తెలుగు కావ్యపరంపర :

# ఆంధ్ర మహాభారతము

(కవిత్రయ ప్రణీతము : మొత్తము 4 సంపుటములు)

## తృతీయ సంపుటము

## యుద్ధషట్కము

(భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు)





ప్రచురణ :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

తెలుగు కావ్యపరంపర :

# ఆంధ్ర మహాభారతము

(కవిత్రయ ప్రణీతము : మొత్తము 4 సంపుటములు)

## తృతీయ సంపుటము

### యుద్ధషట్కము

(భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు)






ప్రచురణ :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు-500 004.

ప్రథమముద్రణము
ప్రతులు – 5000

ఆంధ్ర మహాభారతము : కవిత్రయ ప్రణీతము
మొత్తం నాలుగు సంపుటములు : వెల : రూ. 190.00

తృతీయ సంపుటము

యుద్ధషట్కము
(భీష్మ ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు)



ప్రతులకు :

తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :

ది ప్రింటర్
3-6-584/H,
హిమాయత్ నగర్,
హైదరాబాద్ - 500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతి భాషాసంస్కృతుల అవగాహనకు ఆ జాతి చిరకాలంగా సృష్టించుకొన్న సాహిత్యమే ప్రబలమైన సాధనం. తెలుగుజాతి సంస్కృతిచరిత్ర తెలుసుకోవాలంటే తెలుగు భారతం తప్పక చదవాలి.

కవిత్రయ భారతం వ్యాసవాణిని తనలో స్వచ్ఛంద సుందరంగా పొదువుకొన్నది. అందు వల్లనే దానికి తెలుగున ప్రత్యేక గౌరవ మర్యాద లేర్పడినాయి.

భారత కథ తెలుగువారి జీవితంపై ప్రసరింపజేసిన ప్రభావం సామాన్యమైంది కాదు. పన్నెండవ శతాబ్దిలో తెనుగునాట జరిగిన పలనాటి యుద్ధం సర్వ విధాల భారత యుద్ధాన్ని పోలి వుండటం ఇందుకు నిదర్శనం.

నాటికీ నేటికీ రామాయణంకంటే భారతమే తెలుగువారి జీవితానికి చాల చేరువగా వచ్చిం దనిపిస్తుంది.

దీనికి బలమైన కారణం నన్నయ తిక్కన ఎఱ్ఱనలు తెలుగు భారతాన్ని తీర్చిదిద్దిన తీరు తీయమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

తెలుగు కావ్య సరస్వతికి వెయ్యేండ్ల నిండైన చరిత్ర ఏర్పడింది. ప్రాచీన కావ్య సరస్వతి ప్రజలందరికీ ఉండవలసినంత అందుబాటులో ఉండాలి; ఉండేట్లు చెయ్యవలసిన బాధ్యత విశ్వవిద్యాలయాలమీద కూడా ఉంది. లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆ బాధ్యత కొంత నెరవేర్చింది. ఆ బాధ్యత ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయం స్వీకరించింది. తెలుగు భారతం పునర్ముద్రణ అవశ్యకర్తవ్య మనిపించింది.

## తెలుగు భారతం : తొలుతటి ముద్రణలు

తెలుగు భారతం తాళపత్రాలు ఆధారంగా తొలుదొల్త ముద్రించబడిన పరిస్థితులకు, నేటి పరిస్థితులకు ఎంతో అంతరం ఉంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి సంశోధిత భారతం (1968) పీఠికలో కొన్ని వివరా లున్నాయి.

తెలుగు భారతం ముద్రిత ప్రతులు పరిశీలిస్తే క్రీ.శ. 1860 వ సంవత్సరానికి ముందటివిగా కొన్ని, తరువాతివిగా కొన్ని- కనిపిస్తాయి. ముందటి ప్రతుల ప్రచురణలో చిన్నయసూరి, రామానుజాచార్యులు (1847) ఆలూరి ఏకాగ్రమజోస్యులు (1851-53), కరాలపాటి రంగయ్య గార్ల (1852) ప్రతులు పేర్కొనదగివున్నాయి. తరువాతి ప్రతుల సమాచారం బ్రిటిషు మ్యూజియం గ్రంథాలయం, ఇండియా ఆఫీసు గ్రంథాలయం మొదలైనవిచ్చిన వివరాలనుబట్టి సేకరించు కోవటం జరిగింది.

సి. పి. బ్రౌనుగారు తెలుగు భారతం 18 పర్వాలు తాళపత్రప్రతులతో సరిచూపించి, పాఠాంతరాలు వ్రాయించి, పరిష్కృతం చేయించి కాగితపు ప్రతి ఒకటి సిద్ధం చేయించారు.

ఆలూరి ఏకామ్రజోస్యులు మొదలైన పండితులకు, వావిళ్ళవారికి సి. పి. బ్రౌను గారు సిద్ధం చేయించిన ప్రతి ఎంతో ఉపకరించింది. ఏకామ్రజోస్యులు బ్రౌనుగారికి తమ కృతజ్ఞతను (భారతం- ద్వితీయ సంపుటం 1858 పీఠికలో) తెలియజేయటం జరిగింది.

క్రీ. శ. 1900 సంవత్సరం తరువాత ముద్రితమైన భారత ప్రతులతో వావిళ్ళవారి భారతం, ఆనంద ముద్రణాలయం వారి భారతం సుప్రసిద్ధమైనవి.

## ఆనంద ముద్రణ ప్రత్యేకత

1901 వ సంవత్సరంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు సంపాదకులుగా ప్రచురించబడ్డ ఆనంద ముద్రణం వారి మహాభారతం ఎంతో ప్రశస్తి నార్జించుకొన్నది. దీని ప్రశస్తికి కారణం సుప్రసిద్ధులైన మహాపండితులు తంజనగరం తేవప్పెరు మాళ్ళయ్య, బుక్కపట్టణం రామానుజయ్య, పురాణం సూర్యనారాయణ తీర్థులు మొదలైన వారు పాఠ పరిశోధన బాధ్యత వహించటమే. ఈ పండిత ప్రకాండుల జీవిత విశేషాలు సేకరించి, ప్రత్యేక గ్రంథాలుగా ప్రజల కందించవలసిన అవసరం లేకపోలేదు.

## తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పం

వారి కృషి విశేషాలు తెలుగువారికి సువిదితం చెయ్యటానికి ఆనందాశ్రమగ్రంథరత్నమాల పక్షాన వారు పరిశోధించిన ఆంధ్రమహాభారతాన్ని యథాతథంగా ముద్రించి, సాధ్యమైనంత తక్కువ ధరకు ప్రజల కందించాలని తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పించింది. ఆ సంకల్ప ఫలమే నాలుగు సంపుటాలుగా రూపుదిద్దుకొన్న ఈ భారత ప్రచురణ.

| | |
|---|---|
| మొదటి సంపుటము- | ఆదిసభారణ్య పర్వములు |
| రెండవ ,, | విరాటోద్యోగ పర్వములు |
| మూడవ ,, | యుద్ధషట్కము- |
| | భీష్మ ద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీ పర్వములు |
| | శాంతి సప్తకము- |
| నాల్గవ ,, | శాంతి అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు. |

ఈ ప్రచురణకు ఆధారంగా స్వీకరించిన భారతప్రతులు తొలదొల్త మద్రాస్ వేమూరి వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్స్ వారు, తరువాత ఎ. కణ్ణన్ సెట్టి అండ్ సన్స్ కంపెనీవారు, అటు పిమ్మట ఏలూరు రామా అండ్ కో పబ్లిషర్స్ వారు ప్రచురించినవి.

'భారతం - పరిష్కృతపత్రి ముద్రణలో వావిళ్ళవారిది ముందా? ఆనందాశ్రమం వారిది ముందా?' అనే ప్రశ్న ఒకటి లేకపోలేదు.

1968 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన సంశోధిత ప్రతి పీఠికలోను ఈ ప్రశ్న తలయెత్తింది. వారి కృషి ముద్రణమే ముందరిదైయుంటే అది ఆనంద ముద్రణం మరింత పరిశుద్ధంగా వెలువడటానికి దోహదం కలిగించివుంటుందని కూడా భావించవచ్చు.

ఏమైనా ఆనందాశ్రమ గ్రంథరత్నమాల వారి భారత ప్రతి ఎంత ప్రశస్తమైందో పండిత లోకానికి సువిదితమే కనుక దానిని గూర్చి ప్రకృతం చర్చించవలసిన ఆవశ్యకం అంతగా లేదు. తెలుగు విశ్వవిద్యాలయం కులపతులు ఆచార్య తూమాటి దొణప్పగారు తమ జీవిత కాలంలో భారతం వ్రాతప్రతులు దాదాపు 120 దాకా పరిశీలించారు. వారి దృష్టికి కూడా ఆనందముద్రణమే అభిలషణీయ మనిపించింది. ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధనాలయం సంచాలకుడుగాను, ఆంధ్ర భారత పరిశోధకుడుగాను నావరకు నాకు అనేక భారత ప్రతులు పరిశీలించే అవకాశం కలిగింది. ఆనంద ముద్రణం పేరు సార్థకమే అనుకుంటాను.

## పీఠికలు, విమర్శలు

"భారతం సాధ్యమైనంత చౌకధర కందించినా సముచితమైన పీఠికతో, విమర్శతో అందిస్తే ప్రయోజనకరంగా ఉండేది గదా!" అనే ఆశంక లేకపోలేదు.

భారతంపై విమర్శ రచనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటిలో మేలైన వాటిని ఎన్ను కొని ప్రత్యేక సంపుటంగా అందించటంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందని భావించటమైంది. ప్రస్తుత సంపుటాలలో వాటిని కూడా చేర్చి గ్రంథమూల్యం పెంచటం ఉచితంకా దనిపించింది.

లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1970 నుండి ప్రచురించిన భారత ప్రతులు పూర్తిగా చెల్లిపోయిన కారణంగాను, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ లలితకళా అకాడమీ అంతర్జాతీయ తెలుగు సంస్థ తెలుగు విశ్వవిద్యాలయంలోనే అంతర్లీనమైన కారణంగాను, ఆయా సంస్థలు లోగడ ప్రచురించిన రచనలు పునర్ముద్రించవలసిన సందర్భాలలో ఉచితమైన మార్పులతో వాటిని తెలుగు విశ్వవిద్యాలయమే ముద్రించవలసిన కారణంగాను - ఆ కృషిలో భాగంగానే ప్రస్తుతం ఆంధ్ర మహాభారత సంపుటాలు-ఆనందాశ్రమ, గ్రంథ రత్నమాల వారి ప్రతులు ఆధారంగా-ముద్రించటం జరిగింది.

పునర్ముద్రణకై ఆనందముద్రణ ప్రతిని స్వీకరించినందుకు అభినందనపూర్వకమైన జాబులు కూడా కొన్ని మాకు అందాయి. అయినా ఇందు విషయమై తెలుగు విశ్వవిద్యాలయం దీర్ఘ సూత్రతనే అవలంబించింది.

## ప్రాచీన కావ్యాల పునర్ముద్రణ,<br>లఘు వ్యాఖ్యాన రచనలు,<br>భాషాంతరీకరణలు.

తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పించిన పథకాలలో ప్రాచీనకావ్యాల పునర్ముద్రణ మాత్రమే కాక కొన్ని విశిష్ట కావ్యాలను లఘు వ్యాఖ్యలతో ముద్రించే పథకం కూడా ఉన్నది.

ఉదాహరణకు శ్రీనాథుని కాశీఖండ భీమఖండ హరవిలాసాలు మొదలైనవీ పథకంలో ప్రాధాన్యం వహిస్తున్నాయి. ఇప్పటికే కొన్ని ప్రబంధాలు హిందీ మొదలైన భాషలలోకి కూడా అనూదితములైనాయి. రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యం హిందీలోకి, రాయల ఆముక్తమాల్యద తమిళంలోకి అనూదితం కావటం ఈ పథకంలో భాగమే.

చేసినపని కొద్దిదిగా చేయవలసింది పెద్దదిగా గోచరిస్తుంది. కృషి లక్షణం తెలిసి, చేయ దలచుకొన్నపని పూర్తి చెయ్యడానికి ఆరాటపడే ప్రవృత్తికి అది అట్లా గోచరించటం అతి సహజం.

## విశ్వవిద్యాలయ లక్ష్యాలు

తెలుగు విశ్వవిద్యాలయం లక్ష్యాలు ప్రాచీన సాహిత్యానికి మాత్రమే పరిమితమై లేవు. ఆధునిక సాహిత్యానికీ, ఆధునిక భాషాభివృద్ధికీ, వాస్తుశిల్ప జ్యోతిషాది శాస్త్ర విజ్ఞానాభివృద్ధికీ, లలిత కళాభివృద్ధికీ విశ్వవిద్యాలయం నిరంతరం కృషి చేస్తున్నది.

భూతకాలికమైన విజ్ఞానంతో, వర్తమానానికి సంబంధించిన అనుభవంతో, భవిష్యత్కాలానికి బంగారుబాటలు నిర్మించుకునే ప్రయత్నమే విశ్వవిద్యాలయ పరమ లక్ష్యం. అందులో భాగమే అనేక ప్రాచీనాధునిక కృతుల ప్రచురణ.

ప్రస్తుతం మీ హస్తాలను అలంకరించిన ఆంధ్ర మహాభారత సంపుటాలు మీకు ఆనంద హేతువులు కాగలవని విశ్వసిస్తున్నాం.

హైదరాబాద్,
పక్ల- ఉగాది

తెలుగు విశ్వవిద్యాలయ పక్షాన
డా॥ వి. వి. యల్. నరసింహారావు,
ప్రచురణల విభాగాధికారి




## ఆంధ్రమహాభారతము.

### భీష్మపర్వము-ప్రథమాశ్వాసము.



### భీష్మపర్వము-ద్వితీయాశ్వాసము.

## భీష్మపర్వము-తృతీయాశ్వాసము.



## ద్రోణపర్వము-ప్రథమాశ్వాసము.

## ద్రోణపర్వము-ద్వితీయాశ్వాసము.



## ద్రోణపర్వము-తృతీయాశ్వాసము.

## ద్రోణపర్వము - చతుర్థాశ్వాసము.



## ద్రోణపర్వము-పంచమాశ్వాసము.

## కర్ణపర్వము – ప్రథమాశ్వాసము.



## కర్ణపర్వము – ద్వితీయాశ్వాసము.

## కర్ణపర్వము - తృతీయాశ్వాసము.

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము.



## శల్యపర్వము - ద్వితీయాశ్వాసము.

## సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము.



## సౌప్తికపర్వము - ద్వితీయాశ్వాసము.



## స్త్రీపర్వము - ప్రథమాశ్వాసము.

## స్త్రీపర్వము – ద్వితీయాశ్వాసము.







హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము.

---



సంపాదిపదాంబుజ
నాసాగ్రనివాసరసిక | నాదామృతధా
రాసారరూప వేద
వ్యాసవ్యంజితవిహార | హరిహరనాథా. 1

### ధృతరాష్ట్రునికడకు వేదవ్యాసుండు వచ్చుట.

క. దేవా జనమేజయనను, ధావల్లభుఁ డధికవినయ | తత్పరుఁ డై సం
భావించి కుతూహలమునఁ, దా వైశంపాయనునకుఁ | దగ నిట్లనియెన్. 2

క. ఒండొరుల గెలుచుతలఁపునఁ, బాండవులును గౌరవులును | బాహాగర్వో
ద్దండత నెట్లు చొడంగిరి, భండన మెప్పాటఁ జెల్లెఁ | బరమమునీంద్రా. 3

క. అనుటయు వైశంపాయనుఁ, డనుమోదరసార్ద్రహృదయుఁ | డై యిట్లనియెఁ
జనమేజయుమనమున సం,జనితం బగుకౌతుకంబు | సఫలతఁ బొందన్. 4

వ. పుణ్యక్షేత్రోత్తమం బయినయాకురుక్షేత్రంబున నారెండుదెఱంగులవారికటకం
బులును విడిసి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వునట్టిసమయంబున ధృతరాష్ట్రుండు
కొడుకులదుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది సంజయద్వితీయుం డై చింతిం
చుచున్న యెడకుం ద్రికాలవేది యగు వేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి
సేయునర్చనంబులం గైకొని యతని కిట్లనియె. 5

క. కాలం బగుటయు నృపులకు, నాలము సమకూరె దీని | కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన, [1]నే లోనికి దివ్యదృష్టి | నిచ్చెదఁ బుత్త్రా. 6

చ. అనుడు నతండు ఘోరముగ | నన్నలుఁ దమ్ములుఁ [2]బోరఁ గ్రూరతం
గనుఁగొనఁ జాల నేను విన | గా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్స యన్న ముని | చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరి | పాటి మెయిన్ సకలంబుఁ జెప్పఁగన్. 7

---

1. నీలోనికి దివ్యదృష్టి నించెద. 2. బోర క్రూరతం.

వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యాసూతనందనునకు నారెండుదెఱంగులవారిదివారాత్రప్రవర్తనంబులు గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగునట్లునుం గా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండునట్టిప్రభావంబుఁ బ్రసాదించి దివ్యులయాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టిమహనీయబోధంబును గలుగ ననుగ్రహించి యావైచిత్రవీర్యు నాలోకించి యిది ప్రాప్తకాలంబై వచ్చిన భూప్రజాక్షయంబు దీని కివగవం బని లేదు ధర్మో జయ తనుచు నిశ్చింతంబున నుండు మేనును గురుపాండవులకీర్తిఁ బ్రకటింపఁ గలవాఁడ నని యతని నాశ్వాసించి సాత్యవతేయుండు వెండియు. 8

క. మొగిళులు లేకయు నుఱుములు, గగనక్షోభంబు సేసెఁ గరిహయతతిఁ బె
ల్లుగ నశ్రు లురలఁ జొచ్చెను, మృగములు పక్షులను బసులు మృగముల నీనెన్.

క. నలువురు నేవురు బిడ్డలు, గలిగెడ రొక్కొక్కవనిత గర్భంబున వా
రలు పుట్టినపుడ యాడుచుఁ, గలకల నవ్వుచుఁ జెలంగఁ గనిమెద మెండున్. 10

తే. అర్కునుదయాస్తమయముల యందుఁ గృష్ణ
కాంతి ఘోరకబంధంబు గప్పఁ జొచ్చె
నిందులాంఛనస్థితి దల క్రిందు గాఁగ
దోఁచుచున్నది ప్రజ యెల్లఁ ద్రుంగ కున్నె. 11

వ. విశేషించియుం గారవనికేతనంబులఁ గేతనంబులఁ బొగ లెగయుటయు నాయుధంబులు మండుటయు నివి మొదలుగా ననేకదుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి కులక్షయంబును నానానరేంద్రనాశంబునునగు నుపేక్షింపందగదు దుష్పథవర్తు లగుదుర్యోధనాదికుమారుల వారించి నీతమ్మునిపాలతనికొడుకుల కొసంగి శాంతి సేయుట మేలు మముబోంట్లమనంబులకుం బ్రియంబు గాని యీరాజ్యంబు నీ కేటి కనిన విని యమ్మనుజేంద్రుం డమ్మునీంద్రున కిట్లనియె. 12

చ. హితమును ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్ను నా
సుతుల నయంబుమైఁ దఱిమి చూచితి [1]వారలఁ బంపు సేయ నేఁ
జతురుఁడఁ గాను ప్రాభవము సాలదు నాచెసఁ దప్పు లేమి మీ
మతిఁ దలపోసి యాపలుకు మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్ 13

వ. అనిన విని పరాశరసూనుం డది యట్లుండ నిమ్మింక నేమేనియుం జెప్పవలయునది గలదే యనిపలికిన నాంబికేయుండు గయ్యంబున [2]గెలుపుదెలుపునిమిత్తంబు లడిగిన నమ్మునివరేణ్యుండు నహ్నులు హోమకాలంబునం బుణ్యగంధంబులతోఁ బ్రదక్షిణార్చు లగుటయు భేరీప్రముఖంబులు గంభీరఘోషంబు లగుటయు

---

1. వారలు పంపు సేయ రేఁ. 2. గెలుపునిమిత్తంబు.

వాయువు లనుకూలమృదుమనోహరప్రచారంబు లగుటయు నివి మొదలుగాఁ
గొన్ని శుభసూచకంబులు నిర్దేశించి కొంచెంబు పెద్ద యన లేదు సమరంబున
జయంబు దైవాధీనంబు గావునం బెద్దలు పెనఁకువ లొప్ప వని చెప్పెదు నేను
బోయి వచ్చెద నని చెప్పి సముచితప్రకారంబున నంతర్ధానంబు సేసెఁ దద
నంతరంబ యక్కౌరవేంద్రుండు గొండొకసేపు చింతించి నిట్టూర్పు నిగిడించి
సంజయున కిట్లనియె. 14

ఉ. భూమికిఁ గాఁగఁ బ్రాణములపోక దలంపక రౌద్రఘోరసం
గ్రామము సేయు చుండుదురు రాజులు దొల్లియు నెంతదీపొకో
భూమి మునీంద్రసంగతి సుబుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధనిరూఢముగా సమస్తమున్. 15

వ. అనిన విని సంజయుం డతని కిట్లను నా యెఱింగినంతయు నెఱింగించెద భూతత్త్వ
ప్రకారం బవధరింపుము. 16

సంజయుండు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట.

తే. అధిప నానాప్రకారచరాచరంబు, లిందు వేర్వేఱ జనియించు నిందు పెరుఁగుఁ
బిదప నిందు యడంగు నీపృథ్వి దాన, సకలమునకుఁ బరాయణస్థాన మరయ.

వ. అదియునుం గాక విను మాకాశంబునకు గుణంబు శబ్దంబు వాయువునకు శబ్ద
స్పర్శంబులును దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును నప్పులకు శబ్దస్పర్శరూప
రసంబులును గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధాత్మకం బైనగుణసము
దయం బంతయుం గలదు గావున నిమ్మహాభూతంబు లేనింటిలోనం బృథివి
యెక్కుడు దీనియున్నవిధంబు వివరించెద నాకర్ణింపుము. 18

సీ. ధాత్రీశ మేరువుదక్షిణంబున సుదర్శన మనునభిధానమునఁ బ్రభూతి
విస్తార మై రెండువేలు నేనూఱుయోజనములపొడవు నై సరసమధుర
విపులశాశ్వతఫలవితతిసమేత మై, యొక్కజంబూతరు వొప్పి యుండు
దానిపండులు మహీస్థలి మహారవముగ, ననిశంబుఁ బడి రాలి యవియుచుండు

ఆ. వానిరసము పొంగి వాహినీమూర్తి న, న్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ
నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము, లందుఁ జొచ్చి పాఱు నంబుధికిని.

వ. జంబూనది యనం బరఁగినయాతరంగిణీనీరు సోఁకినచోట్లెల్లను సువర్ణం బగుటం
జేసి కనకంబునకు జాంబూనదం బనునామంబునుం గలిగెఁ దదీయజలపానంబు
సేసినమానవులకు ముదిమియుం దెవులును దప్పియు లే దని చెప్పుదు రవ్వేటి
పడమటం బెరిఁగి పఱపు గలిగి శరనిధిచందంబున జంబూషండంబు గాఱుకొను
చుండు నింతటికిం గారణం బయినయాజంబూవృక్షంబుపేర నీద్వీపంబు జంబూ
ద్వీపంబును సుదర్శనద్వీపంబు నన నెగడి లవణసముద్రముద్రితం బయి పొలుచు
సద్ద్వీపియందు. 20

సీ. నిడుపునఁ దూర్పును ♦ బడమర నై రెండు,గడలు నంభోనిధి ♦ గదిసి యుండు
రత్నమయంబులు ♦ రమణీయములు సాధ్య,సిద్ధచారణగణ♦సేవితములు
నై హిమాచలమును ♦ నావల హేమకూ,టంబును నట నిషధంబు నొప్పు
లలితంబు లైననీల♦శ్వేతశృంగవం,తంబులు గ్రమమునఁ ♦ దనరి పొలుచు
ఆ. [1]నివులమూఁటి కవల ♦ నవులయమ్మూఁటికి, నివలఁ దేజరిల్లు ♦ దివిజనగము
గమలకర్ణికానుకారి యై కాంచన,మణిమయత్వమహిమ♦మహిత మగుచు. 21
తే. అతిదృఢం బగుపాఁతు పదాఱు వేల,యోజనము లండ్రు దానికి ♦ రాజముఖ్య
యిందు మెనుబదినాలుగు♦వేలయోజ,నంబు లన్నిహేమధాత్రీధ♦రంబుపొడవు.22
వ. ఇవ్విధంబున భూమధ్యంబున నున్నయమ్మేరుమహీధరంబున దేవతలును దేవ
మునులును గంధర్వకింపురుషాది దేవయోనులును దేవేంద్రప్రముఖదిక్పతులును
బరమేష్ఠియుం దత్తత్ప్రదేశంబులఁ బుణ్యావర్తసంబులం బరమసుఖంబు లనుభ
వింతు రుత్తరతటంబున గర్ణికారవనంబున గౌరీసమేతుం డై సిద్ధగణంబులు
పరివేష్టింప విశ్వేశ్వరుండు విహరించు చుండు. 23
క. తొమ్మిదిఖండము లై వర్షమ్ము లనం జాల నొప్పెసఁగుజంబూద్వీ
పమ్మునజనపదములు విను, మమ్మహి[2]తాంశములు దెలియ ♦ ననువర్ణింతున్.24
వ. ఉత్తరసముద్రంబు శృంగవంతంబుమధ్యమం బై రావతవర్షం బన నొప్పు శ్వేత
పర్వతశృంగవంతంబులనడుము హైరణ్మయవర్షం బనం బొలుచు నీలశైలోత్తర
దక్షిణదేశంబులు గ్రమంబున రమణకవర్షంబును నిలావృతవర్షంబును ననం
జెలు వమరు మేరువునకుం బ్రాచ్యప్రతీచ్యంబు లగుభాగంబులు వరుసన భద్రా
శ్వవర్షంబును గేతుమాలావర్షంబును ననం బొగ డొందు హేమకూటోత్తర
భూమి హరివర్షం బన నెగడు హిమవంతంబునక్కడయు నిక్కడయు నొలిన
కింపురుషవర్షంబును భారతవర్షంబును ననం బెంపారు ని ట్లున్నదీనియందు. 25
క. భారతవర్షముఁ దొడఁగి మ, హీరమణ యుదీచ్యములన ♦ యెక్కుడు బలస
త్త్వారోగ్యాయుస్సుఖపు, ణ్యారంభగుణంబు లంత ♦ కంతకు నరయన్. 26
వ. అనిన విని వైచిత్రవీర్యుండు సమస్తద్వీపంబులు సకలజలనిధులు నున్నపరిపాటి
యుం బ్రమాణంబులుం బ్రకాశంబుగ నెఱింగింపు మనుటయు సూతసూనుండు
జంబూద్వీపవిష్కంభంబుకోలఁది యెనుబదివేలునాలుసూఱుయోజనంబులు దీని
రెం డంతలు దొడంగి లవణేక్షురససురాఘృతదధిక్షీరశుద్ధజలమయంబు లయిన
మహార్ణవంబులవిష్కంభంబులు గ్రమంబున నొకటి కొకటి రెట్టి యై యుండుఁ
బ్లక్షద్వీపశాల్మలద్వీపక్రౌంచద్వీపకుశద్వీపశాకద్వీపపుష్కరద్వీపంబులవిష్కం
భంబులును జంబూద్వీపవిష్కంభద్విగుణప్రమాణంబు మొదలుగా నొలి నొకటి
కొకటి గుణమడి యై యుండు నయ్యాఱుదీవులును జంబూద్వీపంబుకంటె నెల్లదా

1. నివులమూఁటి కవల ♦ నవులమూఁటి కివలఁ, దేజరిల్లుచున్న ♦ దివిజ. 2. తాంతరము దెలియ.

నను బొగడ్తనడి యనేకపర్వతంబులనునానానదులనుబహుజనపదంబులనునొప్పి
వరుస నొండొంటికి గుణవిశేషంబుల నధికంబులై యుండు నింతకుం గర్తయు
భర్తయు హర్తయునై దుగ్ధాంబుధియుత్తరంబునం గనకమయంబై యష్టచక్రం
బును బ్రభూతభూతయుక్తంబును మనోజవనంబును నగుమహనీయశకటంబున
వినోదపరాయణుం డైననారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభి
ధానంబున విఖ్యాతుం డై విహరించుచుండు నని చెప్పుటయు నతండు. 27

క. భారతవర్షమునకుఁ గాఁ, గౌరవులును బాండవులును గాంక్షం గడుఁ బె
ల్లై రాసి యొండొరులతోఁ, బోరం దెగి రిట్టిలుబ్ధబుద్ధులు గలరే. 28

వ. అనిన విని యమ్మనుజపతికి సంజయుం డి ట్లనియె. 29

ఆ. అధిప పాండుసుతుల కరయంగ నతికాంక్ష, లేదు లుబ్ధబుద్ధి నీదుసుతుఁడు
శకునికలవు విని యశస్స్వర్గవృత్తికిఁ, జొచ్చి యిట్టిమెడరు దెచ్చికొనియె. 30

సంజయుండు ధృతరాష్ట్రునకు భారతవర్షంబునం గలవిశేషంబులు సెప్పుట.

క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలున భూ
రమణులుఁ గొందఱు వచ్చిరి, సమగ్రసఖ్యమునఁ గూడుచందమునఁ దగన్. 31

తే. వారి నన నేల తొల్లియు వసుధకై య
నేకనృపతులు [1]పోరాడి రిట్లు నేల
[2]వ్రాలి కాదె భగీరథసగరఘుయయాతి
నహుషముఖ్యులు విశ్రుతోన్నతులు గనిరి. 32

వ. భారతవర్షంబునయుదారవిభూతివిలాసంబున కాసపడి యీసునం బెనంగ కుండు
దురె దీనివిస్తారంబు విను వివరించెద. 33

ఆ. మలయ మనఁగ శుక్తిమంతంబు నా వింధ్య
మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర
మనఁగ ఋక్షవంత మన సహ్య మన నిందుఁ
గులనగంబు లేడు వొలుచు నధిప. 34

వ. వీనియందు వివిధమణిగణంబులు సమకూర్ప నచ్చు ననిన ఖనివిశేషంబులు సెప్ప
నేల మఱియు నుపమహీధరంబు లనేకంబులు గలిగి యుండు వానియందు. 35

క. ఇనుమును రాగియుఁ దగరం,బును వెండియుఁ బసిఁడియుం బ్రభూతములై పే
ర్చినసిరిఁ జేయఁగ నొప్పెడు, ఖను లెడ నెడఁ బెక్కు గలవు కౌరవనాథా. 36

క. వెండియు ధనార్జనంబులు, గొండలవలనన ఘటించికొన నగు నేర్పుల్
దండితనంబును బాడియు, నొండొంటికి మిగులఁ గలిగి యున్న ట్లయినన్. 37

వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు వేగవతియుఁ గృష్ణవేణియుఁ బెన్నయు
యమునయుఁ దమసయు శరావతియుఁ గావేరియు గోదావరియు నర్మదయు

1. పోరాడ రట్లు. 2. వ్రాలఁ గాదె.

బాహుదయును సరయువును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు
ననుమహానదులు మఱియు ననేకసరిద్విశేషంబులునుం గలిగి వీనివలన నానా
ముఖంబుల ధనధాన్యాదిసంపదాగమంబులు సొంపు మిగిలి యుండు. 38

క. ఎడ నెడఁ బఱపై యెప్పుడి, యడవు లనేకములు వానియం దర్థము సే
రెడు వెరవులు పెక్కులు సొ, ప్పడి యుండు నయంబుతోడి బలిమి గలిగినన్. 39

వ. పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ
కుకురు కోంకణ కేంకణ త్రిగర్త సాముద్ర సాల్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు
కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద
పుండ్రక పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ
దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయ
యాశ్మంతక కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంత
లావంతి కానూపాదిజనపదంబులు సమస్తవస్తుసంపత్సంపాదనంబు లయినగుణ
విశేషంబుల వెలసి పురుషార్థంబు లగుధర్మార్థకామంబులకుం గారణంబు లై
కమనీయంబు లగుచుండు. 40

క. వినికి కలిగి రక్షించుచు, ననువున దయతోడిపాడి నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగడొం, దినరాజున కుర్వి గామధేనువు గాదే. 41

ఆ. వెరవు లావుఁ గలుగు నరనాథు లింత దే, శంబు గలదు తమకు జాలు ననరు
దండ్రి బిడ్డ యన్న దమ్ముఁడు నా కెత్తి, పోయి పోటు లాడి పుడమిఁ గొంద్రు.

క. కావునఁ గౌరవపాండవు, లీవసుధకు నై పెనంగు నొగ్గె దైవం
బేవంక వ్రాలె వారిక, [1]పోవుం గా కిది నరేంద్ర పొగలకు ఖింకన్. 43

వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో నీ వింక సంగరంబుఁ జూడం బొమ్మని
సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారతరణప్రకారం బనుసంధించి యతండు
కతిపయదినంబులకుం జనుదెంచి తగిన తెఱంగునం గాంచి. 44

క. కొడుకులదెస నెవ్వగఁ జే, ష్పడి వందిరి యున్న యా నృపాలు నడుగులం
బడి భీష్ముపాటు సెప్పుచు, నడలి కరుణ నాద మెసఁగ నాక్రందించెన్. 45

వ. అవ్యేడ్పుతో ని ట్లని విలాపంబు సేయు. 46

సీ. ఆత్మయోధుల కెల్ల నాధార మగునట్టి, తనకు నస్త్రంబు లాధార మయ్యెఁ
బరశురామునకు మేల్సరి యైనతనయందుఁ, గలిగె భంగంబు శిఖండిచేత
జనపతి దను నచ్చికమును జూద మొనరించెఁ, దాను గయ్యంపుజూదమున నోడెఁ
దనయాస్పు తెలుఁగునఁ గలఁకు వైరులు పొంగ, నొఱలుచు నేలకు నొఱగె నేఁడు

ఆ. తీవ్రబాణజాలదీప్తులు వరఁగించి, పాండుతనయసైన్యబహుళతమము
లీలఁ బదిదిసంబు [2]లోలి వినోదించి, యధిప భీష్మభానుఁ డస్తమించె. 47

1. ధూవర విను జయము గల్గుఁ ♦ బాగలకు. 2. 'లోలి పై విరియించి' అని అచ్చుప్రతి.

క. పదివేవురు రాజులు దన, కెదిర్చి పొలిసి రా శిఖండి కేమిటివాఁడై
తుదిఁ బోయి తన్ను నాజిం, గదియుచుఁ బొలియించె నియతిఁ గడవఁగవశమే.

తే. చాపవక్త్రుండు భల్లదంష్ట్రావితాన, ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ
జిహ్వాకాభీషణుఁడు నరసింహమూర్తి, గాక కేవలనరుఁడె గంగాసుతుండు. 49

ధృతరాష్ట్రుఁడు భీష్మమరణంబు విని పలవించుట.

వ. అని సంజయుండు పలవించుపలుకులకుఁ జిత్తంబు జల్లనియొల్లంబోయిమూర్ఛిల్లి
కొండొకసేపునకు శిశిరవిధానంబుల సేద దేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరఁగ
గద్గదకంఠుండై. 50

క. దేవాసురవరు లొక్కటి, యై వచ్చినఁ జిక్కనఱచు నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండిశ, రావలిపా లయ్యె నేమి యనఁ గల దింకన్. 51

ఉ. అంచిత తాలకేతుకిరణాళి మెఱుంగులు గాఁగ మార్వి మ్రో
యించుట గర్జచందము గ నేచి విరోధిదవానలంబు మా
యించుశితాస్త్రవర్షమున నిట్టిది భీష్మమహాభ్రి మెట్లడం
గించెనొకో శిఖండి యనుకృత్రిమవాయువు దాఁకి దైవమా. 52

తే. పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు, నిలువ నిమ్మగుదీవిగా నిన్నుఁ దలఁచి
యుండ నత్యంతతుచ్ఛశిఖండిపల్వ, లాక్రమంబున మునిఁగితే యకట తండ్రి.

ఉ. వీరరసాంబుపూరమును విశ్రుతబాహుమహోగ్రసత్త్వముం
జారుగదాధ్వజాచలవిశాలము నంబకజాలవీచికా
స్ఫారము నైనభీష్ముఁ డనుసాగరముం గడవంగ నీఁదఁగా
నేరమి యెట్లొకో గలుగ నేర్చె శిఖండికి నేమి సేయుదున్. 54

తే. అంబకై పూస వచ్చి బలాధిపుండు, జామదగ్న్యుండు సాధింపఁ జాల కున్న
వాని భీష్ముఁ బాండవులకై పూని వచ్చి, కడిమి సాధించి తౌర శిఖండి పోర.

క. ఆశౌర్యం బాసత్త్వం, బాశీలం బాపరాక్రమాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు న,నాశము లని భీష్ముఁ బెద్ద సన్నుతిమి గదే. 56

వ. అని బహుప్రకారంబులం బలవించి యానూతనందనుచే నేతం గీలించి. 57

సీ. అతఁడు నొచ్చినతఱి నడ్డంబు సొచ్చెద, మని నచ్చువారు లేరైరె యచట
నడరి పోరాడక యన్నియక్షౌహిణు, లొప్పరికించెనె యొకనిఁ గలన
నతని నోర్వఁగఁ జాల వని నిశ్చయించితి, మంతకు నోపనే యరిబలములు
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును, శల్యుండుఁ గ్రేడించి చనిరె యపుడు

తే. పాండుసుతులు శిఖండియుఁ జాడశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తాత
విడిచి నాపుత్రు లందఱు విఱిగి యడవిఁ, గలసిరొకొ యాతనికిఁ బడవల సెనకట.

వ. దేవవ్రతుండు దెగినయప్పుడ తక్కినయంతవట్టును దెగియెన కాఁ గలంచెద
నని మఱియు నిట్లనియె. 59.

సీ. కులగురు వృద్ధు సద్ధర్మలచిత్తు గాంగేయుఁ, జంపి రాజ్యము, సేయ సమ్మతించి
తొడరినపాండుపుత్రులకును దైన్యంబుఁ, దోడమ్మె ధర్మంబు గీడుపఱిచి
పరఁగి యధర్మంబు వెరిఁగిన ట్లున్నది, వార లాతనిఁ గూల్చి వసుధఁ గొనఁగ
నిశ్చయించుట గడునిష్ఠురత్వము దాని, కంటెను బాపంబు గాదె మనకు
తే. సంగరంబున నాతండు సచ్చు టొర్చి, స్వపదకుఁగాఁ బెనఁగినచంద మరయ
గులములం దెల్ల నీరాచకులము సాల, బెట్టిదం బిక్కలంబునఁ బుట్ట నగునె.
61
వ. అని పలుమాట లాడి వెండియు.
ఆ. మగఁడు లేనిమగువనూడ్కి గా కున్నె నా, సేన భీష్ము లేమిఁ జేసి నేఁడు
కురుకుమారు లెంత గుందిరో యెవ్వ రే, మైరొ యింక నెట్టు కలగుదురొక్కొ.
క. రాజులు మంత్రులు ననిమెడు, నాజూదరు లాత్మ నేమి యని తలఁచిరో యే
యోజం బలికిరొకో తమ, కాజికి నిట మీఁద నెవ్వ రాధారంబో. 63
వ. అని పలికి సంజయుకరంబు విడిచి కయ్యం బెయ్యెడం బొడిచిరి పదిదినంబులు
నుభయబలంబులవారలు నెవ్విధంబున మోహరించి రెవ్వ రెవ్వ రెప్పు డెప్పు
డేమి సేసి రిన్నాళ్లు గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబు సేసెఁ దుది నత్తెఱంగునం
దెగియె నంతయు వివరించి పరిపాటిం దేటపడం జెప్పుము. 64
ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్ననా
కట్టెఁడి హీను లేమి వినుకాజియ కోర్వవు దుర్వినీతికిం
బుట్టినయిల్లు నై వినక పోవఁగ వచ్చునె యింకె నాకు నే
దిట్టఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా విన నేర్తు సంజయా. 65
వ. అనిన విని సంజయుం డతని కి ట్లనియె. 66
ఆ. అధిప నీవు సెప్పినట్టిద నీయవి, నీతిఁ జేసి ధర్మనిరతు లైన
పాండుసుతుల కన్నిపాటులు వాటిల్లె, నింత దెచ్చికొంటి వంత సేసి. 67
క. కీ డొనరించినవారికిఁ, గీ డగు టరుదయ్య మేలు గీ డేమియు నీ
వాడక విను ననుఁ గయ్యముఁ, జూడఁగఁ బుచ్చుట వినంగఁ జూచియ కాదే.
క. వేదవ్యాసమునీశ్వరు, పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తిరసైకా
స్వాదనసుకరానందో, త్పాదనదివ్యమతి నగుచుఁ దగ నెఱిఁగింతున్. 69
వ. అనిన నాంబికేయుండు నట్ల కాక యెఱింగింపు మనుటయు సంజయుండు. 70

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధంబు సెప్పఁ బూనుట.

ఉ. ప్రాంశుఁ బయోదనీలతను భాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్. 71

వ. అని పలికి పారాశర్యుం జిత్తంబున నిలిపి నమస్కరించి ధృతరాష్ట్రున కిట్లనియె.

క. వినినదియును నెయ్యెడ నేఁ, గనినదియును మునికృపం బ్రకాశం బై తోఁ
చినయదియును విశదంబుగ, వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్. 73

వ. ఆరాత్రి నిన్ను వీడుకొని మనదండునకుం జని నీకొడుకునగరు సముచితప్రకారం
బునం బ్రవేశించునప్పు డతండు గాంగేయాదికౌరవులును దగురాజులును బరి
వేష్టింపం బరిమితస్థానంబుననుండ నేనునుం బొడసూపి యతనియాదరణంబువడసి
కొలిచియుండితిం బదంపడి సమరవిషయంబు లైనసంభాషణంబులసమయంబున
నమ్మేదినీశ్వరుండు దుశ్శాసనుం గనుంగొని యిట్లనియె. 74

ఆ. మనకుఁ బాండురాజ౯తనయవర్గమునకుఁ
గయ్య మయ్యె బెద్ద౯కాలమేని
నెదురుచూచు చుండ౯ నాదవె నివ్విధ మిందుఁ
బూని చేయ వలయు౯దాని వినుము. 75

క. కన్నాకు మనకు భీష్ముం, డిన్నరవరుఁ గావ వలయు ౯ నెమ్మెయి నైనం
దన్నుం గాచిన నితఁడు జ,గన్నుతముగ రణమునం బ౯గఱ నడఁగించున్. 76

ఆ. ఎల్లవారిఁ గాచు ౯ నితఁ డని యెప్పుడుఁ, దలఁతు మితనిఁ గావ ౯ వలయు టేమి
[1]యని తలంచె దేని ౯ విను మిందఱకు నిది, వినఁగ వలయునట్టి౯పని కుమార. 77

వ. సత్యవ్రతుం డగునిమ్మహానుభావుండు. 78

క. వినుఁ డన్యు లెవ్వారును నా, మునుమునఁ బడి బ్రదుక రాల౯మున నేను శిఖం
డిని నోర్వఁ జాలఁ జుండీ, యని మనయుద్యోగవేళ౯యప్పుడ చెప్పెన్. 79

ఉ. ఏమఱి రక్ష సాలనిమృ౯గేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు సం
గ్రామములోనఁ గ న్కలిగి ౯ కావక దక్కిన నాశిఖండిచే
నీమనుజేంద్రుఁ గోల్పడమె ౯ యిట్టిది గోల్పులి నిద్రవోవ ను
ద్దామబలంబుమై గొఱియ ౯ దాఁకి వధించినయట్టు లుండదే. 80

క. కావున నీయుద్భటరథి, కావలి నివ్విభునిఁ గాచు౯నట్లుగఁ బనుపం
గావలయు మీర లందఱు, నేవలఁ జూచిన శిఖండి ౯ కెదురుం డెపుడున్. 81

వ. అని నియమించి కొలువు విరిసి చని యుచితవిధంబున నుండె నంతఁ బ్రభాతం
బగుటయు నమ్మహీపతి పడవాళ్లం బనిచి బలుమానుసులను బలంబులను
బవరంబునకు వెడల నియోగించిన శంఖదుందుభిప్రముఖమంగళతూర్యనిస్వానం
బులను నశ్వ్యసాధనంబులు సమకట్ట సముచితపరివారంబునకుం జెప్పెడునోరల
పలుకులగంభీరనాదంబులను [2]గట్టుబట్లకడలఁ దిగిచినం జెలంగుకరితురంగంబుల
బృంహితహేషితఘోషంబులను బూన్పం దిగుచురథంబులనేమిస్వనంబులను
బెలుచ నొండొరులం బిలుచుపదాతులమెలుంగులవిపులధ్వనులనుం బేర్చిన

---

1. యనియెదేనిఁ దెలియ విను. 2. గట్టుబట్లఁ గదలం.

మహారవంబున శిబిరంబు చంద్రోదయఘూర్ణమానమహార్ణవంబును గ్రేణిసేయు
చుండ సూర్యోదయం బైన సైన్యంబులు సెలంగుచు వెడలునప్పుడు. 82

తే. కనకభూషణజాలంబు కరతన గజము, [1]నెరవళులపోవుకొండల ననసి యొప్పె
వల్గనంబుల హేషల వలన నబ్ధి, ఘనతరంగంబు లనఁ దురంగములు వొలిచె.

క. అరదములు సవరణలతోఁ, బర పై యొక్కొక్కయూరి పరపున నరిగెం
బరుసనిపలుకుల నాకృతి, పసుపత నసురాలివోలె భటతతి మెఱసెన్. 84

వ. అట్టియెడ. 85

మ. పరిధానంబును దేరు నశ్వములుఁ జాపంబుం బరిస్ఫీతవ
జ్రరుచివ్యాప్తసువర్ణతాళమయచంచత్కేతువుం వర్మముం
గర మొప్పం దెలు పారు [2]వెల్గొడుగుతో గంగాసుతుం డాసుధా
కరుఁడుంబోలె వెలింగె దర్ప మెసఁగం గౌరవ్యసైన్యాబ్ధికిన్. 86

సీ. కాంచనమయవేదికాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమం బొప్పఁ గలశజుండు
గనకగోవృషసాంద్రకాంతికాంతధ్వజ, విభవవిలాసంబు వెలయఁ గృపుఁడు
మణిసింహలాంగూలమహితకేతుప్రభా, స్ఫురణంబు మెఱయంగ గురుసుతుండు
రత్నశిలారశ్మిరాజితకదలికా, మహిమ శోభిల్లంగ మద్రవిభుఁడు

తే. వెడలి తమతమచతురంగవితతు లెల్ల
నుచితగతి నాల్కొనంగఁ జేయుచుఁ గడంగి
సంగరోత్సవసంభృతోత్సాహు లగుచు
నగుచుఁ దగుమాట లాడుచు నడచి రెలమి. 87

క. సమరక్రీడాసన్నాహము లొప్పఁగఁ దక్కఁ గలుగునట్టిదొరలు ద
ర్పము పల్లవింప వెడలిరి, తమతమకేతువులు గ్రాల ధరణీనాథా. 88

వ. వా రెవ్వ రంటేని వినుము. 89

క. కల్పితదృఢచతురంగా, నల్పం బై గండు మిగిలి యాదవబల మా
కల్పోజ్జ్వలతఁ గొలువ నవి, కల్పుఁడు కృతవర్మ సనియె [3]గాఢస్ఫూర్తిన్. 90

క. రథములు దఱచై చెలు వగు, పృథుసైన్యముతోడ బంధుబృందముఁ దానుం
బ్రథనోత్సుకవృత్తి మహారథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ బ్రస్ఫురితగతిన్.

మ. చలదుర్వీధరలీలఁ గ్రాలుమదవత్సామోద్భవస్తోమ మ
గ్గల మై యేచిన సేన లొప్పఁగ దిశల్ గంపింప విందానువిం
దులుఁ గాళింగమహీవిభుండు భగదత్తుం డూర్జ భవత్సేనయో
ధులకుం గన్నులపండు వై నడచి రుద్యత్తుంగసంరంభు లై. 92

క. కొడుకులుఁ దమ్ములు గుజ్జపు, గడములుఁ బెక్కైనబలవితానముఁ దగు మై
నడపించుచు మెలపున సంగడములతో నరుగుశకుని గడు నొప్పారెన్. 93

---

1 'శరవళులు వోవు' అని పెక్కుప్రతులు. 2 'మేల్గొడుగు' అని యచ్చుప్రతి. 3 కాంతిస్ఫూర్తిన్.

మ. తనతోఁ గాల్వురు సాలఁ గల్గుబలసంతానంబుతోఁ బ్రీతిఁ బు
త్రుని వీరోత్తము సోమదత్తు విలసద్దోర్దర్పదుర్దాంతుఁ బౌ
త్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణి సేయంగ నే
చిన పెంపొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్. 94

వ. కాంభోజరా జగుసుదక్షిణుం డక్షీణవిభవంబున నెడలె మఱియుం గోసలపతి
యగుబృహద్బలుండును మాహిష్మతీపురనాథుం డగునీలుండును ద్రిగర్తేశ్వరుం
డగుసుశర్మయు నసురేంద్రు లగునలంబసహాలాయుధులును సాల్వసౌవీరశూరసే
నాభీర యవన వసుధాధిపులును లోనుగా ననేకదేశాధీశులాత్మీయచతురంగబల
సమన్వితులును నిజధ్వజవిరాజమానులును నానాభరణోజ్జ్వలాంగులును నయి
సంగరకౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగి రివ్విధంబునం బదియక్షౌ
హిణులు నడువం బదునొకొండవయక్షౌహిణితోఁ గురుక్షోణీవల్లభుండు విస్ఫురిత
భూషణభూషితుం బైనగంధసింధురంబు నెక్కి వెలిగొడుగులు మెఱయం దొడవు
లం దఱచైనవజ్రంబులయుద్దామంబు లగుదీధితిస్తోమంబులును జామరంబులుం
గలయం బొలయ బహురత్నప్రభావిభాసితం బయినభుజంగకేతనంబు గ్రాలఁ గ
లంకుల దుశ్శాసనదుర్మర్షణవివింశతివికర్ణాదు లగుసోదరులు వాహన[1]వల్గనంబుల
మెఱసి మెఱుఁగారుతమతమసిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చనుదేరం జని
నిట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండ గదా దండ కుంత క్షురికా ముసల
ముద్గర తోమర పరశు భిందిపాల శూలప్రముఖనిఖిలహేతివ్రాతంబులను భర్మఘటి
కర్మనిర్మాణశోషితవర్మంబులను వివిధవర్ణవిచిత్రతనుత్రాణంబులను మణిగణోజ్జ్వల
జ్వాలాజటిలకేతనంబులం బరమాభీలసుందరసమ్మర్దం బయ్యె నట్లున్నయప్పుడు.

తే. అమరుతొడవులవజ్రాంశు లంచపిండు, కరణి హరినీలములఁ బేర్చుఁ గాంతి యళుల
పగిది మాణిక్యరుచిపద్మభంగి మెఱయఁ, గురుబలంబు గెందామరకొలనిఁ బోలె.

వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభుల నెల్లం గూడం బిలిపించి వారలతో నిట్లనియె.

భీష్ముఁడు నిజయోధుల కెల్ల నుత్సాహంబుగా నెగువ సెప్పుట.

క. ఆరయ వివృతస్వర్గ, ద్వారము రాజులకు నాహవం బందు మహో
దారులు దొల్లియు నరిగిరి, మీ రీమార్గమున నడవఁ మెయికొను టొప్పున్.

క. ఇంటం దెవులునఁ జచ్చుట, కంటెను బాపంబు లొండుఁ గలవే నృపులకుం
[2]బంటకలను బొలిగల నిది, గంట నిధానంబు గంటఁ గాదే మనకున్. 99

తే. అనిన విని వారలందఱు నగ్గలికలు
నెఱయుమాటలఁ దనతనతెఱఁగు మెఱయ
బహువిధంబుల నతనికిఁ బాస యిచ్చి
యేచి నిజసైన్యములలోనికిఁ గేఁగి రధిప. 100

1. చ్ఛత్రంబుల. 2. బంటకలనఁ బొలిగల నిదె; బంటయి పొలిగలన దివిని.

వ. అయ్యవసరంబున గాంగేయుండు గాంధారేయు నాలోకించి మదీయసంగరసమ
యంబునఁ గర్ణుండు పుత్త్రమిత్త్రామాత్యబంధుసహితంబుగాఁ గయ్యంబునకు
రాకుండం గలవాఁ డని తేటపడం బలికిన. 101

క. చలముకొని యొరుల నుడుపుట, బలియుం డై తెంపు సేసి బవరమునకుఁ దాఁ
[1]దెలియుటగాదే యని కురు,కులముఖ్యుఁడు వొంగి యతనిఁ గొనియాడెఁ దగన్.

వ. ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల ననుజసహితంబుగా నతనిం
బరివేష్టించి యన్నరపతి నిబిడచారుసన్నాహంబుగా నుచితవ్యూహం బమర్పుమని
యతనికిం జెప్పిన నతండును బడమర మొగం బయి తానును ద్రోణుండును
దాలధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలుచుండ ముందర నిలిచి వలపటఁ
గృపాశ్వత్థామలును దాపటం గృతవర్మమద్రేశ్వరులు వెనుక బాహ్లికసోమదత్త
భూరిశ్రవసులును నడుమం గురుకుమారసమేతంబుగా నమ్మహీనాథుండును నతని
యగ్రభాగంబున నర్జునుఁ జంపుదుము చత్తు మింతియ కాని యొండు లే దని
[2]శపథంబులు పలికి సంశప్తకు లనం బ్రఖ్యాతు లయినసుశర్మ మొదలుగాఁ గలపది
వేవురు రథికముఖ్యులును గలయ నెడ నెడం దక్కినయోధవీరులును నిలుచునట్లుగా
నియమించి తగ నమ్మైసైన్యంబుల కేనుంగులు నేనుంగుల కరదంబులు నరదం
బులకుం దురంగంబులుఁ దురంగంబులకు విండ్లవారు విండ్లవారికి [3]నద్ధాయు
ధులు నడ్డం బగు తెఱంగున నిలువ నియోగించి మానుషవ్యూహంబు సమకట్టిన
నన్నండును నిట్టిదృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగ మని యెల్లవారు
నచ్చెరువునం బొరయుచుఁ బ్రియం బందుచుండిరి బృందారకప్రముఖదేవయోను
లును దివంబున నున్నపురాతనధరారమణులును భారతరణంబు గనుంగొను
కుతూహలంబున వివిధవిమానారూఢు లై యేతెంచి రంతకు మున్న యక్కడ.

పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట.

సీ. ఏనికమదమున కెలయు తేఁటుల మొత్త,ములు వెలిగొడుగుల చెలువు [4]గాలుపఁ
దురగఖురోద్ధూతధూళి యప్సరసల, [5]చిన్నిపువ్వులతోడఁ జెలిమి సేయఁ
గేతనంబులమణివ్రాతంబురోచులు, రవికిరణంబుల నవలఁ ద్రోవ
జైత్రభేరులమహాస్వనములు సకలప,ర్వతములఁ బ్రతివిరావముల నీన

తే. నంబరము రథఘోషభీమాభిరామ, కింకిణీగణఝణఝణత్కృతిమయము గఁ
బటుపదాతిహేతిప్రభాపటలి యెల్ల, దిశలు నెలిఁగింప వెడలె యుధిష్ఠిరుండు.

మ. ప్రమదంబాననకాంతిఁ గ్రొత్తవఱుపం బాదాతిభూయిష్ఠసై
న్యముతో భీముఁడు భూషణద్యుతినికాయంబుఁ గదాద్యాయుధో
గ్రమరీచిప్రకరంబునుం గలిసి చిత్రస్ఫూర్తి శోభిల్లఁ గా

1. నెలయుట. 2. సంశాపంబులు. 3. నద్ధనాయకులును. 4. గెలువ. 5. యలకల
తోడుత; ములకపువ్వులతోడ; యలకలచినిపువ్వు.

సమరక్రీడకు వచ్చె జృంభితభుజాస్తంభోజ్జ్వలాకారుఁ డై. 105

సీ. దివ్యరథస్ఫారదీప్తిజాలంబులు, పద్మరాగోజ్జ్వలప్రభలు గాఁగ
మహనీయరథ్యవిగ్రహములజిగిసొంపు, ఘనవజ్రవసుసముత్కరము గాఁగ
నొగలపై నున్నకృష్ణుని మేనినునుఁజాయ, హరినీలకాంతివిస్ఫురణ గాఁగ
బ్రస్ఫీతకేతనాగ్రస్థితకపిదేహ, రోచులు, గరుడాశ్మరుచులు గాఁగ

ఆ. సంపహాదుల నిగుడు నంశువితానంబు, దీప్రమరకతములదీధితులు గఁ
దాలిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయరోహణాద్రి వెడలివెలిఁగె.

క. అతులితరథప్రతానో,ద్ధతసైన్యము గొలువ దేవదత్తం బంగీ
కృతసకలతూర్యనాదో,ద్గతి యగుచుఁ జెలంగఁ గ్రీడి గడు నొప్పారెన్. 107

తే. గాండివం బింద్రచాపంబుకరణి నొప్ప, మెఱసి దివ్యకిరీటంబు మెఱుఁగు లడర
జ్యానినాదంబు గర్జగా మేనికృష్ణ,కాంతిఁ బొలిచెఁ గవ్వడి యనుకారుమొగులు.

మ. వివిధోద్దామహయావళీబహుళ మై విక్రాంతికేళీసము
త్సవకౌతూహలసుందరం బగుమహాసైన్యంబుతో మేదినీ
ధవసందోహము ప్రీతిఁ బొంద మహిమోదాత్తోగ్రయానంబులం
గవ లేతెంచిరి వేడ్క నొండొరులకుం గయ్యంబుమైఁ జెప్పుచున్. 109

మ. రభసక్షోభితమేదినీతలముపై రథ్యప్రచారంబు లొ
ప్ప భుజాగర్వము నెమ్మొగంబులఁ దలిర్పం గన్నెకయ్యంబు న
ర్థి భవత్పుత్రులమీఁదికోపమున నుద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్గంతియూథాకృతిన్. 110

వ. ఇవ్విధంబునం బ్రతివింధ్యుండును శ్రుతసోముండును శ్రుతకీర్తియు శతానీకుండును శ్రుతసేనుండును సౌభద్రుండును దమకుం గన్నాకుగాఁ జెన్ను మిగిలి చనుదేరం గనుంగొని కౌంతేయబలంబులు సంతసంబునం బొదలె నప్పుడు. 111

సీ. కరులసంగడి నొప్పుఘనసేన దుర్దమ,లీలఁ దో నడవఁ బాంచాలవిభుఁడుఁ
దనుజులు ననుజులు దర్పదుర్జయసైన్య,మహిమఁ దో నేతేర మత్స్యపతియు
యాదవానీకంబు లవని గ్రక్కదలఁ దోఁ, జనుదేరఁ [1]బాలుపారి సాత్యకియును
యోధవీరులు ప్రతాపోగ్రవాక్యములతోఁ, దనుఁ జుట్టి రాఁ జేకితానవిభుఁడు

తే. [2]బాస పై వీరరథికులు బలసి మెలమి, నొండొరుల గరువంబుగ నుల్లసంబు
లాడుచును జేరి నడతేర నత్యుదార,గతి శిఖండియు నడచిరి కౌరవేంద్ర.

చ. బధిరితదిఙ్ముఖం బగుచు బంధురతూర్యనికాయనాద మం
బుధియునుబోలె సేనకు విభూతి యొనర్పఁగ నేఁగుదెంచె మా
గధసహదేవుఁ డపు రణకౌతుకసల్లపనంబు నుజ్జ్వలా
యుధవిభవంబుఁ జెన్నొనఁగ నొప్పెడుతమ్మునిఁ బ్రీతిఁ జూచుచున్. 113

---

1. బలుపారి, 2 బాసపడి; బాస లిడి.

ఉ. చండభుజాబలంబుఁ బటుశౌర్యసముల్లసనంబుఁ దోఁప ను
ద్దండత నాత్మసైనికులదర్ప మెలర్పఁగ నెమ్మిఁ బల్కుచుం
బాండవకోటిచమూకలకుఁ బంధువుగాఁ జనుదెంచె ధృష్టకే
తుండు సహోదరుండు దనతోఁ నడతేఁ బరాక్రమోద్ధతిన్. 114

మ. విచలద్దండధరోపమాశ్రయనవపుర్విస్ఫార మై దానవ
ప్రచయం బుద్ధతలీలఁ గొల్వఁగఁ దమోరాశిప్రతీకాశఘో
రచలద్రూపముభంగికిం దగినదంష్ట్రాయుగ్మ మొప్పన్ ఘటో
త్కచుఁ డేతెంచెఁ గరస్థశూలరుచు లాకాశంబునం బర్వఁగన్. 115

వ. పాండ్యపతియును గేకయపంచకంబును శైబ్యుండును మఱియుం గాశ కరూశాది బహుదేశాధీశులును దమతమబలంబులదళంబులసవరణలయొప్పును గయ్యంపుఁ గడంకయు నెఱయం జేతనంబులు మెఱయం దోఁతెంచి రి త్తెఱంగునం గూడి సప్తాక్షౌహిణీబంధురంబుగాఁ బేర్చినపాండవసేనమొగంబునకుం దిలకం బై. 116

శా. పుష్టోదంచితసారవీరరససంపూర్ణాంగముల్ సంగరా
వష్టంభోజ్జ్వలవీరరేఖయును భాస్వద్వ్యూహసంవల్గనో
త్కృష్టస్యందనముం గనద్ధనువు నుద్దీప్తధ్వజంబుం దగన్
ధృష్టద్యుమ్నుఁడు [1]వాల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్. 117

వ. ఇట్లొప్పి సేనాపతి యగు నాద్రుపదసుతుండు ముంగలి యై నడపించు చుండ. 118

సీ. ఇల ధూళి [2]మెగసినఁ బలుచ గాకుండంగ, రాసినతొడవులరజము దొరఁగు
సమరవికాసంబుచెమట నొప్పఱకుండ, హేతిదీధితులు రేయెండ నొడుచు
భేరీధ్వనుల నింగి బీఁటలు వోకుండఁ, గరికరశీకరోత్కరము దడుపు
దర్పంబు గనుఁజాటుదాఁకకుండఁగఁ గొడు, గులపెల్లు ఖచరదృక్కోటి నాఁగు
తే. ననిన నిజ మైనయట్లుండె మనుజనాథ, ధరణి వడవడ వడఁకె దిక్తటము లద్రువ
భూరిచతురంగచండవిస్ఫూర్తిఁ బాండు, నందనులసేన గలనికి నడచునపుడు.

వ. ఇట్లు నడచి కురుక్షేత్రంబులోన నుత్తమప్రదేశం బగు శమంతపంచకసమీపస్థలంబు సేరుసమయంబున ధర్మనందనునకుం దోఁచుదక్షిణాక్షిస్పందనాదిశుభసూచకంబులకు మెఱుంగు వెట్టినచందంబున. 120

క. ఏనుఁగులమదము తావియు, సైనికనికరానులేపసౌరభ్యములుం
దా నుపలాలించుచుఁ బవ, మానుం డనుకూలమృదుగమనమునఁ [3]బొలసెన్.

వ. దాని కయ్యుధిష్ఠిరుండు ప్రముదితచిత్తుం డగుచుఁ బ్రీతచేతస్కు లగుతమ్ములుం బాంచాలమాత్స్యాదిపతులును సకలజనంబులును బరివేష్టింపం దూర్పుమొగం బై కౌరవు లున్నచక్కటికిం గట్టెదురుగా నిలిచి యెల్లవారిసైన్యంబులుం గ్రమంబునఁ గొలంది వెట్టుకొనుచు నందఱకు సంజ్ఞలు నడియాలంబులుం గల్పించి

1. వాల్చె నిల్చె విలస. 2. సెగసినఁ. 3 బాలిచెన్.

దొరలదెసం గనుంగొని మన మీరణంబునందు ధరణీరాజ్యంబు వడసెద మొండెఁ
బూజ్యం బగునాకలోకనివాసంబు గనియెద మొండె నని నిశ్చయించి నాకలంకుల
నిలువుం డనిపలికిన విని వారలు ధీరోదాత్తంబు లగువివిధవాక్యంబులం బ్రతిజ్ఞలు
సేసి నిజశంఖంబులు పూరించి తమతమబలంబులలోనికిం జని రజ్జనపతియును
దన కమర్చినకజ్జంబులును బుష్పఫలకర్పూరకస్తూరికాదులును వారలకుం బుచ్చు
చుండె. 122

క. అనిన విని యాంబికేయుఁడు, మన మొన గడుఁ బెద్ద దీని కమార్కొనఁ గుంతీ
తనయులు గొంచెం బయ్యును, ననుమానింపక కడంగు కటది వెల్లక్కొ. 123

వ. అనుటయు సంజయుం డదియునుం జెప్పెద విను మని యతని కిట్లనియెఁ గాంతే
యాగ్రజుండు గురుబలంబు గనుంగొని కొండొక విన్ననై వివ్వచ్చు నాలోకించి.

చ. ఘన మయి తోఁచుచున్నయది కౌరవసైన్యము చూడ్కి కందు శాం
తనవునితాలకేతన ముకదగ్రత ముందటఁ బొల్చెఁ జూచి తే
యనవుడుఁ బిన్ననవ్వు నగి యన్నరుఁ డన్న మొగంబుఁ జూచి నె
ట్టన బలుమాట లాడఁగఁ గడంగఁగ నొల్లక యత్యుదాత్తతన్. 125

## ధర్మజునకు నర్జునుఁ డుత్సాహంబు గలిగించుట.

వ. అతనితో నిట్లనియె. 126

చ. మునివరుఁ డైననారదుఁడు ము న్నొకయప్పుడు సెప్పె ధర్మనా
శను లగువారలం బ్రబలసైన్యము గల్గినయేనిఁ గొంచె మై
నను రిపుసేన గెల్చు నని నాకు గురుండును దేవతానదీ
తనయుఁడు నేర్పడఁగ వినఁగఁ దాను బరాశరసూనుఁడుం గృపన్. 127

వ. అది య ట్లుండె నమానుషశక్తిసముద్దామం బగుభీముగదావిహారంబు వైరిదు
స్సహంబు ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలవర్గం బనర్గళవిక్రమంబు విరాట
శంఖముఖ్యమాత్స్యనికరం బరిభయంకరంబు సాత్యకిచేకితానాదియాదవనివ
హంబు భవజ్జయావహం బభిమన్యుహైడింబప్రభృతికుమారలోకం బలోకసామా
న్యబలశౌర్యధుర్యంబు నీకటాక్షంబును గృష్ణుసంరక్షణంబునుం గలిగి గాండీవం
బనుపామునకు ఱెక్కలువచ్చినట్లున్నయది యట్లుంగాక యేనుఁగుంబోలె నీలావు
నీ వెఱుంగవు దివిజులకు నజయ్యుండవు. నీ వలిగిన నెవ్వ రెట్లయ్యెదరో యటు
సూడు మనినం దెలి వొంది సంక్రందననందనునకు ధర్మనందనుం డి ట్లనియె.

తే. కౌరవవ్యూహమునకుఁ దగఁగ నొక్క
బంధురవ్యూహ మొనరింపఁ బంపు మనిన
నతఁడు ద్రుపదాత్మజుని నచకలాఖ్య మైన
ఘనతరవ్యూహ మొనరింపఁ బనుచుటయును. 129

వ. ఆధృష్టద్యుమ్నుండును గలయ మెలంగి మోహరంబమర్చె నయ్యచలవ్యూహంబు

నందుఁ దా నగ్రభాగంబున నభిమన్యుప్రభృతికుమారనకులసహదేవసహితంబుగా భీమసేనపరిపాలితుండై నిలిచెఁ దమతమబంధులకును బలంబులకును బలుపుతోడి [1]చెలువుగలుగఁ జేకితానసాత్యకిసమేతంబుగాఁ బాంచాలమాత్స్యాధిపతులు దక్షిణోత్తరభాగంబుల నిలిచిరి నడుమ నడగొండగమియుంబోనిగజరాజితో రాజు రథారూఢుండై ధవళచ్ఛత్త్రచామరంబులు మెఱయ విప్రవర్గంబునకు నంబర జాంబూనదంబు లొసంగుచు విజయాశీర్వాదంబు లాదరించుచుండె ముందట బురందరనందనసంరక్షితుండై శిఖండి గాంగేయునకుఁ గట్టెదురుగా నిలిచి గండు మిగిలి యొప్పె నపరభాగస్థులై మాగధసహదేవధృష్టకేతు లవష్టంభవిజృంభణంబునం బొలిచి రివ్విధంబునం జారుభీషణం బై. 130

క. అరదములు దీవు లున్నత,కరులు గిరులు హరులు వీచికలు సుభటసము
త్కర ముగ్రసత్త్వములుగా, శరనిధిగతిఁ బాండుపుత్త్రసైన్యం బొప్పెన్. 131

క. ఉభయబలదీప్తకేతు,ప్రభలం గీడ్వడఁచి కురుధరావల్లభసై
న్యభయంకర మై శక్ర,ప్రభవుకపిధ్వజము వెలిఁగెఁ బ్రకటస్ఫురణన్. 132

తే. అరుణములును సితంబులు నసితములును
నై నజోడులతో దొర లందు నిందు
నాలలోనియాఁబోఁతులఁ బోలి పొలిచి
రెసఁగుబెడిదంపుమాట లాకసము ముట్ట. 133

తే. కొన్నిభూములబలములు గురునృపాలుఁ, బాండవులఁ గొన్నిభూములు బలములీసు
గలిగి పాయలై కొన్నిభూములబలములు, రెండుదిక్కులయందుఁ జేరినవియధిప.

వ. కావున. 135

క. బాలురు వృద్ధులుఁ దక్కఁగ, వ్రాలి యిలం గలుగుపురుషవర్గంబు జయ
శ్రీలోలత నేతెంచుట, నేల యవిసి మూఁగినట్లు నెఱసె బలంబుల్. 136

వ. అనిన విని ధృతరాష్ట్రుం డప్పు డప్పాండవకౌరవసైన్యంబులలో నెయ్యది యుబ్బు గలిగి యుండె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె. 137

క. రెండుబలంబులవారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కు మిగిలి యొం
డొండ కడంగుచు నుజ్జ్వల,చండస్థితి నొప్పి రపుడు జగతీనాథా. 138

వ. అని వెండియు. 139

క. ఆరెండుబలములందును, దోరం బై యున్నయట్లు దోఁచెం బాండు
క్ష్మారమణసుతుబలము నర,నారాయణు లునికిఁ జేసి నాకుం జూడన్. 140

క. [2]ఎలసి పయి వారి[3]దంతిఘ,టలమదముల [4]రాహు నెట్టుకటయుఁ గౌరవసే
సలమేనుంగులమదధా,రలు డొంకెం బొలయుమధుకరము లుబ్బడఁగన్. 141

---

1 నెలవు. 2 ఎలమి మెయి వారి; ఎలసి పయిఁ బాఱి. 3 'దంతిఘటలు మదమున రాపువెట్టు' అని యచ్చుప్రతి. 4 రాహువట్టు.

తే. అధిప నీతనయుండు గయ్యంబు వోఁడుచు, తెంపువదలకవిభవంబు పెంపుమెఱసె
సారసానకు వచ్చిన చందమునను, నెలమిఁ బొందిరి పాండవేయులును హరియు.
వ. అట్టియెడఁ గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన. 143
క. ఆనినదము విని పాండవ, సేన లలరె ధార్తరాష్ట్రసేనాగతయో
ధానీకములికె నెత్తురు, వాన గురిసె నంతఁ గౌరవవ్యూహమునన్. 144
వ. మఱియు ననేకదుర్నిమిత్తంబులు పుట్టెఁ బుట్ట కేలతక్క దేవవ్రతుండును గురుం
డును గురునందనుండును గృపుండును నిచ్చలుఁ గయ్యంబునకు వెడలునప్పుడు
పాండవులకు జయం బవశ్యంబు నయ్యెడు మనుచు వెడలుదు రది యట్లుండె
నయ్యశుభసూచకంబులకు ధార్తరాష్ట్రులు దలంకక తూర్యంబులు మొరయింప
నియోగించిన. 145
ఉ. అప్పుడు రెండుసైన్యములు నాహవకేళికి నుత్సహించి పె
ల్లొప్పెఁ జెలంగి యుబ్బినసముద్ధతిఁ బొల్పగుతోంటిచందముల్
దప్పి యుగాంతకాలచలితత్వము నొంది పరస్పరాకృతుల్
గప్ప నెదుర్చునంబుధియుగంబుమహోగ్రతఁ గ్రేణి సేయుచున్. 146
వ. తదవసరంబున నుభయబలంబులవారును. 147
చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
సవినయవృత్తిమై వలవ దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడినం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱువోయినను గాదు వధింపఁగ నెట్టిశత్రునిన్. 148
వ. అని సమయంబు సేసి రాసమయంబున. 149
క. పలుచాయల నొప్పినయా, బలము లొకటి కొకటి కెమరఁ బల్లవపుష్పా
వలి గలవనముల క్రియ ని,శ్చలత నిలిచి పొలిచె నశమసమధైర్యములన్. 150
క. అత్తఱి సురఖచరాదుల, చిత్తము లనిఁ జూచువేడ్కఁ జిడిముడి పడఁగా
నొత్తొరవున నిరుదెఱఁగుల, యుత్తమవీరులును దాఁక నుంకింపంగన్. 151

—ధర్మరాజు పాదచారి యై భీష్మునియొద్దకుఁ బోవుట.—

తే. సమరకౌతుకి యైనయజాతశత్రుఁ
డొప్పు మిగిలెడుమైమఱు వూడ్చి యాయు
ధములతోఁ గూడఁ దనయరదమునఁ బెట్టి
యిలకు డిగి మాని యై కరంబులు మొగిడ్చి. 152
వ. భీష్ముదెసకుం జను చున్నం గనుంగొని యమ్మహీవల్లభుతమ్ములును శౌరిసాత్యకు
లును బరమాప్తు లగుధరణీశులు నతనిచేతోవృత్తం బెఱుంగమి నుత్తలపడు
చిత్తంబులతో వాహనంబులు డిగ్గి యతనిం గూడం జని యప్పుడు. 153

సీ. ఏ మెల్ల నుండ నీ వి ట్లొంటి గాల్నడ, నేఁగుచున్కికిఁ గత మెద్దియొక్కొ
పన్నినపగఱపై సన్నాహ మంతయు, నెడలించి నడచుట యెట్టులొక్కొ
రిపులు దేఁకువ సెడఁ గృపణత దుర్బలు,చాడ్పునఁ జను టేమిచంద మొక్కొ
యడరి పోరాటకు నద నైనచో నొప్పు, పొలివోవఁ బోవుట వోలునొక్కొ
తే. యని క్రమంబున నామరుత్తనయవిజయ
నకులసహదేవు లడుగ భూనాథుఁ డొక్క
పలుకుఁ బలుకక యరుగంగఁ బద్మనాభుఁ
డక్కుమారులతో నిట్టు లనియె నగుచు. 154

వ. ఇతనితలం పే నెఱింగితి నితండు భీష్మద్రోణకృపశల్యులకు నమస్కరించి వారల చేత ననుజ్ఞాతుం డై భండనంబు సేయువాఁడుగాఁ దలంచి చనియెడుఁ బెద్దల యనుజ్ఞ గొని కయ్యంబు సేసిన జయం బగుట నిశ్చయం బని యార్యులు సెప్పుదురు గావున నాసుకర్మం బాచరించుట మేల కాక యనిన విని యజాతశత్రు వెనుక నప్పు డరిగినవారలు వలుకు లుడిగి నిలిచి వెఱఁగుపడి చిత్రరూపంబుల చందం బై చూచు చుండిరి కృష్ణార్జునులును భీముండును గవలును దోన చనం గౌంతేయాగ్రజుండు గాంగేయు తేరు సేరం బోవం గౌరవసైన్యంబుజనంబు లేపు మిగిలి మెడ లెత్తి కనుంగొని రయ్యవసరంబున నందలియోధవీరు లితం డింత వెఱచు నే యనువారును వెఱవ నిప్పు డితని కేమి వచ్చె ననువారును వృకోదరుండు వివ్వచ్చుండు గవలు సౌభద్రుండు సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టద్యుమ్నుండు శిఖండియుం గలుగఁ దన కింత యేల యనువారును ధర్మతనయుండు భీతుండు గాఁ డేమితలంపున వచ్చెనో యనువారును మఱియు ననేకప్రకారంబులం బలుకువారును నై యుండిరి పాండవసైనికులు మానధనుం డగు నిమ్మానవనాథుండు నదీనందనుతో నేమనువాఁ డతం డితని నేమిభంగి సమ్మానించు మాధవధనంజయు లెట్లు వలుకువారు మారుతసుతుండును మాద్రీసూనులును నెత్తెఱంగున మాటలాడుదురు వీ రేమిటి కివ్విధంబునకుం దొడంగి రనుచు వగచి వెండియు వివిధవచనముఖరు లగుచుండి రయ్యుధిష్ఠిరుండు సముద్యతనానాయుధబహుళం బైనకురువ్యూహంబు దఱిసి పితామహుపాలికిం బోయి తత్పాదంబులకుఁ బ్రణామంబు సేసి సవినయంబుగా నతని కి ట్లనియె. 155

ఆ. అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడ నై, ము న్ననుజ్ఞ గొనఁగ నిన్నుఁ గాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన, వడసి చనిన నేను బగఱ గెలుతు. 156

సీ. అన విని గాంగేయుఁ డక్కట నీ వి ట్లు, సను దేక తక్కిన శాప మిత్తు
వచ్చితి మే లయ్యె వైరుల నిర్జింపు, మిది గాకయును వర మెద్ది యైన
నడుగుము నీకుఁ గా నని సేయు టొక్కటి, దక్కంగ నావుడు ధర్మసుతుఁడు
రారాజుపక్షు నై రణము సేయుము నాకు,హిత మగుకార్యంబు మతిఁ దలంపు

ఆ. మనుడు నల్ల కాక యట నీతలం పేమి, యనినభీష్ముతోడ నతఁడు నిన్నుఁ
బోరఁ గెలుచువిధము బోధింపు మనుటయు, సస్మితాస్యుఁ డగుచు శాంతనవుఁడు.

క. నను మార్కొని గెలువఁగ న, య్యనిమిషులకు నరిది యనుడు నట్లగుటఁ గదా
నిను వేఁడెద నని కుంతీ, తనయుఁడు పలుకుటయుఁ దత్పితామహుఁడు గృపన్.

ఉ. చుట్టఱికంబునన్ మనసు సొచ్చిననుం గరఁగించి వేఁడినన్
దిట్టతనంబు వో విడిచి తీవ్రరణంబుకడంక దక్కి నేఁ
బట్టినయాయుధంబు వెడఁ బాసినఁ గాని వధింపఁ బోల ది
ట్టిట్టన కేఁగు మిప్పరుస యింతక కాలము గాదు దానికిన్. 159

ధర్మరాజు గురుకృపశల్యులచేత యుద్ధమున కనుజ్ఞాతుం డగుట.

తే. క్రమ్మఱంగ నేతెంచెదు గాక యనుడు, నతిముదంబునఁ బ్రణమిల్లి యతనివాక్య
మపుడు దలనిడుకొనినవాఁ డగుచు నప్పి, తామహుని నెమ్మి వీడ్కొని ధర్మసుతుఁడు.

వ. కృష్ణార్జునాదులుం దోడన చనుదేర గురుకృపశల్యులకడకుం గ్రమంబున నరిగి పాదప్రణామంబు లాచరించి వారలచేత రణంబునకు ననుజ్ఞ వడసి యమ్మనుజపతి దనకు జయం బాశాసింపు మని యభ్యర్థించిన నయ్యాచార్యుండు నీకుం గృష్ణుండు మంత్రి యై యుండ నొరుల జయం బాశాసింపు మన నేల ధర్మం బేవలనం గలుగు నవ్వలన కృష్ణుండు గైకొను నవ్వలనికి జయం బగు ననియె నిజవధోపాయంబు వేఁడిన నతండు నాచేత నాయుధం బున్నంతసేపు నన్నుం జంప నెట్టివారికి నశక్యం బేను బ్రాయోపవేశంబున సన్న్యస్తశస్త్రుండ నైనం జంపుటకు నోపునట్టివారికి నది దొరకొనుఁ బెద్దయు నమ్మఁ గలవాఁడు సెప్ప నత్యంతదుస్సహం బైనకీడుమాట వింటి నేని నట్టివాఁడ నగుదు నప్పు డట్టిపగఱకు నప్పని దీర్ప నను వై యుండు నని చెప్పినఁ గృపాచార్యునిం బరిమార్చు తెఱంగు నడుగం దొడంగి యేర్పడం బలుక నేరకున్న నతం డెఱింగి తాను వధ్యుండు గామి మెఱింగించి గెలువు మని దీవించె మద్రపతితో నీవు రాధేయునకు సారథి వగుట సంభవింప నోపు నని చెప్పి కయ్యంబునప్పుడు కర్ణుతేజంబు దూలం బలికి యతనిఁ జిక్కువఱుప వలయు నని వరంబు గోరిన నతం డవ్విధంబు నీయుద్యోగసమయంబున నియ్యకొనినయది గాదే యట్లచేయుదు నని పలికె నిత్తెఱంగున నందఱ వీడ్కొని యజాతశత్రుం డనుజవర్గానుగతుం డై మరలె నయ్యవసరంబున. 161

క. మొనలవినోదంబునకుం, గనుఁగొన నేతెంచి యున్న కర్ణునికడకుం
జని హరి యి ట్లను నొండొరుఁ, గని యప్పటియుచితభంగి గడ తేర్చి తగన్.

తే. అమరతటినీతనూజుపై నలుక చేసి, యనికిఁ జొరవెఱ యట్లైన నతఁడు సచ్చు
నంతదాఁకఁ బాండవులకై కొంత సమర, కేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ.

వ. అనిన విని దేవకీనందనునకు రాధానందనుం డి ట్లనియె. 164

క. కినుక వొడమి గంగాపు, త్రునికయ్యమునప్పు డనికిఁ దొలఁగితి నేనిం

జనుఁ గా కేఁ గురుపతి కి, చ్చినప్రాణం బొందువలనఁ [1]జేర్పం దగునే. 165

వ. అనవుడు నప్పలుకులకు సంతోషించినవాఁ డయి వాసుదేవుండు గాంగేయులం గూడఁ జనుదెంచె నివ్విధంబున ధర్మనందనుండు కౌరవసైన్యంబు వెడలి నిలిచి యద్దిక్కు మొగంబు సేసి మెలుం గెత్తి యి ట్లనియె. 166

తే. మమ్ము నెమ్మిమైఁ గలయఁ జిత్తమ్ము గలుగు, వార లెవ్వారు గలిగిన వచ్చి కలయుఁ
డట్టివారిని నాతమ్ము లంతవారిఁ, గాఁగఁ బాటింతు నెంతయు గారవమున. 167

వ. అనిన విని నీపుత్త్రుండు యుయుత్సుం డేను వచ్చెద నన్నుం గలపికొను మని పలికిన దానికిం బాండవాగ్రజుండు ప్రియంబుఁదినపలుకులు వలుకుటయు నతండు దుర్యోధనాదులదుశ్చేష్టితంబు లుగ్గడించుచుఁ గాంగేయులగుణంబు లగ్గించుచు నిజసేనాసమేతంబుగా నిస్సాణాదిరావంబులు సెలఁగంజనిధర్మనందనుబలంబులం గలసె నది యట్టిద కాక సవతాలిప్రజలు పొంద నేర్తు రే యది య ట్లుండె నిట్లు దన్నుం గలసిన సంతుష్టాంతరంగుం డగుచు నయ్యుధిష్ఠిరుండు యుయుత్సునకు నత్యుపచారసమాచారంబులం బ్రమోదం బొనరించి. 168

తే. రథమునిఁదికిఁ జనుదెంచి పృథులసైన్య
హర్షభాషణధ్వనులుఁ దూర్యస్వనములు
నెగసి దివి ముట్ట మైమఱు విడి తలిర్చు
నెలమిఁ గోదండతూణీరములు ధరించె. 169

వ. తదవసరంబున నతనితమ్ములుం దక్కటిదొరలును దమతమరథంబు లెక్కి యెప్పటి నెలవుల నిలిచినం దదీయవ్యూహంబు పూర్వప్రకారసన్నాహం బై యొప్పె నట్టి యెడ రెండుబలంబులవారును బాండవులు దొల్లి పడినపాట్లు సెప్పికొని వగచుచు వారు సంధికై చేసినయత్నంబు వాక్రుచ్చి మెచ్చుచు నప్పుడు గురుజనం బులయెడఁ బాటించినవినయంబు వర్ణించి యనురాగించుచుండి రని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 170

క. మానుగ ధర్మక్షేత్రం, బైనకురుక్షేత్రమున మహాహవమునకుం
బూని మనబలముఁ బాండవ, సేనయు నిటు వన్ని యేమి సేసెం జెపుమా. 171

వ. అనిన విని సంజయుం డతని కి ట్లను దుర్యోధనుండు పాండవవ్యూహంబు గనుం గొని గురునికడకుం బోయి. 172

తే. చూడు మాచార్య నీదుశిష్యుండు ద్రుపద
సుతుఁ డమర్చినయది పాండుసుతులసేన
పెంపు బలువును గలిగి యొప్పినది యందు
భీము నర్జునుఁ బోలిన బిరుదుమగలు. 173

వ. సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టకేతుండు చేకితానుండు గాశిరాజు పురు

1. జేర్చుట తగవే.

జిత్తు కుంతిభోజుండు శైబ్యుండు యుధామన్యుండు నుత్తమౌజుండునభిమన్యుండు ద్రౌపదేయులువారలందఱుం జాలుమానుసులయిట్లుగూడి భీమాభిరక్షితంబగు నబ్బలంబు సాల [1]సమర్థంబునుం బోలె మెఱసె [2]మన సేనానాయకులం జెప్పెద నిన్నును భీష్ముని నెన్న నేల కృపాచార్యుం డశ్వత్థామ శల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు మఱియుం బెక్కండ్రురథికులుఁ గలరు నానాస్త్రకోవిదులు వివిధయుద్ధవిశారదులు వీర లందఱు నాకై ప్రాణంబులు విడిచెద మని యున్నవా రిట్లు బెరసి భీష్మపరిపాలితం బయినయీసైన్యంబు పెద్ద యసమర్థంబై తోఁచుచున్నయది మీ రెల్లను వలయునెడల నిలిచి భీష్మునకుఁ గావలి గావలయు ననిన ద్రోణుం డట్ల కాక యింత సెప్ప నేమిటి కనియె నప్పలుకులు విని యమ్మహీపతికిఁ బ్రియంబు వుట్ట శాంతనవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించిన. 174

క. తనతనశంఖంబును దక్కను గలదొర లెల్ల ననికిఁ గొనకొని పూరిం
చినవివిధతూర్యనాదంబును జెలఁగె నభంబు దిశలుఁ బూర్ణంబులుగాన్. 175

వ. అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులును భీమసేనుండు పౌండ్రంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బాంచాల విరాట సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండిప్రముఖదండనాయకులు దమతమశంఖంబులుఁ బూరించిన. 176

క. అనయము నుగ్రం బగుత, ద్ధ్వని గాంధారేయహృదయవిదారణమై పాం
డునరేంద్రపుత్త్రసైనిక, [3]మనోరమం బగుచుఁ జెలఁగె మనుజాధీశా. 177

వ. తదనంతరంబ శస్త్రసంపాతనంబునకు సమయం బగుటయుఁ గపిధ్వజుండు గాండీవంబు వుచ్చికొని గుణంబు సారించి బాణపాణియై నీకొడుకులం జూచి కృష్ణునితో ని ట్లనియె. 178

తే. కౌరవులలోన నిప్పు డెవ్వారితోడ
ననికిఁ గడఁగుదునో చూచికొనఁగ వలయు
నరద మల్లన యుభయసైన్యములనడిమి
నేల కటు వోవఁగా నిచ్చి నిలుపు మచట. 179

అర్జునుఁడు స్వజనసంహారంబునకు శంకించి మోహావిష్టుం డగుట.

వ. అనినగుడాకేశుపలుకులకు హృషీకేశుండు భీష్మద్రోణప్రముఖయోధవీరులుగనుంగొనుచుండ నత్తెఱంగున రథోత్తమంబు నిలిపి యతనితో నీ వీకూడినకౌరవులం జూడు మనవుడు నప్పార్థుండు రెండుబలంబులయందు నున్నసోదరసుతమాతులాచార్యాదు లగుబంధుశిష్టజనంబుల నాలోకించి పరమకృపావేశంబున నత్యంతవిషాదంబు నొంది గోవిందుమొగంబు గనుంగొని దుర్మదాంధుం డయినదుర్యోధనుదుర్వినయంబున నింత వుట్టెం జూచితే యని పలికి వెండియు. 180

1. సమర్థం బనం బోలి మెఱసె. 2. మన సేననాయకులం. 3. మనోహరం బగుచుఁ.

చ. సరసిజనాభ బంధుజనꞏసంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా
విరవిరఁ బోయి మేను నిడుꞏవెండ్రుక వెట్టుచుఁ గంప మొందెఁ జే
నిరతము గాదు గాండివముꞏ నిల్వఁగ నోర్వవు గాళ్లు నేను ని
ష్ఠురతకుఁ జాల నొల్ల నొకఁꞏడుర్వ మహి యేలుట యేటిసౌఖ్యముల్. 181

తే. ఎవ్వరికిఁ గాఁగ ధరణియుꞏ నెల్లసుఖముఁ
గోరెదము వార లందఱుꞏ వీరె వచ్చి
ప్రాణములు నర్థములు నొల్లఁꞏబాటు సేసి
కయ్యమునఁ జావ నఱుముటꞏ గంటి గాదె. 182

ఉ. తాతల మామలన్ సుతులఁꞏ దండ్రులఁ దమ్ముల నన్నలన్ గురు
వ్రాతము శిష్టకోటి సఖిꞏవర్గముఁ దుచ్ఛజనానురూపదు
ర్నీతి వధించి యేఁ [1]బడయుꞏ నెత్తుటఁ దోఁగినరాజ్యభోగముల్
ప్రీతి యొనర్చునే యశముꞏ పెల్లొడఁగూర్చునె పెం పొనర్చునే. 183

క. అక్కడిబంధులఁ జంపుచు, నిక్కడిబాంధవులు సచ్చుꞏ టియ్యకొనుచు నిం
దెక్కడిపెం పొందెదఁ దుదిఁ, దెఱిఁగ్కొనుఁ బాపంబు రణముꞏ తెరు వే నొల్లన్.

ఆ. ఎల్లభువనములనుꞏ నేలుటకైనను, నిట్టికూ్రరకర్మꞏ మెట్లు సేయ
వచ్చుఁ గడఁగి యెదిరిꞏవా రేమి సేసిన, మాఱుసేయ నాకుꞏమనసు రాదు. 185

చ. అకట నితాంతలోభమునꞏ నావలఁ బాటిలుకీడు గానఁ జా
లక ధృతరాష్ట్రసూనులు కులꞏక్షయ మయ్యెడుదాని కోర్చి పో
రికిఁ దెగి వచ్చి రక్కలుచꞏ రెండు నెఱింగెడునీవు నేను దీ
నికిఁ జొర నేల వీరి నిటుꞏ నిర్దయఁ జంపిన నేమి యయ్యెడున్. 186

క. కులనాశము సేసినఁ ద, త్కులధర్మము లడఁగు నష్టꞏకులధర్ములకుం
గలుగును దుస్సంకర మ, క్కులఘ్నులేఁగుదురు నరకꞏకూపంబులకున్. 187

తే. ఇంతపాపంబు సేయంగꞏ నెత్తికొందు
మయ్య రాజ్యలోభంబునꞏ నఖిలబంధు
జనుల వధియింపఁ దొడఁగితిꞏ మని రథంబు
మీఁదఁ గూర్చుండఁబడియెఁ జేꞏ యూఁదికొనుచు. 188

వ. ఇవ్విధంబున శోకసంవిగ్నమానసుండును విషాదవిహ్వలుండును బరమకరుణా భరితుండును నై శరశరాసనంబులు విడిచి కన్నీరు దొరంగ నూర కున్నసవ్యసాచిం జూచి మధుసూదనుం డి ట్లనియె. 189

క. దెప్పరపుఁజోట నీ కీ, యొప్పనివిధ మెచటనుండిꞏ యొదవెను విను మీ
చొప్పవివేకులయది యిది, దప్పించును సద్గతియు నుꞏదాత్తయశంబున్. 190

వ. అని మఱియును. 191

1. 'బడయ ♦ నెత్తుటఁ' అని అచ్చుప్రతి.

తే. తగునె యర్జున [1]యీపెంటితనము నీకు, దండి వై లెమ్ము మనసు పేదఱిమి విడిచి
యనిన నట్లున్నభంగిన యల్లనిట్టు, లనియె నాతండు పుండరీకాక్షుతోడ. 192

సీ. అక్కటపూజార్హు లగుద్రోణభీష్ముల, నమ్ముల నొప్పింప నగునె చెపుమ
మాన్యులఁ జంపుట [2]మగపాడి గాదు భి, క్షాశనం బైన నత్యంతసుఖము
కడఁగి యెవ్వారిఁ జంపఁగాఁ బెద్దబ్రదుకయ్యు, నూహింపబ్రదుకుఁగాకుండునాకు
విను మట్టిధృతరాష్ట్రతనయులు గారె యీ,యొడ్డినమొనలలో నున్నవార

ఆ. లింద్రియముల నెల్ల నివురంగఁ జేయుచు, నడరుశోకవహ్ని యాఱి నేర
దింద్రపదవి సేరె నేనియుఁ గావున, భండనంబు సేయ కుండువాఁడ. 193

వ. ఎల్లభంగుల గురుజనంబుల నొప్పించుటకుం జాల వారిని గెలిపించుటయును మనము వారల గెలిచినవారల మగుటయు ననునీరెంటియందును బెద్ద మే లెయ్యది యేను గార్పణ్యదోషాపహతస్వభావుండను ధర్మసమ్మూఢచేతస్కుండను నై నిన్ను శరణు సొచ్చి యడిగెద నీశిష్యుండ నగునన్ను శాసింపు మనిన విని కలకల నవ్వి నారాయణుండు నరున కిట్లనియె. 194

చ. వగవఁగ నేమియుం దగనివారికి నై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధిమాటలును వావిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్. 195

వ. అని పలికి పార్థునిం బరమజ్ఞానంబునకుఁ గారణంబు లగువాక్యంబులు వినుటకుం జొనిపి యిద్దేహంబునందు బాల్యంబు యౌవనంబు వార్ధకంబు ననం గలుగు నవస్థలం బొందినట్లును జీర్ణంబు లైనవస్త్రంబులు విడిచి నూతనంబు లైనవానిం గైకొనినచాడ్పుననుం గాని దేహాంతరగమనం బాత్మహానిం జేయ దనియుఁ బుట్టువుఁ జావు ననునివి లేమిం జేసి శరీరంబుపోలె శస్త్రచ్ఛేదనంబు మొద లైనవికృతికారణంబులకు నాత్ముండు లోను గాఁ డనియు నప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింపంబడియెడువాఁడును గాఁ డనియుం జెప్పి మఱియు ననేకవాక్యంబుల నాత్మకు నభావంబును శరీరంబునకు భావంబును గలుగమి దెలిపి యాత్మతత్త్వంబు శాశ్వతం బగుట యెఱింగించి యిట్లనియె. 196

## శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానోపదేశంబు సేయుట.

ఆ. ఇట్టు లగుటఁ జేసి యెవ్వరిదెసకు శో, కంబుఁ బొంద గారణంబు లేదు
జీవుఁ డెల్లభంగిఁ జెడియెడువాఁడుగాఁ, దలఁచితేని వగవవలదు మున్న. 197

క. పురుషుఁడు సెడు ననువాఁడును, బురుషుఁడు సెఱుచునని పలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల య, ప్పురుషుఁడు సెఱుపండు సెడఁడు భుజవీర్యనిధీ. 198

క. పురుషుఁ డన వేఱొకండే, పురుషోత్తముఁ డైనయేన పురుషోత్తమతా

స్ఫురణకుఁ బురుషత్వం బను, మెరమెర గలదదియ కాదె। మెయికొనుఁ గ్రియకున్.

వ. అని వెండియు వివిధవాక్యంబుల నాత్మునకు బాధ్యబాధకత్వంబులు లే కునికి వివరించి విష్వచ్చునకుం గృపాశోకంబులకు మూలంబు లగునహంకారంబులు వారించి యతనికి రణోత్సాహంబునకుం గారణం బైనస్వకర్తావలంబనంబు వదలందగమి దెలియుటకు వలయువాక్యంబులు పెక్కు లుపన్యసించి. 200

క. సమరంబు రాజులకు ను, త్తమకర్మం బది యపావృతస్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగఁ గ, య్యము సేయుము దీని కేల। యనుమానింపన్.

క. ఫలములయెడ బ్రహ్మార్పణ, కలనపరుం డగుచుఁ గార్య। కర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము, తలకొనినం గర్మశమము। దానై కలుగున్. 202

వ. అని మఱియు నీదృశంబు లగువాక్యంబు లనేకంబు లనుగ్రహించుచు వివిధ ప్రకారంబుల వికల్పించి విజయుం డడిగిన వానికెల్ల సదుత్తరంబు లిచ్చి సందేహంబు వాపుచు. 203

క. [1]వైరమున నులిచి త్రెంపక, కారాకులు డుల్లినట్లు। కర్మము లెల్లం
దార పెడఁబాయవలయుట, సారకృపం దెలియఁ జెప్పె। శౌరి యతనికిన్. 204

వ. ఇవ్విధంబునం జెప్పిన విని కవ్వడి సముత్థితుం డై జగన్నాథున కి ట్లనియె. 205

మ. అతిగుహ్యం బిది నీవు భూరికృప నీ। యధ్యాత్మముం గానఁజే
సితి నా కిమ్మెయి విన్కిఁ గొంతభ్రమ వా। సెన్ యోగిహృద్ధ్యేయ మై
యతులైశ్వర్యవిభూతి నొప్పుభవదీ। యం బైనరూపంబు సూ
చుతలం పెత్తెడుఁ బోలునేని దయఁ జ। క్షుల్ప్రీతిఁ గావింపవే. 206

వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 207

క. నానాస్ఫుటవర్ణంబులు, నానాభంగులును గలుగు। నారూపములో
నానాశ్చర్యవిధంబులు, గానఁగ నగుఁ జూపెదం బ్ర। కాశస్ఫూర్తిన్. 208

క. విను మానుషచక్షుర్గతి, గనుఁగొన శక్యంబు గాదు। గావున దానిం
గనుటకయి దివ్యచక్షు, ర్జననం బొనరింతు నీకు। శత్రువిదారీ. 209

వ. అని యతనికి దివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుం డై నయాలక్ష్మీశ్వరుండు దన దివ్యరూపంబు సూపె. నావిశ్వరూపునిదివ్యతేజంబు సహస్రసూర్యప్రభానిభం బనుటయుం జాల కుండుం గావున వాక్రువ్వం గొలఁది గా దట్టిమహామూర్తిఁ గనుంగొని ధనంజయుండు విస్మయరోమహర్షణప్రహర్షోత్కర్షంబులతో దండప్రణామంబులు చేసి నిలిచి కేలు మొగిడ్చి యి ట్లనియె. 210

అర్జునుఁడు శ్రీకృష్ణునివిశ్వరూపంబు గనుంగొని స్తుతించుట.

సీ. దేవ నీ దగుదివ్య। దేహంబునందు సు, రాసురగంధర్వు। లాది గాఁగఁ
గలదేవయోనులుఁ। గమలాసనుండును, సచరాచరం బైన। జగము నాకు

1. 'భారమున' అని యచ్చుప్రతి.

దోఁచెమొగంబులుఽదోర్దండములును బా,దములుఁ గన్నులు ననేఽకములు గంటి
మకుటాదిభూషణఽనికరంబుఁ జక్రగ, దాద్యాయుధములు మాఽల్యాంబరములుఁ

ఆ. బెక్కు గానవచ్చెఽ నక్కజ మైయిది, నడుము మొదలు దుది యఽనంగరాదు
తేజ మప్రమేయఽదేదీప్యమానని, ర్వికృతిమహిమ దుర్నిఽరీక్ష్య మయ్యె. 211

క. జగములకు నాదికారణ, మగుపరమజ్ఞేయ మీవ ఽ యని కనియెద భూ
గగనదిగంతర మంతయు, నగణితమూర్తీ భవన్మఽయం బై తోఁచెన్. 212

వ. చంద్రార్కులు లోచనంబులుగాఁ గలిగి దంష్ట్రాకరాళంబు లైననీముఖంబులు ప్రజ్వరిల్లుచున్నయవి నిన్ను రుద్రాదిత్య మరు ద్వసువులు ప్రవేశించెదరు సంఘంబు లై వచ్చి మహామునులు ప్రస్తుతించెదరు సిద్ధసాధ్యవియచ్చరులు వెఱఁ గంది వీక్షించెద రిట్లుదీప్తోగ్రం బగుభవదీయదివ్యరూపంబు గనుంగొని నాకు విభ్రాంతి వొడమి ధృతి దూలి సుఖంబు వడయ నేరక చిక్కువడి యున్నవాఁడఁ బ్రసన్నుండ వగుము రక్షింపుము. 213

మ. అనలజ్వాలలు పర్వునీముఖములం ఽ దాధార్తరాష్ట్రవ్రజం
బును భీష్మాదులు నిర్దెసం గలుగునీఽభూపాలలోకంబు గ్ర
క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు నాఽకుం జెప్పవే యెవ్వరో
యని శంకించెద నిన్ను భూరికరుణాఽయత్తైకచిత్తుండ వై. 214

వ. అనవుడు నప్పరమేశ్వరుం డేను లోకక్షయకర్త యగుకాలుండ నిచ్చో జనసమాజసమాహరణంబునకుఁ బ్రవృత్తుండ నైతి నీవు సంప వలయు నని లే దీ గురుభీష్మాదు లెట్లును ఛే కుండువార నాచేతం జచ్చినవీరి నెల్లను జయించినవాఁడ వగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము లెమ్ము రాజ్యమ్ము గైకొను మనిన విని వడవడ వడంకుచుం జేతులు మొగిడ్చి గద్గదకంఠంబుతో గాండీవి యిట్లనియె. 215

తే. అంబుపవమానసూర్యచంఽద్రానలాది,వివిధతత్త్వంబులును నీవ ఽ విశ్వలోక
సంప్రవర్తనకరుఁడవు ఽ శాశ్వతుండ, వచ్యుతుండవు పుండరీఽకాక్ష నీవు. 216

క. నిను నెఱుఁగ కుండి యాదవుఁ, డని సఖుఁ డని మేసబావ ఽ యని [1]యే సభో
జనములు సల్లాపంబులు, నొనరించుచు మేల మాడు ఽ చుండుదు నెపుడున్.

తే. మఱియుఁ బెక్కులు లోకసాఽమాన్యభంగు, లాచరించితి నీదెస ఽ నంతవట్టు
దల్లిదండ్రులు ప్రజలకుఁ ఽ [2]దప్పుదారు, లెల్ల సైరించునట్లు సఽహింపవలయు.

వ. అని సంప్రార్థనంబు సేసి పార్థుండు వెండియు నిట్లను నదృష్టపూర్వం బైనభవదీయరూపంబు గనుంగొనం బడయుటం బ్రమోదంబును బిట్టు చూచిన నెక్కుసంబును హృదయవ్యథయునుం బుట్టి యున్నయది నీతొంటిసౌమ్యాకారంబు గైకొని నిలిచి నాకు నాహ్లాదంబు సేయుము. 219

1. యేను సభా, జనములు-యేను సభో,జనములు. 2. దప్పుదాల్మి, నెల్ల.

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు నప్పరమేశ్వరుఁ డక్కిరీటి కి
ట్లనుఁ దప మాచరించి నిగమాధ్యయనం బొనరించి కానరా
దనఘ మదీయదివ్యపరమాకృతి పేర్చిన యేకభక్తిభా
వనమునఁ దోఁచు దీని జనవర్గము గానదు నీక చూపితిన్. 220

వ. నీకు హృదయవ్యథం బొంద నేల మూఢత్వంబు విడిచి విగతభయుండ వై సంప్రీతచేతస్కుండవు గ మ్మని చెప్పి పూర్వప్రకారరూపంబు దాల్చి నిల్చినం గనుంగొని కౌంతేయుం డాసౌమ్యరూపంబు సూచి సచేతనత్వంబు నొందితిఁ బ్రకృతిస్థుండ నైతి నని పలుకుటయు వాసుదేవుండు మత్కర్మపరుండును మద్భక్తుండును నైనవానికి నన్నుఁ బడయ వచ్చు నని యతని నాశ్వాసించి. 221

తే. అతఁడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ
దనకు సందిగ్ధ మైనట్టిదాని నెల్ల
నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంతకరుణఁ
దెలియఁ జెప్పుచు హృదయసంచలత మాన్చె. 222

వ. ఇవ్విధంబునఁ బార్థున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి మనసుకసటు వాపి వివేకంబునకుం జేవ గలిగించి కృష్ణుం డీగుహ్యాతరజ్ఞానం బుపదేశించితి దీని నెఱింగికొని నీ కెట్లు సూడం బోలె నట్లు ప్రవర్తింపు మనుపలుకు వలికి యింతకంటెం బరమరహస్యం బొక్కటి సెప్పెద విను మని యతని కిట్లనియె. 223

తే. క్రందుకొను సర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నే నొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్రమోద మొంద 224

వ. ఇప్పరమోపాయంబు. 225

క. నియతియుఁ దపమును నీడెస, భయభక్తులుఁ గలిగి నాకు భక్తుం డై ని
శ్చయనిపుణుఁ డయినవానికిఁ, బ్రియమున నెఱిఁగింపు వలదు పెఱవారలకున్.

వ. అని వెండియుఁ బుండరీకాక్షుండు నాచెప్పినయది లెస్సగా నాకర్ణించితే నీయజ్ఞానసమ్మోహం బంతయుం బాసెనే యనవుడు నర్జునుండు. 227

ఉ. మోహతమంబు వాసెఁ దుది ముట్టిన నీదుప్రపత్తి వీతసం
దేహుఁడ నైతి గాఢపరిదీప్తమహాకృతిఁ గాంచి బోధస
న్నాహనిరామయస్థిరమనస్స్థితిఁ బొందితి సర్వలోకని
ర్వాహవినోద నీవిమలవాక్యముచొప్పున నెల్లఁ జేసెదన్. 228

వ. అని పలికి యప్పరమపురుషునకు సభక్తికసాష్టాంగదండప్రణామంబు సేసి పార్థుండు కృతార్థుం డై ధృతాయుధుం డయ్యె నని చెప్పి సంజయుండు వెండియు నిట్లనుం గురుకులేశ్వరా యేను మునిగణేశ్వరుం డైనపారాశర్యుకారుణ్యంబునఁ

గృష్ణార్జునులయద్భుతపుణ్యసంవాదంబు వినుటకు మహాయోగీంద్రహృదయానం
దకరుం డైనయద్దేవునిదివ్యరూపంబు గనుటకుం బాత్రభూతుండ నైతి నమ్మహా
త్ముండు దనమధురవాక్యంబుల నుపదేశింప నత్యంతగుహ్యం బైనయోగప్రకా
రంబు విశదంబుగా ననుసంధించితి నమ్మహానుభావులసంభాషణంబులు నవ్విశ్వరూ
పునిమహనీయాకారంబునుం దలంచి తలంచి యచ్చెరు వందుచుఁ బ్రియం
బందుచు నుండుదు నని మఱియును. 229

తే. అధిప యోగీశ్వరేశ్వరుం ✽ డైనకృష్ణుఁ,డును ధనుర్ధరవర్యుఁ డ✽ర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు ✽ నీతి సిరియు, భూతి నిత్యంబు లగు నిది ✽ నాతలంపు.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డి ట్లనియె. 231

క. ఇవ్విధమున నాయిత మై, క్రొ వ్వెలరారంగ నిలిచి ✽ కురుపాండవులం
దెవ్వరు మును గడఁగిరి రణ, మెవ్విధి నూలుకొని చెల్లె ✽ నెఱిఁగింపు తగన్.

## భీష్మునిప్రథమదివసయుద్ధము.

వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె భవదగ్రనందనుం డత్యంతోదగ్రవ్యగ్రుం
డై యాగ్రహంబునం బనిచినం బ్రకటదోర్గర్వదుర్దముం డగుదుశ్శాసనుండు
పురికొలుపం గురుసైన్యంబులు శంఖభేరీమృదంగాదినిస్వనమ్ములు సెలంగ గాంగే
యుండు దొలుతం గదలఁ గేతుశోభాభిరామం బగుచు నుద్దామగతిం గవిసినం
గనుంగొని. 233

ఉ. పాండునృపాలనందనులు ✽ పావని మున్నుగ నేచి యప్డు భీ
ష్ముండు గడంకమై నడచు✽చోటికిఁ జక్కటి గాఁగఁ ద్రోచి యొం
డొండ కడంగి సేన తమ✽యుబ్బున నుబ్బఁగ నన్యసైన్యవే
దండముఖాంగముల్ దృణవి✽తానముగాఁ గొని నిర్వికారు లై. 234

వ. ఉరవడించుసమయంబున. 235

క. ఘనతరగర్జాధ్వనులును, ఘనపథ మఖిలంబుఁ దూఁటు✽కట్టెడుతూర్య
స్వనములునుం గబళించుచు, ననిలతనయుసింహనాద ✽ మడరెం బెలుచన్. 236

వ. ఇట్లు ప్రతిభటతురంగమాతంగంబులగుండియ లవియ నందంద యార్చి పేర్చిన
భీము నెదిర్చి దుశ్శాసనుండును దుర్ముఖుండును దుష్ప్రహుండును దుర్మర్షణుం
డును వివింశతియు వృషసేనుండును జిత్రసేనుండును వికర్ణుండును బురుమిత్రుం
డును దుర్యోధనుచూడ్కికి వేడ్క సేయుచుం దాఁకిన. 237

క. ఉదత్తు లై కవలును ధృ,ష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన ✽ సౌభద్రుండుర్
మాద్యద్గతిఁ గవియుడు నే,కోద్యోగత ద్రౌపదీసు✽తోత్కర మడరెన్. 238

వ. ఇవ్విధంబున వృకోదరునకుం దలకడచి తాఁకి వజ్రనిభమ్ము లగువాలమ్ములు శై
లోపము లగుకౌరవవీరులపయిం గురియ నక్కుమారవర్గంబు నిసర్గశప్రసారం
బగుశరాసారంబుల వారలఁ గప్పె నట్టియెడం గొండొకసేపు. 239

క. ఱిచ్చపడి యుభయబలములు, నచ్చెరువుగఁ జిత్రరూపులట్లుండ శర
ప్రోచ్చలితచండదీప్తిస,ముచ్చయములు పెలుచఁ బరఁగె ముసుఁగువడంగాన్.
క. పదపడి దుర్యోధనుఁ డు,న్మదుఁ డై తఱుమంగ ధర్మనందనుఁడు జయా
స్పదముగఁ బురికొల్పఁగ బె,ట్టిదముగ నొండొంటిఁ దలపడియె సైన్యంబుల్.
సీ. కప్పారు రేణువు గమలాప్తబింబంబు, రాహుమండలముసరమణఁ గప్పఁ
దెల్లనిరజము శోభిల్లు సంగ్రామరం,గమునకుఁ దగు మేలుకట్టునట్లు
ఖచరకాంతలయలకములందుఁ గెందూళి, యళులపై పుప్పొడి ననుకరించు
నడరి పచ్చనిపాంసు వమరు దిశాభిత్తి, తలములఁ గనకంపుఁదగడుపగిదిఁ
తే. బాండవానీకమును గురుబలము నొక్క, పెట్ట రథగజహయభటాభీలచటుల
గతిఁ బరిక్షుణ్ణసంగరక్షితితలముగ, వీఁక బెరసినయుత్త్రోలు తాఁకునపుడు. 242
మ. కరిఘంటానిచయస్వనంబులుఁ దురంగస్ఫీతహేషాసము
త్కరనాదంబులు హేతిపంక్తిపటుసంఘట్టోత్థరావంబులున్
ధరణీభాగనభోంతరం బడరి యుద్యత్తూర్యనానాధ్వని
స్ఫురణం బేమియుఁ దోఁప నీవ మొనలన్ భూపాలచూడామణీ. 243
వ. తదనంతరంబ. 244
క. కరికరశీకరతురగో, త్కరలాలాజాలరక్తధారాపటలీ
పరిషిక్తం బై సంగర,ధరణీరజ మడఁగె నద్భుతం బెలరారన్. 245
క. కురుపాండవసైన్యంబుల,దార లడియాలముల నొప్పుతో మెఱయుసము
ద్ధురవీరధ్వజములఁ బొలిచిరి శౌర్యస్ఫూర్తి మూర్తి సేకొన్నక్రియన్. 246
వ. అట్టియెడ. 247
క. మీతండ్రి భవత్సుతులకుఁ, జేతోముద మొదవఁ గడఁగి సేన మిగిలి ప్ర
ద్యోతనుఁడు నభోమధ్య, స్థితుం డైనట్లు వెలిఁగె భీషణమూర్తిన్. 248
వ. ఇట్లు మెఱసిన. 249
ఉ. అర్జునుఁ డప్డు భీష్ముఁ గని యగ్గలికన్ గుణరావసంగమ
స్ఫూర్జితదేవదత్తరవశోభితుఁ డై రణకేళికౌతుకా
వర్జితచిత్తవృత్తి ననివార్యపరాక్రమలీలఁ దాఁకఁ న
తూర్జితరౌద్ర మయ్యె బహుళోగ్రమహాస్త్రగతాగతంబులన్. 250
తే. తఱిమి సాత్యకి కృతవర్మఁ దాఁక నతఁడు
నేచి మార్కొన నిరుమేను పూచి యొప్ప
మిగులు మోదుగుమ్రాఁకులపగిది గాఁగ
నడరె మార్కొన్న రెండువాలంపగములు. 251
చ. మదమునఁ గోసలేంద్రు నభిమన్యుఁడు దాఁకిన నాబృహద్బలుం
డెదిరి కడంగి సూతుఁ బడ నేసి హయంబులఁ జంపఁ బాడ్కిఁ గెం

పొదవఁగఁ బార్థసూనుఁడు మహోగ్రత నట్టుల చేసి కేతనం
బు దునిమి విల్లు ద్రుంచి శరపూరితగాత్రునిఁ జేసె నాతనిన్. 252

తే. భీమసేనునిపై మనభీష్ముఁ డలుక, నడరె నక్కురుముఖ్యులయస్త్రశస్త్ర
కౌశలంబులు సూడ నక్కజము లైన, నచ్చెరువు నొంది సేనలు పిచ్చలింప.

సీ. వీఁకమై నకులునిఁ దాఁకి దుశ్శాసనుఁ, డత్యుగ్రబాణచయమునఁ బొదివె
నక్కుమారుఁడు దరహాసాభిరాముఁ డై, భల్ల మొక్కటి దొడ్గి విల్లు దునిమి
యేడ్తెఱ నిరువదియేనుదూపులు వడి, నడరింప రయమున నతఁడు నొండు
వి ల్లెత్తికొని శరవితతి నంతంతన, నఱికి పాండవుకేతనంబు ద్రుంచె

తే. దుర్ముఖుఁడు సహదేవునితోడఁ దొడరి, మెఱుఁగువాలమ్ము లేసిన నుఱక యాతఁ
డన్నియును మగిడించి రథ్యముల నొంచి, యతనిసారథిఁ దెగటార్చి యార్చి పేర్చె.

చ. సరభసుఁ డై యుధిష్ఠిరుఁడు శల్యునిఁ దాఁకుడు నాతఁ డమ్మహీ
శ్వరుమహనీయచాప మనివారణఁ ద్రుంచిన నొండువిల్లు భీ
కరతరశీఘ్రలీలఁ గొని కన్నుల నవ్వుచుఁ బాండవాగ్రజుం
డరిబల ముక్కు దక్కు వడి నాతనిపైఁ గురిసెన్ శితాస్త్రముల్. 255

సీ. ఏచి ధృష్టద్యుమ్నుఁ డేడ్తెఱ ద్రోణుపై, నడరిన నవలీల నాతఁ డతని
ఘనశరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి, నారాచ మొక్కటి నాటె మేన
వేఱొక్కవి ల్లెత్తి వెసఁ బదునాలుగు, శాతబాణములఁ బాంచాలసుతుఁడు
గలశజు నేసె మాగధసహదేవుండు, భూరిశ్రవునిఁ దాఁకి భుజశిఖరము

తే. మెఱుఁగుటమ్ముల నొంచిన నుఱక యతఁడు
వానియుర ముగ్రశరమున వ్రయ్యఁ జేయ
వార లిరువురు వృత్రుండు వాసవుండుఁ
బోలెఁ బోరిరి సేనలు పొగడుచుండ. 256

తే. ధృష్టకేతుండు గారవోత్కృష్టుఁ డైన
బాహ్లికుని మాఱుకొని తీవ్రబాణనవక
మేసె నాతండు లాఘవ మెసక మెసఁగ
ఘనశరంబులు పదినవకములు గురిసె. 257

క. అచలనిభుఁ డగునలంబసుఁ, బ్రచలితభూభాగుఁ డగుచుఁ బఱతెంచి ఘటో
త్కచుఁడు దలపడిన నారజ,నిచరేంద్రులపోరు కీర్తనీయం బయ్యెన్. 258

సీ. గర్వంబు మెఱయ శిఖండి యశ్వత్థామ, నెదిరిన నాతండు మదమెలర్ప
నారాచ మురమున నాటింప నొచ్చియు, ద్రుపదనందనుఁ డతిక్రూరశరము
దద్వక్షమునఁ గీలితము సేసె భగదత్తుఁ, డుఱక విరాటుపై నురవడించి
కదిసినగగనంబు గప్పె బాణాసార, యుగమును బెరసి మహోగ్రభంగిఁ

తే. కైకయాధీశుఁ డగుబృహత్క్షత్త్రవిభుఁడుఁ
కృపుఁడుఁ దలపడి యొండొరుల కేతనముల
హరుల ధనువులఁ దునిమి నిష్ఠురకృపాణ
దారుణాకారులై యరదములు డిగిరి. 259

ఉ. అట్టియెడం గనుంగొని జయద్రథుఁడున్ ద్రుపదుండు వచ్చి యా
కట్టుపకారులిద్దఱు గ్రక్కున నడ్డము సొచ్చి యొండొరున్
బెట్టుగఁ దాఁకి తీవ్రశరపీడితదేహులఁ జేసి రెట్టిలా
వెట్టిపరాక్రమస్ఫురణ యెట్టిరథుం బని పిచ్చలింపఁగన్. 260

ఉ. మన్యుసముజ్జ్వలుండు నభిమానియునై నవికర్ణుఁడున్ యుధా
మన్యుఁడు నేచి యొండొరుల మార్కొని రౌద్రరసం బలౌకసా
మాన్యము గాఁగ నస్ఖలితమత్సరముల్ మెఱయంగఁ బోరి ర
న్యోన్యనిశాతసాయకనిరంతరవర్షములన్ మునుంగుచున్. 261

ఆ. ధరణినాథ చేకితానుండు గడఁగి సు, శర్మమీఁద నిశితశరచయంబు
గురియ నతఁడు నతనిఁ గ్రూరాస్త్రనికరసం, పిహితగాత్రుఁ జేసి పేర్చి యార్చె.

క. శకుని ప్రతివింధ్యుఁ దాఁకినఁ, బ్రకటబలుం డాయుధిష్ఠిరప్రియసుతుఁ డు
ద్భ్రుకుటి యగుచుఁ గవిసెను సిం, హకిశోరము గజముఁ బొదువుకొన ట్లతనిపయిన్.

తే. భీమనందనుఁ డగుశ్రుతసోముఁ గడిమిఁ
దాఁకెఁ గాంభోజనృపతి సుదక్షిణుండు
వార లిరువురు నొండొరుఁ గ్రూరబాణ
జాలముల నెట్లుఁ దెరలుపఁ జాలరైరి. 264

ఉ. అంతకవిక్రముండు మహిమాస్పదమూర్తి భుజంగకన్యకా
సంతతకీర్తనీయబలశాలి గిరీటితనూభవుం డిరా
వంతుఁడు బాహుగర్వధనవంతు శ్రుతాయువుఁ దాఁకె వార ల
త్యంతరయంబునన్ విరథులైరి పరస్పరబాణఘట్టనన్. 265

సీ. విందానువిందులు గ్రందుగ వెసఁ గుంతి, భోజుని నాతనిపుత్త్రుఁ దాఁకి
రాపురుజిత్తు బాణాసారమున విందుఁ, బొదివె నుగ్రతఁ గుంతిభోజుఁ డేయు
తూపులు పెనుగద దోలఁగంగ జడియుచు, ననువిందుఁ డతనిపై నడరెఁ బెలుచఁ
గైకేయు లేవురు గాంధారరాజు లేవురతోడఁ గ్రూరసంగర మొనర్చి

తే. రుత్తరునిమీఁద నీతనయుండు దీర్ఘ, బాహుఁ డురవడిఁ గదిసి యుత్సాహలీల
నెఱపె నకులాత్మజుఁడు శతానీకుఁ డేచి, వడి నులూకునిఁ దలపడి కడిమి మెఱసె.

వ. ఇవ్విధంబున వెండియు రెండుసేనలం జేయం గలదండిమగ లొండొరులం దాఁ
కిన నధికసంరంభద్వంద్వయుద్ధంబు సిద్ధచారణఖేచరులు సూచి పొగడుచుండ
నిగిడి చతురంగంబులుం దసతనజాతిం బదులు పదులును నూఱులు నూఱులును

వేలు వేలును బెక్కులు పెక్కులునుం దలపడి యెడనెడం గలయ౯ జేరయం
గ్రమంబున సందడికయ్యంబు నూలుకొనినం గ్రందునం దమకించి యుభయ
సైనికు లున్మత్తులగతిం గవియ బాణంబులు గృపాణంబులుం గరిదంతంబులు
నరదంబులనొగలు నొండొంటిం దాఁకి తుత్తుమురు లయినతుములంబుకతన
భయంకరం బగునతిసంకులంబున సామజవాజిరథంబులయురవడికి నోసరింపని
కాలుబలంబులు నుత్తుంగమాతంగస్యందనసందోహంబులపయిం బఱపురావు
తులును గరటిఘటావిఘటనంబు గావించురథికులును నిది యది యనక యెల్ల
బలంబులం జొచ్చినమొగంబునం జిందఱవందఱ సేయుగజారోహకులు నగుచు
నిర్మర్యాదంబుగాఁ బెనంగుసైన్యద్వితయంబు మందరక్షుభితాంబుధిచందం బగు
టకుం దగి యుచ్చి పోయెడుశరంబులు నిరుమెయి౯[1]గెలిచినకుంతక్షురికాదులును
బ్రవాళజాలంబులుంబోలెఁ బొలుపు మిగులు చుండ విశిఖంబులు ముఖంబుల౯
బెట్టు నాటిన జిఱ్ఱునం దిరుగుశుండాలంబులు ప్రళయకాలంబున సురగరువలిచే
దిర్దిరం దిరిగెడుకులనగంబుఁ గ్రేణిసేయఁ గరవాలగదాభల్లప్రముఖంబు లగు
శస్త్రాస్త్రంబులఁ గుంభికుంభతురంగముఖభటకపాలాదు లవియుచప్పుళ్లును వివి
ధాయుధప్రహతుల నొఱలుహరినరనాగంబులరావంబులును దారుణప్రకా
రంబున దిక్తటదారుణంబు సేయుచుం జెలంగఁ జేయి దునిసినం దక్కటిచేతం
గైదువు గొని కవియువారును గాలు దునిసిన నెదిరిమీఁదికి లంఘించువారును
దల దునిసినం దారు మున్ను గన్నిడినవారిం బొడిచి పడువారును దెగి పడియు
నవుడు గఱచుటయును బొమముడి వడుటయును సడలనితలల నొప్పువారును
మావంతులు నేనుంగులు వికలంబు లైనసమీపవర్తులవాహనంబుల సమారోహ
ణంబుసేసి పరాక్రమించువారును నొచ్చియు నీడంబోక చెలులకుం జుట్టంబులకు
నడ్డపడువారును మార్బలంబునం జేరి చుట్టం బని తప్పింపక నొప్పించువారును
సుభటులు సొచ్చి జెండిన వండం దఱిగినట్లుండు వేదండహయచయంబులును
నాశ్వికులు పైకొని మీఁదిమానుసులం దునిమిన మోడుపడురథంబులును రథ
నేమిఘట్టనంబున దట్టంబు లగుపదాతిగాత్రంబులును నిభంబులు వొదివి నేలతో
వ్రేసియుఁ గాలం జమరియుఁ దూల వైచియుఁ గొమ్ముల గ్రుచ్చి యెత్తియు బారి
సమరిన వికటాకారంబు లగుఘోటకంబులు నై ఘోరభంగి యగుసంగరంబు
సెల్లు చుండ మధ్యాహ్నసమయంబున. 267

భీష్ముఁడు దుర్యోధనప్రేరితుండై విజృంభించి పాండవవీరుల నొప్పించుట.

సీ. మనుజేంద్ర వినుము నీతనయుండు పనుపంగ, దుర్ముఖకృపకృతవర్మమద్ర
పతివివింశతులు విస్ఫారబాణార్చులఁ, బంచాగ్నులునుబోలెఁ బ్రజ్వరిల్లఁ
దనకెలంకులఁ గొలుతల సేసి తఱుమంగఁ, దాలకేతువు మహోత్తాలమూర్తి

1. గీలించిన.

నాభీల మై క్రాలి - నడరి పాండవసేన, దఱిసి మందాకినీ-తనయుఁ డేచి
తే. చేదిపాంచాలకేకయు - లాది గాఁగఁ, గల్గుభూపాలకోటిమొ-గ్గరము లెల్లఁ
గలఁగ దిరుగుడువడ నోర-గిలఁగఁ బెల్ల, గిల్లఁ దల్లడపడ రణ-క్రీడ సల్పె. 268
క. పాయ వడఁజొచ్చు గుంపులు, సేయును మలఁకలఁ జరించి - చించునుఁ గోణ
వ్యాయామగతుల వలయము, లై యుండం దిరిగి కలఁచు - నరిసైన్యంబున్.
క. డొల్లెడుతలయును దునిసెడు, విల్లును ధర గూలగుమేను - విఱిగెడుసిడముం
బెల్లు దొరఁగునెత్తురు నై, పల్లటిలం దొడఁగె నపుడు - పాండవబలముల్. 270
వ. ఇట్లు ప్రళయకాలతాండవంబునం బ్రచండమూర్తి యగునష్టమూర్తియుంబోలె విజృంభించినభీష్ము మార్కొనుమగలు లేక పాండవసైన్యంబు బెండువడియున్న యెడ నభిమన్యుండు గనకవర్ణతురంగంబులుం గర్ణికారధ్వజంబును మెఱయం దాఁకి.
సీ. శల్యు నారాచపం-చకమున నొప్పించి, యొకకోల, గృతవర్మ-యురము నొంచి
క్రూరభల్లమున దుర్-ముఖుసూతుతల ద్రుంచి, తఱిమి వివింశతి-ధనువుఁ దునిమి
వెడఁదయమ్మున నేసి - వెండియు మూఁడువా, లికయమ్ములొడలఁ గీలించి కృపుని
హయముల శరచతు-ష్టయతాడనమున ను,బ్బడఁగించి భీష్ముపై - నడరి మేన
తే. విశిఖనవకంబు నాటించి - వెగడుపఱచి, పేర్చి యార్చిన సురకోటి - పిచ్చలించె
మెచ్చి భీష్మాదు లెల్ల వి-వ్వచ్చుఁ బోలు, నెక్కుడగుఁ గాని యసదుగాఁ-డీతఁ డనిరి.
చ. అమరతరంగిణీతనయుఁ - డర్జుననందనుసూతుఁ గేతుదం
డము నిరుమూఁడుదూపులఁ బ-డం గడు బెట్టిద మేసి యుజ్జ్వలా
స్త్రము లడరింపఁ గూడికొని - తక్కటిమేవురుఁ బెక్కు లమ్ము లొ
క్కమొగి రయంబున గురియఁ - గా గిరివోలె నతం డుదగ్రుఁ డై. 273
క. వారలశరవర్షంబులు, వారించుచు వేఱువేఱ - వాలంపగముల్
వారలపైఁ గురియుచుఁ గురు, వీరునితాలధ్వజంబు - విఱుగఁగ నేసెన్. 274
ఆ. తాటిసిడము విఱిగి - ధరణిపైఁ గూలినఁ, బాండురాజసుతుల-బలము లెల్ల
నొక్కపెట్ట యార్చె - నుక్కఱి కౌరవ, సేనజోదుపిండు - సిన్నఁబోయె. 275
తే. సింహనాదంబుతో భీమ-సేనుఁ డప్పు, డనుజతనయునిఁ జేకొని - యరిబలంబు
దరలఁ దాఁకిన నతనియు-త్తాలసింహ, కేతనము గూల్చె సురనదీ-సూతి యలిగి.
క. పవనజుఁడు మూఁడుశరముల, దివిజనదీసూను నేసి - దృఢగతిఁ గృపు మే
నవియ నొకటఁ గృతవర్ముని, యవయవతతి నెనిమిదింట - నార్చుచు నేసెన్. 277
వ. మఱియు నమ్మారుతతనయుండు. 278
శా. మద్రేశుల్ వెగ డొంద నేసె నతనిన్ - మన్నించుజోదుల్ ప్రతా
పోద్రేకంబున నొక్కపెట్ట రథవే-గోద్దీప్తు లై తాఁకినన్
రౌద్రం బాకృతిఁ బొంద సూతహయగా-త్రంబుల్ వెసం ద్రుంచి చం
చద్రక్తోదకవీచులం దడిపె నా-శ్చర్యంబుగా నందఱన్. 279

వ. తదనంతరంబ సాత్యకియు ధృష్టద్యుమ్నుండును గేకయపంచకంబును విరాటుండు
నతనికొడుకులుం దలకడచి యురవడించిన. 280

క. అందఱమేనుల గంగా, నందనుఁడు శరత్రయములు నాటించెను శ
ల్యుం దాఁకె నుత్తరుఁడు గరి, సందోహముతోడ నధికసంరంభమునన్. 281

క. నిజఘటకు మిగిలి యుత్తరు, గజ మమ్మద్రేశురథము గదిసి తురంగ
వ్రజముఁ బయి కడరి కడున, క్కజముగ వెస నేలఁ బెట్టి కాలం జమరెన్. 282

తే. శల్యుఁ డుగ్రకోపంబున శక్తి యెత్తి, రయము మెఱయ వైరాటియురస్స్థలంబు
దూఱవైచిన నంకుశతోమరములు, విడిచి నడుమన చచ్చుచుఁ బుడమిఁ బడియె.

క. మద్రేశుఁ డంత నిలువక, రౌద్రంబున వాలు వెఱికి రయము మెఱయ న
త్యుద్రేకత డాసి యుఱికి, భద్రకరిం గరముఁ దునిమి పడవైచె నిలన్. 284

క. తనవిక్రమంబు సేనలు, వినుతింపఁగ నిట్లు సేసి వేగమ కృతవ
ర్మని తేరిపైకి లంఘిం, చెను శల్యుఁడు గిరికి దాఁటుసింగముభంగిన్. 285

చ. అనుజుఁడు వడ్డ శంఖుఁడు మహోగ్రహవృత్తిఁ గడంగి శల్యుపైఁ
దనరథరాజితోఁ గవియఁ దారుణదర్పముఁ జూచి దంతి ము
ట్టినఁ బరికాఱు మొత్తము వహిడిం బఱతెంచినమాడ్కి నాపగా
తనయుఁడు లోనుగా రథికదంబము బిట్టడరెన్ సముద్ధతిన్. 286

తే. భీష్మునంపఱ కోర్వక పెల్లగిల్లి, శంఖుతోడి రథావళి జలదపంక్తి
భూరిమారుతహతిఁ దూలఁ బోవునట్లు, వఱచెఁ గని క్రీడి యడ్డంబు వఱపెఁ దేరు.

క. కోఱవియుఁ గోఱవియుఁ దాఁకిన, తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడుఁ జూ
పఱు వొగడఁ దాఁకుటయు ని, ద్దఱదిక్కులసైన్యములును దలపడియె వడిన్.

వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టియెడ. 289

క. కృతవర్మ రథము డిగి యుద్ధతుఁ డై మద్రపతి ఘనగదామండితహ
స్తత మెఱయఁ గవిసి రథ్య, ప్రతతిన్ ధరఁ గూల్చె శంఖుబలము దలంకన్.

క. విరథుఁ డయి మాత్స్యపుత్త్రుఁడు, గరవాలముఁ గొని రథంబు గ్రక్కున డిగి యా
తురత సురరాజనందను, నరదముమాటునకు నతిరయంబున నరిగెన్. 291

క. దిక్కులఁ దనబాణంబులు, పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరుతే
రక్కడ డించి ద్రుపదవిభుఁ, డు క్కఱఁ దత్సేనమీఁద నురవడిఁ గవిసెన్.

వ. ఇట్లు గవిసి. 293

క. ఎండినయడవిన్ దరికొని, మండెడు కార్చిచ్చుమాడ్కి మారి మసఁగన
ట్లొం డొండ నేచి హయవే, దండస్యందనపదాతితతిఁ బొడవడఁచెన్. 294

క. కేకయులేవురబలములు, నాకులతం బొంద మార్గణాసారమునం
జీకాకుపఱిచె భీష్ముఁ డ, నేకగతులఁ దనరథంబు నేడ్తెఱ మెఱయన్. 295

క. ఉఱక విరాటుబలముపైఁ, గొఱియలఁ బిండునకుఁ గవియు కోల్పులిక్రియ బి

౩

టులఁ గవిసి నదీసూనుఁడు, నుఱుమాడె వియచ్చరులు వి✱నుతి సేయంగన్. 296

తే. ఇట్లు పాండవసైన్యంబు✱లెల్లఁ గలఁగి, యిక్కడక్కడఁబడుచుండ ✱ నక్కజంపుఁ
గడిమి కచ్చెరువడి యొక్క✱కడకు వచ్చి, పాండుసూనులు నివ్వెఱ✱పాటు నొంద.

క. శాంతనవుఁడు తేజోద, ర్ద్రాంతుం డై నావెలుంగు✱ధర కెల్లను జా
లింతు నినుఁ డస్తశైలో, పాంతమునకుఁ జనిన నేమి ✱ యనిన ట్లుండెన్. 298

క. సోమాన్వయప్రదీపకుఁ, డీమెయిఁ దేజోవిశేష ✱ మెసకం బెసఁగం
గా నెఱయుట గనుఁగొని సి, గ్గై మఱువడుమాడ్కిఁ గ్రుంకె ✱ నర్కుం డంతన్.

తే. జలరుహంబులు పాండవ✱సైనికులును, గంబులట్టుల విన్ననై ✱ కాంతి దఱఁగ
వారిమనముల భీత్యంధ✱కార మడరు, కరణిఁ జీఁకటి యెడ నెడఁ ✱ గవియుదెంచె.

వ. అప్పుడు గయ్యంబు సాలించి. 301

తే. ఉభయసేనలుఁ దమతమ✱యునికిపట్లు, కరిగెఁ దాతపరాక్రమ✱స్ఫురణమునకు
గురువిభుండును దమ్ములుఁ ✱ బరమహర్ష, భరితహృదయులై యుండిరి ✱ భరతముఖ్య.

వ. అని సంజయుండు భీష్మాటోపంబు సెప్పె నని పలుకుటయుఁ దొలునాఁటి
కయ్యంబున గాంగేయుచేత నట్లయినఁ బాండునందనులు పదంపడి యేమి సేసి
రని యడిగిన. 303

చ. నిగమశిఖావిహారమహ✱నీయ మునీశ్వరభావనీయ స
ర్వగురుమహానుభావ మధు✱రప్రకటాప్రతిమస్వభావ దే
వగణనిషేవ్య వారిగిరి✱వాసవినోదవిభావ్య విశ్వలో
కగతవపుర్వికస్వర వి✱కారవిదూరవిలాసభాస్వరా. 304

క. దూరాంతికదుర్గమవి, స్తార[1]సుగమసన్నివేశ✱[2]తావదచలస
ర్వారంభక నిష్క్రియ సం, స్కారోజ్జ్వలవిశ్వసంప్ర✱కాశనమూర్తీ. 305

మాలిని. నిరతిశయమహత్త్వో✱న్మేష నిర్ధూతదోషా
విరతిహృదయరమ్యా✱వేశ నిత్యప్రకాశా
భరితభువనతేజో✱భవ్య యోగానుభావా
స్ఫురితగుణసమశ్రీ✱పుణ్య నైర్గుణ్యగణ్యా. 306

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము. 307

---

1 నిగమసన్నివేశ. 2 దావదచలస.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము.

---



శ్రీనిర్వాణవిచక్షణ
తానిష్ఠాపరకటాక్ష ధర్మసరోజా
సీన నిరంజన భక్తో
ద్ధ్యానవసంతాయమాన హరిహరనాథా. 1

ధర్మజుఁడు గోపాలదేవుపాలికిం జనుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. అట్లు దనవారు మేలుచే మైనభంగి
వినినధృతరాష్ట్రుఁ డాసూత తనయుతోడ
నెలమి నటమీఁదివృత్తాంత మెట్లు సెప్పె
మనినఁ గురువంశవర్య యి ట్లనియె నతఁడు. 3

వ. ఆరాత్రి ధర్మతనయుండు విషణ్ణచిత్తుం డై తమ్ములం దగువారలం గూర్చికొని గోపాలదేవుపాలికిం జని యతనితో ని ట్లనియె. 4

చ. ఎరగలిచిచ్చు గానడవి యెల్లను బెల్లుగ నొక్కపాయగా
దరికొని రూపడంచినవిధంబున నిక్కడిసేన యంతయుం
దర మిడి చంపె భీష్మబల దర్పమహోగ్రత గంటె నింక నే
బిరుదొకొ నీలమేఘ మనఁ బేర్చి యునిం దెగటార్చు నాతనిన్. 5

చ. అలవి యెఱుంగ నేరక మహాత్ముని లోకముతోడిపాటిగాఁ
దలఁచితి బేల నైతి శరతాడనపీడితు లైరి నీసుబం
ధులు సమరాపగాతనయుతోడిరణంబునకు దిశాధినా
థులు నలుమంగఁ జాల రని తోఁచుచు నున్నది నామనంబునన్. 6

చ. అతని జయించు నంచు మన మస్త్రను నెంతయు నమ్మి యుండఁ గా
నితఁడును సంగరంబున నుపేక్షకుఁ డయ్యె వృకోదరుం డొకం

డ తఱికిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెదు నేమి సేయు నా
కితనిని నీతనిం దడవ నేటికిఁ గయ్యపుజోలి మానెదన్. 7

క. నరపతుల నెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁ జాల నే నడవులకుఱ్ఱ
మరలం బోనెద నచటం, దిరిగెదఁ గూరాకు గోసి తినియెద ననఘా. 8

క. నీమాటమెయిన చేయుదు, మే మెయ్యది యైన నెందు నెప్పుడు మాకుఱ్ఱ
దామోదర యశుభస్థితి, లేమి శుభము గలిమి నీదు[1]లీలయ కాదే. 9

వ. చేయం గలపని యెయ్యది పనుపు మనినం బద్మనాభుండు పాండవాగ్రజున కి
ట్లనియె. 10

ఉ. నెవ్వగ యింత యేల విను నీ కెదు రెవ్వరు నీదుతమ్ములం
దెవ్వరు సూచినఁ జగము లిన్నియు గెల్వఁ గలారు లావునం
గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుఁ డైన శిఖండి యేను నీ
కొవ్వనివారి నెల్లఁ గ్రమయుక్తి లయం బొనరింతు నెమ్మెయిన్. 11

క. సత్యపరాక్రముఁ డగునీ, సాత్యకిబాహాబలంబు సమరవిహారా
ద్ధత్యముఁ జూచెదు గాదే, యత్యాశ్చర్యంబు లితనియప్రవిధంబుల్. 12

శా. ఉద్యద్విక్రము లైనయాద్రుపదమత్స్యోర్వీపతుల్ నిన్ను సం
పద్యోగోజ్జ్వలుఁ జేయఁ బూని కడఁకం బ్రాణంబు లీ నున్న ని
ట్లుద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ వేయేల ధృ
ష్టద్యుమ్నుం డొకరుండ విద్విషదవష్టంభంబు మాన్పింపఁడే. 13

వ. అనవుడు ధర్మతనయుండు ధృష్టద్యుమ్ను నాలోకించి. 14

ఉ. పాండవసైన్యసంఘపరిపాలన సేయు నితండ యుంచుఁ గృ
ష్ణుం డభిషేకసంపదుపశోభితుఁ జేయఁగ నాధిపత్యము
ద్దండతఁ బూని తీనృపులుఁ దమ్ములు నేనును జుట్టి రాఁ జమూ
మండలి నాలుకొల్పికొని మా ర్తుర నోర్చినఁ గాక యొప్పునే. 15

వ. అని యగ్గించినం బొంగి పృషతపౌత్రుండు గుంతీపుత్త్రున కి ట్లనియె. 16

చ. జగ మెఱుఁగంగ ద్రోణు నని జంపుటకై సృజియించె ధాత న
న్నగఁటిమి గాఁగ దీనిఁ బలుమాఱు ననం బని లేదు భీష్ముఁ డా
దిగఁ గురుసేనలోన గణుతింపఁగఁ బేర్చినయోధకోటి నా
మొగమునఁ బడ్డ నెట్లుడరి ముట్టెదనో యటు [2]సూచు చుండుమీ. 17

తే. పృషతకులముఖ్యుఁ డిమ్మెయిఁ బేర్చి పలుకు
సంగరోత్సాహకరవాక్యభంగి కపుడు
పాండుసుతులును సకలభూపతులు సంత
సంబు నొందిరి హరియుఁ బ్రియంబు నొందె. 18

1 లీలన కాదే. 2 సూచి యుండుమీ.

వ. తదనంతరంబ యుధిష్ఠిరుండు ధృష్టద్యుమ్నున కి ట్లనియె. 19

ఉ. తొల్లి గురుండు దానవులతోడి రణంబున వజ్రపాణికిం
దెల్లమి గాఁగఁ జెప్పె నది దీప్తతరం బగునొడ్డనంబు శో
భిల్లుచు వైరిదృష్టులకు భీకర మై చనుఁ గ్రౌంచనామకం
బెల్లి ఘటింపు నీదువెర వేర్పడ నమ్మొన యద్భుతంబుగన్. 20

వ. అనిన విని యతం డట్లు చేయువాఁడ నని పలికె నట్లు గలంక దేఱి కృష్ణు వీడ్కొని యెల్లవారల నిజనివాసంబులకుం బోవం బనిచి ధర్మతనయుం డభ్యంతరావాసంబున కరిగెఁ బ్రభాతం బగుటయుఁ బాండవసైనికులడెందంబులతోడన యరవిందంబులు వికాసంబు నొందెం బదంపడి తదీయప్రతాపోదయసహవర్తి యగుచు మార్తాండోదయంబు వెలుంగుటయుం గాలోచితకృత్యంబులు నిర్వర్తించి కౌంతేయాగ్రజుండు వెడలెఁ గ్రౌంచవ్యూహంబు సంఘటించు నెడం జంచత్వంబు భజించి ఫల్గునుండు గాండీవకపిధ్వజంబులు మెఱయం బొలిచి నిలిచెఁ గుంతిభోజుండును శైబ్యుండును జక్షుస్స్థానంబులం దేజరిల్లిరి ద్రుపదుండు శిఖకు నమరె దశార్ణశూరసేనకిరాతదేశాధీశులు కంఠాకారంబుఁ దాల్చిరి భీమసేనుండును ధృష్టద్యుమ్నుండును దక్షిణవామపక్షంబు లయిరి సౌభద్రసాత్యకిద్రౌపదేయపౌండ్రచోళపాండ్యులు భీమసేనువలనను నకులసహదేవహైడింబశంబరవత్సమహీపతులు ధృష్టద్యుమ్నుదిక్కునం బన్నిరి కేకయకాశిరాజులతోడం గూడి విరాటుండు జఘనభాగభంగికిం దగి యుండె హూణపతిప్రముఖులు పరివేష్టింప వెన్నయి యుధిష్ఠిరుం డొప్పె నివ్విధంబున మోహరించినయప్పుడు. 21

భీష్మునిద్వితీయదివసయుద్ధక్రమము.

తే. పుండరీకంబు లుద్దండపుండరీక, చారుభంగి లేమెండ కెంజాయ నొప్పె
నంతనక్కడఁ గురుబలమధికరభస,తుములముగఁ ద్రోచినడ తెంచె సమరమునకు.

వ. అయ్యవసరంబున దుర్యోధనుండు భీష్మద్రోణాశ్వత్థామకృపశల్యకృతవర్మల నాలోకించి. 23

క. ఒకఁ డొకఁడ పాండుపుత్త్రుల, సకలబలంబులను గెలువఁ జాలుదు రుగ్రా
ధికశౌర్యసత్త్వ లందఱు, నొకతల యఱె మిమ్ము నొర్వ నోపునె హరుఁడున్.

క. ఐనను గ్రౌంచవ్యూహవి, ధానంబున మోహరించి దారుణచారు
స్థానక మై కుంతీసుత, సేన వొలిచె మనము నివ్విశేషంబునకున్. 25

క. అనురూపము లగుమాఱొ, డ్డనముల్ ప్రస్ఫురితములు దృఢంబులు గాఁ దీ
ర్చినఁ గాక తెఱం గగునే, యని మొన లేర్పఱిచెఁ గౌరవాన్వయముఖ్యా. 26

వ. దుశ్శాసనవికర్ణవిందానువిందులును శూరసేనయవనత్రిగర్తకురుదేశంబులవారలొక్కవలనను ద్రోణాచార్యుండును గుంతలదశార్ణవిదర్భులును గాంధారసింధుసౌవీరపతులు నొక్కదిక్కునను భీష్ముండు మహాసైన్యంబులతో నడుమనుం గా

[1]మూఁడుమోహరంబు లయ్యెఁ గృతవర్మయు శల్యుండును నశ్మంతకాశ్మీరులుం
గొందఱు దమ్ములుం దానును మానవేంద్రుండు వెనుకదెస నిలిచె నిత్తెఱంగున
రెండుబలంబులు నాయితంబులై శంఖభేరీమృదంగాదితూర్యస్వనంబులు సెలంగ
నొండొంటిం గదియ నడచె ననిన విని ధృతరాష్ట్రుం డివ్విధంబునం గదిసి యెవ్వ
రెట్లు గయ్యంబు సేసి రని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 27

తే. ఏచి దుర్యోధనుండు చే ॥ వీచి యెలుఁగు, సూపి పురికొల్ప నెంతయు ॥ నేపుమిగిలి
మనబలంబులు పాండుకుమారసైన్య, సమితిలోఁ దాఁకె నత్యంత ॥ సంకులముగ.

వ. అట్టియెడ. 29

ఉ. చెక్కులు సించి కంఠమున ॥ జేకులు వాపి శిరంబు వ్రచ్చి పే
రుక్కునఁ గ్రొంచచందమగు ॥ నొడ్డు గలంగఁగఁ జేసి భీష్ముఁ డే
దిక్కునఁ దాన యై దిశలు ॥ దీటుకొనన్ శరకోటి నింపఁ గెం
పెక్కినకంటిక్రేవ చెలు ॥ వెక్కుడు సేయఁగఁ గ్రీడి కృష్ణుతోన్. 30

అర్జునుఁడు భీష్మునిమీఁదికి రథంబు దోలించి విజృంభించుట.

మ. మనసేనం గలఁగంగఁ జేయుచు మదిన్ ॥ మందాకినీనందనుం
డు ననుం గైకొన కున్నవాఁ డితనియా ॥ టోపం బడంగించెదన్.
నిను మెప్పించెదఁ జూడు ఖేచరులు వ ॥ ర్ణింపన్ విజృంభించెదన్
దనుజధ్వంసి రథంబు వే పఱపు ము ॥ ద్యద్విక్రమప్రక్రియన్. 31

క. అనిన విని విష్ణుఁ డాజి, ష్ణునిఁ గనుఁగొని యేను నీమ ॥ నోరథము తెఱం
గునకుఁ దగ రథము గడపెద, విను తిర మై నాదుపలుకు ॥ వీరవినోదీ. 32

చ. గజిబిజి లేక యుబ్బక య ॥ ఖండితశౌర్యము నస్త్రవీర్యమున్
భుజబలముం బొగడ్తవడ ॥ భూరిపరాక్రమశాలి భీష్ము న
క్కజముగఁ దాఁకి యద్దెస న ॥ కంపితు లై నడతెంచుశల్యకుం
భజకురురాజు లచ్చెరువు ॥ పాటు భయంబును బొందఁ జేయుమీ. 33

వ. అని పలికి యచ్యుతుం డుచితరయంబున రథంబు నడప ధనంజయుండు దన కడ్డం
బై నశూరసేనసేనాకాననంబు పటుబాణపరంపర యనుమహావాతవేగంబున బడ
లుపడం జేయుచుఁ గవిసినం గని గాంగేయుం డెదిర్చి పేర్చి డెబ్బదేడుక్రూరనా
రాచంబు లేసిన నప్పుడు గూడుకొని ద్రోణుం డిరువదేనింటను శారద్వతుం డే
నూటను వికర్ణుండు మూఁటను శల్యుండు దొమ్మిదింటను దుర్యోధనుం డఱువది
నాల్గింటను రభసోల్లాసంబున నేసిన. 34

క. అవి యెల్లను బైఁ గురియఁగ, నవికలమూర్తి యగు ననిమి ॥ షాధిపతనయుం
డవిరళవర్షము మీఁదం, గవియంగా నొప్పునగము ॥ కరణిం బొలిచెన్. 35

వ. ఇట్లు సుస్థిరుం డై. 36

---

1 మూఁడుమొగంబు లయ్యె.

సీ. ఇరువదేనమ్ముల సురనదీనందను, ద్రోణుని నఱువదిబాణములను
దొమ్మిదిసునిశితాస్త్రమ్ములఁ గృపుని వి,కర్ణశల్యుల విశిఖత్రయముల
రారాజునైదునారసముల నొప్పించె, నప్పుడు గడఁగి సాత్యకియు మత్స్య
జనపాలకుండు ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప,దీసూనులును సుభద్రాసుతుండు
తే. భీష్మునకుఁ దోడుపడువారి బెట్టు దాఁక, నతఁడు ఫల్గును నేఁబదిశితశరముల
నేసి సేర్చినఁ గౌరవు లెల్ల నార్వ, నుఱక యాతఁడు గురుసేనఁ దఱియఁ జొచ్చె.
వ. ఇటు క్రీడించి గాంగేయు డించి గాండీవి దనయరదంబు రయంబున. 38

క. పఱపి రథికులను సూతుల, నఱకిన మ్రోడుపడి యుండె నానారథముల్
వెఱచఱచిరి కురువీరులు, పఱిపఱి యై ఘనబలంబు భయముం బొందెన్. 39
వ. అట్టియెడ నీకొడుకు నీతండ్రితో ని ట్లనియె. 40
చ. తనభుజసార మేర్పడఁగ దర్పితుఁడై మనయందుఁ జేయఁ గ
ల్గినన్నృపకోటి నెల్ల నవలీలమెయిన్ మును మించి త్రుంచె న
ర్జునుఁ డదె నీవు సూడ ననురూపమె నీ కిది మున్ను కర్ణుభం
డనము దొలంగఁ జేసి తకటా యిటు లొప్పరికింపఁ బాడియే. 41

వ. అనిన విని యనిమిషనదీనందనుం డితం డింత యొప్పనిపల్కు పల్కనే యని
మనంబునం గుత్సించుచు బీభత్సుదెసకు నడగుటయు దుర్యోధనవికర్ణులు నల
పటను గురుపుత్రుండు దాపటను గూడుకొని యాక్రీడిపైఁ బటుశరపరంపరలు
వఱఁగించి రతనికి నన్నలుఁ దమ్ములు బాసట యయ్యి కడంగి కవిసి రిట్లు దొరలు
దలపడిన నిరువాఁగును జిందమ్ములు గర్జిల్ల సందడికయ్యంబుగాఁ బెనంగిన గాండీవి
గాంగేయు లొండొరులచండబాణంబులఁ ద్రుంచుచు వర్మంబులు సించుచు నొక
ళ్లొకళ్ల వెలిమావులం బడగలం దాఁక నేయుచుం జేరి పోరుసమయంబున. 42
తే. ఆపగానందనుండు మురారియురము
బాణవితతిని భేదింప శోణితమునఁ
దోఁగి యతఁ డొప్పెఁ దలిరాకు దుఱఁగలింప
మెఱయునవపారిజాతంబు తెఱఁగు దాల్చి. 43
క. కనుఁగొని కోపంబున న,ర్జునుఁ డమరనదీతనూజుసూతుని నొప్పిం
చిన నాతఁ డతనియరదము, మునుఁగంగాఁ జేసె బాణములవెల్లువలన్. 44
క. ఆవెల్లువ శరజిహ్వలఁ, ద్రావి ధనంజయమహాగ్ని దరికొని కవియం
గా వెగ డొందెడుకురుబల,దావము శాంతనవుఁ డంబుదముక్రియఁ గాచెన్.
వ. ఇత్తెఱంగున నెక్కువదక్కువలు లేక యక్కజంబుగాఁ బోరువారిం జారణసిద్ధ
గంధర్వాదులు గనుంగొను చుండి తమలో ని ట్లనిరి. 46
ఉ. ఒండొరుచండవిక్రమము లొప్పుదు రీరల కాక వీరితో

నొండొకరుండు మార్కొనఁగ నోపునె పూని కృతాంతుఁడైన నా
ఖండలుఁడైన నివ్విధపుఁగయ్యము లెక్కడ నైనఁ గంటిమే
పాండవకౌరవోత్తములబాహువిలాసము లిట్టు లుండునే. 47

ధృష్టద్యుమ్నద్రోణాచార్యులయుద్ధము.

వ. అని యగ్గించి రంత మార్తాండుండు గగనమధ్యవర్తి యయ్యె నప్పుడు ధృష్ట
ద్యుమ్నుండు ద్రోణాచార్యుపయిం గవిసిన సతండు. 48

తే. సూతు నొక్కవాలమ్మునఁ ద్రుక్కనేసి, యశ్వముల నాలుగింట నుఁబ్బడఁగఁజేసి
సిడము నడిమికి వెసఁ ద్రుంచెఁ బెడఁదవాఁడి,దొడ్డతూపునఁ గురుసేనఁ దొంగలింప.

క. ఆధృష్టద్యుమ్నుఁడు స, క్రోధుండై బాణవితతిఁ గురిసిన దృఢసం
వేధం బగునారస మ, య్యోధాగ్రణి యేసి నఱకె నుఱక యతండున్. 50

క. ఆచార్యుఁ దీవ్రఘుననా, రాచము లేయంగఁ ద్రుంచెఁ గ్రక్కున నవి వ
మ్మై చెడి పోయిన నార్చెం, జూచి భవద్బలముఁ బాండుసుతసైన్యంబున్. 51

వ. ద్రోణుం డలిగి శరాసనంబు ద్రుంచిన. 52

ఆ. పార్షతుండు శక్తిఁ బరఁగింప నతఁడు ము,త్తునియఁ జేసె మఱియు ద్రుపదసుతుఁడు
పెక్కుశక్తు లొక్కపెట్ట వైచినఁ దును,మాడెఁ దయము మెఱయ నగ్గురుండు. 53

తే. పృషతపౌత్రుండు గద వైవఁ బిడుగుఁబోలె
నడరు నెడఁ బొడిగాఁ జేసె నస్త్రగురుఁడు
భల్లముల గట్టిమెఱుఁగు వెల్లఁ జించి
యతని నెత్తుటిలో ముంచె శితశరముల. 54

ఉ. ఒండొకచాప మెత్తికొని యుగ్రత నాపృషతాన్వయాగ్రగ
ణ్యుం డడరించునారసము లుచ్చి చనంగ గురుండు గ్రొవ్విరుల్
నిండినకింశుకంబు రమణీయతఁ జూడఁగ నొప్పి వానివి
ల్వొండియు రెండు సేసి యవలీల హయంబుల సూతుఁ జంపినన్. 55

మ. విరథుం డై పొలివోనిబంటుతనముం వేగంబు నొప్పంగ బి
ట్టరదంబుల్ డిగునప్డు చేతిగద నుగ్గై రాల నేసెన్ ధను
ర్గురుఁ డవ్వీరుఁడు వాలునుం బలకయున్ ఘోరాకృతిం బుచ్చికొం
చు రయం బారఁ గడంగి బెట్టడర సంక్షోభించె నీసైన్యముల్. 56

క. గురుఁ డనునురుతరగిరి ని,ష్ఠురభంగిం బుట్టి వచ్చుసునిశితబాణో
త్కరచండవేగనదికి నె,దురు చన రాదయ్యె నపుడు ద్రుపదసుతునకున్. 57

క. గతి గుందియుఁ బైఁ దొరఁగెడు, శితశరములు పలక జడియఁ జేయుచు ద్రుపద
క్షితిపతిసుతుండు మెఱయఁగ, నతిరయమున ననిలతనయుఁ డడ్డముసొచ్చెన్.

వ. ఇట్లు సొచ్చి వృకోదరుండు గురుం గ్రూరాస్త్రసప్తకంబున నొప్పించి పాంచాల
పతిసుతు నొండొకయరదం బెక్కించుటయుఁ గనుంగొని నీకొడుకు కళింగపతికిం

జేయి వీచి వాయుతనయుం దలపడ నియోగించిన నతండు మహాసైన్యసహాయ త్వంబునం బేర్చి భీమసేనుపై నురవడించి నడచెఁ గుంభసంభవుండును విజృంభి తుం డై విరాటద్రుపదులం దాఁకె ధర్మతనయుండు ధృష్టద్యుమ్నుం గలిసికొని వెన్ను దన్ని నిలిచెఁ జేదికరూశదేశంబులబలంబులు మహాబలనందనుముందటికి వచ్చె నట్టియెడ. 59

తే. అడరెఁ గాళింగనాయకుం డగుశ్రుతాయు
వునకుఁ దోడయి వీఁకమైఁ దననిషాద
సైన్యమును దాను భీముపైఁ సరభసముగఁ
గేతుమంతుండు ఫణిరాజకేతుఁ డలర. 60

క. భీమునిముందటిబల ము, ద్దామతఁ గాళింగసేనఁ దలపడి హేతి
స్తోమావృత మై వ్రాలెను, భూమిపయిం జగము సగము పొలు పఱి విఱిగెన్.

ఆ. మదము మిగిలి కేతుమంతుఁడు గాంగేయు, పైకిఁ గవిసి యతనిబాణశిఖల
మ్రంది పోమెఁ గడఁగి మంటలో నుఱికిన, మిడుతవోలె మెలఁగ మిడుకలేక.

చ. పవనసుతుం గళింగనరపాలసుతుం డగుశక్రదేవుఁ డు
గ్రవిశిఖవృష్టిఁ దేల్చి తురగంబులఁ గూల్చినఁ గ్రోధదీప్తుఁ డై
యవిహతభంగి భూరిగద నాతఁడు వైచినఁ గూలె వాఁడు వ
జ్రవిహతిఁ గూలుశైల మన సారథికేతుయుతంబుగా నిలన్. 63

వ. ఇవ్విధంబున నద్భుతభయావహం బగుపరాక్రమంబునం బేర్చి భీమసేనుండు ఘటితకాంచనబిందుసందోహసుందరంబును దృఢవిశాలంబును నగుపలకయుం గల్పాంతకృతాంతజిహ్వాభీలం బగుకరవాలంబును బుచ్చికొని హతహయం బగు నరదంబు డిగ్గిన. 64

ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ, పతి రయమునఁ దేరు వఱపి భీముఁ
బొదివి పిడుగుఁగొదమవోనినారసము బి, ట్టేసె నది యతండు ద్రెసెఁ దునియ.

క. మదమున శ్రుతాయు వొక్కటఁ, బదునాలుగుతోమరములు వరఁగించిన నే
ర్పొదవఁగఁ బవనజుఁ డన్నిటిఁ, జిదురుపలుగఁ జేసె ఖడ్గచిత్రనిహతులన్. 66

భీమసేనునిచేత భానుమంతుండు సచ్చుట.

వ. అప్పు డాకళింగపతియనుజుం డగుభానుమంతుండు దంతినికరంబుతో నగ్రజునకుం దల మిగిలి పవమానసూనుపై నడరి నిజఘటలకుం దలకడచి యతనిమేన నారాచంబులు నాటించుచుఁ గదిసి తనయెక్కిన యేనుంగు నేపునం బురికొల్పిన. 67

శా. కుంతీసూనుఁడు సింహనాదమున దిక్కుల్ పిక్కటిల్లంగ దు
ర్దాంతస్ఫారగతిం గరిం గదిసి రౌద్రస్ఫూర్తి లంఘించి త
ద్దంతంబుల్ వెస నెక్కి త్రొక్కి తునిమెం ధారాళరక్తచ్ఛటా
క్రాంతం బై నభ మొప్ప వానిఁ బటుఖడ్గస్ఫారధారాహతిన్. 68

వ. ఇట్లు భానుమంతు నంతకుపురికిం బనిచి. 69

తే. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ నుఱికి
కెంపు దళు కొత్త వాలుతోఁ గ్రేళ్లువాఱు
నావృకోదరుపైఁ గవిసియంగఁ జేయి
వీచె సేనకుఁ గాళింగవిభుఁడు గడఁగి. 70

వ. ఇట్లు శ్రుతాయువు సేయివీచినఁ దచ్చతురంగంబులు వోదివినం బవనతనయుండు నిజభుజశిఖరంబులు వెలుగం దాను బాదచారి యగుటయు నొంటి యైన తెఱంగునుం దలంపనిదర్పంబునం బేర్చి రణక్రీడకుం జొచ్చి కరవాలంబు శుండాలకుంభస్థలంబులు వగుల వ్రేసిన మెదడంటి మొదుక నైనం గేతుదండంబులు నఱికి చులుకం జేయుచు రథికసారథిసహితంబుగా నరదంబులు చక్కడంచి మొక్కలు వోయిన నస్థిసారంబు లగునశ్వశరీరంబులు గోసి పాఱవైచి వాఁడిసేయుచు నుబ్బున గుఱ్ఱంబుల కుఱికి బడలుపడ నఱిముఱి విసరిన [1]నోర వోయిన సురియం జెరివి యవలీలం గాలుబలంబులపైఁ బడి చక్కం జేయుచు మఱియు నానాప్రకారంబు లగుచిత్రవధవిహారంబుల నమ్మోహరంబు విఘటితవిభ్రాంతపలాయితంబు గావించి యపరాహ్ణంబునం గళింగపతిం గవియునవసరంబున. 71

తే. వివిధసన్నాహయుతముగాఁ బవనతనయు
తేరు దగురథ్యములఁ బూన్చి తెచ్చి సూతుఁ
డతనిముందట నిలిపిన నతఁడు వాసి
నాదరంబునఁ గనుఁగొని యరద మెక్కె. 72

ఉ. చాపము వేడ్కఁ బుచ్చికొని సజ్యము సేయునెడం గళింగుఁ డ
ష్టాపదదీప్తపుంఖనవశాతశరంబులు నాట నేసినం
గోపితుఁడై కడంగి బరిగోలలపోటుల నుగ్రవారణా
టోపము వేర్చునట్లుగఁ గరదుల్ వెస డగ్గఱి భీముఁ డుద్ధతిన్. 73

ఆ. అయిదునారసముల నాతనిఁ జదికిలఁ, బడఁగ నేసి మూర్ఛపాలు సేసి
యతనిచక్రరక్షు లైనసత్యుని సత్య, దేవుఁ జంపి నభము దివుర నార్చె. 74

వ. అట్లు శ్రుతాయువు మూర్ఛిల్లినం దదీయసారథి రథంబు దోలంగం దోలికొని పోయినఁ గర్ణధారుండు లేనియానపాత్రంబుంబోలెఁ దద్బలంబు దిరుగుడువడియె నప్పుడు కిమ్మీరవైరి శంఖంబు పూరించిన. 75

క. విని గాంగేయుం డడరినఁ, గని ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నరిభం
జనుఁ డగుసాత్యకియు మరు, త్తనయుఁ గడచి యతనిఁ దాఁకి దర్ప మొలర్పన్.

తే. వెడికముగ నేయ రథములరూపింపు మఱియుఁ
గవిసి తోడ్పడ నతఁడు శిఖండి యొకఁడు

---

1 నొఱవలు వోయిన.

దక్క నందఱతనువులఁ । బెక్కునిశిత
విశిఖములు నాటి బకరిపు । వెగడుపఱిచి. 77

వ. అతనియరదంబుగుఱ్ఱంబులం గూల నేసిన నతండు కోపించి. 78

క. ఘనశక్తివైవ నది శాం, తనవుఁడు ముత్తునియ సేయ । దానం గోపం
బినుమడిగా నుజ్జ్వలగదఁ, గొని యరదము డిగ్గి కవిసె । ఘోరాకృతి మై. 79

క. తదవసరంబున సాత్యకి, మదమునఁ గాంతేయుఁ గడచి । మంత్రంబున బె
ట్టిదముగఁ బడవైచినయొ, ప్పిదమున నస్త్రమునఁ గూల్చె । భీష్మునిసూతున్. 80

వ. ఇట్లు సారథి వడుటయు. 81

తే. వాయువేగంబు లైనతద్వాహనములు
భీష్ముతే రెత్తికొని పాఱెఁ । బృథివి యద్రువ
నపుడు మనసైనికులు గీచకారి నెదుర
నలికి పాసిన బయ లయ్యె । నతనిమునుము. 82

వ. అట్టియెడ ధృష్టద్యుమ్నుండు గారవంబున నమ్మారుతిం దనరథం బెక్కించికొనియె నంతఁ గృష్ణానుజుండు దన తేరు సేరం దెచ్చి యావృకోదరు నుపలక్షించి. 83

ఆ. ఒంటిమైఁ గళింగు । నురవడిఁ దలపడి, పుత్త్రసోదరాప్త । భూరిసైన్య
హీనుఁ జేసి కౌరవానీకములు సూడ, నుఱక భంగపెట్టి । పఱపు టొప్పె. 84

వ. అని యగ్గించె నంతం గడంగి వచ్చుశల్యకృపాశ్వత్థామలం గని పార్షతుండు దన యరదంబున నున్నభీమసేనుని సవినయంబుగా డించి నీవు నన్ను వెన్ను దన్ని చూడు మని పలికి యద్దెసం దేరు వఱపి యశ్వత్థామరథ్యంబులఁ బది బాణంబులం బడ నేసిన నతండు శల్యునిరథంబుపైకిం బోయి పాంచాలపతిసూను మేన నిశితాస్త్రంబులు నినిచెఁ దక్కటియిరువురు నట్ల చేసి రివ్విధంబున నమ్మువ్వురచేత నతం డొక్కరుండును బొదువంబడి యుంట దవ్వులం జూచి విజయనందనుండు నిజస్యందనంబు దోలికొని వచ్చి కృపాశ్వత్థామలం దొమ్మిదేసియమ్ముల నొప్పించి మద్రపతియంగమునఁ బంచవింశతివిశిఖంబులు నాటించె వారును నతనిఁ బండ్రెండు పండ్రెండుశరంబు లేసి రాసమయంబున భవదీయపౌత్త్రుం డగులక్ష్మణకుమారుం డయ్యభిమన్యుం దలపడి మర్మభేదు లయిననారాచమ్ముల నొప్పించిన నతం డక్కుమారుఁ బంచాశత్సాయకంబులం గప్పి తనహస్తలాఘవంబు ప్రకటించిన. 85

తే. లస్తకంబునకోలఁదికి । లక్ష్మణుండు, వెడఁదయమ్మున నభిమన్యు । విల్లు దునియ
నేసి మూర్ఛనఁ గౌరవు । లెల్ల నార్వ, నతఁడు వేఱొకబలువింట । నతని నొంచె.

క. తనయుఁడు నొచ్చిన దుర్యో, ధనుఁ డగ్గనతనయుమీఁదఁ । దన తేరలుకం
జన నిచ్చుట గనుఁగొని శాం, తనవద్రోణముఖరథికతతి వెసఁ గవిసెన్. 87

క. అక్కిను డు నడరినరథికుల, తఱుచునకు సుభద్రకొడుకు । దలఁకక తాఁ నం

దఱ కన్నిరూపులై యే, డ్తెఱ నవ్వుచు నేటు లాడెన్ ధీరత మెఱయన్. 88

వ. తదవసరంబున. 89

మ. కని తే రుప్పరవీదిఁ దోలికొని యాన్ కౌరవ్యసైన్యంబు న
జ్జననాథు న్దటినీతనూజు గురుఁ జంచద్బాణవర్షంబులన్
మునుఁగం జేయుచు దేవదత్త మెలమిన్ మ్రోయించుచున్ సంగరా
వని యల్లాడ వియచ్చరుల్ వొగడ విబ్వచ్చుండు వచ్చెన్ వడిన్. 90

వ. అంతయుం గనుంగొని యుధిష్ఠిరుండు గడంగి సేనల కెల్లను జేయి వీచిన నొక్క పెట్ట యురవడించి కురుసైన్యంబు దలంకం దలపడియె నప్పు డాదిత్యుం గప్పి ధరణీరేణువులుచీఁకట్లుగవియింపంగరితురగనరగాత్రగళితరుధిరధారాసారం బది యడంగునట్లు సేసె నంత నర్జునువివిధబాణపాతంబులఁ గౌరవానీకంబునం దునియ లైనశరాసనశరకరవాలపరిఘపరశ్వధాదులును బఱియ లయినసారిశిరగకుంభికుం భపదాతికపాలప్రభృతులును దుమురు లైనరథాంగధ్వజచ్ఛత్త్రచామరప్రముఖం బులుం గలిగి కయ్యంపునేల కరంబుఘోరం బయ్యె నట్టియెడఁ దమమిఁదిమా నుసులు వడినం జెడి తిరిగెడుహయగజస్యందనంబులు దురంగమాతంగస్యందనం బులు రూపఱిన నేపఱి మెలంగునయ్యయారోహకులును నై యాకులతం బొంది మనబలంబు దెరలి మరల వెఱచ్చఱచి కనుకనిం బఱచినం గృష్ణార్జునులు పాంచ జన్యదేవదత్తంబులు పూరించిన మందాకినీనందనుండు గుంభసంభవున కిట్లనియె.

తే. కృష్ణసారథ్యమున నొప్పున్ క్రీడి యిపుడు, కౌరవానీకముల నెల్లఁన్ గసిమసంగి
కృష్ణసారథ్యమున నొప్పున్ క్రీడి యైన, నెట్లు సేయంగవలయుఁ దాన్ నట్లు సేసె.

క. విను మలుక వొడమి మిక్కిలి, కను దెఱచిన త్రిపురవైరిన్ కైవడి యీయ
ర్జునునందుఁ దోఁచుచున్నది, మన మొనలున్ వశము గావున్ మరలుపు మింకన్.

వ. పోక నిలిచిన బలుమానుసులుం బెగ్గడియు డస్సి మోహటించినయట్లున్నవారు వారిజమిత్త్రుండు నపరగిరిశిఖరంబునకుం జేర నేఁటికిఁ గయ్యంబు సాలింత మని చెప్పి యతం డియ్యకొన నెల్లవారలం దివియ నియమించి నడపించె నప్పుడు పాం డవులు పాంచాలమాత్స్యాదిపరివారసహితంబుగా నార్పులు సెలంగి నింగి ముట్ట మరలి రిట్లు రెండవనాఁటిసంధ్యాసమయంబున రెండుదెఱంగులవారును దమతమ శిబిరంబులకుం జనిరి మఱునాఁడు. 94

## భీష్మునితృతీయదివసయుద్ధము.

క. రేపకడ రభసమున గం, గాపుత్త్రుఁడు సేనఁ గూర్చి న్ గరుడవ్యూహం
బేపారఁ దీర్చుకొని ము, క్కైగ్ పొలుపును బలుపు మెఱయున్ నట్లుగ నిలిచెన్. 95

వ. దానికి ద్రోణకృతవర్మలు కన్ను లయిరి కృపాశ్వత్థామలు శిరం బయి నిలిచిరి త్రిగర్తులతోఁ గూడి భూరిశ్రవశ్శల్యభగదత్తులును సౌవీరజయద్రథులును గంఠ

---

1 దసకు.

త్వంబు నొందిరి మనుజపతి యనుజులుం దానును వెన్నయ్యె విందానువిందులుం
గాంభోజుండును శూరసేనుండునుం బుచ్ఛంబైరి మాగధకళింగాదిగణంబులు
దక్షిణపక్షం బయ్యును గర్ణాటకోసలప్రముఖనికాయంబులు వామపక్షం బయ్యు
ను బొలిచిరి తక్కునుం గలవారలుఁ గలయం బన్ని రంతం బాండవబలంబులును
భండనంబునకు వెడలె నయ్యవసరంబున నర్జునుండు. 96

క. మనమునఁ గని ధృష్టద్యు, మ్నున కిట్లనుఁ బన్నఁ బంపు * మోహర మర్ధం
దునిచందంబున దుర్యో, ధను సైన్యముఁ [1]బొదువునవు * దలకొన వలయున్. 97

వ. అనిన విని యతం డట్లచేసినం బాండ్యమగధబలపరివృతుండై భీమసేనుండు దక్షిణ
శృంగంబున నిలిచెఁ దదనంతరంబ విరాటద్రుపదులును మఱియు నీలుండును గాశ
కరూశగణసమేతుండై ధృష్టకేతుండును నిలిచిరి శిఖండిసహితుం డగుధృష్టద్యు
మ్ను ముందిడికొని యుధిష్ఠిరుండు శుండాలమాలికాభీలంబుగా మధ్యప్రదేశం
బలంకరించె నవ్వల సాత్యకి మొదలుకొని యోలిన కవలును ద్రౌపదేయులు నభి
మన్యుండు ఘటోత్కచుండుఁ గేకయపతులుం బన్నిరి సకలలోకంబులకు రక్షకుం
డైన రాజీవాక్షుం డెవ్వానికి రక్షణం బొనర్చు నట్టిరథికశ్రేష్ఠుండు డాపలికొమ్మునం
బన్నెఁ దక్కటిదొరలుం గలచు మోహరించి రిట్లుభయసైన్యంబులు సన్నద్ధంబు
లయి నడచి నిస్సాణాదులరావంబులు సెలంగ రౌద్రంబు దలకొనం దార్కా
నిమెఁ దత్సమయంబున ధనంజయుండు మనపదాతులు బడలువడం దనరథంబు
వఱపించి శరంబులు నిగిడించి. 98

క. అరదములు రథికవరులును, హరిసారథికేతుసహిత * మై పొడిపొడిగాఁ
గరులును జోదులు డొల్లఁగఁ, దురగంబులు రావుతులును * దుత్తునియలుగాన్.

క. చేయఁ దొడంగిన గాంధా, రేయులు వెస నొక్కపెట్ట * రేఁగి యతనిపైఁ
గో యని [2]కవిసినఁ గని కౌం, తేయులు నందఱుఁ గడంగి * తేరులు వఱపన్. 100

వ. కని తమకించి బలంబులు రెండును గలయఁగ బెరయఁ గెందూళి మొగసిన. 101

క. నామములఁ బితృపితామహ, నామంబుల నుగ్రబిరుదనామంబుల సాం
గ్రామికు లెఱిఁగింతురు దము, నామొన నీమొనను జూపు * లడరక యున్నన్.

తే. ఇవ్విధంబునఁ గ్రందుపా * టింత యైన, భీష్ముకడఁక నీసైన్యంబు * భీమబలిమిఁ
జేసి యాసేనయును నప్డు * సిక్కువడక, పోరె నే మని చెప్పను * గౌరవేంద్ర.

క. శోణితము[3]వెల్లి గవిసిన, రేణు వడంగుటయు మొనలు * ప్రియపడి వెస గీ
ర్వాణాసురసమరముక్రియ, బాణాదినిశాతహేతిసంపత్తులు మెఱయన్. 104

వ. పెనంగునట్టియెడ గాంగేయుండును గురుండును బృహన్మిత్రుండును సైంధవుండును
సౌబలుండును వికర్ణుండును బాండవసేనపై నడరిన భీమసేనఘటోత్కచసాత్యకి
శైబ్యచేకితానద్రౌపదేయులు వారిం దలపడినం బోరుఘోరంబయ్యె నప్పుడు రథ

---

1 బొదుచునను. 2 కవియఁగ నాకౌం. 3. వెల్లి గురిసిన.

బృందంబులతో భవదగ్రనందనుండు వాయునందనతదీయనందను లున్న యెడకు నురవడించినం గని భీష్మద్రోణు లతని మించి వారలం దాఁకినం జూచి సవ్యసాచి యగ్రజునగ్రభాగంబునకు వచ్చి. 105

క. భూరిశరాసారంబునఁ, గౌరవులకడంక యుడిపె ॱ గాంధారబలాం
భోరాశిఁ దఱియఁ జొచ్చిరి, వీరాగ్రణి సాత్యకియును ॱ విజయసుతుండున్. 106

క. పొదివికొని శకునిబల ము, న్మదగతి సాత్యకిరథంబు ॱ నఱకిన నాతం
డది డిగ్గ దాఁటి ధైర్యా,స్పదమతి నభిమన్యు తేరిॱపైకిం జనియెన్. 107

క. వా రిరువురుఁ జలమున గాం, ధారపతిప్రముఖరథికॱతతులం జంచ
న్నారాచతతుల నొంచిరి, క్రూరతఁ గవిసెన్ యుధిష్ఠిॱరుఁడు భీష్మపయిన్. 108

క. భూరిబలఘోర మగునా,భూరమణునికోలుతలకుఁ ॱ బోవక భీష్మ
స్ఫారబలము ద్రోణునిదో,స్సారంబును నచ్చి నీదుॱసైన్యము పెనఁగెన్. 109

-:o:- దుర్యోధనుఁడు భీమునితో యుద్ధము సేసి మూర్ఛిల్లుట. -:o:-

చ. తదవసరంబునం బతి యుॱదగ్రత భీమునిఁ దాఁకి విస్ఫుర
త్ప్రదరము లేసినన్ నగుచుఁ ॱ బాండవవీరుఁడు రాజుమేన బె
ట్టిద మగుబాణ మొక్కటి వॱడిం గొని తూఱఁగ నేయఁ దేరిపైఁ
జదికిలఁ బడ్డమూర్ఛ నృపॱసత్తము లేవఁగ నీక కప్పినన్. 110

ఆ. సంభ్రమమున నపుడు ॱ సారథి యచ్చోటు
దొలఁగఁ బెలుచఁ దేరు ॱ దోలుటయును
గని భయంబు నొంది ॱ కలఁగి యొక్కుమ్మడి
బలము లెల్లఁ బెరలి ॱ పాఱఁ జొచ్చె. 111

క. వెనుకొని విఱిగినసైన్యము, గనుకనిఁ బాఱంగఁ జేసి ॱ క్రూరోద్రేకం
బున ధృష్టద్యుమ్నుండును, దనకెలనం దఱుమ వాయుॱతనయుం డెగచెన్. 112

క. అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు, మదమున నిలు నిలు మనంగ ॱ మఱియును మొగక
ట్టిద సేన భీమసేనుఁడు, గదిసి పెఱుఁద నంట నార్వఁ ॱ గౌరవనాథా. 113

క. సభయ మయి శకునిసైన్యం, బభిమన్యుఁడు సాత్యకియు రॱయంబునఁ దోలం
బ్రభ సెడి పఱచుట గని యా,ప్రభువు చలం బెడలి విఱిగెॱ బంధులుఁ దానున్.

క. ఊర్జితశాత్రవసేనా, దుర్జయుఁ డగునగ్రజుండు ॱ దోర్బలలీలా
స్ఫూర్జితుఁడై యొక్కదెసన్, గర్జారౌద్రముగఁ దోలెఁ ॱ గౌరవబలమున్. 115

తే. అంతఁ దెప్పిఱి నీకొడు ॱ కనికి రథము
దొలఁగఁ బెచ్చుట గనుఁగొని ॱ యలిగి సూతుఁ
బలికి సరభసముగ నడుॱకలని కేఁగి
యెలుఁగు సూపిన బలములు ॱ నిలిచి పొదివె. 116

తే. ఉన్న [illegible] కడల [illegible] యున్న ద్రోణ, భీష్ములును [illegible] సేయఁ ॱ [illegible] సేన

చంద్రుఁ డుదయింపఁ బెటిగినకరశరధియట్లు, దోడుతోఁడుతఁ బొంగారెఁజూడ నొప్పె.

వ. ఇట్లు బలంబుల నిలిపి సుయోధనుండు సత్వరంబుగా భీష్మద్రోణులపాలికిం జని వారలతో నిట్లనియె. 118

ఉ. ఉక్కున మూఁడులోకములు నొక్కటఁ దాఁకెనయేనిఁ బోర మీ
[1]రొక్కఁ డొకండ గెల్చుటకు నోపుదు రశ్రమవృత్తి నిట్లు మీ
రుక్కున నూర్పు గల్గ మనమోహర మీదురవస్థఁ బొందునే
యక్కట మున్న పాండవుల కల్గఁగ నొల్లమి సెప్ప రైతిరే. 119

వ. అని పలికి గాంగేయుం గనుంగొని. 120

ఆ. నాఁడె చెప్పఁ గన్న నాకు రాధేయున, కెట్లు సూడఁ బోలె నట్లుపోలెఁ
బడినపాటుఁ బడుదు మడియాస నీచేతఁ, భంగపడితి మింక బలుకు లేల.

వ. అనిన విని చిఱునవ్వు నవ్వుచు మీతండ్రి నీకొడుకును బ్రియభాషణంబులం దేర్చి యి ట్లనియె. 122

క. పురుహూతసహిత మగుని, ర్జరబలమున కైన గెలువ శక్యమె సమర
స్థిరు లగుపాండుతనూజుల, నరనాయక నీకు నిట్లనం దగ వగునే. 123

క. వృద్ధులు గతాయువులు [2]దు, ర్బుద్ధులు నగువారిచేతఁ బోదురె శస్త్రా
స్త్రోద్ధతియు బాహుగర్వస, మృద్ధియుఁ గలపాండుసుతు లమిత్రధ్వంసీ. 124

క. ఐనను నోపినభంగిని, భూనాయక పాండురాజపుత్త్రసముద్య
త్సేనలఁ గూల్చెదఁ గనుఁగొను, మీ నీవును బంధులును సమీపస్థుల రై. 125

వ. అని పలికి సంరంభమున విజృంభించిన ధార్తరాష్ట్రులు ముదితమానసు లై శంఖంబులు పూరింప భేరీమృదంగాదితూర్యస్వనంబులు సెలంగుటయును. 126

క. విని పాండునందనులు శం, ఖనినాదము లుల్లసిల్లఁగా బహుతూర్య
ధ్వను లడరఁగఁ దిర మై తమ, మొన నిరతముగా నొనర్చి ముదము దలిర్పన్.

వ. నడచి రనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 128

క. దుర్యోధనుమాటకు భుజ, వీర్యోద్ధతి భీష్ముఁ డేచి విక్రమలీలా
ధుర్యతఁ గడఁగినఁ గయ్యం, బార్య తవనీయ యెట్లు లయ్యెం జెపుమా. 129

వ. అనిన విని సంజయుం డతని కి ట్లనియె నప్పుడు ప్రభాకరుండు నభోమధ్యంబునకు వచ్చి వెలుంగుచున్న నతనితోడిపురుడునం దేజోమహిమ దలకొన్న తెఱంగు నందనమెఱుంగువాలమ్ము లనుకిరణమ్ములు వరఁగించుచుఁ బ్రతాపదీపితుం డగు దేవవ్రతుండు దేవేంద్రసుతుం దాఁకెన. 130

చ. కడఁగి సుయోధనప్రభృతికౌరవవీరులు భీష్ముతోన బె
ట్టడరిన భీమముఖ్యు లగునక్కడియోధులు నొక్కయుమ్మడిం
వడిఁ దలపడ్డసైన్యము లవారణ రెండును నేచి త్రోచి య

---

1. రొక్కొకరుండ ; రొక్క రొకండ. 2. నిర్బుద్ధులు.

ప్పుడు రభసంబునఁ బెరసి । పోరె వియచ్చరకోటి మెచ్చఁగాన్. 131

వ. అట్టియెడ. 132

క. హుంకారములు నదల్పులు, జంకెలు ధిక్కారణములును । సంస్తుతులును వీ
రాంకోక్తులు [1]నిస్సాణజ, ఢాంకృతులును గలసి యుద్భ।టంబుగఁ బెఱిగెన్.

క. తునిసినచాపామస్తక, తనుచరణంబులును బాణ।తరవారిగదా
ధనువులుఁ గిరీటకంకణ, కనదంగదములును దఱచు।గా ధరఁ దొరఁగెన్. 134

తే. సగముసచ్చినయొడళులు। జలచరములు, రక్తపూరంబు దోయంబు । ప్రచురమాంస
పటలి పంకంబుగాఁ గల।బహునదీప్ర, వాహములు వాఱె సంగరా।వని నృపాల.

క. అఱవఱ లైనరథంబులు, నెఱి దప్పఁగఁ బడినయశ్వ।నికరంబులుఁ బెం
డఱచుగఁ గూలినకరులు, గ్గిరికొని యొప్పె సమరమేది।నీతల మెల్లన్. 136

వ. ఇవ్విధంబున విషమం బగురణభూభాగంబునం జరియింపం జతురులుగాక రథిక
జను లంతంత గుంపులుగట్టిరి గాంగేయుండు ప్రతియోధులం బేరు వేరం బిలుచుచు
నుక్కుమిగిలి దిక్కు లమ్ములం బిక్కటిల్లం జేయుచు నెక్కడఁ జూచినం దాన యై
మెఱుంగు మెఱసిన తెఱంగునం గొఱవి ద్రిప్పినయొప్పున నింద్రజాలంబు సూపిన
చందంబునం దనరథంబు మెఱయ శక్తిశౌర్యంబులు నెఱయ నెవ్వరికిని నిలువరింప
రాక యెదిరినరూపంబులం బెక్కింటి నొక్క బాణంబునం బెక్కు బాణంబుల నొక్కం
టిఁ గూల్చి కేలిసలుపుచు నఱిమి పయింబడినవీరులం గీ[2]లెడలినజంత్రంబులుం బో
లె నేలం గూల నేయుచు దృఢత్వలక్ష్యశుద్ధిలాఘవంబులకు వియచ్చరులు పిచ్చ
లింప ననేకప్రకారంబు లగుక్రూరశరంబులఁ జతురంగంబులం దునియలుం బఱి
యలుం దుమురులుం గుదులు నై బడలువడం జేయుచుం గార్చిచ్చు పొదివినపోలిక
మాయ గావించినమాడ్కి మంత్రించి పడవైచినపగిదిం గసిమసంగి కౌంతేయ
సేనం గనుపుకొట్టుచుఁ బ్రళయకాలతాండవప్రవృత్తి యైనఫాలలోచనులీల నాజి
రంగంబునం బరాక్రమనృత్యంబు సేయుచున్నం బాంచాలయాదవాదియోధులు
వెఱఁగుపడి చూచుచుండఁ బాండవులునుం జేయునది లేక చేష్టలు దక్కినం
దదీయసైన్యంబులు రూపఱి భయభ్రాంతంబు లై దీనదశకు వచ్చె నప్పుడు
శౌరి యుగ్యంబులపగ్గంబులఁ బట్టి పార్థుతో ని ట్లనియె. 137

చ. కృపగురుభీష్మయుక్తముగ । గెల్తు సుయోధనుసేన [3]నంచు నీ
వపరిమితోగ్రశక్తి మెఱ।యం దఱి గోరుచు నుండు దెప్పుడుం
గుపితయుగాంతరుద్రగతిఁ । గోలుమసంగినవాఁడు భీష్ముఁ డే
చి పటుభుజాబలంబు విల।సిల్లఁగ మార్కొన కున్కి యొప్పునే. 138

అర్జునుఁడు శ్రీకృష్ణప్రేరితుం డై భీష్మునిపైఁ గవియుట.

క. అనిన విని యర్జునుం డి, ట్లను నీ విం తనఁగ నేల । యాతనిమీఁదన్

1. నిస్సాణధ, ణంకృతులును. 2. లెడపిన. 3. నందు వీ.

మనరథముఁ బఱపు మిప్పుడ, సునిశితబాణముల నతనిసోం పడఁగింతున్. 139

చ. అనుటయు నట్ల కాక యని యచ్యుతుఁ డుద్ధతిఁ దేరు వోవ ని
చ్చినఁ గని పొంగి యారథికసింహుఁ డుదంచితసింహనాదుఁ డై
నినిచెఁ దురంగదేహముల నీరజనాభుని మేనఁ బాండునం
దనునొడలం బ్రదీప్తఘనదారుణమార్గణపుంజముల్ వడిన్. 140

తే. తనదునొవ్వునకలుకకధైర్యవృత్తి,నయ్యుపేంద్రుండునొచ్చినసహాయచయంబుఁ
దడవి తేర్చి యుదగ్రతఁ దఱుముటయును, గుణరవంబుల్లసిల్ల ఘల్లనుఁడు గడఁగి.

క. భల్లం బొకటఁ బితామహు, విల్లు దునుమ వేఱొకండు వెస నెత్తిన న
వ్విల్లును దునిమిన లాఘవ, ముల్లంబునఁ బొగడి యేసె నొండొక వింటన్. 142

తే. ఇట్లు గాంగేయుఁ డేయునానేకవిశిఖ, వితతి యసురారి రథచిత్రగతులు దప్పి
పోవఁ జేయంగ నతఁ డంతఁ బోక నొంచె,నరుని నారాయణుని బలునారసముల.

క. నొచ్చియు భీష్మునిపై వి, వ్వచ్చుఁడు బెడిదముగఁ గురిసె వాలమ్ములతం
డచ్చెరువుతోడ వెసఁ గా, ర్చిచ్చు గవిసినట్లు పొదివె శితవిశిఖములన్. 144

వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టియెడ. 145

క. హరి దాను నొచ్చి నొచ్చిన,నరుని తెఱం గెఱిఁగి భీష్ముఁడనఘు నించుకయుం
గరలాఘవ మెడలమియుం, దిర మై పరికించి తనమదిం దలపోయున్. 146

ఉ. పాండవసైన్యముల్ గలఁగి పాఱెడు సిగ్గఱి వీరిలోన నొ
క్కండును భీష్ము మార్కొని మగంటిమి సూపఁగ లేఁడ యింద్రపు
త్త్రుండును జాల నొవ్వడిరి తూగెడు నిట్టిద యైన నేఁడ తీ
ర్పండె యితండు కౌరవనృపాలుసమస్తమనోరథంబులున్. 147

క. యాదవకేకయపాంచా, లాదులు వాఱుటలు సూచి యసమెక్కి జయో
న్మాదంబునఁ గురుసైన్యము, లేదిక్కునఁ దామ యగుచు నేడ్తెఱఁ బొదివెన్.

వ. ఇప్పుడే నూఱకున్నం బోవదీ దేవవ్రతుం జంపి ధర్మతనయు గెలిపింప వలయు నని
యిట్లు దలపోయు నెడ మఱియు మందాకినీనందనుండు బెట్టిదమ్ము లగునారసమ్ములు
గురియం దేఁకువ సెడి క్రీడి యున్నం గని కృపకృతవర్మాశ్వత్థామలును భూరిశ్రవ
సైంధవవికర్ణులును నొక్కమొగం బై రథమ్ములమొత్తమ్ములతోడం గడంగివచ్చి
కవ్వడిపయిం బడి రాసమయంబున సాత్యకి సామజఘటలతో నురవడించి యిరు
గెలంకుల యోధుల నాలోకించి. 149

క. మఱతురె యాడినమాటలు, పిఱుసని పోఁ దగునె మీకు బెదరక మెదురై
తఱుముఁడు భీష్ముని గీష్ముని, నెఱుఁగరె మున్నెను గలుగ [1]నేలా వెఱవన్. 150

వ. అనుచు నేచి యెదిరినబలంబుల నిలు నిలు మని యదల్చుచు నర్జును తేరికిం దల
కడచి నచ్చు నతనికి దనుజాంతకుం డి ట్లనియె. 151

1 నేలా విఱుగన్.

4

క. తిరిగినపందల నేటికిఁ, బురికొల్పఁగ నున్నవారు వోదురు గాకేఁ
గురుపతి జయంబు గొని యి,ద్ధర యేలం జూడ నేర్చెదనె విను నన్నున్. 152

శా. గంగానందనుఁ గూల్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్యువీ
రాంగమ్ముల్ నుఱుమాడి తత్ప్రబలసైన్యం బెల్ల మాయించి యి
త్తుం గాంతేయుల కిమ్మహీవలయమ్ముఁ దుర్దాంతచంచద్భుజా
సంగస్ఫూర్జితచక్రవిక్రమకళాసంక్రీడనోన్మాది నై. 153

శ్రీకృష్ణుఁడు చక్రంబు ధరించి భీష్మునిమీఁది కుఱుకుట.

వ. అని పలికి సుదర్శనంబుం దలంచినం దత్క్షణంబ యది సన్నిహితం బగుటయుం బద్మనాభుండు సునాభం బగునాచక్రంబు గైకొని దక్షిణకరంబున నమర్చి పేర్చి యుగ్యంబులపగ్గంబుల నొగల ముడిచి యరదంబు డిగ్గ నుఱికి. 154

తే. అవని గంపింప లలితపీతాంబరంబు, చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజితభయంక, రాననంబునఁ జెలగంగ నడరెఁ బెలుచ.

శా. అంహోమర్దనుఁ డాజనార్దనుఁడు మాద్యద్భీష్మకుంభీంద్రుపై
సింహోల్లాసవిభాసి యై కవియునత్యేకంబు నాటోపమ్ముఁ
గంహస్ఫూర్తియు దీప్తమూర్తియును సంరంభంబుఁ జూడన్ జగ
త్సంహారోన్ముఖుఁ డైనరుద్రుగతి రౌద్రప్రక్రియం బొల్చినన్. 156

చ. పులిఁ బొడగన్నలేళ్లగమిపోలె సుయోధనుసగ్రసైనికుల్
దలఁకి కలంగి నివ్వెఱఁగు దక్కినఁ జేష్టలు దక్కి చిత్రరూ
పులక్రియ నుండి రక్కురువిభుండును మాఱు దలంప లేనికొం
దలమునఁ బొందు డెందమునఁ దానును రూపఱి యుండె వెల్ల నై. 157

ఉ. అప్పుడు భీష్ముఁ డెంతయుఁ బ్రియంబున నిట్లను సంభ్రమంబు లే
కప్పరమేశుతో నిటు కృతార్థునిఁ జేయుదె నీవు వచ్చి న
న్నిప్పుడు నీకుఁ బోలినటు లెల్లను జేయుదు గాని వేగ ర
మ్మెప్పుడె నాకు నిట్టితెఱఁ గుజ్జ్వలఫుల్లసరోజలోచనా. 158

వ. అను నట్టియెడ నర్జునుండు రయంబున రథంబు డిగ్గ నుఱికి పఱచి పురుషోత్తముపిఱిందిదెసం గ్రుచ్చిపట్టిన నతండు దీర్ఘబాహుం డగునతని నాయతశాఖం బగువిపులశాఖం గొనిపోవుమహావాతంబునుంబోలెఁ గొనిపోవ నాతండు పది యడుగులకొలంది నిలాతలంబు చిక్కం ద్రొక్కి యీడిగిలంబడి నిలునం బట్టి యిట్లనియె. 159

ఉ. కోపము సంహరింపు యదుకుంజర పాండవకోటి కెల్లనుం
దేపవు గావె నీ విటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁ డైనధర్మసుతుశౌర్యము ధైర్యము బాహువీర్యమ్ముఁ
రూపఱి పోక కాదె యనురూపమె నీ కిది లోకనాయకా. 160

చ. ఇటు దగు నయ్య కృష్ణ శమియింపుము సాత్యకిఁ జంపినాఁడ విం
కట చనితేని నీ దగుసహాయతఁ గౌరవసేన రూపు మా
పుట యవలీల నాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే
కటకట నాపరాక్రమము గాసిగఁ జక్రము చేత నంటితే.* 161

వ. అనినసవ్యసాచిసమయనిష్ఠకు శౌరి సంతోషించి రోషం బుడిపికొని యతనికిం బ్రియంబుగా మగిడి నొగలపైకి వచ్చి దిక్కులు పిక్కటిల్లఁ బాంచజన్యంబు పూరింప నాధనంజయుండును దేవదత్తంబొత్తి గాండీవగుణచండనిస్వనం బొండొండ నిగిడించుటయుం గౌరవబలంబులు భేరీమృదంగాదితూర్యనాదంబులు సెలంగ మూర్కొని కడంగిన. 162

క. అగ్గలిక దూది దరికొను, నగ్గితెఱం గమర నప్పు డర్జునుఁడు గడు
డగ్గతి మెఱుంగుటమ్ముల, మ్రగ్గించె వియచ్చరోత్కరం బగ్గింపన్. 163

వ. ఆసేనకుం దలకడచి భీష్మభూరిశ్రవశ్శల్యదుర్యోధను లడరి యర్జునుపై శక్తిగదాసప్తనారాచతోమరంబులు ప్రయోగించిన నతండు శక్తియు గదయును దోమరంబును నొక్కొక్కభల్లంబునను నేడునారాచంబు లేడింటను దునిమి పేర్చి మైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానాప్రకారక్రూరశరకలాపరూపంబునం గవిసి కౌరవసైన్యంబు నొప్పింప మఱియును దాను మందాకినీనందను నిశితనారాచజాలంబునం బొదివి భూరిశ్రవసునిచాపంబు ద్రుంచి తొమ్మిదివాలమ్ములు శల్యుమేనం గీలించి కురుపతిపక్షంబు వెడందవాతియమ్మున భేదించె నప్పుడు పాంచాలపతివిరాటప్రముఖు లగుజోదులు గోలుతల సేసిరి మనబలంబులు గాండీవగుణనిష్ఠురనినదంబునం జేడ్పడి యొల్లంబోయె. వెల్ల నయి యుండ భవదీయసుతులు శౌర్యోద్రేకంబున నాకేశనందనునరదంబుఁ బొదివి రట్టిసంకులసమరంబున మహేంద్రబాణంబుచేత మనదిక్కున. 164

ఆ. కెడసె హయము లొడ్డగెడవయ్యె రథములు, చాఁపకట్టువడియె సామజములు
చదిసెఁగాలుబలముచామరచ్ఛత్త్రకేతువులు నాయుధములుఁ దునియలయ్యె.

వ. అప్పు డర్జునుండు కేశకలాపంబు శైవాలంబును బ్రేవులపోవులు ఫేనపుంజంబులును మేదోమాంసమస్తిష్కపటలంబు పంకంబును నగురక్తనదీప్రవాహంబు భవదీయసేనామధ్యంబునం బఱపి భేతాళక్రవ్యాదాదిభూతంబుల నోలలార్చె

---

* "చ. సరసిజనాభ నీ వలిగి చక్రముఁ గఁ జూచిన నీయజాండక
ర్పరమునజంతుజాలములు భస్మమయంబులు గావె చక్రముం
గరమునఁ జేర్చి బిట్టుఱుక కౌరవసైన్యము లెంత బాహువి
స్ఫురణము సూప నేల యదుపుంగవ కోపము సంహరింపవే."

ఈపద్యము ప్రక్షిప్తము. ఇది ముద్రిత మైనయొకప్రతియందు 161 వ పద్యమునకుఁ దర్వాత నున్నది గాని వ్రాఁతప్రతులయందుఁ జూపట్టదు.

నతండు దేవదత్తంబును దామోదరుండు పాంచజన్యంబును బూరించి సింహనాదంబులు సేసి రంత నరుణగభస్తి యస్తగిరిమస్తకాంతరితుం డయ్యె నాసంధ్యాసమయంబున నిజసైన్యంబునొవ్వనుం గవ్వడిదివ్యబాణజాలంబులదుర్నివారత్వంబును విచారించి భీష్మద్రోణబాహ్లికదుర్యోధనులు బలంబులఁ దివియించి మరలి [1]కరదీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి పాండవులును గృష్ణసహితంబుగా నుబ్బునం బొంగుచు వందిజనకీర్తనంబులు సెలంగ మగిడి శిబిరంబునకుం జని రమ్మూఁడవనాఁటిరాత్రి కురుపతివీటిజనంబులు గిరీటిపరాక్రమప్రకారంబులం దమదెస నానాదేశంబులచతురంగంబులు వ్రాలిసిన పెల్లును నంతంతం గుములు గట్టి చెప్పికొనుచుండ. 166

భీష్మునిచతుర్థదివసయుద్ధము.

క. వేగుటయు సత్వరంబుగ, నాగాంగేయుండు మించి । యనికి నడచినన్
సాగరతరంగములగతి, వేగమ తరతరమ మొనలు । వెడలఁ దొడంగెన్. 167

క. అతిరయమున గురుఁడు భవ, త్సుతుఁడును బాహ్లికుఁడు నెయిది । తోడ్తో బలసం
తతి గూడికొనఁగఁ బటుబృం, హిత హేషా నేమిరవము । లెసఁగెం దఱచై. 168

క. తారుకొని మేఘమాలా, కారంబునఁ జాల నొప్పెఁ । గౌరవసైన్యం
బారూఢవీరరసవి, స్ఫారం బై యంతఁ దోఁచెఁ । బాండవబలమున్. 169

క. కురుసేనఁ జూచి యప్పుడు, నరనారాయణులు దమమొ । నకు మిగిలి సము
ద్ధురలీల సూర్యచంద్ర, స్ఫురణము లొక్కెడన మెఱయు । పోలిక నమరన్. 170

క. వెలిఁగిరి బలములుఁ దూర్యం, బులు నార్పులుఁ జెలఁగ రెండుఁ । బురికొని చతురం
గలసద్గతు లొప్పఁగ వడిఁ, దలపడియెం గైదువుల న । దరు లెగయంగాన్. 171

వ. ఇట్లు దాఁకి తోమరప్రాసప్రముఖంబుల డొల్లవైచుచుఁ గుంతక్షురికాదులఁ గూలం బొడుచుచుం గరవాలపరశ్వధప్రభృతులం దునియ వ్రేయుచు గదాముసలముద్గరంబులఁ జదియ మోఁదుచు నఖరప్రాసంబులం బగుల వ్రచ్చుచు.

క. పురికొనుచుం దెరలుచు నో, హరిసాహరి నొక్కచోట । నలవడు నొకచో
విరియ నొకచోటఁ దిరుగుం, దిరుగక యొకచోట రెండు । దెఱఁగులు నొచ్చున్.

క. పలుచోటులఁ బలుభంగులఁ, బలుమొన లిమ్మాడ్కిఁ బోరఁ । బార్థునిపై న
గ్గలిక నడరెఁ దాటిసిడము, తలతల మని మెఱయఁ గురుపి । తామహుఁ డధిపా.

క. పతియును ద్రోణుండు వివిం, శతియుం గృపసోమదత్త । శల్యులు గంగా
సుతుతోడఁ గడఁగి రర్జున, సుతుఁ డయ్యేద్వురను దాఁకె । సురలు నుతింపన్.

క. వారలశరనిచయము దు, ర్వారవిశిఖపంక్తిఁ దునిమి । వాసవపౌత్రుం
డారూఢతేజుఁ డై వెలుఁ, గారెను హుతవహ్నిక్రియ । రణాంగణవేదిన్. 176

తే. భీష్ముఁ డభిమన్యుఁ గడచి యాభీలబాణ, జాలములు దీవ్రతరముగ । సవ్యసాచి

1. ‘కరదివియలు’ అనియే వ్రాఁతప్రతులు.

మీఁదఁ గురియంగ నాతఁడకేమేయభల్ల, తతులనన్నింటిఁ దునుమాడెఁ దరతరంబ.

వ. ఇట్లు దొడంగి యుద్భటప్రకారంబునఁ బెల్లు సెల్లుభీష్మార్జునులకయ్యం బయ్యెను వాఁగును గొండొకసేపు నివ్వెఱపడి చూచుచుండె నశ్వత్థామభూరిశ్రవశ్శల్యపుత్త్రచిత్రసేనులు మత్తమాతంగంబులు సింగంబుఁగోదమం బొదువుపోలిక నభిమన్యుం బొదివిన నతండు. 178

క. కని యల్లన నవ్వుచు గురు, తనయుని యురమేసి శల్యతనయునిసిడముం
దునిమి వెస నీదుతనయుని, ధనువు నఱకి సోమదత్తతనయుని నొంచెన్. 179

క. వారును ముందటి యార్వురు, నీరసమున నొక్కపెట్ట యేయఁగఁ బటుదో
స్సారుం డగు సౌభద్రుఁడు, దారస్ఫురణమున నద్భుతంబుగఁ బోరెన్. 180

ఆ. హస్తలాఘవమున నతులబలంబున, శౌర్యమహిమ నధిక ధైర్యమునను
సవ్యసాచితనయు సరి గార యమ్మహా, వీరు లంతవట్టు గౌరవేంద్ర. 181

వ. ఇట్లు పెక్కండ్రతోడం బెనంగుపుత్త్రుం గనుంగొని యర్జునుం డంట నార్చి యడరి యందఱ గన్నిరూపులై నొప్పించి చిక్కువఱిచె నప్పుడు నీకొడుకుపంపునం ద్రిగర్తులుఁ గృతవర్మయుఁ గేకయులును ముప్పదేనువేలరథంబులవారును గవిసి కిరీటిం గొడుకునుం బొదవి రట్టియెడ. 182

మ. తఱికిం జొచ్చి కడంగి పోరువిజయుల్ దాదవ్వులం జూచి యే
డ్తెఱఁ బాంచాలసుతుండు సత్వరగతిం దేరద్దిరన్ సారథిం
బఱపం బంచి నిశాతబాణపటలీపాతంబులన్ వైరులు
క్కఱఁ దాఁకెం దమసైన్యముల్ సెలఁగ శౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 183

వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు పురందరనందనునకుం దలకడచి తాఁకె. 184

క. శరములు మూఁటం గృపుఁ బది, శరముల మద్రేశు నొంచి శర మొక్కట ను
ద్ధురగతి యగుకృతవర్మని, యరదముఁ దురగముల నొకట నవనిం గూల్చెన్.

వ. అప్పుడు శల్యనందనుండు. 186

క. పదిటఁ ధృష్టద్యుమ్నునిఁ, బదియమ్ముల నతనిసూతుఁ బటురయమున ను
న్మదుఁడై నొప్పించినఁ గెం, పొదవినమోమలఁతినవ్వు నొప్పున నొప్పెన్.

క. ఆపృషతపౌత్త్రుఁ డుద్ధత, కోపానలుఁ డగుచు శల్యుకొడుకుధనువు నా
టోపమునఁ దునిమి ఫణిరా, జోపమితాస్త్రంబు లతనియొడలం జొనిపెన్. 188

వ. ఇవ్విధంబున. 189

క. నో నేసి సూతుహయసం, తానముఁ జంపుటయు శల్యతనయుఁడు విరథుం
డై నిరుపమాన మగుతన, మానము వాహనము గాఁగ మన మెలరారన్. 190

శల్యనందనుఁడు ధృష్టద్యుమ్నునితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. పలకయు వాలును గొని తె, క్కలు గలపెనుఁబాముపగిదిఁ గవిసినఁ గొంతే
యులు సూచి వెఱఁగుపడి రా, బలమును నీబలముఁ బొగడెఁ బటుశౌర్యంబున్.

వ. ఇట్లు గవిసి. 192

క. వెరవున ధృష్టద్యుమ్నుని, శరనికరం బెల్లఁ బలక । జడియుచుఁ గిరణ
స్ఫురణాతిభీషణం బై, కరవాలము మెఱయఁ జిత్ర । గతులం గవిసెన్. 193

తే. కవిసి వ్రేసిన గ్రక్కున । గద యమర్చి, యాఁగి వజ్రప్రహారంబు । ననుకరింప
ద్రుపదనందనుఁ డడిచినఁ । దునియ లయ్యెఁ, బలక రెండనవాటునఁ । బగిలె శిరము.

క. తల వ్రయ్యలైనఁ బ్రాణం, బులును గృపాణంబు విడిచి । భువిఁ ద్రెళ్లె నతం
డలు కొంది కురుబలం బా, కులతం బొందంగఁ గొండ । గూలినభంగిన్. 195

తే. ఇత్తెఱంగున నిజపుత్త్రుఁ । డీల్గుటయును
గ్రోధదీప్తుఁ డై శల్యుండు । ద్రుపదసూతి
మీఁదఁ గవిసిన నాతఁ డ । మేయబాణ
పంక్తి వఱఁగించె నుజ్జ్వల । ప్రభలు నిగుడ. 196

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 197

క. మానుష మేటికి దైవా, ధీనము సర్వంబు నస్మ । దీయస్థాయ
త్సేనలఁ బాండునృపాలక, సూనులు గెల్చెదరు కంటె । సూతతనూజా. 198

క. చావును నోవును మనయో, ధావలికిఁ గెలుపు నుబ్బు । నావలికిని సీ
చే వినియెదఁ దుది నెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ । జేపడున కదే. 199

వ. దుర్యోధనుదుర్ణయంబున నేను దుర్వార్తలు వినుచు దుఃఖంబు లనుభవించు
వాఁడ నైతిఁ గౌంతేయుల గెలుచునుపాయంబెద్దియుం గన్నవారము గా మనిన
సంజయుం డది యట్టిద నీసైన్యంబుల సేనాంగంబు లనేకంబులు వొలిసె దొరలు
మడిసెదరు దిర మై విను మని యిట్లనియె నట్లు శల్యుచేత బహుబాణంబులం
బొదువంబడి పార్షతుం డతని నపరిమితనిశితశరంబులం బొదువ నతం డతనివిల్లు
దునిమి వివిధాస్త్రంబుల నెగడుపఱిచిన నాధృష్టద్యుమ్నుఁడు నొచ్చుటయుఁ
జూచి సుభద్రాసూనుండు మద్రపతిం దాఁకె నప్పుడు కురుపతి పురికొల్ప
దుర్ముఖుండును దుస్సహుండును దుర్మర్షణుండును సత్యవ్రతుండును జిత్రసేనుం
డును బురుమిత్త్రుండును వివింశతియును వికర్ణుండును నయ్యభిమన్యు మా
ర్కొనుట కలికి పాంచాలనందనుపై నడరి యొక్కొక్కండ పెక్కమ్ము లేసిన నా
పృషతపౌత్త్రుండు చలింపక యొక్కొక్కకునిం బెక్కమ్ము లేసి కరలాఘవంబు
నెఱపి యందఱకుం జాలి సమరంబు సేయుచుండె. 200

క. నకులుఁడు సహదేవుఁడు మా, మకు నచ్చెరువాటుఁ బ్రియము । మదిఁ దలకొన నం
బకవృష్టి గురియ నస్త్ర, ప్రకరంబునఁ బొదివె మద్ర । పతియును వారిన్. 201

వ. వారికి బాసట యై పాంచాలమత్స్యపతులు సైన్యోపేతంబుగాఁ దఱిమిన మన
యందుఁ గలదండిమగలు శల్యునకు సాహాయ్యంబు సేసి రంత దినమణి యంబర
మధ్యం బలంకరించె నట్టియెడ. 202

తే. భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ, దీఱుదల యగుఁ గా కని తీవ్రకోప
దీప్తుఁడై గదసూచుచుఁ దేరు నీడు, తనయునకు సమ్ముఖంబుగఁ దఱుముటయును.

క. నీకొడుకు లందఱును వెఱ, నాకులతం బొంది రప్పు డగ్రజుఁడు గజా
[1]నీకఘను మగధు వీరో, ద్రేకంబునఁ బనిచె మారుతిం దలపడఁగాన్. 204

వ. పనుచుటయు నతం డురవడించిన. 205

చ. గజఘటలం గనుంగొని వికాసము మోమునఁ బల్లవింపఁగా
భుజశిఖరంబునందు గద వ్రాల్చి మదంబునఁ దేరు డిగ్గి వా
యుజుఁడు గడంగి భీషణసముద్ధతిమైఁ దలపడ్డఁ బర్వత
వ్రజముపయిం బెనం గవియువాసవుచందము దోఁచె నత్తఱిన్. 206

క. నిజసింహనాదమున న, గ్గజములు గుండియలు వగిలి కలగుండువడన్
విజయాగ్రజుఁ డిట్లేచి ది, విజవర్గము పిచ్చలింప విస్ఫురితగతిన్. 207

వ. విక్రమవిహారంబునకుం జొచ్చె నప్పుడు ద్రౌపదేయులు నభిమన్యుండును గవలును ధృష్టద్యుమ్నుండును గరిసముత్కరంబుపై శరనికరంబులు నిగిడించుచు భీముని నిరుగెలంకులం జేరి కవిసి రందు నకులనందనుం డగుశతానీకుండు హస్తికుల మస్తకంబులు భల్లంబుల డొల్ల నేయుచు నడరె నట్టియెడ. 208

చ. మగధమహీశుఁ డేచి యభిమన్యునిపైఁ గరిఁ గొల్పఁ నుజ్జ్వలం
బగునొకనారసంబు దొడి యాతఁ డుదగ్రత ఫాలకుంభసం
ధిగతము గాఁగ నేయ నది దీనత మ్రొగ్గఁగ నప్పు డక్కజం
బుగ వెస మాగధుం దునిమె భూస్థలి నయ్యిరుపీనుఁగుం బడన్. 209

క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల, దష్టాపదపుంఖమార్గణావళి నయ్యు
త్కృష్టగజఘటలఁ గలఁచె న, వష్టంభవిజృంభణంబు వైరులు వొగడన్. 210

ఉ. కొన్నిటి హస్తముల్ సదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ముదూళిగాఁ
గొన్నిటిఁ గుంభముల్ వగులఁ గొన్నిటిఁ గాళులు నుగ్గునూచగాఁ
గొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీఁపులు పిండుపీఁచుగా
[2]నన్నిటి భీముఁ డుద్భటగదాహతి నేనికవేఁట లాడఁగన్. 211

క. అభిమన్యుఁ ద్రుపదసుత, ప్రభృతు లతనితోన మెలఁగి బడలువడఁగ న
య్యిభచయము నిశితవిశిఖ, క్షుభితముగాఁ జేసి రేపు సొం పారంగన్. 212

క. ద్విరదము [3]లొఱగెడివియు నె, త్తురు గ్రక్కుచుఁ గూలెడివి గనుపు లై కలయం
దిరుగుడువడి మెడివియు భువిఁ, బొరలెడివియు నయ్యెఁ బవనపుత్త్రుమునుమునన్

క. ఏనుఁగు నెత్తుట గదయుం, దానుఁ దడిసి విలయకాలదండధరునిచం
దానం బావని మాగధ, సేనం బీనుంగుపెంటఁ జేసి చెలంగెన్. 214

క. శరముల వేగంబున గద, పరుసఁదనంబునను గలఁగఁబడి చేడ్పడ నా

1 నీకపుగమిఁ గడు వీరో. 2 నన్నున; నన్నున. 3 లొరలెడివియు.

కరులం దోలెను భీముఁడు, వెరవున గోపకుఁడు గదుపు వెలిచినమాడ్కిన్. 215

క. పెనుగాలిఁ దూలుమొగిళులొ, యన నిభములు విఱిగి నిజబలావలి సదియం
దనమీఁదఁ బాఱ గుర్వ్యో,ధనుఁ డదలిచి సర్వసైన్యతతిఁ బురికొల్పెన్. 216

క. పతి పురికొలిపిన నమవస, నతిశయముగఁ బొంగుజలధి యనఁ గ్రమ్మినయు
ద్ధతబలము నిలిపె నమ్మా,రుతి సెలియలికట్టక్రియ నిరూఢస్థితి యై. 217

వ. ఇట్లు నిలిపి యార్చి తఱియం జొచ్చి వృకోదరునకుం దోడయి ధృష్టద్యుమ్న
సౌభద్రప్రముఖు లగురథికజనంబులు. 218

క. విదువక చాపట వలపటఁ, గడిమి మెఱయ నిలిచి యపుడు కౌరవసేనం
గడుఁ జిక్కువఱచి రొక్కు,మ్మడి నమ్ములవానఁ గురిసి మద మెలరారన్. 219

క. అడవి దరికొనినపావకు, వడువున భీముండు గౌరవవ్యూహంబుం
బొడి సేయుచుఁ బేర్చెం దన,యొడలు మనము నంతకంత కుబ్బుచునుండన్.

క. [1]ఉరమునఁ గటి మైఁ దొడలం, జరణములం గౌరవేంద్రచతురంగంబుల్
ధరఁ జాఁపకట్టువడ ని, ష్ఠురగతిఁ దాఁకుచు సమీరసుతుఁడు చరించెన్. 221

తే. తుంగమదువున నాడుమాతంగవిభుని, భంగి భవదీయసైన్యంబు బడలువడఁగ
లీల నిస్సంభ్రముం డయి కేలి సలిపె, గాలిచూ లప్డు గగనచరాలి వొగడ.

క. వెఱచఱచి వెగడువడి ని,వ్వెఱఁ గందుచుఁ గురుబలంబు వీరు లతని డ
గ్గఱ కంత నంతఁ జూడఁగ, నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్. 223

క. అరదంబు రవము సెలఁగఁగ, శరములు వాయుజునిమీఁదఁ సాంద్రముగ వెసం
గురియుచు నడరెడుభీష్ముని, సరభసముగ మాఱుకొనియె సాత్యకి కడిమిన్.

వ. ఇ ట్లెదిర్చినం జూచి. 225

క. అంబరము వగుల నార్చి జ,నంబు వొగడఁ గృష్ణననుజునకు మార్కొని తీ
వ్రాంబకములు పదియింట న, లంబుసుఁడు దదంగకంబులం గీలించెన్. 226

వ. ఇవ్విధంబునం దాఁకి బెట్టు నొప్పించినం గోపించి. 227

చ. శినిమనుమండు నద్దనుజు శీఘ్రమ నాలుగునారసంబులన్
వెనుక కొందుంగఁ జేసి పటువిక్రమ మొప్పఁగ నార్చె నార్చినన్
విని కనుఁగ్రేవఁ గెం పడర వీరరసోద్ధతిఁ జూచి సోమద
త్తునితనయుండు బిట్టతనితోఁ దలపడ్డ నుతించె సైన్యముల్. 228

వ. ఇత్తెఱంగునం దలపడి. 229

క. భూరిశ్రవుండు దొమ్మిది, నారాచము లతనిమేన నాటించిన నా
కౌరవ్యునిఁ బటువిశిఖా,సారంబున ముంచి నొంచె శైనేయుండున్. 230

ఉ. ఈసునఁ దాను దమ్ములు నరేంద్రుఁడు గ్రందుగ సోమదత్తికిన్
బాసట యై కడంగె నట పాండవులున్ హరితమ్ముఁ గూడి పె

---

1 ఉరమునసుం గటిఁ దొడలం.

ల్లేసిరి వారిపై నధిప ♦ యేడ్తెఱ మీఱి బకారి యప్డు సం
త్రాసనభాసురుం డగుచుఁ ♦ దాఁకి తెరల్చె భవత్కుమారులన్. 231

—దుర్యోధనుఁడు భీముని మార్కొని మూర్ఛఁ బొందించుట.—

ఉ. తమ్ములు వీఁగినం బతి యుదగ్రత భీము నెదిర్చి యార్చుచుం
దొమ్మిదియమ్ములం దనువుఁ ♦ దూఁటులు సేసిన సూతుఁ బిల్చి వే
గమ్మ రథమ్ముపై కరిగి ♦ కన్నుల నిప్పులు రాల నవ్వి యొ
క్కమ్మడి నాతఁ డేసె నృపు ♦ నుగ్రగతిం బదినారసంబులన్. 232

సీ. అంతఁ బోవక సూతుఁ ♦ డగునందకుని మూఁడు, శరముల సేసిన ♦ ధరణినాథుఁ
డలువదియమ్ముల ♦ నతని నాతనిరథ, చోదకుం డైనవిశోకు మూఁట
నఱిమిఱి నో సేసి ♦ మఱియు నొక్కమ్మున, ఘనశరాసనము ద్రుంచినఁ బ్రదీప్త
కోపుఁ డై యొండొకచాపంబు గైకొని, యుగ్రభల్లమున వృకోదరుండు

ఆ. విల్లు దునుముటయును ♦ వేఱొక్కవింట వ, జ్రంబుఁబోనినారసంబు దొడిగి
రాజరాజు వెస నురం బాడ నేసిన, మూర్ఛవచ్చి యతఁడు ♦ మ్రొగ్గె నధిప.*

క. కని కడు నలిగి సుభద్రా, తనయుఁడుఁ బాంచాలరాజతనయుఁడుఁ గృష్ణా
తనయులు నొక్కమ్మడి నీ, తనయునిఁ బొదివిరి పటుప్రదరపుంజములన్. 234

ఉ. అంతకు నేడ దేఱి విలయాంతకునాకృతి భీముఁ డేచి దు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ ♦ దాఁకి నరేంద్రతనూజు శల్యు న
త్యంతరయంబునం బటుశరావలి నొంచిన నీదుసైనికుల్
సెంతలఁ జేర రైరి బలుసింగముఁ గన్నగజంబులట్ల యై. 235

వ. అప్పు డపరాహ్ణం బయ్యెఁ దత్సమయంబున భవత్సూనులు సేనాపతి సుషేణజల సంధసులోచనులును భీమభీమరథభీమబాహుదుష్ప్రధర్షదుర్ముఖులును వివిత్సు వికటోగ్రాలోలుపసములు నీపదునలువురు బహుశరంబు లడరించుచు నతనిం బొదివిన నజ్జరాసంధమర్దనుండు ఘనశార్దూలంబు[1] బాలమృగంబులం గని కవియు చందంబున నెదుర్కొని సేనాపతిశిరంబు భల్లంబునం ద్రుంచి బాణత్రయంబున జ లసంధు నంతకాలయంబున కనిచి సుషేణువక్షస్థలంబునవలుఁదనారసంబు నా టించిపడవైచి భీమబాహున స్త్రపంచకంబునంజంపి యుగ్రునుత్తమాంగంబు వెడఁ దవాతియమ్మునం గుండలంబులతోఁ గూల్చి భీమభీమరథుల నొక్కమ్మడిం బెక్క మ్ములం గూలనేసి నగుచు మిక్కుటమ్మగునాలుగమ్ముల సులోచనుం గీటడంగించిన.

క. పెఱవార లధికభీతిఁ, విఱిగి చనిరి భీష్ముఁ డేచి ♦ వీరరథికు లం

* "తే. తలఁగి రచ్చట నున్నట్టి ♦ ధరణిపతులు, తిరిగి సైన్యంబు లన్నియు ♦ ధీరవృత్తిఁ
బరమసమ్మోద మందిరి ♦ భరితవినయు, లగుచు రారాజుఁ బొగడుచు ♦ ననుజు లెల్ల."
ఈపద్యము ప్రక్షిప్తము; వ్రాఁతప్రతులం జూపట్టదు. 233 వ పద్యమునసుఁ దర్వాత జనుచ లయును. 1 వాలుమృగంబులం.

దఱిఁ జూచి రాచకొడుకుల, నఱిమాఁడెడు భీముఁ డిట్లు ♦ నడుఁకం దగునే. 237

వ. అని పురికొల్పికొని తొడరునట్టియెడ. 238

క. మిగిలి పవమానసుతుపై, భగదత్తుఁడు మత్తగజముఁ ♦ బఱపి యతని నా
శుగములఁ బొదివిన నమ్మెయి, మొగిళులు రవిఁ బొదువుదర్పముం దలఁపించెన్.

చ. కని యభిమన్యుముఖ్యు లవికంపితవృత్తిఁ గడంగి యేసినం
దనువున నెల్ల రక్తజలధారలు గ్రమ్మఁగ వారణేంద్రుఁ డే
పున సెలయేఱు లొక్కమొగి ♦ బొరనఁ బెక్కడరంగ లీలఁ గై
కొని ఘనకేళి సల్పునడగొండగతిఁ సముదగ్రమూర్తి యై. 240

క. కవిసి బలముఁ జంపఁగఁ బాం,డవయోధులు నిల్వరించుకొటకుఁ జాలక తి
చ్చ వడినఁ గని పెల్లుగఁ గౌ,రవసైన్యము లడరె నుద్ధురస్ఫురణమెయిన్. 241

తే. అప్పు డుబ్బి దుర్యోధనుఁ డతిరయమునఁ, దేరువఱపించి మారుతిఁ దెగువతోడఁ
గదిసి బలునారసంబువరుసమున నాట, నొల్లఁబోవుచు సిడ మతఁ డూఁతగొని యె[illegible]

వ. అయ్యవసరంబున. 243

ఘటోత్కచుండు మాయాబలంబునఁ గౌరవసేనపై విజృంభించుట.

క. మనసేన పేర్చి పెల్లా,ర్చినఁ జూచి ఘటోత్కచుండు ♦ సెలఁగి జనకుఁ జే
కొని యిది మాయ ఘటింపఁగ, ననురూపం బైన వేళ ♦ యని తలఁచి వెసన్.

వ. కైలాసశైలాకారంబును జతుర్దంతసారోదారంబును నుద్దామగమనదుర్వారం
బును నగువారణంబు నెక్కి వజ్రజ్వాలాభీలబాహుదండుం డగుచు నయనసహ
స్రం బొప్ప నప్పాండవులకుం దోడుపడ నైరావణారూఢుం డై యింద్రుండు చను
దెంచె ననుబుద్ధి వైరులకుం బుట్టునట్టుగా నంజనవామనాదిదిగ్గజంబు లెట్టెట్టివి
యని వినంబడు నాభంగిమత్తేభంబుల నెక్కి తక్కటిదిక్పాలురపోలికం దో
దానవులు గెలంకుల నేతేరం గురుపతిపైఁ దోఁతెంచి యతని కడ్డపడు భగదత్తు
దంతిం బొదివి. 245

క. అమ్ముల నేనుఁగుకొమ్ముల, నమ్మత్తగజమ్ము నొంచి ♦ యఱిముఱి మనసై
న్యమ్మెల్లఁ జదియఁ బఱచె భ,యమ్మున మొగతిరిగి దిక్కులఁ ద్రువ నొరలుచున్

వ. ఇట్లాభీలంబుగా భగదత్తుశుండాలంబుఁ దోలి యురవడించి. 247

క. దనుజపతి యేచి దుర్యో,ధను దెస కడరుటయుఁ దత్పితామహుఁ డాచా
ర్యున కిట్లను హైడింబుఁడు, దనమాయాగర్వమున నుదగ్రుం డయ్యెన్. 248

క. భగదత్తు నెగచి కౌరవ, జగతీశ్వరుమీఁదఁ గవిసె ♦ సరభసవృత్తిం
దగ నడ్డపడక తడయుట, మగఁటిమియే పొదువవలయు ♦ మనుజాశనునిన్. 249

చ. తలఁకెడువాఁడు గాఁడు భగదత్తుఁడు భీమతనూజుతోడ ని
ట్టలముగఁ బోరఁ జాలు నకటా కరి నొవ్వరువ దేమి సేయు వి
చ్చలవిడి భూవిభుం గవిసె ♦ సామజమ్ముఁ వెస నేయుఁ డంచు జో

దులకును జేయి వీచి మును ॰ దోలె నతండు రథంబు బల్విడిన్. 250

వ. ఆచార్యప్రభృతు లగురథికవరులునుం గూడికొని కురుభూపతి కడ్డపడి హిడింబానందనుపైఁ గ్రందుకొని వివిధాస్త్రంబులు వరఁగించి రంత నక్కడ నతనికిఁ దోడై యుధిష్ఠిరాదిపాండవులును బాంచాల మాత్స్య ప్రముఖ దండనాయకులును బ్రతివీరులపై ననేకవిశిఖంబులు గురియ నప్పుడు పోరు ఘోరం బయ్యె నందు మందాకినీనందనుం డమందపరాక్రమక్రీడం గాంతేయబలంబులం గనుపుగొట్టె నట్టియెడ నాఘటోత్కచుం డుత్కటోద్దామవిక్రమాభిరాముం డగుచు సింహనాదంబు సేయ బృంహితోదాత్తంబు లైనతదీయదంతావళంబులు నలిరేఁగి నీసైన్యంబుల బడలువడం జేసినం గని గాంగేయుండు గుంభసంభవున కిట్లనియె.

క. ఈయనతో రణ మిప్పుడు, సేయఁగ మది గొల్ప దస్త్ర॰శిఖరికిఁ జేరం
దోయజమిత్త్రుఁడు నేఁటికిఁ, బోయి మనము వత్తె మెల్లి॰ప్రొద్దున ననికిన్. 252

ఆ. అనిన నట్లు కాక ॰ యని ధనురాచార్యుఁ, డప్పు డాత్మపక్ష ॰ మైనరథిక
కోటి కెఱుఁగఁ జెప్పి॰కొని యని సేయుట, నిలిపి తివియఁ బంచె॰ బలము నెల్ల.

వ. ఇవ్విధంబున. 254

క. కౌరవబలములు దిరిగిన, భేరీశంఖాదితూర్య॰భీషణరావో
దారపటుసింహనాద, స్ఫారవిలాసంబు లయ్యెఁ ॰ బాండవబలముల్. 255

తే. చిన్నఁబోయి నీకొడుకులు ॰ సేయఁ గలుగు, దొరలు విడిదల కరిగిరి ॰ పరఁగ భీమ
సేనుకొడుకు నగ్గించుచుఁ॰జెలఁగి వారు, చెన్నుసొంపారఁ జని రాత్మ॰శిబిరములకు.

వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూలపోవుట సెప్పిన విని సంజయునకు నాంబికేయుం డిట్లనియె. 257

చ. అనితల నీవు పాండుతన॰యావలి కెప్పుడు మేలుచేయు నా
తనయులకుం బరాక్రమము ॰ దక్కువయుం బ్రకటింప విందు భీ
ష్ముని గురు [1]శల్యుఁ దక్కుఁ గల॰శూరుల నెల్లను వారు సీరికిం
గొన కిటు లింతవా రగుట॰కుం గత మెయ్యది నాకుఁ జెప్పుమా. 258

క. అనుటయు నాతం డిట్లను, విను మౌషధగుణము మంత్ర॰వీర్యము మాయా
జనితసమగ్రోద్ధతి గా, దనఘా నీ కేను మున్న ॰ యది యెఱిఁగింతున్. 259

ఉ. పాడియు సత్యముం గలరు ॰ పాండుతనూజులు నీదుపుత్త్రు ల
ప్పాడికి నోడ రత్తెఱఁగు ॰ పాపము సేయఁగఁ జూచి తీవు న
క్కీడిటు సేయ కేలుడుగు ॰ గెల్వదె ధర్మువు వారిగెల్పు మీ
మోడుటయుం ధ్రువంబు విదు॰రోక్తులు వింటిమి గాదె యేర్పడన్. 260

క. నీయడిగినభంగిన గాం, గేయు నడిగె నట్లు వారు ॰ గెలిచి చనినయా
రేయి కురునాథుఁ డాతని, కాయన సెప్పినవిధంబు ॰ నభివర్ణింతున్. 261

---

1 దక్కనుం గలుగు॰శూరుల.

వ. భీష్ముండు దుర్యోధనున కి ట్లనియెఁ దొల్లియుం బలుమాఱుం జెప్పెదఁ బాండ
వులకు వాసుదేవుండు సహాయుం డై యుండు న ట్లగుట నెయ్యెడియు నసాధ్యంబు
లే దప్పరమేశ్వరుమహత్త్వం బున్నరూ పెఱింగెడువారు పెక్కండ్రు లే రె
ఱింగినవారల కాపదలు లేవు కౌంతేయు లతని నెఱింగి యాశ్రయింతురు నీవు
సరకుసేయవు వినుము చెప్పెద మానససరస్సను త్తరపర్వతంబునగ్రప్రదేశంబున
దేవతామునిగంధర్వాప్సరోగణంబులు గొలువం గొలు వుండి కమలసంభవుండు.

తే. మణిగణోజ్జ్వల మైనవిమాన మొకటి, యంబరంబునఁ గాంచి సర్వాత్ముఁడండు
సన్నిహితుఁ డగుటెఱిఁగి హర్షంబు సంభ్రమంబుఁ దలకొన లేచి నమస్కరించి.

క. లోకోత్పత్తిస్థితివిల, యాకలనవినోద మునిగణార్చిత గుణర
త్నాకల్ప నిర్గుణాత్మక, శోకభయాపహపదాబ్జ । శుభకరమూర్తీ. 264

వ. అని మఱియు ననేకప్రకారంబుల సంస్తుతించి యి ట్లని విన్నవించె. 265

క. నారాయణ నీ కేఁ గడు, గారవమునఁ బుట్టి యిజ్జగము లన్నింటిన్
సారమతిం గావించితి, నీరక్షణ వీని కెల్ల । నిలు పై యుండున్. 266

క. ఇత్తఱి మనుష్యభువనం, బుత్తలపడు చున్నయది మహోగ్రాసురదు
ర్వృత్తముల నీవు కరుణా,యత్తమతిం బుట్టవయ్య । యదువంశమునన్. 267

క. నరసఖుఁడ నీవు సఖుఁడును, నరలోకమునన్ జనించి । నానాదైత్యే
శ్వరులదెసఁ బీడ లుడుపుము, ధరణీభారంబు వాయఁ । దాత్పర్యమునన్. 268

వ. అని వేఁడికొని వినతుం డయి యద్దేవునితోడి నీడయుం బోనినరనామధేయుం
డగుమహాపురుషుం బ్రార్థించిన నన్నారాయణుండునుం గారుణ్యార్ద్రకటాక్షంబున
వీక్షించి యట్ల యయ్యెడుం గాక యని యానతిచ్చి యంతర్ధానంబు సేసిన నర్క్యా
లువువా రెల్ల నచ్చెరు వంది. 269

క. పరమేష్ఠి నీవు గడుఁ ద, త్పరతను వినయంబు సేసి । ప్రార్థించితి వె
వ్వారొకో వీరలు నావుడు, సరసిరుహాసనుఁడు సెప్పె । సంప్రీతి మెయిన్. 270

క. పరమమును లాదిపురుషులు, నరనారాయణులు వీరు । నా కారాధ్యుల్
నరహితముగఁ బ్రార్థించితి, ధరఁ బుట్టుం డనుచు దానిఁ । దలకొనిరి దయన్.

క. ఇలఁ గ్రీడగఁ బుట్టినవీ, రలఁ గేవలమర్త్యు లని సరకు సేయనివా
రలు సెదుదు రెఱిఁగి భక్తిం, గొలిచినవారలకు శుభ మగును వినుఁ డెందున్.

వ. అని యెఱింగించి బ్రహ్మ దనలోకంబున కరిగెఁ గొలువువారలు నిజస్థానంబులకుం
జని రిక్కడ నీకథ నారదజామదగ్న్యవ్యాసాదులచేత వింటిం దొల్లియు మహా
మునులు నిన్ను నరనారాయణులతోడి వైరంబు వలవ దని వారించిర కాదె నీవు
మదాంధుండ వై మాన వైతి వింక నైనను గృష్ణు నాశ్రయించి పాండవులతోడి
పొత్తున మెలంగి బ్రదుకు మని చెప్పి భీష్ముం డూర కుండెఁ గౌరవపతియు నప్పలు
కులు పెడచెవులం బెట్టె మీరు దగువారు సేయుహితోపదేశంబు లాదరించెద రె

యని పలికి సంజయుం డమ్మహీపతి కిట్లనియె. 273

భీష్ముని పంచమదివసయుద్ధక్రమము.

క. వేగినఁ గౌరవసేనలు, వేగమ కై సేసి యనికి ◆ వెడలెం దీవ్రో
ద్యోగత భీష్ముని మున్నిడి, సాగరములు మేర దప్పు ◆ చందం బొందన్. 274

వ. ఇట్లు వెడలి మకరవ్యూహం బమర్చుకొని నిలిచె నంతఁ బాండవులును శ్యేన వ్యూహంబుగా వేూహరించి రంఁదు ముఖంబున భీమసేనుండును నయనంబుల ధృష్టద్యుమ్నశిఖండులును శిరంబున సాత్యకియును గంఠంబునం గిరీటియు వామ పక్షంబున విరాటద్రుపదులును దక్షిణపక్షంబునఁ గేకయులును వీఁపున నభిమన్యు ద్రౌపదేయులును బుచ్ఛంబున నకులసహదేవసహితుం డయి యుధిష్ఠిరుండును నిలిచి రివ్విధంబున సన్నద్ధంబు లయినయుభయవ్యూహంబులు మేదురతూర్య నినాదంబులు రోదసీకుహరంబు నిండ నొండొంటిం గదిసిన. 275

క. మకరవ్యూహం బనియెదు, మకరాలయ మపుడు దర్ప ◆ మహిమోజ్జ్వలుఁ డై
మకరక్రీడం జండత, మకరాభీలముగఁ జొచ్చె ◆ మారుతి యధిపా. 276

ఉ. చొచ్చి పితామహుం గని యిషుప్రచయంబునఁ గప్పె నాతఁడుం
జిచ్చున నేయి వోసినవి ◆ శేషము దోఁపఁగ భీము నొంచి ము
చ్చిచ్చును నేర్చునట్టులుగఁ ◆ జేసెఁ బదూర్జితసేన నంత వి
వ్వచ్చుఁడు వచ్చి దివ్యశర ◆ వర్గనిరర్గళవిక్రమంబునన్. 277

క. భీష్మునిగర్వం బుడిపి మ, హోష్ములుఁ డై కౌరవేంద్రు ◆ యోధుల కెల్లన్
గ్రీష్మాదిత్యునిక్రియ న, ర్చిష్మత్త్వము సూపి యడరె ◆ సేనలు దెరలన్. 278

వ. అట్టియెడ నీకొడుకు గురునిం గదిసి యతని కిట్లనియె. 279

తే. పట్టి పాలార్చెదరు మీరు ◆ పాండుసుతుల, నీవు భీష్ముండు నలిగిన ◆ దేవతలకు
నైన మార్కొనవచ్చునే ◆ సేన నరుఁడు, నొంపఁగా నిట్టు లొప్పరి ◆ కింపఁదగునె.

వ. అనిన విని కుంభసంభవుండు గటకటంబడి యతనితో ని ట్లనియె. 281

తే. ఎన్నఁడును మున్ను వారల ◆ యేపు నోపఁ, గాన మెట్లు సముద్రంబు ◆ లోన బుబ్బు
వైవఁ గొన్నంత గొనుఁగాక ◆ వారి గెల్వ, మాకు శక్యంబె చవిగాని ◆ మాటలేల.

క. అనుచు మొన గడచి నడచినఁ, గని పాండుతనూజసైని ◆ కవ్రాతంబుల్
గనుకని విచ్చిన సాత్యకి, యనిలజవం బెసఁగఁ దాఁకె ◆ నస్త్రాచార్యున్. 283

ద్రోణుండు దుర్యోధనప్రేరితుం డై పాండవసైన్యంబుపైఁ గవియుట.

సీ. తాఁకి యుజ్జ్వలబాణ ◆ తతి గవియించిన, నవ్వుచు బెడిదంపు ◆ నారసములు
గురుఁడు శైనేయుపైఁ ◆ గురిసిన నొచ్చియుఁ, దెరలక యాతండు ◆ తీవ్రభంగి
బెనఁగంగఁ జూచి పావని యేచి గురునిపై, నిశితాస్త్రసంతతి ◆ నించి నొంచె
నంత శల్యుండును ◆ శాంతనవుండును, నతనికిఁ దోడ్పడి ◆ యడరి భీము

ఆ. నేయఁ దొడఁగుటయును ◆ నే ద్రౌపదేయులును దానుఁ గవిసి ◆ యుగ్రలీలఁ

బటురయంబుమై సుభద్రాసుతుండు దు,ర్వారవిశిఖతతుల వారిఁ బొదివె. 284

చ. కడువడితోడ నప్పుడు శిఖండి ధనుర్గుణనిస్వనంబు పె
ల్లడరఁగ బాణజాలము వియత్తతిఁ గప్పఁగ నీదుసైన్యముల్
సుడివడ భీష్ముఁ డాఁకుటయుఁ జూచి మనంబున నాట దానితోఁ
బొడుతునె యంచు మార్కొనక పోయెఁ దొలంగి యతండు భూవరా. 285

క. కనుఁగొని కురుపతి యాచా, ర్యునిఁ బురికొలుపుటయు నాతఁ డుద్దామగతిం
జని కడిమి మెఱయ నుజ్జ్వల, ఘనమార్గణపుంజముల శిఖండిఁ దెరల్చెన్. 286

క. అమ్మెయిఁ గౌరవులును ద,ర్పమ్ములరఁగఁ జెలఁగుటయును బాండవబలముల్
సమ్ముఖమునఁ దలపడినను, సమ్మర్దం బుగ్ర మయ్యె సంగ్రామమునన్. 287

క. ధూళులు మేఘంబులుఁ గర,వాలాదినిశాతహేతివర్గాంశుతటి
న్మాలయు గుణరవగర్జలు, గీలాలపువృష్టికిం దగియె నట్టియెడన్. 288

క. పోవులు గట్టినగుజ్జులుఁ, బ్రేవులు నేనుఁగులతఱచుఁబీనుంగులు ర
క్తావిలత వెల్లచీరలు, గావులు నై భటనికాయకాయంబులు నై. 289

క సమరాంగణంబు గడుఘో,రముగా నిరువాఁగుఁ బోరురభసంబున ది
క్సమితి వడఁకాడెఁ బొగడెదు,నమరులయులి వడరెఁ జదల నతినిబిడముగాన్.

క. అనిలజభీష్ముఁడు దమతమ,మొనలకుఁ గన్నాకు లగుచు [1]మునుకొని వడి న
ర్జునకుంభసంభవులప్రా,పునఁ జూపిరి విక్రమంబు భూరిబలంబున్. 291

క. భీమునిదెసఁ గాళింగో, ద్దామగజానీకసంగతత్వస్ఫురణా
భీమగతిం దఱిమెం గురు, భూమీశుఁడు భీష్మగురులు పోరెడుబలిమిన్. 292

చ. అఱిముఱి నీకుమారవరు లత్తఱి నందఱు నాబకారిపై
నుఱక రథంబులం బఱప నుజ్జ్వలశైలము మేఘబృందముల్
గిఱికొనఁ గప్పిన ట్లయినఁ గ్రీడి గుణస్వన ముల్లసిల్ల నే
ర్తెఱ విశిఖప్రతాన మనుతీవ్రసమీరము నేపు సూపినన్. 293

క. ఆరథనివహంబులు న, వ్వారణములుఁ దెరలి మరలి వడిఁ బఱచుటయుం
గౌరవబల మెల్లను రణ, శూరుఁడు గాంగేయుమఱువు సొచ్చె వికల మై. 294

వ. ఇట్లు సేన మొగతిరిగినం గని సుయోధనుండు బరవసంబునం బురికొల్పి చేయి
వీచుచు నగ్గలిక నడచినం గాంభోజగోపాలసింధుగాంధారసౌవీరత్రిగర్తకళింగప్ర
ముఖబలసంగతులై శకునిసైంధవులు దుశ్శాసనుంబురస్కరించుకొని యురవడించి
భీమపార్థులం బొదివిన ధర్మనందనుండు వెన్నుదన్ని యదల్చినం జేదికాశకరూశ
పాంచాలసైన్యంబులతో ధృష్టద్యుమ్నపురోగము లగురథికముఖ్యులు గడంగి
కవిసి రప్పుడు విందానువిందులు గాశిరాజును సైంధవుండు భీమసేనుని వికర్ణుండు
సహదేవునిఁ జిత్రసేనుండు శిఖండిని దుర్యోధనుండు విరటునిఁ ద్రిగర్తులు నకు

1. మున్నుగ వడి.

లుని ద్రోణుండు చేకితానసాత్యకులను గృపహార్దిక్యులు ధృష్టద్యుమ్నుని సౌభద్రుండు సాల్వకేకయులను ధృష్టకేతుఘటోత్కచులు నీకొడుకులం దలపడిరి యుధిష్ఠిరుండు దాను మద్రేశ్వరుం దాఁకె నిట్లు సంకులసమరం బైన నస్త్రశస్త్రసంఘట్టనంబున వెడలుమంటలు మింట నడరి మధ్యాహ్నప్రచండంబులై యున్న చండకిరణుకిరణంబుల మగిడింప నరదంబులు దాఁకి పడి పొరలుకరులును గరిహస్తాకర్షణవిధ్వస్తంబు లగురథంబులును దురగఖురపుటవిఘటితగాత్రులగుపదాతులును బదాతివర్గానర్గళప్రహారధారాళరక్తసిక్తంబు లగుఘోటకంబులు నై చూచుఖేచరులకు వెక్కసం బయ్యె నట్టియెడ. 295

క. భీమునిపోరుట గడు నుద్దామం బై మెఱయుటయుఁ బితామహుఁడు శర
స్తోమవిదారితుఁ జేసె మహామర్షోత్కర్షుఁ డగుచు నతనిం బెలుచన్. 296

క. కనుఁగొని సాత్యకి యేనుంగునకు సిడులు సూపినట్లు కోపంబున భీ
ష్మునిమీఁదఁ గవిసి యుజ్జ్వలసునిశితభల్లంబు లేసె సురలు నుతింపన్. 297

ఆ. అలిగి యతఁడు సూతుతలఁ దెగ సేసిన, నధిప వృష్ణివీరునరద మిట్టు
నట్టుఁ దిగిచె నప్పు డాకులగతి ఘోటకములు దద్బలంబు గలఁగఁబడఁగ.

క. మరలుపుఁడు పట్టుఁ డిటఁ దెండరదమునకు వేగవేగ యడ్డము సనుఁ డా
తురుఁ డయ్యెను సాత్యకి సెచ్చెరఁ జొరుఁ డనునులివు వారిసేనఁ జెలంగెన్.

తే. వికలరథుఁ డగునావృష్ణివీరుమీఁద, నేయ నొల్లక మీతండ్రి యెసక మెసఁగ
బాహుబలమునఁ బాండవవ్యూహవిదళనంబుసేయఁదొడంగెభూనాథముఖ్య.

క. అంత విరాటుఁడు లయకాలాంతకుఁడుంబోలెఁ బేర్చి యతిరభసమునన్
శాంతనవుఁ గదిసి యేసెం, గుంతీసుతు లలర మూఁడుక్రూరాస్త్రములన్. 301

క. ఏసి తురంగంబుల నొ, నేసినఁ గోపించి భీష్ముఁ డిషుదశకమునం
జేసె నతని రక్తజలోద్భాసితగాత్రుఁడుగ రెండుబలములుఁ బొగడన్. 302

వ. అట్టియెడ. 303

శా. గంగానందనుఁ దాఁక నర్జునుఁడు వోఁగా నడ్డ మై రాజు మె
చ్చం గేలీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామపద్బాణవి
ద్ధాంగుం జేసెఁ గిరీటి నవ్వుచుఁ దదీయం బైనచాపంబు ద్రుం
చెం గోదండము వే ఱొకండు గొని యేసె ద్రోణి పెక్కమ్ములన్. 304

క. గురుసుతుబెడిదపుటంపఱ, నరనారాయణులు నొచ్చి నరుకడక
న్నరుణం బగుటయుఁ దద్రుచిపరంపరలతోన నిగిడె బాణచయంబుల్. 305

క. ఉఱక నరుఁ డట్లు మైమఱువఱువుల్లుగఁ జేసి లీల నంగము నెల్లం
బఱియలుగఁ జేయ నాతం, [1]డఱు మెడలక మఱియు నేసె నధికరయమునన్.

క. నొచ్చియుఁ బెనఁగినఁ గృపయును, మెచ్చుఁ గదిరి విప్రుతోడ మెయికొని పోరి

1. డఱుఁ దలఁకక.

ట్లచ్చుపడ నేటి కని వివ్వచ్చుఁడు గ్రేడించి యొండు వలనికి నడచెన్. 307

వ. తదనంతరంబ. 308

ఉ. భీముఁ డుదగ్రదర్పమున భీష్మునిపైఁ జన నడ్డ మై కురు
గ్రామణి భల్లపంచకయుగంబున నాతనిమేను సించుదుర్
భీమదృఢక్షురప్రచయభిన్నతనుండు గఁ జేసె నాతఁ డా
భూమిపు నిట్లు నీదుప్రియపుత్త్రికు లొండొరుతోడఁ బోరఁగాన్. 309

వ. కనుంగొనుజనంబులు. 310

క. చండవిరోధితిమిరహా, ర్తాండు లనఁగఁ దగినవీరు దమలో నిట్లు
ద్దండతఁ బెనఁగుట ధృతరా, ష్ట్రుం డవినయలోభముష్కరుం డగుటఁ జుమీ. 312

వ. అని రట్టిమెడ.

క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ, బురుమిత్త్రుఁడు వేల్పుటేటిపుత్త్రుఁడుఁ బ్రాపై
యురవడిఁ దఱిమిన వారికి, నరనందనుఁ డెదురుపడె గుణధ్వని సెలఁగన్. 313

క. పురుమిత్త్రుని నే డుజ్జ్వల, శరముల గంగాతనూజు సప్తతిబాణ
స్ఫురణమునఁ జిత్రసేనునిఁ, బరమాంబకదశకమున విపాటితుఁ జేసెన్. 314

తే. ఎన్నిశరముల నభిమన్యుఁ డేసెఁ దమ్ముఁ, దారు నన్నియు శరములఁ దఱిమి చిత్ర
సేనపురుమిత్త్రు లతని నేసిరి కవోగ్ర, విశిఖములు నాటె భీష్ముఁ డవ్వీరుమేన.

ఉ. ఆతఁడు చిత్రసేనునిశరాసన మేత్తెఱఁ ద్రుంచి ఘోటక
వ్రాతము నొంచి మైమఱువు వ్రచ్చి శరంబులు మేన గ్రుచ్చి యు
ద్యోతితుఁ డైనఁ జూచి కర ముద్ధతి రాజతనూజవర్గముల్
వే తఱియంగఁ జొచ్చి పొదివెం బటుమార్గణవృష్టి నాతనిన్. 316

క. ఆసౌభద్రుం డుగ్రపు, వేసవి దావాగ్ని శుష్కవిపినమ్ము నిరా
యాసంబుగ దరికొనుగతి, భాసితశరశిఖలు వారిపైఁ బరఁగించెన్. 317

క. రంగత్ప్రథనస్తుత్యతుఁ, రంగముఁ డై తాండవాభిరతుఁ డగుహరులీ
లం గడఁగి వీరనృత్యము, సంగరరంగమునఁ జేసె శత్రులు మెచ్చన్. 318

వ. ఇట్లు పేర్చి కురుబలంబు నేర్చునభిమన్యుం జూచి జనితమన్యుం డై శుభలక్షణుం
డగులక్ష్మణుండు. 319

## అభిమన్యులక్ష్మణకుమారులయుద్ధము.

క. తలపడి నానాస్త్రము ల, గ్గలికం గురియుటయు నతఁడు కాండము లాఱి
ట్టల మైనయలుక నాతని, లలితోరస్స్థలమునం గలయ నాటించెన్. 320

చ. తెరలక లక్ష్మణుండు దృఢదీప్తశరావలి ఫాలపట్టిపైఁ
దొరఁగఁగఁ జేసినం గినిసి తొల్త హయంబులఁ జంపి సారథిన్
ధరఁ బడ నాతఁ డేసె విరథత్వము నొందియు నీదుమన్నఁ డు
ద్ధురగతి శక్తి వైవ నది ద్రుంచె మహేంద్రునిమన్మఁ డమ్ములన్. 321

ఆ. శక్తిఁ ద్రుంచి తీవ్ర।సాయకహతదేహుఁ, జేయఁ దొడఁగునతని।చేతిబలుపు
సూచి కృపుఁడు రాజ।సుతుఁ దన తేరిపై, నిడి తొలంగఁ దెచ్చె। నెల్లఁ జూడ.

క. కురురాజు యోధవీరులఁ, బురికొలుపుచు భీష్ముఁ డపుడు। పోరికి నడరం
గరిహయనరశరనిబిడత, ధరణి జలదనిబిడగగన।తలముం బోలెన్. 323

ఉ. సాత్యకి యప్పు డేచి శర।జాలము చిత్రలఘుస్ఫుటత్వసాం
గత్యవిరాజమానముగఁ గౌరవసేనఁ। గలంగఁ జేసి యా
ద్ధత్యమునం దనర్చిన సు।దాత్తమనస్కుఁడు సౌమదత్తి యా
హుత్యభిరామవహ్నిక్రియ। నుజ్జ్వలుఁడై వెసఁ దాఁకె నాతనిన్. 324

చ. తలపడి యంత్యకాలశిఖి।దారుణభంగి నమేయమార్గణా
ర్చులు వఱఁగించుచుఁ భయము। పొచ్చి జనార్దనుతమ్ముతోఁడియో
ధులు పిలుసన్నఁ దత్సుతులు। దోర్బలదుర్దములై పదుండ్రు న
గ్గలిక నెదిర్చి యిట్లనిరి। కౌరవసత్తముతో నుదగ్రతన్. 325

క. భూరిశ్రవసుఁడ యొక్కటి, వీరవినోదంబు సలుపు। వేడుకమెయి దు
ర్వారత వచ్చితి మొక్కరుఁ, గోరికొనుము సంగరమున।కుఱ్ఱ మాలోనన్. 326

చ. అన విని నవ్వి యొక్కఁడు మ।దస్త్రబలంబున కోర్వఁ డోపినన్
సునిశితబాణముల్ వఱపి। సూరెల నందఱు నొక్కపెట్ట యే
పు నెఱపుఁ డన్న నారథిక।పుంగవు లేయ నతండు నమ్ము లె
ల్లను దునుమాడి వారిఁ జటు।లస్ఫురితాంబకవృష్టి ముంచినన్. 327

క. పొలివోనిశౌర్యరేఖం, జెలఁగుచు వార్ష్ణేయు లతనిఁ। జేడ్పడఁ బెక్క
మ్ముల నొవ్వ నేసినం గడు, నలిగి శరాసనము లెల్ల। నాతఁడు ద్రుంచెన్. 328

క. కోదండదశకశీఘ్ర, చ్ఛేదం బొనరించి యపుడ। శిరములు పదియుం
భూదేవికి బలిగా ని, ష్పాదించెం గౌరవేంద్ర।బలములు సెలఁగన్. 329

వ. ఇట్లు వడినకొడుకులం గని వృష్ణివీరుండు. 330

చ. వగపును గోపముం గదుర। వైరిబలంబు దలంకఁ దేరుపై
నొగ నొగ దాఁకఁగాఁ బఱపి। నుగ్గుగఁ గౌరవసూతు నేసి బె
ట్టుగఁ దురగంబులం దునుము।దుం వెస నాతఁడు నట్ల చేసెఁ బా
టిగఁ గరవాలముల్ గొని వ।డిం దిగి నేలకు దాఁటి రిద్దఱున్. 331

వ. అట్టిసమయంబున. 332

ఆ. వేగ మెయిది వృష్ణి।వీరు భీముఁడు గురు, వీరుఁ గురువిభుండు। గారవమున
వెనుకఁ జనఁగఁ దివిచి। తనతనరథముపైఁ, బెట్టికొనుచుఁ దొలఁగఁ। బ్రీతిఁ జనిరి.

వ. అంత. 334

క. అపరాహ్ణసంగతుం డగు, తపనుం గని ప్రొద్దు గ్రుంకెఁ। దడ వేఁగుదు రీ

రిపు లని కడంగి నరుఁ డ, స్త్రపరంపర వఱపి నీదు ✱ రథికుల నెల్లన్. 335

వ. నిహతులం జేయుచు విహరించు చున్నం గనుంగొని. 336

క. సైరింపక యేడ్తెఱఁ గురు, వీరాగ్రణి యిరువదేను ✱ వేలరథంబుల్
పోరికిఁ బురికొలిపిన వి, స్ఫారగతిం గూడి కవిసెఁ ✱ బార్థునిమీఁదన్. 337

క. కదువెసఁ గవిసినయవి గ, వ్వడి బాణజ్వాల లడర ✱ వడి దావాగ్నిన్
మిడుతలు వాలిసినక్రియఁ బొడి, పొడి యయ్యెం గురుబలంబు ✱ పొంగడఁగంగన్.

క. కిరణంబు లడఁగి యంతకు, నరుణత్వము మెఱయఁ దరణి ✱ యపరాద్రిశిరః
స్ఫురణను నధికరణాలం, కరణం బొనరించుటయును ✱ గాంగేయుఁ డెడన్. 339

క. శ్రాంతం బయ్యెను వాహన, సంతానం బెల్ల నిపుడు ✱ సంధ్యాసమయం
బింతట నేఁటికి నని సా, లింతము గా కింకఁ బోర ✱ లె సైన్య యున్నే. 340

వ. అని తలఁచి కుంభసంభవాదియోధముఖ్యుల కెఱింగించి బలంబులఁ దివియ నియమించి. 341

క. సమరక్రీడనలీలం, దమక తమక తనిసి మరలి ✱ తమతమయావా
సములకు నరిగి రుభయసై, న్యములజనంబులును దీవి ✱ యలు వెలుఁగంగాన్. 342

తే. రెండువీళ్లజనంబులు ✱ రేలు వివిధ, హృద్యసంగీతములను సా✱హిత్యమధుర
లలితగోష్ఠీవినోదంబు✱లను బ్రమోద, భరితు లై ప్రొద్దుపుత్తురు ✱ భరతముఖ్య.

భీష్మనిషష్ఠదివసయుద్ధక్రమము.

వ. ఏనవనాఁటిరాత్రి సనుటయుం దెలతెల వేగునప్పుడు ధనంజయుండు సేనాపతి రావించి మకరవ్యూహంబు సంఘటింపు మని నియమించిన నఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతం డమ్మోహరంబు దీర్చు నెడ దానికిఁ బార్థపాంచాలపతులు శిరంబును గవలు గన్నులును భీమసేనుండు దుండంబును సౌభద్రద్రౌపదేయఘటోత్కచులుగండస్థలంబులును సాత్యకిసహితుండై యుధిష్ఠిరుండు గంఠంబును ధృష్టద్యుమ్నపురస్సరంబుగా విరాటుండు వెన్నును గేకయులు వామపార్శ్వంబును ధృష్టకేతుండును గరూశపతియును దక్షిణపార్శ్వంబును గుంతిభోజశతానీకులు జఘనంబును శిఖండియు నిరావంతుండును బుచ్ఛంబును నై పన్నిరి భీష్ముఁడు దానికిఁ బ్రతివ్యూహం బూహించి క్రౌంచవ్యూహం బమర్చి యందుఁ జంచువునం దాను గురుసహాయుం డై నిలిచె నేత్రంబులఁ గృపగురుపుత్త్రులును మస్తకంబునఁ గృతవర్మయుఁ గాంభోజబాహ్లికులును గళంబున శూరసేనపరివృతుండై సుయోధనుండును నురంబున సౌవీరసమేతుండై భగదత్తుండును వీఁపున విందానువిందులును వామపక్షంబున సుశర్మయు దక్షిణపక్షంబున యవనపతియు నపరభాగంబున శ్రుతాయురుపేతుం డై భూరిశ్రవసుండును నిలిచి రి ట్లుభయసైన్యంబులు సన్నద్ధంబు లై నడచి శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు [illegible] పట్టిసమయంబున. 344

క. తలకడచి నడచు ద్రోణుని, యలవుఁ జలంబును సహింప – కనిలతనయుఁ డి
ట్టల మగురోషంబునఁ ద,ద్బలముపయిం బఱపె రథముఁ – బటువేగమునన్.

వ. ఇట్లు వఱపిన నతనికో ల్తలకుం గాక. 346

క. తనముందటి యోధులు పిఱు,సనుటయుఁ గుంభజుఁడు గినిసి – శరసవకము భీ
మునిమేన నాట నాతఁడు, సునిశితభల్లమున నతని – సూతుం దునిమెన్. 347

క. వాహనముఁ దాన నడపుచు, సాహసికత్వమున గురుఁడు – సమరక్రీడో
త్సాహము వదలక వైరి,వ్యూహము దలఁకంగ భుజస – ముద్ధతిఁ గవిసెన్. 348

క. మీతండ్రి ద్రోణునకుఁ దో, డై తఱిమినఁ గేకయులు భ – యాకులత మరు
ద్ధూతాంబుదగతిఁ దెరలఁగ, నాతతసృంజయబలంబు – లఱిముఱి విఱిగెన్. 349

ఆ. అధిప భీమసేనుఁ – డడరినఁ గౌరవ, సైన్య మతనిచేతఁ – జాఁపకట్టు
వడియె నపుడు ధరణి – పతు లిద్దఱును జేయి, వీచి తఱిమి రధిక – విక్రమమున.

వ. ఇవ్విధంబున ధర్మనందనదుర్యోధను లగ్గలికం బురికొలుప మొగ్గరంబులు రెం
డును గండు మిగిలి తలపడియె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

ఆ. మనబలంబునందు – మంచిమగల్ సాలఁ, గలిగి యాబలంబు – గెలువ లేమి
దైవకృతముగా దె – తలఁపఁ జోద్యము మున్న, యెఱుఁగఁ జెప్పె విదురుఁ – డిట్టులగుట.

క. అతఁ డెంత సాటి చెప్పిన, మతిహితముగఁ గొనఁడు కీడు – మానఁడు కడుదు
ర్మతి యైననాతనూజుఁడు, మతి గర్మము వెనుకఁ జనక – మానునె యెందున్.

వ. విధికృతం బెవ్వరికి నుడుప వచ్చు నెట్లు గానున్నది య ట్లయ్యెడుం గాక యనిన
సంజయుం డతని కిట్లనియె. 354

ఆ. నీతనూభవుండు – నెఱిగుఱి యెఱుఁగమి, యెఱిఁగి యెఱిఁగి యతని – నేల చెప్ప
మనయుపేక్షవలన – విను నాఁటిజూదంబ, నేఁడు గయ్య మయ్యె – నృపవరేణ్య.

వ. ఇంకం బశ్చాత్తాపం బుడిగి ధీరుండ వై సమరప్రకారంబు విను మట్టియెడ భీమ
సేనుండు భవత్సేనాసాగరంబు పాయ వడం దఱిమి చొచ్చి దుశ్శాసనుండును
దుర్విషహుండును దుర్మదుండును దుస్సహుండును జయుండును జయత్సేనుండును
వికర్ణుండును జిత్రసేనుండును సుదర్శనుండును జారుచిత్రుండును సువర్మ్ముండును
దుష్కర్ణుండును నొక్కచో నున్నం గనుంగొని యక్కుమారులం దాఁకిన.

తే. వార లందఱు నొండొరుఁ – బేరు వేరఁ, బిలిచికొని వీఁడె చనుదెంచె – భీముఁ డీతఁ
డొంటి యగపడ్డచోటన – యుక్కడంగఁ, బొదివి చంపుద మని యతి – సంస్ఫురణసేసి.

క. ఉగ్రగ్రహములు లయకా,లగ్రహపతిఁ బొదువు క్రియ న – లఘువిక్రమగ
ర్వాగ్రహమున ముట్టిరి రిపు,నిగ్రహలంపటుని భీము – నిం జటులగతిన్. 358

వ. ఇట్లు నీకొడుకులు చతురంగబలంబులతోడం జుట్టు ముట్టిన వృకోదరుండు సంత
సంబునం బొదలి సారథిం గనుంగొని నీ వీరథం బిచ్చట నిలిపికొని యుండు మని
నియోగించి గద పుచ్చికొని ధరణికి లంఘించి. 359

చ. కవిసి యుగాంతదండధరుకైవడిఁ గోలుమసంగి కుంభముల్
పవులఁగఁ దుండముల్ దునియఁ బ్రక్కలు ప్రక్కలు గాఁగ దర్పముం
జవము బలంబు నొప్పఁగ గజంబుల వ్రేసిన నెత్తు రొల్కఁగా
నవి వడె ధాతునిర్ఝరమయాచలపంక్తులఁ బోలి మేదినిన్. 360

క. అరదంబులు పొడిపొడియై, హరులగములు నుగ్గునూచయై మొత్తపుఁగా
ల్వురు సిదురుపలై పడ నిష్ఠురగతి విహరించె వాయుసూనుఁడు గదతోన్.

క. పెక్కండ్రతోడ నిమ్మెయి, నొక్కరుఁడ రథమ్ము డిగ్గి యురవడిఁ జని పే
రుక్కునఁ బోరుట సూడఁగ, నక్కజమై యుండెఁ గౌరవాన్వయముఖ్యా.

ఆ. భీమసేను నపుడు పెక్కుబలంబులు, పొదువు టెఱిఁగి ద్రుపదపుత్త్రకుండు
శస్త్రగురునితోడ సరభసవృత్తిమైఁ, బోరి పోరి యుడిగి బుద్ధి గలఁగ. 363

క. భూరిరయంబున నద్దెసఁ, దేరు వఱపఁ బనిచి యతని తేరిపయిం ద
త్సారథిఁ గాంచి శోకము, గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. 364

తే. ఆర్తుఁడై యవ్విశోకుని నడిగె భీముఁ
డెచట నున్నాఁడు నాయొడ లెట్లు-ప్రాణ
సహితమై యుండు నతఁ డొకచందమైన
నేమిగతిఁ బోదు నక్కట యెఱుఁగఁ జెపుమ. 365

వ. అనిన విశోకుండు ధృష్టద్యుమ్నున కిట్లనియె. 366

చ. గొదగొని ధార్తరాష్ట్రు లతిఘోరవిధంబునఁ జుట్టు ముట్టిన
న్మదమునఁ దేరు డిగ్గి హరిణంబులపైఁ జనుసింహమో యనన్
గదఁ గొని నన్ను నియ్యెడ నకంపితసుస్థితి నిల్పఁ బంచి పె
ట్టిదముగఁ జొచ్చె నాహవపటిష్ఠుఁడు భీముఁడు వారిసైన్యమున్. 367

ధృష్టద్యుమ్నుఁడు భీమసేనునకుఁ దోడ్పడుట.

వ. అని యవ్వల నెఱింగించిన నతండు. 368

క. కడువడిఁ జని యంతంతం, బుడమిఁ బడినకరులగములు పొరలుటకతనన్
వడముడి యరిగిన తెరు వేర్పడఁ గని వేవేగ రథము వఱపెం గడియన్. 369

వ. ఇట్లు భీమసేనుఁ జేరం బోయి. 370

క. ఇదె యేనుఁగూడ వచ్చితిఁ, బదిలుఁడవై పోరు మింక బకమర్దన యీ
కదిసినవీరుల నెల్లం, గుదియించెద ననుచుఁ గవిసెఁ గురువితతిపయిన్. 371

క. అత్తఱి నీతనయుం డెలుఁ, గెత్తి గథికవరులతోడ నిట్లను నీదు
ర్వృత్తునిఁ బొదువుఁడు భీముని, యుత్తలపాటుడుపు కడఁక నుడువుఁడు గడిమిన్.

వ. అనిన విని యోధవీరులుం గుమారులు నొక్కపెట్ట ధృష్టద్యుమ్నుం బొదివిన
నతండు ద్రోణదత్తప్రమోహనబాణంబున వారి నందఱ నిశ్చేష్టితులం జేసిన న
ప్పుడు దప్పిదీర్చికొన నెడ గని యనిలనందనుం డొక్కమడువున మధురశిశిరజలం

బులఁ బానంబుసేసి యుల్లసిల్లి యాద్రుపదపుత్త్రుం గూడికొనియె నట్టియెడ [1]నాచా
ర్యుండు గయ్యంబు సేయుచునుమున ధృష్టద్యుమ్నుండు దొలంగిన తెఱపిం గది
యఁ బాంచాలపతి దఱిమిన నప్పు డగ్గురుండు నవ్వుచు. 373

తే. అస్త్రవర్షంబుఁ గురియంగ నతఁడు పూర్వ, వైరబంధంబుకతన దుర్వార మైన
యతనిరోషంబు సైరింప నలవి గాక, జడిసి పోయిన నాతండు శంఖ మొత్తె.

వ. ఇట్లు ద్రోణుండు ద్రుపదుం దెరల్చి ధృష్టద్యుమ్ను చనినవల నరసి తదీయ
ప్రమోహనమార్గణమూర్ఛితం బయినశూరలోకంబు నాలోకించి కరంబురయం
బునఁ బోయి. 375

క. వినుతప్రజ్ఞాబాణం, బున మోహనబాణశక్తి వోఁ జేసిన సం
జనితప్రాణోజ్జ్వలు లై, యనికిం గ్రమ్మఱఁ గడంగి రయ్యోధవరుల్. 376

వ. ఇవ్విధంబున నాచార్యప్రాపునం జేసి యేచి నీకొడుకులు పవనద్రుపదులకొడుకుల
పై నడరినం గని యుధిష్ఠిరుండు కేకయులేవురను ద్రౌపదేయులను ధృష్టకేతునిం
జూచి మీ రభిమన్యుండు ముంగలి గా రథంబులు వఱపి భీమసేనధృష్టద్యుమ్ను
లకుఁ దోడుపడుం డని పంచిన. 377

క. ఆపన్నిద్దఱు సైన్యా,టోపసమేతముగఁ గవియుడును బాంచాల
క్ష్మాపాలసుతుఁడు భీముఁడు, నేపారిరి నీదుసేన యెసకం బడఁగన్. 378

వ. తదవసరంబున. 379

తే. క్రందుఁగయ్యంబులోన నరాతిభయద, బాహువిక్రమ నీ విట్లు పాదచారి
వగుట వల దని కేకయునరద మెక్కఁ, బనిచె భీముఁ బాంచాలపతిసుతుండు.

క. అప్పుడు మధ్యందినమున, నొప్పినయినుతోడఁ జాల నొర వచ్చి గురుం
డప్పాండవబలములపై, దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రముగాన్. 381

చ. కనుఁగొని పార్షతుం [3]డపుడు గట్టుపకా సయి వీఁకఁ దాఁకినం
దునిమె నతండు తద్ధనువుఁ దోడన పెక్కుశరంబు లేసె నా
తనిమెయి నొండువిల్లు ద్రుపదక్షితిపాలసుతుండు గ్రక్కునం
గొని శరసప్తతిం గురిసి కోపముఁ బెంచిన నాతఁ డుగ్రతన్. 382

క. ఆవిల్లు ద్రుంచి రౌద్రర,సావేశం బొప్ప నాలుగమ్ముల రథవా
హావలిని సూతు నొక్కట, దేవగణము వొగడ వసుమతిం బడ నేసెన్. 383

మ. విరథుం డై యభిమన్యుతేరిపయికిన్ వేగంబ పాంచాలభూ
వరసూనుం డరుగం దదీయబల మోర్వం జాల కొక్కుమ్మడిన్
మరలం బాఱె నతండు వాయుసుతుఁడున్ మానింప మానింప న
ష్ట రథానీకముతోడ భీముఁ బొదివెన్ భూమీశ్వరుం డుద్ధతిన్. 384

---

1 నాచార్యకయ్యంబు. 2 జూడ 3 డు గురుకట్టుప.

## ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితో యుద్ధము సేయుట.

తే. అంత నొండొక సారథి - యతిరయమునఁ
జటులహయములఁ బూన్పఁ బాంచాలసుతుఁడు
దనరథమునకు గ్రక్కునఁ - జని పరాక్ర
మాభిరాముఁడై గురునిపై - నడరెఁ బెలుచ. 385

వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు గడంగి యెప్పటియట్ల కుంభసంభవుతోడం బెనంగు చుండ భీమసేనుండును. 386

క. తనయరదంబు విశోకుఁడు, గొని వచ్చిన నెలమి నెక్కి - క్రూరోత్సాహం
బునఁ దనుఁ బొదివినదుర్యో,ధనుమీఁద నిశాతవిశిఖతతి నిగిడించెన్. 387

క. కురుపతి యొకనారాచం, బురమున నాటింప భీముఁ - డుగ్రత నేసెన్
గురుతరశరత్రయంబునఁ, గరములు వక్షమును నాటఁ - గౌరవనాథున్. 388

వ. దాని కతండు చలింపక వృకోదరుపై వివిధశరంబు లేసె నతనితమ్ములు దలకడచి యాభీమసేనుం బట్టికొన నుత్సహించి యెప్పటియట్ల బెట్టిదంబుగాఁ గవిసినం గని యక్కుమారుల నభిమన్యుద్రౌపదేయులును ధృష్టకేతుకేకయులునుం దాఁకి రట్లు వారును నమ్మారుతియుం గూడి దారుణభంగిం దఱుముట సైరింపం జాలక. 389

క. విఱిగి భవత్సుతనివహం, బఱిముఱిఁ గనుకనిఁ జనంగ - ననిలసుతుం డే
డ్తెఱ నెగచి వగచె వారం, దఱుఁ దనచేఁ జచ్చు టపుడు - దప్పుటకుఁ గడున్.

క. తమ్ములఁ దోలిన నతిరౌ, ద్రమ్ముగఁ గోపించి యన్న - దలపడియెను సై
న్యమ్ముఁ బురికొలిపికొని రథ, సమ్మున భీమాదియోధసంఘముతోడన్. 391

క. అపరాహ్ణసమయమున న, ట్లుపమాతీతాతిఘోర - యుద్ధం బయ్యెన్
రిపుభయదభుజుఁడు భీమున, కపరిమితబలుండు గురుధరాధీశునకున్. 392

సీ. తదవసరంబునఁ - బొదివి వికర్ణుండుఁ, జిత్రసేనుఁడుఁ బార్థపుత్త్రుమీఁదఁ
గవిసిన నతఁడు వికర్ణురథ్యంబులఁ, గూల్చి యాతనిపయిఁ - గుప్పెకోల
లిరువది నాటింప - నరదంబు డిగి భీతి, యూన నాతఁడు చిత్రసేనురథము
పై కేఁగె ద్రౌపదీపట్టు లేవురు భీము, నకు నడ్డపడి కురునాథుఁ దాఁకి

తే. మేను నెత్తురు వఱ్ఱుగా - మెఱుఁగుటమ్ము
లేయ వారలఁ దలపడి - యేనునార
సముల రారాజు నో నేసి - సరభసముగఁ
దఱిమె గాంగేయుఁ డరిసేనఁ - దఱియఁ జొచ్చె. 393

క. చొచ్చి చతురంగవితతులు, విచ్చునటులు సేయుటయును - వివ్వచ్చుఁడు వే
వచ్చి తలపడినఁ బురికొని, యచ్చట నిరువాఁగు సట్ట - లాడం బోరెన్. 394

ఉ. రక్తనదులలోన - రథయానసపాత్రముల్, నడపి యోధవరులు - బాహుబలము
వెలయ సమరకేళి - సలిపిరి శూరత, నేచి కడఁగి యోల - రాచి రాచి. 395

వ. అంత నరుణకిరణుం డన్వర్థాభిధానుం డగుచు వచ్చిన వేగిరపడి వాయునందనుండు సుయోధను నేఁడ సమయింతు ననుసంరంభంబున నతనికి సమ్ముఖంబుగాఁ దేరు వఱపించి కదిసి క్రోధమోదంబులు మనంబునం బెనంగొన నతనిం గనుంగొని.

సీ. కడుఁ బెద్దకాలంబు గాంక్షించి యున్నయు,త్సవ మిపు సమకూర దైవ మిచ్చె
గొంతిసంకటపాటుఁ గోడలిబన్నంబుఁ, దీర్చెదఁ గృష్ణుండు దెలుప నీవు
సరకు సేయమియును సభలో నులూకునిఁ, బంచి యాడించిన[1]పరుసములును
గ్రక్కించి బీరంబు దక్కించుకొన నీక, తెగఁ జూడఁ గాంచితి మగతనంబు
తే. గలిగి మగుడక నిలుమని పలికి యుగ్ర,గతి నెదుర్కొని రథతురంగములసూతుఁ
జంపి చాపంబు ద్రుంచి విస్ఫార కేతు,దండ మేర్తెఱ నఱకె భీముండు సెలఁగి.

ఉ. వేఱొకవిల్లు పుచ్చికొను వేగములోనన కౌరవేంద్రు మై
దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం
దూఱినయట్లుగాఁ బ్రబల దోర్బల మేర్పడ నేయ నెమ్ములన్
గీఱిన మూర్ఛ వచ్చి యొఱగెం దఱచై రుధిరంబు గ్రమ్మఁగన్. 398

వ. అట్టియెడ జయద్రథుండు రథికవరులతోడం గడంగి వడముడిపై నడరె నప్పుడు కృపాచార్యుండు దుర్యోధనుఁ దనరథంబుమీఁదం బెట్టికొని తొలంగం గొని పోయె నభిమన్యుండును ద్రౌపదేయులును గేకయులును మారుతిని మీఱి సైంధవుం దలపడినఁ జిత్రసేనుండును జిత్రుండును జితాశ్వుండును జారుచిత్రుం డును సులోచనుండును నందుండును నుపనందుండును రౌద్రంబుగా సౌభద్రుం బొదివిన. 399

క. బలియుఁ డగుపార్థపుత్త్రుఁడు, వల నేర్పడ నొకని నొకని వడి నైదైద
మ్ముల నేసి నొంప వారలు, దలఁకక వెస ముంచి రస్త్రధారల నతనిన్. 400

వ. సహోదరులకు సహాయత్వంబు సేయం బూని మున్న విరథుం డై పోయిన వాఁ డగుటం జేసి. 401

చ. లఱిమి వికర్ణుఁ డపు తనుఁ దాఁకిన నాయభిమన్యుఁ డల్గి బి
ట్టఱ విలు ద్రుంచి సారథి వఱడం దురగంబులఁ జావ నేసి క్రొ
మ్మెఱుఁగులతోడఁ దధ్వజము మేదినిఁ గూలఁగఁ జేసి యంగముల్
గిఱికొన బాణముల్ నినిచెఁ గేలిమెయిం బటుదర్ప మేర్పడన్. 402

వ. ఇట్లు నొచ్చినవికర్ణుం గనుంగొని కురుకుమారు లొక్కపెట్ట కవ్వడికొడుకుపై నురవడించిన. 403

ఉ. ఏవురు ద్రౌపదేయులును నేర్తెఱ నాతని కడ్డ మై తురం
గావళి నొంచియుం బడగ లన్నియుఁ ద్రుంచియు నంపవానలం
జేవ సెడంగ ముంచియును జేడ్పడఁ జేయఁగ నీతనూభవుల్

1 పరుసఁదనముఁ.

వోవక వారితో మఱియుఁ బోరిరి సిగ్గున బీర మెక్కఁగన్. 404

వ. అట్టియెడ నకులనందనుం డగుశతానీకుండు బహుప్రకారబాణంబుల వివిధవిక్రమక్రీడ సలుపుబలుపుఁ గనుంగొని కేకయపాంచాలపతులు బాసటయై చటులతరతురంగమాతంగస్యందనసందోహంబులం బఱపి కడిమి నెఱపి రిప్పుడుసునం బ్రతివీరుల నఱుముటయు నప్పుడు పతంగుండు పశ్చిమాచలశృంగంబుమఱుంగు పడుటయుం జూచి గాంగేయుం డంత్యకాలకాలాకృతిం గడంగి పటువిశిఖవితానంబుల వేఁడిమి సూపి యమ్మోహరంబు దెరల్చి తనమొనల మరల్చికొని సమరంబు సాలించి శిబిరంబున కరిగెఁ బాండుసూనులును మేనులు వెడవెడ చెమర్ప విడిదలకుం జని రని యిట్లు సంజయుండు డాఱవదివసంబునాహవంబు తెఱంగెఱింగించె నప్పుడు. 405

క. కిమ్మీరమర్దనునిచే, నిమ్మెయి నోటూరఁ బెక్కు లేటులు వడి దర్ప మ్మెడలి మూర్ఛమునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురునాథుఁ డెట్లు గడఁగెనొ యనికిన్.

వ. అని సకౌతుకంబుగాఁ బలికిన. 407

ఉ. భూరితపోవిశేషపరిపూరమృదుస్థిరహృత్కరండవి
స్తారనివాసతంత్రఘనసారవిధాపరమాభిరామశే
ఖారమణీయ లోకహితకారిమహాకరణీయ ఘోరసం
సారదురామయాపదవసాయక నిత్యఫలప్రదాయకా. 408

క. పారాశర్యప్రముఖో, దారమునీంద్రాంతరంగధామాంతర్వి
స్ఫారప్రభాపటలవి, స్తారోజ్జ్వలదీపరూపతా స్తవనీయా. 409

మాలిని. అసురదళనలీలావ్యాప్తిదీప్తారశోచి
ర్లసితపరశుగాఢాలంకృతపౌఢిముద్రా
[1]భ్యసనమహితబాహాప్రస్ఫురత్కాంతిహృద్యా
హాసనసురభివిద్యా హంసనాద్యైకవేద్యా. 410

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజితిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు ద్వితీయాశ్వాసము. 411



1 వ్యసన.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## భీష్మపర్వము - తృతీయాశ్వాసము.

---



విలసనత్వగుణగౌ
రీవిభ్రమరమ్యచాతురీస్వీకృతస
ద్భావ నిరుపాధికానం
దావహకరుణానుభావ ! హరిహరనాథా.

### భీష్మగాంధారేయులసంవాదము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. భండనంబునఁ దనయుండు ! గండడంగి, పోక విని తీవ్రఖేదంబుఁ ! బొంది యంబి
కాతనూభవుఁ డప్పు డా ! సూతపుత్త్రు, నడిగె నుత్తరవర్తన ! మాదరమున. 3

వ. అడుగుటయు నతం డతని కిట్లను నాఁటిరేయి గాంగేయుతోడ గాంధారేయుండు,

ఆ. మనము పూఁచి పట్టి ! మొన లేర్చికొని పోవఁ, బాండురాజసుతుల ! బలము గవిసి
గాసిచేయ నదియుఁ ! గాక నీముందటఁ, బవనతనయుచేత ! భంగపడితి. 5

క. నినుఁ గొని గెలిచెదఁ గుంతీ, తనయుల నని యున్నతలఁపు ! దప్పించెదు ని
వనిమిషుల నైనఁ జేకొన, వని మొన వా రింతబలియు ! రగు టేమియొకో. 6

క. అనిన విని నవ్వి యతఁ డి, ట్లను నిం తననేల నన్ను ! నని నాయొడ లో
మినచోటుఁ గలదె పెఱయో, ధని కాయం బైన నకట ! [1]తలఁకదె చెప్పుమా. 7

వ. పాండవుల గెలువ నలవి గా దని యెప్పుడుం జెప్పుదు నైన [2]నఱ లేక నీకు
జయంబు గోరి పోరెద వగవ కుండుము. 8

### భీష్మునిసప్తమదివసయుద్ధక్రమము.

క. అన విని యూఱడి నిద్రా, జనితసుఖం బంది రేపు ! జనపతి యనికిం
జనుటయు భీష్ముఁడు బల మె, ల్లను నెఱయఁగఁ దీర్చె మండలవ్యూహముగన్.

వ. అందు నడుమ నరనాథుం డొప్పి యుండెఁ దమ్ములుఁ జేయుం గలదొరలును
సూరెల నిలిచి రంతం బాండవులును భండనంబునకు వెడలి రయ్యుధిష్ఠిరుండు
మన మొనలం గనుంగొని వజ్రవ్యూహంబు గల్పింపు మని సేనాపతిం బనుప

---

1 తలఁకనె; తలఁపదె. 2 నొర; నోర.

నరుఁడును దత్ప్రకారంబున సైన్యంబు సన్నద్ధంబుసేసిన నది పరబలంబు మెచ్చక
తఱిమి తూర్యధ్వను లెసఁగం దాఁకె నప్పుడు ద్రోణుండు విరాటుని ద్రౌణి
శిఖండిని దుర్యోధనుండు ధృష్టద్యుమ్నుని మద్రపతి గవలను విందానువిందులు
యుధామన్యునిఁ బెక్కండ్రు రాజులు బీభత్సుని మార్కొనిరి భీమసేనుండు కృత
వర్మను సౌభద్రుండు చిత్రసేనదుశ్శాసనవికర్ణులను ఘటోత్కచుండు భగదత్తుని
సాత్యకి యలంబుసుని ధృష్టకేతుండు భూరిశ్రవసునిఁ జేకితానుండు కృపాచార్యు
ని ధర్మసూనుండు శ్రుతాయువును బలువురు భూపతులు భీష్మునిం దలపడి రట్టి
యెడఁ గృష్ణునితో జిష్ణుం డి ట్లనియె. 10

తే. భీష్ముఁ డొడ్డన మేర్చిన బెడఁగు సాల, నొప్పెఁ గౌరవయోధుల యుబ్బు మెఱసె
నృపులనేకులు నామీఁద నిగిడి రేను, జిక్కువఱిచెదఁ జూడుమీ యుక్కుమడిచి.

వ. అని పలికి గొనయంబు సారించి. 12

క. జననాథులపైఁ బెల్లే,సిన వారలు నొక్కపెట్ట చెలఁగి ముకుందా
ర్జునులఁ బటుబాణవర్షం,బున ముంచిన నార్చె నీదుపుత్త్రబలంబుల్. 13

వ. అప్పు డింద్రనందనుండు గోపించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 14

మ. అది యాబాణము లెల్ల మాన్చి నరనాథాంగంబులన్ గీఱి యు
న్మదశుండాలహయాళిఁ గూల్చి రభసోన్మాదక్రియన్ సంభ్రమ
ప్రద మై మందర మంబుధిం గలఁచుదర్పం బొప్ప నొప్పించుడుం
డదనీకంబులు వాఱి భీష్మరథ మాధారంబుగా నిల్చినన్. 15

వ. త్రిగర్తపతి మొదలయిన యమ్మహీపతులుం దెరలి తమతమసైన్యంబులు సన్న
నెలవులకుం జని యొదుంగుటయు గాంగేయుండు గడంగుటయుం గని రాజు
లతో రారా జి ట్లనియె. 16

క. సేనాసమేతుఁ డగునరుఁ, పై నొక్కఁడ భీష్ముఁ డడర బలువిడిమైఁ దో
డై నడవ పలదె యింతటి, మానుసులకు నేను జూడ మరలం దగునే. 17

వ. అనిన విని యాభూపాలనికరం బాలంబునకు నూలుకొని సురనదీసూను నిరు
గెలంకులం గూడికొనియె నప్పుడు. 18

సీ. గురుఁడు విరాటునికోదండకేతుదం, డంబులఁ ద్రుంచె రెండంబకముల
నతఁడు వేఱొకవింట నాచార్యుమేనును, సూతుని మూఁడేసిసునిశితాస్త్ర
ముల నొంచి ఘోటకమ్ముల నాలుగింట నో,నేసి చాపము సిడమెడల రెంట
నేసిన నతఁడు ద న్నెనిమిదియమ్ముల, విరథుఁ జేసిన సుతునరద మెక్కి

తే. యతఁడు దానును గూడి వాలంపవెల్లి
ముంచుటయుఁ గుంభజుండు గోసించి దొడ్డ
నారసం బేయ నమ్మత్స్యనాథతనయు
నురము వడిఁ గాడి వీఁపున నుచ్చి పోయె. 19

వ. ఇట్లు కూ్రరనారాచంబు నెట్టు దాఁకిన. 20

క. విల్లును నమ్ములు విడుచుచుఁ, ద్రెళ్లుటయును శంఖుఁ జూచి ధృతి గలఁగి జనం
బెల్లను జూడ విరాటుఁడు, దల్లడమునఁ బాఱ విచ్చెఁ దత్సైన్యంబుల్. 21

వ. అట్టిసమయంబున శిఖండి గురుపుత్త్రఫాలంబునఁ బటునారాచత్రయంబు నాటిం
చిన నతం డలిగి యొక్కపెట్ట పెక్కమ్ములఁ దురంగసూతకేతుచాపంబుల నుగ్గు
సేసినం బలకయు వాలునుం గొని నేల కుఱికి పాంచాలనందనుండు సాళువంబు
చందంబునం గవిసి యశ్వత్థామ యేయుబాణంబులు గృపాణంబునఁ ద్రుంచు
చుం గదిసిన నతండు కోపించి. 22

తే. పలక పఱియలుగాఁ జేసి యలుఁగు దునిమి
యొడల వాలంపపొది నింప నొల్లఁబోక
ద్రుపదపుత్త్రుండు గరవాలు దునియ వైవ
నడుమఁ బొడి సేసె నాచార్యనందనుండు. 23

వ. శిఖండియు సాత్యకిరథం బెక్కెఁ దదవసరంబున ధృష్టద్యుమ్నుండు. 24

ధృష్టద్యుమ్నుని చే దుర్యోధనుండు విరథుఁ డై పోవుట.

క. శరములు గురుపతిమీఁదం, గురిసిన నతఁ డతనిమేనఁ గ్రూరాస్త్రంబుల్
సరభసమున నింపఁగ స, త్వరముగ నాద్రుపదసుతుఁడు దచ్చాపంబున్. 25

వ. తుండంబులు గావించి. 26

క. మఱియు నొకవిల్లు గొనుసఁ, [1]త్రెంచిన విరథుఁడుగఁ జేయ ధృతిఁ గరవాలం
బుఱక గొని విభుఁడు నేలకు, నుఱికి యతనిమీఁద నడరె నుగ్రాకృతి మై. 27

వ. అట్టియెడ సౌబలుండు రయంబున నెయిది యన్నరపతిం దనరథంబుమీఁదికిఁ
దిగిచికొని పోయె సాత్యకి యలంబుసుని నలఘువిశిఖవృష్టిం బొదివిన నద్దనుజుం
డర్ధచంద్రబాణంబునఁ దద్బాణాసనంబు దుండంబులు సేసి యంగమ్ముల వాల
మ్ములు గీలించి మాయ లొనర్చి యతిఘోరంబుగాఁ బేర్చిన నాశినివంశవరుం
డచలుం డై యైంద్రాస్త్రప్రయోగంబున నమ్మాయ మాయించి యతని వెగడు
పఱచిన నతఁడు వెఱచఱచి పఱచిన నయ్యాదవసింహుండు సింహనాదంబు
సేసి కురుబలంబులపయిం గవిసె నప్పుడు. 28

క. కృతవర్మ యేచి మారుత, సుతుపయిఁ దఱుముటయు నతఁడు సూతునిఁ దురగ
ప్రతతిం బడ నేసి మహో, ద్ధతి మార్గణమయము సేసెఁ దద్గాత్రంబున్. 29

వ. ఇట్లు విరథుండును విశిఖక్షతదేహుండును నై యతం డేదు వెరిఁగినట్లు నీదు
మఱంది యగునృపకునరదంబుమీఁది కరిగె ననిలతనయుండును మనగజఘటల
నైపెఁ బటురయంబునం దనరథంబుఁ బఱపె ననిన విని ధృతరాష్ట్రుండు సంజ
యున కి ట్లనియె. 30

---

1. త్రెంపిం గని విరథుఁ జేయ.

క. విఱుగుట నొచ్చుట మనదెసఁ, దఱచుగ నాడెదవు పాండుతనయులబల మే
డ్తెఱ దఱుఁగక పెనఁగుట పల్కు, మఱుఁ జెప్పెద వకట యేమిమాయయొ తలఁపన్.

వ. అనిన విని సంజయుం డతని కిట్లను మనవారుఁ దా మోపినభంగిం బెనంగుదురు సముద్రంబు సొచ్చినయేఱులుం బోలెఁ బాండవసేనం జొచ్చి తమదర్పంబులు మెఱయ లేరది దప్పుగాఁ గొన రాదు నీతప్పునఁ బాటిల్లినచేటునకు శోకింపం బని లేదు సమరప్రకారం బవధరింపు మవంతీదేశాధీశు లగువిందానువిందులం బటుబాణపరంపరలం గప్పి యుధామన్యుం డేచి యనువిందు విరథుం జేసిన నతండు విందుస్యందనం బెక్కుటయు నప్పాంచాలవంశవరుండు. 32

క. విందునిసారథి నొకకో, లం దునిమిన వాహములు గలంగం బడి పా
ఱెం దేరు దిగిచికొని మగు, డం దద్బల మెల్లఁ దల్లడముఁ బొందె వడిన్. 33

వ. అట్టిసంకులసమరంబున. 34

క. భగదత్తుసేనఁ గడరిన, వెగడునఁ బాండవులమొనలు విఱుగుటయు మహా
నగమేటివేగ మాఁగిన, పగిది ఘటోత్కచుఁడు దానిపరువు డిగించెన్. 35

సీ. దనుజేంద్రునిలుచుట గని సైన్య మెప్పటి, యట్టుల పురికొని యనికిఁ జొచ్చె
నాఘటోత్కచుఁడు బాణావళి వఱపిన, భగదత్తుఁ డది యెల్ల మగుడఁ జేసి
పటుతోమరంబులు పదునాలు గడరింప, నవి ద్రుంచి డెబ్బదియమ్ము లేసి
యసుర యార్చినఁ బేర్చి యాతఁడు విరథుఁ జే, సిన వాఁడు శక్తి వైచిన నతండు

తే. నడుమఁ దునుమాడి వడిఁ బెక్కునారసముల
నొంప దైత్యుండు నముచి నిలింపపతికిఁ
బాఱిన ట్లోడి పాఱె నబ్బలము గడిమి
నెగచెఁ బ్రాగ్జ్యోతిషాధీశుఁ డిభముఁ బఱపి. 36

ఆ. శల్యుమీఁదఁ గవలు శరవృష్టి గురిసిన, నగుచు విరథుఁ జేసె నకులు నతఁడు
వారలప్పు డొక్కతేరెక్కి యడరిన, రౌద్ర మెసఁగ నొంచె మద్రవిభుఁడు.

చ. ధృతిబలు వొప్ప నిల్చి సహదేవుఁడు ప్రేఁకనినారసంబుఁ గ్రూ
రత నుర మాడ నేయ నది రక్తముఁ సోఁకక యుచ్చి పోవుడున్
మృతుఁడునుబోలెఁ దేరిపయి మేటిమగం డగుమద్రమేదినీ
పతి వడిసం గలంగె నరపాలక కౌరవరాజసైన్యముల్. 38

వ. ఇట్లు మూర్ఛితుం డయినశల్యుం జూచి సారథి రథంబు దొలంగం దోలికొని పోయినం గనుంగొని కవలు సింహనాదంబులు సేసి శంఖంబులఁ బూరించి రంతం గమలబాంధవుండు [1]దివసమధ్యోపేతుం డయ్యె నట్టిసమయంబున యమసూనుండు శ్రుతాయువుపైఁ దొమ్మిదియమ్ములు నిగిడించిన నతండు వాని మగిడించి

---

1. దివసమధ్యోదితుఁ డయ్యె - దివసమధ్యోపహితుం డయ్యె.

నిశాతసాయకసప్తకంబు శరీరంబున గ్రుచ్చినం గోపించి యుధిష్ఠిరుండు వరాహ
కర్ణమార్గణంబున వానివక్షస్స్థలంబు వ్రచ్చి వెడందవాతియమ్మునం గేతువుఁ
దునిమిన నతండు. 39

ఉ. వెండియు నేడుబాణములఁ వే తొడి ధర్మజు నొవ్వ నేయ నా
తండు మహోగ్రకోపమునఁ దత్తురగంబులఁ జంపి తద్ధను
ర్దండముఁ ద్రుంచి తత్తనువు రక్తమయంబుగఁ జేయ వాఁడు భీ
తుండయి పాఱె నీబలము దూలఁగ నబ్బల ముబ్బి క్రాలఁగాన్. 40

చేకితానకృపాచార్యులద్వంద్వయుద్ధము.

తే. చేకితానుండు గృపునిపై శితశరములు, గురిసె నాతండు విల్లును గుఱ్ఱములను
వ్రయ్యలుగఁ జేయఁ గద గొని రథము డిగ్గి, సరభసంబుగఁ జని కృపు విరథుఁ జేసి.

వ. అయ్యాదవసింహుండు వెనుకకు లంఘించి పోయినం గృపాచార్యుండు పదాఱమ్ము
లెమ్ములం గీలించుటయు నతండు గదాదండంబు వైవ నగ్గౌతముండు దుండంబులు
సేసినం జేకితానుండు రయంబున రథంబుమీఁదికరవాలంబు గొని మెఱుంగు
మెఱసినట్లు పఱతెంచిన శారద్వతుండు నిశాతకృపాణపాణి యై ధరణి కెఱఁగి
యేడ్తెఱ నతనిం గవిసి నొప్పించి యతనిచేత నొచ్చె నట్లిరువురు మూర్ఛిల్లి
మేదిని వ్రాలిన. 42

క. ఇద్దెస సుబలతనూజుఁడు, నద్దెసఁ గరకర్ణుఁడు రయం బెసఁగఁగ న
య్యిద్దఱఁ దమరథములపైఁ, గ్రద్దన నిడుకొని తొలంగఁ గాఁ జని రథిపా. 43

వ. చేదిపతి యగుధృష్టకేతుండు భూరిశ్రవసునిం దొంబదితూపుల నే పాఱి యేసిన
నొచ్చి కోపించి యాసోమదత్తతనయుండు. 44

క. నానాస్త్రంబుల హయముల, మేనులు దునియలుగఁ జేసి మెయి నారసముల్
[1]వే నాటించిన నతఁడు శ, తానీకునిరథముపైకి సరిగెం బెలుచన్. 45

వ. దుశ్శాసన వికర్ణ చిత్రసేనులతో సుభద్రాసూనునకు మహాయుద్ధం బయ్యె నందు
వారల నందఱ నాసంక్రందనపౌత్త్రుండు విరథులం జేసి వృకోదరువచనంబులు
దలంచి యులంచు చుండెం గాని సమయింపం డయ్యె నట్టిసమయంబున శాంత
నవుండు వారిం గైకొని యనేకరాజరథికులతోడం గూడ నన్నరనందనుపై నుర
వడించిన నాభూపతులు పలువురు ప్రౌఢు లగుటయు నయ్యభిమన్యుఁ డొక్క
రుండు బాలుండు నగుటయుం జూచి సవ్యసాచి శౌరితో నిట్లనియె. 46

క. ఉక్కుమిగిలి జగతీశులు, పెక్కండ్రు రయంబు మెఱయ భీష్మసహితు లై
యొక్కటఁ దోతెంచెద రా, డిక్కునఁ బో నిమ్ము రథము దీవ్రస్ఫురణన్. 47

వ. అని వారలవలను సూప నచ్యుతుం డట్ల చేయం ద్రిగర్తపతి దనమొనలకుం దల
కడచి కవ్వడి మార్కొనుటయు నతండు. 48

1. నో నాటించిన.

క. మీవీటి కెల్ల మేటివి, నీ విల్లు గడంగి తిచట నిక్కము పోరం
గావలయుఁజుమీ యనుచు శ,రావృతుఁ గావించె సూతహయసహితముగాన్.

వ. అట్టియెడం గౌరవసైన్యంబు గాండీవిపై నొక్కపెట్ట యడరినం బాండవబలంబు
లతనికిం దలకడచి తలపడిన సందడికయ్యంబయ్యె నాసంక్రందననందనుండు రాజు
లగములకుం గవిసి కేతనంబులు నఱికియుఁ సారథిరథికరథ్యంబులప్రాణంబులు
వెఱికియు నాతపత్రచామరంబులు పొడిసేసియుఁ జాపంబులు రూపఱఁజేసియు
వర్మంబులు వ్రచ్చియు మర్మంబుల మార్గణంబులు గ్రుచ్చియు సర్వాంగంబులు
నొంచియుఁ దలలు ద్రుంచియు విహరించుచుండ నపరాహ్ణం బయ్యెఁ ద్రిగర్త
నాథుండు వెండియుం జేర్చి యెదిర్చిన. 50

తే. అతనిరథరక్షకులు శక్రసుతునిమీఁదఁ
గడఁగి ముప్పదియిద్దఱు గవియుటయును
నవ్వి యఱువదినాలుగునారసముల
నక్కిరీటి యారథికుల నవనిఁ గూల్చె. 51

క. ఇలఁ బడినసహచరులఁ గని, యలిగి సుశర్ముండు దాఁకె నర్జును నతనిం
దలకడచి శిఖండిప్రభృతులు నిగిడిరి వారిమీఁద ద్రుపదజ్ఞాతుల్. 52

వ. ధనంజయుండును దనకు దుర్యోధనసైంధవు లగ్గం బై యున్నను గ్రేఁగంటం
జూచుచు గాంగేయుపై నడరె నప్పుడు దన్నుఁ దోడర వచ్చుశల్యు నాదరింపక
ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయసహితుం డై పార్థునకు బాసట యై
భీష్మునిదెసకు నడరె నిట్లు పాండవపంచకంబుతోఁ బెనంగుశాంతనవుం గనుంగొని
కురుపతియును సింధురాజును బరవసంబు సేసి యుప్పాండవేయులం దాఁకిన. 53

క. శలశల్యచిత్రసేనులు, బలియుం డగుకృపునిఁ గూడి పాండుకుమారా
వలిమీఁదఁ గవిసి వాల,మ్ములు గురిసి రతండు [1]సూచి మోదం బందన్. 54

వ. తదవసరంబున శిఖండి దేవవ్రతున కెదిర్చిన నొండు సేయ నొల్లమి నాతండు కో
దండంబు దుండంబులు సేసి పిఱుసనఁ జేయుటయుఁ బాండవాగ్రజుండు వాని
ప్రతిజ్ఞావచనంబు లెత్తిచెప్పి మొగమోడక యదల్చినం బురికొని యప్పాంచాల
పతిసూనుండు సురనదీసూను మార్కొనుటయు మద్రనాథుండెడసొచ్చి మహాన
లాస్త్రంబు ప్రయోగించిన దానికిం దలంకక యతండు వారుణాస్త్రంబేసిన నతండు
తత్ప్రతిహతి గావించె గాంగేయుండును ధర్మతనయుకేతుచాపదండంబులు
ద్రుంచి యార్చినం జేర్చి భీముండు గద గొని రథంబు డిగ్గి రారాజుపయిం గవి
యుటయుఁ దత్సమయంబునం దలమిగిలి జయద్రథుండు రౌద్రం బెసంగ వేగంబు
మెఱసి మెఱుంగుటమ్ము లేనూ ఱతనిపై నడరింప నతండు సరకుసేయక శరంబులు
గద జడియుచుం గదిసి సింధురాజుహయంబులం జదియమోఁదిన నాసైంధవుండు.

1. మోదమునఁ బొందంగ.

క. ఉక్కటి యొండొకనిరథం, బెక్కటయ్యుఁ దొరలు దెరలి యేడ్తెఱ సెడి శా
దిక్కు ప్రజ విచ్చి నప్పుడు, గ్రక్కునఁ బతి భీముమీఁదఁ గవిసెం బెలుచన్. 56

క. ఎడఁ జొచ్చి చిత్రసేనుఁడు, వడముడిపై [1]నేయ నతఁడు వైచెం గోపం
బడరఁగ గద నది యుగ్రపుఁ,బిడుగుక్రియం మెఱసి పఱచె బిట్టుగఁ జదలన్.

తే. అట్లు వచ్చునాగదఁ గని యచటియోధు
లలికి తమతమమీఁదన యడరు ననియుఁ
దలఁచి యొదిఁగిరి రారాజుఁ దలఁప రైరి
ప్రాణభయ మెట్టివారిఁ గీడ్పఱుప కున్నె. 58

క. అడిదముఁ బలకయునుం గొని, చిడిముడి వడ కపుడు చిత్రసేనుం డుఱికెం
బుడమికి రథహయసూతులఁ, బొడిపొడి గావించెఁ బవనపుత్త్రునిగదయున్. 59

వ. ఇట్లు చిత్రసేనుండు విరథుం డైన వికర్ణుం డతనిం దనరథం బెక్కించికొని పోయె నట్టియెడ. 60

శా. గంగాపుత్త్రుఁడు పాండవాగ్రజునియుగ్యంబుల్ మహిం గూల్చి స
ర్వాంగంబుల్ వెస నొంప నాతఁడు సముద్యల్లోహితుఁ డై శక్తి వై
చెం గంపింపక త్రుంచెఁ దాత విభుఁడుం శీఘ్రంబ మాద్రీసుతో
త్తుంగస్యందన మెక్క నొంచెను సరిత్సూనుండు మాద్రేయులన్. 61

క. తమ్ముల నొంచిన నగ్రజుఁ, డుమ్మలికముతోడ బెరయు నుత్సాహమునం
ద మ్మందఱఁ బురికొలుపఁగ, నమ్మెననృపు లెల్లఁ దాఁకి రప్పుడు భీష్మున్. 62

వ. ఇట్లు పలువురు ధరణీశు లురవడించినం బెక్కుమృగంబులు మార్కొనినం జెలంగు సింగంబుచందంబున నలిరేఁగి సురనదీసూనుండు వెరవు గలవనపాలకుండు తాళఫలంబులు దిగఁద్రోచుచందంబున మెఱుంగు లడరువెడందవాతియమ్ముల నమ్మహీశులతలలు డొల్ల నేయుచు మండలచారి యై విహరించు చున్న వెఱఁగుపడి పాండవులు సూచు చుండ శిఖండి కోదండపాండిత్యంబు మెఱయుచుం గదిసినఁ గ్రేడించి యతండు సృంజయసైన్యంబుపయిం దఱిమి దైన్యంబు నొందించె నట్టి సమయంబున. 63

సీ. సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దానుఁ, గురుసైన్యములఁ గలఁగుండువెట్ట
విందానువిందులు వెసఁ దాఁకి దుపదుని,కొడుకుగుఱ్ఱంబులఁ గూల్చుటయును
విరథుఁ డై హారితమ్మనరదంబుపై కతఁ, డేఁగిన ధర్మజుఁ డెల్లబలముఁ
గవియించి యిరువురఁ గైకొని తఱిమినఁ, బ్రజకుఁ జేవీచి రారాజు గడఁగఁ

తే. దమ్ములును భీష్ముఁడును ధర్మతనయుసమద
సేనఁ బొదివిన వాసవసూనుఁ డమర

---

1. వతులశక్తి వైచినఁ గోపం, బడర గద (వేయ నుగ్రపుఁ.

ద్రోణుఁ డాతని మార్కొని బాణజాల
పిహితముగఁ జేసె రోదసీకుహర మెల్ల. 64

వ. ఇవ్విధంబున నాచార్యుం డేచిన నతనిప్రాపున భవత్సేనలు సెలంగి పైకొనియె
నయ్యవసరంబున ధర్మతనయుండు దనమెలుంగు సూపిన నగ్గలిక నాతని మొగ్గ
రంబున మొనలు బెరసి పరుసఁదనంబు సూపి యేపునం బెనంగుచుండ నినుండు
దర్శనీయమండలుండగుచు నపరశైలశిఖరగతుం డయ్యె నయ్యెడ సంజకెంజాయ
నెఱయ నెత్తురు టేఱులపయి వడిం దేలిపోవు పీనుంగులం దివిచికొని చనుభూత బే
తాళసమ్మర్దంబులను సమరతలప్రాంతపతితంబు లైనశవంబులం గైకొని చెలంగు
సృగాలంబులరవంబులను దత్సమయం బతిఘోరంబగుటయుఁ ద్రిగర్తపతిప్రముఖు
లగుజగతీశుల వెగడుపఱచి మెఱచినసవ్యసాచియు సైంధవాదివసుంధరాపతులం
జిక్కువడంజేసి యుక్కుమీఱినమారుతియుం దమయన్నకుం బొడసూపి నిలిచిన
నతండు సైన్యంబుల నివర్తింప నియమించి సమస్తపరిజనపరివృతుం డై. 65

తే. విడిదలకుఁ బోయె నపుడు నీకొడుకు లెల్ల, నాపగానందనునికడ కరుగుదెంచి
బలములన్నింటిఁ దివియంగఁ బనిచి మరలి, రాత్మసన్నివేశంబులకతఁడుఁ దారు.

వ. సప్తమదివసరజనీసమయావసానం బగుటయు. 67

భీష్మునియష్టమదివసయుద్ధక్రమము.

క. భూపోత్తమ విను పాండు, క్ష్మాపాలతనూభవులును గౌరవులును నా
టోపంబున సంగరకేళీపరులై వెడలి రుగ్రలీలలు మెఱయన్. 68

వ. అట్టియెడం గురుపితామహుండు గూర్మవ్యూహంబు దీర్చినం గనుంగొని ధర్మ
తనయుండు ధృష్టద్యుమ్ను నాలోకించి కౌరవవ్యూహంబు సూచితే దీనికిఁ బ్రతి
వ్యూహం బెయ్యది దానిసంఘటింపుమనిన నతండు శృంగాటకవ్యూహంబు వన్నె
నిట్లు రెండుసైన్యంబులు మోహరించి యుత్సాహంబులు మెఱయ భేరీమృదం
గాదితూర్యంబులు మొరయం దలపడినఁ బటుహేతివ్రాతపరస్పరసంఘట్టనంబు
లం బొగ లేనిమంట లెగయం జటులస్యందనమాతంగతురంగభటకదంబకంబుల
గమనవేగంబున నెగయుపరాగపటలంబులంబరంబునం బరఁగనీక తత్తదనీకానేక
రక్తధారాసారంబు లడరి యడంగించిన నతిరౌద్రంబునఁ బెనంగునాసమయంబున,

క. మీతండ్రి సింహనాద, స్ఫీతముఖుం డగుచు నాత్మసేన గడచినఁ
భీతిం బాండవయోధ, వ్రాతము మార్కొనక యొదిఁగె వసుధాధీశా. 70

చ. అనిలతనూజుఁ డొక్కరుఁడు నార్చుచు భీష్ము నెదిర్చి సూతుఁ జం
పిన రథ మీడ్చికొంచుఁ గురుబృందము గొందల మంద నశ్వముల్
వెనుకకుఁ బాఱె నప్డు పృథివీవర పాండవసేన యుబ్బె నీ
తనయుఁడు భీముకట్టెదురఁ దాఁకె సునాభుఁడు విక్రమోద్ధతిన్. 71

### సునాభుఁడు మొదలగుకురుకుమారులు భీమునిచేఁ జచ్చుట.

ఆ. అట్లు దాఁకుటయు బ✽కాంతకుఁ డంత్యకా,లాంతకుండువోలె ✽ నలిగి బొమలు
ముడి వడంగ నొక్క ✽ వెడఁదయమ్మునఁ దల, నఱికివైచి పెలుచ ✽ నవ్వె నధిప.

వ. ఇట్లు సునాభుండు వడుట గనుంగొని కోపాటోపంబునఁ దత్సోదరు లగునాదిత్య
కేతుండును నపరాజితుండును బహ్వాశియుఁ బండితకుండును గుండధారుండును
విశాలాక్షుండును మహోదరుండును వృకోదరుపై నొక్కపెట్ట కదిసి పెక్కు
విధమ్ము లగునమ్ములం బెక్కింట నొప్పించిన నప్పాండవవీరుండు రోషాతిభీషణుం
డై యేరికిం దేటి చూడ రాక పటుభల్లంబున నతినిశితక్షురప్రముఖంబున శితప్ర
దరంబున శాతక్షురికాముఖంబున దీప్తార్ధచంద్రాంబకంబున ఖరనారాచంబునఁ
గ్రూరబాణంబున నక్కుమారసప్తకంబు సమవర్తిసమీపంబున కనిచినం దక్కటి
కుమారు లుక్కు దక్కి వెఱఁగుపడి యంతంత నొదిఁగిన. 73

తే. నాఁడు సభ నాడినంతయు ✽ నేఁడ చేయు
నట్టు లున్నాఁడు మొనతల ✽ ననిలసుతుఁడు
విదురుపలుకులు దలకూడె ✽ వేయు నేల
యనుచు వెఱఁ జూచు చుండిరి ✽ మనుజపతులు. 74

క. నీవుఁ దనూజుల దుర్వ్యన,యావేశం బుడుప వైతి ✽ వది దుర్దశలం
గావింప నింకఁ జావక, పో వచ్చునె వారి కనిల✽పుత్త్రునిచేతన్. 75

వ. అది యట్లుండె నప్పుడు సుయోధనుండు దనచుట్టు నున్నయోధవీరులం గలయం
గనుంగొని భీమసేను మార్కొనం బంచి భీష్ముకడకుం జని శోకగద్గదకంఠుం
డగుచు నతనితో ని ట్లనియె. 76

ఉ. ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ ✽ డేపునఁ గోలుమసంగి పొంగి నా
తమ్ములఁ జంపఁగా నకట ✽ తప్పక చూచెదు గాని రోషశో
కమ్ములు లేవు తోడుపడఁ ✽ గా దని నిల్చితొ యున్నవారు నొ
క్కుమ్మడిఁ జావఁ గోరి యిటు ✽ లూరక యుండితొ కౌరవోత్తమా. 77

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కి ట్లనియె. 78

క. ఇది మున్న యేను ద్రోణుఁడు, విదురుండును జెప్పినదియ ✽ విన వప్పుడు బె
ట్టిదు లగుపాండుతనూజుల, కెదు రై నిర్జింప వశమె ✽ యీశున కైనన్. 79

తే. మనకుమారులలోన న✽య్యనిలతనయు, బారి కగపడువాని నె✽వ్వారి కైనఁ
గావఁ దలకొన శక్యంబు ✽ గాదు మనకు, నడలఁ బని లేదు దీనికి ✽ నధిపతనయ. 80

క. వీరస్వర్గము ధనముగఁ, బోరుము నీ వింక నొండు ✽ బుద్ధు లుడుగు మేఁ
బోరెద నోపినమెయిఁ దెగి, పోరఁగ జయ మైన దానిఁ ✽ బోఁ ద్రోచెద మే. 81

వ. అనియె నని చెప్పిన విని వైచిత్రవీర్యుండు. 82

తే. గురుఁడు భీష్ముండుఁ గలుగంగఁ ≀ గురుకుమారు
లిట్టు వాలిసెదరే మున్న ≀ యింతవట్టు
దల్లియును నేనుఁ జెప్పినఁ ≀ బొల్లసేసి
దానిఫల మిప్పు డాసుయోధనుఁడు గనిమె. 83

వ. ఇంక నమ్మాట లాడుట గతజలసేతుబంధనంబు దానిం జాలింపు మట్లు కురు కుమారులచావు గనుంగొని గాంగేయకుంభసంభవులు పదంపడి యేమి సేసి రని యడుగుటయు సూతనందనుం డంబికానందనున కి ట్లను భీష్ముండు భయంకరాకారుండై మారుతిపయిం దేరు వఱపె నతనిం గని ధర్మనందనుండు సేయి వీచిన ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులు దలకడచి యతనితోఁ దలపడి రంతకు మున్న దుర్యోధనుపనుపునఁ గవిసినరథికులమీఁదం జేకితానద్రౌపదేయసహితంబుగా సవ్యసాచి యడరె నభిమన్యుండును హైడింబుండును ధార్తరాష్ట్రులదెసం దఱిమి రిత్తెఱంగున మూఁడుగట్టిమొత్తమ్ములు బెట్టిదంబు సేయ మనబలంబులుం బోక పెనంగు చుండె నట్టియెడ. 84

క. ద్రోణాచార్యుఁడు ద్రుపద, క్షోణీశ్వరుమోహరంబు ≀ సుడివడ దివి గీ
ర్వాణులు గీర్తింపఁగఁ బటు, బాణపరంపర లనేక≀భంగులఁ బఱపెన్. 85

క. కరిఘటలు మీఁద భీముఁడు, సరభసముగ నేయునారసంబుల మ్రోఁడై
[1]ధరఁ బడి రూపఱినను ధిన,కరుకరములఁ దమము విరియు≀గతి దోఁచె నృపా.

క. అఱిముఱి గుజ్జపుదడముల, కుఱికి కవలు రౌద్రరసమ≀హోగ్రాకృతులై
నఱకిన నచ్చట రథములు, వఱపఁగ రా దయ్యె నుభయ≀బలయోధులకున్. 87

తే. నరుఁడు రథికజనంబుపై ≀ సరభసముగ, నేయఁ గేయూరహారత≀త్కాయశకల
వితతి నిల యొప్పె రాలిన≀వివిధపుష్ప, పుంజమునఁ బొల్చునుద్యాన≀భూమివోలె.

వ. అప్పు డిరావంతుండు. 89

క. తురగనికరంబుతోడం, గురుసైన్యము దఱియఁ జొచ్చు≀కొల్తల సూడం
గర మొప్పె ఘనవిహంగో, త్కరముపయిం గవియుడేగ≀తండంబుగతిన్. 90

వ. ఇట్లుక్కు మిగిలి యెక్కినయర్జుననందనుం గనుంగొని శకునితమ్ములు శుకుండును శర్మవంతుండును వృషకుండును నార్జవుండును గజుండును గవాక్షుండును గుజ్జపుమొగ్గరంబులతో నగ్గలిక నతనిపై వాహనంబులం బఱపి పిఱుదివియక రాయి రాయి దాఁకినట్లు దాఁకి రయ్యిరువాఁగును విచిత్రంబుగాఁ బోర నయ్యాఱ్వురు గాంధారకుమారులు నయ్యిరావంతుం బొదివి సెలకట్టెలవాట్ల డొంకెన పోట్ల నొప్పించిన బరిగోలలపోటులు తాఁకిసం గినిసినగంధగజంబుచందం బై. 91

ఆ. అతఁడు ధన్వి యగుట ≀ నశ్వంబుఁ దొలఁగ దాఁ, టించి తిరిగి యాక≀డిందిమగల
నారసములు పెక్కు ≀ నాటించి నొప్పించి, నెగడువఱచె సురలు ≀ వొగడుచుండ.

---

1 ధరణిం బడి రూపఱి దిన.

వ. అట్టియెడ. 93

క. మును పోటులఁ బడి నొచ్చుటఁ, దనగుఱ్ఱము వడినఁ బడక ధరణికి లంఘిం
చెను మఱపు లేక పేరుక్కునఁ బట్టుఖడ్గంబు వెలికిఁగొనుచు రయమునన్. 94

వ. ఇట్లు భూచారి యయినభుజగరాజదౌహిత్రుం జూచి యేచి యాసుబలసూనులు
సుట్టు ముట్టి. 95

క. పొడువంగ ప్రేయంగ నతఁడుం, [1]గడు నుఱ వగు నేర్పు కడిమి కలిమిం దనపైఁ
బడకుండఁ గృపాణమ్మునఁ, గడుఁజిత్రపుగతుల జడిసెఁ గైదువు లెల్లన్. 96

వ. ఆరాతులు వీఁడు గాలుమానిసి యగుట్టం జేసి మనకు నొప్పింప వెరవు గా
దయ్యెడు ననుదుర్విచారంబున. 97

ఆ. ఆర్వురును గడంగి హయముల డిగి పటు, ఖడ్గదీప్తు లడరఁ గదియుటయును
బ్రమరి తిరిగి వారిఁ బం డ్రెండుదునియలు, సేసి క్రీడికొడుకు సెలఁగి యార్చె.

క. వెక్కస మందుచుఁ గురుపతి, రక్కసుతో ననియె నియ్యురగదౌహిత్రుం
డొక్కఁడ మనసైన్యంబు, ల్నక్కఁడఁచుచు నున్నవాఁ డలంబుస కంటే. 99

అలంబుసునిచేత నిరావంతుఁడు మృతుం డగుట.

వ. అని యాతనివలను సూపినం గని దైతేయనాథుండు. 100

ఆ. కడఁగి నడచి మాయ గావింప నయ్యిరా, వంతునశ్వసేనయంతసేన
వుట్టె వారిమీఁదఁ బుట్టని తలపడి, సమయఁ జేసె నదియు సమసె నధిప. 101

వ. అయ్యిరావంతుం డొక్కరుండును బొలివోనివిక్రమంబున నలంబుసుని మా
ర్కొని రయంబు మెఱయ మెఱుంగు మెఱసినట్లు గవిసి కరవాలంబున విల్లు
దునిమిన దనుజుండు వినువీధి కెగసి మాయాశరంబుల నతని నొప్పించినం
గోపించి గగనంబునకు లంఘించి. 102

క. ఘనఖడ్గంబున వానిం, దునుమ నలంబుసుఁడు దోడుతో నుజ్జ్వలయా
వనరూపము గ్రొత్తగఁ గైకొని పెనఁగం బెనఁగఁ బార్థుకొడు కచలుం డై.

క. జననీవంశంబునఁ గల, యనుపమమాయానుభావ మాత్మఁ దలఁచి శే
షునిచందం బగురూపం, బునఁ బేర్చి యనేకనాగపుంజములోడన్. 104

చ. అడరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని మాయతోడ లోఁ
బడ భుజగంబులం బొదివి పట్టి రయంబున మ్రింగి యపు చే
డ్పడునరుపట్టికంఠము గృపాణమునం దెగ వైవ మేదినిం
బడి మొగ మొప్పెఁ బూర్ణశశిభాతి వికారము లేనిచెన్నునన్. 105

వ. అంత వియత్తలం బుదాత్తమిహిరమండలమండితమధ్యం బయ్యె నని చెప్పిన
విని ధృతరాష్ట్రుం డయ్యిరావంతుండు వడినం బాండవులును వారియోధవీరు
లును జేసిన తెఱంగు సెప్పు మనవుడు సంజయుం డతని కి ట్లనియె. 106

---

1 గడుఁవడి నేర్పునను గడిమిఁ

శా. తోడంబుట్టువుపాటు సూచి యలుకన్ దుర్వారశుంభద్గతిన్
హైడింబుండు మహాసురేంద్రులు గజేంద్రారూఢు లై సంగర
క్రీడాలోలతఁ దన్ను మీఱి విలయాగ్నిం బోల దిక్చక్ర మ
ల్లాడన్ బెట్టుగ నార్చి చొచ్చెఁ గురుసైన్యంబున్ మహోగ్రంబుగన్. 107

చ. కరమున నున్నశూలమునఁ గ్రమ్ము మెఱుంగులు శత్రుసైన్యభీ
కరములుగా గజాశ్వభటకాయములన్ గుది గ్రుచ్చినట్లుగాఁ
జెరువుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధసింధురో
త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్. 108

క. వంగాధిపతియు శౌర్యో,త్తుంగతనుం డగుచు నీసుతుం డలరఁగ దై
త్యుం గదిసె గాఢమదమా,తంగఘటలతోడ నపుడు దారుణభంగిన్. 109

వ. ఇట్లు దన్ను బెట్టు గిట్టినకరినికరంబులం గని పొంగి కరవాలంబు గొని యడరి ఘటోత్కచుండు. 110

క. కరదంతకర్ణమస్తక, చరణము లని తోఁప కుండ చందముగా ని
ష్ఠురవిక్రమకేలివి, స్ఫురణంబున రూపు మాపె సురలు నుతింపన్. 111

వ. ఇవ్విధంబున గజంబులు వొలిసిన గజపురనాథుండు రోషంబున నురవడించి నారాచవృష్టి ముంచి వేగవంతుండును విద్యుజ్జిహ్వుండును బహ్వాశియు ననుదనుజప్రధాననాయకు[1]లం బ్రేతపతిపురంబున [2]కనిచి యాభీమసేనతనయుతనువున నిశాతశరంబులు నించినం గోదండపాణి యై క్రోధాగ్నిజ్వాలలు నిగుడువడువునఁ బటుబాణజ్వాలలు నిగిడించి కదిసి కురుపతి నవలోకించి యతండు. 112

ఉ. పాడియు సత్యముం గలుగుపాండవకోటికి నీవు దొల్లి మె
ప్పాడి మెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం
జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూదలించి మై
నాడఁగ నేసెఁ గృష్ణభుజగావలిఁ బోలిననారసంబులన్. 113

క. దానికిఁ జల మెడలక నీ, సూనుం డాపవనసూనుసూనుని మేనం
దా నుగ్రశరము లిరువది, యేను వెసం గీలుకొలిపె నిభపురనాథా. 114

తే. అసుర గినిసి కృతాంతజిహ్వయునుబోని, శక్తి యెత్తిన నమ్మహీశ్వరున కపుడు
వంగపతి యడ్డపడుటయు వానిగజముఁ, గూల వైచిన నాతండు నేల కుఱికె.

క. ఏనుంగు వడిన సచ్చటి, సేనలు దెరలుటయు రాజసింహుఁడు దన్నుం
దాన పురికొల్పికొని వెఱ, పూనక దానవుని యెదుర నొక్కఁడ నిలిచెన్. 116

క. నిలిచి మహాస్త్రం బెఱమం,టలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చె
క్కలు గాఁగ నేసి దిక్కులు, నలిగులిగా నతఁడు సింహనాదము సేసెన్. 117

వ. ఇట్లు సేసిన విని గాంగేయుండు గురుపతిమోఘవీరులం గలయం గనుంగొని.

---

1 లుద్రేకంబునఁ గదిసిన వారం బ్రేత. 2 కనిచి రణప్రారంభంబునం గదిసి యాభీమ.

క. భీమునితనయుం డత్యుద్దామగతిఁ రాజుఁ దొడరి తత్కరటిఘటా
స్తోమంబు గూల్చి యాతని,పై మారి మసంగినట్లు బలువిడిఁ గవిసెన్. 119

వ. ఆఘటోత్కచుండు దివిజులకు నజయ్యుండు మీరు వేవేగ రారాజుం గూడికొనుం
డనిన సేనాపతిపలుకులకు గురుకృపాశ్వత్థామచిత్రసేనులు బృహద్బలబాహ్లీకా
వంతీనాథభూరిశ్రవసులును సైంధవసోమదత్తవివింశతివికర్ణులు నేకోద్యోగంబునం
దమతమయనుచరు లైనయోధవీరసహస్రంబులతో రథంబులు దోలికొని చని
భవత్తనయుం బరివేష్టించి హిడింబాతనయుం దాఁకిన నతండును దైతేయబలం
బులం గొని బలిమి మెఱసి నిలిచి మార్కొనియె నారెండుసైన్యంబులు నొం
డొంటి కెదిర్చి పేర్చి పెనంగు చుండ నాభీమసేననందనుం డాచార్యప్రభృతు
లగునాపన్నిద్దఱపై బహుప్రకారక్రూరబాణంబులు వగఁగింప నందు. 120

ఘటోత్కచుండు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబు సేయుట.

క. కొందఱసూతులు వాలిసిరి, కొందఱచాపములు దునిసెఁ గొందఱచటుల
స్యందనహయాలి వడిమెను, గొందఱయంగములు వ్రస్సెఁ గురుకులముఖ్యా.

వ. ఇట్లతిరథమహారథులం జిక్కుపఱచినరక్కసున కలిగి రయంబున సాధనంబులు
సమకట్టికొని రభసంబున నాకుంభసంభవాదిద్వాదశరథికవరులు నొక్కపెట్ట
చుట్టు ముట్టి మహాస్త్రజ్వాలాజాలంబులం బొదివిన. 122

ఆ. ఓర్వ రాక దానవోత్తముఁ డంబర, వీథి కెగసి పోయి విపులరవము
సెలఁగఁ బెలుచ [1]నడరిజీమూతభంగి దు, ర్దాంతుఁడైనఁ జూచి ధర్మసుతుఁడు.

వ. భీమసేనుతో ని ట్లనియె నిక్కడ భీష్ముబారిం బడినపాంచాలబలంబులఁ బరిపా
లింపను నక్కడ నాచార్యాదుల కగపడ్డఘటోత్కచుం గావను వలసియున్నయది
యివ్వలసికిం గవ్వడి గలం డవ్వలనికి వేగంబ యరుగు మనిన సింహనాదంబు
సేయుచు. 124

క. కౌరవబలములు సుడివడ, మారుతి గవియుటయు మెఱసి మార్కొని కురుధా
త్రీరమణుఁ డర్ధచంద్రా,కారశరము దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్.

తే. తునిమి తోడన క్రొవ్వాఁడి దొడ్డనార
సంబు భీమునివక్షస్స్థలంబు దూఱ
నేయుటయు సోలఁ గని ద్రౌపదేయు లడరఁ
గడఁగి సౌభద్రుఁడును ఘటోత్కచుఁడుఁ గలసె. 126

వ. ఇట్లు దండ్రి నొచ్చినఁ బాండుపౌత్త్రులు నీపుత్త్రునిపై నొక్కపెట్ట మిక్కుటం
బగుకోపంబునం గవిసిన. 127

చ. కసి కృపబాహ్లికాదిరథికప్రకరంబు గడంగి వారి మా
ర్కొని పెనఁగంగఁ దేటి కడుఁ గ్రూరత నేచినమారుతాత్మజుం

1. నాదరి; నుటరి.

జెనసి గురుండు రక్తపరిషిక్తునిఁ జేసిన నాతఁ డల్గి యా
తని నొకనారసంబున నుదగ్రత మూర్ఛ మునుంగ నేసినన్. 128

మ. ధనురాచార్యునిఁ జూచి తత్తనయుఁడుర్ ♦ ధాత్రీశుఁడుర్ భీము మా
ర్కొని రాతం డెలనవ్వు చెన్నుగ గదా♦ఘోరాకృతిం దేరు డి
గ్గినయాలోనన తేజి ద్రోణుఁడు గడం♦గెం జూచి తోడై కృపా
దినికాయంబుఁ గడంగి వాయుసుతుపైఁ ♦ దీవ్రాస్త్రముల్ నింపఁగన్. 129

క. ఏపున హిడింబసుతుఁడును, ద్రౌపదిపుత్త్రులు సుభద్ర♦తనయుఁడుఁ గోపో
ద్దీపితులై వారలయాటోపముఁ గుదియించి రతిప♦టుప్రదరములన్. 130

వ. అప్పు డనూపభూపాలుండును భీమసేనసఖిత్వలోలుండు నగునీలుండు నశ్వత్థా
మం దొడరి నొచ్చినం గని ఘటోత్కచుండు. 131

క. తలపడి యగ్గురునందనుఁ, జలమున నొప్పింప గురుఁడు ♦ సరభసముగ ను
జ్జ్వలబాణావృతుఁ జేసిన, బల మఱి దనుజుండు మాయఁ ♦ బన్నెఁ గుపితుఁడై. 132

వ. ఇవ్విధంబున హిడింబాసూనుండు సేసినమాయం జేసి. 133

క. గురుఁడు మొదలైనయాప, న్నిరువురుఁ గురుపతియు నొవ్వ ♦ నేటులఁ బడి నె
త్తురు దొరఁగ సోలి సంగర, ధరణిం బడినట్లు దోఁచెఁ ♦ దత్సేనలకున్. 134

చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి ♦ క్రందుకొనన్ వెసఁ బాఱ నాపగా
తనయుఁడు సేన నాఁగి యివి ♦ దైత్యులమాయలు గాని బొంకు బొం
కని మెలుఁ గత్తి చెప్పఁగ భ♦యంబున నమ్మక పోయె నట్లు వో
యినఁ జనుదెంచెఁ గౌరవమ♦హీశుఁడు దీనత భీష్ముపాలికిన్. 135

వ. వచ్చి యిట్లనియె. 136

క. నీవును ద్రోణుఁడుఁ గలుగం, గా వైరులచేత నేను ♦ గష్టపడితిఁ గా
దే వారితోడఁ దలపడి, చావొండెను విజయ మొండె ♦ సంపాదింతున్. 137

చ. అన విని నవ్వి పాండవుల♦యంతటివారికిఁ గాక నీకు మా
ర్కొన నగు నయ్య [1]యిప్పరుసు ♦ కుత్సితవర్తన మిట్టిదు స్తరం
బునఁ దగులావు సేయ మము♦బోఁటులు లేరె చలంబు డింపు మీ
వని పతితోడఁ జెప్పి సరి♦దాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్. 138

వ. భగదత్తు నాలోకించి. 139

క. దనుజు లొనరించుమాయలు, నినుఁ జేరవు వారి గెలుతు ♦ నీ విప్పుడ యీ
జనపతి మెచ్చఁగ నాడై, త్యుని గెలువుము నీదుసేన♦తో నడరి వడిన్. 140

వ. అని భీష్ముండు వలికినం బ్రాగ్జ్యోతిషపతి మేటిమగండు గావున నమ్మాటకుం బొంగి
సింగం బడరినచందంబున నార్చి సుప్రతీకంబు నెక్కి సేనాసమేతుం డై. 141

1. యిప్పడుచు ♦ కుత్సిత.

తే. పరఁగి తోఁతెంచుపాండవబలము మీఁదఁ
గవియుటయు నంత నంతఁ గౌరవులమూఁక
మరలి యేర్పడఁ జూచి యమ్మాట యపుడు
నిజముగాఁ గొని యాజికి నిగిడె మగుడ. 142

వ. ఇట్లుభయసైన్యంబులుం [1]దలపడినసందడికయ్యంబున నపరాహ్ణం బగుచునుండ.

క. నగపతియుఁబోనిగజపతిఁ, దగ నేడ్తెఱ నెక్కి ప్రబలదైత్యబలముతో
నిగుడఁగ ఘటోత్కచుం డా, భగదత్తునిమీఁదఁ గవిసెఁ బార్థివముఖ్యా.

వ. తదవసరంబున వృకోదరుం డరదంబురయంబు మెఱయ నయ్యభిమన్యుద్రౌప
దేయప్రముఖులుం దానును హైడింబునకుం దోడై కడంగె నట్టియెడ. 145

ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ, దత్తుదంతిరక్తధార లొప్పెఁ
జెలువు రెట్టి గాఁగ జేవుఱుసెలయేఱు, లున్నతాచలమున నురలునట్లు. 146

క. శూలంబున హైడింబుఁడు, గాలాకృతితోడ వైవఁగా నది పొడి యై
రాలెడునట్లుగ మగఁటిమి, వ్రాలినభగదత్తుఁ డేసె వడి భల్లమునన్. 147

వ. ఇట్లేసి యార్చి వెండియు. 148

ఆ. భీమహరులఁ గూల్చి పేర్చి సౌభద్రాది, యోధవరుల నెల్ల నుఱక తఱుచు
టంపవానఁ దడిపి హయరథభటసమూ, హంబుఁ జంపె సమదహస్తిఁ బఱపి.

క. మందరము మహాంభోనిధి, యందుఁ దిరుగునట్లు పాండువానీకములో
నం దిరిగి సుప్రతీక మ, మందగతిం జంపెఁ బెక్కుమాతంగములన్. 150

క. అలిగి దశార్ణాధీశుఁడు, గొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము ను
జ్జ్వలము లగునతనితోమర, ములతాఁకున నది చలించి మొగతిరిగె వెసన్.

వ. ఇవ్విధంబునం బోరుభగదత్తుం గనుంగొని గండు మిగిలి కురువిభుండు గురుకృపాది
యోధవీరసమేతంబుగాఁ దఱిమినం దమబలంబులు గోలాహలబహుళంబు లగుట
యుఁ బాండవాగ్రజుండు పార్థపాంచాలపురస్సరుం డై యవ్వలనికిం గ్రొవ్వలరం
గోల్తలల సేసె నట్టిసమయంబున. 152

అర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట.

క. నరుఁడు ధనుర్గుణరావ, స్ఫురణంబును దేవదత్తభూరిరవము నం
బరము వగిలింప నానా, శరములఁ గురుసైన్యసరభసత్వం బుడిపెన్. 153

ఆ. అపుడు సేరి భీముఁ డతనికి భుజగేంద్ర
కన్యకాసుతుండు గలనఁ బడుట
నల్లఁ జెప్పుటయును నడలి మెచ్చుట నని
యడిగి యతఁడు సూప నచటి కరిగి. 154

1 దలపడి సందడికయ్యంబుగా నపరాహ్ణంబునం బెనంగు చుండ.

వ. దనుజఖండితుం డయి పడి యున్నయయ్యిరావంతుశరీరంబు గనుంగొని యా ధనంజయుండు. 155

చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీళులు నించి యానుయో
ధను నవినీతియుం బిదప ధర్మతనూజుఁడు సంధి గోరి ప
ల్కినతగవుం గడంగి యనికిం దలకొన్ననిజోద్యమంబుఁ దోఁ
చిన మదిఁ దిట్టుచున్ వినుతి సేయుచు రోయుచు నుండె నయ్యెడన్. 156

వ. ఇట్లు పుత్త్రశోకానలసంతప్తచిత్తుం డగుసవ్యసాచిం జూచి గోవిందుండు మందస్మితంబు సేసిన. 157

క. కని యతఁడు దెలిసి నీచే, వినినది యిది మున్ను దీని విడిచితి సహింభం
జన తేరు నడపు గురుబల, వినిపాతనపాటవమున విహరించుటకున్. 158

వ. అని పలికినం బద్మనాభుండు రథంబు రయంబున మనమొనపయిం బఱపఁ బార్థుండు పటుబాణపరంపరలు వఱఁగింప భగదత్తుండును గృపాచార్యుండును ద్రిగర్తపతియును భీష్ముం గూడుకొని యాక్రీడి నెదిర్చిరి సాత్యకి యడరినం గృతవర్మబాహ్లికులు మార్కొనిరి మారుతి గవిసినం గుంభసంభవుండు దలపడియె నతనిప్రాపున నేపు మిగిలి నీపుత్త్రకు లాబకమర్దను మర్దింపం గడంగి కవిసిన. 159

క. గురునంపవెల్లి నాఁగుచు, సరభసముగ వారిమీఁద శరవర్షంబుల్
గురియుచు వారలయమ్ములఁ, దెరలక భీముండు పటుగతిస్యందనుఁ డై. 160

వ. సమరక్రీడ సలుపుచుఁ గురుకుమారులు దొరఁగించునారాచధారల నొచ్చి యాజ్యధారాక్రాంతుం డై నయర్చిష్మంతుండునుంబోలె మండి యుద్దండకోదండనైపుణ్యంబు సూపినం గుండభేదియు ననాధృష్యుండును గనకధ్వజుండును విరావియు సుబాహుండును దీర్ఘబాహుండును దీర్ఘలోచనుండును దీర్ఘనిద్రం బొందిరి పెఱవారు వెఱచఱచి విఱిగి పఱచిన నజంబుల వెనుకొనువృకంబువిధంబున వృకోదరుండు దోర్విలాసంబు మెఱసె నప్పుడు ప్రొద్దు గ్రుంకు చుండ నీపెద్దకొడుకు బలుమొనలం బురికొల్పికొని చలంబునం గోల్తల సేసినం గాంతేయవ్యూహంబులు నభినవోత్సాహంబునం జోక పెనంగిన. 161

తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబులఁ జాల నొప్పెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
దెఱఁగుతొడవులు దొడిగినతెఱవవోలె. 162

---

*"క. నీచెలువును నీబలువును, నీచతురత నీబలంబు నీసాహసముం
నీచక్కఁదనము నే నే, రామాలికిఁ గలుగఁ గందు రా రాకుత్తా.

వ. అని యంత నిలువక." ఈపద్యగద్యములు 155-వ దానికిఁ దర్వాత నచ్చుప్రతులలో ముద్రింపఁబడి యున్నవి గాని వ్రాఁతప్రతులం జూపట్టవు.

వ. అంత. 163

క. తిమిరము గవిసినఁ బాండవ, సమితియుఁ గౌరవులు రణము ♦ సాలించి నివా
సములకుఁ దగఁ జని రయ్య,ష్టమయామిని నుదితపటువి♦షాదుం డగుచున్. 164

క. గురువిభుఁడు నగరు సొచ్చియుఁ, జొరమిన గాంధారవిభుని ♦ సూతతనూజుం
ద్వరితముగఁ బిలువు మని య్యా,తురతం బలుమాఱుఁ జెప్పె ♦ దుశ్శాసనుతోన్.

వ. చెప్పిన నతండు వారిం గూర్చికొని వచ్చుటయు నేకాంతంబున సమ్మహీకాంతుండు
వారలతో నిట్లనియె గాంగేయగురుకృపాశ్వత్థామలు మధ్యస్థు లై పాండవబలం
బులం జెఱుచునట్టిసంరంభంబునకుం జొరరు మనసేనలు నానాఁటికి సన్నంబు లై
సమయుచు వచ్చె నేమి సేయం గలవార మనిన విని రాధేయుండు రణక్రీడా
లంపటుం డై. 166

క. నరనాథ యింక భీష్ముని, దురమునకుం దేకు మేను ♦ దోర్బలవిభవో
ద్ధురతం బాండుకుమారో,త్కరముం దత్సేనల♦ మఱిదం బడఁగింతున్. 167

క. అని పలికిన విని దుశ్శా,సనుఁ గనుఁగొని మనము వోయి ♦ శాంతనవునిభం
డన ముడిపి వత్త మని చె,ప్పి నరేంద్రుఁడు వీడుకొల్పెఁ ♦ బెఱవారిఁ దగన్. 168

వ. ఇట్లు కర్ణసౌబలుల నిజనివాసంబులకుం బోవం బనిచి బహుప్రకారసౌరభసంవా
సితంబు లగుజలంబుల జలకం బాడి పరమసురభిచందనానులేపంబులను జీని
చీనాంబరపరిధానంబులను మహనీయమాల్యాభరణంబులను బ్రస్ఫీతమణిమయ
భూషణధారణంబులను దగ నలంకృతుండై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ
బరిమళపరంపరాభాసితనూతనతైలధారాభిషేకప్రదీపితంబు లయినకరదీపికా
సహస్రంబులు వెలుంగ వేత్రహస్తులు దొలంగు తొలంగుం డని సందడి నెడ
గలుగ జడియ వందిసందోహంబులు సంకీర్తనంబులు సేయ మాగధమంజుల
గానంబులు వీనులం బొరయఁ బాఠకపఠనరవంబుల మనంబు రంజిల్ల రమణీయ
రత్నఖచితం బగురథం బెక్కి మందమందగమనంబున మందాకినీనందనుమంది
రంబు సేరం జని తదీయద్వారంబునం దేరు డిగ్గి దుశ్శాసనుముంజేయి కర
తలంబున నవలంబించి యల్లన నడచి యుచితప్రకారంబునం బ్రవేశించి యప్పి
తామహుపాదంబులకుం బ్రణామంబులు సేసి తత్పీఠసమీపంబున సముచితకన
కాసనంబున నతం డునుప నాసీనుం డై చేతులు మొగిచి యమ్మనుజపతి యతని
తో నిట్లనియె. 169

మ. నిను ము న్నెంతయు నమ్మి పాండవులయు♦ న్స్నేహంబు నేఁ జీరికిం
గొన నీపోరెడుచందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే
రి నయం బిచ్చుచు నొంప నాల్కొనక వారిం బట్టి పాలార్చె దొం
డన నేరం గురుముఖ్య యింక నిట నీ ♦ వాలంబు సాలింపవే. 170

చ. అని మొన దేవదానవుల ♦ కైనను మార్కొన రాదు నిన్ను నేఁ

డనిమిదినాళ్లు లయ్యె సమరయింపవు నోంపవు సవ్యసాచి న
వ్వని యటు లుండ నిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవ నిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే. 171

వ. అనవుడు. 172

క. అమ్మాట మనమునకు వాలమ్మై తాఁకుటయు భీష్ముఁ డత్యంతవిషా
దమ్మున నించుకవడి మానమ్ము దగం దాల్చియుండె నతవదనుండై. 173

వ. పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి. 174

క. తలకొని నీకుం బాణం, బులు డాఁపక యోపినట్లు వోరఁగ నిమ్మైఁ
బలుకఁ దగునె యక్కట నావలనం గలభక్తి యెల్ల వమ్మునఁ గలయన్. 175

వ. అని పలికి యలుక వోడమి వెండియు. 176

సీ. కాల్పఁడే మహనీయఖాండవం బింద్రుని, నమరగణంబులో విముఖుఁ జేసి
బహుదివ్యశరములు వడయఁడే యెక్కటి, బవరాన మెప్పించి శివునిచేత
గంధర్వులకు నోడి కర్ణుండు నీతమ్ములును బాఱ విడిపించికొనఁడె నిన్ను
విను నను ద్రోణు నాతనిపుత్త్రుఁ గృపుఁ గర్ణు, గెలిచి విరాటుగోవులఁ గొనం

ఆ. తక్కుపెక్కులెడలఁ బెక్కండ్ర నే మేమి, సేసె వినమె యట్టిజెట్టి నిన్ని
దినము లిట్లు దొడరి పెనఁగియు నీచేత, నేఁడు వినఁగ వలసె వేఁడిపలుకు

క. తగనిపని యని తలంపక, పగగొంటి వజయ్యులైన పాండుసుతులతోఁ
దెగి యింక నీవు రణమున, మగఁటిమి వాటింపు రిత్తమాటల నగునే. 178

వ. అని మఱియును. 179

క. గాండీవి గెలువ రాదు శిఖండిని జంపంగ నాకుఁ గాదు వినుము న
న్నొండుమగలు మార్కొనినం, జెండుదు నుగ్రముగ మున్న చెప్పితి నీకున్.

క. ఏనును నాదళమును ద్రుప, దానీకవిరాటసైన్యయాదవబలసం
తానములతోఁడఁ బెనఁగెదఁ, బూనుఁడు మీ రెల్లఁ బాండుపుత్త్రుల గెలువన్.

ఆ. నడికిరేయి వచ్చి నను నొవ్వఁ బలికినఁ, గలుగునయ్య జయము గడఁగి నీకు
నడవు మనికి నెల్లి నాచేతి[1]బలుపు సూచెదవు గాక వేయుఁ జెప్ప నేల. 182

క. అనినఁ బ్రియ మంది నగరికిఁజని పతి సుఖనిద్ర సేసి సముచితసమయం
బున మేలుకాంచి కయ్యంబున కాయిత మయ్యె మేను వొంగారంగాన్.

వ. ఇట్లు సన్నద్ధుండయి బలంబులతో వెడలి నీపుత్త్రుండు భీష్ము నుపలక్షించి భూపాల
ప్రకరంబులతో నిట్లనియె. 184

భీష్మునినవమదివసయుద్ధము.

తే. ఇతఁడు పాంచాలు రాదిగ నెల్లబలముఁ
జంపి పాండుతనూజుల సమరభూమి

1 బరువు.

ఆ గెలువఁ గలవాఁడ నని రాత్రి కవలికె నేఁడు
దఱిమి మనలావుఁ జేవయుఁ దెఱయ వలయు. 185

క. అని యాడుతులువమాటలు, విని బీభత్సంబు సిగ్గు విపులవిషాదం
బును నొక్కపెట్ట పుట్టఁగ, ననిమిషతటినీతనూజుఁ డతిదుఃఖితుఁ డై. 186

వ. తన్నుం దాన యుపశమించుకొని యున్నం గనుంగొని కౌరవేశ్వరుం డతనిక
న్నెఱింగినవాఁ డై దుశ్శాసనునితో నిట్లనియె. 187

క. మన మెల్లఁ బితామహునొ,ద్దన యుండుద మదియుఁ గాక యతనిముందటఁ బె
ట్టన వలయు శత్రుబలము,ర్దను లిరువదిరెండువేలరథములవారిన్. 188

వ. అని నియోగించిన నతం డట్లు చేసె నద్ధరణీశుండు గురుకృపాశ్వత్థామల నాలో
కించి గాంగేయుంజూపి సత్యవ్రతుం డగునీతండు శిఖండిపై నేయ నని మన మెత్తి
విడియునాఁడ చెప్పుట మీరెఱుంగుదురకాదె యన్నిచునకు గోచరంబు గాకుం
డ నిమ్మహానుభావుం బొదివికొని రా వలయు ననిన వారలు నట్ల కాక యని ర
య్యమరనదీసూనుండు సర్వతోభద్రవ్యూహం బొనర్చె నందుఁ గృపాచార్య
కృతవర్మశల్యశకునిసుదక్షిణసైంధవులును గురుకుమారులుం దానును ముందట
నిలిచెఁ దదనుమతిం గుంభసంభవభూరిశ్రవోభగదత్తులు వలపటను సోమదత్త
ద్రోణపుత్త్రవిందానువిందులు డాపటను హాలాయుధాలంబుసశ్రుతాయువులు వెను
కను ద్రిగర్తప్రకరపరివృతుం డై జననాథుండు నడుమను నిలిచి రంతకు మున్న
కౌంతేయులు సైన్యసమేతంబుగా వెడలి రట్టియెడ నర్జునుండు మనమొగ్గ
రంబు సూచి ధృష్టద్యుమ్నున కిట్లనియె. 189

తే. కంటె గాంగేయు నతనిచక్కటి శిఖండిఁ, బెట్టు మీతని మన మెల్లఁ బొదువుగట్టి
పొదివికొని వత్త మివ్విధంబునకుఁ దగ ద,ళంబుగా మోహరింపు బలంబు నెల్ల.

వ. అనిన విని యతం డట్ల చేయుదు నని సాత్యకివిరాటులు వలపటను నభిమన్యు
పాంచాలకేకయులు డాపటను నకులసహదేవద్రౌపదేయపురస్సరుం డై నయుధి
ష్ఠిరుండు నడుమను జేకితానకుంతిభోజులు వెనుకనుంగా నొనర్చి యగ్రభాగంబు
న శిఖండి నునిచి యతనికెలంకుల డాసి భీమసేనఘటోత్కచు లొక్కవలనను
బార్థుండుఁ దాను నొక్కదిక్కున నిలిచి తక్కినయోధవీరులం గలయం జేర్చి గట్టి
మొనగా నమర్చె నిట్లుభయసైన్యంబులుం బన్ని భేరీభాంకారశంఖాదినిస్వన
గర్జాస్ఫూర్జితబహుళంబుగా నొండొంటిం దాఁకె నట్టిసమయంబున. 191

క. చెంగట నభిమన్యుండు పి,శంగతురంగప్రచారచంచద్రథుఁ డై
పొంగి మనదిక్కుప్రజమీఁ,దం గవిసెం జిచ్చు దూది దరికొనుమాడ్కిన్. 192

వ. ఇట్లు గవిసి. 193

తే. మెఱసి మండలచారి యై కొఱవి ద్రిప్పి,నట్లు గురుకృపసింధురాజాదు లైన
యోధవీరులు వెగడంద నులివు మిగిలి, తరువఁబడునభ్రిక్రియ సేన దిరుగఁబడఁగ.

వ. ఇట్లు మాఱు లేక తఱుముచున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలంబుసుతో ని ట్లనియె వీఁడు రెండవయర్జునుం డై మనబలంబులఁ గలంచుచున్నవాఁ డర్జున నందను నెదుర్కొన నీవ కాని మాఱు లే దేము పాండవుల కడ్డపడియెదము నీవు వీనిం బొదివి భంజింపుము. 195

ఆలంబుసుఁడు దుర్యోధనప్రేరితుం డై యభిమన్యుపైఁ గవియుట.

క. అనవుడు నతండు దుర్దమ,దనుజావలి మున్ను గాఁగఁ దఱిమెం గుంతీ
తనయబలము గారాకులు, పెనుగాలిం దూలునట్లు భీతిం జెదరన్. 196

ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము సొచ్చి దైత్యులం
గుప్పలుగా మహిం బెలుచఁ గూల్చిన దానవనాథుఁ డమ్ములం
గప్పెఁ గడంగి వారల నఖండపరాక్రమలీల వారు వాఁ
డొ ప్పఱి తేరికూబరము యూతఁగ వ్రాలఁగ నేసి యార్చినన్. 197

క. ఆలోసన తెప్పిఱి లయ,కాలుండునుబోలె నసుర గన్నుల నిప్పుల్
రాలఁగ వారలసిడములు, నేలం బడ నేసి చాపనికరము ద్రుంచెన్. 198

వ. త్రుంచి నవ్వుచు. 199

తే. ఒకని నొకని నైదైదుమహోగ్రభాసు
రాస్త్రముల నేసి నొంచిన నతనిమకము
సొంపు సోదరవ్యథయును జూచి యడరె
నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు. 200

వ. అప్పు డుభయసైన్యంబులవారును వెఱఁ గంది. 201

క. దనుజుఁడు మాయాధికుఁ డ,ర్జునతనయుఁడు దివ్యశరధరుం డె ట్లగునో
యను చుండఁగ నయ్యిరువురు, నని సేసిరి వృత్రవాసవాకృతి దోఁపన్. 202

క. ఇత రేతరశరకృతశో,ణితధారలు నిగుడ నపుడు నిర్భరదావ
ద్యుతు లడరఁ బొలుచునగముల,గతిఁ బొలిచిరి వార లప్రకంపోన్నతు లై.

క. దనుజేశ్వరుండు మాయం, బొనరించినఁ దమము గవిసె భూనాయక ఫ
ల్గునసుతుఁడుభాస్కరాంబక,మున వెలుఁగొనరించె సురసమూహముపొగడన్

తే. అసుర వెండియుఁ బెక్కుమాయలు ఘటింప
శక్రపౌత్త్రుండు దివ్యాస్త్రజాల మడరఁ
జేసి యన్నింటి నడఁగించి చెలఁగి నొంప
రథము డిగి పాఱెఁ బెలుచ నారాతుసుండు. 205

క. రక్కసుఁడు విఱిగినం గడు, నుక్కున సౌభద్రుఁ డడరు ననురవడి గని న
ల్దిక్కులఁ బఱచెం దమలోఁ, జిక్కువడుచుఁ గౌరవేంద్రు సేనలు భీతిన్. 206

వ. అప్పుడు పెక్కండ్రు రథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యుపయిం గవిసిన.

తే. అతఁడు దానికిఁ దలఁకక యుండ ఱకుసు, నన్నిరూపు లై పోరంగ సజ్జునుండు

సరభసంబుగ భీష్ముపై నురవడింపఁ, బొంగి యిరువాఁగు నిరువురఁ బోదివె బెరసి.

వ. అట్టిసంకులసమరంబున నభిమన్యుపై నడరుకృపాచార్యుం దాఁకి సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ దునిమి యతనివిల్లు ద్రుంచినం గోపించి. 209

క. ఆసాత్యకి వేఱొకవి, ల్లాసురగతి నెత్తి యుగ్ర మగునారాచం
బేసిన నాతఁడు కేతు, వ్యాసక్తుం డయ్యె మూర్ఛ వచ్చి నరేంద్రా. 210

క. ఆలోనన తెలిసి మెఱుఁగు, వాలికతూపాతఁ డతనివక్షమునడుమం
గీలించి సిడము ద్రుక్కున, నేలం బడ నేసి యార్చె నింగి వడంకన్. 211

వ. దానికిం గినిసి శినిమనుమండు పొగరు మిగులునారాచనిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగునుగ్రగభస్తియుంబోలె నైనం గనుంగొని. 212

క. ద్రోణాచార్యుండు సుత, ప్రాణపరత్వమునఁ గృష్ణుతమ్మునిపై న
క్షీణోద్ధతిఁ గవియుడు గీ, ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. 213

చ. అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లను ద్రోణుఁ డాత్మ న
ర్జునునకుఁ గూర్చు నాతఁడు గురుం గని యెంతయు భక్తి సేయు వా
రనిఁ దమలోన నట్లు వెస నప్పుడు దార్కొని యెట్లు వోరిరో
వినఁ గల దేర్పడం జెపుము విశ్రుతభంగిగ నాకు సంజయా. 214

వ. అనిన నాసూతనందనుం డతని కిట్లనియె. 215

క. క్షాత్రము దలకొని సంగర, ధాత్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్
పౌత్రులు శిష్యులు మామలు, పుత్రు లనం గలదె తొడరి పోరన వలయున్.

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట.

వ. వినుము. 217

సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యు మూఁడునా, రసముల నేసి యుగ్రంపుటంప
వెల్లువ వఱపిన వెగ డొంద కాతఁ డా, తనిమేనఁ దూపులు దఱచు గాఁగ
నాటించె నంత భూనాథుండు పురికొల్పఁ, గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ
నరుఁ డేచి వాయుబాణమ్మున నమ్మొనఁ, దూలింపఁ గుంభజు శైలశరము

ఆ. వచ్చి యుడుప నలిగి వాసవి నారాచ, వర్షమునఁ ద్రిగర్తవసునిపుత్ర
చయముఁ [1]దెరలుచుటయు జనపతి కృపశల్య, బాహ్లికులునుఁ దానుఁ బార్థుఁ దాఁకె.

వ. అట్లు దాఁకుటయు వారల నతండు గన్నెరాకమ్ములం జీకాకుపఱిచె నట్లు గురుండు మొదలైనయందఱకును నాధనంజయుపోరు దలమునుక లయ్యెఁ గురుపితామహుండు ధర్మసూతి యున్నతిట్ట కుఱికి తలలు చెండాడె శకునిభూరిశ్రవసులు గవలం దలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభసేనలతోడం దొడరి భీమసేనుం బొదివిన. 219

1. వెల్చుటయును.

క. గిరి డిగు కేసరిచాడ్పున, నరదము డిగి భ్రమితపటుగదాభీలత నా
కరువలిపట్టియుఁ గవిసినఁ, గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తిగతిన్. 220

తే. క్రందుకొని యిట్లు మాతంగఘటలు విఱుగ
నాశ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ
బోక నిలిచి యమ్మారుతపుత్త్రుఁ జోడుఁ
దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు వఱపి. 221

వ. అప్పుడు గాంగేయుండు సేయుదారుణరణంబు ధర్మపుత్త్రునకు భరంబైన నతం
డెలుం గెత్తి పేరువేరం బిలిచి చేయివీచిన నాకళింగనాథభగదత్తుల విడిచి
యవుడు గఱచుచు. 222

క. కలయఁగఁ గరములఁ జరణం,బుల నురమున శోణితంబు జోరనఁ దొరఁగం
దలి రెసఁగిననడమామిడి, చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. 223

వ. అంతకు మున్న ధృష్టద్యుమ్నశిఖండివిరాటద్రుపదులు ధర్మనందనున కడ్డపడి
భీష్ముపై నడరి బహుప్రకారవిశిఖంబుల వెగడుపఱచిన నతం డలిగి శిఖండి
నేయ నొల్లక యమ్మువ్వురను మూఁడేసివాఁడితూపుల నేసిన నావీరరథికులు
హుతాగ్నిత్రయంబునుంబోలెఁ బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని నొ
ప్పించిరి వృకోదరుఁ డద్దెసం గవియుటం గనుంగొని కేకయగణశైనేయద్రౌపదే
యులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయం గలమేటిమగ లెల్లను మిన్నేటి
కొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరుదెఱంగులదొరలును బలంబులును
నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడుచుండం జండరశ్మి వినువీదిచక్క
సగంబునకుం జనుదెంచె నట్టియెడ. 224

తే. రథములను సామజములఁ దురంగమముల
నుఱక [1]నెత్తురుటేఱుల నీఁది తతియ నడచి
పోరి రేటును వ్రేటును బోటు నొక్క
యలవిఁ జెలఁగంగ నుభయసైన్యములవారు. 225

వ. అప్పుడు మనబలంబులజనంబులు. 226

క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు, నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ
ర్మతనూజు గెలువ వచ్చునె, మతి లేరై రింక నేటిమాటలు మనకున్. 227

ఆ. అనుచు వగచుపలుకు [2]లాలించుభీష్మాది, యోధవరులతోడ సుయోధనుండు
చెనఁటిమాట లేమి విని మెద రనిన వా,రదియు నదియు విననియట్లపోలె. 228

వ. పరాక్రమక్రీడలు సలుపుచుండి రాసందడికయ్యంబునం గిమ్మీరమర్దనుండు గద
పండువు సేయుచుండె నప్పుడు. 229

---

1 నెత్తురుటేఱులఁ దఱియ. 2. లాలించి.

క. సరభసముగ సారథి దన, యరదముఁ దెచ్చుటయు నెక్కి యతినిశితశర
స్ఫురణాపరిణతి బాహ్లికు, విరథుం గావించె సురలు వినుతింపంగన్. 230

తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ, పాతమున నొంచి యార్చినఁ బాండుపౌత్త్రుఁ
డతనిసారథిఁ బడ నేసి యంతఁ బోక, తురగములఁ జంపి యాతనిఁ ద్రుళ్లడంచె.

వ. అక్కుమారుండును దుర్ముఖునిరథం బెక్కెఁ బాంచాలపతి కుంభసంభవుపై నడరి యతనిమేన నానాస్త్రంబులు నించిన. 232

క. ద్రోణుఁడు గోపించి తను, త్రాణం బలువుల్లు సేసి తనువున రాజ
ద్బాణంబులు గ్రుచ్చిన సం, క్షీణబలుం డై యతండు సిగ్గఱి తొలఁగెన్. 233

సీ. తఱిమి సుశర్ముండు దాకి యర్జును నొంచి, కృష్ణుపై నమ్ములు గీలుకొలుప
నలిగి యన్నరుఁడు వాలంపకాలువ లోలి, నడరించుటయు వాని యఖిలబలముఁ
జేతిసమ్మెటలను జేరుకోలల వ్రేసి, యంకుశంబుల నూఁటి యతిరయమున
వాహనంబులఁ దోలువారును విండ్లును, బలకలు వైచుచుఁ బఱచువారు

తే. నైన మీతండ్రి కిరీటిపై నడర నడుమఁ, జొచ్చె సాత్యకి యన్నదీసుతుఁడు శక్తి
వైవ మెయివాల్చియది వట్టి వైచె మగుడ, నాతఁ డాభీష్ముఁ డెడఁదను నాఁడె నధిప.

వ. ఇట్లు ద్రుంచి. 235

క. ఆలోనన మెయిఁ దొమ్మిది, వాలమ్ములు నాటఁ బాండవవ్యూహము శుం
డాలరథఘోటసుభటా, భీలతఁ దలకడచి పొదివె భీష్ముని నంతన్. 236

దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.

క. కని కౌరవపతి దుశ్శా, సనుతో ని ట్లనియెఁ గంటె శాంతనవునిపై
ఘనసేన ద్రోచెఁ జని కై, కొనుఁ డీవును సౌబలుఁడు నకుంఠితవృత్తిన్. 237

క. అనవుడు నయ్యిరువురు నే, పునఁ గదియుడుఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో, ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్.

వ. ఆపది వేవురు నెఱరావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి మెక్కినం బాండవబలంబు మహామత్స్యసమూహవిహారంబునం గలంగుమడువునుం బోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును వివిధవిశిఖపరంపరలు వరఁగింప ముందటికాళ్లు దునిసిన మొగ్గతిలంబడియును మోరలు పఱియలై నెఱి ద్రప్పం గూలియు గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు ద్రెవ్విన వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱగినం జెనఁటి దిరిగియు ననేక ఘోటకంబులు రూపఱిన నేపఱి యత్తురంగనికరంబు లేటమొగంబువడి చెదరి కనుకనిం బఱచిన. 239

క. భేరీశంఖాదిరవ, స్ఫారత నప్పాండుపుత్త్రబల మేచుటయుం
గౌరవపతి శల్యునితో, గారవమున నిట్టు లనియెఁ గడు దీనుం డై. 240

క. వెలివిరిసి వచ్చుజలనిధి, పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్త్రునిబలుగో

ల్తల నిలువరింప నీవొక్క, చెలియలికట్ట వయి మమ్ముఁ । జేకొను మిచటన్. 241

ఆ. అనుడు నతఁడు పాండవాగ్రజుఁ గవలును, దాఁకి విపులచాపబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదివి । మారిమసంగిన, ట్లయినఁ జూచి నరుఁడు । ననిలసుతుఁడు

క. ఒక్కటఁ గడంగి శల్యుని, బెక్కమ్ముల నొంచుటయును । భీష్మద్రోణుల్
గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు, దిక్కులసైన్యములు నత్యుదీర్ణత బెరసెన్. 243

వ. ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగమథనం బగుప్రధనంబు
సేసె నట్టియెడ భీష్మగిరిప్రాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబు లను
కిరణంబులు వరఁగించి. 244

సీ. పంద్రెంటఁబంద్రెంటఁ । బాండవాగ్రజుని భీ,ముని మాద్రికొడుకుల । మూఁటమూఁట
నేడింట ,నేడింట । నేచి సాత్యకిని ధృ,ష్టద్యుమ్ను నొప్పించి । సమదవృత్తి
నార్చిన మాత్స్యపాంచాల్యానీకములును సో,మకవరూథినియును । మగధబలముఁ
గాశసైన్యంబుఁ గరూశసేనయు నొక్క, పెట్ట రయంబున । భీష్ముమీఁద

తే. నురవడించినఁ బాండవోత్కరముఁ గృష్ణు
తమ్ముఁ బాంచాలనందను సమ్ముఖమున
కడర నీ కాఁగి యుండఱ । కన్నిరూపు
లై మహారణ మొనరించె । నస్త్రగురుఁడు. 245

ఉ. శాంతనవుం డనేకబల సంతతి నుద్భటశౌర్యసారదు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ । దాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథిత కంపితపాతితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దనరథంబుగతుల్ మెఱయం బ్రదీప్తుఁడై. 246

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణవ్రాతంబుఁ దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబు గాన్. 247

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడి గొని మార్కొన మగలు లేక మదంబునం బొంగి
గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడ మఱియునుం గడంగి దుర్వారంబు
లగుదివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేదిక్కు సూచినం దానయై రథికులను హాస్తి
కులను నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున మోసిడుపడినయుద్యా
నంబుచందంబున నగు చున్నచోట్లును గాలుబలంబులం గనుపుకొట్టినం గాలు
చేయి తల డొక్క[1]యని యేఱుపాటు లేక వండం దఱిగినయ ట్లున్నయెడలును
బెక్కుదెఱంగులచప్పళ్లు నిగుడ రథచయంబునవయవంబులుం గరిహయనిక
రంబులయెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదివినవెదురుటడవి తెఱంగునం దోఁచు

1 యనుపేఱుపాటు.

పట్లును దఱచుగొడుగులు విటతాటనంబు సేసినం బెనుగాలిం జిక్కువడినకుసు
మితకాశవనంబునుం బోలుచక్కట్లును బహురత్నమయమకుటాదిభూషణవ్ర
జంబు వివిధవర్ణచామరజాతంబు నఱికి పడ వైచినం బ్రబలోద్ధతలులాయబులి
తం బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించుప్రదేశంబులును
నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండు
వడియుఁ గలంగం బాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహుళంబు
లగుట గనుంగొని గోవిందుండు. 247

ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచుచున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు § నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ § జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము § దోఁపఁగఁ జేయక యున్కి యొప్పునే. 248

వ. అనిన విష్వక్సేనుండు విచారడోలాయత్తం బగుచిత్తంబుతోడ నిరుత్సాహుండై
యున్నం జూచి వెన్నుం డతని కిట్లనియె. 249

క. మును మత్స్యనాథునగరం, బున సంజయుతోడ నీవు § వొంగుచు బెట్టా
డినమాట లెల్ల మఱచిన, నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా. 250

వ. అనుటయు నర్జునుండు. 251

ఆ. సకలబంధుజనులఁ § జంపి కౌరవహీన, మైనరాజ్య[1]మహిమ § యేను బడసి
యనఘ యేమిసుకృతమాచరించినవాఁడ, నగుదు మనసు గొలుపదయ్యె ననిక. 

వ. అయిన నీతో [2]నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటికొడుకుం బడవైచెదం
దేరు నడపు మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు సమ్ముఖంబు
గా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలినసైన్యంబులు గూడికొని గాంగేయు
పయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు
నిలువరించి సింహనాదంబు సేసి. 253

మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిన్ § గాండీవియంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశరస్యూతాస్యముల్ గాఁగ స
త్వరుఁడై యేసి రథంబు గూడఁ బొదివెన్ § వాలంపమొత్తంబునన్. 254

వ. అప్పుడు. 255

తే. బీఱువోయి రథ్యంబులు § మాఱుమొగము
వడినఁ దా నొచ్చి యుండియుఁ § దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన § వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె. 256

1 విభవ ♦ మేను. 2 నిప్పటి కేటి.

నదియుఁ దునుము ॥ నాతం డౌరా
క. అతఁ డొండొకవి ల్లెత్తిన, నతిరయమున ... ధృతి వేఱొకవింట శరతతిం బరఁగించెన్. 257
శతమఖనందన యనుచును, ధృతి వేఱొకవింట శరతతిం బరఁగించెన్.
శతమఖనందన యనుచును, నొచ్చి ॥ చేడ్పడి మఱియుం
క. ఆబెట్టిదంపుటంపఱ, చే బీభత్సుండు నొచ్చి ॥ చేడ్పడి మఱియుం
దా బంటుతనమ పటుబా, హాబలముగఁ బోగు చుండె ॥ నంగము దూలన్. 258
దా బంటుతనమ పటుబా, హాబలముగఁ బోగు చుండె ॥ నంగము దూలన్.
క. వివ్వచ్చునొవ్వ నెంతయుఁ, గ్రొవ్వున భీష్ముండు గడఁగుకో ల్తలయుం ద
క్కొవ్వగు నాతనిఁ జేరక, దవ్వుల నిల్చుటయుఁ జూచి ॥ తనచిత్తమునన్. 259
క. దారుణరోషం బడరఁగ, నారాయణుఁ డపుడు సైరణం దొరఁగి వెసం
దేరినొగలఁ బగ్గము లిడి, క్రూరత [1]మునికోల యెత్తికొని యిల కుఱికెన్. 260

శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిం బోవుట.

261
వ. ఇట్లు లంఘించి.
మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణికిం
ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబు గా నీబలం
బురలం బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్. 262
తే. లలితపీతాంబరంబువిలాస మొప్ప
సింహనాదోద్భటం బగుచెలువుతోడ
మెఱుఁగువెలుఁగును గర్జయు ॥ మెఱయ వచ్చు
కారుమొగి లనఁ గృష్ణునాకార మొప్పె. 263
264
వ. అట్టియెడ.
క. బలుజీవము వోయిన వెల, వెలఁ బాఱుచు నీదుయోధవీరులు వాలిసెం
బాలిసె నదె భీష్ముఁ డనుచును, [2]గలఁగం బడి యఱ్ఱు లెత్తి ॥ కనుఁగొనుచుండన్.
చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మహాత్మ వికస్వరపుండరీకలో
చన యిది లెస్స నా కిచట ॥ శాశ్వత మైనయశంబు నచ్చట
న్వినుతికి నెక్కుసద్గతియు ॥ నీదయఁ జేకుఱఁ జేయు మిష్టమున్. 266
వ. అని పలుకునంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గ నుఱికి వెన్ను
వెనుక నెయిది కరంబుల గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం
బోవం బోవఁ బదియడుగులకొలంది నాకొంతేయుండు పదస్థైర్యంబును బాహు
వీర్యంబును మెఱయ మహీతలం [3]బూని మెట్టి నిలువం బట్టి నిట్టూర్పు
నిగిడించుచు నద్దనుజమర్దనుతో ని ట్లనియె. 267
ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ ॥ మే మను నించుకసేపు ఘోరుల్

1 ములుకోల. 2 గలయం బడి. 3 బూఁది చొట్టి నిలువం.

డయ్యుట దప్పె నాపయిఁ గఽడంగినభీష్మునిపాటు సూతు రా
వయ్య రథంబుమీఁది కిటు కఽ లాశ్రితమానము వీటిఁ బుత్తురే. 268

వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె న
య్యిరువురు నెక్కినయరదంబు శిఖరద్వయసుందరం బైనశైలంబునుంబోలెఁ
బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగువారిదంబుకరణి గర్జిల్లుచుఁ బటు
నారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడువఱచి యచ్చట నొండొరుల
మెచ్చక యఱిమి తఱిమిన వైరివీరుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుం డై
పరిశ్రాంతు లైనకృష్ణార్జునులును భీతు లగుభీమసేనప్రముఖులును జేయునది లేక
చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి సలిచీమలం
గాలం జమరుచందంబు దోఁచె నయ్యవసరంబున. 269

క. తా నస్తశిఖరి మఱువడఁ, [1]బోనియపుడు పాండురాజఽపుత్త్రవిరాజ
త్సేన పొడ వడఁగు ననుకృప, నో నలినాప్తుండు గ్రుంకె ఽ నుర్వీనాథా. 270

వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయంబునం బంకనిర్మగ్న
మైనగోవునుంబోలె నున్ననిజసేనం జూచి యొక్కింతసేపు చింతాకాంతుం డై
యప్పటికిం దిగుచుటయ కర్జంబుగాఁ దలంచి తగువారల నెల్లం దివియ నియమించి.

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు వగచుఽపార్థాదులు ద
న్నుం గొలిచి చనఁగ విడిదల,కుం గడు విన్న నయి పోయెఁ ఽ గురువంశనిధీ. 272

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోహటించి పోయినం దారును దమబలంబులఁ దివియ
నియమించి. 273

చ. ఎలమి నమస్కరించుచు నఽహీనపరాక్రమభంగు లేర్పడం
బలికి యుదాత్తవాక్యములఁ ఽ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్బలసి భవత్తనూజులు మఽనంబులు నిండి ముదంబు మోములన్
వెలి విరియంగ నేఁగిరి నఽవీనవిభూతి నివాసభూమికిన్. 274

వ. ఇట్లు ధర్మతనయుఁడు దొమ్మిదవనాఁటిబవరంబున బెండువడి యానిశాసమయం
బునందు రహస్యప్రకారంబున. 275

క. మనమున విషాద మడరఁగ, ననుజులఁ గూర్చికొని దానఽవాంతకుసదనం
బునకుం జని యిట్లను నా, తనితో నాత్మీయకార్యఽదశ దెలియుటకున్. 276

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి నేఁడు భీష్ముఁ ఽ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ, రార్చుల నవ్వీరుఁ గన్ను ఽ లారం గంటే. 277

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుఽర్మానంబునం జేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను నిఽర్మాల్యంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము గొన్నయ ట్లగు నె నిఽశ్చింతంబునం గానినం

---

1 బోనాడును.

బునకుం బోయెదఁ దమ్ములం గొని తపసి।పూజ్యుండ నై యుండెదన్. 278

క. మున్నును నేఁ గారణము గ, నన్నియిడుమ లనుభవించి। రనుజులు వీరిం
గన్నారఁ జూతుఁ గాని జ, గన్నుత భీష్మునకుఁ [1]గోలు।గా నీఁ జాలన్. 279

వ. నీకు మాదెస ననుగ్రహంబు గలదేనిఁ గయ్యంబు దక్కి ధర్మవిరోధంబు గా
కుండునట్టియొక్క తెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వన
వచనంబుల ననునయించి యతని కిట్లనియె. 280

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ, వత్యద్భుతబాహువీర్యు। లనుజన్ములు దౌ
ర్గత్యము గల్గునె నీకు న, మాత్యుఁడ నై యేను రాజ్య।మహిమ నొనర్తున్. 281

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొర కున్న భీష్ముఁ। దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నున్, మగిడింపక చూచు చుండు। మనుజాధీశా. 282

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు। సవ్యసాచి, నాకు నతనికి నై యేను। నగవరేణ్య
కూర్మి మై నిత్తుఁ గండలు। గోసి యైన, నరయ నాతండు నాయెడ। నట్టివాఁడ.

వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు నులూకుండు వచ్చి
నప్పు డతనిపలుకులం బుట్టినబెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయ
వలయు నేను నీరెండెడలం బెక్కులు వలికినవాఁడ మా కిరువురకు నొండొరువుల
పలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు
ధర్మనందనుం డిట్లనియె. 284

క. కయ్యము సేయక తగుసా, హయ్యము సేయఁ గలవాఁడ। నని పలికితి ని
న్నియ్యెడ నేఁ బొంకింతునె, దయ్యము నా కేల యిట్టి।దైన్యము దెచ్చెన్. 285

వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబు గల దమ్మహాత్ముండు గౌరవులకు నయి
కయ్యంబు సేయుటకును నాకు హితం బగుకార్యంబు బుద్ధిం దలకొనుటకుం
బూనినవాఁ డతండు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా నిట్లనియె. 286

ఆ. అకట తండ్రి సచ్చి।నంతనుండియు మము, నరసి ప్రోచినట్టి।యనుఁగుఁదాతఁ
జంప మదిఁ దలంచు।తెంపు సూచితే రాజ, ధర్మ మింతక్రూర।కర్మ మగునె.

వ. అనవుడు. 288

తే. విని మురాంతకుఁ డితఁడు శాంత।తనవు కడకు
నరుగఁ జూచినవాఁ డని। యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నేతెంచెదు। గాక యనిన
యన్నదీసూనుతొంటివా।క్యములు దలఁచి. 289

వ. అజాతశత్రున కిట్లనియె. 290

ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట.

ఆ. నీతలంపు లెస్స। నీవు మున్ననినట్లు, కాక భీష్ముఁ డలుక। గదిరి పోరఁ

1 ‘గొలుపుగా’ అని వ్రాఁతప్రతులు.

జక్కఁ జూచె నేని । శత్రువుల్ వొలియరె, యిప్పు డతనిపాలి । కేఁగు మధిప.

సీ. నీవు ద న్నడిగిన । నిజవధోపాయం బ,వశ్యంబుఁ జెప్పు దేవవ్రతుండు
మనము రహస్యవర్తనమున నందఱ,మును జని యమ్మహాత్మునకు భక్తి
నెఱఁగి తెల్లంబుగ । హితకార్యగతి విన,యంబుమైఁ బ్రార్థించి । యడిగి యతని
సదయమంత్రోపదేశంబున నెగడుద, మని యిట్లు హరి నిశ్చయంబు సేయ

ఆ. నయ్యజాతశత్రుఁ । డనుజులు నతఁడును, దాను సౌమ్యవేషధరణ మొప్ప
నతినిగూఢవృత్తి । నాపగాసుతుమంది,రమున కరిగి సముచితముగఁ జొచ్చి.

వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణ
మిల్లిన నతం డత్యాదరంబునఁ బేరు వేర వార లందఱ సేమంబు లడిగి యిట్లనియె.

క. ఇచ్చటికి మీర లందఱు, వచ్చినపని యేమి యేది । వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను, జెచ్చెరఁ దలకొని ఘటింపఁ । జేసెద బ్రీతిన్. 294

వ. అని తెలి వొందిన మొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని
కి ట్లనియె. 295

క. మా కెమ్మెయి సామ్రాజ్యము, సేకుఱు నెబ్భంగి బహుళసేనోత్పాద
వ్యాకులత రాక తక్కుం, జేకొని యత్తెఱఁగు కరుణఁ । జెప్పఁగ వలయున్.

క. అనవుడు నేఁ బెనఁగఁగ మీ, కనఘా సైన్యక్షయంబు । నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున, నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్. 297

వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుండు. 298

ఉ. చిచ్చఱకన్ను మూసికొని । చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున । వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిం గెలువ । వచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే. 299

క. అనుటయు ని ట్లను గంగా,తనయుఁడు నీచెప్పినట్ల । తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురే చే, ధను వుండఁగ వినుము తద్విధము చేటపడన్.

తే. ఇట్టివానిఁ గ నన్ను మీ । రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా । యిట్టు లడుగ
మీకుఁ బ్రియ మైనకార్యంబు । మెయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు । గలదె నాకు. 301

వ. ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందినను నన్నుజయింప సమకూ
రు జోడు వుచ్చినవానిని గైదువుఁ బెట్టినవానిని సిడంబు డించినవానిని నంగనను
నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని భాతృహీనుని నపుత్ర
కునిం గని యేటుఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు మఱియు నొక్క
వ్రతంబు వూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చినపురుషత్వంబు

గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నుపాయంబు సెప్పెద ద్రుపదు నపత్యంబై నశిఖండి యట్టివాఁ డగుట మీ రెఱుంగుదుర కాదె విశేషించి ముంద టిపుట్టువున నంగన యగుట వాని కెదు రేయ కుండుదు నర్జునుండు వానిం బుర స్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడ వైచు నది వదంపడి బంధుమిత్త్రు లగుధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నాపను పేను బనిచినట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత నను జ్ఞాతులై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవు చున్నసమ యంబున బీభత్సుండు. 302

ఆ. సురనదీసుతుండు | పరలోకగతి నిరీక్షించుటకును దాను | గృతకవృత్తిఁ
జంప వలయుటకును | సవిషాదమానసుం, డగుచు నిట్టు లనియె | నచ్యుతునకు.

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధర్మరతు వయోవృద్ధు లోక | మాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ, బురుషోత్తమ చంప బుద్ధి | వుట్టదు నాకున్. 304

ఆ. [1]నన్నుఁ బాంసుకేలి | నున్న నర్మిలి నెత్తి, మేనిధూళి దనదు | మేను బొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి | మాతండ్రిగుణము లగ్గించి కన్నునీరు | నించు నతఁడు. 305

ఉ. అక్కట తండ్రి లేనిమము | నమ్మెయిఁ బెంచిన తాత నిమ్మెయిం
ద్రెక్కొనఁ గా దతండు సము | దీర్ణభుజాబలశౌర్యశాలి యై
యిక్కడి సేనఁ జక్కడిచె | నేనియుఁ జూతునకాక ధర్మముం
దక్కట కోర్వఁ జాలుదునె | ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. 306

వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కి ట్లనియె. 307

ఉ. క్రూరత కోర్చి యించుకయు | రోయక పైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు | వర్ధనముం గలిగించి పాడిమైఁ
గోరరి గొంచు సద్వ్యయము | గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి వ | చస్పతి సెప్పుట యప్రసిద్ధమే. 308

చ. అని మొన నోర్తు భీష్ము నని | యాడిననీదగుపూన్కి లోక మె
ల్లను విని యుండఁగా నిటు చ | లం బెడలం జన దెట్టులైనఁ జం
పన తగు రాజధర్మపరి | పాలన గా కిది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవు | నిం దెగటార్పఁగ వేయు నేటికిన్. 309

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను | నా ద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయవధార్థ మం డ్రదియుఁ | దప్ప దతండును వాని నేయఁ డే
ను నతని నేయుచండమున | నూల్కొని యన్యుల నేయు చుందు వాఁ
డనితరవధ్యకాయుఁ డగు | నాయనఁ దాఁ బడ నేయు నుగ్రతన్. 310

వ. అనవుడు నప్పి కవ్వడికిం గమలనాభుం డి ట్లనియె. 311

1 నన్ను బాలకేలి | నున్నచో నర్మిలి, తోడ నెత్తి మేని | ధూళి బెరయఁ.

ఉ. నీ వొకరుండు దక్కఁగ నకోనింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును ◆ జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్
దైవముచూపువో లెఁ దుది ◆ దాఁకునె యవ్విధ మిట్టు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యెటులుఁ ◆ ద్రోచినఁ బోవదు చూచి యుండుమీ. 312

వ. అని పలికిన విని యతం డట్ల కాక యప్పటికి నెట్లయిన నట్లయ్యెడు నని యర్జునుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజనివాసంబున కనిచి తమతమని కేతనములకుం జని యారాత్రి సుఖనిద్ర సేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 313

క. పాండుసుతు లేమిభంగి శి, ఖండిం గూర్చికొని యాపగాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు [1]ప్ర, చండతతో సమరకేలి ◆ సలిపిరి చెపుమా. 314

భీష్మునిదశమదివసయుద్ధానుక్రమము.

వ. అనుటయు నాసూతనందనుం డతని కిట్లను సూర్యోదయసమయంబునం బాండుసూనులు సేనాసమేతు లై వెడలి మోహరించునప్పుడు ముందట శిఖండి నిలిపి యతనికెలంకుల భీమార్జునులును వెనుక నభిమన్యుద్రౌపదేయులును వారియిరువంకలం జేకితానశైనేయులును నటపిఱుంద ధృష్టద్యుమ్నాదిపాంచాలకుమారుల ము న్నిడికొని కవల నుభయపార్శ్వంబులం బెట్టికొని యుధిష్ఠిరుండును వీరిసూరెలం బొదివికొని విరాటద్రుపదముఖ్యు లగుపృథ్వీపతులును గేకయపంచకధృష్టకేతులును నిలిచి రిత్తెఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి రంతకుమున్న మనవారును వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల నీకుమారు లమ్మహాత్ముఁ బరివేష్టింపఁ గుంభసంభవతత్సంభవులు దక్షిణవామభాగంబులను గృపకృతవర్మభగదత్తపురస్సరుండై కురురాజు మధ్యభాగంబునను బృహద్బలకాంభోజముఖ్యులైనమహీపతు లమ్మనుజేంద్రుచుట్టును ద్రిగర్తు లపరభాగంబునను బన్ని బలుమొన యమర్చికొని త్రోచి నడచి రిట్లిరువాఁగునుం గవిసి వివిధతూర్యస్వనంబులు నింగి ముట్ట నొండొంటిం దాఁకిన. 315

క. సమరం బప్పుడు దనుజులు, నమరులునుం బెనఁగుచంద ◆ మై తోఁపఁగ భూ
రమణ విను మేమి సెప్పుదు, జముపురమున నగ్గలంపుకోసందడి యయ్యెన్. 316

వ. అట్టియెడ. 317

మ. కవ లుద్దామపరాక్రమనుర్షణమైఁ ◆ గౌరవ్యసైన్యంబు సి
క్కువడం జేయఁగ భీమపార్థులును గో ◆ కొ మ్మంచు నొక్కుమ్మడిం
గవియం బాండవసేన యుబ్బి యడరం ◆ గాఁ జూచి కల్పాంతభై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరశ్రీవారితంబు గుప్పించినన్. 318

---

1 ప్ర, చండసమరకేళి నెట్లు ◆ సలిపిరి.

ఆ. కాలు కాలు పెనఁగి కాలుబలంబులు, నొడ్డగెడవుగా రథోత్కారంబు
మొగ్గతిలఁగ గుఱ్ఱములు నేల యద్రువ మా,తంగఘటలు గూలెఁ దక్షిణంబ.

క. కనుఁగొని శిఖండి వెస మా,ర్కొని భీష్ముని నేసె మూఁడుక్రూరాస్త్రములం
గని యతఁడు మరలి చూడక, తని నుద్దేశించి పలికె దరహాసముతోన్. 320

ఉ. ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగ నా
కొవ్వమిఁ జేసి యట్టినిను నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం
గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే
నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ. 321

వ. అనినం గోపించి శిఖండియు నతని కిట్లనియె. 322

క. గెలిచితి రాజుల నెల్లను, బలియుం డగుపరశురాము ప్రతివీరుఁడ వై
యలవుకలిమి నెఱపితి నీ,చలము బలము నాకుఁ జూపఁ జాలవు కంటే. 323

క. ఏయు మొకనేర్పుమై ని, క్లేయక క్రీడించి యరుగు మెట్లయినను మ
త్సాయకముల నినుఁ గూల్చెదఁ, జూ మెవ్వత నైతి నేమి సూచెదు నన్నున్.

క. నేఁ డెమ్మెయి నైనను నీ, పోఁడిమి సెడఁ దోన తవిలి పొదువుదు నిన్నున్
వాఁడిమగఁ డనుట యుడుపుదు, వేఁడిమిసాం పెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్.

వ. అనుచు మఱియు నయిదమ్ము లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మగతంబున నేఁడు శిఖండిచందంబు వింత యయి యున్నయది నదీనందనుండు సమయుటకు సమయం బైన దైవదత్తోత్సాహంబున నేచి పలికెం గావలయు నని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె. 326

## అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట.

ఆ. ఇట్టు లాడి పిదప నేమియుఁ జేయంగఁ
జాల కున్న మనల జగము నవ్వు
నేను గలుగ నిన్ను నెవ్వరి కేమియుఁ
జేయ రాదు భీష్ము నేయు మదరి. 327

వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాలబలంబులపైఁ దఱిమినం దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ మనసైన్యంబు దైన్యంబు నొంద నగునే యనవుడు రారాజుతో నతండు. 328

క. మును పదివేవురఁ జంపుదు, నని యిచ్చినబాస వచ్చె నవనీశ్వర నీ
కునిచినఋణంబు దీర్చితి, విను లా విట మీఁదఁ దఱుఁగువిధ మై తోఁచెన్

ఆ. నేఁటిభంగి సూడ నృపవర పాండవు, లొండె నన్ను వారి నొండె నేను
సమయఁ జేత గలుగు సమసెద రేయొక, మర్త్యుచేత వా రమర్త్యబలులు.

వ. ఏనను నాచేతిబలంబు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరాస్త్రంబులం బ్రచండ నరనాథయూథంబులం బొదివికొని పాండవులకుం దేఱి చూడ రాక నిర్ధూమ దహనస్వభావుం డైనపితామహుప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలు వడం జేయం దొడంగిన వారిం గనుంగొని. 331

ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ, పాండ్యకేకయాదిబలము లొక్క
మొగిన త్రోవనీమ మొనలు మాఱ్కొనుటయు, నపుడు పోరు ఘోర మయ్యె నధిప.

వ. అట్టియెడ నగ్రజుండు శిఖండి నాలోకించి. 333

తే. నీవు భీష్ముని గలికినఁ గాఁవ దేను, గలఁగ వెఱ పేల యతనిపైఁ గవియు మెయిది
కొని మదీయబాణంబులఁ గుప్పఁ గూరఁ, బఱపి కూల్చెద నీతనిఁ గటురయమున.

వ. అనిన నాతనిపలుకులు విని యెలుం గెత్తి ధృష్టద్యుమ్నుండు. 335

క. మనయోధు లందఱును శాం, తనవునిపైఁ దఱుముఁ డింద్రతనయుఁడు గలుగన్
మన మతనికి శంకింపఁగఁ, బని లే దని పలికి యార్చి బలువిడి [1]నడరెన్.

వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపదవిరాటులును సాత్యకిచేకితానధృష్టకేతుకేకయమాగధులును మఱియునుం జేయంగలరథికులు నొక్కపెట్ట బెట్టదరిన నిక్కడ గురుపుత్త్రభూరిశ్రవసులును గృతవర్మకృపకాంభోజపతులును వికర్ణదుర్ముఖవివింశచిత్రసేనులును లోనైన యోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందనుపయిం గవియుపాండవసైనికులను నతని కడ్డపడుకౌరవ్యవీరులును జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవసరంబున. 337

క. మొనసి శిఖండిని మున్నిడి, కొని యురవడిఁ దఱుమునరునకును వెస దుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన, వననిధికిని వేలవోలె వసుధాధీశా. 338

వ. ఇట్లు నిలువరించి. 339

క. ఇరువురుఁ గృష్ణుల నాతం, డిరువదిబలునారసముల నేసెం గ్రోధ
స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు, నరనాయక యతని నూఱునారాచములన్.

తే. అతఁడు నొచ్చియు నాటెంచె నైదుదూపు, లింద్రసుతుఫాలమున నాతఁ డేచివిల్లు
దునిమి పెల్లేయఁ [2]దలఁకక దుస్ససేనుఁ, డన్యధనువున నిరువదే నమ్ము లేసె.

క. ఆతూపులు నఱికి పరి, స్ఫీతం బగునారసంబు పృథుతరవక్షః
స్స్యూతంబు సేసి విజయుఁడు, సీతనయుని మూర్ఛవుచ్చె నిష్ఠురవృత్తిన్. 342

వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 343

క. సారథి యరదము భీష్ముని, తేరివెనుక [3]కెగిచె నంతఁ దెలి వొంది ధృతి
స్ఫారుఁ డగునక్కుమారుఁ డు, దారగతిఁ మగిడి వచ్చి తాఁకెం గ్రీడిన్. 344

వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగదత్తులును నభిమన్యుతో సుదక్షిణుండును

1. నడచెన్. 2. దరలక; దెరలక. 3. కరిగె.

విరాటద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుండును నకులుని తో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుండును భీమసేనుతో భూరిశ్రవసుం డును జేకితానుతోఁ జిత్రసేనుండును ధర్మనందనుతో నశ్రుగుదుండును దలపడిన [1]నట్టిదం బగుబవరంబయ్యె నందిరుదెఱంగులయోధులునన్యోన్యధ్వజభంజనంబు ను బరస్పరతురగహననంబును నితరేతరసూతనిపాతనంబును మిథఃకోదండఖండ నంబును జేయుచుండం బటుతరశరసంపాతసంపాదితశంపాజాలకాభీలంబును భీష ణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసారఘోరంబునునగునపూర్వపర్జన్య సమయంబు దోఁచె నప్పుడు గయ్యంబుకలగూ పంతయుం గనుంగొనుటకు మింటిక్రేవ నున్న వెరవుగా దనుపరుసున సవితృండు చక్కనిమింటికిం జనుదెంచె [2]నట్టియెడ. 345

మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు
త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచుఁ గాండీవి పెల్లేయుడుం
ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు నిర్లూనాఖిలాంగుండునై
రటదశ్వం బగు తేరితో నతఁడు సంత్రాసంబునం బాఱెనన్. 346

తే. ఫల్గునుఁడు భీష్ముముందటికి బలము నెల్లఁ, జటులరథవల్గనుండయి చంపు చున్నఁ
జూచిద్రోణుండుగుణరవస్ఫురణఘూర్ణ, రోదసీభాగుఁడగుచుమార్కొనఁగడంగి. 347

ద్రోణాచార్యు లశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట.

వ. అక్కడ నడచినం గాంగేయాగ్రజుండు తోడన తవిలి సేనాసమేతంబుగా నడ్డ పడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు. 348

క. అప్పుడు [3]క్రోధమునం గను, నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడమై
యొప్పినతనయున కిట్లని, చెప్పెం దత్కాలగతివిశేషము లెల్లన్. 349

చ. తడఁబడె దివ్యబాణములకుం దంత్రము మంత్రముఁ దప్పెదుం గడు
న్వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు వీ
డ్వడియెడుఁ జెయ్వు లంగము గరండంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువం బని బుద్ధి జనించెఁ బుత్త్రకా. 350

వ. అతనిమును మటు తల యెత్తి చూడుము. 351

క. కూలెడుఁగుఱ్ఱంబులు ధర, వ్రాలెడు నేనుఁగులుఁ గెడయుకరథములునై యా
భీలయుగాంతసముద్భట, కాలపురోభాగరేఖ గానఁగ నయ్యెన్. 352

వ. అదియునుం గాక. 353

తే. అడరి కురుసేనపై గ్రద్దలాడఁజొచ్చె బడఁచునున్నవి యుల్క లిక్కడ వినంగ
వచ్చె నతిరూక్షభంగి శివారుతంబు, లాపగామందనునకుఁ గీడు వహిల్లు. 354

1. శ్రేష్టిబవరం. 2. 'ననుకరణి పుద్మాన్యన్నాం బయ్యె నట్టియెడ' అచ్చుప్రతి. 3. 'క్రోధ ము గన్నుల, నిప్పులు' అనియె వ్రాఁతప్రతులు.

వ. యుధిష్ఠిరు మొగంబునం గ్రోధం బగ్గలం బై తోఁచుచున్న యది ద్రౌపదేయనకుల సహదేవసహితుం డయి తఱుముసతని మిగిలి నాకు రా రాదు నీవు దేవవ్రతు పాలికిం బోయి యతనికి దాపట వలపటం బ్రాపై నిలువు మిది ప్రాణంబులు డాఁచుసమయంబు గా దని పలికి పనిచిన నశ్వత్థామ యుద్ధామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 355

క. నరుఁ డేచి శిఖండిఁ [1]బుర,స్కరించుకొని యపుడు భీష్ము | సమయింపఁగ స
త్వరుఁ డగుటకుఁ దగ రథత,త్పరుఁ డై కురుసేనమీఁదఁ | దఱిమెం బెలుచన్.

వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబుల బారిసమరం దొడంగిన భగదత్తకృప కృతవర్మశల్యసైంధవచిత్రసేనదుర్మర్షణవిందానువిందవికర్ణులు పదుండ్రు నొక్క పెట్ట యతనిం బొదివి నానాస్త్రసంతానంబుల నొప్పించిన నొచ్చియుం జలింపక పోరునమ్మారుతిం గనుంగొని క్రీడి తోడై తఱియ నుఱికి ధనువులతునియలను బాణంబులపఱియలను గేతుచ్ఛత్త్రిచామరంబులచెక్కలను భూషణంబుల పొళ్లను బుడమిం గప్పినం జూచి సుయోధనుండు సుశర్మాదిభూపాలకుల నాలోకించి యాభీమార్జునులం దాఁక నియోగించిన. 357

క. ముందటిపదుండ్రు నానృపు, లందఱునుం గూడి [2]పెనఁగి | యయ్యిరువురచే
తం దూలపోవఁజొచ్చినఁ, గ్రందుగ బలుమొనల నెల్లఁ | గవియం బనిచెన్.358

వ. ఇవ్విధంబునం బెక్కుమొనలు పయిం బడిన నయ్యిరువురకుం బోరు భరం బగుట యెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖు లగురథికజనంబులు సైన్యోపేతంబుగాఁ ద్రోచి యేచిన. 359

క. పాండవబలములయుత్స్య, ద్దండపరాక్రమము సూచి | దర్పోద్ధత వే
దండములఁ గనిన కేసరి, చండత భీష్ముండు వొదివె | శరనఖరములన్. 360

క. డొల్లెదుసూతులుఁ బెలుచం, ద్రెళ్లెదుతురగములుఁ గా నతికూరగతిం
బెల్లేయుచు సత్వరముగ, నెల్లెడలం దాన యగుచు | నేడ్తెఱఁ బొదివెన్.361

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మగతంబున.

తే. ఉత్తమక్షత్త్రియుల నెల్ల | నుగ్రవృత్తి, నేఁడు పదినాళు లేనినా | నిశితశరచ
యములఁ గూల్చితి వేసరితినట్టు లయ్యె, మేనితోడిపొత్తిం కిట | మానుటొప్పు.

వ. అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబు సేయుచందంబునం గాంగేయాగ్రజుం గదిసి యల్లన యతనితో ని ట్లనియె. 364

క. జనియించినంతనుండియు, జనపతులం గూరవృత్తిఁ | జంపుచు నుండం
జనియెం గాలము విసివితి, ననఘా యే నింకఁ జాల | నాసురవిధికిన్. 365

ఆ. మీరు నాహితంబు | గోరుదు రేని శిఖండి మున్ను గాఁగఁ | గడఁగి యంత
వట్టువారు నొక్క | పెట్టగాఁ బైఁ బడి, యేయుఁ డింకఁ దడవు | సేయవలదు.

1. 'బుర, స్కరుఁడుగఁ గొని' అనియే పెక్కుప్రతులు. 2. పెనఁగ | నయ్యిరువుర.

వ. అని పలికి సమరప్రకారంబునం ¹దేరు గ్రెల్లు వోలి పాంచాలబలంబులపయిఁ
నడరె నప్పు డయ్యాజాతశత్రుండు సమీపవర్తి యగుధృష్టద్యుమ్ను నాలోకించి.

క. దేవవ్రతుపలుకులు విం, టే వేగమ పనుపు మొక్కటిగఁ దఱుమఁగ యో
ధావళి నెల్లను భీముఁడు, నీవును నకులతోడఁ గూడి నిగుడుఁడు పెలుచన్. 368

369

వ. అనవుడు నతండు.

సీ. మాత్స్యకైకేయాదిమనుజేంద్రులకుఁ జేయఁ, గలయట్టియోధవీరులకుఁ జేయి
చూపి మరున్నదీసూనుపైఁ గవియింపఁ, బవనజపార్థులప్రాపుకలిమి
నెఱపేది యంధయుఁ దఱుమఁ గౌరవపతి, తమ్ములు దొరలును దానుఁ దాతఁ
గడచి తాఁకినఁ బోరు ఘన మయ్యె నప్పుడు, సౌభద్రుఁ డమ్మహీశ్వరుని నొంచె

తే. ద్రోణతనయుండు శైనేయు బాణమయశ, రీరుఁ గావించెఁ జేదీశపౌరవులస
మానఘోరాక్రమం బొప్పె మారుతాత్మ, జుండు రారాజుసేనికపింజఁ జదిపె.

వ. మఱియు నందు నిందును మందాకినీనందనుపయిం ద్రోవను నతనిం గావను దలంచి
కడంగిన సైనికు లనేకులు నానాప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగు
చుండ. 371

క. మొనసి మృగేంద్రు మృగేంద్రుఁడు, సెనయం జనుపగిది నరుఁడు శీఘ్రగతిఁ శాం
తనవుపయిఁ గవియ దుశ్శా, సనుఁ డడ్డము సొచ్చె దేవసంఘము వొగడన్. 372

ఆ. అతని కప్పు డెదుర నమ్మొన నెవ్వరుఁ, జాల రైరి సవ్యసాచి యొకఁడ
నిశితవిశిఖపంక్తి నిగిడించి నొప్పించి, యొత్తి భీష్మువెనుకఁ గొందుఁగఁ జేసె. 373

374

వ. తదవసరంబున సరభసంబున నడరిన.

క. భగదత్తుని నాకవ్వడి, వెగ డొందఁగఁ జేసి యతని వెల్లెనుఁగుఁ గెం
పుగఁ ²జేసిన నాతండును, నిగిడెం బాంచాలమేదినీపతిమీఁదన్. 375

వ. ఆఖండలనందనుఁడును శిఖండిం దఱిమి తెఱపి చూపి దేవవ్రతు నేయు మని
పురికొలిపె నంత. 376

క. మనయోధప్రకరము శాం, తనవుం దలకడచి యత్యుదగ్రత నయ్యె
ర్జునుఁ బొదివె నతం డలిగినఁ, బెనుగాలిం దూలు మొగిలుపిండును బోలెన్. 377

ఆ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద, ³వాలుటమ్ము లేయ వాని నేయ
నొల్ల కతఁడు గెలని యోధవీరావళి, నేయుచుండె శౌర్య మెసక మెసఁగ. 378

క. నరుఁడు శిఖండిం దఱిమిన, శరము లతఁడు భీష్మునురుభుజామధ్యమునం
గుఱియఁగ నవ్వుచు నుండెం, గరి యంత్రజలంబు దొరఁగఁ గా నున్నక్రియన్.

వ. ఇట్లు దేవవ్రతుండు శిఖండి వేయుట సరకు సేయక యతం డగ్గ మైన నేయక
సాయకంబులు సవ్యసాచిపయి నిగిడింప మగిడి దుశ్శాసనుండు గడంగి కవ్వడి
వెగడుపడునంతకయ్యంబు సేసి నొచ్చి పాసినం గౌరవపతి గనుంగొని మొలుంగు

---

1 దేరు గెల్లు దోలి. 2 జేయ జడిసి యాతఁడు. 3 వాలురమ్ము.

చూపి చేయి వీచి పురికొల్పినం గళింగమాళవబాహ్లికవిదేహశూరసేనప్రముఖ
బలంబులు బలమర్దనుతనయుదెసకుం గవిసిన. 380

తే. అతఁడు దివ్యాస్త్రజాలంబు నతిశయంబు, చూప చతురంగబలములు రూపుమాపి
యుఱక తఱిమి శిఖండికిఁ జెలిపి చూప, వాఁడితూపులు భీష్ముపై వాఁడు నినిచె.

వ. అసమర్థయంబునం గృపశల్యవివింశతివికర్ణులం గూర్చికొని పేర్చి దుశ్శాసనుండు
శాంతనవున కడ్డపడినం బార్థుం డయ్యేవురను విరథులం జేసిన. 382

క. కురుపతియు ననుజవర్గముఁ, బరమక్రోధమునఁ దెంపు బలుపును మెఱయన్
సురనాథనందనునిపై, నురవడిఁ ద్రోచుటయు సేన యుగ్రత నడరెన్. 383

క. పాండవబలములు దలపడి, భండన మొనరింప నగ్రభాగంబున ను
ద్దండతఁ బోరెడుమనుమల, తండము గని మెచ్చి యప్పితామహుఁడు వెసన్.

తే. అరిబలంబుపై నొక్కదివ్యాస్త్ర మేయఁ
దలఁచి యరిఁబోసి తిగిచి యుదగ్రవృత్తిఁ
గవిసి ముందట నున్నశిఖండిఁ జూడ్కి
నొడరుటయుఁ డాల్మిమైఁ డెగ [1]యుడిపె నధిప. 385

వ. అంత. 386

క. సోమకమాత్స్యప్రముఖో, ద్దామబలము లేచి పెలుచఁ దఱుముటయును సం
గ్రామతలము సేనాంగ, స్తోమాంగమయంబు సేసె దుర్దాంతగతిన్. 387

క. సేనల నిమ్మెయి భీష్ముఁడు, దీనతఁ బొందింప [2]నలిగి ధీరత్వము వీ
రానీకం బగ్గింప శ, తానీకుఁ డెదిర్చె నతని నాసురభంగిన్. 388

విరటుతమ్ముఁ డగుశతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట.

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాలమ్ముల నొప్పించినం గోపించి. 389

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులన్
డొల్లం దీవ్రత నేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమి యాభీలద్యుతిప్రస్ఫుర
ద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్. 390

వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన. 391

క. మొన లెల్ల విఱుగ మధ్యం, దినమున నినుమాడ్కి బయలఁ దేజోనిధి శం
తనుసూనుఁ డొప్పె నప్పుడు, గనుఁగొని యిట్లనియె శౌరి గాండివితోడన్.

క. మనమోహరములు సెడి కను, కనిఁ బాఱెదు నిప్పు డాపగాసుతునకు గ్ర
క్కున నీవు మార్కొనక త, క్కినఁ గార్యము దప్పుఁ బొదివి గెలువుము కడఁకన్.

వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీనందను నమందమార్గణ
పుంజంబునం బొదివె శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు

1 యుడిచె నధిప, 2 గడఁగి.

వాని నేయ నొల్లనిసందున నాసవ్యసాచి యతనివిల్లు దునిమి పెల్లేయుచున్న
జూచి సైరింపక శల శల్య కృప కృతవర్మ చిత్రసేన భూరిశ్రవఃప్రభృతివీరలోకం
[1]బలిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు [2]నేయుచు భీష్మున కడ్డపడుం డ
దలకడవుం డనునెలుంగులు నింగి ముట్ట బలసమేతంబుగా నడరినం గని సమీర
నందనసాత్యకిసౌభద్రవిరాటద్రుపదఘటోత్కచప్రముఖయోధవర్గం బనర్గళభ
గిం దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమయస
మరం బయ్యె నందుఁ బురందరనందనుండు మనసైనికులకండఱ కన్నిరూపు లగు
నైంద్రవారుణాగ్నేయాదిమహాశరంబులం దెరల్చుచు సురక్షితుండై శిఖండిం
బురికొల్పికొని మీతండ్రి నేయించుచు నతం డెన్నివిం డ్లత్తిన నన్నిటిం దోడ్తో
తునుమాడుచుండె నాక్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగింప నదియునుం ద్రుం
చి సూతునిం గేతనంబునుం గూల్చిన. 394

సీ. మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁ బాండవుల నాయొక్కవింటన కడంగి
గెలువనే వీరికిఁ గృష్ణుండు ప్రాపుగా, కున్న నిం కది యట్టు లుండ నిమ్ము
కృష్ణుఁ డోడుఁగఁ గొని కీడ్పడి వీరలు, వచ్చినఁ జెప్పితి వధవిధంబు
సమర ముపేక్షించి శాంతిమై నుండెద, నడిచిపాటేటికి ననఁగ నెఱిఁగి
తే. చదల సుర లిట్లు మే లిది సమ్మతంబు, మాకు నని ప్రీతిమైఁ జెప్ప మాట లాత
డొక్కరుండును వినియె నే నొకఁడు వింటి, మునిమహానుభావంబున మనుజనాథ.
వ. తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరం బగుమారుతంబు మత్తటినీతనయుమీఁదఁ
నుడిసె సురదుందుభులు మ్రోసెఁ గుసుమవర్షంబులు గురిసె నవియు ననన్యగోచ
రంబు లయ్యె నిట్లు నిశ్చయించియు నమ్మహాత్ముం డూరకున్నం గెలని కొకభంగి
మై తోఁచు నని తలఁచి. 396
తే. ఒక్కవిల్లెక్కు వెట్టంగ నుఱక వెస శి, ఖండి పదునుమార్గణంబులఁ గడఁగి యేయ
నతఁడు మిసిమింతుఁడును గామి నల్ల నవ్వి, పఱపెఁ దన యమ్ములతనిపై ఫల్గునుండు.
వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 398

క. నరుఁడు దనమీఁదఁ దొరఁగెడు, శరములు వారించి యతని చాపం బధిక
త్వరితగతిఁ ద్రుంచి యతని, క్షురనారాచంబు దనువు సొర నేయుటయున్. 399
వ. తమకుం దమయోధవరులకుఁ వారింపం జేరం జెనయం గొలఁది కాక వెల్లివిరిసిన
శరనిధిభంగిం బొంగినవివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం దన్ను విడువక కెలంకుల
నున్నకొడుకులం గనుంగొని మీతండ్రి రారాజుతో ని ట్లనియె. 400
మ. అని దేవాసురకోటి కైనను నశక్యం బిమ్మహావీరు మా
రొక్కన వీఁ డల్గిన మర్త్యు లేమెదు రుదారుం డైనయాక్రీడి ద
క్కన నిప్పాండవసైన్య మింతయును మ్రగ్గింపంగ నేఁ జాలుదుఁ

1 బలిభీకరం బగుదివ్యా. 2 నేయుండు భీష్ము.

వినుసత్యం బిది వీనివింటి కెదురన్ వి ల్లెత్తలేఁ డెవ్వఁడున్. 401

క. అను నెడ శిఖండిచాపము, వెనుకం దనవిల్లు నిల్పి వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను, జననాయక దొడ్డనారసంబుల భీష్మున్. 402

వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి. 403

సీ. అశనికల్పము లివి యర్జునుబాణముల్, గాని శిఖండివి గావు సుమ్ము
కర్కటి గర్భంబు కరణి గాత్రము వ్రచ్చె, నిట్టివి వీనికి నెందుఁ గలవు
బ్రహ్మదండంబుల పాటి వై మర్మంబు, లిట్టు నోనాటు నే యితనిచేత
జముదూతలట్ల ప్రాణముల వెలార్పఁగ, నీద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె

ఆ. దృఢ[1]విముక్తములును దీప్తాకృతులు లక్ష్య, శుద్ధిమంతములును సునిశితములు
నైననారసంబు లతనివి గాక యీ, తనివి యగు నె యెవ్విధమునఁ జూడ.

క. అనుచుఁ బటుశక్తి నప్పా, ర్థుని వైచిన నది యతండు దునుమాడుడు శాం
తనవుఁడు వాలుఁ బలకయుఁ, గొని యరదము డిగ్గఁ జూచు కోలఁదిం బెలుచన్.

తే. ఏసి యారెంటిఁ దునియలు సేసి యెలుఁగు
సూపి యే నుండ వెఱ పేల నాపగాత
నూజుఁ బొదువుఁడు మీ రని యోజఁ జెప్పె
శక్రతనయుండు దనయోధజనుల కెల్ల. 406

వ. అప్పలుకు లాకర్ణించి. 407

క. ఏయుఁడు పొదువుం డడువుఁడు, వ్రేయుఁ డనుచు వారు జాహ్నవీతనయుఁ గదుర
డాయుడు మనసైనికులుం, గో యని తలపడ్డఁ బోరు ఘోరం బయ్యెన్. 408

వ. అప్పుడు. 409

తే. ఏచి గాండీవి కురుసేన నెగవ నతని, వారు వెఱవక భీష్మునిఁ జేరి యొడల
వ్రేలెఁ డెడ లేనియట్లుగ వివిధభంగి, నిష్ఠురాస్త్రశస్త్రంబుల నినిచి రధిప.

భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట.

వ. అంత నంశుమంతుండు శాంతుం డగుచువచ్చె నట్టియెడం గదిసి కవ్వడి గాంగే
యుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడం ద్రోచిన. 411

క. తూర్పుతల గాఁగ నీసుతు, లేర్పడఁ గనుఁగొనుచు నుండ నిల గంపింపన్
దర్పోజ్జ్వలుఁ డా భీష్ముఁ డ, హర్పతి యస్తాద్రి సేరు నట్లుగఁ బడియెన్. 412

తే. తనువు ధరఁ బొంద కుండఁగఁ దల్పభంగి
శరము లూఁత యై పొలుపారె నరవరేణ్య
యట్లు శరతల్పగతుఁ డగు నమ్మహాను
భావు దేవవ్రతుని దేవభావ మొందె. 413

చ. అనిమిషు లప్డు సూచి మృతుఁ డయ్యెడు నక్కట దక్షిణాయనం

1 సుముక్తములును; సముక్తములును.

బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ । బొందిన భీష్ముఁ డెఱింగి వారి కి
ల్లను సురలార కాలగతి । నాత్మఁ దలంచియ కాదె మేనిలో
నునిచినవాఁడఁ బ్రాణముల । నుమ్మలికింపకుఁ డించు కేనియున్. 414

వ. సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రి మెచ్చి యవధ్యత్వంబును స్వచ్ఛంద
మరణంబును నిచ్చినవాఁడు గావునఁ దద్వరప్రభావంబున నావధంబున కేనోడం
బడక కానేర దయ్యెఁ బ్రాణంబులు నావశంబ యనిన విని వారలు సంతోషించి
రాసమయంబున భాగీరథిపనుపునం గొందఱు మునివరులు హంసరూపంబుల న
మ్మహాత్మునకు దక్షిణాయనం బెఱింగింపం జనుదెంచి యతండు దెలిసియునికి నతని
చేత నెఱింగి ప్రియం బంది యేఁగి రట్టియెడ దుర్యోధనుండు వుచ్చిన దుశ్శాస
నుండు గుంభసంభవుపాలికిం బోయి భీష్ముపాటు సెప్పిన నతండు మూర్ఛిల్లి
యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథుక[illegible]ం జనియె నయ్యవ 415
సరంబున.

సీ. పాండవేయులు మాత్స్య । పాంచాలయాదవ,సహితంబుగా సంత । సమునఁ బొదలి
రాదెస బొబ్బలు । నార్పులు బహుతూర్య,కోటియుఁ జెలఁగె నీ । కొడుకుగమియు
నీదిక్కుదొరలును । నెలుఁగెత్తి యేడ్వంగ, నంబరచరులహా । హారవంబు
లులియంగ రోదసి । గలయంతవట్టును, ఘనశబ్దమయ మయ్యె । మనుజనాథ

తే. కాలు సేయార్చుటలు లేక । కన్నుఁగవల
నశ్రు లొలుకంగఁ జిత్తంబు । లడలఁ బాండు
సూనుతతిఁ జూచు చుండిరి । గాని యించు
కయును గడఁగరు మనవారు । గయ్యమునకు. 416

వ. తదవసరంబున నంబరమణి యపరరత్నాకరంబు సొచ్చె ననిన విని ధృతరా
ష్ట్రుండు సంజయున కిట్లనియె. 417

క. నాయుల్ల మరయ నినుమో, ఱాయో, కా కిట్లు రూపఱక విన నేర్చే
సాయకసముదయఖరభవ,దీయవచనచయము గవియ । దేరం దిర మై. 418

వ. ఇంక నేమేనియుం జెప్పఁ గొఱంత గలదే యనుటయు నాసూతనందనుం డిట్లను
నప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు లూడ్చి యాయుధంబులు
వెట్టి గాంగేయుకడకుం బోయిరి కౌంతేయులు నట బంధుమిత్రసహితు లయి
యచటికిం జనిరి ధనంజయుం డొకరుండును ధనుష్పాణి యై యరిగె ని ట్లయ్యిరు
దెఱంగులవారలుం దత్కాలప్రశాంతస్వాంతు లై యన్యోన్యవిషయరోషంబులు
దక్కి తన్నుం బరివేష్టించినం గులగురుం డగు నమ్మందాకినీనందనుండు వారి నభి
నందించి కొలిపించికొని యుండె. 419

తే. తనకుఁ గ్రీడల యని భవ । త్తనయులకు నె
ఱుంగఁ జెప్పిన వారు గ । డంగి మెత్తఁ

దనము గలతలగడలు దేఁ బనుచుటయును
జూచి చిఱునవ్వుతో సవ్యసాచిఁ బిలిచె. 420

క. పిలుచుటయు నతఁడు బాష్పము, లొలుకఁగ గాండివము పెట్టి యొయ్యన చనినం
దలగడతూపులు సెజ్జకు, నలవడఁ బెట్టు మని భీష్ముఁ డాతనిఁ బనిచెన్. 421

వ. ఇట్లు పనిచినం బార్థుం డట్ల చేయుదు నని గాండివంబు పుచ్చికొని మఱియు ననుజ్ఞ గొని మూఁడువాలమ్ము లభిమంత్రించి పెడతలఁ దాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచి నిలుచునట్లుగా నేసినం దాత ప్రీతుం డై తల్పంబు నకుం దగినయుపధానంబు పెట్టె నని యతనిం గొనియాడి సకలపౌత్రులను ధాత్రీపతులను నవలోకించి. 422

క. రవిఁ గ్రొల్చి యుత్తరాయణ, మవునంతకు నంపపాన్పునం దిట్లు మహో
త్సవలీల నిలుతు నాకీ, దివసంబులఁ జేయ వలయు దృఢరక్ష దగన్. 423

క. అలయ కరయ నోపినవా, రలు గ్రక్కునఁ బరిఘతోడిప్రాకారం బి
ట్టలముగఁ గావింపుఁ డనుడుఁ, దలకొని నీసుతులుఁ బాండుతనయులు భక్తిన్.

వ. అత్తెఱం గాచరింపనుం దాత్పర్యంబునరక్షింపనుం దమతమయందుఁదగినవారల నియోగించి రంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స సేసెద మని తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి పీడుకొల్పె గీతవాద్యనృత్తప్రవీణంబు లగుపాత్రంబు లమ్మహాత్మునకు వినోదంబు సలుపు చుండె నట్టియెడ నాదేవవ్రతుండు నీళ్లుద్రావ నడిగినం దనుపారునీ రనేకులు గొనివచ్చిన నతండు.

తే. వినుఁడు శరతల్పగతుఁడనై యునికిఁ జేసి, యన్యసలిలంబు సేవింప ననుచితంబు
నాకుఁ దేజోమయాస్త్ర[1]విన్యాసవిధిస,ముత్థితం బైనభూజల మొకఁడు దక్కఁ.

వ. అనుటయుఁ గౌరవులును దక్కటిరాజులును వెఱఁగుపడి యున్నం గవ్వడిం గనుంగొని గాంగేయుండు. 427

క. శరవేదన సర్వాంగము, నెరియఁగ నాకిపుడు పెదవు లెండెడుఁ దృష్ణా
భర ముడుపఁ దగిననీళులు, వెరవునఁ దే నేర్తు వీవ వే తెమ్మనఘా. 428

వ. అనిన నట్ల కాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు సేసి తేజోమయం బయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబు గాఁడ నేసిన భాసురచ్ఛాయం బగుతోయంబు ధారారూపంబున దివ్యగంధరసోపేతం బయి మెగసిన. 429

ఆ. కౌరవులు ప్రకంపగాఢవిస్మయు లైరి, పాండుసుతులు వారిబలము నుబ్బి
యార్చి సంకులొత్తి రాజలంబుల నమ్మ,హాత్ముఁ దృప్తుఁ జేసె నర్జునుండు.

వ. ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీనందనుండు పురందరనందనున కిట్లనియె. 431

---

1. విన్యస్తవిధి.

ఉ. నారదుచేత నిన్ను మునినాథునిఁ గాఁగ నెఱింగి యుండుదుర్
శౌరియు నీవుఁ గూడిన నసాధ్యము లెవ్వియు లేవు దర్పదు
ర్వారుఁడ వైననీవలని వైరము గీడని చెప్పఁ జెప్ప నీ
కౌరవరాజు మానఁడు దొరగం జెడుఁ గా కిట మీఁద భీముచేన్. 432

వ. అని పలికి దీనమానసుం డగు చున్న భగవత్సూనుతో ని ట్లనియె. 433

మ. నరుఁ డత్యద్భుతవిక్రముం డతని నారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింప రాదు సమరావష్టంభముం దక్కి ధ
ర్మరతుం డై నయ్యజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్ధరా
జ్యరమం బొందుము మీరు గొంద ఱయినం జా కున్న నీ కొప్ప దే. 434

వ. అని పలికి యూర కుండినం గౌరవపాండవులును మాఱుపలుకక యతనికి నమ
స్కరించి నిజనివాసంబులకుం జని రట్లు సనునెడ గోవిందుండు గాంతేయాగ్రజుం
గనుంగొని. 435

క. సురలకు నజయ్యుఁ డగునీ, సురసరిదాత్మజుని గెలువఁ జొప్పడునే యె
వ్వరి కైన నద్భుతావహ, పరికరు లగుమీకుఁ దక్కఁ బౌరవముఖ్యా. 436

క. అనుటయు నతఁ డి ట్లను నే, మనఁగా నొకమానుసుల మె యప్రతిహతవీ
రుని నిన్నుఁ బడసి యింతటి, పనులకుఁ జాలితిమి గాక భక్తాధీనా. 437

కర్ణుఁడు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట.

వ. అని యి ట్లియ్యిరువురు నొండొరులం బ్రశంసించుచు నఖిలజనపరివృతు లై శిబి
రంబుల కరిగిరి తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తివినయం
బులు దోఁపం బాదప్రణామం బాచరించి. 438

ఆ. అలుక దక్కి నన్ను నధికవాత్సల్యశ్రీ, దలము గాఁగఁ జూచి తగినమాట
లాడవే మహాత్మ యనుటయు నాతండు, గారవమున నతనిఁ జేరఁబిలిచి. 439

వ. ఒక్క[1]కరంబు మలంచి కౌఁగిలించికొని యచ్చట నున్నరక్షకాదిజనంబుల నవ్వ
లం బోవం బనిచి యతనితో ని ట్లనియె. 440

క. నీదెసఁ గోపింతు నె కుల, భేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపం
గా దని కినియుదు లే దన, [2]రా దలఁతును నిన్ను నిష్ఠురంపుఁబలుకులన్. 441

వ. అది శిక్ష గాని రోషంబు గా దట్లుం గాక. 442

క. నీయుదయము దైవికగ, ర్భాయత్తము నీకు మర్త్య లసదృశులు గాం
తేయుఁడవు గాని విను రా, ధేయుండవు గావు నీవు ధీరవిచారా. 443

వ. ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె నేనును భవదీయ తేజో
విశేషంబువలన నుంగనుంగొనియుండుదుఁ బాండుతనయుండ వగుటం జేసి నీయెడ
వాత్సల్యంబ కాని మాత్సర్యంబు లే దొక్కటి సెప్పెద విను మేను గురుపాండ

---

1 కరం బక్కలి మలంచి. 2. రా వదలుతు.

వులవైరం బుడిపి పుచ్చితి నప్పాండవేయు లజయ్యు లప్రమేయుం డగుకృష్ణుండు
వారికి విధేయుండు గావున వారలతోడివిరోధం బొప్పదు నీవును నొండుదలంపు
వక్కి యక్కౌంతేయులం గలసి యుండు మనినం గర్ణుం డతని కి ట్లనియె. 444

క. కౌంతేయుండ నగుదు నది, యంతయుఁ దొల్లియును వింటి నార్యులచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ, సంతానము[1]తోడిపొత్తు సనునే నాకున్. 445

ఉ. వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింప రాదియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
స్ఫారమణుండు సేయుతగుసమన్నన లెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక యే విడిచి పోవుట ధర్మమె వీరకర్మమే. 446

వ. అదియునుం గాక. 447

ఉ. మాటలు పెక్కు లాడి యనుమానము లేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జలంబునఁ బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యే బలువు సేసితి వైరము నాకు నింక నీ
వీటికి వారివీటికిని వెక్కస మయ్యెడుకయ్య మొప్పగున్. 448

శా. దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపఁగా వచ్చునే
నీ విన్కన్ నను నొండు వల్కక పరానీకంబుపైఁ బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబు సం
భావింపన్ విహరించెదన్ మురరిపుం బాధ్యుం దలంకించెదన్. 449

చ. అన విని భీష్ముఁ డిట్టు లను నంతకుఁ జాలు నెఱుంగనే సుయో
ధనునకు నెప్డు నీభుజదర్పము గాదె సహాయ మెద్ది యా
తనికిఁ బ్రియంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున సంతసిల్లు మనుమానము దక్కు మనుజ్ఞ యిచ్చితిన్. 450

వ. అని తెలివొంది పలికినదేవవ్రతుబంధుభావంబునకుం బరమానందంబు నొంది
రాధేయుండును నిజనివాసంబునకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకుం
జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు. 451

ఉ. మర్దితతాపసంకలనమంజులనామ దురంతదుర్దశా
కర్దమలేపనిర్హరణకారికృపామృత[2]పూర కర్మస
మ్మర్దనిరాసకర్మఠ సమత్వపరిస్ఫుటరూపభావనా
నిర్దళితారివర్గ మహనీయమనోరమణీయవైభవా. 452

క. భసిత[3]పరభాగహేలా, లసితశ్రీవత్సలలితలాంఛన పింఛ
ప్రసృమరరుచిశబలోరగ, విసృమరదీధితికలాపవి[4]వేష్టితమాళీ. 453

---

1 తోడిపొందు. 2 పూర్వకర్మ. 3 పరిభాగలీలా. 4. పవేష్టిత.

మాలిని. క్షురణరహితవృత్తీ గాఢిహ్యా[1]భక్తప్రవృత్తీ
[2]కరణాగమనలీలా గాఢకారుణ్యశీలా
స్మరణశుభదమూర్తీ [3]మధ్యరక్షిప్రవర్తీ
చరణవినమదింద్రా సంతతానందసాంద్రా. 45

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు సర్వంబును దృతీయాశ్వాసము. 45

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము న ం ద లి

భీష్మపర్వము సమాప్తము.





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము, ప్రథమాశ్వాసము.

---



సంశ్రయమంగళగా
రీసంగమవిభవపుణ్యా రేఖాసంప
ద్భాసితవక్షోవామాం
గాసూత్రితచిత్రమహిమ హరిహరనాథా. 1

{సంజయుఁడు యుద్ధభూమికిఁ బోయి మరలి వచ్చి యందలివృత్తాంతంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.}

వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె. 2

క. మునిజనవల్లభ యివ్విధ, మున దేవవ్రతుఁడు శాంతిఁ బొందినక్రమ మె
ల్లను ధృతరాష్ట్రమహీశుఁడు, విని యెయ్యది యాచరించె వినిపింపు తగన్. 3

వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 4

క. అనిమిషనదీతనూజుఁడు, సనుటయు విని యవ్విభుండు సంజయుఁ బోవం
బనిచెను దనయునికడకు న,తనివిజయముకాంక్ష దనహృదయమున మొలవన్.

క. పనిచి కృతపడినగాంగే,యుని దెసయుమ్మలిక నాతఁ డుల్లము నానా
ఘనతరచింతాభర మొం,దినఁ గుందుచు నుండఁ గొన్నిదివసంబులకున్. 6

క. వ్యాసప్రసాదమహిమం, జేసి యుభయసైన్యగతవిశేషజ్ఞుం డై
యాసంజయుఁ డొకనాఁటిని, శాసమయమునందుఁ గడు వేసం జనుదెంచెన్. 7

వ. ఇట్లు శిబిరంబుననుండి సూతనందనుండు గరినగరంబునకు వచ్చియంతఃపురంబున
నున్నధృతరాష్ట్రు నుచితప్రకారంబునం గనిన నమ్మనుజవల్లభుం డతనిం దనచేరువ
ననిచికొని యాదరించి. 8

చ. అమరనదీతనూజు సమరావనిఁ గోల్పడి నాదుయోధవ
ర్గము మఱి యెవ్వనిం గొని పరాక్రమదుర్దమపాండుపుత్త్రసై

న్యమునకు మార్కొనం దలఁచె నక్కట కౌరవు లేమి సేసి రా
సమయమునన్ బలప్రచయ[1]సంఘటనం బెటు లయ్యె సంజయా. 9

క. అనిన విని సూతసుతుఁ డి, ట్లను నక్కురునాథుతోడ నవహితమతి వై
విను మంతయుఁ జెప్పెదఁ గ్రమ,మున నీయడిగిన తెఱంగు భూవర తెలియన్.

వ. దేవవ్రతుండు దేవభావంబు నొందినయప్పుడు కురుపాండవు లతనికడకు వచ్చు టయు నాసమయంబునఁ బుట్టినవిశేషంబులు నాఁడు నీ కెఱింగించితి శరతల్ప గతుండైన శాంతనవుండు సెప్పినహితవచనంబు లాదరింపక రోషసంరక్తనయను లగుచు నతని నీడ్కొని యట్లు సనినకౌరవులు నాఁటివేకువ నీకడనుండి యేను బోయి శిబిరంబు సొచ్చునవసరంబున. 11

మ. సమరోద్యోగము వీటికిం దెలుపునిస్సాణాదితూర్యంబు లొ
క్కమొగిన్ మ్రోయఁగ వారణాదిచతురంగస్ఫారసన్నాహసం
గమనాటోపము మిక్కుటంబుగఁ గడంకన్ వీర నైపథ్యవి
భ్రమలోలాకృతు లైరి మోముల వివర్ణత్వంబు సంధిల్లఁగాన్. 12

వ. ఇట్లు సన్నద్ధు లై వెడలి యస మెడలినబలంబులం గూర్చికొను చుండి. 13

ఉ. అప్పుడు భీష్ము లేమి హృదయంబుల నుమ్మలికంబు గూరఁగా
నెప్పటిచందముల్ విడిచి యేడ్తెఱఁ దక్కినచూడ్కు లొండొరు
న్రెప్పలమాటునం [2]బొలయ నీసుతుపాలికి వచ్చు రాజులం
దిప్పు డతండు రా వలవదే యని కర్ణుఁ దలంచి రందఱున్. 14

వ. అట్టియెడ. 15

చ. పతిరహితాత్మ యైనసతిభంగియు గోపకహీన యైనగో
ప్రతతివిధంబు సస్యవిధురస్థితి యైనధరిత్రిచాడ్పు ను
ద్ధతహరిశూన్య యైనవసుధాధరకందరభూమిచందముం
మతి మనసేనఁ దోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు లేక యుంగుటన్. 16

ఉ. అంగద నాథు మ్రింగినవృకావలి దన్ వెస ముట్టికొన్న స
ర్వాంగములుం జలింప వెగ డందుచు దిక్కులు సూచు చున్నసా
రంగియపోలె నుండెఁ గురురాజ భవత్సుతుసేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభితవిక్రమలీలఁ బొల్చుటన్. 17

ఆ. కర్ణ కర్ణ వచ్చి కావు మనాథుల, మైతి మను నెలుంగు లగ్గలముగ
బలములోన నెల్లఁ గలయంగ వీతెంచె, నార్తి దెల్లముగ జనాధినాథ. 18

వ. తదనంతరంబున. 19

క. పిలువుఁడు దడయక కర్ణుని, బలవిక్రమశాలి యతఁడు పదిదివసములుం
గలనికి రాఁడు నదీసుతు, పలుకులకుం గనలి సచివబంధుయుతముగాన్. 20

1 [illegible]. 2 [illegible].

వ. అని కౌరవులును దక్కటిజనపతులును నతని నాసపడి పలుకు చుండి రాతని తెఱంగు దొల్లియు నీ వాకర్ణించి తది యెయ్యది యనిన. 21

చ. అనఘ సరిత్సుతుండు దను ♦ నర్ధరథుం డని పల్కినన్ మనం
బునఁ గడు నొచ్చి నీ వనికిఁ ♦ బోయిన నద్దెస రాను నీజయం
బున వనవాసి నయ్యెద రిపుల్ నిను నోర్చిన వారి నోర్చెదన్
ఘనభుజశక్తి నే [1]ననియెఁ ♦ గాదె నృపుల్ విన నమ్మహాత్ముతోన్. 22

వ. కావున నతం డంతకు మున్న కయ్యంబునకుం దొలంగి యుండె నాఁ డట్లు [2]మనవారిమనంబు లెల్ల నాసూతనందనుదెసకుం బాఱె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 23

క. తను సిమ్మెయిఁ దలఁచినయ, మ్మనుజేంద్రులఁ గౌరవులను ♦ మనమూఁకల న
య్యనిఁ గర్ణుఁడు గాచెనె తన, మనోరథము లెల్ల ఫలసమగ్రతఁ బొందన్. 24

వ. అనవుడు నమ్మనుజపతికి నతం డిట్లనియె. 25

క. వననిధినడునీటఁ గలము, మునిఁగిన బెగ డందుచిత్తములు గలిగినత
జ్జనులక్రియ నున్న[3]సేనలు, గనుఁగొన దీవిగతిఁ దోఁచెఁ ♦ గర్ణుం డంతన్. 26

వ. ఇట్లు పురంబు వెడలి యతండు కురుపతికడ కేతెంచి ప్రీతుం డగునతనిచేత సభినందితుం డై రాజలోకంబు నాలోకించి. 27

చ. దమమును సత్యముం దపము ♦ దానము శీలము నస్త్రవీర్యశౌ
ర్యములును భీష్మునంద కల ♦ వట్టిమహాత్ముఁడు పోర నీల్గె నిం
క మనకు నేటిబాహుబల♦గర్వము లెక్కడిసేన లక్కటా
సమసెనె కౌరవేశ్వరుని♦సంపద యంచు విషణ్ణమూర్తి యై. 28

క. కన్నీ రొలుకఁగ వగచిన, నన్నరపతు లెల్ల నేడ్చి ♦ రార్తరవంబుల్
మిన్నంద నశ్రుజలములు, విన్ననివదనంబులందు ♦ వెల్లిగొనంగన్. 29

వ. అప్పుడు దన్నుం దాన యుపశమించుకొని యందఱడెందంబులయుమ్మలికంబులు వాయ రాధేయుం డిట్లనియె. 30

క. మీ రెల్లఁ జూచు చుండఁగఁ, గౌరవనికురుంబమునకుఁ ♦ గన్నాకై యొ
ప్పారినభీష్ముఁడు వడియెను, మేరు వొఱిగినట్టు లసము ♦ మిగుల నరునకున్. 31.

వ. నా తెఱంగు వినుండు. 32

క. కలఁగినసేనలఁ గాచెద, నిలిపెద నర్జునునికడఁక ♦ నెఱపెద బాహా
బల మాభీష్ముం డెట్లగ్గలిక మెఱసె నట్ల మీకుఁ ♦ గన్నులు దనియన్. 33

ఉ. ధర్మజభీమపార్థులును ♦ దమ్ములు నుద్భటసంగరక్రియా
కర్మఠు లచ్యుతానుజుని♦గర్వము దుర్విషహంబు వారి మ
త్కార్ముకముక్తచండశర♦ఖండితదేహులఁ జేసి యుత్తునేఁ

1 ననియ ♦ కాదె. 2 మామనంబు. 3 సేనలఁ, గనుఁగొని.

బేర్చిరిగాఁ గౌరవేంద్రున కభీష్టత రాజ్యరమావిలాసమున్. 34

క. కాద్దేని గాండివజ్యా, నాదము సురదుందుభిప్రణాదంబును నిగ
ఖేదుఁడ నై వించు నధిక, మోదంబున నిత్యసౌఖ్యముం గైకొందున్. 35

క. కౌరవులం గాచుచు రణ, శూరులఁ బాండవుల నోర్చుచుం గీర్తికర
స్ఫారవిహారత భీష్మునిఁ, జేరం జనుకంటె నొప్పు సెప్పం గలదే. 36

వ. అని పలికి తనసారథిం గనుంగొని. 37

సీ. మణిగణోజ్జ్వల మైనమనయరదంబున, జవనాశ్వములఁ బూన్పు చాపబాణ
ఖడ్గాదిసాధనోత్కర మొడఁగూర్పుము, రత్నధ్వజం బెత్తు రశ్ము లడర
శంఖమృదంగనిస్సాణాదితూర్యముల్, సంఘటింపుము రభసమున ననుదు
వాఁ డట్లు చేయ దుర్వారగర్వోద్ధతి, నగ్నిప్రభం బగునారథంబు

తే. పటురయంబున నెక్కి భూపతికి మ్రొక్కి
యాతఁ డెల్లకౌరవులును నఖిలనృపులుఁ
దన్నుఁ గొనియాడఁ గర్ణుఁ డుత్సాహలీల
నిజబలాభీలసుందరధ్వజము లొప్ప. 38

వ. నడచి నదీనందనుఁ డున్నయెడకుఁ జేరంబోయి శోషించినసముద్రంబుచందంబున విమానంబు విఱిగి పడినదివ్యుని తెఱంగున భూతలపతితుం డయినపతంగుభంగిని భగ్నపక్షంబైనమైనాకంబుమాడ్కిం బొలుచునతనికడకుం బాదచారియై యరిగి యాఫల్గుననారాచనిచయంబునం బొదువంబడి యమునానదీహ్రదస్థితంబును [1]మదనిమీలితంబును నై శోభిల్లుశుండాలంబు ననుకరించుచు వీరశయనమహనీయుం డైనయమ్మహానుభావునియడుగులపైఁ గన్నీరు దొరఁగం బ్రణమిల్లి కేలు మొగిడ్చి వినయవినమితశరీరుం డై. 39

క. వచ్చితి రాధేయుఁడఁ గను, విచ్చి ననుం జూడు భరతవీరాగ్రణి [2]నీ
సచ్చరితముఫలమే యి, ట్లిచ్చట [3]నీయునికి ధాత నే మన నేర్తున్. 40

ఆ. పావనంబు లయినపలుకులు నాచెవు, లార నెమ్మి నన్ను నాదరింపు
మయ్య ధర్మనిత్య యంచితసత్య శం, తనుకుమార గాఢధైర్యసార. 41

ఉ. నేర్చినమాఁడఁ గూడ నడపింపఁగఁ గొల్తల సేయఁ దీవ్రబా
ణార్చుల మార్బలంబుల రయంబున నీఱుగఁ [4]గాల్ప నాజి నీ
నేర్చినభంగి నొం డొకఁడు నేర్చునె పాండవబాహుసంపదల్
పేర్చు నెలర్చు నింకఁ గురుబృందము లెల్లను దల్లడిల్లఁగన్. 42

క. శరజిహ్వాభీకరుఁ డగు, నరుఁ డనుశిఖి నిగుడఁ జేసి నారాయణుఁడు
ర్భరపవనుఁ డింక బంధుర, కురుసేనాకాననంబుఁ గ్రొవ్వడఁగించున్. 43

మ. భరితాశాంతరపాంచజన్యరవదృప్యద్దేవదత్తధ్వని

1 'మదనిమీలితాక్షంబును' అ. ప్ర. 2 యా, సచ్చరితము. 3 నీపడుట. 4 జేయ.

స్ఫురణఁ వీనులు ప్రయ్యఁ గేతనకపిఽ[1]స్ఫూర్జత్ప్రభం జూడ్కు లా
తురతం బొందఁగఁ జండగాండివసముఽద్భూతాస్త్రజాలంబు లె
వ్వరు సైరింతురు నీవు దక్క భుజగఽర్వస్ఫూర్తినిర్వాహకా. 44

ఆ. మెయిమెయిం బెనంగి ఽ మెచ్చించి ముక్కంటి,చే వరంబు గొని విఽశిష్టదివ్య
కర్మదీప్తుఁ డైనఽగాండీవి నోరుఁ డాజిఁ, జెనయఁ జాల కునికి ఽ సెప్ప నేల. 45

క. అని పెక్కుమాట లాడిన, విని యాదరభరితనేత్రఽవిస్తారుం డై
యనిమిషనదీతనూజుఁడు, గనుఁగొనుటయు మఱియుమ్రొక్కిఽకర్ణుఁడు వలికెన్.

ఉ. ఆనరు నే నొకండన విఽషానలదుస్సహదృష్టిభీషణం
బైనమహాభుజంగమము ఽ నద్భుతమంత్రనిరస్తదర్పముం
గా నొనరించునట్లు భుజఽగర్వ మడంచెద నస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వసంపద నుఽదాత్తగుణోత్తర నీవు వంపఁగాన్. 47

వ. అనిన గాంగేయుండు రాధేయున కిట్లనియె. 48

మ. తగఁ బర్జన్యునిసొంపునఁ బ్రతుకుభూఽతవ్రాతముఁ వార్ధి సో
చ్చి గరిష్ఠస్థితి నుండు నేఱులును సంఽక్షీణంబు లై యుర్వి ని
ల్చి గుణాధిక్యముఁ బొందుబీజములుఁబోఽలెం గౌరవుల్ విశ్రుతం
బగునీప్రోపున బ్రాపుఁ గాపుఁ గని సౌఽఖ్యం బొందు టొప్పం గడున్. 49

చ. అరయఁగ బంధుకోటులకు ఽ నక్కురునాథునియట్ల కావె నీ
వరిబలభేది జన్మమున ఽ నయ్యెడుచుట్టఱికంబుకంటె సు
స్థిరతర మైన[2]సంగడముఽచే నగుబాంధవ మెక్కు డందు రా
నరపతి రాజ్యభారము మఽనంబున నీయది గాఁ దలంపుమీ. 50

వ. అంబష్ఠవిదేహపౌండ్రాదిదేశాధీశుల గెల్చి దుర్యోధనాధీనవర్తులంగా నిర్వర్తించిన నీకు నిట్లు సెప్పవలయు నే యండజంబులు పండినవృక్షంబు నుపజీవించు చందంబున నిన్నుం జెంది బంధువులు సుఖులై యుండువారు గాక నాకు నీవును సుయోధను నట్ల కావున మే లాడెదఁ గౌరవుల నడపికొని యమ్మహీవిభునకు విజయంబు గావింపుము పొమ్మని సమ్మదంబునం బలికిన సూతనందనుండు ప్రీతుండై యద్దేవవ్రతుచరణంబులు శిరంబు సోఁక వినతుండై వీడ్కొని యరదం బెక్కి యరుగు దెంచి భవదీయసైన్యంబు దైన్యంబు వాపి యే పగ్గలించి కలయం గనుంగొని.

క. నరపతి యలరఁగ రథకరి,తురగసుభటసముదయముల ఽ దోర్గర్వధురం
ధరలీల మెఱయ నతిబలం,ధురములుగా సంఘటించె ఽ దురమునకుఁ దగన్. 52

వ. అట్టియెడ. 53

క. అరుణాశ్వములు రుచిరరు,క్మరథంబుఁ బ్రదీప్తవేదిఽకాధ్వజమును ను
ద్ధురగాత్రకలితసితభా,సురబంధురకంకటంబు ఽ శోభిల్లంగన్. 54

1 స్ఫూర్తిప్రభం. 2 సంగరము; సంగమము.

క. మొగమునఁ గయ్యపువేడుక, చిగురొత్త నుదాత్తమూర్తిఁ జెలువొందుగురుం
దగురాజులుఁ గౌరవులును, బొగడి రులివు మిగులఁ బ్రమదపూర్ణహృదయులై.

తే. అపుడు నీయగ్రనందనుం డల్లఁ దనదు, తేరు రాధేయునరదంబు సేరఁ బోవ
నిచ్చి మనమున సంతస మెసక మెసఁగ, నాదరంబున నిట్లను నతనితోడ. 56

క. నీవలన సనాథం బై, యీవీఁ డెంతయును మెఱసె నింకిట మనకుం
గావింప వలయుకార్యము, నీ వెఱిఁగింపంగ వలయు నెయ్యమెలర్పన్. 57

క. అనిన నతం డిట్లను బహుజనరక్షకు లైననృపులు సద్బుద్ధులు గా
వున నీవు సెప్పఁగా నే, వినియెద నెయ్యది దలంపు వివరింపు తగన్. 58

ఉ. నావుడుఁ గర్ణుతోడ నరనాయకుఁ డిట్లను సర్వయోధసం
భావితుఁ డైనశాంతనవుబాహుబలమాటున నస్మదీయసే
నావిభవంబు సెల్లెఁ బదినాళ్లును నీమది కెక్క నాదుయో
ధావలిలోన నింకఁ బృతనాధిపుఁగాఁ గొన నెవ్వఁ డర్హుఁడో. 59

### ద్రోణాచార్యులకు సర్వసేనాధిపత్యంబు నిర్ణయించుట.

క. సేనాపతిత్వమునకుం, బూని యొకఁడు నడప కున్నఁ బాడ వడఁగదె యా
సేన యనిఁ గర్ణధారవిహీనం బగుకలము జలధి నెడలినభంగిన్. 60

వ. కావున నొక్కరు నిరూపింపు మనవుడు గాంధారేయునకు రాధేయుం డిట్లనియె,

సీ. అధిప నీయోధులయందు సేనాపతిత్వమునకుఁ జాలనివారుఁ గలరె
యందఱు నయవిక్రమాదిగుణంబుల, మాననీయుల యట్టు లైన నెల్ల
వారి ముఖ్యులఁ జేయ వచ్చునే యొక్కరుఁ, గైకొన్న మత్సరగ్రస్తబుద్ధి
నన్యులు విపరీతు లై కలంగక యుండు, వారు గావలయు నెవ్వరును ద్రోణుఁ

తే. డనినఁ గాదన రాతండ యర్హుఁ డాధి
పత్యమునకు నాచార్యుండు బ్రాహ్మణుండు
వివిధరణకోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక
బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని. 62

వ. అనుటయుం గురురాజు దగురాజులం గూర్చుకొని గురుం డున్నయెడకుం జని
సవినయంబుగా నతని కిట్లనియె. 63

ఉ. ప్రాయముకల్మి నొక్కటన భవ్యధృతిన్ మహనీయశీలతన్
సాయకసంపదం బటుభుజావిభవంబునఁ గార్యతంత్రశి
క్షాయుతబుద్ధి వృద్ధుఁడవు గావె ధరాసురవర్య మున్ను గాం
గేయుఁడు మాకు నెల్ల సెఱిఁగింపఁడె నీదుమహానుభావమున్. 64

వ. అని వెండియు. 65

క. కనువెలుఁగు నీవు గా నీ, వెనుక భవన్మతమ యూఁది వీరలు నేనుం
జనుదెంచెద మాఱట నెల, కొన వృషభముపజ్జ నడచుగోవులపగిదిన్. 66

ఆ. అనుచు నచట నున్న యవనీపతులఁ జూపి, మఱియు నిట్టులని యె మనుజవిభుఁడు
దేవసేన నడపి దితిజుల గెలిచిన, షణ్ముఖుండు నీవు సరియ కాదె. 67

వ. కావున. 68

తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప, వలయు ననవుడు నమ్మహీశ్వరులు నట్ల
చెప్పి గెలువుము నీ వని చెలఁగి యతనిఁ, బ్రస్తుతించి ప్రార్థించిరి భరతముఖ్య. 70

వ. మఱియు నమ్మహీశ్వరుండు.

క. సేనాసముదయ[1]రక్షకుఁ, గా నిను నేఁ బడసినవుడ కౌంతేయులు నా
చే నడఁగ రెట్లు భీష్మవి,హీనుల మగుమమ్ముఁ గావు మెల్లవిధములన్. 71

వ. అని వేఁడికొనిన నయ్యందఱం గలయం గనుంగొని యాచార్యుం డిట్లనియె. 72

ఉ. వేదములుం దదంగములుఁ వింతలుగా నొకకొంత నేర్తు శౌ
ర్యాదిగుణంబు లెందుఁ గల వైనను నింతటివానిఁగాఁగ న
త్యాదరవృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి యాఁ
గా దన కియ్యకొంటిఁ దగఁ గౌరవనాథునికోర్కి దీర్పఁగాన్. 73

శా. భవ్యం బైనబలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు న
న్నవ్యాకీర్ణగజాది యై మెఱయుసైన్యశ్రేణిఁ బాలించి కౌ
రవ్యోత్సాహముఁ బెంచి మార్కొనిరవీరవ్రాతముం ద్రుంచి నా
దివ్యాస్త్రంబులఁ బంచి [2]పాండవులదీప్తి మాయఁ జేయించెదన్. 74

వ. అని పలికినం బ్రీతచేతస్కుం డయి సీతనూభవుండు గనకకలశంబులం బావన
జలంబులు దెప్పించి మంగళోపకరణశోభితంబు గావించి పుణ్యాహనాదంబులుం
బరమాశీర్వాదంబులుఁ మాగధగీతంబులుఁ వందిజనస్తుతివ్రాతంబులుం జెలంగఁ
బ్రభూతభూపతులుం దానును ద్రోణాచార్యునకు సేనాధిపత్యాభిషేకపట్టబంధం
బొనర్చి పేర్చినం గని రథికవరు లార్చి నిజశంఖంబులు పూరించిన నఖిలసైన్యంబు
లందును భేరీమృదంగపణవాదితూర్యనినాదంబులు నిగిడి నింగి ముట్టె నిట్లు సకల
చమూపతిత్వపదభాసితుం డై భారద్వాజుండు. 75

సీ. కౌరవసేనాముఖంబునఁ దిలకమై, యొప్పి రాధేయాదియోధవరులఁ
గొని[3]పాండురాజనందనులసైన్యములతోఁ, దొడరి ధైర్యంబునద్భుతమహాస్త్ర
వీర్యంబు ననివార్యశౌర్యంబు దోర్బలౌ,దార్యంబు మెఱయ సీతనయువలని
కూరిమి వెలయ నక్షోహిణిపైఁ గొంత, బలమును దొర లనేకులను గూర్చి

తె. చామరచ్ఛత్రకేతుభూషణతురంగ
దంతిరథహేతివర్మయోధవ్రజంబు
తునియ లిల నించి కతిపయదినము లరులు

---

[1] భర్తనుగా. [2] 'పాండవబలోద్రేకంబు మాయించెదన్' అ. ప్ర. [3] పాండురాజనందనుల
తోఁ దొడరి ధైర్యంబు నద్భుతవిక్రమంబు నస్త్రవీర్యంబు.

సురలు వినుతింప విహరించె ధరణినాథ. 77

క. అడవుల దవశిఖి దరికొను, వడువున నిట్లరిబలంబు వారణఁ బొడిగా
నడరి యతఁ డాజి ద్రుపదుని, గొడుకార్వ నుభయజనములకర్ణ వగ మిగులన్.

క. దుష్టమనస్కుం డగునా, ధృష్టద్యుమ్నుండు దక్క దేవాసుజనో
త్కృష్టుఁ డగుగురుని తెగుటకు, నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్. 78

వ. అనిన విని యాంబికేయుండు హృదయంబు జల్లనఁ జెదర వదనంబు వెల్ల నయి మొగుడ నివ్వెఱఁ గంది కొండొకసేపు నిశ్చేష్టితుండై యుండి గద్గదవికలకంఠుం డగుచు సంజయుతో నిట్లనియె. 79

ద్రోణాచార్యునిమరణంబు విని ధృతరాష్ట్రుండు పరితపించుట.

సీ. అస్త్రశస్త్రంబుల నధికుండు వెరవరి, భుజబలవిక్రమంబుల ఘనుండు
గురుఁ డట్టివానిఁ దేఁకువ లేక కదిసిరే, పాంచాలు రతనిచాపంబు దునిసె
నో తేరు విఱిగెనో సూతుండు వడిమెనో, యేమఱి యలసత నెదిరి సరకు
సేయమి మఱపాటఁ జెందెనో హీనాత్ముఁ, డైనధృష్టద్యుమ్నుఁ డతనిఁ జంపె
తే. నట్టె యచ్చెరు విది దైవమగ్గలంబు, పౌరుషముకంటె ద్రోణునిపాటు వినియు
వేయిపఱియలై పోవదు రాయి గాఁగ, నోపు నాగుండె యేమని యుమ్మలింతు. 81

వ. అని యడలూని పొగిలి వెండియు.

తే. మేరు వొఱగుట యినుఁ డిలమీఁదఁ బడుట
యబ్ధి యింకుట గాదె ధైర్యమునఁ బేర్చి
ప్రభ వెలింగి గభీరత రాశి కెక్కి
యెందుఁ బొగ డొందునాచార్యుఁ డిట్టు లగుట. 82

క. అతిలోకపరాక్రమనిధి, మతి సురగురు మిగులుఁ గురుకుమారగురుఁడు దు
ర్మతు లగుమత్సుతులకుఁగా, మృతుఁడయ్యెఁ బరోపకారమృతి యొప్పఁగదా.

తే. విల్లు వట్టెడువా రెల్ల వెరవు గఱచి, పోవ నెల నైనద్రోణునిభుజము నిలువ
రించి పాంచాలనందనుఁ బంచి పార్థుఁ, డిట్లు[1] సేయించెఁగా కొరుఁడేల చాలు.

క. పాముఁ బొడిని పడఁ దిగిచిన, చీమలగమియట్ల ద్రోణుఁ జిక్కువఱిచెఁ గా
కేమి బహుదేశసైన్యము, లే మనఁ గల దింక నూఁత యెవ్వరు మనకున్. 85

వ. అని పలుమాట లాడి యొల్లంబోయి యాలోనన కొంత దెప్పిఱి యంగంబులు వడంకుచుండ మఱియు నమ్మానవేశ్వరుండు సూతనందనున కిట్లనియె. 86

తే. ప్రథమగిరిమీఁద దోఁతెంచుభానుఁ బోలి
ధర్మపుత్త్రుండు దోఁచినఁ దమము విరియు
నట్టు విరియక గుపుసకు నడ్డపడఁగ
వచ్చునే తమ్ము మెఱసి యెవ్వారికి నైన. 87

1. సమయించెఁ.

క. సింధురము మహోద్రేకమ,దాంధం బై వచ్చులీల నాచార్యునిపై
గంధవహసుతుఁడు గవియ న,మంథరగతి నెవ్వఁ డాఁగు నమనయోధులలోన్. 88

చ. ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతిం బడ ఘోరమూర్తి యై
యఱిముఱిఁ గప్పుదెంచువిలయాభ్రముచాడ్పున మార్విదాద మే
ర్తెఱఁ జెలఁగన్ వడిం దొరఁగుదివ్యశరంబులు ద్రోణుతేరిపైఁ
బఱపుకిరీటి మాధరణిపాలకుజోదులచేత నిల్చునే. 89

క. ఎవ్వఁడు దెరలెనొ తిరుగక, యెవ్వఁడు నిల్చెనొ కడంగి యెవ్వఁడు బిరుదై
క్రొవ్వునఁ జచ్చెనొ కుంభజు, నెవ్వఁడు గావంగ లేఁడ యెయ్యది దుదియో.

ఆ. గురుఁడు వడినయపుడ కురుసైన్యములఁ గల,వారణాశ్వసుభటవర్గములును
బడియెఁ గాక యేల పడ కుండు నాధర్మ,పుత్త్రభాగ్య మలఁతిఁబోవు నెట్లు.

చ. నడిఁకెడువాఁడు గాఁడు గురునందనుఁ డక్కట తండ్రిచావున
ప్పుడు మొగ తప్పి యొండుగడఁ బోరుచు నుండెనొ యడ్డపాటు గ
వ్వడికతనన్ ఫలింపమి నవారణ నాద్రుపదాత్మజుండు బె
ట్టడరి వధింపఁగా వికలుఁ డై దురపిల్లుచుఁ జూచు చుండెనో. 92

క. అని పనవి వనట నలఁదురి, నిను నెద్దియు నడుగ నాకు నీ వేమియుఁ జె
ప్పను వలవదు సంజయ మఱి, వినియెద మది గలఁగె ననుచు వివశాత్ముఁడై.

వ. [1]తనకొడుకులగెలుపునెడ నాస మాలుటం జేసి. 94

ఆ. సొమ్ము వోయి పడినసుదతు లాక్రందన,రవముతోడ సత్వరముగ నెత్తి
యానృపాలు సెజ్జయం దిడి మెలపున, శిశిరవిధులు సేయ సేద దేఱె. 95

వ. ఆసీనుం డై యాతండు సూతసుతున కిట్లనియె నరనారాయణులు రథిసారథు
లైనయారథం బెందును సిద్ధమనోరథం బగుఁ గవలు గడిందిమగలు సాత్యకి
సత్యపరాక్రముండు పాంచాలోత్తముం డగునుత్తమౌజుం డుదాత్తబలుండు శిశు
పాలతనయుం డగుధృష్టకేతుండు ధీరుండు భీష్మపాతనహేతు వయినశిఖండి
యఖండపరాక్రముండు సౌభద్రుండు రెండవరుద్రుండు యాదవశ్రేష్ఠుం డగుచేకితా
నుండు మానధనుండు ద్రౌపదేయు లజయ్యులు గేకయు లేవురు వేవురపెట్టు యు
యుత్సుండు బహుళమత్సరుండు ద్రోణవధంబ పనిగాఁ బుట్టినధృష్టద్యుమ్నుండు
భుజసారద్యుమ్నుండు ఘటోత్కచుండుఘనఘోరమూర్తి కృష్ణాశ్రితంబై నవృష్ణి
కుమారలోకం [2]బలోకమాన్యం బన మిగిలినబిరుదుతనంబునం బేర్చినయది భీమ
గదాభీషణుం డైనభీమసేనుం డెవ్వరికి నలవిగాకయుండుఁ బాండవసేనం గావను
గౌరవసైన్యంబు సమయింపను దాన చాలునట్టిపరికరంబును గల దనుకొలంది
గాదు కార్యవివేకశౌర్యోద్రేకధుర్యుండు ధర్మదేవతకొడుకు ధార్మికత్వసత్యాది
మహాగుణగరిష్ఠుండు యుధిష్ఠిరుం డతని గెలువ దేవతలకు నశక్యంబు మఱియు

1 తనకొడుకులదెస గెల్పునాస. 2 బు లోకంబునకు మిగిలిన.

నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము. 96

మ. యదువంశంబున లోకరక్షణపరుం డై పుట్టి వేపల్లె ను
న్మదబాల్యంబు నటించి కంసముఖనానాదైత్యులం ద్రుంచి బ
ల్లిదుఁ డాయింద్రునిపారిజాత మిలకుం లీలాగతిం దెచ్చి శి
ష్టదయాళుత్వము పూని యున్నహరి నిశ్చింతం జెంది రప్పాండవుల్. 97

వ. కావున వారల గెలుచు టరిది యట్లుం గాక. 98

క. హరి యాత్మ యర్జునున కా, హరి కర్జునుఁ డాత్మ హరియు నర్జునుఁడును నా
నిరువు రగుట క్రీడార్థం, బరయఁగ నది యొక్క వెలుఁగ యతులం బెందున్.

క. ఆవెలుఁగు గనువెలుంగు గఁ, దా వెలసినపుణ్యమూర్తి ధర్మసుతుం డే
లా వెఱచు రణమునకు నా,చే వచ్చెం గౌరవులకుఁ జేటే మందున్. 100

వ. అని వెచ్చ నూర్చి యూర కుండి వెండియు. 101

చ. గురుఁడును భీష్ముఁడుం గలనఁ గూలుదు రట్టె కిరీటి కింక నె
వ్వ రెదురు కౌరవక్షయ మవశ్యము నయ్యెడు వార్త లేమిగాఁ
బురపురఁ బొక్కుచుఁ వినఁగ బుద్ధిఁ దలంచెద నైన ద్రోణుసం
గరపరిపాటి యెల్ల వినఁగా వలతుఁ వివరించి చెప్పుమా. 102

తే. అనిన సంజయుఁ డిట్లను నాంబికేయు,తోడ నేను దెల్లంబుగ ద్రోణుసమర
మెఱిఁగి వచ్చితిఁ జెప్పెద నెల్లఁ దెలియ,వినుము[1]దిర మయి మాటలు వేయునేల.

ద్రోణుఁడు దుర్యోధనునకు ధర్మరాజుం బట్టి యిచ్చునట్లు వరం బిచ్చుట.

వ. అట్లు సేనాధిపత్యంబు పూని కుంభసంభవుండు ముదితమనస్కుం డై గారవం
బునం గౌరవేంద్రునకు నరేంద్రులు విన ని ట్లనియె. 104

క. నను భీష్మునిపిదప బలం,బున కెల్లను ముఖ్యుఁ జేసి పూజించితి [2]వీ
వినుతాచరణఫలంబును, గనువాఁడవు వరము గోరు కౌరవనాథా. 105

వ. అనిన విని యతండు కర్ణదుశ్శాసనాదిసుహృజ్జనంబులతో నాలోచనంబు సేసి
సవినయంబుగా గురున కి ట్లనియె. 106

క. వర మిచ్చె దేనిఁ గోరెదఁ, బరమహితము ధర్మపుత్త్రుఁ బ్రాణముతోడం
దురమునఁ బట్టి భుజాభీ,కర కొని రా వలయు మత్సకాశంబునకున్. 107

వ. అని కోరుటయు భారద్వాజుండు నీకొడుకువదనం బవలోకించి. 108

చ. అకట యజాతశత్రుఁ డనుకనప్పలు కిప్పుడు నిక్క మయ్యె వా
నికిఁ గురునాథ యిట్టు లతనిం బగఁ జూచుట గోర కాజిఁ బ
ట్టికొనుట గోరి తివ్విధము దెప్పర మెంతయు నిత్తెఱంగు గో
ర్కికిఁ గత మేమి పాండవుల గెల్చి ధరం సగ మీఁ దలంచితే. 109

వ. నీదునిశ్చయం బెట్టిది యతనిం బట్టి తెచ్చిన నేమి సేయం గలవాఁడ వని యడిగిన

1. దీఱమిమాటలు. 2. ఛ, వినుతాచరణపుఫలమును.

నమ్మనుజవరుం డుప్పొంగి తనమనంబున నున్నకార్యం బాచార్యునకుం దక్కటి వారికిం దేటపడ నిట్లనియె. 110

సీ. ఆధర్మసూనుఁ గకయ్యంబునఁ జంపినఁ, గోపించి గాండీవి కకురుబలంబు
సమయించు మన మాపి కసర్వపాండవులను, జంపితి మేనిఁ బ్రచండచక్ర
ధారఁ గౌరవకోటికతల లేటి రాజ్యంబు, గోవిందుఁ డీ కున్న కగొంతి కయినఁ
గాన యుధిష్ఠిరుఁ కగాయంబు నొంపక, తెచ్చి జూదం బాడుక తెఱఁ గొనర్చి
తే. మగుడ నడవికి [1]నడిచినఁ కదగిలి యతని,తోడఁ దమ్ములుఁ బో నంతకతోన మెల్ల
దొసఁగు మాలు నప్రతిహతకదోర్విభూతిఁ, బెద్దకాల మే నేలుదుఁకబృథివియెల్ల.

వ. అనిన విని కుటిలం బగునతనియభిప్రాయంబునకు రోసి యస్త్రగురుం డవ్వరం బునకు నేమేనియు నెడ వెట్టి యిచ్చువాఁడు గా నూహించి యొక్కతెఱంగుఁ గాంచి యన్నరనాథున కిట్లనియె. 112

చ. నరుఁ డెడ సొచ్చెనేని విను కనా కది దుష్కర మే నొకండనే
సురగణ మైన వ్రేలిఁ గొని కచూపఁగఁ జాలరు వాఁడు లేనిచోఁ
దిర మయి పోర నిల్చిన యుకధిష్ఠిరు ద్రౌపదిపుట్టినింటివే
వురు వెఱఁ గంది చూడ నలకవుం జలముం జెడఁ బట్టి తెచ్చెదన్. 113

తే. అనుడు బాలిశులైననీకతనయు లెల్ల, ధర్మజుఁడు పట్టువడునకాఁ కదలఁచి రపుడు
పాండుసుతులకు మొగమోడకకుండ గుఱుని,ప్రతిన యెల్లెడఁజాటించె కరాజరాజు.

వ. ఇట్లు శిబిరంబునను సేనాస్థానంబునను గలయ నాఘోషణంబు సేయించినం జెలంగి సకలసైనికులును సింహనాదంబులు సేయ శంఖభేరీరవంబు లుల్లసిల్లం గౌరవసైన్యంబు వొంగె నది యంతయుం గొంతేయాగ్రజుండు దనచారులచేత విని యనుజులం గూర్చి వినిపించి విజయచ్చు నాలోకించి. 115

ఆ. గురునిప్రతిన వింటె కవెరవున లావునఁ, జేసి దీని బొంకు కసేయవలయు
నెఱుఁగు నతఁడు నిన్ను కనెడ వెట్టి పలికిన, వాఁడు గాన చెప్ప కవలసె నీకు.

క. నాయున్నచోట నెప్పుడుఁ, బాయక కను గలిగి నిలిచి కభండనము దగం
జేయంగ వలయు నక్కుఱు,నాయకుకోరికిఫలంబుకనకు విముఖముగాన్. 117

అర్జునుఁడు ధర్మరాజుతో ద్రోణునిప్రతిజ్ఞకు వెఱవ కుండునట్లు చెప్పుట.

వ. అనుటయు నర్జునుం డతని కిట్లనియె. 118

క. గురుని వధియించుటయు భూ,వర నీ వని నొవ్వ నొందుకవలను సనుటయుం
బరికింప నొక్కరూ పని, దురితంబులు [2]వీనిఁ జేయుకదునె యే నెందున్. 119

క. క్షోణీవల్లభ విను మేఁ, బ్రాణములో నుండ నిన్నుఁ కబట్టికొనఁగ నా
ద్రోణునకు కాదు సగణ,స్థాణున కైనను వశంబె కతలఁ కేమిటికిన్. 120

చ. అలవి యెఱుంగ కిమ్మెయి దుకరాశఁ దలంచిరి గాక ధార్తరా

1. నడిచినఁ; నెగిచినఁ. 2. వినియు; వినియు.

ష్టులు ద్రిజగంబులుం గొని పఱటుస్ఫురణం జనుదెంచి రేనియుఁ
బలవదరాతిపుంజమదఱభంజన నీ వని భంగపడ్డ నీ
యిల శకలంబు లై చెడదె ఱ యింకదె వారిధి నింగి గూలదే. 121

ఆ. వారితలఁపు వొసఁగఱ నేరదు పోరఁ బ,రాభవంబు మనకు ఱ రా దెఱుంగు
కలుగ దద్దురాత్మకులచేత నాతలం, పిట్టు. లున్నయది నఱ రేంద్రముఖ్య. 122

వ. అని పలికిన విని యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుండై శంఖభేరీమృదంగాదిమంగళ తూర్యస్వనంబులు సెలంగ సకలసైన్యసమేతంబుగా వెడలి నడచి మొగంబున నెలమి నెలకొనం గ్రౌంచవ్యూహం బమర్చె నం దగ్రభాగంబున. 123

మ. ధవళాశ్వంబులఁ బూని కేతనకపీంఱద్రస్ఫూర్తి మార్తాండమూ
ర్తి విడంబింపఁగఁ జక్రగాండివధరుల్ ఱ దేజోమయాకారవై
భవ మారం దనపై వెలుంగ సతిదీఱప్తం బైన తే రొప్పె శా
త్రవసంఘంబుమనంబునఁ భయము గూఱరం గాలచక్రాకృతిన్. 124

క. ఆరథముకెలన నుజ్జ్వల, ధీరోద్భటరేఖ మెఱసె ఱ ధృష్టద్యుమ్నో
దారస్యందన ముద్ధత, సారథికముఁ [1]జారుతురగఱ చటులాశ్వము నై. 125

వ. మఱియు వృకోదరాదిసోదరులను నభిమన్యుప్రభృతికుమారులను బాంచాలపతిప్రముఖబాంధవులను ధృష్టకేతుముఖ్యదండనాయకులను దక్కనుం గలపరివారంబును దగ నయ్యైయెడల బలుపును బొలుపును గలుగ నిలిపి యుధిష్ఠిరుం డమ్మోహరంబునడుమ నుదాత్తసన్నాహంబునను గంభీరోత్సాహంబునను బొలిచి నిలిచె నంతకు మున్న యక్కడ. 126

క. మనవారును రణకౌతుక, జనితోద్యమతీవ్రు లగుచు ఱ శకటవ్యూహం
బొనరించిరి యొప్పను బెం, పును దర్పము నుల్లసిల్ల ఱ భూవరముఖ్యా. 127

వ. అందు వలపట సింధురాజకళింగపతిసంగతుం డయినవికర్ణుండును నతనికి బాసటయై చటులహయబహుళం బగుబలంబులతో నక్కెలన సౌబలుండును డాపటఁ గృతవర్మవివింశతిచిత్రసేనసమేతుం డై దుశ్శాసనుండును నతనికిఁ బ్రాపై తత్పార్శ్వంబునఁ గాంభోజశకయవనమహీశ్వరులును నడుమం ద్రిగర్తమద్రశిబిశూరసేనదేశాధీశపరివృతుండును గుంభసంభవపురస్సరుండును నై కురువిభుండును నాముందట నంగజనపదచతురంగప్రధానసేనాసముదీర్ణుం డై కర్ణుండును నిలిచిరి వెండియుం గలవార లెడనెడం బన్ని రట్టియెడ. 128

తే. దర్పదుస్సహతేజు రాఱధాతనూజుఁ
దిలక మై సైన్యముఖమునఁ ఱ బొలుచువాని
సైనికులు సూచి కడు సంతఱసమున నేచి
యెలుఁగు లడరంగఁ దమలోన ఱ నిట్టు లనిరి. 129

---

1. జారుతురగసంశోభియు నై.

మ. అని రాధేయుఁడు పాండునందనుల బాహాశక్తి మాయించు నీ
తని దేవావలి యైన మార్కొనునె దుర్ధాంతుండు భీష్ముండు పో
రినయన్నాళ్లను బక్షపాతమున వారిం బట్టి పాలార్చెఁ గా
క నిజం బల్ల నితండు ధీరు లగు టెంకం జెల్లునే వారికిన్. 130

వ. అని యుబ్బుచుండి రివ్విధంబున సన్నాహంబు సువిహితం బైనయనంతరంబ. 131

చ. తగ మనసైన్యమున్ గురుఁ డుదగ్రగతిన్ నడపింపఁ జొచ్చుడున్
గగనతలంబు నెత్తురులుఁ గండలు నెమ్ములు నొక్కయుమ్మడిన్
[1]మొగిళులు లేకయుం గురిసె ముత్తము లై పెనుగ్రద్ద లాడె బె
ట్టుగ వినిచెన్ శివారుతము దుల్లెఁ గడున్ వడి నుల్క లెల్లెడన్. 132

తే. అమ్మహోత్పాతములకు భయంబు గొనక
కౌరవులు శంఖములు మ్రోయ భేరు లులియ
నగ్గలిక సేన నడఫించి రంత సమద
గమనమున వారిసేనయుఁ గదియ నడచె. 133

వ. అప్పుడు. 134

క. నరుఁడును రాధేయుఁడు నాఁ, బొరువులతోఁ బెనఁగువేడ్క నుల్లంబులలో
గురువులు వాఱఁగ నిలిచిరి, యిరుదెఱఁగులసైనికులకు నేడ్తెఱ మిగులన్. 135

తే. ఇట్టు లొండొంటిఁ గదియంగ నెలమి నడచి
బలము లొక్కింతసేపు నిశ్చలతఁ బొలిచె
మవ్వ మెసఁగువసంబులు మావు లెంత
యైనఁ జెలువార సొగసి యున్నట్లపోలె. 136

క. తదనంతరంబ ద్రోణుం, డుదితార్కునిఁ గ్రేణిసేయు నుజ్జ్వలరథ మె
ల్లదిశలు వెలిఁగింపఁగ బెట్టిదముగ మును గవిసె మొనగడిమితోఁ గదియన్.

క. మనబలము గదియుబలువిడిఁ, గనుఁగొని యర్జునుఁడు దొలుతఁ గవియఁగఁ బేరు
బ్బునఁ దాఁకె వారిసైన్యము, వినువీథి నమర్త్యగణము వేడుకఁ జూడన్. 138

సీ. రథకరితురగోత్థపృథివీపరాగంబు, దెసల నాకసమున దీటుకొనఁగ
బాణాదిహేతిసంపాతజాతము లగు, మంట లర్కాంశుల మరలఁ ద్రోవ
హస్తికపాలరథావయవములు భగ్నము లగురవము లుగ్రముగఁ జెలఁగ
వివిధసేనాంగవిదళనంబునఁ గ్రమ్ము, రక్తపూరములు ఘోరంబు గాఁగఁ

తే. గలయ బెరసినపాండవకౌరవప్ర,చండసైన్యద్వయంబు నుద్దండసమర
గతులు వెక్కస మొనరించె ఖచరసాధ్య,సిద్ధులకు ననుబోంట్లకుఁ జెప్ప నేల.

వ. ఇవ్విధంబునం దొడంగి చెల్లుసంకులసమరంబునం దనకనకరథం బరుణతురంగం
బులచటులచిత్రసంచారంబులం గొఱవి ద్రిప్పినతెఱంగున నేదిక్కు సూచినం

---

1 మొగులును.

దాన వైమె పెక్కురథంబు లనుబుద్ధి పాండవపాంచాలయోధులకుఁ బుట్టునట్లుగా 140
విహరించి వివిధవిశిఖనిచయంబులు నిగిడించుచుఁ గుంభసంభవుండు.

క. కూల్చుచు గజముల నెత్తుటఁ, దేల్చుచుఁ దురగముల వీఁకఁ [1]దేరులు మరలన్
వెల్చుచుఁ గాల్బలములఁ బోరి, మాల్చుచు రౌద్రముగ మారిమసఁగినభంగిన్. 142

వ. సంగరక్రీడ సలుపునయ్యవసరంబున.

క. పాయవడు రథచయంబులు, సాయకహతిఁ జెదరుఁ బ్రళయజలధరపటుగ
ర్జాయతతర్జనలీలఁ బ,లాయిత మగుపాండుసుతబలంబు నరేంద్రా. 143

క. పొదువుచు విచ్చుచు బలువిడి, నెదురుచుఁ బాఱుచును మఱి మహీభాగము గ్ర
క్కదలం గార్ముకవిద్యా,విదుఁ డగుగురుతోడఁ బోరె వివిధబలంబుల్. 144

ద్రోణుఁడు పాండవసైన్యంబుపైఁ గేఁగి దివ్యాస్త్రంబులశక్తి నూపుట.

వ. అట్టియెడ నాచార్యుం డసమానశౌర్యంబును మాననీయదోస్సారంబును ది
వ్యాస్త్రప్రభావంబును జూపినం గాంతేయసైన్యంబునందు. 145

సీ. తఱుచుగాఁ దెగిపడ్డధవళచామరములు, డిండీరములయొప్పుఁ బుండరీక
ములు మరాళంబులపోలుపును గరవాల,ములు మీనభంగియుఁ దలలు శిలల
చాడ్పును గేశముల్ శైవాలరేఖయు, మాంసంబు పంకసమానతయును
దాల్ప భటాశ్వమాతంగాంగభగ్నర,థములతిట్టలు [2]సైకతములు గాఁగఁ

తే. ధీరవరకోటి ద్రెళ్లిన వీరతతికి, సంభ్రమము వుట్ట సంభృతోత్సాహలీల
నుబ్బి భూతబేతాళంబు లోలలాడ, సట్టలం బగునెత్తురుటేఱు వఱపె. 146

వ. అప్పుడు. 147

తే. గగనమధ్యంబునకు వచ్చి ఖరకరుండు
దేఱి చూడంగ రాక యుద్దీప్తుఁ డగుచు
నెట్లు వెలుఁ గొందు ద్రోణుండు నట్ల వెలుఁగు
చున్నఁ గనుఁగొని ధర్మజుం డురవడించి. 148

వ. ధనంజయధృష్టద్యుమ్నుల నాలోకించి యమ్మహావీరు వారించుటకు నియోగించిన.

శా. చంచత్తుంగతురంగసత్వరగతిస్ఫారీభవత్కేతనో
దంచద్దీప్తులు ప్రజ్వరిల్ల నతిసాంద్రం బై శరశ్రేణికా
సంచారంబు నింతాతఘోరము గ నాచార్యుఁ వడిం దాఁకె న
ప్పాంచాలక్షితిపాలనందనుఁడు శుంభద్వీర్యసంరంభుఁ డై. 150

వ. తదనంతరంబ. 151

క. నరుఁ డగ్గలికం దఱుముచుఁ, బురికొలిపిన గండు మిగిలి భూరిబలంబుల్
గురునిఁ బొదివె నప్పార్షతు,నరదమునకు మించి రభసమత్యుగ్రముగాన్. 152

క. పొదువుటయుం గనుఁగవఁ గెం, పొదవఁగ మెఱుఁగు వొంగి ద్రోణుఁడున్నత్యుగతిం

---

1 చెరలుచు. 2 పులినములు.

దగనీకములఁ [1]గలంచుచు, ముదుకం డయ్యును గుమారమూర్తిం బొలిచెన్.

క. విను మప్పుడు కులశక్తుల, కనురూపము గాఁగ నిలిచి యద్దెసవీరుల్
పెనఁగిరి రథ్యంబులు నా, తనిసూతుని మేను శోణితంబునఁ దోఁగన్. 154

క. గురుఁ డలిగి పెలుచ నడరినఁ, గరిఘోటకభటనికాయకాయముల సమి
ద్ధరణి వాలిచె నరుణపయో, ధరసంవృతమైనగగనతలము చెలువునన్. 155

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురలుచూపు లడర నిశితాస్త్రములం
గప్పె గురునిఁ దత్సైన్యం, బొప్పఱి తనబెట్టిదంపుటురవడిఁ దెరలన్. 156

క. ద్రోణునిశరములు నిలుపుచు, బాణవితతి సేనమీఁదఁ బరఁగించుచు గీ
ర్వాణనుతు లెసఁగ నతఁ డ, క్షీణోద్ధతి నట్లు సమరకేళి సలుపఁగన్. 157

క. ఏచినరథికవరులు ధను, రాచార్యుని యిరుగెలంకులందుఁ దఱిమినం
జూచి వడి సవ్యసాచి శ, రాచితదేహులు గఁ జేసె నందఱఁ గడిమిన్. 158

వ. ద్రోణుండు పదిబాణములు ద్రుపదసూను మేనం గీలించినం దూలక యతం డతనిపై నిశితవిశిఖవర్షంబు గురిసె నయ్యిరువురశరనికరంబు లంబరంబు గప్పె నట్టియెడఁ బాండవాగ్రజపురోగము లగువారలు గడంగి కుంభసంభవుదెసకుం దఱిమిన మనవలనిఘనయోధవరులు వారిం దలపడి రందు శకుని సహదేవుం దాఁకి. 159

మ. తురగవ్రాతము నొంచి కేతువు వెసం ద్రుంపంగ నాతండుఁ గ్రో
ధరసం బుగ్రము గాక యుండియును గాంధారేశు వీతధ్వజున్
విరథున్ విస్ఫురితాస్త్రఘట్టితునిఁ గావింపన్ గదాభీలమూ
ర్తిరథం బుద్ధతి డిగ్గి పాఱి యతఁ డుర్విం గూల్చెఁ దత్సారథిన్. 160

క. సహదేవుండును గద గొని, మహి కెరఁగినయప్పు డొప్పె మనుజేశ్వర య
మ్మహితసుభటయుగము శిఖర, సహితమహాశైలయుగ్మసదృశాకృతి యై. 161

క. వింశతిశరముల నేసె వి, విశంతి [2]ననిలజుఁ డతండు వీఁక నగుచుఁ ద
త్ప్రాంశుధనుర్దండము రెం, డంశములుగ నేసె వెడఁదయమ్మునఁ బెలుచన్.

సీ. మనబల మార్చినఁ గినిసి భీముఁడు గద, నతనియశ్వంబుల నవనిఁ గూల్చె
భూరిశ్రవుఁడు పొలుపారి ధృష్టద్యుమ్నుఁ, గప్పె నస్త్రముల శిఖండి యేచి
యాతని నిలు నిలు మని తాఁకి శరవృష్టిఁ, బొదివెఁ బిశాచముల్ పూను తేరు
లెక్కి కప్పారెమ నెలువుచ ర్మపుఁగత్త్ర, శములతో ఖరనిస్వనములు సెలఁగ

తే. నసురవల్లభులగు నలంబుసఘటో, త్కచులు సముద్ధతిఁ దొడరి మాయలు వొనర్చి
పేర్చి యొండొరు నొంచుచుఁ బెనఁగి పెనఁగి, తెల్లముగఁ జూడఁ జూడ నదృశ్యులైరి. 164

వ. అయ్యవసరంబున.

సీ. క్షత్త్రదేవుండు లక్ష్మణుతోడ సమరంబు, సేసె నుగ్రంబుగఁ జేకితానుఁ
డనువిందుఁ దలపడి యద్భుతగతిఁ బోరె, శల్యుండు నవ్వుచు శరచయముల

1. గలంచెను...మూర్తి యొఁబోలెన్. 2. ననిలజు నతండు.

నకులు నొంచినఁ గేతనము నాతపత్రంబు, వెసఁ ద్రుంచి యాతని విరథుఁ జేసి
శంఖంబు పూరించె శారద్వతునిమీఁద, ధృష్టకేతుఁడు సప్తతీవ్రదీప్త
తే. విశిఖములునింప నతఁ డస్త్రవృష్టి[1] పెల్లు, గురిసె సాత్యకికృతవర్మయురమునార
సముల నొప్పించి డెబ్బదిసాయకంబు, లేయ డెబ్బది యే డమ్ము లేసె నతఁడు.
క. సేనాపతి యగుద్రుపద, క్ష్మానాథతనూభవుఁడు సుశర్మునిమర్మ
స్థానముల నొంచె నాతఁ డ, దీనుం డై యతనిజత్రుదేశం బేసెన్. 166
చ. బలమును దాను మత్స్యనరపాలుఁడు గర్ణునిఁ దాఁకి రెండుసే
నలు వినుతింప నుద్భటరణం బొనరించినఁ గంటి క్రేవ గెం
పొలయఁగ నీతనూభవుల కుబ్బుగఁ దద్రథ[2]దంతిఘోటకం
బుల నుఱుమాడె నారథికపుంగవుఁ డంబరచారు లార్వఁగన్. 167
క. వేడుకమైఁ దలపడి పో, రాడిరి ద్రుపదభగదత్తు లస్త్రబలము శౌ
ర్యాడంబరమును నెలుఁగులుఁ, జూడను వినఁ జిత్రములుగ శుంభద్భంగిన్.
సీ. పౌరవుం డభిమన్యు బలువిడిఁ దాఁకి బా, ణాసారమున ముంప నతఁడు గినిసి
యతనిధనుగ కేతనాతపత్రంబులు, ద్రుంచి యేనింటఁ దత్తురగములను
సారథి నొప్పించి శరము లేడిట స్రుక్కఁ, జేసి దర్పంబున శిరము ద్రుంచు
టకు శర మరిఁబోయుటయుఁ గృతవర్మ రెం, డమ్ముల విల్లు నయ్యమ్ముఁ దునిమె
తే. బలకయును వాలుఁ గొని నరుపట్టి గవిసి, పౌరవునిరథ్యముల నేలపాలు సేసి
యుఱికిసూతునిఁబడఁదన్నియురగవిభునిఁ, బట్టుగరుడుని క్రియఁ దలవట్టికొనియె.
వ. ఆలోన సైంధవుండు సంభ్రమంబున శాతకృపాణచర్మంబులు గొని రథంబు
డిగ్గనుఱికి రయంబున నెఱిది యదల్చినం గని, జనకద్వేషి యగునతనివలనిరోషం
బగ్గలింప నాపురందరపౌత్రుండు పౌరవుని విడిచి యద్దెసకు లంఘించి కవిసె
నప్పుడు. 170
తే. వికటవిస్ఫురదసిచర్మవివిధచిత్ర, గతులు చూపఱమెడఁద కద్భుతము సేయ
నార్జునియు సింధురాజుఁ బరఁగె భాభిరామ, సింహశార్దూలగతి విలసిల్లి రథిప. 171
వ. అట్టియెడ. 172
క. అఱిముఱి ప్రేసినఁ బలకం, గఱచినసైంధవునిమెలుఁగు గని నరసుతుఁ డే
డ్తెఱ ముఱిసిన నది గూపఱె, విఱుగుటయును వెస నతండు వెనుకకువిఱిగెన్.
క. విఱిగినచో నిలువక [3]వెఱ, నుఱికెం దనరథముమీఁది కోడితి పోపో
పిఱికి యని పలికి నుఱుముగ, నఱికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్. 174
క. తెరలినసైంధవుఁ గని నృప, వరులు పలువు రొక్క పెట్ట వాసవిసుతుపై
నురవడిఁ దఱిమిరి మద్రే, శ్వరుఁడు గదిసి దీప్తశక్తి వైచెం బెలుచన్. 175
క. ఉరగాంగన నలిఁ బట్టెడు, గరుడునిక్రియ శక్తి [4]వట్టి క్రమ్మఱ వైచెఁ

1. పెలుచఁ, బొదివె... వర్మయెదను నార. 2 నూతఘోట. 3 వెస. 4 సమరి.

నరసుతుఁడు శల్యసూతునిఁ, బొరివోవఁగ నార్చెఁ బాండు।పుత్త్రబలంబుల్. 176

వ. అయ్యవసరంబున విరాటుఁడును ద్రుపదుండును ధృష్టకేతుండును యుధిష్ఠిరుండును సాత్యకియును గేకయపతులును భీమసేనుండును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం గవలును ద్రౌపదేయులును సౌభద్రుం బొగడు నెలుంగులు సింహనాదంబులు నింగి ముట్ట నతనికి నుల్లాసంబును నీకొడుకులకు రోసంబును జనియింప నతనిం బరివేష్టించిన నవ్విజయంబు సైరింపక కూడుకొని నీకొడుకు లతనిపైఁ బటుశరంబులు గురియ నక్కుమారసంతతికి సంతసంబు గా శల్యుండు గద గొని యభిమన్యున కభిముఖుం డై కవిసె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 177

తే. ఎక్కటెక్కటి పెనఁగిన । నింత వట్టు, పెనఁకువలు నిట్టు లేచునే । పృథివి నింక
జనము లీకురుపాండవ।సంగరంబు, సెప్పికొండ్రు మనంబు ల।చ్చెరువు నొంద. 178

క. అనిసొంపు వినియు నాకుం, జనివి సనదు శల్యపార్థ।తనయులసమరం
బున తెఱఁగు సెప్పు మేర్పడ, ననవుడు సూతసుతుఁ డిట్టు । లనుఁ బతితోడన్.

భీమసేనశల్యులగదాయుద్ధము.

ఉ. అమ్మెయి సూతుఁ డీల్గుటయు । నగ్గలికన్ గద పుచ్చికొంచు రౌ
ద్రమ్మున వచ్చుశల్యుఁ గని । తానును జండగదావిలాసనో
గ్రమ్ముగ లీల మార్కొనియె । ర మ్మిట ర మ్మనుచున్ సమస్తసై
న్యమ్ములుఁ బిచ్చలింపఁగ సు।రాధిపపౌత్త్రుఁడు దీప్తగాత్రుఁ డై. 180

ఉ. అంతకు భీమసేనుఁడు ర।యం బెసఁగన్ గద నెద్ది పట్టి య
త్యంతరయంబు మైఁ బిఱిఁది । కాతనిఁ ద్రోచి కనగ్గదాపరి
భ్రాంతి వెలుంగ నిల్చినఁ ది।రం బయి శల్యుఁ డుదాత్తరేఖఁ గా
లాంతకదీప్తమూర్తి యగు।నాతనిఁ దాఁకె బలంబు లార్వఁగన్. 181

వ. అట్టియెడ. 182

క. ఇతనికి నితండ యితనికి, నితఁడ యెదురుఁ గాక [1]యొరుల । కీయిరువురయు
ద్ధతి కెదుర వశమె యనువా, క్తతియును దూర్యస్వనములుఁ । గడుఁ బెల్లెసఁగెన్.

వ. ఇట్లు దలపడి శల్యసమీరనందనులు మండలప్రచారంబులను విచిత్రగదాప్రసారణంబులను మెఱయుచు. 184

మ. గద లన్యోన్యసమాహతిన్ మిడుఁగుఱుల్ । గ్రక్కంగ సారించుచుం
గదియం [2]బాయఁగ వ్రేటు దప్ప నుసులం । గా నేర్పు లంగంబులం
దొదవన్ ఘోరపరస్పరప్రహతు ల।త్యుగ్రంబుగా నెత్తురుల్
సెదరింపం బదశబ్దహుంకృతులు ది।క్సీమంబులన్ దాఁటఁగన్. 185

క. పోరెడునప్పుడు లావును, వీరోద్రేకంబుఁ జలము । వెరవును సరి యై

---

1. యితరు । లీయిరువుర నుద్ధతి నెదుర. 2. బోయిన; బాయుచు.

మారుతియు మద్రపతియు ను,దారగతుల మెఱసి రమరతతి వినుతింపన్. 186

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు పెనంగి. 187

క. అతిముతి నొండొరు వ్రేసిన, నెఱఁకులు దాఁకుటయు నొచ్చి నేల గొఱగె బి
ట్టతి యాసుభటద్వితయము, వెఱచఱచి బలద్వయంబు వెగడందంగన్. 188

వ. అయ్యవసరంబున, 189

క. కృతవర్మయు మద్రమహీపతి గ్రక్కున గ్రుచ్చి యెత్తి పాయం గొని యు
ద్ధతి వాయఁ జనియె మారుత,సుతుఁ డాల్గొఁ దెలిసి లేచి శోభిల్లెఁ గడున్. 190

క. గద సారించుచు జయమునఁ, బొదలునతనిఁ జూచి నీదుపుత్త్రులు గోపం
బొదవ నడరి రుద్భటగతి, మదవత్కరిచటులరథసమాజంబులతోన్. 191

వ. ఇట్లడరి వివిధాస్త్రశస్త్రంబు లేయుచుం బొదివిన. 192

మ. కవలుం దానును నేచి యుద్ధురగతిం గౌంతేయముఖ్యుండు వీ
రవరానీకము వీఁకఁ గూడికొని సంరంభంబు శోభిల్లఁ గౌ
రవసంఘంబుఁ గలంచినన్ విఱిగె దర్పం బేది నీసేన య
బ్బవితానంబు మహాసమీరణనిరస్తం బైనచందంబునన్. 193

వ. అంత నపరాహ్ణం బయ్యె నప్పుడు శంఖభేరీమృదంగాదితూర్యస్వనంబులు సెలంగ
సింహనాదంబులం బేర్చినపాండవసేనం జూచి వృషసేనుండు రోషావేశభీషణుం
డై మార్కొని మార్గణనికరంబులు నిగిడించిన. 194

మ. కరిగాత్రంబుల ఘోటకాంగకములం గప్పెన్ సమిద్భూమి య
చ్చెరు వై యుండఁగ రథ్యసూతరథికశ్రేణీవపుఃఖండముల్
దొలఁగెం దుత్తుము రయ్యెఁ గాల్బలము లస్తోకప్రవాహంబు లై
పరఁగెన్ రక్తనదుల్ పిశాచకుల మంభఃకేలిలోలంబు గన్. 195

తే. కర్ణనందనుఁ డిట్లత్యుదీర్ణభంగిఁ, బాండురాజతనూజులబలము నెల్లఁ
గనుపుగొట్టంగఁ జొచ్చినఁ గినిసి నకులు,నాత్మజుండు శతానీకుఁ డతనిఁ దాఁకి. 196

క. వాలమ్ములు పది మేనం, గీలించిన నాతఁ డతనికేతనము ధరం
గూలిచి చాపముఁ ద్రుంచిన, నాలోనన ద్రౌపదేయులందఱుఁ బెలుచన్. 197

వ. తోడంబుట్టువునకుం దలకడచి వివిధవిశిఖంబుల వృషసేనుం గప్పిన నశ్వత్థామ
ప్రముఖు లై కదిసి కౌరవానీకంబు శతానీకునిం దత్సోదరుల ననేకక్రూరాస్త్ర
నిచయావృతులం జేసినం గని కౌంతేయాగ్రజుండు గడంగి కేకయమాత్స్య
పాంచాలప్రభృతిబలంబులతో నురవడించిన సురాసురసంగ్రామసదృశసమరం
బయ్యె నందు భీమకర్ణకృపద్రోణద్రౌణిధృష్టద్యుమ్నవిరాటులు ప్రతాపదీపితు లై
మార్తాండుండు సప్తమూర్తులు దాల్చి ధరణివిహరించినట్లు వెలింగిరి కొండొకసేపు
నకుఁ బాండవసేనాసంరంభంబు సహింపం జాలక మన మొన దెరలి మరలినం
జూచి యాచార్యుండు గోపాటోపంబును బటువిక్రమంబును నావేశింప నీసైనికుల

నిలు నిలు మని యదల్చి తూణీరంబు బిగియించి గుణంబు సారించి సారథితో
నిట్లనియె. 198

సీ. చల మేది కౌరవసైన్యముల్ వాఱెడు, ధర్మనందనుని యుద్దండవృత్తిఁ
గంటె యీతనిఁ దాఁకి గర్వంబు మాన్పక, నిలిచిన నిమ్మాఁక నిలుచునెట్లు
ధర్మజభీమసాత్యకిమాత్స్యపాంచాల, తత్తనూజులు నాకుఁ దరమె క్రీడి
చాపంబు వెఱవు నాచూపినయది గాదె, విను మట్లు గాకయుఁ దనువు దాఁచు

తే. సమయమే యిది సంభృతోత్సాహలీల
జయముఁ గీర్తియుఁ గోరి యస్ఖలితభంగిఁ
దేరు నడపుము చేతులతీఁట వోవ
నడరి రథికజనంబు వేటాడవలయు. 199

—ద్రోణాచార్యులు ధర్మరాజుతో యుద్ధంబు సేయుట.—

చ. అన విని మేను వెంచి రయ మారఁగ సూతుఁడు దేరు వోవ ని
చ్చినఁ గని వారిసైన్యములు చెచ్చెర ధర్మజు మించి త్రోవఁ బే
ర్చినభుజసంపదం గడఁగి సింధురలీలఁ దెరల్చి తాఁకె న
మ్మనుజవిభుఁ గురుండు పటుమార్గణసంపిహితాంబరంబు గాన్. 200

క. తాఁకినఁ బొగడం దగియెడు, వీఁకం బతి ద్రోణు బాణవృతుఁ జేయ నతం
డాఁకగొనక యతనిధనువు, వ్రేఁకనిభల్లమునఁ ద్రుంచి వెస డగ్గఱియెన్. 201

వ. ఇట్లుద్ధతుండై యగ్గురుండు వొంగినజలధియుంబోలెం గవిసిన ధర్మనందనుచక్ర
రక్షకుం డగుసుకుమారుండు చెలియలికట్ట తెఱంగున నిలువరించి నిశితశరం
బతనియురంబున నాటించిన నప్పాంచాలవరుం బ్రశంసించు నెలుంగులు సెలంగఁ
బాండవబలంబులు పేర్చి యార్చిన. 202

క. పెనుగాలిఁ బెలుగు కార్చిచ్చునుబోలెం బొదలి గురుఁడు సుకుమారునిఁ గాం
చనపుంఖశరజ్వాలావినిపాతితుఁ జేసి తఱిమి విభునిం గదిసెన్. 203

వ. అప్పుడు పాండవయోధులొండొరుల మీఱి యుధిష్ఠిరుముందరికి వచ్చి యాచా
ర్యుం బొదివిన నతండు నలిరేఁగి. 204

సీ. నకులుని నైదుసాయకముల స్రుక్కించి, సహదేవు నేడింట సాధుఁ జేసి
నవవిశిఖముల మాత్స్యవరేణ్యు నడఁగించి, యేఁడింట సాత్యకి యేపు మాపి
ద్రౌపదేయుల శరత్రయములఁ గలఁచి వింశతి నుత్తమౌజుని చలము మాన్పి
పంద్రెండుపంద్రెండుపటుమార్గణంబులఁ, బాండవాగ్రజుని శిఖండి నొంచి

తే. మఱియు మార్కొన్నరథికుల మదము సెఱచి
మెఱుఁగుఁదూపులా ధర్మజు మేన నిగుడ
నడర నఱిమి యుగంధరుఁ డడ్డపడిన

నవ్వి యవ్విభుఁ డెగటార్చె నారసమున. 205

వ. అట్టియెడఁ గేకయపతులును బాంచాలనాథుండును దదీయజ్ఞాతు లగుసింహసేన వ్యాఘ్రదత్తులు లోనైనయోధు లనేకు లాచార్యుం బొదివి శౌర్యబాహువీర్యం బులు నెఱపి రందు సింహసేనుండును వ్యాఘ్రదత్తుండును నెట్టన నానాస్త్రం బుల నొప్పించిన నాధనుర్ధరగురుండు. 206

తే. కన్నుఁగవఁ గెంపు గదురంగఁ గౌరవులకుఁ
జిత్త మలరంగ నావ్యాఘ్రదత్తసింహ
సేనమస్తకములు రెండుశితశరములఁ
గుండలంబులతో నేలఁ గూల నేసి. 207

క. తక్కటిరథికుల నెల్లను, జిక్కువడం జేసి పురుషసింహుండు మదం
బెక్కి యుధిష్ఠిరుఁ బొదివెడు, నెక్కుడుతమకమునఁ గదిసె నేత్తెఱ మెఱయన్.

వ. అయ్యవసరంబున నాసైన్యంబులజనంబులు. 209

క. అదె పట్టువడియె ధర్మజుఁ, డదయుం డగుద్రోణుచేత నక్కట నేఁడు
న్మదుఁడై సుయోధనుఁడు దండ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొని యెలమిన్

వ. అనుచు సంభ్రమాకులచిత్తు లగుచు నున్నంత. 211

మ. ధరణీభాగము గ్రక్కునం గదల రథ్యవ్రాతచంచద్గతి
స్ఫురణం బొప్పఁగ బాణజాలము నభంబుం గప్ప నత్యంతని
ష్ఠురసంతర్జనఘోషభీషణమహాటోపంబు [1]దిగ్దంతు లా
తురతం బొందఁగఁ జేయ వచ్చి వడిఁ బార్థుం డగ్గురుం దాఁకినన్. 212

వ. కౌరవయోధవరు లొక్కపెట్ట భారద్వాజునకు బాసటయై ససైన్యంబుగా సవ్యసాచిం బొదివిన నవ్వీరుండు ఘోరాకారుం డయి గాండీవచండనిస్వనంబు లొండొండ నిగుడ నిశితసాయకపరంపరలు గురిసి కపాలోపలంబును మేదోమాంసపంకంబును నస్థిచూర్ణసికతంబును నగుశోణితనదీప్రకరంబును బఱపె నంత గభస్తిమంతుం డస్తశైలాంతరితుం డయినఁ బార్థుబాణాంధకారంబునకుఁ దోడు సంధ్యాసమయంబు గవిసినం గురుసైనికులకుఁ దమవార లెదిరివార లని నిరూపింప నశక్యం బగుటయు ద్రోణదుర్యోధనులు సమరంబు సాలించి వాహినులఁ దివియించినం దిరంబై ధనంజయుండును జయతూర్యస్వనంబులును బాంచాలకేకయాదిబంధుమిత్త్రప్రశంసావచనంబులును వీనులం బొలయఁ దనబలంబుల మరల్చి ధర్మనందనుం గొలిచి చనియె నిత్తెఱంగున రెండుసేనలుఁ దమతమవిడిదలల కరిగి యథోచితవ్యాపారంబుల నుండి నాఁటిరాత్రి సనిన మఱునాఁడు.

క. రేపకడ యుభయబలములు, నేపును నెలమియును నెసకమెసఁగ వెడలి యా
టోపంబున రణసన్నాహోపక్రమలీల మెఱయ నుజ్జ్వలభంగిన్. 214

---

1 దిగ్భిత్తు లాతుర.

వ. ఉన్నసమయంబున లజ్జావిషాదంబులు మొగంబునం దోఁప ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె. 215

చ. నరవర మున్న చెప్పితి రణంబున నర్జునుఁ డొద్ద నున్న నె
వ్వరికిని ధర్మసూనుఁ బొదువంగ నశక్య మొకండు పార్థుఁ డను
ద్ధురుఁ డయి నేల వాపికొని దోర్బల మొప్పఁగఁ బోవఁ జాలినన్
వెరవునఁ బట్టెదం బరులు వేవురు నూర్కొనినం గలంచెదన్. 216

## ద్రోణాచార్యుల రెండవ నాఁటియుద్ధము.

ఆ. నరుఁడు లేనిచోట ననుఁ గని వెన్నిచ్చి, పాఱకున్నఁ బట్టువడియెఁ గాఁగఁ
దలఁపు ధర్మపుత్త్రు ధరణీశ పాఱుట, గలిగె నేని నంతకంటె మేలు 217

వ. అనిన విని సుశర్మ దుర్యోధనున కిట్లనియె. 218

క. ఆనరుఁ డెప్పుడు మము నవ, మానించుచు నునికిఁ జేసి మనుజేశ్వర కో
పానలము సంతతము మా, మానసములఁ బొదువ నతని మార్కొనుకడఁకన్.

వ. తమకించుచుందుము నీకు బాస యిచ్చి పెద్దకాలం బయ్యె నేఁడు రణభూమియందు నర్జునుం డొండెఁ ద్రిగర్తు లొండెం గావలయు నే మతనిఁ బెద్దకయ్యంబులోనం బాపికొనిపోవుట నీచిత్తంబునకు వచ్చున కాదె యనవుడు నతనితమ్ములు సత్యవ్రతుండును సత్యకర్ముండును సత్యవర్ముండును నిబ్భంగిన పలికిరి వారలపక్షంబై నరథికవర్గంబు నిత్తెఱంగున నియ్యకొని యుల్లసిల్లె నిమ్మెయిం ద్రిగర్తులు పదివేవురుదారలు గడంగినం గని తుండికేరళమాళవశిబింద్రమగధమచ్ఛిల్లికాది దేశాధీశులును బంధుమిత్రసహితంబుగా నివ్విధంబున వారితోడివారై పంతంబులు వలికి యుబ్బునం బొంగి రిట్లప్పరుసుననగణ్యరథికోత్తము లుత్సహించి కృతస్నానులై యగ్నులం బూజించి తత్సన్నిధి సర్వయోధులు నాకర్ణింప నందఱు నిట్లనిరి.

సీ. అర్జునుఁ జంపుదు మతని కోడితి మేని, గోవధంబును వనితావధంబు
బ్రహ్మవధంబును బరదారగమనంబు, బ్రహ్మస్వహరణంబుఁ బరధనాప
హరణంబు గురుజనత్యాగంబు శరణాగ, తారక్షణము ననృతాభిరతియు
మద్యపానము నర్థిమానవవైముఖ్య,మును గృహదాహంబు జనుల నెట్టి

ఆ. గతులఁ బుచ్చు నట్టిగతులు వాటిలు నక్కు,రీటికోలుతలకు నోట లేక
దుష్కరంబు సేసి తుది గన్నపుణ్యాత్మ,కలితగతుల మేలు గలుగు మాకు.

వ. అని సంశాపంబులు పలికి సంశప్తకు లనేకరథికముఖ్యులు బహుళచతురంగబలపరివృతులై కురురాజు సంతసిల్ల నుల్లాసంబునం జనిరి గురుండును గరుడవ్యూహంబు సమకట్టి దానికిఁ జంచువై తాను నిలిచె దుర్యోధనుండును దమ్ములుం దలయును గృపకృతవర్మలు గన్నులును సింహళాభీరశూరసేనకేకయప్రముఖులు మెడయునుబాహ్లికభూరిశ్రవస్సోమదత్తశలశల్యులువలపలిఱెక్కయు నశ్వత్థామ సుదక్షిణవిందానువిందులుడాపలిఱెక్కయు శకునిపౌండ్రకళింగాంబష్ఠమాగధులు

వెన్నును నానాజనపదసేనాసమన్వితుం డై సూతపుత్త్రుండు పుచ్ఛంబును సైంధ
వాదివివిధదేశాధీశులు నెడ నెడం గలయఁ బెరసి యొడలిపొలుపును బలుపును
నై నిలువ నియోగించిన నమ్మోహరంబు మహాపవనసముద్ధూతసాగరాకారం బై
యుత్సాహనృత్యంబు సేయుచందంబునం జూడ నొప్పె నందు మధ్యమప్రదేశం
బున భగదత్తుండు గజారూఢుం డై యుదయాచలంబుపైఁ బొలుచుభానుండు
నుం బోలెఁ దేజరిల్లుచునుండె నంత నక్కడం ద్రిగర్తాదులు పాండవసేన దక్షిణ
దిక్కునకుం జని సమరంబునకు సవ్యసాచిం దొలంగం బిలుచుటయు నన్నర
శార్దూలుం డన్నతో నిట్లనియె. 222

చ. తఱిమి సుశర్మ దమ్ములును దానును నాజికి నన్నుఁ బిల్వ నే
నెఱుఁగనియట్టు లుండు టిది యేపురుషార్థము వారి నెల్ల నే
డ్తెఱ నుఱుమాడఁ బంపుము తడిందిగఁ జూడకు నీకు నేమియుం
గఱగొఱ గాదు పోమి గడుఁ గష్టము నాకు నుదాత్తమానసా. 223

వ. అనుటయు నయ్యుధిష్ఠిరుండు. 224

తే. గురునిబలశౌర్యములు నెఱుంగుదుము మనకు
నతనిపూనికి బొంకు సేయంగ వలయు
దీని కెయ్యది కార్యంబు దాని నీవు
బుద్ధి నుచితంబుగాఁ దలఁపోయు మనుడు. 225

వ. ధనంజయుం డతని కిట్లనియె. 226

చ. పిలిచినఁ బోవ కుండు టిది [1]బీదతనం బగుఁ గాన నేర్పుగాఁ
దలఁపదు లోక మే నరివధం బొనరింపఁగ నెట్లుఁ బోయెదం
జలము బలంబు ధైర్యమును శౌర్యమునుం గలవాఁడు వీఁడు నేఁ
డలఘుఁడు గుంభసంభవుని నాఁగు భవత్పరిరక్షణార్థి యై. 227

వ. అని పాంచాలవరుం డగుసత్యజిత్తుం జూపి. 228

క. ఇతఁ డున్నయంతసేపును, మతి నేమియు వెఱవ వలదు మార్తురచేతన్
హతుఁ డయ్యెనేని నిలుచుట, చతురత గా దనికిఁ దొలఁగి చనవలయు నృపా.

అర్జునుఁడు ధర్మజుచే ననుజ్ఞాతుం డై సంశప్తకుల పైఁ బోవుట.

తే. అనిన నొడఁబడి యట్ల కా కనుడు నన్న
రేంద్రునకు భక్తి మ్రొక్కి సురేంద్రపుత్త్రుఁ
డతనిచేత దీవన గొని యవ్విరోధు
లున్నదెస కేఁగె సంతోష ముత్కటముగ. 230

వ. ఇట్లు ధర్మజునిమ్రోల్ల వాసి విజయుండు చనుటకు నుబ్బినమనసైన్యంబులం గనుం
గొని యమ్మహీపతి ధృష్టద్యుమ్నుతోఁ గౌరవులు గరుడవ్యూహంబుగా మోహ

1. బెట్ట-బెంట-బెండు-తనం బగుఁ.

రించినవారు దీనికి నీవుం దగ మండలార్ధవ్యూహంబు సమకట్టుమని పనిచిన నతం
డట్ల చేసె నివ్విధంబున నుభయవ్యూహంబులును గాఢసన్నాహంబు లై శంఖ
భేరీప్రముఖతూర్యస్వనంబులు సెలంగ నడువానకాలంబునం బొంగినగంగా
యమునలుంబోలె నొండొంటిం దార్కొనుసమయంబున నయ్యజాతశత్రుండు
ద్రుపదపుత్త్రు నాలోకించి గురుం జూపి. 231

క. నేఁ డీబ్రాహ్మణుచేతం, బోఁడిమి సెడి యేను జిక్కి పోవక యుండన్
వేఁడిమి మెఱయుశరంబుల, వాఁడిమిసొం పెల్లఁ జూపవలయుం జుమ్మా. 232

క. అనుడు నతఁడు నవ్వుచు ని, ట్లను నే నాఁగంగ ద్రోణుఁ డని నిను గదియం
జనువాఁడె యింత యేటికి, నను నీతఁడు గెలువ లేఁడు నమ్ము మహీశా. 233

వ. అని పలికి పారావతవర్ణాశ్వవర్ణనీయరథుండగు నయ్యతిరథుండు కుంభసంభవునకు
సమ్ముఖంబుగా నడచుటయు నాధృష్టద్యుమ్నదర్శనంబు దనకు నరిష్టం బగుటయు
నగ్గురుం డొక్కింత విన్న నై యతనిదిక్కు దేఱి చూడం జాలక క్రేడించి పాం
చాలబలంబుపై నిశితవిశిఖంబులు వరఁగించుచుం బాయవడ నడరె నంత నక్కడ.

సీ. క్రీడి యాఁకొని యున్న కేసరి హరిణచ, యముమీఁదఁ జనునట్టు లాత్రిగర్త
వరులపై నరుగంగ వా రట ము న్నర్ధ, చంద్రాకృతిగ నొడ్డు సంఘటించి
కొనియుండి యాతనిఁ గని ప్రీతి నార్పులు, బొబ్బలుఁ జెలఁగంగఁ బొంగుటయును
జూచుచు నాసవ్యసాచి మందస్మితుఁ, డై కృష్ణుతోడ ని ట్లనియెఁ జూడు

ఆ. [1]మెక్కు డై నరవము నెసకంపుటుబ్బునఁ, బొదలుచున్నవారు ముదముకలన
నెదిరిఁ దమ్ము నించు కేనియు నెఱుఁగరు, వీరు క్రొవ్వి చావ వేఁడి రకట. 235

వ. అని మఱియును. 236

క. తగు సంతసింపఁ గుజనుల, కగపడనివిశిష్టగతికి నస్మద్దివ్యా
శుగములచేఁ బోఁ గనుటకు, విగతభయత్వంబు సమరవిధి నొప్పుఁ గదా. 237

వ. అనుచుం జేర నడచి దేవదత్తంబు పూరించిన. 238

ఉ. ఆనినదంబు సాంద్రముగ నాకస మంతయు నిండఁ బర్వ దుర్
మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూల విద్విష
త్సేవ నితాంతనిశ్చలతఁ జిత్రసమర్పితమూర్తియో యనం
గా నులి వేది యుండియును గ్రమ్మఱఁ దేఱె రవంబు మానఁగాన్. 239

వ. ఇట్లు దెలి వొంది యొండొరులం బురికొల్పికొని సంశప్తకు లొక్కపెట్ట ఫల్గును
పయిం బటుశరపరంపరలు గురిసి రతండు దవ్వుదవ్వులఁ బదిసేను నేలరథంబుల
వారిం గూల్చినం జెలుచ నడరి. 240

క. శరము లొకఁ డొకఁడు పదిపది, నరఁగింపఁగ మూఁటమూఁటఁ బాఁటుడు నొంచెన్
సరి నై రై చేయుఁగ న, న్నరుఁ డంపల వెంట వెంట నలి నొప్పించెన్. 241

1 '[illegible]'

వ. అట్టియెడ సుబాహుండు గ్రీడికిరీటంబు దశవిశిఖంబుల నేయ నతం డతనిపై
ననేకశరంబులు వరఁగించిన సుశర్ముండును సురథుండును సుధన్వుండును బాసట
మై యప్పార్థుం దాఁకిన. 242

ఆ. వారి కేతనములు ౝ వడిఁ ద్రుంచి యవ్వీరుఁ, డౌ సుధన్వుహయశౝరాసనముల
తునియ లవనిమీఁదఁౝదొరఁగించి తన్మస్త,కంబుఁ దునిమెఁ దేరుౝగముల కుఱికి.

క. ఇరువే యుద్భటరథములఁ, బోరిగొనుటయుఁ బెఱబలంబు ౝ పురికొనక వెఱం
దెరలుచు గుంపులు గట్టుచుఁ, గురుపతిసైన్యంబు పొంతౝకుం జనుచుండెన్. 244

వ. ఇట్లు భయభ్రాంతులైనసైనికులం గనుంగొని సుశర్మ యెలుం గెత్తి. 245

క. వెఱవకుఁ డిట మరలుఁడు ము, న్నెఱుఁగరె యర్జునుని గురుమౝహీపతికడ నే
త్త్రైఱఁ బలికినపంతంబులు, మఱతురె నో రెద్ది రిత్త ౝ మరలిన మనకున్. 246

వ. అని బరవసంబు సేసిన నాసైనికులు గోల్తల సేసి రప్పుడు నారాయణగోపాలు
రెక్కడెక్కడ యని వారిం గూడి కడంగిన నిస్సాణాదితూర్యరావంబులు సెలం
గుటయు వాసవి వాసుదేవు నాలోకించి. 247

చ. ఒడలను బ్రాణముల్ గలుగ ౝ నూరక యుండుదురే త్రిగర్త లి
ప్పుడ నుఱుమాడి పోద మటు ౝ వోవఁగ నిమ్ము రథమ్ము నావుడుం
గడు వెస నాధనంజయునిౝకాంక్షిత మెక్కడ నక్క డెల్ల నె
క్కుడుముద మొప్పఁ దేరు రథిౝకోటులపైఁ బఱపెఁ ముకుందుఁడున్. 248

క. విమలాంబుదములు వూనిన, విమానమో నాఁగ మెఱసె ౝ వెలిమావుల వే
గముసొంపున నయ్యరదం, బమరేంద్రునిలీలఁ బొలిచె ౝ నతనిసుతుండున్. 249

వ. ఇట్లు మండలప్రచారగతప్రత్యాగతాదివివిధగతులం దేరు సంచరింపం జేయుచు
నిలింపకోటికిం గన్నులపండువు సేయం బుండరీకాక్షుం గనుంగొని నారాయణ
గోపాలురు గుపితాత్ములై యర్జునదుర్యోధనులు ద్వారకానగరంబునకుం బోయిన
నాఁడు కృష్ణుతోడిసరి గా దుర్యోధనుఁడు దమ్ముఁ గోరికొనినవాఁ డగుటం జేసి
యాసునం బేర్చి యన్నరనారాయణులమేనుల నానాస్త్రంబులు నినిచిన నరుండు
దేవదత్తంబు పూరించి యవష్టంభంబునం ద్వష్ట యిచ్చినమహాస్త్రంబు ప్రయో
గించినం దత్ప్రభావంబున. 250

క. గాండీవిచంద మయి వా, రొండొరులకుఁ దోఁచి యొకళు ౝ లొకళుల నానా
చండాస్త్రశస్త్రసముదయ,ఖండితులుగఁ జేసి పడిరి ౝ కలనం గలయన్. 251

వ. ఇమ్మెయిఁ గృతార్థం బయినదివ్యాస్త్రంబు పదంపడి శాంతం బగుటయు హత
శేషులువోక పాదివి రథరథ్యకపికేతుగరుడకేతుసహితంబుగా సవ్యసాచి నాభీల
శరజాలసంవృతుం జేసిన. 252

క. ఆపార్థుఁడు గోపానల, దీపితుఁ డై విశిఖశిఖలౝతీవ్రనిహతి న
త్రూపులగమి నేర్చి జముని, బ్రోపు గుడువఁ బుచ్చె వారిఁ ౝ బురువంశనిధీ. 253

వ. ఇవ్విధంబున విజృంభించి యట్టహాసంబు సేయుటయుం దుండిమగధకేరళమచ్ఛిల్లి కాదు లడరి సాయకనికాయంబులం గప్పిన. 254

క. నానాస్త్రంబుల నాతఁడు, పీనుఁగుపెంటలుగఁ జేయఁ ✽ బిఱుసనక మహా
సేనలు దోడ్తో డగ్గఱి, యానరుపైఁ బెల్లు గురిసె ✽ నమ్ములవానల్. 255

క. కరితురగరథపదాతులు, బెరసి కదిసి చుట్టు ముట్టి ✽ భీషణహేతి
స్ఫురణ మెఱయఁ జేరిన న,చ్చెరువుగ విజయుండు సించి ✽ చెండాడె వడిన్. 256

వ. సంశప్తకులు మఱియును. 257

క. పెరయీఁగలగతిఁ గవియుచుఁ, బొరిఁబొరిఁగడుఁదురుసపగిదిఁ✽బొదువుచు[1] నెరకై
వెరవునఁ గాకులుఁ గ్రోఁతులుఁ, బరువడిఁ జీకాకుపఱుచు✽భంగి నలఁచుచున్.

వ. పెనంగి రండుఁ గొండఱు వీరావేశంబున. 259

సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునరథంబుపైఁ బడుట.

క. అరదంబులు మొద లగును,ద్ధురవాహనకోటి డిగ్గి ✽ దుర్దాంతగతిం
దురగంబులపై హరిపై, నరుపై నూడుకొనఁ బడిరి ✽ నలి నార్పులతోన్. 260

వ. ఇత్తెఱంగునం జేయి గా లార్పనుం జూడ్కి వఱప రా కుండునట్లుగా గుంపులు గొనం బైపయిఁ దొరంగినం గృష్ణు లగపడిరి తెగిరి మడిసిరి మ్రగ్గి రనుమాట లతోఁ దత్సైన్యంబుల సింహనాదంబులుఁ దూర్యనినదంబులుఁ జెలంగె నప్పుడు సెమర్చి చేడ్పడి వసుదేవనందనుండు. 261

ఆ. ఎచట నున్నవాఁడ ✽ వేమైతి ప్రాణానఁ, గలవె యేను నిన్నుఁ ✽ గాన కునికిఁ
దలఁకు చున్నవాఁడ ✽ ధైర్యధౌరేయ నీ,వెలుఁగు సూపవేసు✽రేంద్రతనయ.

వ. అనిన విని యతండు ముకుందునిమానుషభావం బూహించుచు నుత్సాహంబు వాటించి. 263

క. అనిలాస్త్రంబు ప్రయోగిం,చిన సంశప్తకులు దెసలఁ ✽ జెదరి చొరువుచా
డ్పునఁ దూలఁగ బహువిధశర,వినిహతి బడలువడఁ జేసె ✽ వెన్నుఁడు మెచ్చన్.

క. శిరము లురంబులు గరములు, చరణంబులు రూపు మాయ ✽ శకలము లై సం
గరధరఁ దొరఁగిరి యోధులు, గరితురగరథాస్త్రశస్త్ర✽ఖండంబులతోన్. 265

వ. అట్లు గసి మసంగి కిరీటి కల్పాంతపురాంతకుండునుంబోలె బొరిసమరు చుండ వెండియు వెఱచఱవక తఱిమి పెనంగునబ్బలంబు లతనిబాణపరంపరలబలితంపుఁ బరపునం జేసి. 266

ఆ. కూలురూపుఁ దన్ని✽కొని మెడ్డిరూపును, నొఱలురూపు [2]నేల ✽ కొఱగురూపుఁ
బొరలురూపు నయ్యె ✽ సరవాజిగజములు, ప్రధనభూమి ఘోర✽భంగి గాఁగ.

వ. ఇవ్విధంబున నసమసమరతత్పరులై తనవలన నేమఱియామఱందియు బావయు న ట్లుండ [3](*నిక్కడధర్మజుండు పురికొల్ప నుగ్రసైన్యంబులు మనమొనలు దలం

1 నెఱకై - నెరపై. 2 నల్ల నొఱగు. 3 (*) ఈకుండలీకరణములోనిపాఠము వ్రాఁతప్రతులందు లేదు.

కం దటిమె) నాచార్యుండును ధర్మసూనుసైన్యంబులు దలంకఁ దటిమె నప్పుడు
నీకొడుకు దుర్ముఖుం ,డతనికిఁ బ్రియంబుగా ధృష్టద్యుమ్నుం దలపడినం గురు
పాంచాలకుమారవర్గంబు లగ్గలికం గవిసి పోరె నట్టియెడ. 268

చ. గురుఁ డనుతీవ్రమారుతముతోఁ గ్రొత్తల కోర్వక ధర్మపుత్త్రబం
ధురబలవారిదోత్కరము దూలుడు నాతఁ డదల్చి వీరసుం
దరముగఁ జేయి వీచిన నుదగ్రగతిం బురికొన్నఁ గారవ
స్ఫురణము నుద్భటం బగుడు సూర్యుని ముంగె ధరాపరాగముల్. 269

వ. ఇబ్భంగి నుభయసైనికులును గలయఁ బెరసిన మణిభూషణకిరణజాలంబులకితం
బున ధూళికృతంబు లగుతిమిరంబుల గెలిచి పోరు చుండ ధారాళరక్తసిక్తం బై
యారజఃపటలం బడంగుటయు. 270

క. ఇరువాఁగును దార్కొని వి,స్ఫురణ మెఱయ నాయుధములు పొగ లేనిశిఖల్
దరతరమ యెగయఁ బోరఁగ, ధరఁ జతురంగములు నద్భుతంబుగఁ గెడసెన్

క. కరిఘటలు దురగములదళ, మరదంబులమొత్త మనక యడరి వడిం గా
ల్వురు మ్రగ్గఁ జేయుచును మ్ర, గ్గిరి విస్మయ మొలయఁ జూచు ఖేచరతతికిన్.

ఉ. తేరులయొప్పు మ్రొగ్గుపడఁ దేఁకువ లేనిపదాతికోటి ను
గ్గై రుధిరంబులో మునుఁగ నానిన యేనికపిండు పక్షముల్
ఘోరము గాఁగఁ ద్రెవ్వి వెసఁ గూలుకులాద్రులఁ బోల నాశ్వికుల్
వీరవినోదముల్ సలుపు వేడుకసొంపునఁ గూడి యెక్కినన్. 273

చ. నిలిచినరూపు డొల్లి ధరణిం బడి యున్నశరీర మింత లిం
తలు శకలంబు లై నెఱయ దండడిమూఁక గలంగ నొంటి గుం
పులు వడి పోవ రక్తజలపూరముఁ గ్రొంపులు ధూళి గా రథం
బులు రభసంబునం బఱపి పోరిరి యోధులు గ్రోధదీప్తు లై. 274

క. కొమ్ములఁ గ్రుమ్మియుఁ జాదత,లమ్ములఁ జమరియును గరములం బఱిపఱి యై
యి మ్మెడలఁగఁ దిగిచియు నర,దమ్ముల నేనుఁగులు వీటతాటము సేసెన్. 275

క. తురగమున నరుని బ్రేయుచుఁ, గరిదంతము వెఱికి యన్యకరి వైచుచు ను
ద్ధురరథము చదలఁ ద్రిప్పుచుఁ, గరులు వినోదంబు సేసెఁ గనుఁగొను ప్రజకున్.

వ. ఒక్కొక్కచోట. 277

చ. మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలి సోనయుఁ గల్గుమేఘము
ల్గిఱికొన నొప్పునాకసముతోలీల రణక్షితి సూడఁ బొల్పగుం
దఱి చగుభూషణద్యుతివిరాజసము పర్వ గజవ్రజంబు పై
ల్లొఱలుచు నెత్తురుల్ సొరఁగఁ జుండ నొగిం బడి యున్కి నత్తఱిన్. 278

ఆ. అశ్వసుభటతతులయంగఖండంబులు, రుధిరకర్దమమున బ్రుంగి యున్న
పెల్లు చూడ రౌద్రబీభత్సకరుణభ,యానకైకహేతు వయ్యె నధిప. 279

వ. అట్టిసమయంబున నారోహకులు వడినం దెరలం బాఱువారణహయంబులును వాహనంబులు నిహతంబు లయిన వెడవెడ మెలంగువివిధయోధులును రుధిరమాంసమస్తిష్కమయమహాపంకంబునం గలయ మునింగియుం గాళులు వెలుకరాకుండియు గొరిజ దిగంబడియును రథకరిఘోటకంబులు సంచరింప నేరకునికి వెడంగువడుచుం బెనంగుకడిందిమగలును రక్తాంబుతురగావర్తకరిగిరికలితం బైన సమరాంగణసాగరంబు నానావిధవాహనయానపాత్రగతులం దఱియం జొచ్చి తమయట్టివారు గొందఱు మునింగినను వెండియు విజయధనవాంఛం జేసి వెఱవక వర్తించువీరవ్యవహారులు నయి యెయ్యది సూచిన నెత్తుటం గెంపెక్కి పైనిరులుక్కునం బొంపిరివోవు చున్నసంకులసంగ్రామంబునం జెక్కు చెమర్పక దర్పంబునం జెలంగుచు ద్రోణుం డెలుంగు సూపి కడఁగి. 280

క. కరియూథనాథుఁ బొదువం, ద్వరితోద్ధతియానదుర్నివారం బై కే
సరి సనియెడుపగిది యుధి,ష్ఠిరుదెసకుం జనియె నతనిసేన దలంకన్. 281

క. అతికోలాహలవికల,స్థితి యగుతనబలము మిగిలి ధీరత్వమహో
న్నతుఁ డగునతండు విశిఖ,ప్రతతి వఱపె గురునిపై నరాతులు వొగడన్. 282

ద్రోణాచార్యునిచేత సత్యజిత్తు చచ్చుట.

చ. కని ద్రుపదాన్వయోత్తముఁ డకంపితశౌర్యుఁడు సత్యవిక్రముం
డనుపమధైర్యధుర్యుఁడు మహాబలదీప్తుఁడు సత్యజిత్తు ద్రో
ణుని వెసఁ దాఁకి తత్తనువు నొవ్వ దశోగ్రశరంబు లేసి సూ
తుని మెయి గ్రుచ్చెఁ బేర్చి పదితూపులు ధర్మజుఁ డుల్లసిల్లఁగన్. 283

ఆ. గురుఁడు సత్యజిత్తుకోదండదండంబు, దునుముటయును వేఱధనువు పుచ్చి
కొని యుదాత్తరేఖఁ గ్రూరభల్లంబులు, ముప్పదింట నతనిఁ గప్పె నతఁడు.

వ. తదవసరంబున సత్యజిత్తుం గూడికొని. 285

క. వృకుఁ డనుపాంచాలకుమా,రకుఁ డఱువదితూపులం గరం బరుదుగ న
స్త్రకళాచార్యుం బొదివిన, వికాసముం బొందెఁ బాండవేయబలంబుల్. 286

చ. ఘనతరకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల సత్యజి
త్తనువు వృకాంగమున్ విశిఖధారల ముంచె గురుండు వార లా
తనివడి కోర్చి మై గలయఁ దాఁకఁగ సారథియు బ్బడంగ వా
హనములు బీఱువోవ సిడమల్లల నాడఁగ నేసి రుద్ధతిన్. 287

ఆ. సత్యజిత్తుమేన సాయకదశకంబు, నాటి కుంభజుండు నగుచు విల్లు
దునుమ నొండువింట ద్రోణునినొప్పించె, నతఁడు వృకుఁడుఁ బెలుచ నడరి యేసె.

క. కినిసి వెసన్ సత్యజితుని,ధనువు నఱకి గురుఁడు వృకునితల దునియఁగ నా
తనిహయములు సారథియును, మును డొల్లఁగ నాలుబాణముల్ బిట్టేసెన్.

ఆ. అన్యచాపహస్తుఁడై సత్యజిత్తు సం,రంభజృంభణమునఁ గుంభభవునిఁ

దలర నేయుటయు నతండు గెంపారెడు, నాననంబుతోడ నవుడు గఱచి. 290

ఉ. ఖండము లై పడం ధనువు గ్రక్కున నేయుడు సత్యజిత్తు వి
ల్లొండు గొనం గొనం దునియ నుద్ధతి నేయుచుఁ బెక్కువిండు లు
ద్దండత నుగ్గు సేసి భుజదర్పధురంధరుఁ [1]డీతఁ డింత ద
క్కం డని యర్ధచంద్రవిశిఖప్రహతిం దల డొల్ల నేసినన్. 291

క. సాహంకారుం డగుగురు, బాహుబలంబునకు నులికి పాఱఁ దొలంగెన్
[2]వాహములఁ దోలుకొని యు,త్సాహంబుఁ జలంబు నెడల ధర్మజుఁ డధిపా.

ద్రోణాచార్యునిచేత సూర్యదత్తుఁడు సచ్చుట.

సీ. అతని వెనుకొన నాచార్యునకు నడ్డ, పడి వారిమొన లెల్లఁ గడఁక నొక్క
పెట్ట త్రోచిన దూదిగుట్టలపైఁ బ్రాఁకు, నగ్గిచందంబున మ్రగ్గఁ జేయు
నగ్గురుఁ దాఁకి మాత్స్యానుజుఁ డాఱుదూ,పుల నొంచి యార్చిన నలిగి యతని
తల కుండలములతో నిలఁ బడ నతఁ డేసె, ధరణినాయక సూర్యదత్తుఁ డిట్లు

ఆ. వడినఁ జూచి మత్స్యబలకోటి విచ్చినఁ, జేదిమగధకేకయాదిసేన
లెల్లఁ జెదరఁ దలరఁ దల్లడపడఁ గల,గుండుగొనఁగఁ జేసెఁ గుంభజుండు. 293

క. మెఱుమ ధనుర్దండము గుణ, ముఱుమఁగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁ దఱచై
పఱవ రుధిరంపుఁ గాలువ, లఱిముఱి ఘనభుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా.

క. వీరాస్థిశర్కరాఘన, భేరీమండూకకవచపృథులోర్మిరథ
స్ఫారావర్తగజమకర, ఘోరమహిమ రక్తనదులకుం దగియె నృపా. 295

వ. ఇవ్విధంబునం బాండవాగ్రజుం బట్టికొన నప్పళించి తఱుమునమ్మహావీరు మా
ర్కొని యుధామన్యుండును నుత్తమౌజుండును వసుదానుండును శిఖండియు నై
దైదుశరంబు లేసిరి సాత్యకిక్షత్త్రధర్ములు వరుసన నూటయిరువదింటఁ బదింటం
గప్పి రయ్యుధిష్ఠిరుండును మరలి బాణశతత్రయప్రయోగతీవ్రు లగుధృష్టద్యుమ్న
చేకితానుల ము న్నిడికొని పొంగి తానును బంద్రెంట నొప్పించె నప్పు డాభార
ద్వాజుని మఱియునుం బలువురు పాండవపక్షయోధవీరులు వొదివినం గని నీ
మన్నించురాజులు రాజకుమారులు నతనికి బాసట యై కవిసి రతండు వసుదాను
వసుధం గూల్చి క్షేము జముకడ కనిచి యుధామన్యుని నుత్తమౌజుని శిఖండిని
సాత్యకిని నెక్కమ్ము లెమ్ములం గీలించి తన్నుం గదిసినం గని యయ్యజాత
శత్రుండు వెండియుఁ గైతవంబున రణంబునకుం దొలంగం బాఱెన. 296

క. గురు దృఢసేనుఁడు దాఁకిన, హరిసారథికేతురథశరాసనశకలో
త్కరములతోడ నతండును, దొరఁగించెఁ దదీయతనువుదునియలు ధరణిన్.

వ. ఇత్తెఱంగునం దునిమి తఱుమునతనిదోర్విలాసంబు దుస్సహం బగుటయుం
బాండవబలంబులు దెరలినం గురుసైనికులు నలుగడలకు నెగచి రట్లు విజృం

1 డింతతోడ. 2 వాహనములఁ దోల్కొని.

భించినకుంభసంభవు నెదుర్కొని వార్ధక్షేమియుఁ జిత్రసేనుండును సేనాబిందుం
డును సువర్చసుండును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును శిఖండియు సాత్యకి
యును సుమిత్రుండును సాయకజాలంబులు నిగిడించిన. 298

తే. అందఱు నన్నిరూపులై ǂ యతఁడు పోరి
యాసుమిత్రునిఁ గూల్చిన ǂ నతనిఁ గేక
యులును మాత్స్యపాంచాలురు ǂ నొక్కపెట్ట
కవిసి విరిసిరి తచ్ఛరాǂఘాతభీతి. 299

వ. ధృష్టద్యుమ్నసాత్యకిసేనాబిందుప్రముఖరథికవరులును వస మఱి యుండి రనిన
విని ధృతరాష్ట్రుం డచ్చెరువడి యిట్లు వేర్చినయాచార్యుశౌర్యభుజవీర్యంబులు
సైరింప నక్కడ నెవ్వరు లేరైరి గదే యనుటయు సంజయుం డది సెప్పెద నా
కర్ణింపు మని యిట్లను నట్లు గలంగినకౌంతేయసేనం గనుంగొని కలకల నవ్వుచుఁ
గురువిభుండు గర్ణునితో నిట్లనియె. 300

క. పెనుగాలిని వెసఁ గూలిన, వనముక్రియం బడినపాండǂవబలముఁ గంటే
విను మింక నెన్నఁడును మొగ, కొన రీయోడిచనువారు ǂగురుకోత్తలకున్. 301

చ. పవనతనూజుఁ గంటె నిజǂపార్శ్వములం దనవారు లేక కౌ
రవులు మహోగ్రభంగి నడǂరం గడుదైన్యముఁ బొంది యున్నవాఁ
డవిరళదివ్యమార్గణదుǂరాసదు ద్రోణునిఁ జూచి వీఁడు రా
జ్యవిభవకాంక్ష యెల్లఁ దెగǂటాఱఁగఁ బాఱెడు నట్లు సూడుమీ. 302

వ. అనిన విని కర్ణుం డతని కిట్లనియె. 303

ఉ. భీముఁడు నట్టివాఁడె యరిǂభీషణవిక్రముఁ డస్మదీయసం
గ్రామజయంబు ప్రాణములు ǂ గల్గఁగ సైఁచునె పాండవేయు లు
ద్దామబలాఢ్యు లాహవము ǂ దక్కుదురే యది గాక వారు నీ
చే మును పడ్డపాట్లు దమǂచిత్తములన్ మఱవంగ నేర్తురే. 304

చ. వినుము తదీయయోధులును ǂ వీరగుణాఢ్యులు భీము మున్నగాఁ
గొని గురుఁ దాఁక కుందుదురె ǂ కూడుద మీతఁడు నొవ్వ కుండఁగా
మనమును నీతనిన్ బలసǂమగ్రుల మై యటు గాక యోడి రం
చునికి ప్రమాద మేను మొగ ǂ మోడక చెప్పితిఁ గౌరవేశ్వరా. 305

వ. అని పలుకునంతకుం గూడుకొని. 306

సీ. హంసగౌరము లగుǂహయములు నమృతాంశు, కేతువు మెఱయ నǂజాతరిపుఁడు
కురునిభాశ్వంబులు ǂ హరికేతనంబును, బ్రస్ఫురితములు గఁ ǂ బవనసుతుఁడు
శుకవర్ణహరులు ప్రǂస్తుతశరభధ్వజం, బును నొప్ప సహదేవǂపూర్వజుండు
నంబుదచ్ఛాయరǂథ్యములు శుంభ...బర్యా...యు శోభిల్లఁ గ దదనుజుండుఁ

తే. గడఁగి తమతమసిడములు గ్రాల ద్రుపద
మాత్స్యసాత్యకిముఖయోధమండలములు
దారుణాటోపవిక్రమోత్సాహలీలఁ
దోడు నడవంగ నడరిరి ద్రోణుమీఁద. 307

వ. ఇట్లు పాండవబలంబులు జలధరంబులు శైలంబు గప్పుకరణిం గుంభసంభవుం బొదివిన దృష్టపథం బవరుద్ధం బగుటయు నతండు దెగిమె ననుదిగులు మన వారికిం బుట్టు నట్టియెడ నీకొడుకు గడంగి సేనలకుం జేయివీచి యందు ముంగలియై నడచువడముడిం దాఁకినం దమకించి సాత్యకిని గృతవర్మయు క్షత్త్రధర్ముని సైంధవుండును యుయుత్సుని సుబాహుండును నకులుని దుశ్శాసనుండును సహదేవునిఁ జిత్రవర్ముండును ధర్మనందను శల్యుండును ద్రుపదుని బాహ్లికుండును విరాటుని విందానువిందులును శ్రుతకీర్తిని వివింశతియు శ్రుతసేనుని సాల్వుండును శ్రుతసోమునిఁ జిత్రసేనుండును శతానీకుని శ్రుతవర్మయుఁ బ్రతివింధ్యుని నశ్వత్థామయు సౌభద్రుని లక్ష్మణుండును శిఖండిని వికర్ణుండును గుంతిభోజుని దుర్ముఖుండును గేకయపంచకంబును గర్ణుండును గాళీశ్వరుని జయుండును బాండ్యుని జయత్సేనుండును ధృష్టద్యుమ్నపుత్త్రుల బృహద్ధనుర్జయమిత్త్రులును వార్ధక్షేమిని కృపాచార్యుండును మణిమంతుని భూరిశ్రవుండును ఘటోత్కచుని నలంబుసుండును దలపడి రెన్నం గొలఁది గాదు గాని మఱియు ననేకు లనేకుల మార్కొని రిబ్బంగి భారద్వాజునిం బరిమార్పను గావను బూని [1]యక్కడియిక్కడివీరులుక్కు మిగిలి యొండొరుల కేతనంబులు గూల్చియు ఘోటకంబులప్రాణంబులఁ బీల్చియు సారథుల రూపుమాపియు నరదంబులు పఱియలువాపియు నాతపత్ర చామరంబుల బడలువఱిచియుఁ జాపంబులు విఱిచియుఁ గత్తళంబులతునియలు ధరన్ [2]దొరలించియు నెత్తురు రురలించియు నిత్తెఱంగున ఘోరసంగ్రామంబు సేయుచుండ మధ్యాహ్నం బయ్యె నప్పుడు దన్నుం గవిసినధృష్టద్యుమ్ను నమ్ముల నవలీలం గుదియించి యగ్గురుండు వెండియుం గొందఱం జిక్కువఱిచె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 308

క. వీరిచట నివ్విధంబునఁ, బోరఁగ నర్జునునితోడఁ బోక పెనఁగున
వీరులు సంశప్తకు లె, ట్లైరొకొ యాతనిపరాక్రమాతిశయమునన్. 309

చ. అనవుడు నాతఁ డిట్టు లను నవ్విభుతో నది వెండి చెప్పెదన్
వినుము నరేంద్ర యట్టియెడ వీరరణస్ఫురణంబునన్ భవ
త్తనయుఁడు గంధసింధురవితానము పై నడరించి భీమసే
నునిఁ గినియించె నాతఁడు గనుంగవ నిప్పులు రాలు చుండఁగన్ 310

1 యిక్కడక్కడివీరు. 2 దొరఁగించియు.

క. శరజాలమహావాత,స్ఫురణంబున నుగ్రదంతి* భూరిఘటాబం
ధురవారివాహపటలము, విరియించుచు బెట్టు గవిసి * విభు నొప్పించెన్. 311

వ. అట్లు కురురాజు నొచ్చిన నడ్డంబు సొచ్చి. 312

శా. వంగాధీశ్వరుఁ డేనుఁగుం గొలిపి గ*ర్వస్ఫూర్తిఁ [1]దివ్యాస్త్రవి
ద్ధాంగుం జేసె మరుత్తనూజు నతఁ డు*ద్యత్క్రోధుఁడై వానిమా
తంగంబుం బడ నేసి వాఁ డొఱగుచోఁ * దన్మస్తకం బుర్విఁ డొ
ల్లం గేలివిధ మొప్ప నేయ బల మె*ల్లం బెల్లగిల్లెన్ వడిన్. 313

వ. ఆసమయంబున. 314

భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱప పాండవసైన్యంబులం గలంచుట.

క. దానవజయ మింద్రున కై, ద్దానివలనఁ గలిగె మున్ను * దానోగ్రము స
ద్వేఁనుఁగు భగదత్తుఁడు పవ, మానతనయుదెసకుఁ గొలిపె * మద మెలరారన్.

వ. ఇట్లు మనసైన్యంబు దైన్యంబు వాయం గొలుపుటయు నగ్గజంబు. 316

సీ. కినుకమై నిగిడిన* కనుఁగవ మెఱుఁగుల, [2]గములు ముందటఁ గెంపు* గడలుకొలుపఁ
జెవులు మ్రొగ్గించి పూఁ*చినరౌద్రతర రేఖ, వినువీథిఁ జూపఱ* వేడ్కఁ బెనుప
గండునఁ జాఁగిన* తొండంబు లయసమ,వర్తిదండములీలఁ * బట్టువఱుపఁ
గడుబెట్టిదపుటుర* వడిఁ బదన్యాస మి,లాస్థలి గ్రక్కద*లంగఁ జేయ

ఆ. ననిలపుత్త్రుదెసకు * నడరినఁ గని ధర్మ,తనయుసేన జనులు * దల్లడిల్లి
చంపెఁ జంపె భీము * సామజం బనియెడు,నులివు గలయఁ జెలఁగ* గలఁగి రథిప. 318

వ. తదవసరంబున యుధిష్ఠిరుండు.

క. అలు కొందుమనముతోఁ దన, బలముం బురికొలిపి పొదివి * భగదత్తుని న
మ్ములఁ గప్పె నతఁడు వానిన్, విలసిల్లుమహాంకుశమున * విరియ జడియుచున్.

క. గజముఁ గొలిపి యాదిక్కున, గజఘోటకభటనికాయ* కాయములు రథ
వ్రజములుఁ బొడి పొడి గా న,క్కజముగ విహరించె బాహు* గర్వస్ఫూర్తిన్. 321

వ. అప్పు డాలోకించి.

చ. అలిగి దశార్ణభూరమణుఁ * డాతనిఁ దాఁకినఁ జూడ నొప్పె తె
క్కలు గలపర్వతద్వయము* కైవడి వారలదంతియుగ్మ మి
ట్టల మగువీఁకఁ దక్కరిఁ బ*డం బొడిచెన్ వడి సుప్రతీక ము
త్తలపడువానిఁ జంపె భగ*దత్తుఁడు దోమరసప్తకంబునన్. 322

ఆ. చంపి విక్రమంబు * సొంపారఁ బాండవ,బలము బడలుపడఁగ * భద్రదంతిఁ
జట్టులగతులఁ బఱప * సాత్యకి యడ్డంబు, నడచి యేసె దొడ్డ*నారసమున. 323

చ. కరిపతి జిఱ్ఱనం దిరిగి * క్రుస్సుఱ నూల్కొని వృష్ణివీరును
ద్ధురరథ ముద్ధతిం బెనఁచి * తొండమునన్ వెస నెత్తి వీచి వై

1 దివ్యాస్త్రి. 2 గములముందటఁ గెంపు ♦ గడలుకొనఁగఁ.

చె రయమునై నగం డిలకుఁ । జిత్రముగా నెడ దాఁటి పోయెఁ జె
చ్చెర గజ మొండుమైఁ గవిసి । చిందఱవందఱ సేసె మూఁకలన్. 324

క. సారథి తురంగముల మెల, పారంగాఁ బూన్చి తేర్చి । యవికల మగునా
తే రల్లఁ దేర సాత్యకి, బీరము వాలివోవ కుండఁ । బ్రియమున నెక్కెన్. 325

ఉ. భీముఁ డుదగ్రతం గవియఁ । బెల్లగునాకరిచేతిశీకర
స్తోమమునం దురంగములు । దోఁగి కదుర్ వెగ డొంది యీడ్చె సం
గ్రామవినోదలీలకు వి।ఘాతము గాఁగ రథంబు నప్పు డు
ద్దామపరాక్రమస్ఫురణఁ । దాఁకి సుపర్వుఁడు సచ్చె హస్తిచేన్. 326

వ. అతనిపడుట గనుంగొని సౌభద్రుండును ద్రౌపదేయపంచకంబును జేకితానుం
డును ధృష్టకేతుండును యుయుత్సుండును గడంగి సామజంబుపై శరవర్షంబులు
గురిసిన నది కోపించి యురవడించి. 327

క. పదముల రథవాహంబులఁ, జదుపుచుఁ బైకొని యుయుత్సు।సారథిఁ జంపన్
బెదరక యభిమన్యుని తే, రొదవిన నది యెక్కి యూతఁ । దుర్గతి నేసెన్. 328

క. నరతనయప్రముఖరథిక,వరులు నిభముమీఁద నేయు।వాలమ్ములు ని
ష్ఠురగతి శరదభ్రముపైఁ, బరఁగుతరణికిరణచయము।పగిదిం బొలిచెన్. 329

క. రభసంబునఁ బ్రాగ్జ్యోతిష,విభుఁడు గరిం గొలుపుటయును । వెస నది యరివీ
రభయంకరముగ వారల,ప్రభ సెడ నరదములు వైచెఁ । బలుదెసలఁ బడన్.

ఆ. ఇట్లు భీమసేను।నేపు నర్జునసుత,ప్రముఖు లైనయలఘు।రథికవరుల
జృంభణంబుఁ జెడినఁ । జేడ్పడి చెడి పాఱఁ, జొచ్చెఁ బాండురాజ।సుతులసేన.

క. నలి భగదత్తుఁడు గదుపుల, వెలుచుపసులవానియట్ల । విలసద్గతి న
బ్బలము నెగవ ధూళియు నా,కులసంరావంబు గగన।కుహరము నిండెన్. 332

క. అని చెప్పి సంజయుఁడు గురు, జననాయక యపుడు సవ్య।సాచిరణముది
క్కునఁ జిత్తం బిడి యడిగితి, విను మయ్యోధవరు తెఱఁగు । విస్పష్టముగాన్.

వ. అనవుడు నాంబికేయుం డాకర్ణనవాంఛ మిగుల నది సెప్పు మనుటయు నాతని
నాసూతనందనుం డిట్లనియె. 334

అర్జునుఁడు భగదత్తునిదెస రథంబు దోలు మని కృష్ణునితోఁ జెప్పుట.

క. అంతకు మును భగదత్తుని, దంతియసమసమరకేళిఁ । దాఁ గని హరితోఁ
గుంతీసుతుఁ డిట్లను మన, మెంతయు వెస బలములోని । కేఁగఁగ వలయున్.

వ. అది యెట్లంటేని. 336

చ. బిరుదు జితశ్రమంబు బల।భేదనశాలి మహాస్త్రశస్త్రపా
తరయము సైఁప నోపు భగ।దత్తునివేనుఁగు దానికో ల్తలం
[1]దిటగక పోర నెవ్వరికిఁ । దీఱదు నీవును నేను లేనిచో

---

1 దిటముగఁ బోర.

భర మగు నేఁడు రాజునకుఁ గ బావనికిం దలఁ కొందెడున్ మదిన్. 337

ఆ. అనిన నట్ల కాక గ యని శౌరి యరదంబు, ద్రిప్పి యాత్మసేనదిక్కు వోవ
నిచ్చుటయును వెనుక గ నెయిది సంశప్తకు, లార్చి పేర్చి కురిసి గ రస్త్రసమితి.

వ. ఇట్లు చతుర్దశసహస్రరథికముఖ్యులు బెట్టు ముట్టిన. 339

క. బలములఁ గావఁగఁ జనుటయు, నలవు మెఱయ మగిడి వీరిఁ నడఁగించుటయుఁ
వలయుపనులయం దిప్పుడు, దలకొని మొద్దానిఁ జేయఁ గ దగవో నాకున్. 340

వ. అని వితర్కించి విచ్చుండు సంశప్తకవధంబ యుచితంబుగా నిశ్చయించి మరలి గాండీవగుణక్వాణనమేదురరోదసీకుహరుండును దేవదత్తధ్వానవిదళితదశదిశాసందోహుండును నై దివ్యబాణంబులు వరఁగించినం గేతనాతపత్రచామరవ్యజనంబులును భేరీశంఖకాహళమృదంగంబులును యుగాక్షరథాంగకూబరంబులును దంతశుండాకుంభవంశదండంబులును ఖురస్కంధవాలంబులును ధనుశ్శరముసలముద్గరక్షురికాంకుశంబులును దనుత్రాణకంకటమస్తకచ్ఛదంబులును మకుటకేయూరహారకంకణాంగుళీయకంబులును శిరఃకరవక్షఃకుక్షికటిచరణంబులును దునియలుం బఱియలుం దుమ్ములుం బొళ్లు నై రాలిన నన్నేల ఘోరంబును నభిరామంబు నై యుండె సర్వభూతంబులును బీభత్సుం బ్రశంసించెఁ గంసారి విస్మయప్రమదమగ్నమానసుం డయి కిరీటిం గరతలంబున నప్పళించి యగ్గించె నివ్విధంబున నవ్వీరరథికులం బిలుకుమార్చి పేర్చి రథాంగపాణిం జూచి రథం బింక రయంబున నక్కడకు నడపు మనుటయు. 341

ఆ. ఆతఁ డట్ల చేయ గ నరవాయి గొనక సు,శర్మ దాను ననుజచయముఁ బెలుచ
నెయిది పార్థ పార్థ యిట్లువోఁ దగునె యే, మనికిఁ బిలువఁ బిలువనిన నతఁడు.

క. పిలిచిన మరలమి దగ ద, బ్బలములఁ గాచుటయు వలయుపని యైనది నీ
వలసినవిధంబు సేసెదఁ, దలకొను మొక తెఱఁగు దైత్యదర్పధ్వంసీ. 343

చ. అనుచు మురారిఁ జూచుటయు గ నాతఁడు దేరు మరల్ప మోమునం
గినుక మునుంగున వ్వాలయఁ గ గ్రీడి త్రిగర్తునిచాపదండకే
తనములు ద్రుంచి పైపడినతమ్ముల నంతకుప్రోలి కన్చి యా
తని నవలీల నొంచిన నతండు వెసం బడి మూర్ఛ వోవుడున్. 344

వ. మగిడి యట నిరూపించి నారాయణు నుద్దేశించి. 345

సీ. షాఱెడు మనసేన గ పరఁగెడుఁ బెందూళి, నభము గోలాహలక్షుభిత మయ్యె
భగదత్తుశుండాల గ మెగచుచు నున్నది, పఱపుము వెస దానిపై రథంబు
నావుడు నతఁడు మహావేగమున రథ్య,ములఁ దోలఁగఁ గిరీటి యలవుఁ జలము
మెఱయంగ నీమొన మెఱుఁగువాలమ్ముల, నఱుముసేయుచు సింహనాదమునకుఁ

తే. బ్రాపులై దేవదత్తంబురవము గుణము,రావమును దిక్తటంబులఁ గ్రమ్మఁ జేయ
వచ్చి విచ్చుఁ డడ్డంబుసొచ్చె వీరఁ, జండచేష్టితోద్దండ వేదండమునకు. 346

క. అన విని ధృతరాష్ట్రుం డి, ట్లను సంజయుతోడ భీమ౯ణాటోపత న
ర్జునుఁ డి ట్లెయిదిన భగద,త్తుని కతనికి నేమిభంగి ౯ దుర మయ్యెనొకో. 347

ఉ. నావుడు నాతఁ డాధరణి౯నాథున కిట్లను నట్లు దాఁకినం
జేవ దలిర్ప విక్రమవి౯శృంఖలుఁ డై భగదత్తుఁ డుగ్రబా
ణావలిఁ బార్థుపైఁ బఱపె ౯ నన్నియు నవ్వుచుఁ ద్రుంచి వైచి య
ద్దేవసముండు నొంచె దృఢ౯దీప్తశరంబుల దంతి నాతనిన్. 348

తే. అలుఁగుటమ్ములుదాఁకిన౯నలిగి భద్ర,[1]కుంభి రౌద్రంబు సొంపారఁ౯గొలిపెనతఁడ
వారిసేనలు గోపికా౯వరుఁడు నరుఁడుఁ, దెగిరి తెగి రనుపలుకుల ౯ దిగులు పుట్ట

క. బలువిడిఁ గరి గవియుడు వెసఁ, దొలఁగించె రథంబు వెరవు౯తో హరి యది య
ట్టల మగురయమునఁ జని త, ద్బలము బడల్పడఁగఁ జేసెఁ ౯ బార్థివముఖ్యా.

క. హరి నేమియు నన నేరక, కరిదెసఁ గనుఁగొనుచు నవుడు౯గఱచుచుఁ బోని
మ్మరద మని పలికెఁ గవ్వడి, హరులను సమ్ముఖము సేసె ౯ నతఁడుఁ గరటికిన్

క. శౌరిమెయిని భగదత్తుఁడు, నారసములు నినిచి యేసె ౯ నరుఁ డల్గి మహో
దారోద్ధతిఁ దచ్చాపవి,దారణ మొనరించి గ్రుచ్చెఁ ౯ దనువునఁ దూపుల్. 35[illegible]

సీ. కోపంబు గదిరి ప్రాగ్జ్యోతిషపతి చతు, ర్దశతోమరము లింద్ర౯తనయుమీఁద
నడరించుటయు [2]నవి ౯ పొడిసేసి క్రీడి యే,నుంగుపక్కెర చిఱు౯నుగ్గు సేయ
నది గప్పి యున్నమే౯ఘావలి విచ్చిన, గొండచందంబున ౯ నుండె శక్తి
గొని భగదత్తుండు౯దనుజభంజను వైవ, నడుమ ముత్తునియగాఁ౯నఱకెఁ బార్థుఁ

తే. డాతపత్రంబు దునిమిన౯నతనిమకుట,మతఁడు ఘనతోమరంబున ౯నగలఁ జేయ
మెచ్చుఁ గినుకయుఁ బొడమ వి౯వ్వచ్చుఁ డుగ్ర,విశిఖసప్తతిఁ జొనిపె న౯వ్వీరుమేన.

మ. రభసోదగ్రతఁ బూన్చి దీపు లడరం ౯ బ్రాగ్జ్యోతిషాధీశ్వరుం
డభిమంత్రించి నిజాంకుశంబు దివిజేం౯ద్రాపత్యవక్షంబు సూ
చి భుజోల్లాసవిభాసి యై పెలుచ వై౯చెం దద్బలం బెల్ల భూ
రిభయోద్రేకతరంగితం బగుచు ఘూ౯ర్ణిల్లంగ రౌద్రాకృతిన్. 354

ఉ. అప్పుడు శౌరి పార్థునకు ౯ నడ్డముగాఁ దన[3]మే నమర్చి ను
న్గ ప్పెసలారుపేరురము౯నఁ ధరియించిన నమ్మహాస్త్ర మం
దొప్పె నవారుణాంబుజకృ౯తోజ్జ్వలమాలిక యై చిరస్థితిం
జొప్పడి నూతనాభ్రితల౯శోభిత మైనమెఱుంగుచాడ్పునన్. 355

చ. కనుఁగొని ఫల్గునుండు ముర౯ఘస్మర యిట్లగు నయ్య సొంపు నొం
దినకరుణావిశేషమునఁ ౯ దేరికి సారథి వైతి గాక యే
పనులును బూని చేయు టిది ౯ పాడియె తేజము నీవు దప్పఁ జూ
చినఁ జెడదే ననుం బలుకఁ ౯ జేసితి మాటలు వేయు నేటికిన్. 356

---

1. దంతికొ్ర... [illegible] 2. నొడఁ ♦ బొడి. 3. మేను సేర్చిన, న్గప్పెసలారు.

వ. అని దూఱినం గృష్ణుండు దొల్లి భూమిదేవి గామించి యోగనిద్రాసమయావసాన సుప్రబుద్ధుం డై యున్నవిష్ణుకడకుం జనుటయు నతండు తత్సంగతిం బ్రీతుం డై యన్నాతికి వరం బిచ్చుటయు నప్పరంబున నవ్వేలందియం దుదయించిననరకునకు వైష్ణవాస్త్రంబు విధేయం బగుటయు నది భగదత్తాయత్తం బై యునికియుం దద్ఘోరసాధనంబు దనకుఁ దక్క నొరులకు నోర్వరామియు నెఱింగించి యిది యట్లు గాక దీన నేమి యని మఱియుం దగుమాటలం గిరీటి ననునయించి విరోధిం జూపి వీఁ డిప్పరమసాధనంబు వృథ యగుటం జేసి వెఱఁగుపడి యున్నవాఁడు వీనితండ్రిని నేను దెగఁ జూచిన ట్లీక్రూరకర్ముని బిలుకుమార్పు మనినఁ గొండొక తేఱి యాతండు గాండీవగుణంబు సారించి దృఢముష్టి నేయుటయు.

భగదత్తుండు సుప్రతీకంబుతోడ నర్జునుచేఁ జచ్చుట.

ఉ. వాలికదొడ్డనారసము వజ్రము శైలము దాఁకునాకృతిం
ఫాలముమీఁదఁ దాఁకిన నిభంబు వెసం బడి కొమ్ము లూఁతగా
వ్రాలుడు నర్ధచంద్రరుచిరప్రదరంబునఁ ద్రుంచె బాణవి
ద్యాలసితుండు గ్రీడి భగదత్తునికంఠ మకుంఠితోద్ధతిన్. 358

వ. ఇట్లు దంతిని భగదత్తునిం బరిమార్చి మాఱు లేక మలయుమధ్యమపాండవునిం గనుంగొని శకునితమ్ములు వృషకుండును నచలుండును దాఁకిన నతండు వృషకుని రథరథ్యసూతధ్వజచ్ఛత్త్రచామరంబులు రూపఱ నఱకుటయు నాతండు సోదరు నరదం బెక్కె నప్పుడు వారి కడ్డపడినగాంధారవీరరథికపంచశతంబుఁ బంచత్వంబు నొందించిన సంక్రందననందనునురవడికిం దెరలక యేకరథస్థు లగునయ్యిరువురుం బరాక్రమించిన. 359

తే. చేరి యుండుట నను వైన వారి నొక్క
నారసంబునఁ బడ నేసె నరుఁడు దానిఁ
జూచి కన్నీరు నించి నీసుతులు సాలఁ
గుంది రర్జును నపుడు మాఱొక్కనియె శకుని. 360

వ. అతండు మాయావి యగుట ననేకమాయలు గల్పించిన మొగిల్లు వరఁగి పాషాణవృక్షవివిధాయుధంబులు విజయుపైఁ గురిసెం బదంపడి తమం బడరెఁ బిదప నీళ్లు వెల్లిగొనియె మఱియు మహోరగశార్దూలాదిక్రూరసత్త్వంబులు గవిసె వాని నెల్లను దోడ్తోన దివ్యాస్త్రవేది యగునాసవ్యసాచి యడంగించి యల్లని నగవుతో ని ట్లనియె. 361

క. మాయలు జూదముతోడన, పోయెం గా కింక నిచటఁ బొసఁగునె యవి మ
త్సాయకము లడ్డసాల్లే, నీయాచవి లేదు పొమ్ము నిలువక మామా. 362

క. అని పలికి వాలుటమ్ములు, తనువున నినుచుటయుఁ గలఁగి ధైర్యము మానం
బును వీటిఁబోవఁ బాఱెను, జననాయక నీమఱంది సరివారు నగన్. 363

ఉ. ఆతఁడు వాఱినం దెరలునచ్చటిసేనలఁ గాల్కొనంగ నీ
కాతతబాహువీర్యులు బకారియు సాత్యకియుం గడంగి తో
డై తనపార్శ్వభాగముల నార్చుచుఁ దోలఁగఁ దోలె ఖేచర
వ్రాతము మెచ్చఁ గ్రీడి కురురాజును ద్రోణుఁడు నున్న నేలకున్. 364
ఆ. బలము విఱిగి రెండుపాయలై యిట్టు ల,మ్మనుజవిభుని గురుని మఱువు సొచ్చె
ద్రోణుఁ బాదువుఁ డనుచు దుర్దమలీల నా,దిక్కు వారు గవిసి రుక్కు మిగిలి.
క. చనుఁ డడ్డం బాచార్యున, కనునెలుఁగులతోడ నీసు తావలి వెస మా
ర్కొనుటయు మనసేనలు పురి,కొని పాండవబలముఁ దాఁకెఁ గురువంశనిధీ.
క. గురుఁ డొడ్డుగఁ దమకంబున, గురువీరులుఁ బాండుపుత్త్రకులయోధులు ని 367
ర్భరసమరద్యూతకళా,నిరతిం గ్రీడించి రుగ్రనిపుణత మెఱయన్.
క. శరగురుఁ డెచటికిఁ దఱిమిన, వెరవున నచ్చటికి నెల్ల విక్రాంతిధురం
ధరుఁ డగుధృష్టద్యుమ్నుఁడు, బరవసము చలిర్ప నడ్డపడి పోరాడెన్. 368
చ. కురుపతిధర్మనందను లకుంఠితవిక్రమకౌతుకంబునం
బురికొలుపంగ సైన్యములు వోక పెనంగెడురౌద్రభంగి క
చ్చెరువడి యున్కి నిట్టు లని చెప్పఁగ నిప్పుడు నేర నయ్యెదం
గరిపురనాథ చూడ వినఁ గల్గునె యమ్మెయికయ్య మెయ్యెడన్. 369
370
వ. అట్టియెడ.
క. నీలుఁ డనురాజు గురుసుతు,పై లీలం దేఱు వఱపఁ బటువిశిఖమునం
గీ లెడపినజంత్రముక్రియ, నేలం బడ నేసె నతఁడు నృపుఁ డగ్గింపన్. 371
క. చచ్చిననీలునిఁ గనుఁగొని, విచ్చినసైన్యంబు గురుఁడు వెనుకొనుటయు వే
వచ్చిసధృష్టద్యుమ్నుని, నచ్చినయబ్బలము మగిడి నం బోరొప్పెన్. 372
వ. అప్పుడు సంశప్తకులు నారాయణగోపాలబలంబులం గూడికొని పఱతెంచి. 373
క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడించి రాక గెలుపే [1]యతఁ డేఁ
డీ డాఁగి పోయెనొకొ మా,తోడిబవర మిట్లు రాను దొలఁగినఁ దెగునే. 374
వ. అనునెలుంగులు నింగి ముట్ట దక్షిణభాగంబునం గవిసినం గవ్వడి యట నడచి
వారికిం గయ్యం బిచ్చిన నత్తెఱపి గని తఱుముకౌరవయోధులకోలుతలకుం గాక
దమసేనలు దెరలిన భీమసేనుం డదల్చి మార్కొని. 375
క. తలమిగిలి వచ్చుబాహ్లీకు, నిలు మని విశిఖముల నొంచె నృపతియు గురుక
ర్ణులు నశ్వత్థామయు న,మ్ములవానలు గురిసి రొక్క మొగి నతనిపయిన్. 376
వ. అతం డందఱ కన్నిఁటాపులై యార్చుచు నేట్లాడె ని ట్లొక్కనిం బెక్కండ్రు
వాదివినం గనుంగొని కౌంతేయాగ్రజుండు పురికొలుప నకులసహదేవసాత్యకి
సౌభద్ర లాసమీరపుత్త్రునకు బాసటమై దుర్యోధనాదులం దలపడుటయు

[1] యతఁడుర్క-వేఁడీ డాఁగెనొకొ మా-వేఁడిం దాఁకనొకొ మా.

రెండుసేనలు గలయఁ బెరసె నిట్లపరాహ్ణంబునం గ్రందుకయ్యం బయ్యె నం దరదంబులు దాఁకుపెల్లున డొల్లుకరులును గరవాలధారలఁ గాన నగుకుంభికుంభ మౌక్తికంబులును దురగఖురంబులం గరటిరదంబులను బెనంగొనుచు వ్రేలుప్రేవు లును దెగిపడియు నంకుశంబులు విడువక మిట్టి మిట్టిపడుబాహువులును దొండం బులం బెనఁచి యెత్తినం దారును హయంబులు వ్రేలురావుతులును ముందఱి కాళ్లు దెగ వ్రేసినఁ గూలుశుండాలంబులును సామజంబు లడరి రథ్యసారథి రథికసహితంబుగా మల్లడిగొనం ద్రొక్కిన నేలంగలసినరథంబులును నాశ్వికు లొక్కమొగిఁ జెక్కినం దునిసి పడి యేమిటియంగంబులో యనుసందేహంబు నకుం బట్టయి యున్నపదాతిగాత్రఖండంబులును జూచుఖేచరులకు వెక్కసం బొనర్చె నట్టిసంకులసమరంబున ధృష్టద్యుమ్నుండు. 377

క. మన కిది సమయము నుండీ
యని ద్రోణునిఁ జూపి తఱుమ నమ్మొన రథికుల్
గని [1]పొదువుఁడు సంపుఁడు పొరి
గొనుఁడు దునుముఁ డనుచుఁ గూడుకొని యతనిపయిన్. 378

చ. కపిసిన నమ్మహాభుజుఁడు గన్నుల దట్టపుఁగెం పెలర్ప భై
రవముగ దివ్యబాణనికరం బడరించినఁ దేఱి చూడ రా
క వెఱఁగు నొంది చిత్రములకై వడి నాఘనయోధు లుండ నీ
రవుతులు జోదులుఁ రథికరాజియు వారిమొనల్ గలంపఁగాన్. 379

మ. తను నత్యుద్ధతిఁ బిల్చి దుర్దమభుజాదర్పంబు శోభిల్లఁ దాఁ
కినసంశప్తకకోటి నొంచి సమరక్రీడాకళాకౌతుకం
బున నాభీలకపీంద్రకేతనపరిస్ఫూర్జత్ప్రభాజాలముల్
వినువీథిం బరఁగంగ వచ్చె మగుడఁ వివ్వచ్చుఁ డచ్చోటికిన్. 380

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చినక్రియ భీముకడకు వాసవి యిమ్మై
వచ్చినమనయోధావళి, ఱిచ్చవడియె వారిమొన దఱిమికొని వచ్చెన్. 381

ఉ. బాసట యై వృకోదరుఁడు పార్శ్వమునం దఱుమంగ వైరిసం
త్రాసనమూర్తి వాసవి శరప్రతతిం దొరఁగించి ద్రోణును
ల్లాసము మాన్చి కౌరవబలంబులు నెత్తురువెల్లిఁ దేలఁగాఁ
జేసినఁ గర్ణ కర్ణ మముఁ జేకొనవే యనుచుఁ భయంబునన్. 382

కర్ణార్జునులయుద్ధము.

క. తనవెనుక కోడి పాఱిన, ఘనయోధులఁ జూచి బాహుగర్వస్ఫూర్తిం
దనరుచు నోడకుఁ డోడకుఁ, డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతున్.

వ. ఇట్లు దాఁకి యతనిపై నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన నతండు వారుణ

1 పాదువుఁడు.

బాణంబున వారించి వాలమ్ములుగురియంగూడుకొని భీమసాత్యకిధృష్టద్యుమ్నులు శరత్రయంబులు నూతనూనుమేన నాటించిన నతండు గాండీవనిర్గతచండమార్గణంబుల మగిడించుచు నమ్మువ్వురచాపంబులు నవ్వుచుం ద్రుంచి వారలు శక్తులు వైవ వానిం దునిమి పేర్చి యార్చిన నర్జునుండు నారాచసప్తకంబున నవ్వీరు నొప్పించి యతనిం దలకడచి తన్నుఁ దలపడినయతనితమ్ములతలలు మూఁడును భూమిదేవికి బలి సేసె నంత భీముండు రథంబు డిగ్గి వచ్చి గదాదండంబునఁ గర్ణబంధువులం బదివేవురం బడలువఱిచి మరలి రథస్థుఁడై వేఱొక్కవిల్లు గొని విశిఖంబులు వఱపి యంగపతియంగంబులం దురంగశరీరంబులను నొప్పించె నాలోన నయ్యప్పాంచాలవరసుతుండును శైనేయుండును నొండువిండ్లు గొని యతనిసారథి యొఱగను జాపంబు విఱుగను నేసి రాసమయంబున దుర్యోధనుండును ద్రోణుఁడును జయద్రథులును నెయిది శాత్రవసముద్రంబున మునుంగ కుండ నారాధేయు నుద్ధరించి రట్టియెడ. 384

క. ఉభయబలంబులుఁ బురికొని, యిభరథతురగభటతతి మహిం గూలఁగ న
క్షుభితము లై పోరాడెం, బ్రభువులు వెను దన్ని చూడఁగ బార్థివముఖ్యా. 385

సీ. కాలువ లై పాఱుకీలాలజలములఁ, దేలి పోయెడుమృతదేహములును
బ్రేవులపోగులకు పెల్లునఁ జిత్రత, చ్ఛాయంబు లగుమాంససంచయములుఁ
గరినాయంబులకళేబరముల క్రిందఁ గొం, డొక తోఁచుభటగాత్రనికరములును
దలలపెండలిచులోన మిలమిల మెదలెడు, కరపదంబులనవఖండములును

తే. రౌద్రబీభత్సనర్తనరంగభంగి
నపుడు సమరాంగణము ఘోర మయ్యెఁ జూడ
ద్రోణఫల్గుననిష్ఠురోద్ధురనిపాత
జాత మగునమ్మహోద్భటసంకులమున. 386

వ. అంతం బతంగుండు పశ్చిమాచలంబునవులకుం జనిన సంధ్యారాగంబు సొంపునఁ గెం పినుమడించునెత్తురుమడువుల నోలలాడుభూతబేతాళంబులను శవకబళనలోలంబు లగుసృగాలంబులను మాంసచర్వణకోలాహలబహుళంబు లగుకంకగృధ్రాదిపక్షికులంబులనుం జూచియుఁ బాండవబలంబు సమయసముచితం బగుసమరవిరామంబునకు నున్ముఖం బగుట యెఱింగియు మున్న సవ్యసాచియుర వడికిం గాక తమమొన దెరలు చునికిం జేసియు నదియ మెయిగా నాచార్యుండు వారలకుం జెప్పి సేనలఁ దివియ నియోగించెఁ బాండవసైన్యంబులును మరలె నివ్విధంబున నుభయసైన్యంబులు నిజస్కంధావారంబులకుం జనునవసరంబున మనజనంబులు ద్రోణుప్రతిజ్ఞాభంగంబును ఫల్గునుపరాక్రమస్ఫురణంబును నతని యెడ నచ్యుతునకుం గలసౌహార్దవిశేషంబును నుగ్గడించుచు విన్న నై పోయిరి వేగుటయుఁ గయ్యంబునకు వెడలునప్పుడు విషాదవివర్ణవదనుండగుచు నీతనయుఁ

డెల్లయోధులు వినం గుంభసంభవున కిట్లనియె. 387

మ. పెను పార్థున్ వర మిచ్చి తట్లు గడిమిన్ భీమాగ్రజుం డాజిఁ గి
ట్టినఁ బట్టం గడు నగ్గ మైనయెడఁ గ్రేడిం తెప్డు నిక్లైనఁ జా
లనివాఁ డందురు నిన్ను నన్నుఁ గుటిలాలాపంబులన్ వెట్టిఁ జే
సిన నీ కైనది యేమి యాశ్రితగుణశ్రేష్ఠుండు వంచించునే. 388

వ. అనిన విని గురుం డప్రీతుం డయ్యును గటకటంబడక యతనితో నిట్లనియె.

ఆ. నరునివిక్రమంబు నారాయణునిమహ
త్త్వంబు నెఱిఁగి యెఱిఁగి తగునె యిట్లు
వలుక ధర్మపుత్త్రుపైఁ జేయి వదలక
వారు రారె పెక్కువరుస లధిప. 390

ఉ. ఎవ్వరి నెట్లు సేసెదనొ యేర్పడఁ జూడుము నేఁడు పోరికిం
గవ్వడి రాక యుండఁ దొలఁగం గొనిపోవఁగఁ జాలువారి నీ
వెవ్వరి నైనఁ బంపు మిదిఁ యేటికి నొండొకబుద్ధి సేసె దే
నవ్వుచుఁ బల్కినన్ ధరణినాథ యసత్యము గల్గ నేర్చునే. 391

వ. అనవుడు. 392

మ. విని సంశప్తకు లేము దక్క నొరు లావివ్వచ్చు భంగించి బె
ట్టనికిం బాపి యలంప నేర్పు గలరే యంచున్ వెసం బోయి పి
ల్చిన నప్పార్థుఁడు నుద్ధతిం జనుడు నక్షీణోగ్రశస్త్రాస్త్రవ
ర్తనఘోరం బగుసంగరం బచట రౌద్ర[1]స్ఫూర్తిమైఁ జెల్లఁగాన్. 393

వ. ఇక్కడ భారద్వాజుండు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజుననుమతి నభిమన్యుం డయ్యొడ్డు భేదించి బృహద్బలలక్ష్మణప్రభృతు లగుభూపతులను భూపకుమారులను బెక్కండ్రం బారిసమరి యనేకయోధ వీరవిక్రమసంకులంబు నం జిక్కువడి యుక్కు మురిసినట్లు సమసిన మన మొనలు సెలంగుచుం బాండవ బలంబులు పొగులుచుం దమతమయునికిపట్లకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకు సౌభద్రుండు వడుట సెప్పె ననిన విని నాఁటికయ్యంబుకలరూపంతయు నేర్పడ నెఱింగింపు మనుటయు. 394

ఉ. సాత్త్వవతేయవాఙ్మయవిశాలగృహస్ఫురిత[2]ప్రదీపితా
ప్రత్త్యయగోచరా విహృతిభగ్ననిశాచర శాంత బోధసం
పత్త్యవినాభవన్మహిమభాసుర సంభృతభూసురాళిసాం
గత్త్య వివిక్తయుక్తజనకౌశలభావిత దేవసేవితా. 395

క. వేదశిరోమణిచరణా, నాదాంతస్సార[3]కరణ నైష్ఠికతరణా
ఖేదరహితప్రకారా, వాదవిదూరా విరించి[4]వర్యవిహారా. 396

1. స్ఫీత మై. 2. ప్రదీపికా. 3. చరణ. 4. వర్ణ్య.

మాలిని. అనుపమహితవిద్యావ్యక్త యోగానురక్తా
దనుజమథనలీలాస్తవ్య శాంతానుభావా
జననమరణదుఃఖోత్తారి సర్వోపకారీ
సనకముఖయతీంద్రాసన్న నిత్యప్రసన్నా 397

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందు ప్రథమాశ్వాసము. 398





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము, ద్వితీయాశ్వాసము.

---



కర భక్తాంభోధిసు
ధాకర చక్రత్రిశూలధారణరక్షో
భీకర నిర్భరశరకరు
ణాకర దృగ్దీప్తినికర హరిహరనాథా.

### ద్రోణునిమూఁడవనాఁటియుద్ధము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనమనుమండు మృతిం బొందుట విని ధృతరాష్ట్రుండు. 2

ఉ. చిత్తము వొక్కెడుం బురుషసింహునిఁ బౌత్త్రకులాగ్రగణ్యు న
త్యుత్తమతేజు భూరిగుణు నొప్పెడుమెత్తనిమేనివాని నె
ట్లుత్తలపెట్టిరో పలువు రుగ్రమనస్కులు గూడి యక్కటా
యత్తెఱఁ గెల్లఁ దేటపడు నట్టులుగా వివరించి చెప్పుమా. 3

వ. అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను నట్లు భారద్వాజుండు పద్మ
వ్యూహంబు సంఘటించునెడ వివిధదేశంబులరాజులు దళంబులును రాజకుమా
రులుఁ గేసరంబులును గర్ణదుశ్శాసనబహుళసేనాపరివృతుం డయి కురువిభుండు
గర్ణికయునుంగా నభేద్యభంగి నొనర్చిన నది వలయాకారం బగుటం జేసి చక్ర
వ్యూహంబు నను జను నమ్మొగ్గరంబుమొగంబునం దాను దర్పంబు మెఱయ
నెఱయం బొలిచి నిలిచె మఱియు వలయునెడలకు లావై జయద్రథగురుపుత్త్రకృప
శకునికృతవర్మభూరిశ్రవశ్శల్యశల్యులును నీకొడుకులును మనుమలును రక్తమా
ల్యానులేపనాంబరాభరణంబులు శోభిల్లం బొలిచి నిలిచి రంత భీమసేనప్రముఖం
బైనపాండవబలంబును గదియనడచె నందు సాత్యకిధృష్టద్యుమ్నకుంతిభోజులును
జేకితానక్షత్త్రధర్మక్షత్త్రివర్మ్ములును ధృష్టకేతునకులసహదేవులును నుత్తమౌజ
శ్శిఖండియుధామన్యులును ఘటోత్కచవిరాటద్రుపదులును ద్రౌపదేయకేకయ
సృంజయసముదయంబును నుక్కునం దఱిమి యక్కుంభసంభవుం దలపడిన నవ్వి

యవ్వీరుండు వాఁడి మిగులుబలుతూపులం దన వేఁడిమి సూపిన నమ్మేటివిలుకాని
మొగంబున నిలువ నోర్వక యాసైనిక ప్రకరంబు దిరుగుడువడిన వెక్కసంబును
వెఱఁగుపాటును వెల్లఁదనంబునుం గదురఁ గౌంతేయాగ్రజుం డూర కుండి కర్ణి
కార కేతుస్ఫీతుండును నుత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుండును నగుసౌభద్రుం గ
కార కేతుస్ఫీతుండును నుత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుండును నగుసౌభద్రుం గ
నుంగొని వీఁడు దక్క నొరు లీదృఢవ్యూహంబు భేదింపం జాల రని మనంబున
నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి. 4

సీ. ఈయొద్దు భేదింప నే నెవ్వరము నేర, మర్జునుండును నీవు నచ్యుతుండుఁ
బ్రద్యుమ్నుఁడును దక్కఁ బార్థుండు మనల నుల్లసమాడకుండ నీలావు మెఱసి
భేదించి మాకెల్లఁ బ్రియ మొనర్పు కుమార, యనవుడు నతఁ డానతాబ్జ మలర
దీనిముఖంబు భేదించు తెఱంగు నా, కెఱిఁగించె మాతండ్రి యేను దెఱపి
ఆ. సేయ నేర్తుఁ జొచ్చి చించి చెండాడెద, మూఁక పోరఁ జుట్టు ముట్టినపుడు
వెడలునట్టివెరవు విన దాని కేమి నా,చొచ్చునేర్పు బలువుఁ జూడు మధిప. 6

వ. అనిన విని ధర్మనందనుండు ధనంజయనందనున కిట్లనియె.

క. తెఱపి గొని నీవు సొచ్చినఁ, బిఱుఁదన చొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం
దఱమును మా కిది యెంతయు, నుఱునట్టివరంబు దీని నొసఁగుము పుత్త్రా. 7

చ. అనవుడు భీముఁ డిట్టులను నర్జుననందన నీవు [1]ముంద ఱి
మ్మ్మొన యొకయింత సించిన నమోఘరయంబునఁ బార్షతుండు నే
నును ద్రుపదుండు సత్యకతనూభవుఁడుర్ విరటుండు నంత నం
తే నడరి చింతు మెల్లెడలు దారుణవిక్రమణక్రమంబునన్. 8

వ. అనిన విని యభిమన్యుం డాతనిమోనసం బాలోకించి. 9

చ. నను విను కీచకాంతక మఖనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య
మ్మొనఁ గలఁగింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చినజతనంబు నిష్ఫలము సేయుదు నే నరుఁడుర్ సుభద్రయుం
దనయునిఁ గాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తఁ బుత్తునే. 10

చ. ఇదె యొకపిన్నవాఁ డడరి యెక్కుడుమూఁకలఁ గ్రందు దోలెడుం
గదుపుల వెల్చుగోపకునికైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్ల బె
ట్టిదుఁ డగుకౌరవేంద్రునకు డెప్పర మయ్యెడుభంగిఁ బేర్చెదన్. 11

క. అనిన విని ధర్మసూనుఁడు, దనుఁ బ్రీతిం జూచి నీదుధైర్యము శౌర్యం
బును బలమును గీర్తియు వర్ధన మొందెడు మనుచుఁ బార్థతనయుం డెలమిన్.

వ. తనసారథిం గనుంగొని మనయరదంబు ద్రోణానీకంబుపైఁ బఱపు మనుటయు
నాసుమిత్త్రిం డర్జునపుత్త్రిన కిట్లనియె. 13

1. ముందఱన్; ముంద రై.

తే. బాలుఁడవు నీవు కుంభజప్రముఖసైన్య
పతులు ప్రౌఢులు పెక్కురు బవరమునకుఁ
జొచ్చి యెఱుఁగనినీచేతఁ జచ్చువారు
గారు బహువిధసమరకర్కశులు వారు. 14

చ. అనవుడు నల్ల నవ్వి యతఁ డాతని కి ట్లను దేవయుక్తుఁ డై
యనికి బలారి వచ్చినఁ బురారి గణంబులుఁ దానుఁ బన్నినం
గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతు మా
ర్కొని యను చుండుదుర్ సరకు గొందునె ద్రోణునిఁ దోడియోధులన్. 15

వ. అని పలికి వానియాలాపంబు నాలంబుసేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన
వాఁ డనుమానించుచు మనసైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరు నడపుటయు వారి
సేనయుం దోడన కడంగుటయుం గనుంగొని భారద్వాజప్రముఖయోధు లొం
డొరులకుం దలమిగిలి యేచి యెదుర్కొని పెలుచ నిలిచిన సంకులసమరం బయ్యె
నట్టియెడ. 16

అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని చొచ్చుట.

ఆ. మెఱుఁగు మెఱచినట్లు మెఱయంగ నరదంబు, కర్ణికారకేతుకాంతి వెలుఁగ
నంపగముల గురుని నలయించి కడచి యింద్రుజునికొడుకు మొగ్గరంబు సొచ్చె.

వ. ఇట్లనన్యభేద్యం బగునాపద్మవ్యూహంబు భేదించిచొచ్చి సౌభద్రుండు రౌద్రరసో
ల్లసితమూర్తియై యందు మహార్ణవంబునం దిరుగుమందరనగంబుచందంబునం
గాననంబునం జరియించుతీవ్రానలంబు తెఱంగునం గాలపక్వజన[1]సమాజసంహరణ
క్రీడనంబు సలుపుశూలిపోలికం గేలీగతుల మెలంగి యమ్మెయి నమ్మోహరంబు
ద్రిప్పుకొలిపియుం బొడిసేసియు రూపుమాపియు రణవిహారం బొనరింప నవ్వీరవరు
నారాచాదినానావిధవిశిఖవ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుఁ గరుల
నుచ్చి పోవుచుఁ దేరుల విఱుచుచు హయంబుల[2]ఘట్టంబుల నుఱుము సేయుచుఁ
గాల్బలంబులఁ జదుపుచుఁ గేతువులం ద్రుంచుచు నాతపత్రంబుల నుఱుమాడుచు
రథ్యంబులం గూల్చుచు సూతుల గీటడంగించుచు ధనువులు దునుముచు మై
మఱువులు వ్రచ్చుచు భూషణంబుల డుల్చుచుఁ గరవాలంబులఁ ద్రోయుచు మేను
లు సించుచుఁ దూపులు దూలించుచుఁ జేతులు నఱకుచు సబళంబులు జడియుచుఁ
దలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు నెత్తురు లురలించుచు గండలు సె
క్కుచు నెమ్ములు నలఁచుచుఁ బరఁగిన నమ్మొన చిక్కువడియును సుడివడియును
గలంగియుఁ దొలంగియు వెఱచఱచియు విచ్చి పఱచియు దీనదశకు వచ్చినం
గనుంగొని. 18

క. వీఁక మెయిఁ గ్రీడికొడుకుం, దాఁకఁగ నీకొడుకు తలఁచి తఱిమి కవిసెఁ బే

1 సమాజంబున సంక్రీడనంబునం గ్రేణి సలుపుశూలి. 2 దట్టంబు సేయుచు.

రాఁకలితో నున్నవారిం, దేఁకువ సెడి చేయకరి పఱతిం గురుముఖ్యా. 19

వ. ఇట్లు సౌభద్రుఁ జెనయం జూచుసుయోధనుం జూచి శరాసనగురుండు సైనికవరు లకుం జేయి వీచి యెలుం గెత్తి. 20

క. నరసుతున కగ్గమయ్యెం, గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీ
రరుగుం డేయుం డడ్డము, చొరుఁడు వెరవు లావు నెఱయ - శూరత మెఱయన్. 22

వ. అనుచుఁ దనయరదం బద్దెస మొగంబు సేసి పురికొల్పిన.

ఆ. కృపుఁడు గురుసుతుండు - గృతవర్మ గర్ణుండు, సౌమదత్తి శలుఁడు - సౌబలుండు
పౌరవుండు మద్ర - పతి వృషసేనుండు, గౌరవేశ్వరుండు - గడఁగి రపుడు. 23

వ. అట్లు గడంగి. 24

చ. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరం బయి పల్వురు వీఁక భూమిపా
లకునకు నడ్డమైనఁ దవు - లం బడి హుమ్మని నోరికండ నాఁ
చికొనిన మ్రోఁగుబెబ్బులివి - శేషము దోఁపఁగ బార్థపట్టిసా
యకముల నొంచినం దెరలి - రందఱు లేళులపిండునాకృతిన్. 25

వ. ఇవ్విధంబున నయ్యోధవరులు విచ్చిన పవ్వచ్చుకొడుకు పేర్చి యార్చిన నాచార్యుం డు వీరిచేత నిలువం డని తా నరిగి యన్నరనందను నెదుర్కొనిన వారును గూడు కొని పొదివిన. 26

క. అతఁ డందఱమార్గణములు, నతిరయమునఁ ద్రుంచుచుం ద - దంగముల శర
ప్రతతులు నించుచుఁ బోరఁగఁ, బతి సేనకుఁ జేయి వీచె - బరవస మలరన్. 27

క. మనసేన పెలుచ గడఁగిన, వననిధి పొంగెడువిధంబు - వాసవిసుతుఁ డే
చినఁ జెలియలికట్ట తెఱం, గున గానఁగ నయ్యె నపుడు - కురువంశనిధీ. 28

వ. ఆసమయంబున. 29

సీ. రారాజుఁ గృపుడును - భూరిశ్రవుండు మూఁ, డేసియమ్ములు పది - యేడు గురుఁడు
వినుము వివింశతి - వింశతివిశిఖంబు, లాచార్యసుతుఁడు బృ - హద్బలుండు
నైదు నెన్మిదియును - నాఱు శల్యుఁడు సప్త, శరములు గృతవర్మ - సౌబలుండు
రెండుబాణములు పం - డ్రెండుఁ దొమ్మిదియును, దుశ్శాసనుండును - దుస్సహుండు

తే. నేసి రర్జునసుతుమీఁద - నెల్లవారి, తనువులందును సాయక - త్రయము లతఁడు
గ్రుచ్చె నశ్మకుఁ డడరినఁ - గూల నేసెఁ, దురగసూత కేతనములతోడఁ గూడ.

దుర్యోధనప్రభృతిమహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యుపైఁ గవియుట.

వ. ఇవ్విధంబున నశ్మకుండు వడినఁ దెరలుబలంబుల మరల నీక పురికొల్పుకొని యప్పటి యాచార్యప్రభృతియోధులును నీకొడుకులలోనఁ గొందఱును గ్రందు గం దఱిమి యనేకాస్త్రశస్త్రపరంపరలం బొదివిన నొదవిసకినుకం గిరీటినందనుం డందఱమేనులు నానానిశితవిశిఖవేగంబున నెత్తుటజొత్తిల్లం జేసికర్ణుపయిం గవిసి.

తే. కంకటము దూఱి యంగంబు గాఁడి పోవఁ, గ్రూరనారాచ మేసినఁ గ్రుక్కినతఁడు
లీల నట్టివ పఱపి భూపాల నీదు, సుతుల వెనుకకుఁ బఱపె నుద్ధతి దలిర్ప. 32

చ. అడరి నరేంద్రకోటి నుఱుకఁ మాడఁగ నత్తఱి శల్యుఁ డెంతయున్
వడిఁ దనుఁ దాఁకినన్ మెఱుఁగుఁ వాలికతూపుల మూర్ఛ వుచ్చి
వ్వడికొడు కేచి యుద్భటరవంబున నార్చినఁ బెల్లగిల్లి న
ల్గడలకుఁ బాఱె నిల్వక బలంబులు ద్రోణుఁ డెలుంగు సూపఁగాన్. 33

34

వ. అప్పుడు.

క. సురలును సిద్ధులు విద్యా,ధరులుఁ బొగడునులివుఁ జూచుఁ ధరణీశులబం
ధురనుతినాదంబులు నం,బరధరణీమధ్యభాగభరితము లయ్యెన్. 35

చ. అన విని యాంబికేయుఁడు మహాద్భుతవిక్రమశాలిఁ బార్థునం
దను మఱి యెవ్వ రట్టియెడఁ దాఁకిరొ నావుడు సూతపుత్త్రుఁ డి
ట్లను నటు లైన శల్యుఁ గని యాతనితమ్ముఁడు మేను వెంచి మా
ర్కొని పదితీవ్రబాణములు గ్రుచ్చెఁ దదంగములం జెలంగుచున్. 36

37

వ. అట్లు బెట్టేసిన వాసవికొడుకు గోపించి.

చ. హయములఁ జంపి సూతుఁ దెగటార్చి పతాక ధరిత్రిఁ గూల్చి చా
పయుతము గాఁగ వానిఘనబాహులు రెండును ద్రుంచి యెంతయున్
రయమునఁ దేరు చక్కడిచి రాజులు రాజతనూజులుం గడున్
భయమునఁ దూలిపోవఁ బటుభల్లహతిం దల డొల్ల నేసినన్. 38

వ. ద్రోణకృపద్రౌణికృతవర్మబృహద్బలకర్ణప్రముఖయోధవరు లొండొరులఁ బేరు
నేరం బిలిచి బలంబులం బురికొలిపిన రథనేమిగజఘంటాతురంగకింకిణీస్వన
సింహనాదమేదురరోదోంతరరాంధ్రంబుగా సౌభద్రుం జుట్టు ముట్టిన నతం డట్ట
హాసంబు సేసి లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబులు మెఱయఁ గృష్ణార్జునులు
గావించు నేర్పు మెఱయం బోరునవసరంబున మండలీకృతకోదండుండును [1]బటుసం
ధానస్ఫురితశరనికరుండును నై పరివేషవలయంబులోనం గిరణస్ఫురణదుర్నిరీక్ష్యుం
డగుతపను ననుకరించుచు గుణఘోషభీషణంబుగా బెడిదంపునారసంబులు
వరఁగించి యార్చి యూర్జితం బగుచున్ బలుపిడుగులు దొరఁగించువిలయకాల
వలాహకంబు విడంబించుచు విజృంభించి భల్లాంజలికక్షురప్రకూర్మనఖరప్ర
భృతిబాణవేణికావితానంబుల వెగడుపఱచిన విచ్చినవాహినుల నిలువరింప నేరక
నివ్వెఱపడి యాచార్యుండు సూచుచుండె ననవుడు ధృతరాష్ట్రుండు సంజయున
కి ట్లనియె. 39

క. మనమున ఖేదము మోదముఁ, బెనఁగొని యెడు మద్బలంబుఁ బీడించెడు నా
మనుమఁ డని వినికి నాతని, యనిపని యటమీఁద నెట్టు లయ్యెం జెపుమా.

1 బటుశరసంధానస్ఫురితకరుండును; బటుశరసంధానస్ఫురితదశశతకరుండును.

క. అనుటయు సంజయుఁ డి ట్లను, వినుము జనాధీశ యిట్లు ♦ విఱిగిన సేనం
గనుఁగొని పోవఁగ నీ క,ర్జునతనయుఁడు దనరథంబు ♦ [1]చుట్లం బఱవన్. 41

వ. కొఱవి ద్రిప్పిన తెఱంగు దోఁపఁ బొదివి పో నీక పీనుంగుపెంటలు సేసిన నప్పు
డక్కుమారు నాలోకించి వికాసభాసితవదనుం డగుచు గురుండు [2]గురుపతి నెఱను
దాఁకఁ బలుకవలయు ననుతలంపున నతండు విను చుండం గృపాచార్యులో
ని ట్లనియె. 42

ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ ♦ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁ ♦ దాఁకెడు నే విజయాత్మజుండు ఘో
టమ్ములుఁ గుంజరమ్ములు బఱడల్పడఁ దేరులు నుగ్గు గాఁగ నా
నమ్మిన యోధవీరులు వినాశము భంగము నొంద నొక్కఁడున్. 43

ఆ. అనిన వెలుకఁ బాఱి ♦ యతిదీన మగునాన,నమున నవ్వు గానినవ్వు నెఱయ
సౌమదత్తికర్ణశల్యాదు లగుయోధ,జనులతోడ నిట్టు ♦ లనియె విభుఁడు. 44

చ. పలుకులు వింటిరే ధనువు ♦ వట్టెడివారికి నెల్ల నొజ్జ దో
ర్బలవిదితుండు కుంభజుఁడు ♦ బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం
గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బో ♦ గ దత్తరుఁ [3]జొచ్చె నితండు నొంపఁగాఁ
దలపఁడు వీనిఁ బార్థునకుఁ ♦ దాఁ గడుఁ గూర్చుట నెంత త్రుళ్లినన్. 45

చ. గురునియుపేక్షఁ జేసి తన ♦ కుర్వి సమరోద్ధతి సెల్లె దాసి నీ
వెరవిఁడి గాన లేఁడు దన ♦ వీరమ కాఁ గొని విఱ్ఱవీఁగెడుం
బొరిగొనుఁ డందఱుం గడఁగి ♦ పోవఁగ నీక దృఢాస్త్రశస్త్రని
ష్ఠురపరిపాతనోగ్రముగఁ ♦ జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్. 46

వ. అనిన విని వార లందఱు నవ్యాసవపాత్రుం బొదువం బోవ నవ్వీరుల వారించి
దుశ్శాసనుం డి ట్లనియె. 47

చ. ఇనుఁ గబళించురాహుక్రియ ♦ నే నొకరుండన పోయి పార్థపు
త్రునిఁ బరిమార్తు నీతఁడు మృతుం డగు ♦ పేర్పడ విన్నఁ గేశవా
ర్జునులును బిట్టు సత్తు రతి ♦ శోకభరంబునఁ జేసి యంతతో
మనపగ దీఱుఁ దీవ్ర మగు ♦ మద్భుజదర్పముసొంపు సూడుఁడీ. 48

దుశ్శాసనుఁ డభిమన్యుతోడం బోరి పాఱి పోవుట.

వ. అని పలికి యార్చి యమ్ములు నిగిడించుచు ధనంజయతనయుం దాఁకిన నతండు
షడ్వింశతిసాయకంబులు దనువునం జొనిపినం గనలి దుశ్శాసనుండు శరాసార
ఘోరంబుగాఁ గవిసినం గిరీటికొడుకునుం బేర్చి పెనఁగ నయ్యిరువురకరలాఘవ
శరలాఘవప్రకారంబులు రథచిత్రప్రచారంబులుఁ జూప అగ్గించి రప్పు డగ్గలిక
సొంపున సుభద్రాసూనుండు నీసుతువిల్లు ద్రుంచి భల్లంబుల మేను సెక్కి

1 చుట్టుం బఱపున్. 2 గురుపతికి. 3 దచ్చె.

స్రుక్కించి యతనితో ని ట్లనియె. 49

చ. అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మెయి నీవు నొవ్వఁ బ
ల్కిన ఫల మందఁ జేసెదఁ జలింపక యించుక సేపు నిల్వుమీ
నిను లఘుచిత్తుఁ గూర్చి యవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చినగరువంపుఁదండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబు దీర్చెదన్. 50

క. అని యతనిజత్రుదేశంబున నొకవాలమ్ము వక్షమునఁ బెక్కును గ్రు
చ్చినఁ ద్రెళ్లి యెన్నఁడో చచ్చినయట్లు రథంబుమీఁదఁ జేడ్పడి యుండెన్.

వ. ఇట్లు మూర్ఛిల్లిన దుశ్శాసను తేరు సారథి దొలంగఁ దోలుకొని పోయె నంతకు
మున్న కౌంతేయులు సౌభద్రుండు సొచ్చినపథంబున నాపద్మవ్యూహంబు సేనా
సందోహసహితులై చొచ్చి యెడనెడ నడ్డపడుసైన్యంబులతో సంగరంబు సేయు
చు నక్కుమారుం దల లెత్తి చూచుచు నతం డరిబలంబులం గలంచుటకు సంప్రీ
తు లగుచుఁ దోఁతెంచువారు ముందట దుశ్శాసనుండు భంగపడుట గనుంగొని
పొంగి యార్పులు నింగి ముట్ట నయ్యభిమన్యు ననేకభంగులం బ్రశంసించుచుం
దఱిమి రట్టియెడ. 52

సీ. రాధేయుఁ జూచి రారాజు దుశ్శాసనుఁ, డభిమన్యుచే నొచ్చె నకట కంటె
యనవుడు నతఁడు సేనాన్వితంబుగ నక్కుమారుపై నడర నవీరుఁ డేచి
ముందటిమూఁకల ప్రందించి కదిసి డెబ్బదిమూఁడుదూపులఁ బటురయమున
నొంచిన రక్తాననుం డయి దివ్యాస్త్రజాలంబు వఱపునాజామదగ్న్య

తే. శిష్యుభుజవీర్యశౌర్యవిశేషభంగి, సరకుగొనక యబ్బాలుండు సమదలీలఁ
బెనఁగ నయ్యంగరాజు డస్సిన నెఱింగి, యతనితమ్ముఁ డయ్యర్జునసుతునిఁ దాఁకి.

చ. హయములమీఁద సూతుపయి నాతనియంగములందు నస్త్రసం
చయ మడరించినం గమలచారుముఖంబున నెత్తురవ్వు చె
న్నయి విలసిల్ల భల్లమున నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష
ద్భయదవిలాస[1]బాహుసముదగ్రత వానిశిరంబు గ్రక్కునన్. 54

ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుముటేపు గనుంగొని యోహటించి శి
ష్టమ్మునఁ బెంపఱం దొలఁగెఁ గర్ణుఁడు పెక్కుబలంబు లప్పు డొ
క్కుమ్మడిఁ దోఁచి యుద్ధతమహోదధిఁ బోలఁగ మందరమ్ముచం
దమ్మున నొప్పె నుద్భటవిరోధస్ఫురణుం డగుపార్థపుత్త్రుఁడున్. 55

వ. ఇట్లు మూఁకలం గలంచి. 56

క. వెస రాధేయునితోఁ దొలఁగిన, పెసకుం జనుటయు నతండు ధృతి సెడి విఱిగెం
[2]బస పొడ వడఁగఁగఁ బెఱిమో, ధనసమూహము వాఱ ధరణీతల మద్రువంగాన్.

వ. ఇవ్విధంబున సైన్యంబులుం దానును బఱచునొరలం జూచి యాచార్యుండు. 58

1 శేఖసముదగ్రత. 2 వస మఱి వడఁకఁగ వెఱిమో.

చ. నిలు నిలు కర్ణ యోకృపుఁడ యీ విటు లేల [1]కడంక దక్క సౌ
బల ధృతి దూల నేమిటికి బాహ్లిక యిత్తఱిఁ గౌరవేంద్ర నీ
బలముఁ జలంబుఁ జూపి నిలుపం దగు సేనల నంచుఁ బెక్కుభం
గులఁ బురికొల్ప నెవ్వరును గోల్తల సేయర యేమి సెప్పుదున్. 59

వ. ఇట్లు ప్రళయసమయధారాధరస్ఫీతనిర్ఘాతచ్ఛటాభీలం బగునబ్బాలుని బెడిదంపు టంపఱ సైరింపం జాలక నీబలంబులు వాఱిన నక్కుమారకంఠీరవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి యనికిం దనివి సనక వెనుకం దవిలి వట్టియడవి ముట్టి యేర్చు కార్చిచ్చుచందంబునం జతురంగబలంబులం బారి సమరినం దేరులు నలియం ద్రెళ్లినశుండాలంబులును గాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద [2]నూఁదుకొనం గూలినఘోటకంబులును గుజ్జుపుటట్టల రాసులు మూసికొని యఱవఱలైనయరదంబులునుగరటికళేబరంబులువొదివినం గాలు గాలం బెనఁచుకొని పడి యున్నసుభటసమూహంబులును గంకణాంగద కాంతంబు లైనకరకాండంబులగములును మునుంగువడ డొల్లినసకుండలమస్తకంబులును వీరకటకంబులును మెఱయఁ జిక్కువడియున్నచరణంబులును గ్రిందు పడం దొరఁగినగాత్రఖండంబులును దునియ లైనధనురాదిహేతివ్రాతంబులపైం బొడవు సెడక బాహువులతోడం బోలుచుకృపాణప్రముఖప్రహరణంబులును గొడుగులకుప్పలును జామరంబులప్రోవులును సిడంబులతిట్టలును నయి సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె నప్పుడు గగనమధ్యభాగంబున భాసమానుండయినమార్తాండుఁ రెండవమూర్తియుంబోలె నయ్యేకవీరుండు వెలింగె ననవుడు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 60

ఆ. బాలుఁ డొంటి యిట్లు పలువురతోడఁ బోరంగఁ జూచు పాండురాజతనయు
లందుఁ దోడపడుటకై యొకరుండును, గడఁగ కునికి కేమికారణంబు. 61

వ. అనవుడు సంజయుండు. 62

పద్మవ్యూహంబు సొచ్చుపాండవులకు సైంధవుం డడ్డపడుట.

చ. వినుము నరేంద్ర పాండవులు విక్రమదుర్దముఁ డైనపార్థనం
దనునకుఁ దోడ్పడం గడఁగి దంతితురంగరథోత్కరంబులం
దనుముచు సత్వరస్ఫురణఁ ద్రోచిన నీపెనుమూఁక పాయ [3]వి
చ్చి నిలిచి చూచు చుండె నవిచేష్టితు లైరి బలాధినాథులున్. 63

వ. పాంచాలయాదవపాండ్యకేకయమాత్స్యప్రముఖమహానీయసైన్యంబులతో నట్లురవడించిన నయ్యుధిష్ఠిరుం డనుమహావాయువునకు జయద్రథుం డద్రియపోలె నడ్డపడియె నని చెప్పుటయు విస్మితుం డగుచు వైచిత్రవీర్యుం డతని కిట్లనియె.

చ. తనయునిమీఁదికూరిమి నుదగ్రత సేనలతోడఁ బాండునం

1 తలంకె డింగు సౌ,బల. 2 నూఁదుకొన. 3 వి,చ్చిన నలిఁ జొచ్చి రప్పు డవిచేష్టితు.

దనులు రయంబుమై నడరఁ ꣳ దా నొకరుండ భుజాబలంబు నే
పునఁ గుదియించెనే యతఁడ ꣳ పో కురుసేనకు మేటి సింధురా
జున కది యేమహాతపముꣳసొంపున న త్తఱి సంభవించెనో. 65

వ. అనిన విని సూతసూనుఁ డమ్మానవపతి కి ట్లనుఁ బాండవు లరణ్యంబున నున్ననాఁ
డతండు ద్రౌపదికతంబున భీమసేనుచేత భంగపడి సంత ప్తచిత్తుండై చి త్తజారాతి
నారాధించిననతనిగరిష్ఠనిష్ఠాతిశయంబునకు భ క్తవత్సలుండగునప్పరమేశ్వరుండు
ప్రీతుం డై పొడసూపిన జయద్రథుండును గౌంతేయుల నివారించునట్లుగా వరం
బొసంగవలయునని విన్నవించిన నద్దేవుండు[1] (*నర్జునుండుదక్కఁ దక్కిననలువురు)
పాండవులు నీచేత నివారితు లగుట యొక్కదివసంబునం గలుగుఁగాక యని పలికి
యంత ర్హితుం డయ్యె నది కారణంబుగా నట్టిగౌరవం బారథికవరునకు దొర
కొనియెఁ దత్పరాక్రమంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 66

సీ. సింధుదేశోద్భవꣳస్థిరవాహనంబులఁ, బూనినయరదంబుꣳపొలుపు మిగుల
రత్నమయోగ్రవꣳరాహధ్వజంబు న,భస్స్థలిఁ జంచలꣳప్రభల మెఱయ
సాంద్రచంద్రాతపꣳసదృశ మై యుజ్జ్వల,చ్ఛత్త్రచామరములꣳచాయ నిగుడ
వజ్రముక్తాఫలꣳవ్రజకిరణావళి,కలితభూషణములు ꣳ వెలుఁగుచుండఁ

తే. జి త్తమున వరగర్వంబుꣳచిగురులొ త్తఁ, బాండుపుత్త్రులదుర్దాంతꣳబాహుబలము
మొనలపెల్లును సరకుగాꣳగొనక యేచి, యార్చి వారికి నీయల్లుఁ ꣳడడ్డపడియె.

వ. ఇవ్విధంబున నడ్డపడి సాత్యకిని సాయకత్రయంబునను భీమసేనుని బాణాష్టకం
బునను ధృష్టద్యుమ్నుని నిరువదియమ్ములను విరాటుని శిఖండిని బదిపదితూపు
లను బాంచాలపతి నేడింటను ద్రౌపదేయులం బదియేనింటను గేకయుల నిరువ
దేనింటను ధర్మసూను స ప్తతిశరంబులను నేసి యాసేన నానాస్త్రంబులం గప్పె
నప్పు డప్పాండవాగ్రజుం డతనికోదండంబు దుండంబులు సేసిన నాసైంధవుం
డొండువింట మంటలుం బోనిమార్గణమ్ము లమ్మనుజపతిమీఁదను దదనుచరుల
యంగంబులందును బరఁగించినం బవనతనయుండు దలకడచి రభసంబున. 68

క. భల్లములు మూఁట గొడుగును, విల్లును బడగయును ద్రుంప ꣳ వేఱొకవిలు నీ
యిల్లుఁడు గొని భీముగొడుగు, విల్లును బడగయును ద్రుంచి ꣳ విరథుం జేసెన్. 70

వ. ఇట్లు వికలసాధనుం డై.

సీ. అనిలసుతుండు సాꣳత్యకితేరిమీఁదికి, నరిగిన నీసేన ꣳ యార్పుటయును
సైంధవుపై వారిꣳసైనికో త్తము లనే,కాస్త్రముల్ నఱపిన ꣳ నతఁడు వాని
మరలింప ము న్నభిꣳమన్యుచేఁ గూలిన, రథదంతిహయభటꣳరాజికతన
నతివిషమం బై నꣳయానేల నవిహత, గతి నరదంబులు ꣳ [2]గ్రందు పఱపి

ఆ. వారు సేసి రాహꣳవము దాని గోర్చి యం,దఱును దమక తమక ꣳతనిసి వెనుక

1 (*) ఇది కొన్నిటఁ గానిపింపదు. 2 గ్రందఁ బఱపి.

కొదుఁగునట్లు గాఁగ నుజ్జ్వలశరనికాయములు గురిసె నాజయద్రథుండు.

వ. ఇత్తెఱంగున సింధురాజు పాండవుల వేఁడిమి యుడిపిన నుభయపార్శ్వంబులకు మున్ను దొలంగి యున్ననీబలంబులు గ్రొత్తలసేసి యక్కౌంతేయసైన్యసంతానంబుతోఁ దలపడినం బోరు ఘోరం బయ్యె నక్కడఁ గుంభసంభవప్రయత్నవిశేషంబునం జేసి వాహిని మగుడ నడరి యభిమన్యుం బొదివిన నక్కుమారుండు నుక్కునం గడంగి. 72

క. అభిముఖసంవృత్తము లగు, నిభతురగస్యందనంబు లిలఁ గూలఁగ న
క్షుభితుం డగువృషసేనుఁడు, రభసంబున నతనిఁ బటుశరంబుల నొంచెన్. 73

వృషసేనుం డభిమన్యుం దాఁకి మూర్ఛితుం డగుట.

ఉ. నొంచినఁ గెంపుసొంపునఁ గనుంగవ యొప్పఁగ సూతుఁ ద్రుంచి విల్
ద్రుంచి తురంగవక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొ
ప్పించినఁ దేరితోడ నఱపీనుఁగు నీడ్చికొంచుఁ బాఱె సే
నాంచలభూమికిం బెలుచ నత్తురగంబులు విహ్వలంబులై. 74

వ. ఇట్లు వృషసేనునరదంబు వఱచిన తెఱపిన యభిమన్యుండు నిజస్యందనంబు వఱపించినం బటుసంరంభంబున నెదుర్కొని. 75

ఆ. శౌర్యధుర్యుఁ డగువసాతిభూపతి షష్టి,శితశరంబు లేయ నతఁడు దొడ్డ
నారసమున వాని [1]నలిఁ దూల నేసినఁ, గూలి పెలుచఁ దన్నికొనుచుఁ జచ్చె.

క. చచ్చినవసాతిఁ గనుఁగొని, యచ్చటిభూపతులు పెలుచ నడరుటయును వి
వ్వచ్చుకొడుకు కోపించినఁ, జిచ్చు మిడుతపిండు నేర్చుచెలువము దోఁచెన్. 77

వ. ఆసమయంబునం జేడ్పడి నీసేనలు దీనదశకు వచ్చిన నానాదేశాధీశులు పరస్పరాహ్వాననాదంబులు సింహనాదంబులు శింజినీస్వనంబులుం జెలంగ ధనంజయతనయుపై నొక్కుమ్మడి నురవడించిన నయ్యతిరథవర్యుండు లేళ్ల గమిం గనిన బెబ్బులియుబ్బు దోఁప నలిరేఁగి యందఱ నుఱుమాడిన నంగకంబులవివిధఖండంబుల కెంపునను గరితురగనరశవంబులవికృతాకారంబుల నాయుధంబులమెఱుంగుల నాభరణంబులతఱచునం దత్ప్రదేశంబు దారుణప్రియదర్శనం బయ్యె నప్పుడు దెరలినమూఁకలు దన్నుఁ దేఱిచూడనుం జాలక యంతంత ఱిచ్చవడిన నాగుంపులకుం గవిసి నిలింపపతిమనుమండు సత్యశ్రవగప్రభృతిభూపాలలోకంబు జములోకంబున కనిచినం జుట్లు నుండి చూచుమానధను లగుమానవపతులు నేన నేన యని కడంగి యక్కుమారునిమీఁద నుఱికి పెనుఁజోఱమొగంబునం బడినచిఱుచేఁపతండంబులచందంబున దావానలంబు దఱియం బాఱినమృగకులంబుచాడ్పున సముద్రంబు సొచ్చినయేఱులచందంబున నతనియందు డిందిన.

ఉ. అచ్చట సైన్య మంతయు భయాకులతన్ నలుదిక్కులన్ వెసన్

1 నట్టఱ్ఱు నేసినఁ - నదరంట నేసినఁ - నాటంగ నేసినఁ.

విచ్చిన శల్యనందనుఁడు వీనికి నోడఁగ నేల మీకు నే
వచ్చితిఁ బట్టి తెచ్చెద నవారణ బిట్టు పెనంగెనేనియుం
జచ్చు మదీయభూరిభుజశక్తి గనుంగొనుఁ డంచు నుద్ధతిన్. 79

వ. రుక్మరథుం డనువాఁడు పాండుపౌత్త్రుం దలపడి తొమ్మిదియమ్ము లురమ్మున భుజమ్ముల రెండును నాటించి వెండియు నేయం గడంగునెడ నాసుభద్రాసూనుండు.

ఆ. శరముతోడ నొక్కకరము చాపముతోడ, నొకటి బొమలు గదిసియున్న యుగ్ర
రేఖతోడఁ దల ధరిత్రిపైఁ బడ నేసె, రయము మెఱయఁ బటుశరత్రయమున. 82

వ. ఇట్లర్జునపుత్త్రుండు చిత్రకౌశలంబు సూపిన.

ఆ. రుక్మరథుఁడు వడిన రోషాత్తచిత్తులై, యతని చెలులు పలువు రవనిపతులు
గవిసి రపుడు తేరుగములతో వడి భవ, త్పౌత్త్రుమీఁద నీదుపుత్త్రు లలర. 83

క. అమ్మనుజవిభులబహుళశ, రమ్ములచే సూతకేతురథరథ్యసమే
తమ్ముగఁ బొదువం బడుతన, తమ్మునిసుతుఁ జూచి పతి ముదమ్మునఁ దేలెన్. 84

వ. ఇట్లభిమన్యుండు మడసెనకాఁ దలంచి దుర్యోధనుండు సంతోషింప నాసౌభద్రుండు భద్రగజంబు బరిగోలలపోట్లం గనలుకై వడిం గినిసి గాంధర్వమైనమాయ గావించె నది దొల్లి ధనంజయుతపంబునకుం బ్రియం బంది తుంబురుప్రభృతులొసంగినట్టిది దానం జేసి యమ్మానవనాథులయాలోకనంబులకుం బెక్కురథమ్ములవారు దమ్ముఁ బొదివికొని యనేకాస్త్రశస్త్రంబులు ప్రయోగించినచందంబు దోఁచిన వారు వెగడుపడి చూచుచుండ నతండు మండలప్రచారంబులం దేరు మెఱయ మెఱుంగువాలమ్ములం గూల నేసియు వెడందతూపులం ద్రుంచిపడ వైచియు బడలు వఱచిన నన్నరపతులు నఱుకుడు వడిన మెలమావిజొంపంబులచందం బగుటయు నుబ్బు దక్కి వెక్కసంబును వెల్లఁ బాటునుం గదిరి యక్కురువిభుండు దనకొడుకు కడిమి సైరింపం జాలక యతనిపై నడరి కొండొకసేపు గన్నులపండువుగా భండనంబు సేసి సంరంభవిజృంభితుం డగునవ్వీరవరువిశిఖవేగంబునకుం గాక విముఖుండయ్యె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 85

ఉ. ఇమ్మెయి బాలుఁ డొక్కరుఁడ యిందఱిఁ దోలి వధించె నన్న నే
నమ్మఁగ నేర నయ్యెద వినం గడు నక్కజ మట్టు లేల చి
త్తమ్మున సంశయింప విను ధర్మ మధర్మము నోర్వ కున్నె క
య్యమ్ము తెఱంగు సెప్పు మెటు లయ్యెఁ బదంపడి సూతనందనా. 86

వ. అనిన నమ్మనుజవల్లభునకు సంజయుం డిట్లను నట్లు పెక్కండ్రు రాజులు సచ్చుటయును సుయోధనుండు దెరలుటయును గని భవత్కుమారవర్గంబును దోడియోధవరులును మేనులు సెమర్ప మొగంబులు వెలవెలం బాఱ నొండొండం గాళ్లు వడంకఁ నలుదిక్కులుం జూచుచు ధృతి [1]వెరిగి పోయిన వెఱచఱచి విఱిగి రప్పుడు

1 దఱిఁగిపోయి వెఱచఱచి పఱచి రప్పుడు.

మగుడం గోల్తలు సేసి కురువిభుండు గురుపుత్త్రకృపకర్ణకృతవర్మబృహద్బలసౌబల సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునుబ్బునం గొండొక పెద్ద యనక పిడుగుచందంబునఁ గర్జిలి యుఱికిన నయ్యరదంబులతండంబులు లేట మొగంబు వడిమె నట్టియెడ. 87

— దుర్యోధనపుత్త్రుం డగులక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట. —

చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ దాఁకినఁ జూచి యుమ్మలం
బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱు రాజుఁ గాంచి యం
బుదములు గొండపై నడచుపోలిక నన్నరుపట్టి నందఱుం
బొదువ నతండు ఘోరశరభూరిసమీరమునం దెరల్చుచున్. 88

క. కదిసినలక్ష్మణునిం బలి, కొదమను సింగంపుఁగొదమ [1]గొదగొనులీలం
బొదువుగతిఁ గిట్టి మోదము, మదము నెలర్పంగ నింద్రుమనుమఁడు గడిమిన్.

చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొకయమ్మున నొవ్వ సేసి నీ
వెఱఁగి మెఱింగి నర్ల దొడరి తెక్కడఁ బోవఁగ వచ్చు నంచు నే
డ్తెఱఁ దలఁ గుండలస్ఫురితదీప్తులతో నిల డొల్ల నేసె నం
దఱుఁ బతియుం గనుంగొనఁగ దైన్యరవంబు సెలంగ సేనలన్. 90

తే. మిడుక మిడుక నిత్తెఱఁగున గొడుకుఁ దునిమి
యక్కుమారుండు మెఱయుట నడలుఁ గనలుఁ
గడలుకొనుమదితోడ నీకొడుకు వీని
నొంపుఁ డందఱుఁ బైపడి చంపుఁ డనుడు. 91

క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు, నతనిసుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును భా
సితశరములు గురియుచు న,చ్యుతునల్లునిఁ బొదివి రొక్కయుమ్మడిఁ బెలుచన్.

క. అతఁ డందఱవిశిఖంబులు, వితథమ్ములు సేసి వారి వెగడుపఱిచి యు
ద్ధతి సైంధవుపోరెడునెడ, కతిరయమునఁ దేరు నడపునాసమయమునన్. 93

వ. నిషాదులుఁ గళింగులు గజబృందంబులతో నడ్డపడిన నయ్యతిరథసింహుండు దరువాయి గొని తునుమాడ నెప్పటియోధవీరు లెయిది పెక్కుఁబోతు లొక్కపులిం జుట్టుముట్టినచందంబునం బొదివి పెనంగ నాజయద్రథుండును బాండవబలంబులం ద్రోచి రా నీక రభసాతిశయఘోరంబుగాఁ బోరుచుండె నక్కుమారుండు గురుం బంచాశద్బాణంబులను గృతవర్మ నశీతిసాయకంబులను గురుతనయు దశవిశిఖంబులను గర్ణు నొక్కబలునారసంబునను స్రుక్కించి కృపుని విరథుం జేసి బృహద్బలుమేన ముప్పదినారసంబులు నాటించి వారలకు బాసటయయి కదిసిన సైనికులం బెక్కుతెఱంగులతూపులఁ జిక్కువఱిచి యుక్కునం గ్రోధలిప్తబృందారకులను రాజులను రూపడంచె నప్పుడు శారద్వతుండు దే రాయితంబు సేసి

---

1 గొదగొని లీలం.

కొని కడంగి తోడివేవురం గూడుకొని యాక్రీడికొడుకుమీఁద మార్గణపరంప రలు వరఁగింపం బెరిఁగినదర్పంబునం గసి మసంగి యతండు నొప్పింపం బెఱవారు బీఱువోవ బృహద్బలుండు బిట్టు గవిసి నిశితశరంబులు నిగిడించిన నన్నరనంద నుండు. 94

ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధించుడుం
గోప మెలర్ప ఖేటకముఁ గూరికృపాణముఁ గొంచుఁ దేరు సా
టోపత డిగ్గి వే కవియుకడుం బటుభల్లహతిం గృతాంతసే
వాపరుఁ జేసె హృత్పుటము వ్రచ్చి బృహద్బలు భూరిదోర్బలున్. 95

వ. ఇట్లింద్రపౌత్రుండు గోసలేంద్రునిం దెగఁ జూచినఁ జూచి యేచి తదీయబంధు భూపతు లొక్క మొగి నురవడించిన నతండు వారలయేపు మాపి కర్ణుండు డాసినం గర్ణోపాంతంబు గగ్గి కానారాచంబుల నొప్పించె నయ్యిరువురు నొండొరులమే నులు నెత్తురుల జొత్తిల్లం జేసిన సంధ్యాసమయసూర్యబింబప్రతిబింబంబులుం బోలెఁ బొలిచి రాసమయంబున సూతనందనునాయంతు లార్వురు గర్వంబునఁ ద న్నుం గదిసినం గవ్వడికొడుకు చిత్రవధవిహారంబు సలుపునప్పుడు కుంభసంభవ ప్రభృతిరథికవరులశరంబులు మగిడించుచు వారిపైఁ దూపులు నిగిడించు చునికి యద్భుతం బయ్యె నట్టియెడ. 96

తే. మగధపతిసూనుఁ డైనయశ్వంతకుండు
బాలుఁ డయ్యును బ్రౌఢదోర్బలము మెఱయఁ
దాఁకుటయు సూతుతలయు రథ్యములతలలు
నతనితలతోన యభిమన్యుఁ డవనిఁ గూల్చె. 97

వ. ఇట్లు పూర్వవైరంబు దలంచి తలపడినమాగధకుమారు నవలీల నేలంగలిపి సింహ నాదంబు సేసినం దత్సంరంభంబు సైరింపం జాలక దుశ్శాసనసూనుండు సరభ సంబుగాఁ గవిసి ఘోటకంబుల నంబకచతుష్టయంబునను సారథి నొక్కనారసం బునను దదీయతనువు పదిబాణంబులను బెలుచ నొప్పించినం జంచదరుణ కమలచారువిలోనుం డగుచు సౌభద్రుం డతనిఁ బ్రదీప్తసప్తనారాచనిపాతపీడితుం జేసి డగ్గఱి. 98

ఉ. ఇంతకు మున్న నీజనకుఁ డెంతయు నోటఱి పాఱె నీవు నా
పొంతకు వచ్చి తింక నెట వోనగు నం చొకదొడ్డనారసం
బెంతయు బెట్టిదంపువడి నేయుడు ద్రోణసుతుండు దాని నిం
తింతలు సెక్కులై యిలపడయిం ద్రొఁగన్ వెస నేసె నేసినన్. 99

తే. అతనిదిక్కును జూడక యతఁడు రయము
మెఱసి నీపౌత్రుచాపంబు నఱికి సూతుఁ
గూల్చి యాఱమ్ము లురమున గ్రుచ్చుటయును

నొండు దేరిపై కబ్బాలుఁ డుఱికె నధిప. 100

వ. అంత నపరాహ్ణం బయ్యె నాసమయంబున శత్రుంజయుండును జంద్రకేతుండును సువర్చసుండును సూర్యభానుండును మేఘవేగుండును మొత్తంబై తాఁకిన ధనంజయతనయుండు మేటిమగ లగునమ్మహీశులమేనులు నానాస్త్రంబుల ననేకఖండంబులు గావించి గాంధారపతి సేరినం గ్రూరనారాచజాలంబుల జర్జరితశరీరుం జేసి దుర్యోధనుదెసకు నడరుటయు నంగపతి యాచార్యున కిట్లనియె. 101

క. చండగతి వీరరథికులఁ, జెండుచు నేతెంచి రాజుఁ జేరెడు సౌభ
ద్రుం డిట్టులు నీకూరక, యుండ నగునె ప్రతివిధాన మొనరింపు తగన్. 102

క. అని పలికి పతికి నడ్డము, సనుటయు గురుఁ డచటియోధచయముం గలయం
గనుఁగొని యభిమన్యుఁడు న, ర్జునుఁడును నని నొక్కరూప చుండీ తలఁపన్.

వ. చూడం బిన్నవాఁడు గాని యలంతులం బోయెడువాఁడు గాఁడు మన మందఱముం గూడికొని యొక్కపెట్ట యక్కుమారుపై నురవడింప వలయు నని పురికొలిపి బరవసంబు సేసె నప్పు డప్పాండుపౌత్త్రు బాణంబులం బీడితుండై సూతపుత్త్రుండు గుంభసంభవు నాలోకించి నాదెస సూడుము వీఁడు నొప్పించె నిలువం దగునెల వగుట నసము డింపక [1]యీల గఱచుకొనియున్నవాఁడ గాండీవిఁ గలనం గదిసి మెఱుంగుదుమ కాదె యతనిచే యింతబెట్టిదంబు గా దని చెప్పిన విని యల్లన నగి యతం డతని కిట్లనియె. 104

సీ. కవచధారణ మనుఘనవిద్య గవ్వడి, కే నెఱింగించితి నితఁడు దాని
నేర్చుట నీతని నెట్టన నొప్పింప, శక్యంబు గాదు వంచన గుణంబు
నఱకంగఁ జాపంబు విఱుగ నేయఁగ ఘోట, కములఁ జంపఁగ సూతు సమయఁ జేయ
నగుఁ జాలుదేని నీ వట్లు సేయుము చేత, ధను వుండ నవ్వీరుఁ జెనయ వశమె

ఆ. దేవతలకు నైనఁ గావున నొక్కమై, విల్లు ద్రుంచి తఱిమి విరథుఁ జేసి
చూచికొంద మలవు చొప్పనఁ దెగునె యీ, రథికవరునిపటుపరాక్రమంబు.

కర్ణుఁడు మొదలగుయోధులు వంచనచే నభిమన్యుని విరథుఁ జేయుట.

చ. అన విని సూతసూనుఁడు భయం బెదఁ గూరినవాఁడపోలె నై
వెనుక గొదింగి యారథికవీరుపిఱిందికిఁ జుట్టి వచ్చి వం
చనకు సహాయు లై యచటిసైనికు లన్నరపుత్త్రు బిట్టు మా
ర్కొని పెనఁగంగఁ [2]జేరి యలఘుప్రదరంబున విల్లు ద్రుంచినన్. 106

వ. ఆలోన. 107

క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను, సరభసముగఁ గృపుఁడు సంపె సారథి నమ్మై
నరసుతుఁ డనాయుధుండును, విరథుండును నగుట సూచి వెఱపేది వడిన్. 108

క. శకుని కృతవర్మ శల బా, హ్లీక గురుసుతు లాదిగా ననేకు లడరి య

1. యీలు-యవుడు-గఱచుకొని. 2 జేసి యలఘు; జేఱియలఘు.

స్త్రకలాపంబుల శస్త్ర, ప్రకరంబుల నొంచి చిక్కువఱచి యలఁచినన్. 109

క. వాలును బలకయుఁ గొని య, బ్బాలుఁడు రయ మార గగనభాగంబున ను
న్మీలితధృతిసారుం డై, లీల నెగసి పోయె మండలీభూతగతిన్. 110

క. తనవిద్యకలిమి వినతా, తనయునిభంగిం జరింపఁ దమతమపైఁ దెం
పున నుఱుకు ననుతలంపున, మనయోధులు భయము గొనిరి మనుజాధీశా.

చ. ఎడ గని వాలు బల్లెమున నేసె వెసం దునియంగ ద్రోణుఁ డ
ప్పుడు శకలంబు లై పలక భూమిపయిం దొరఁగంగఁ జేసె నె
క్కుడువడిఁ గర్ణుఁ డాశిశు వకుంఠగతిం దనతేరిమీఁద నొ
ప్పెడుఘనచక్రముం గొని యుపేంద్రుఁడు లీల నటించుచాడ్పునన్. 112

వ. సంరంభవిజృంభితుం డై. 113

సీ. నెత్తుట జొత్తిల్లి నెఱసినయలుక నుగ్రం బైనవదనంబుకాంతి పరఁగఁ
గౌరవసైనికోత్కరమున కతిభయదం బగుసింహనాదంబు సెలఁగ
నింగికి నిగుడురథాంగరోచులు మణికంకణద్యుతులతోఁ గలసి వెలుఁగ
సిల్లు సూపినగంధసింధురం బనురేఖ, దలఁపించుపటుగతి చెలువు మెఱయఁ

తే. గుంభసంభవుఁ డున్నదిక్కునకుఁ గవిసి, యడ్డపడుసేనఁ జించి చెండాడునక్కు
మారవరుమేనియొప్పను మగతనంబుఁ, జలము బలముఁ గీర్తించె నిర్జరగణంబు.

వ. అట్టియెడ. 115

తే. శకునికృతవర్మకృపకర్ణశల్యముఖ్యు, లైనయోధులు పెక్కండ్రు రఖిలదిశలఁ
బొదివి యతనికరంబునఁ బొలుచుచక్ర, మలఁతితునియలుగా నేసి రాగ్రహమున.

వ. ఏసిన నతండు రయంబున. 117

క. గద గొని యశ్వత్థామం, గదియుడు దంభోళికొదమకై వడి మెఱుఁగుల్
వొదలించుదానిఁ గని కడు, బెదరి యతఁడు రథము డిగ్గి పిఱిఁదికిఁ జనియెన్.

వ. సుభద్రాతనయుం డతనిరథ్యంబులను సారథినిం జదియ మోఁది మనజోదుల యమ్ముల నేదు వెఱిగినచందంబున సౌబలునిదెసకు నడచి యాతనికి నడ్డపడిన గాంధారుల సప్తవింశతిరథికులం బొరిగొనుటయుం బురికొని తన్ను మార్కొనిన వసాతీయులం బదుండ్ర నేనుంగులతోడన పీనుంగులఁ గావించి యందంద తఱిమిన కేకయసప్తకంబు రథసహితంబుగా నగ్గలిక నుగ్గు సేసి డస్సి తూఁగాడుచుఁ దొలంగినయోధుల నుల్లసం బాడుచు నఱిమినవారి నుఱుమాడుచు వీరవ్రతంబు ధీరత్వనిష్ఠం జలుపుచుండె. 119

ఉ. ఆసమయంబునం గడఁగి యాయిత మైనరథంబుతోడ దౌ
శ్శాసని రా నతం డడరి సారథిఁ జంపి హయంబులం బడన్
వ్రేసిన నాతఁ డల్గి గద వే కొని యుద్ధతిఁ దేరు డిగ్గ ను
ద్భాసితమూర్తులం బొలిచె భ్రాతృకుమారయుగం బుదాత్త మై. 120

## అభిమన్యుదుశ్శాసనసుతు లిరువురుఁ జచ్చుట.

తే. ఇవ్విధంబునఁ గదిసి నరేంద్రముఖ్య, నీదుమనుమలు సూపఱ నెమ్మనముల
కద్భుతంబును శోకంబు నావహిల్ల, లావు వెరవును మెఱయఁ బోలంబు నెఱయ

ఉ. ఒండొరు[1]మీఁదికోపమున నుగ్రతఁ బోరి రుదగ్రులై గదల్
మండఁగ నెత్తురుల్ సెదర మాంసము పిండిగ నెంపనుగ్గు లొం
డొండ ధరిత్రిపైఁ దొరఁగ నొప్పెడుమేనులు వ్రాల వానిలో
నుండక ప్రాణముల్ [2]వెడలె నుబ్బునఁ గ్రాలఁగ దేవకామినుల్. 122

123

వ. ఇత్తెఱంగున.

చ. వనగజ మంబుజాకర మహోవారణఁ జొచ్చి కలంచి యాడఁగా
మనమునఁ గొంకు లేక కృప మాలినబోయలు ముట్టి చంపుచా
డ్పున భవదీయసేన బోరి వుచ్చఁగఁ జుట్టును ముట్టి పార్థనం
దను నలయించి నిర్దయవిరోధంబున జంపి రనేకసైనికుల్. 124

125

వ. అట్టియెడ.

సీ. జగము లన్నియును దేజంబున వెలిఁగించి, యపరాద్రి సేరినతపనుమాడ్కిఁ
దఱచైనకానలు దరికొని నివుఱుగాఁ, జేసి యాఱినదవశిఖివిధమున
గగనంబుతో రాయు[3]కరడులు గలజలం, [4]బివురఁ బాఱినమహార్ణవముకరణి
నున్నతగతి సెడి యుర్విపైఁ గడు విన్న, నై పడి యున్నసుధాంశుభంగి

తే. బీరమునఁ దమవారికిఁ బెం పొనర్చి
యరుల సమయించి వస మఱి యనువు దప్పి
తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁగగుచుఁ బొలిచె
మహితమూర్తిశోభితుఁ డభిమన్యుఁ డధిప. 126

ఉ. నెత్తుటఁ దోఁగి నేల మెఱనింగి తెఱంగున నుండె నక్కుమా
రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె సితాయుధఖండభూషణో
దాత్తమణిప్రతానములు తారలచందము నొంది యందమై
యత్తఱి నుల్లసిల్లె వసుధాధిప చూపఱపిండుచూడ్కికిన్. 127

సీ. కరికళేబరములు ధరణీధరములు దు,రంగగాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములు గౌక్షేయక, క్షురికాదిశస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రశిరములు రుచిరప్రవాళముల్, ప్రేవులపోగులు ఫేనతతులు
నెత్తురువెల్లువ నీళులు భూషణ, స్తోమాస్థిచయములు తుమురు లిసుక

ఆ. గాఁగ నంబురాశికరణి సంగ్రామభూ, భాగ మొప్పె మిగుల భవ్యయోగ
నిద్ర నున్నవిష్ణునికిఁ బాటి యగుచు శో, భిల్లె నమ్మురారియల్లుఁ డందు. 128

129

వ. అబ్బాలుండు.

---

1 మీఱుకోపముల. 2 వెడల. 3 కరళులు-కడళులు. 4 బివిరి పాఱఁజేసినయర్ణవము.

తే. మహితలావణ్యమున సుకుమారమైన, యంగమును బూర్ణచంద్రనిభాననంబు
[1]గ్రొత్తపెంపుగ నెంతయు [2]గొమరుమిగిలి, చెన్నుఁదలకట్టునై పడియున్నఁ జూచి.

క. సీసైనికు లెంతయు సం, తోసిల్లుచు నార్చి రపుడు దుఃఖితులై కుం
తీసుతులవారు దీనద, శాసంగతులైరి బాష్పజలములు దొరఁగన్. 131

క. నెఱి దప్పంబడి పెల్లుగ, నొఱలెడినరవాజికరులయులి వభిమన్యుం
డఱిముఱిఁ బడుటకు వగ మదిఁ, బఱిగొన నిల పెలుచ నఱచు భంగిఁ జెలంగెన్. 133

వ. ఆసమయంబున.

క. పెక్కండ్రు గూడి యిమ్మెయి, నొక్కనిఁ జంపుట యధర్మ మోహో యని న
ల్దిక్కులను బెద్దయెలుఁగున, నక్కజముగ భూతసంచయంబులు వలికెన్. 134

వ. ఇట్లు శౌర్యసారసంపాదితరౌద్రుండైన సౌభద్రుండు పడుటయు వారిబలంబులు
ఱెచ్చవడి భండనంబు దక్కి తలరిన ధర్మపుత్త్రుండు ప్రబలయోధవీరలోకంబు
నాలోకించి యిట్లనియె. 135

సీ. మార్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి, రథరాజిఁ గలఁచి తురంగములఁ
ద్రుంచి పదాతులఁ దునుమాడి పెక్కండ్రు, సైనికప్రవరుల సమయఁ జూచి
మూఁకల విరియించి వీఁక నాచార్యాది, యోధుల నెల్లను నొక్కదెసకు
వెలిచి వియచ్చరుల్ వినుతింప నాకంబు, చూఱ గొన్నట్టి యర్జునతనూజుఁ

ఆ. జూచి మనకు నేల శోకింప వైరుల, గం డడంచి గెలుపు గంద ముచిత
భంగిఁ బ్రొద్దుకొలఁది పరికించి మనసైన్య, ముల మరల్త మెలమి దలకొనంగ.

వ. అని పలికి బరవసంబు సేసి సేనలం బురికొల్పికొని యవష్టంభవిజృంభితుం డయి
నిలిచె నంతఁ బదంపడి యరుణకిరణుం డపరమహీధరంబుమౌళికి సరసీరుహశేఖరంబై
చెలువారం దదనంతరంబ రిత్తచోట్లును నెత్తుటఁ జొత్తిల్లుచున్నట్లుండెఁ బిండుగట్టి
పిశాచనిశాచరులు నలిరేఁగి రక్తపానంబును మాంసఖాదనంబునుం జేయుచు
మోదంబునం బొందుచు నాడుచుం బాడుచుండు కలకలంబునను గుణప
భక్షణవ్యగ్రవిహంగసముదయతుములంబునను [3]బలలఖాదనసంరంభశివానివహ
కోలాహలంబునను బరమాభీలంబైన సంధ్యాకాలంబు నిరూపించి నిజశిబిరంబు
లకు నుభయబలంబులుం బోయె నప్పుడు నీకొడుకు లుబ్బునం గొమరు మిగిలి
యరిగిరి కౌంతేయులు చిన్నఁబోవునాననంబులతో శోకసంతప్తచిత్తులయి చని
రివ్విధంబున ధర్మతనయుండు దననికేతనంబున కరిగి యచట నిఖిలపరిజనంబులుం
దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్నసమయంబున సం దమ్ముని
దెసకు మాఱిమి నారం గూరినవగ పెంపున ధైర్యంబు సొంపఱి వివర్ణవదనుం డగుచు
నిట్లనియె. 137

1 క్రొత్త-పెనుపఁగ-పెంపున. 2 గొమరు-మిగులఁ-మిగులు. 3 బలలకబళనసంరంభ.

## అభిమన్యునిమరణమునకు ధర్మరాజు దుఃఖించుట.

మ. గురుశారద్వతముఖ్యయోధవరసంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మా సైన్యము దానిఁ జొచ్చి నను బ్రీతుం జేయఁగాఁ బూని యొ
క్కరుఁడుం గోవులలోను జొచ్చుబలుసింగం బోల్కి నా నట్లు సా
చ్చి రయం బార ననేకవీరశిరముల్ సెండాడె నుద్దండుఁడై. 138

క. ఈసును రోసముఁ గలదు, శ్వాసను నొప్పించి పఱచి చతురంగములన్
గాసిలఁ జేయుచు నట్లు,ల్లాసముతో మెలఁగఁగా దలంబె యొరులకున్. 139

తే. కొడుకుఁ బోడగాన కర్జునుఁ డడిగె నేని, వానితో నింక నే మనువాఁడ హరికి
నతనిగారాబుచెలియలి కధికదుఃఖ, మేన చేసితి [1]వగవంగ నేమి గలదు. 140

క. బాలుఁడుసుకుమారుఁడు పె,క్కాలములం జొచ్చి యెఱుఁగఁడనక మొన సొరం
జాలుదు చొరు మని పనిచితి, నేలా నన్నాస దోస మెఱుఁగఁగ నిచ్చున్.

క. కుడువను గట్టను బూయను, దొడువను బోఁ బనిచి కాక తొలుత మొన సొరం
గొడుకుం బనుచుట కెవ్వఁడుఁ, గడఁగునె నాయట్టిపాపకర్ముఁడు దక్కన్. 142

తే. వానితోడిద లోక మై యేను బోవ, నై తిఁ బోఁ గన్నఁ బుత్త్రశోకాతురత్వ
మున నితాంతవివర్ణతఁ బొందుచుండఁ, జూడకుండెడివాఁడ నర్జునుమొగంబు.

ఉ. వాసవునంతవానికిని వచ్చినయాపద దీర్పఁ గాలకే
యాసురులట్టిబల్పగఱ నైనను వ్రేల్మిడిఁ ద్రుంచు నాజి న
వ్వాసవి [2]యాత్మజుండు పగవారలచే హతుఁ డైనదుర్దశం
జేసి యలంతఁ జేడ్పడఁగఁ జేసె విధాతృని నేమి సెప్పుదున్. 144

చ. కొడుకు వధించి రన్నఁ గురుకోటిని నెట్టన యల్గి రూపు మా
పెడున కడంగి పార్థుఁ [3]డెదఁ బేర్చినశోకము నార్పఁ జాలునే
పుడమిధనంబు నాకమువిభూతియుఁ జేరిన యేని నల్ల న
వ్వెడునభిమన్యునెమ్మొగము వే యగుపాలును బోల నేర్చునే. 145

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించుచున్నసమయమునం గృష్ణద్వై
పాయనమునీంద్రుం డయ్యెడకు విజయంచేయుటయు నవ్విభుండు ప్రత్యుత్థానంబు
సేసి దండప్రణామం బాచరించి యాసనవిన్యాసనప్రముఖపూజావిశేషంబుల
నారాధించి యమ్మహాత్ముతో నిట్లనియె. 146

సీ. పరసేన భేదింపఁ బనిచితి నేను సౌ, భద్రుని వాఁడు సబ్బలము సొచ్చె
వెనుక నేమును జొచ్చిచనఁగ సైంధవుఁడు మ, మ్మాఁగినఁ దోడ్పడనను వుదప్పె
నప్పుడు పెక్కండ్రు గప్పాడి నవ్వీరుఁ, బొదివిన నాఱడిగావోయె నట్లు
సుకుమారమూర్తిఁ బుత్త్రకునొంటిమైఁ జిన్న, పాపని నలుగులపాలుపడఁగఁ

ఆ. బనిచి తాను బ్రదికుపాపాత్ముఁ డెందును, గలఁడె విపులశోకజలధి మునిఁగి

---

1 వనరంగ. 2 నాత్మజుండు - కాత్మజుండు. 3 పది ♦ పేర్చిన.

పేర్చుతల్లడమున బిమ్మిటిఁగొనియెదుఁ, జిత్త మింక నేమి సేయువాఁడ. 147

వ. అనిన విని మునీశ్వరుం డమ్మనుజేశ్వరున కిట్లనియె. 148

చ. పలువురు రాజులం దునిమె బల్లిదుఁ డాతఁడు పిన్నపాపఁడే
యలుఁగులపాలు సేయ కభియాతులు పువ్వులకోల సాఁతురే
కలఁగుదురే విపద్దశలఁ గాఁటీయ నార్యులు సావు లింతవిం
తలె గరుడోరగద్యుచరదానవకోటులచావుఁ జూడమే. 149

క. ఎప్పాట నెవ్వరికి విధి, దప్పింప వశంబె ధైర్యధనఘనుఁడవు నీ
విప్పరుసున నడలుట గడు,నొప్పదు శమియింప వలయు నుర్వీనాథా. 150

వ. అనిన సాత్యవతేయునకుం గౌంతేయాగ్రజుం డిట్లనియె. 151

చ. వెరవును లావునుం గలిగి విక్రమసంపద నొప్పి ధీరులై
పరఁగిర కాని తమ్ము మృతభావవికారము వొందకుండ ను
స్థిరముగఁ బ్రాణరక్షణము సేయఁగ రాజులు సాల [1]రైరె మె
వ్యాసఁ దలపోయ మృత్యు వనివార్యమె తాపసముఖ్య యిమ్మెయిన్. 152

వ. అనుటయుఁ బారాశర్యుండు పాండవాగ్రజున కిట్లనుఁ దొల్లి యిట్లు పుత్త్రమరణ
శోకాతురుం డై నయకంపనుం డనురాజు నారదమునిచేత మృత్యుప్రకారంబు
దెల్లంబుగా విని యుపశమితశోకుం డయ్యె నని విందు మయ్యితిహాసంబు తెఱం
గెఱింగించెద నది నీయంతఃకరణంబుసంతాపంబు మాన్చి శాంతి యొనర్చు నవ
హితుండ వై యాకర్ణింపుము. 153

సీ. పగతు రకంపనుపై నెత్తి వచ్చి క, య్యము సేసి యాతని నడఁగఁ బట్టి
కొనుటయుఁ జూచి తత్తనయుండు[2]హరి యను,వాఁడు దోర్దర్పదుర్వారమూర్తి
యవ్విరోధులమీఁద నడరి బల్విడిఁ దండ్రి, విడిపించి విక్రమవిహారణమునఁ
దని వోక మఱియు నుద్ధతిఁ గరిరథఘోట,భటనికాయంబుల బడలుపఱుప

ఆ. నుగ్రు లగున నేకయోధులు చలమునఁ, గూడుకొని మహాస్త్రఘోరశస్త్ర
తతుల నక్కుమారు మృతుఁ జేసి రప్పుడు, గనలి రభసమున నకంపనుండు.

క. విపినంబు నడఁచుదవశిఖి, [3]కుపమాస్థాన మయి పగఱరియొప్ప సెఱచి యా
త్మపురము సొత్తెంచెం దూ,ర్యపటుధ్వను లెసఁగ ననిమిషాధిపుభంగిన్. 155

వ. ఇట్లు గెలిచి వచ్చియు. 156

ఆ. పుత్త్రుఁ దలఁచి తలఁచి పొగులుచు నున్నయ, న్నరవరేణ్యుకడకు నారదుండు
నెమ్మి వచ్చుటయును నిభృతుఁ డై యాసనా,ర్ఘ్యాదిపూజనంబు లాచరించి.

వ. అతనికడనుండి యమ్మహీపతి యత్తాపసముఖ్యునకు నిజవృత్తాంతం బెఱింగించి
కొడుకుగుణంబు లగ్గించి వానిం గోలుపోవుటం జేసి విజయంబు ప్రియంబు సేయ
కున్న దని తనవగపును దెలిపి మఱియును. 158

---

1 రైరి. 2 ధృతి యను. 3 కుపమానం బగుచుఁ బగఱ.

క. మునినాయక మృత్యువు ప్రభు, వని విందుము లోకమునకు నది యెట్లాగొ త
జ్జననంబుఁ దత్ప్రభావము, వినఁ దలఁచెద నుచితమేని వినిపింపు తగన్. 159

— నారదుఁ డకంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱింగించుట. —

వ. అనిన విని యమ్మహాత్ముండు గరుణాయత్తచిత్తుండై యతని కిట్లను బంధుమరణ
శోకం బుడుపంజాలెడుమృత్యుప్రకారకథ వినుట మేలు నీ వవధానపరుండ వై
వినుము సెప్పెదం బ్రజాపతి ప్రజల సృజియించి పదంపడి సంహారంబు లేమిం
జేసి భూమికిఁ దదీయభారంబు దుర్భరం బగుటయు ననుసంధించి చింతాక్రాంతుం
డై తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటంబడిన నతనియింద్రియం
బులవలన మహాజ్వాలనంబు జనియించి యెల్లదిక్కులం బరఁగి చరాచరాత్మకం
బైనభూతవ్రాతంబు దహింపం గడంగుటయు భువనహితార్థంబుగా భవుండు సని
కమలభవు శరణు సొచ్చినం బ్రజ్వరిల్లు చున్నయమ్మహానుభావుం డద్దేవు నాలో
కించి యాదరభరితుం డై. 160

క. నీకోరికి యప్రతిహత, మేకార్యము గోరి వచ్చి తెలెఁగింపు మమే
యాకార కామహర యది, సేకొని యీక్షణమ యేను జేసెద ననుడున్. 161

ఆ. అభవుఁ డిట్టు లనియె నఖిలసృష్టిక్రియా, కర్త వగుట నీవ కలుగఁజేయఁ
గలిగి భూతకోటి యెలమిఁ బొందఁగఁ గోప, మెత్తి రూపుమాపనేల యిపుడు.

వ. నాకుంగా లోకంబులం గరుణాలోకంబున నాదరింపు మనిన విని యంబుజాస
నుండు నాయందుఁ గోపంబును గామంబును లేవు వినుము ప్రజాభారపీడిత యైన
భూమిదేవి దనడప్పి యెఱింగించినం దదీయహితంబు సేయంబూని సంహారంబు
గావించువాఁడ నై దానికి నుపాయంబు విచారించి యెద్దియుం గాన నైతి నది
గారణంబుగా నన్నుఁ గ్రోధంబు వొందె ననవుడు భూతనాథుండు. 163

చ. అనఘవిచార నీ వరయు మన్నఁ దగం గడు నిష్ఠ లోకపా
లన మొనరింతుఁ గాన యనలం బయి నీ దగునల్క లోకము
న్మను మిడి కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁ గృప వుట్టి చెప్పెదం
జనునె మహోగ్రకోపవివశత్వము నీకుఁ ద్రిలోకనాయకా. 164

వ. చరాచరంబు లన్నియు నొక్కపెట్ట భస్మీభూతంబులు సేయనేల ధరణీభారంబు
వాయుటకై యుచితసంహారంబు గలుగునట్లుగ నొండుదెఱంగు దలంపుము
కోపం బుపసంహరింపు మివ్వరంబు నా కొసంగు మనవుడు నిహతపాపకళంకుం
డై నయాశంకరుపలుకులకు నతం డయ్యలుక నడంచిన నయ్యనలం బాఱుట
యును భువనంబులు ప్రమోదంబు నొంది యాశంకరశతానందుల నభినందించె
నట్లు క్రోధోపశమనం బాచరించుసమయంబున. 165

సీ. కమలాసనునియింద్రియములు రక్తాస్యయు, నసితాంగియును నరుణాంబరయును

నగునింతి జనియించి యల్లన నగుచుఁ గెం, జాయ రంజిల్లులోచనము లలర
నాజగన్నాథుల నలవోకవోలెఁ గ, న్గొని దక్షిణమునకుఁ జన నజుండు [వెఁ
మెలపుతో మృత్యువ మృత్యువ యెటవోయె, దనిపలుమాఱు సాంత్వనము దోఁ

తే. బిలిచి సంహారబుద్ధి నా కొలయఁ బొడము, కనలునం దుద్భవించితి గాన నీవు
దొడరి వాసి లే కెల్లజంతువుల సంహ, రింపు నాపంపుమై నీకుఁ బెంపు గలదు.

వ. అనిన విని మృత్యుదేవత దుఃఖిత యయ్యునుం గన్నీరు దొరంగ నయ్యశ్రుబిందువులు పద్మజుండు పాణిపుటంబులం బట్టి లోకహితార్థంబుగా ననేకభంగుల ననునయించిన నక్కాంత గాడ్పున నల్లాడుతీఁగ తెఱంగునం జలించి యంజలి ఘటించి యవ్విరించి కి ట్లనియె. 167

తే. నీవు సృజియించి తటె నన్ను దేవదేవ, యేను క్రూరకర్మమునకు నెట్టు లోర్తు
బంధుమరణశోకార్తులై పనవుజనుల, వివిధభంగుల మెలుఁగులు వినఁగ జాల.

వ. ఈయధర్మంబునకు వెఱతు నీవు నామీఁదఁ గృప సేయు మిట్లు నన్నుం బనుపక తపశ్చరణంబునకుం బనుప వలయు నివ్వరం బిమ్ము భవదనుజ్ఞ వడసి ధేనుకాశ్రమంబునకుం జనియెద నని పలికినం బరమేష్ఠి యన్నీరజాక్షి నిరీక్షించి. 169

సీ. నినుఁ బ్రజాసంహారమునకునై కల్పించి, నాఁడఁ గావున నీమనంబునందుఁ
బొడమువిచారంబు నుడిగింపు మిట్లు గాఁ, గలయది యైనయిక్కార్యమునకు
నన్యథాత్వం బేల యగుఁ బ్రజాసంహర, ణము ననిందితసమయముగఁ జేయు
మీ వవశ్యంబును నావుడుఁ గడు భయం, బున నప్పటికి నియ్యకొని మృగాక్షి

తే. నలువవదనంబు సూచుచు నిలిచె నతఁడు
ప్రీతుఁడై లోకములఁ గృపపెంపుతోడి
దృష్టిఁ గనుఁగొన నవి పరితుష్టిఁ బొందెఁ
జంద్రమౌళియుఁ దనయిచ్చఁ జనియెఁ బ్రీతి. 170

వ. మృత్యుదేవియుం బరమేష్ఠికిం బ్రణమిల్లి. 171

తే. అచటు వాసి రయంబున నరిగి ధేను
కాశ్రమంబున నియమంబు లాచరించి
నంద కౌశికి యనియెడు నదులఁ బెక్కు
వ్రతము లొనరించి మఱియుఁ దీర్థముల నెల్ల. 172

వ. అద్దేవు నుద్దేశించి పెద్దకాలం బనేకవిధంబుల దుష్కరంబు లగుతపంబులు సేయుచుం బోయి హిమశైలశిఖరంబున సంయతాత్మ యై యున్నఁ జతురాననుం డమ్మానినికిం బొడసూపి మృత్యువ నీ వత్యంతనిష్ఠురనియమంబు లేల యనుష్ఠించెద వనిన నయ్యంగన సమాధానంబున నున్న ప్రజల మెడలు నులిచి చంపం జాల నీపనికిం బంపకు మధర్మభయంబున నిన్నాశ్రయించెద నార్తనైన నాకు శరణంబ వగు మని ప్రణమిల్లిన నతం డిట్లనియె. 173

ఆ. ఇంతి నీ కధర్మ కే మేల యయ్యెడు నాదు, పనుపు సేయ నిన్నుఁ గ బరమధర్మ
మెుందు విమలకీర్తియును జెందునట్లుగా, వరము లిత్తు మేను కహరుఁడు నీకు.

వ. ఏ మనుసంధించినపనికి నీకు భయం బేల చతుర్విధభూతకోట్ల నుపసంహరింపు మనిన న త్తన్వి దేవా దేవరయాజ్ఞ దల మోచి చేయుదానంగాక యొక్క విన్నపం బవధరింపుము లోభంబును గ్రోధంబును నీర్ష్యయు ననూయయు జంతువుల శరీరంబుల వికృతిం బొందింప వలయు ననవుడు నతం డట్ల యయ్యెడు మఁది యునుం గాక నీయశ్రుబిందువు లెన్ని యన్నియు రోగంబు లై జనంబులం జావం జేయంగలయవి దానంజేసి యధర్మంబు నిన్నుం బొరయ నేరదు ప్రాణి ప్రాణమారణంబు నీకుం బరమధర్మం బగు భవదీయశుభం బేను గోరెద నీవు ధర్మస్వరూపంబ వీవిశ్వంబునకు నీశ్వరి వట్లు గావునఁ బ్రాణసంయమనంబు భవ దధీనంబు సర్వజీవులయెడం గామరోషంబు లుడిగి జీవంబుల నాకర్షింపుము తత్ప్రకారంబు ధర్మతత్త్వంబు నీకు భయం బేమి మిథ్యావర్తనుల నధర్మంబ సమయించుఁ బొమ్మనిన నమ్మానిని శాపభీతిని దన్ను నధర్మంబు వొంద దనుమా టను దన్నియోగం బంగీకరించె నవ్విరించివచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహాసం జేయ నామృత్యుదేవత ప్రాణాపహారిణి యగుటం బ్రాణంబులు దేహంబులం బాసి దేవాదిభావంబులం బొందుచు మగుడ మనుష్యత్వంబు నొం దుచుండు. 175

తే. భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్ర
తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డోడఁలు
మనుపఁ జెఱుపంగ నోడయండు సనుట మగుడ
నరుగుదెంచుట వింత గా దతని కెందు. 176

క. నరు లమరు లగుదు రమరులు, నరు లగుదురు గాన నీదుకనందనునకు భూ
వర వగవ నేల యతనికిఁ, జిరవీరస్వర్గసుఖము సేకుఱి యుండున్. 177

క. అగణితదుఃఖాత్మక మి,జ్జగ మాతఁడు దీనిఁ దొఱఁగి సౌఖ్యాత్మక మై
వగ చెంతలఁ జేరనియ,జ్జగమునఁ బుణ్యాత్మపురుషసంగతి వడసెన్. 178

వ. నీకు వగవం బని లేదు బ్రహ్మకల్పితం బైనయీనిశ్చయంబు నిరూపించి ధీరులు దెగినవారలకు వగవ రని చెప్పిన నారదునకు నయ్యకంపనుం డి ట్లనియె. 179

క. మునినాథ నీవు సెప్పఁగ, ననఘం బగునీసమంచితాఖ్యానం బే
విని గతశోకుఁడ నైతిని, మనము ప్రియం బందె నతిసమాధానమునన్. 180

వ. అనుచు వినతుం డగుటయు నమ్ముని దన దైనయశోకననరంబునకుం జనియె నని పలికి పారాశర్యుండు. 181

క. ఈయితిహాసం బాయువు, శ్రీయును నారోగ్యమును విశిష్టగుణంబుం
జేయు జనములకు జగతీ,నాయక వ్రాసినఁ బఠించినం దగ వినినన్. 182

వ. అభిమన్యుండును భండనంబునఁ బిఱుసనక శరశరాసనాదివివిధాయుధంబులఁ బర బలంబుల బడలుపఱచి చిరవీరస్వర్గసౌఖ్యంబును బ్రఖ్యాతియుం బడసె నీవు నడలం బని లే దని చెప్పిన విని ధర్మతనయుండు దనమనంబున నుత్తమక్షత్త్ర ధర్మంబు తెఱం గిట్టిద యగుట దలపోసియు శూరులు పుణ్యలోకంబున సుఖం బుండుటయుం దెలిసియు నెవ్వగ విడిచి వెండియు వేదవ్యాసమునీశ్వరుతో ని ట్లనియె. 183

ఆ. మును ప్రసిద్ధిఁ బొంది చనినభూపాలక,శ్రేష్ఠు లెవ్విధమునఁ జేసిరొక్కొ-
క్రతువు లవ్విశిష్టకర్మజాతముఁ దెలి,యంగఁ జెప్పి నన్ను నాదరింపు. 184

వ. అనిన విని యమ్మనుజపతితలంపు గనుంగొని కృష్ణద్వైపాయనుండు నీ వి ట్లడుగుట నీకొడుకు దొంటిమహారాజులయట్టివాఁడు గావున నక్కుమారునకు వారలకుం బుణ్యగతితారతమ్యం బెట్టిదియో యని [1]యరయుట గా నోపు నని యూహించెద ననవుడు నతండు మీదివ్యచిత్తంబున నవధరించినదానిం గా దన నెట్లు వచ్చు నవ్వానిని విన వలతు నానతి యిండు. 185

చ. అనుటయు నమ్మునిప్రవరుఁ డాతని కి ట్లను నధ్వరప్రవ
ర్తనులుఁ దపఃప్రదీప్తులును దానసమగ్రు లుదాత్తశీలురుం
జనియెడునట్టిచోటు లోక[2]సంపద యే రణశూరకోటి క
ర్జునసుతుఁ డత్యుదాత్త మగుచోట సుఖస్థితి నుండు భూవరా. 186

వ. అది య ట్లుండె మహాత్ము లయినమహీపతులవరిష్ఠకర్మానుష్ఠానంబుల తెఱంగెఱుంగుట మేల కాదె యంత లంతలుమానుసులు మడిసిరి గాని పుడమి నిత్యులై నిలువం బడ రది వినుటయు [3]నీమనోరోగశమనంబు సేయుం జెప్పెద నాకర్ణింపుము. 187

వేదవ్యాసమునీంద్రుఁడు ధర్మజునకు సువర్ణష్ఠీవిచరిత్రంబు సెప్పుట.

క. జనపాలక సృంజయుఁ డను,మనుజేంద్రుఁడు పుణ్యమూర్తి మహిమాస్పదుఁ డి
వ్వననిధివలయములోనియ,వని నొక్కఁడ యేలు దుర్నివారస్ఫురణన్. 188

వ. సంతానార్థి యయి సంతతంబును భూసురపూజనంబులు సేయుచుండు నానరపతికి నారదుండు సఖుం డగుట నతనిపాలికిఁ బలుమాఱు నరుగుదెంచుచుండు నొక్కనాఁడు విప్రవరు లతిప్రయత్నంబునంగూడికొని యమ్మునివరునితో నిమ్మహీపతికోర్కి దీర్ప వలదే యని చెప్పిన. 189

క. అతఁ డతనితోడ భవదీ,ప్సిత మెయ్యది నాకు నేల చెప్ప ననుడు నం
చితగుణుఁడు రూపసియు నగు,సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా.

వ. అక్కుమారుండును మూత్రపురీషలాలాస్రుస్వేదంబులు సువర్ణంబు లగునట్టివాఁడు గావలయు ననిన నమ్మహీపతికి నమ్మహాత్ముం డవ్వరం బిచ్చె నాసృంజ

---

1 యరయుటకుం గానోపు. 2 సంప్రతియే, 3 నీమనశ్శోకోపశమనంబు.

యుండు న త్తైలంగుతనయుం బడసి సువర్ణష్ఠీవి యనుపేరిడి ప్రియంబునం బెను
చుచు వానివలనం గనకం బనుదినంబు నుత్తరోత్తరాభివృద్ధియగుచుండ సమృద్ధి
నొంది శయనాసనసదనప్రాకారప్రభృతిసమస్తవస్తువులును గాంచనమయంబులు
గావించికొని యసమానమహిమానందంబునం బ్రకాశుం డై. 191

క. విలసిల్లుచు నుండఁగ ము,చ్చిలి పట్టి కుమారునోరఁ ఽ జీర దుఱిమి వెం
గలు లగుక్రూరులు గొందఱు, వెలువడఁ గొని పోయి యొక్కఽవిపినములోనన్.

ఆ. కడుపు వ్రచ్చి యొడలు ఽ గలయంగఁ జల్లించి, పాపి పాపి చూచి ఽ పసిఁడి గాన
కచటశవము నై చిఽయరుగుచున్నండి త,త్కర్మఫలముఁ దమ్ముఁఽగలఁచుటయును.

వ. ఆపాపాత్ములు దమలోనం గలహించి యొండొరుల వధియించి యందఱు నధో
గతిం జెందిరి సృంజయుండును గొడుకుం గానక వెదకి తత్కళేబరంబు గని పర
లోకక్రియలు నిర్వర్తించి శోకంబునం బలవించు చున్న నన్నరేంద్రుకడకు
నారదుం డరుగుదెంచి యతనిచేత నర్చితుం డై. 194

క. జననాథ యిట్లు శోకం,బునఁ గుందినఁ దనువు విడిచి ఽ పోదె యుసుఱు స
చ్చినవారలు వత్తురె యే,డ్చినఁ జెలిమింజేసి హితము ఽ సెప్పెద నీకున్. 195

## షోడశరాజచరిత్రము.

వ. అవధానాయత్తం బగుచిత్తంబుతో వినుమని యిట్లనియె. 196

సీ. సంవర్తుఁ డనుమహాఽసంయమి దేవతా,గురుతోడియీాసున ఽ నరుగుదెంచి
పూని యుపద్రష్ట ఽ యై నడపంగ హి,మాచలపాదంబుఽనందు శక్ర
వరుణప్రభృతు లైనఽసురలు మహాముసీం,ద్రులును సహాయులై ఽ మెలఁగుచుండ
శాలాప్రముఖభవ్యఽసాధనంబులు గన,కమయంబులుగ వచ్చ్రఽకాంచనాజ్య

ఆ. దధిపయఃఫలాదిఽతర్పణద్రవ్యస,మృద్ధి సకలజనులు ఽ మెచ్చఁ బెక్కు
లధ్వరములు సేసె ఽ నట్టిమరుత్తుండు, నిత్యపదవి నుండ ఽ నేర్చెనయ్య. 197

సీ. సన్మార్గమున రాజ్యఽసంపద నొంది భూ,సురపూజ లొనరించి ఽ సువ్రతముల
బృందారకులఁ బ్రీతి ఽ బొందించెఁ దన కర్థిఁ, బర్జన్యుఁ డేఁటేటఁ ఽబసిఁడివాన
కనకమయము లైనఽకర్కటఝషనక్ర,కూర్మచయముతోడఁ ఽ గురియు చుండ
నయ్యర్థ మెల్ల ధఽనార్థుల కిచ్చుచుఁ, గురుజాంగలంబునఁ ఽ బరమనిష్ఠ

ఆ. నశ్వమేధముఖము ఽ లైనరాజార్హ్వ య,జ్ఞములు పెక్కు సేసె ఽ సకలజనులుఁ
బొగడునట్టిపాటఽనెగడె సుహోత్రుఁ డ,వ్విభుఁడు దెగియె ననఁగఽవినమె యధిప.

సీ. కాంచనాలంకారఽకాంతంబు లై రూఢి, కెక్కినగజములు ఽ పెక్కువేలు
జవసత్త్వరూపాదిఽసకలగుణములఁ బెం, పెసఁగినహయము లఽనేకలక్ష
లమలసువర్ణమఽయము లగుకొమ్ములం, గొమరారుపశువులు ఽ గోట్లు లూర్జి
తాంగకవిలసదఽజావికంబులు గణ,నాతీతములు గన్య ఽ లప్రమేయ

ఆ. లఖిలరత్నవిరచిఽతాభరణంబు ల,నల్పములు మహీసుఽరావళులకు

నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు నంగుఁ, డతఁడు నన్యలోకగతుఁడు గాఁడె.

సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దన, రథము చరింప నరాతు లనఁగ
వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ, బ్రజల నొప్పింపనిపరమపుణ్య
కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన, కక్షయధనము ఫాలాక్షుఁ డొసఁగ
నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్టజ, నాకీర్ణములుగఁ బెక్కాచరించెఁ

ఆ. దారకములు వృష్టిధారలు లెక్కింప, వచ్చుఁ గాని యతనియిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు సన్నుతిపాత్రు మా, శిబికి నుర్వి నునికి సెల్లె నెట్లు.

సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి, పంపున నరిగినపెంపుకలిమి
సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొన, ర్చినమర్త్యలోకపావనవిభూతి
త్రైలోక్యకంటకు దశముఖు బంధుయు, క్తంబుగాఁ జంపినకలితనమ్ము
బాలురమరణంబు వాటిల్ల కుండంగఁ, జేసినయత్యంతచిత్రమహిమ

ఆ. గలిగి యశ్వమేధములు మున్నుగా ననే, కాధ్వరము లొనర్చి యఖిలజనులఁ
దల్లివోలె నరసి దశరథరాముండు, గాలవశత నొందెఁగాదె యధిప. 201

సీ. పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ, నవని భాగీరథి యనఁగఁ బఱపి
శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి, యప్రతిహతముగ నశ్వమేధ
యాగంబు లొనరించునప్పుడు వేయువే, లరథంబులందుఁ గన్యల నలంకృ
తలఁ జేసి యునిచి రథంబు రథంబున, కిభములు నూఱునూఱు[1]జేసి యేనుఁ

తే. గేనుఁగునకు గుఱ్ఱములు వేయేసిపాటి, హయముహయమునకట్లగోచయముమర్చి
భూరిభూరియుతంబుగ భూసురులకు, నొసఁగినట్టిభగీరథుం డున్నవాఁడె. 202

సీ: అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగుగం, ధర్వులు హృద్యవాదన మొనర్ప
నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు, నై వినోదింపంగ నమరగణము
బహువిధాలంకారభంగుల విన్నాణ, ములు సూప దివ్యమునులు నుతింప
మనుజలోకం బెల్లఁ గనకాన్నవస్త్రభూ, షణదానములఁ దృప్తి సనఁగ నశ్వ

ఆ. మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని, శతతమాధ్వరమున నతఁడు హయము
నాస పడిన నిచ్చె నాదిలీపునిఁ జూపు, మా ధరిత్రి నిపుడు మనుజనాథ.203

సీ. జనన మాదిగఁ బాకశాసనుకరమునఁ, బ్రభవించు నేయును బాలుఁ ద్రావి
ద్వాదశదినము లాతఁడు గారవింపంగ, వర్ధిల్లి పన్రెండువత్సరముల
ప్రాయ మై రాజ్యసంప్రాప్తికి నేతెంచి, యర్కునియుదయంబు న స్తమయము
నగుపట్లు పొలిమేర లైనమహాక్షేత్ర, మంతయు నొక్కండ యనుభవించి

ఆ. యన్నపర్వతముల నాజ్యనదుల విప్ర, భోజనము లొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ, డింద నిలిచెనే నరేంద్రముఖ్య.

సీ. అనిమిషాసురయుద్ధమున నసురావళి, సమయించి న[illegible]ముల నేర్ప

---

1 ఏర్చి. 2 వర్ధించి.

రించి భూమి యలంకరించి యగ్నిష్టోమ, హయమేధవాజపేయాతిరాత్ర
పౌండరీకము లనఁ బరఁగినయధ్వరం,బు లనేకములు సేసి భూసురులకు
నఖిలభూములఁ గలయర్థంబు లెల్లను, దన కని యేమియు నునుప కిచ్చె
ఆ. శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లుతనయందు, ధర్మతత్త్వ మూర్జితముగ నియమ
నిష్ఠుఁ డై యయాతి నెగడె శాశ్వతుఁ డయ్యె, నే నృపాల యమ్మహీశ్వరుండు.
సీ. ఓర్వక పెక్కండ్రు రుర్వీశు లొక్కటఁ, బై నెత్తి వచ్చిన భండనమున
వారిహేతిచ్ఛత్త్రవాహనధ్వజములు, నఱకిన నడునడు నడిఁకి వార
లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి, యేలె నీ పెన్నేల యెల్లఁ దాన
కొని యధ్వరములు పెక్కు లొనర్చి వేడుకఁ, బాయసమ్ములు నపూపములు మోద
ఆ. కములు లోను గాఁగఁ గలవంటకముల ను,ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి
దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన, యంబరీషుఁ డేమి యయ్యెఁ జెపుమ. 206

సీ. లక్షభార్యల నుపలాలించి యొక్కొక్క, వెలఁదికి వేవురు వేవు రాత్మ
జులుగాఁగఁ బదిగోటు లలఘుమూర్తులఁ గాంచె, వారును దోర్బలోజ్జ్వలులు నార్య
చరితులు నై పేర్చి తురగమేధంబు లం,దఱు బహుదక్షిణోదాత్తభంగిఁ
జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ, దానును విశ్రుతాధ్వరము లొప్పఁ
తే. బెంపు సొంపును సువ్రతసంపదయును
నిర్మలశ్రద్ధయును గర్మనిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె నతఁడు
వడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు. 207

సీ. అధికతపంబున నగ్ని నారాధించి, ప్రత్యక్ష మగుటయు బ్రహ్మచర్య
వృత్తంబు దమమును వేదవిత్త్వము నహిం,సయుఁ బాత్రదానంబు శమము వరము
గాఁ గోరికొని వేదికాస్థలి మణికన,కాత్మిక మై ముప్పదాఱు యోజ
నముల దైర్ఘ్యము నంత కమరు విస్తారంబుఁ, గలుగంగ నొనరించి క్రతువు సేసి
తే. విప్రతతులకు దాని నతిప్రియముగ
నిచ్చి తనపేర గయ నుతి కెక్క వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁ డై నెగడె గయుఁడు
భూవరోత్తమ యతఁ డెందుఁ బోయెఁ జెపుమ. 208

సీ. ఇరువదివేవురు పరిణతపాచకు, లభ్యాగతులకును నతిథులకును
బాటించి క్రొత్తగాఁ బవలును రేలును, వలయు నన్నము లిడి వెలసెఁ బశువు
లర్థి నుత్తమగతికై తామ చనుదేర, విశసించు నమరులు వేడ్కతోడఁ
బొడసూపి కడు పారఁ గుడువ హవిర్భాగ,ములు వెట్టు నివ్విధమున మహోద్భ
తే. తముగ నొనరించె సత్త్రయాగము దదుత్స,వంబు గొనియాడ వచ్చిన వార లెల్లఁ
బ్రకటపుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ, డవ్విభునకును వలసె లోకాంతరంబు.

సీ. శరభసింహవ్యాఘ్ర¸సత్త్వచయంబుల, నేడిక లెట్లట్ల¸యెక్కి యాడి
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున, దమియింపఁగా సర్వ¸దమననామ
మిడియె నమ్ముని పదం¸పడి మహారాజ్యప,దస్థుఁడై కాళింది¸తటమునందు
భాగీరథీతీర¸భాగంబునను సర,స్వతిసమీపంబున¸వాజిమేధ
తే. రాజసూయాదివివిధాధ్వ¸రము లొనర్చి, కనకనిర్మితకరితురం¸గమరథంబు
లసదృశప్రీతి విప్రుల¸కొసఁగె భరతుఁ, డన్న రేంద్రచంద్రుండును¸జన్నవాఁడ.
సీ. మిట్టుఁ బల్లంబునై¸మెలఁగంగఁ దనరథ, ప్రముఖవాహనములఁ¸బఱప ననువు
గా కున్న మేదినిఁ¸గడు సమస్థలి గాఁగ, వెరవున నొనరించి¸విశ్రుతముగఁ
దన పేరఁ బృథివి నాఁ¸జనఁ జేసి గోరూప, యైనయవ్వసుమతి¸నమరగణముఁ
బనిచి యోషధులును¸బహురత్నములుఁ బిది,కించి జగంబుఁ బో¸షించెఁ బృథుఁడు
తే. సేసె నానాధ్వరము లవి¸సెప్ప నేల, సకలధాత్రియు బ్రాహ్మణ¸సమితి కిచ్చె
నమ్మహానుభావునకును¸నతులయశము, కాక సుస్థిర మయ్యెనే¸కాయ మనఘ.
సీ. బ్రహ్మవిద్వేషంబు¸పరికించి కోపించి, యవిధేయుఁడైన స¸హస్రబాహుఁ
బరిమార్చి నృపతులఁ¸దర మిడి తునుమాడె, నిరువదియొక్కమా¸ఱెల్లచోట
నందఱయే లెడు¸నన్నిభూములుఁ దాన, యేలె ధర్మోజ్జ్వల¸పాలనమున
రాజయోగ్యములు ధ¸రాసురార్హంబులు, నగునధ్వరములు పె¸క్కాచరించెఁ
ఆ. గశ్యపునకు నిచ్చి¸కాశ్యపి యనుపేరఁ, జనఁగఁ జేసె నుర్వి¸జామదగ్న్యు
వినమె యమ్మహాత్ముఁ¸డును బరితోషవి,భ్రాంతి గలిగె నేని¸బ్రదుక లేఁడు. 212
చ. నలుమడి నీకు నమ్మనుజ¸నాయకు లేమిటఁ జూడ వచ్చినం
దలఁప భవత్సుతుండును సు¸దాత్తుఁడు వారలకంటె నెందునుం
గలయది దీని కేల యధి¸కం బగు నెవ్వగ నింత నొవ్వ ని
త్తెలివి మనంబునం జొనుపు¸ధీరతసారత గూర్పు నేర్పునన్. 213
వ. అని నారదుండు. 214
తే. ఆయువును బుణ్యమును జిర¸శ్రీయుఁ జేయఁ, జాలుషోడశరాజన్య¸చరిత మిట్లు
సెప్ప నేర్పడఁగా విని¸సృంజయుండు, పాండవాగ్రజ యేమియుఁ¸బలుకకుండె.
చ. పలుకక యున్నయద్ధరణి¸పాలుఁ గనుంగొని యమ్మునీంద్రుఁ డేఁ
దెలియఁగఁ జెప్పినంతయు న¸తిస్థిర మై భవదీయబుద్ధియం
దొలసెను బూదిలోనఁ గ్రమ¸మొందఁగ వేల్చిననేయివోలె ని
ష్ఫల మయి పోయెనో యనుడుఁ¸బ్రాంజలి యై తగ నాతఁ డిట్లనున్. 216
తే. పుత్రశోకాపహంబును¸బుణ్యమతము,నై నయాఖ్యానమున నాదు¸మానసంబు
కలఁక యంతయుఁ బాసె నిష్కల్మషుండ, నైతి నీదయఁ జేసి సం¸యమివరేణ్య.
వ. అనిన విని యత్తపోధనుండు ప్రీతుండై నీ కెద్ది వలయు నడుగు మిచ్చెద ననుట
యు సృంజయుండు దేవా నీవు ప్రసన్నుండ వగునంతకంటె మిక్కిలి వలయునది

మెయ్యది భవత్ప్రసాదభాజనంబు లయినవారికి దుర్లభంబు లగువస్తువులుం గలవే యనుటయు నమ్మునివరుండు. 218

క. మ్రుచ్చులమాఘత్వముసం, జచ్చి నరకవాసమునకుఁ జనినతనయు నేఁ
దెచ్చెద మగుడఁగ వేనీ, కిచ్చెద వగ పుడుగు మింకఁ నేనియు నధిపా. 219

220

వ. అని చెప్పిన.

క. దేవముని యిమ్మెయిం దగు, దీవన యిచ్చుటయు నరుగుఁ దెంచె సువర్ణ
ష్ఠీవి గడు నద్భుతంబుగ, నావిభుఁడు ప్రమోదసంభృతాత్ముం డయ్యెన్. 221

వ. ఇవ్విధంబున నత్తపస్వి యిచ్చినయక్కుమారునకు సృంజయుం డస్త్రశిక్ష గావించి వివాహంబొనరించియతండు యాగంబులఁ ద్యాగంబుల భోగంబులం దనమనంబునకుఁ బ్రియంబు సేయుచు సంతానవంతుం డై నెగడిన నతం డత్యంతసంతోషంబునం బొదలె నిట్లాసువర్ణష్ఠీవి యశిక్షితాస్త్రుండును నకృతవివాహుండును నయాగకర్తయు నత్యాగవిదితుండును నభోగభాగియు నసంతానవంతుఁడును నగుసమయంబున సమయుట కారణంబుగా నన్నారదుండు గారుణ్యంబునం గ్రమ్మఱ వానిం గలిగించె నది యట్లుండె నవ్విశేషంబు లన్నియు సంపన్నంబు లయి శౌర్యంబున శత్రులధైర్యంబు దూలించి మేలిమివడసి నాకలోకసౌఖ్యంబునం బొందినవాసవపౌత్రునకు వగచుట వివేకంబు తెరువు గాదు విను మీలోకంబు దుఃఖబహుళం బగుటయుఁ దపోదానాద్యనుష్ఠానంబుల మానవులు సురలోకసుఖంబు సాధింపం జూచుట సుప్రసిద్ధంబుగాదె నీ వయ్యర్జుననందనుఁ డెట్టిపుణ్యపరులకుం బడయ నరిది యగుపదంబున నునికి దెలియుటకును భావనంబు లైనపలువురు భూపతులవృత్తాంతంబులు వినుటకును ఫలం బయినపరిజ్ఞానంబున సమాధానసుస్థిరుండ వై యుండుము పోయి వచ్చెద నని పలికి పారాశర్యుం డంతర్ధానంబు సేయుటయు ధర్మసూనుం డుపశమితశోకుం డయ్యె నివ్వచ్చుండు వచ్చిన వానితో నే మనువాఁడ ననుతలంబు పుట్ట నూరకుండె నని సంజయుండు సెప్పుటయు.

తే. అతనిలోఁ ధృతరాష్ట్రుఁ డిట్లనియెఁ గ్రీడి, సంగరమున సంశప్తకసమితి నేమి
సేసె సుతువార్త యెవ్వరుఁ జెప్పి రాతఁ, డట్లు దెగుట యెఱింగి యెట్లయ్యెఁ జెపుమ.

క. అనిన విని సూతసుతుఁ డి,ట్లనుఁ బేరడవులు దహించుఁ ననలముచందం
బున సంసప్తకసేనల, ననిమిషపతిసుతుఁడు దీవ్రుఁడై పొరివుచ్చెన్. 224

అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట.

వ. అట్లు మర్దించి మగుడునప్పుడు మాధవు నాలోకించి. 225

చ. కలయఁగ దుర్నిమిత్తములుఁ గానఁగ నయ్యె మదీయచిత్తముం
గలఁగెడు మేను మాఱ్నుపడఁగాఁ దొడఁగెఁ గుఱుఁ డారయంగఁ గే
వలుఁడె సృపాలుఁ డెడసుఁ వచ్చెనో యన్న నతండు రాజుఁ ద
మ్ములు సుఖులొందుమై నశుభముం గల దిప్పు డెఱుంగ నయ్యెడున్. 226

వ. అని పలికెఁ దదనంతరంబ యద్దామోదరధనంజయులు సంధ్యాసమయసముచిత
కరణీయంబు లాచరించి యరుగుదెంచి నిజశిబిరంబు సొత్తెంచి రది చిట్లినచిత్ర
రూపంబులు గలకుడ్యంబునుంబోలె వివర్ణాకారు లైనజనులవలనం బాడఁతి
యున్నం దత్ప్రకారం బనుసంధించి యన్నరుండు నారాయణున కి ట్లనియె. 227

క. సైనికులు నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి యరిగెద రది యే
మో నేఁడు వేణువీణా, గానస్వనములును వీటఁ గలుగవు కృష్ణా. 228

క. ఈమేలు ప్రజ గొనర్చిన, యామహిమకు నెలవు గొంతియగ్రతనయుఁడో
భీముఁడొకొ తమ్ముఁగుఱ్ఱలొ,కో మఱియెవ్వారొకొ తలఁవు గొలఁదికి మీఱెన్.

ఆ. అలరుమొగముతోడ నభిమన్యుఁ డేలొకో, యెదురు రాఁడు నాకు నెట్టివార్త
చెవులు సోఁకునొక్కొ చే వెట్టి కలఁచిన,భంగిఁ ద్రిప్పికొనఁ దొడంగె మనము.

క. పలుమాటల కిటు మఱుమా,టలు వలుకనికృష్ణుతో నరుడలు మది మొలవం
బలుకుచు ధర్మసుతునివిడి,దల కరిగెను మోము వెల్లఁబడనమునఁ గదురన్.

వ. ఇవ్విధంబున నరిగి యన్నరపతి బంధుమిత్త్రులును మాన్యరాజన్యులుం దానును
నొక్కయెడ నున్నం దత్ప్రదేశంబునకుం గేశవుండును దోడన చనం జని వా
రుమ్మలించి యునికియు వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి సవ్య
సాచి యడుగులు దొట్రుపడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుంగొని
మెలుంగు రాల్పడ ని ట్లనియె. 232

క. ఆననములు వెలువెల్లం, గా నడ లొదవినది మీకుఁ గానఁ [1]దడవ మీ
లో నభిమన్యుఁడు లేఁ డే,మో నాకుం జెప్పఁ డేల యారక యుండన్. 233

క. ధనురాచార్యుఁడు దగఁ బ, న్నినపద్మవ్యూహ మొరులు నేరరు చొర మం
చనుమానింప కతనిఁ జొరు, మనరు గదా మీయుపాయ మాఱడివోవన్.

ఉ. అమ్మొన సొచ్చుచొప్పు దెలియంగ విని నంతియ కాని యిమ్ములం
గ్రమ్మఱుభంగి వాఁడు వినఁగానఁడు దీని నెఱుంగ కుక్కిఁ బా
పమ్మునఁ బోయి మీరు పొరఁ బంచిన నుక్కునఁ జొచ్చి యోధబృం
దమ్ములచేత ప్రగ్గఁడు గదా కురువీరులు సుట్టు ముట్టినన్. 235

మ. హరిమేనల్లుఁడు గొంతికూర్చుమనుమం డస్మత్తనూజుండు సం
గరకేళీనిపుణుండు దివ్యశరశిక్షాశాలి యవ్వీరు నె
వ్వారొకో నేలకుఁ దెచ్చి రొక్కరునిచే వాఁ డేల చిక్కుం బొరిం
బొరిఁ బెక్కండ్రపు విచ్చుచుం బొదువుచుం బోరాట గల్గెం జుమీ. 236

క. గురులకు భక్తుఁ డుదారుఁడు, గరుణ గలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురం
ధరుఁడు [2]మొగమోడు నాసుర,వరపౌత్త్రుఁడు లేమి కోర్వ వచ్చునె చెప్పుఁడా.

క. అన్నగుమోమును నక్షైలి, గన్నులు నవ్వొడఁదయురము గ న్నారంగాఁ

1 బడఁడు. 2 మొగమోడునే నుర.

గన్నను బ్రదుకుదుఁ గానక, యున్నను బ్రాణంబు లెట్టు లుండఁగ నేర్చున్.

సీ. హంసతూలికపాన్పునందుఁ [1]బొందెడుమేను, కఠినంపునేలతోఁ గదిసె నేఁడు
గొజ్జఁగులనీడ పైనడరఁ జెన్నగుమోము, పొరిఁ బర్వుపెందూళిఁ బ్రుంగె నేఁడు
లలనలు లీలమైఁ గొలువ నుండెడుభోగి, వఱళులలో నున్నవాఁడు నేఁడు
నానాజనములకు నాథుఁడై శోభిల్లు,దార యనాథత్వంబుఁ బొరసె నేఁడు

ఆ. వినయరతుఁడు హృదయవిదుఁడు సుభద్రగా,రాబుపట్టి మగలరాజు మాన
ధనుఁడు దివిజరాజుమనుమఁడు నాచెలి,కాఁడు ముద్దులాఁడు లేఁడు నేఁడు.

ఉ. అక్కట మందభాగ్యునకు నట్టితనూభవరత్న మెవ్విధిం
డక్కు విధాత నిర్దయుఁ డొకడఁబడునే కడుమేలివస్తువుల్
పెక్కుధనంబు లున్కి యరిబృందము పిల్చినఁ బోటుబంటనై
యక్కడ కేల పోయితి మహాగుణభూషణుఁ గోలుపోయితిన్. 240

వ. అనుచుఁ జదికిలంబడి ఫల్గునుండు. 241

ఉ. హా యను ధర్మరాజతనయా యను నన్నడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁపఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి వోవఁ దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్. 242

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించి యుధిష్ఠిరునాననం బాలోకించి.

ఉ. పావని సేరి యుండఁడొకో పార్షతుఁ డచ్చట లేఁడె యొండుమైఁ
బోవఁగఁ బంచితే ద్రుపదుఁ బోరికి సాత్యకి రాక తక్కెనే
భూవర మత్స్యనాథుఁ డెట వోయెనొ డెప్పర మైన నీకునుం
గావఁగ రాక తక్కెనొ తెగం గత మేమి సుభద్రపట్టికిన్. 244

అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు సచ్చినవిధంబు నడుగుట.

క. పడుఁగాక యేమి పగఱం, గడిమి మెఱసి చంప నొంపఁ గనియెనె నృప నీ
కొడు కిట యట సూడక యె,క్కుడుమగఁటిమి నుఱికి పేరు గొనియెనె పోరన్.

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి చింతించి. 246

చ. పలువురు సుట్టు ముట్టికొని బాణకృపాణముఖాస్త్రశస్త్రసం
క్తులఁ గడు నొంపఁగాఁ దనకు దోడ్పడువారలు లేక నర మదిం
[2]దలఁపఁడ యత్తఱిన్ రిపువధంబున కెద్దియుము తండ్రి యేను గొం
డలమునఁ బొంద కుండ నని తాఁ బఱువాఱును జీర కుండునే. 247

క. అక్కట తప్పఁ దలంచితి, నక్కలఁదులవాఁడె కృష్ణునల్లుఁడు పోరం
గ్రుక్కనె బాహాగర్వము, దక్కనె నాకొడుకు మిన్ను [3]దలపైఁ బడినన్. 248

ఆ. పిన్ననగవుతోడఁ జెన్నెసలారుసా, భద్రుమొగము సూడఁబడయ కున్న

1 బందెడుమేను. 2 దలఁపఁడె. 3 దనపైఁ బడినన్.

వాఁడ నామనంబు వ్రయ్యలై పో దిది, రాతఁ జేసినది యొకొ తలంప. 249

క. పలువురు క్రూరత బాలునిఁ, జలముకొని వధించునపుడు శౌరిని నన్నుం
దలఁపరొకో మనముల వా, రలు దానికి [1]నేమి సేఁగ రా దయ్యెడినో. 250

క. కటకట పేరినపెన్నె, త్తుట జొత్తిలి యున్నమేని తోఁ గొడు కేచ
క్కటిఁ బడి యున్నాఁడో య,చ్చోటు సూపెడువారు లేరె చూచెద వానిన్.

సీ. పడి యుండి వాఁ డిలఁ బొడిచినచందురు,క్రియఁ దత్తలము వెలిఁ గింపకున్నె
యే మని నాతోడఁ బ్రేముడించునొకో సు,భద్ర పుత్త్రునిఁ జూడఁ బడయకున్కిఁ
బగతురనిర్జించి మొగముపోటుల నొచ్చి,పొడసూపరాఁ డయ్యెఁ గొడుకు నాకు
నడలునఁ దల్లడపడియెడుద్రౌపది,వంత మాన్పింప నెవ్వారికి వశమె

తే. యని యలంతమైఁ బలుమాట లాడుచుండి
తలఁచి మఱియును ధర్మనందనునియాన
నంబు వీక్షించి నిర్జరనాథతనయుఁ
డెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్టు లనియె. 252

వ. సంశప్తకసమితితోడం దమకించి పోరి పోరి కౌరవసైనికులసింహనాదంబులు వింటి
నప్పు డెలుం గెత్తి యుయుత్సుం డాడినమాటల నాకర్ణించితి. 253

సీ. పెనఁగంగఁ జాలరు బీభత్సుతో మీరు, బాలుని నొక్కరుఁ బలువు రిట్లు
సంపితి రిది మీకు సంతోషకాలమే, యేద్దురుగా కార్య నేల చెప్పుఁడ
హరికి నర్జునునకు నప్రియం బొనరించి, బ్రదుకంగ వచ్చునే భవున కైన
నది. యట్టు లుండె నీయధికపాపముఫలం, బెట్లును జెఱుపక యేల తక్కు

ఆ. ననియె నివ్విధమున నరిసేనయోధుల, నతఁడు వలుక వీనులార వినియుఁ
దెలియ నైతి వాసుదేవుండు [2]వినియెన, యని తలంచి దాని [3]నంత గొనక. 254

క. మనుజాధిప తగుసమయం,బున నీ వెఱిఁగింపఁ గన్నఁ బొరివుచ్చునె వే
చనుదెంచి నీసుతుం బొదివి,వినయెడఁ దత్క్రూరయోధవీరుల నెల్లన్. 255

క. అని పలికి మఱియుఁ గొడుకుం, బనవుచు శోకమున మునుఁగుఫల్గునునిఁ దగం
దనకరములఁ బొదువుచు ని, ట్లను నారి చిత్తంబులోన నడ లూనంగాన్. 256

చ. ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకడ యిట్ల కాదె యే
మిటికి నలందురక మొనలు మేకొని యాయుధజీవనంబు నూఁ
దుటయు నెఱుంగవే రిపులఁ ద్రుంచి యశం బెల నించి పుత్త్రుఁ డె
క్కటి దివిచూఱకోల్ ప్రియమ కా కిది యప్రియమే తలంపఁగాన్. 257

ఆ. ఎఱుఁగ వలయు దాని నెఱిఁగి కోవిదుఁ డగు,నట్టినీకు వగవ నగునె పార్థ
నీదువంత సూచి నీవార లందఱు, దీను లైరి వీరిఁ దేర్పవలదె. 258

వ. వీరలం జూచి తగుమాట లాడు మనిన నత్యంతశోకాక్రాంతస్వాంతుం డగుచు

---

1 నే మనంగ ♦ రాద ; నేమి యెఱుఁగ ♦ రాద. 2 వినియు నే. 3 నంత గొనన.

సుభద్రాకాంతుండు గద్గదకంఠంబుతోడం దోడంబుట్టువుల కిట్లనియె. 259

చ. మనసిజమూర్తి యైనయభిమన్యునిమాటలు వీనులార నే
విన వలతుం దదీయమృతి వేడ్క నొనర్చినవారు గ్రక్కునం
జని తగ వానిఁ గాంచి సుఖసంగతి నైఁ జరియించునట్లుగా
ననిచెద నేఁటిపోరు పెలుచయం గలభంగియు మీరు సెప్పుఁడా. 260

వ. అని మఱియును. 261

చ. అలవుఁ జలంబు శౌర్యమును నస్త్రమహత్త్వముఁ గల్గునిండఱుం
గలుగఁగ నెట్లు సచ్చు బలఘస్మరుచే నయినం బ్రచండదో
ర్బలవిభవాభిరాముఁడు సుభద్రసుతుం డిది యెన్నిభంగులం
దలఁచినఁ బోల దేమిటికతంబున నామన మిట్టు లయ్యెనో. 262

క. మిమ్మును బాంచాలురఁ గడు, నమ్మి చెడితి వానిరక్షణమ్మునఁ బ్రౌఢ
త్వ మ్మిట్లు లేమి యెఱిఁగి, నెమ్మెయిఁ గాచికొన నేరనే యబ్బాలున్. 263

క. రథవితతి వఱపి మీ రవి,తథముగఁ గవియంగ మిమ్ముఁ దాఁకి కలఁచి యే
రథికులు సమయించిరి యరి, మథనభుజావిభవు నక్కుమారోత్తమునిన్. 264

వ. అని యంతకంత కగ్గలించునుమ్మలికంబునం గలంగి యంత నిలువక. 265

క. ఉక్కును నస్త్రబలము మీ, కెక్కుడియది సాల రైతి రిందఱు నని న
య్యొక్కరుఁ గావఁగ మీరీ,తక్కువ కోర్చితిరి మిమ్ముఁ దక్కన నేలా. 266

క. బలహీనులు సంగరభీ,తులు నగుమిమ్మెఱిఁగియెఱిఁగి తొలఁగి తనూజుం
దలఁపక యొంటి మెలఁగునెం,గలి నగునను దూఱుకొందుఁ గా కేమందున్.

తే. మానుసులువోలె నున్నార లేను లేని
తఱి మహాగుణశాలి నాతనయుఁ గాచి
కొనఁ గడంగర సింగారములకుఁ గాక
మఱువులును గైదువులు మీకు మానమునకె. 268

వ. అని భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగువారం గ్రోధశోకంబులు మనంబునఁ బెనంగొనం గన్నీ రొలుక నూరకున్న నెల్లవారు నతనికి మాఱుపలుకను దేఱి చూడను వెఱచి యుండి రప్పు డచ్యుతుం డొక్కరుండు నను నయాలాపంబులం దేర్చుచుండం బాండవాగ్రజుండు గుపితాఖండలనిభుం డగు నాసవ్యసాచితో సాంత్వనస్వరంబున నిట్లనియె. 269

ధర్మరా జర్జునుని కభిమన్యుండు సచ్చినవిధంబు సెప్పుట.

సీ. అనఘ సంశప్తకహననంబునకు నీవు, నసని నొడ్డన మేర్చికొని కడంగి
నడచి ద్రోణునిఁ దలపడితి మప్పుడు మో,హర మేము సొరఁజాల మైతి మనఁగ
నేల తద్బాణార్చు లేర్చిన నక్కడఁ, దేఱి చూడను లేక త్రిప్పికొంటి
మమ్మొన భేదింప నభిమన్యుఁ డోపుఁ బో, మ్మనియెడుతలఁపు నా కపుడు పుట్టె

శా. ఆగ్నేయాస్త్రము ద్రోణుఁ డేసిన సముద్యజ్జ్వాలికామాలికో
ద్విగ్నం బయ్యె నభంబు వారుణశరావిర్భావముం జేసెఁ గ్రో
ధాగ్నిస్ఫూర్తి వెలుంగ నాశినివరుం డబ్బాణముల్ ద్రాసని
ర్మగ్నవ్యోమచరంబులై తొడరి పోరం జొచ్చె నొండొంటితోన్. 138

క. ఘోరంబు గాఁగ హాహా,కారము లెసఁగంగ బలయుగంబును దయ్యం
బోరి పెడఁబాసి శాంతము,లై రెండును నిలిచె నమ్మహాస్త్రము లధిపా. 139

వ. ఆసమయంబున ధర్మజభీమనకులసహదేవులు శైనేయునకు బాసటయై తఱిమిన ధృష్టద్యుమ్నప్రముఖరథికవరులుం దళుకడఁచి భారద్వాజుం దాఁకుటయు దుశ్శాసనుము న్నిడికొని మనదిక్కు రాజకుమారవర్గంబు వారలతోఁ దలపడిన నుభయబలంబులుం బురికొని యోహరిసాహరిం బెనంగుచుండె నప్పు డక్కడ. 140

క. నరుఁడు దన తేరు వోయెడు, తెరువున [1]కైనంతసేనఁ దీవ్రాస్త్రములన్
ధరఁ గూల్పఁగ నయ్యెడ న,య్యరదముఁ గృష్ణుండు వఱపుటద్భుత మయ్యెన్.

వ. ఇవ్విధంబున రౌద్రరసంబు దళుకొత్త దర్పంబున సైంధవుం డున్నదిక్కునకుం బోవం బోవ. 142

విందానువిందు లర్జునుచేత మృతిఁ బొందుట.

క. విందానువిందు లేక,స్యందనగతులై కడంగి సైన్యంబులుఁ దా
రుం దెప్పదెరల నాసం,క్రందననందనునిమీఁదఁ గవిసిరి గడిమిన్. 143

వ. ఇట్లవంతీశ్వరు లురవడించి. 144

చ. హరులపయిన్ మురారిపయి నాతనిమేనను బాణవర్షముల్
గురిసి రతండు వారి నతిఘోరశరంబుల నొంప ధీరతం
దెరలక వారుఁ దద్రథముఁ దేల్చిరి తూపులవెల్లి నల్గి య
య్యిరువురవిందులుం దునిమి యేపున మూఁకలపెల్లడంచుచున్. 145

క. తోడన కడువేగంబునఁ, గ్రీడి తురంగముల సూతుఁ గేతనమును దు
న్మాడుచు విందునితల యిల,పై డొల్లఁగ నేసెఁ దీవ్రభల్లప్రహతిన్. 146

వ. ఇట్లు దల దునుముటయు బలుగాలిం గూలుతరువుపోలికిం బడినయగ్రజు నాలోకించి యనువిందుం డలుకయు నుమ్మలికంబు నుల్లంబునం బెనంగొన గద గొని సంరంభంబున. 147

చ. అరదము డిగ్గి తీవ్రగమనాతిశయంబునఁ గిట్టి బాహువి
స్ఫురణ దలిర్ప దానవనిషూదనుఫాలము వ్రేసి యార్వ ను
ద్ధురరభసం బెలర్ప గదఁ ద్రుంచి పదంబులు బాహుశాఖలున్
శిరమును ద్రెంచి వాని బలి సేసె ధనంజయుఁ డాజిభూమికిన్ 148

ఆ. దొరలు వడిన సేన దూలక యవ్వీరుఁ, జుట్టు ముట్టుటయును బెట్టు గవియు

1 నున్నంత సేన. 2 దూలుతరువు.

కాలుచిచ్చు దఱచుఁ[1]గానల నీఱుగఁ, జేయుపగిదిఁ దోఁపఁ జేసె నతఁడు. 150

వ. ఇవ్విధంబున.

సీ. అచ్చోటు గదలి వివ్వచ్చుండు సనఁ జన, నతనిమైవాడును హయచయంబు
డప్పియు నతనికి నప్పుడు సైంధవుఁ, డున్నెడ దూర మై యుండుటయును
గని సంతసము నొంది కౌరవయోధులు, సింహనాదంబులు సేసి తఱుమ
సారథికోత్తముఁ డచ్యుతుఁ జూచి రథ్యమ్ములు మేనుల నలుఁగు లుండ

తే. నురవడింపవు వీరల నరకు గాన
వీని నిప్పుడ యట్టులు విడిచి తడవు
మనుడు నతఁ డిది వోలున యనుడుఁ దేరు
డిగ్గి సారించెఁ గ్రీడి గాండీవగుణంబు. 151

చ. ఎడ గని యబ్బలంబు గడు నేడ్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రము
ల్గడువడిఁ గుప్పఁగూరగఁ జలంబునఁ బైఁ దొరఁగింపఁ జేచి క
వ్వడి వివిధోజ్జ్వలాస్త్రముల వాని వెసన్ మగిడించి తాఁకుఁ పె
ల్లడరఁగఁ జేసె మింటికల యంతయుఁ [2]జిట్టలు గట్టుమంటలన్. 152

వ. ఇత్తెఱంగున. 153

క. లావును వెరవును దెలియఁగ, నీవీరులు పాండుపుత్త్రునిం బొదివినచో
నావీరునియక్కజ మగు,లావు వెరవుఁ గరతలామలక మై తోఁచెన్. 154

వ. అట్టియెడఁ జతురంగంబులు. 155

క. నొచ్చినఁ జచ్చినఁ దెరలిన, విచ్చిన నయ్యెడరు సూచి విసువక పైపైఁ
జొచ్చినఁ గడుఁ గ్రిక్కిఱిసిన, నచ్చట మనసేనలోన నార్పులు వెడలెన్. 156

వ. ఆఫల్గునుండు పాదచారి యై యునికిం దేఁకువ సెడియును గెలుపున కాసపడి యును నిట్లు గ్రమ్మినకౌరవసైన్యంబు పొంగినసముద్రంబుపోలిక యగుటకుం దగినతరంగంబులచందంబున నిగుడుశరపరంపరలవలనను ఘోషంబుచాడ్పునం జెలంగుతూర్యనాదంబులవలనను వివిధసత్త్వంబులవిధంబున నుల్లసిల్లుమాతంగ తురంగసుభటస్యందనసందోహంబులవలనను జలియింపక చెలియలికట్టయుం బోలె నవి నిలువరించి యవ్విక్రమకుతూహలి విజృంభించిన. 157

సీ. పటుభల్లనికరంబు పరఁగినఁ బఱియ లై, యఱవఱ లయ్యెడు నరదములును
నానార్ధచంద్రబాణవ్రాత మడరినఁ దునియ లై మేదినిఁ దొరఁగుకరులు
శాతనారాచపుంజంబులు నిగిడినఁ, గుదురు లై కూలెడుఘోటకములు
వివిధాస్త్రతతులు వర్వినఁ గండ లై వండఁ, దఱిగిన ట్లుండుపదాతిచయము

తే. నగుచు బీభత్సరౌద్ర[3]మహాద్భుతములు

---

1 గాన నీఱుగఁ జేయు,పగిదిఁ దోఁపఁ జేసి ♦ నిగిడె నతఁడు. 2 జిట్టలు-జంటలు - గట్ట మంటలన్. 3 భయానకములు.

మూ_ర్తిమంతంబులుగ మన౯ మొనలు ర_క్త
మాంసమేదోస్థిమ_స్తిష్క౯మయతఁ జూడ
ఘోరరూపంబు లై [1]పరిక౯క్షోభ మొందె. 158

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్నకవ్వడిం గనుంగొని కమల
నాభుండు. 159

క. పెఱికితి నలుఁగులు మేనులు, నెఱిఁ బడ నెల్లెడలఁ గలయ ౯ నివిరితి హరు లి
త్తఱి నీళులు ద్రావక తె,ప్పిఱ వెట్లొకొ శత్రుసైన్య౯భీకరమూ_ర్తీ. 160

క. వెన్ను మునుఁగఁ దివియఁగ లే,కున్నను ద్రావఁ దగునీళు ౯లాదవిన హయముల్
నిన్ను గెలిపించు ననవుడుఁ, గన్నుల నగి యర్జునుండు ౯ గల విడె యనుచున్.

మ. ధర దివ్యాస్త్రహతిం బగిల్చి ౯కొల నుత్పాదించి వే దానికి
న్శరజాలంబుల రెల్లు గట్ట మనసై౯న్యంబుల్ వెఱం బొందె న
చ్చెరు వందెన్ సురసంఘముల్ హరి నుతిం౯చెం బొంగి యప్పార్థు భూ
వర మున్నిట్టివి సూడరున్ వినరు నె౯వ్వారుం ద్రిలోకంబులన్. 162

తే. హర్షమందస్మితముతోడ ౯ నమ్మురారి
యపుడ హయముల మెయి వెట్టు౯నట్లు సేసి
[2]తఱిమి నీళులు ద్రావించి ౯ తడవి మగుడఁ
దెచ్చె మనయోధు లెల్లను ౯ బిచ్చలింప. 163

వ. ఇట్లు సేద దేర్చి. 164

క. మును దివ్యాస్త్రబలంబున, జనియించిననీరితోన ౯ సంభూతం బై
యొనరినఖాణము మేపెం, [3]దనివు సనం దురగములకు ౯ దర్ప మెలర్పన్. 165

వ. మేపి కట్టాయితం బయి మనమూఁకలనడుమం బడంతులపిండులోనం గ్రాలెడు విలాసియుంబోలె విలసిల్లుచు నమ్మహనీయరథ్యంబులం బూన్చినఁ బాండవమధ్యముం డారథం బల్లన యెక్కె నాతడవున దుర్యోధనుం డనతిదూరవ_ర్తి యై వారలం గని వేగంబున వచ్చుచుండె వార లక్కడ చూడ రయ్యవసరంబున నచ్చటిభూవల్లభు లెల్ల వెల్ల నైన మొగంబులతోడ వెఱఁ గంది డెందంబులు గుందుచుండం దమలో ని ట్లనిరి. 166

మ. చతురంగంబులు నొక్కపెట్ట వివిధా౯స్త్రజ్వాలలం గప్పఁగా
నతివేగంబున [4]మ్రింగెఁ గ్రోలె ఘనమా౯ర్యన్ రూపడంగించె నా
నితఁ డన్నింటిని రి_త్త పుచ్చుచు మదం ౯ బేపార నిమ్మై రణ
క్షితియుం బీనుఁగుపెంటఁ జేసెఁ జెనయం ౯ జెట్టాడఁగా శక్యమే. 167

సీ. కురుసేన పైఁబడ్డ ౯ సరకు సేయక మంచు, విరియించుభానుని౯వెరవు మెఱసి
యిది నమ్మగల నని ౯ యుంచుక గొంకక, తనఘోటకంబులఁ ౯ దడవఁ బనిచి

1 భయక్షోభ. 1 కడఁగి. 3 దనివుగ నత్తురగ. 4 మ్రింగఁగోరి.

కోల నక్కజంబుగ । నలుఁగులమైన ఘటిఁ, యించి యమ్ముల దాని । కిల్లు గట్టి
సారథి లీల నశ్వములకార్యము దీర్చు, నంతకు నవ్వుచు । నవుల నిలిచి

ఆ. గారవమునఁ దాను । గానివాఁడునుబోలె, నరద మెక్కె నింక । నడ్డపడఁగ
నలవిగే పురారికైనను వీనిచేఁ, జచ్చువాఁడు గాక । సైంధవుండు. 168

వ. అనుచు నీయోధవీరు లందఱును బెండువడి యుండిరి గాని యందు నొక్కం డేని
యు నుక్కున మార్కొనువాఁడు లేఁ డయ్యె నట్లు గోపాలదేవుండును గ్రీడియు
బాలక్రీడవిధంబుగా విహరించి యనాయాసగమనవిలాసంబు మెఱయం జని చని
ప్రొద్దు వాలుట గనుంగొని పాంచజన్యదేవదత్తంబు లొత్తి రయంబు గైకొని
యరిగి రాచక్కటిం గొందఱు నరపతు లొండొరులం బురికొల్పికొని యడ్డపడి
[1]తవులు వెట్టి బెట్టు పెనంగి సముద్రంబు సొచ్చినవేఱులుంబోలె నడంగి రట్లు
సైన్యంబు గడచి బలితంపువల ద్రచ్చికొని వెలువడినమహామత్స్యంబులును
రాహుముఖంబు వెడలినచంద్రార్కులుంబోలెఁ బొలిచి యట వోవుచుండ
నయ్యెడ సైనికులు సింధురాజుపని సాలించి తొలంగి రిత్తెఱంగున దుస్తరంబులగు
బహుళబలంబుల నిస్తరించి యయ్యిరువురుం దల లెత్తి చూచి తమలో నిట్లనిరి.

ఆ. వీఁడె సైంధవుండు । వీనిచుట్లను నృప, శల్యగురుతనూజ సౌమదత్తి
కర్ణకర్ణసుతులు । గావలి యున్నారు, పోటుమగలు గాన । పూఁచి పట్టి. 170

వ. అని పలికి వారలలో నాజయద్రథుం దప్పక చూచి వెండియు. 171

క. వీ రేమి గాచెదరు తా, నేరూపున బ్రదుకు వీర । లేల సురలు జం
భారియుఁ గాచినఁ దన్నును, బారిసమరి కాక నింగిఁ । బడ నిచ్చెదమే. 172

క. అనుపలుకులు నీయోధులుఁ, దనయులు విను చుండ ఘోరశతరదుర్గము లె
ల్లను గడచి లాభదేశము, సనఁ జొచ్చినవణిజులట్ల । సమ్మదలీలన్. 173

వ. ఒప్పినయప్పురుషసత్తములం గనుంగొని యారథికజనంబులు విస్మయంబునం
దమలో నిట్లనిరి. 174

తే. పెక్కునదు లీఁది వెడలుట । పేర్చుదాన, శిఖలు గడచుట దారుణాశీవిషముల
బారి దప్పుట గాదె కుంభజముఖోగ్ర, శూరయోధుల మిగిలి వచ్చుట దలంప.

వ. అనుచు నాకృష్ణుల నుపలక్షించి. 176

క. గురుముఖబహురథికశరో,త్కరములచే నైనక్రొత్తగంట్లను సుమనో
భరితనవకర్ణికార, స్ఫురితాచలయుగముభంగిఁ । బొలిచిరి చూడన్. 177

క. అని యగ్గించుచు సింధువి,భునిదెస విగతాశు లైరి । భూవల్లభ య
వ్వనజాక్షు లెఱ్ఱసెర లొ,ప్ప నతని వీక్షించి యార్చి । బరవస మలరన్. 178

కవచధారణంబున దుర్యోధనుం డర్జునుతోఁ దలపడుట.

వ. కడంగి రంతఁ గురుపతి గూడ వచ్చి కుంభసంభవకృతం బగుకవచంబుకతంబున

---

1 తవులువడ- తడవు పెనఁగి.

భయంబు దక్కి బలంబునకుం దలకడచి తనరథంబు జయద్రథుం డున్నదిక్కున
కడ్డంబుగాఁ జొచ్చిన నతనిసూరెల నున్నవీరలోకంబు ముదంబున సింహ
నాదంబులు సేయ శంఖభేరీస్వనంబులు సెలంగం దమ తేరికిం గట్టెదురై నిలిచినం
గని కృష్ణుండు గ్రీడి కి ట్లనియె. 179

క. ఆపద ముట్టినయెడ ని, ట్లేపారఁగ వలదె రథికుఁ డీతఁడు శశ్వ
త్కోపోద్దీప్తుఁడు మాదెసఁ, జాపకళావేది దర్పసంపన్నుండున్. 180

క. గోమునఁ బెరిఁగినవాఁడు మ, హామానోదగ్రచిత్తుఁ డట్లగుటను సం
గ్రామంబున కలుకం డు, ద్దామభుజావీర్యదుర్మదస్ఫురితుండున్. 181

క. మనకును నితనికి సైంధవుఁ, డనునొడ్డున నయ్యె జూద మధికౌద్ధత్యం
బున గెలువుము చిరకాలము, మనమున రారాజునలుక మ్రండింపు తగన్. 182

ఉ. ఈతఁడు మీకు నాపదల కెల్లను మూలము ధర్మపుత్త్రు దు
ర్ద్యూతమునం బరాభవము నొందఁగఁ జేసినపాపనిశ్చయుం
డాతరుణీలలామమున కమ్మెయి భంగ మొనర్చె వీఁడు నీ
చేతులలా వెఱుంగఁడు విశిష్టశుభం బిది నీకు ఫల్గునా. 183

క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట, [1]యెఱుకువమై మనకు దైవ మిచ్చినసిరి యి
ట్లెఱిమినయీలో గ్రక్కున, నఱకు మితఁడు దెగిన మనమనగపీడ దెగున్. 184

మ. వెరవే సంపదఁ గోరి గాండివగుణావిర్భూతబాణాలికి
ల్లెర యై వచ్చుట యిమ్మహీపతి కితం డే లొక్క యత్యంతని
ష్ఠురశౌర్యోన్నతి నిన్నుఁ దాఁకఁ దలఁపం జోద్యంబు వీఁ డగ్గమై
దారకో లగ్గున నీకుఁ దొంటిసుకృతస్తోమంబు కల్మిం జుమీ. 185

క. ఇతఁడు వడినఁ బ్రజ విచ్చును, ధృతి సైంధవుఁ డెఱిమెనేనిఁ దెగు నాతం డు
ద్ధతి విడిచి పాఱిపోయినఁ, బ్రతిన కదియ చాలుఁ గడఁగు పటుశౌర్యనిధీ. 186

వ. అని పెక్కుభంగులం జెప్పిన విని విప్వచ్చుం డచ్యుతు నాలోకించి. 187

ఉ. ద్రౌపది వడ్డబన్నము లుదగ్రత మేదినిఁ బెద్దకాల మి
చ్ఛాపరతంత్రుఁ డై తనపశంబుగఁ జేసినవీనిగర్వముం
గోపము వెంప దే మనము గుందఁగఁ జేయదె యింత సెప్ప నే
లా పొరిగొందు నీతనిఁ జలంబు బలంబును నీవు మెచ్చఁగాన్. 188

ఆ. ఒరులదిక్కు సనక యరదంబు నీతని, యున్నయెడకు నడపు మన్న నతఁడు
నట్ల చేయఁ దనకు నభిముఖు లై వచ్చు, వారిఁ జూచి మనుజవల్లభుండు.

క. మనమునఁ గొంకక యెదురుగఁ, జనియె నిజోద్ధతికి మెచ్చి జనపాలకు లె
ల్లను బిచ్చలింప సేనా, నినదం బెసఁగంగ ఘోరనిష్ఠురవృత్తిన్. 190

క. తముఁ బిలుచుచు నిష్వధమున, సమదాటోపగతి నడరుజనపతిఁ గని చి

1 యెఱుఁగమిఁ దా.

త్తము లలర నార్చి నిజశంఖము లొత్తిరి శార్ఙ్గధరుఁడు గాండివధరుఁడున్. 191

చ. ఎలమిఁ జెలంగుకృష్ణులయహీనసముద్ధతిఁ జూచి శోకవి
హ్వలు లయి మానవేంద్రుదెస నాసలు మాని మృగంబు భ్రాంతి ను
జ్జ్వలదనలంబులోఁ నుఱుకుచందముగాఁ గొని నీదుయోధవీ
రు లకట చచ్చెఁ జచ్చె నని ప్రోయఁగ నాతఁడు వారి కిట్లనున్. 192

క. భయ మేటికి వినుఁడు ధనంజయునిం గేశవుని నాదుశరకీలాసం
చయమున నేర్చెదఁ బేర్చెద, నయనానందంబు మీకొ పర్చెదఁ గడిమిన్. 193

వ. అని పలికి పార్థుం గనుంగొని యవష్టంభంబున. 194

దుర్యోధనుఁ డర్జునుం దలపడి యధిక్షేపించుట.

చ. వినుము కిరీటి దివ్యశరవేదివి నాఁ జను దేను లేనిచో
టను మును సెల్లె నీకు నిచటం జన నిత్తునె యిప్డు నీబలం
బును హరినేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి నీవు పాండురా
జునకు జనించితేనిఁ దెగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్. 195

వ. అనుచుఁ గ్రూరంబు లగుమూఁడునారాచంబుల నన్నరు నేసి శరచతుష్టయం
బున హయంబులు నొప్పించి పదిబాణంబులు పద్మనాభునురంబునం గ్రుచ్చి
మునికోల యొక్కకోలం దునిమినం గినిసి క్రీడి యాతనిపైఁ జతుర్దశనిశిత
ప్రదరంబులు వరఁగించిన నవి యమ్మహీపతిమైమఱువు దాఁకి మిట్టిపడుటయుం
జూచి తొమ్మిదిదూపులతోడఁ బంచాశుగంబులు నిగిడించిన నవియు నిష్ఫలంబు
లగుటయు నిరువదెనిమిదిబాణంబు లడరించె నవ్వాలమ్ములు నట్టయిన వమ్మైన
విషాదంబున వాసుదేవుండు వాసవి కిట్లనియె. 196

క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది గా దమ్ము లెడలె గాండీవములా
వు న్నీభుజములశక్తియు, మిన్నక పోఁ జిత్ర మిది యమిత్రధ్వంసీ. 197

ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు నాకర్షణ, గాఢతయును బాణగతియుఁ దొంటి
యట్లొ యొండుభంగి మైతోఁచెనో నాకు, నున్నరూపు సెప్ప వన్న పార్థ.

చ. పిడుగులయట్ల తాఁకి రిపుబృందములం దెగటార్చు నాజి నె
ప్పుడు భవదీయదివ్యశరపుంజము [1]లొక్కట నిపు పొల్లు వో
యెడు నిది నీవు నిమ్మతివిహీనపుజంతువు నేమిసేట్లకుం
జెడుటకు నొక్కొ విస్మయము సెందెదు డెంద మలంతఁ బొందెదున్. 199

వ. అని యిట్లు దన్ను నిందించుకొనుచు గోవిందుం డడిగినం బురందరనందనుం
డతని కిట్లనియె నిది యొక్కకవచధారణంబు మున్ను ద్రోణుఁ డొక్కరుండ
యెఱుంగుఁ బదంపడి నాకు నెఱింగించె నిప్పుడు సుయోధనుండును నెఱుంగు
తెఱంగు గావించెం గావలయు నిమ్మెయి మైమఱువు త్రిలోకంబుల కభేద్యం బగుట

[1] లక్కట యిప్డు.

యు నీవు నెఱుంగుదు వెఱిఁగియు నన్నడుగ నేల భువనత్రయంబునందును
వస్తుప్రకారంబులు నీయెఱుంగనియవియుం గలవే యది య ట్లుండె నితండు
దీని నగ్గురుకరుణం బడసినవాఁ డై. 200

క. విను మాఁటదివో లెం దన, తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచికొన్నాఁ
డనఘ యిటులైన నెట్లగు, నని యెఱుఁగఁడు దీనివిధముఁ గలన్నియుఁ దెలియన్.

క. నావింటిబలువుఁ జేతుల, లావును జూడు మిదె నీతఁ గలం కుడుగఁగ నే
నీవిభునిఁ గపచరక్షితుఁ, డై విలసిల్లంగ నీక యలఁచెదఁ గృష్ణా. 202

వ. అంగిరసుం డమరపతికి నొక్క మహాస్త్రం బిచ్చె దాని నతండు నా కొసంగె నది
నిఖిలకవచనిర్భేదనశీలం బై యుండు దాన నిమ్మెయిమఱు వఱువుల్లు సేసెద. 203

క. అని వెస నాదివ్యశరం, బనూనమంత్రప్రకాశ మగునట్టులు గా
గొనయమునఁ జేర్చి తిగిచినఁ, గని యశ్వత్థామ బాహుగర్వం బలరన్. 204

తే. అధిప సర్వాస్త్రఘాతి యై యతిశయిల్లు
నస్త్రమునఁ జిత్రముగఁ దెగకయంద తునిమె
నమ్మహాస్త్రంబు న ట్లది వమ్ము గాఁగ
నెఱిఁగి వెఱఁ గంది హరి కతఁ డిట్టు లనియె. 205

వ. ఆచార్యపుత్త్రు నస్త్రప్రభావంబున నవ్విశిఖంబు వినిహతం బయ్యెఁ బునఃప్రయో
గంబు సేసిన నది యొప్పమి సేయు నని వింటి నావింటిబలిమిన సాధించెదం
జూడు మనునవసరంబున నయ్యిరువురను దుర్యోధనుండు. 206

క. తొమ్మిదితొమ్మిదివాలిక, యమ్ముల ము న్నేసి పటుశరాసారము పైఁ
గ్రమ్మించిన మన దెసఁ దూ, ర్యమ్ములునుం గీర్తనములు నార్పులుఁ జెలఁగెన్.

ఆ. అలిగి యవుడు గఱచి యన్నరుఁ డానృపు, తురగములును సూతుఁ గదునిమ్మి నైచి
రథము నఱికి యధికరయమునఁ దఱుచుగ, నాఱెఁ గరతలముల నారసములు.

వ. ఇట్లు విరథుండును వికలహస్తుండును నై విషణ్ణుం డగునన్నరనాథుండు వెడం
గగుటం గటకటంబడి యాకంకటంబు నిష్ఫలం బనుబుద్ధిం బుచ్చి వైచి యొం
డొకకవచంబు దొడిగె నయ్యెడరు గనుంగొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు
చతురంగబహుబలంబులతోఁ గవిసి కవ్వడిం జుట్టి ముట్టి యలుఁగులసోనలు
గురిసిన నతండు సంరంభవిజృంభితుం డగుటయు. 209

చ. అటిముటఁ ద్రెళ్లెఁ దేరులు గజావళి గూలెఁ దురంగమాంగము
ల్గిటికొనియొ మహిఁ భటులు లెక్కకు మిక్కిలి సేన పాడుగా
నఱు మయి రప్డు కృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం
దఱచు గ నొత్తె నిర్మథితదానవసైన్యముఁ బాంచజన్యమున్. 210

తే. అట్లు భీషణ మగునర్జునాక్రమంబు, ఘోర మైనమురారిశంఖారవంబు
నధికభయసంభ్రమంబుల నావహింప, నధిప నలుగడఁ బఱచె సైన్యంబు గలఁగి.

వ. ఇత్తెఱంగున. 212

క. మును సంకటపడి మూఁకలు, గనుకని విచ్చుటయుఁ బిదపఁ గాండివి మెఱసెం
బొనుఁగుపడి యుండి తగుగా,డ్పున మండుమహానలంబుఁ బోల్కి మహీశా. 213

వ. అయ్యవసరంబున సింధురాజరక్షకం బైనబలంబు సంక్షోభసహితం బగునుత్సా
హంబునం బొదలి శంఖభేరీపణవాదిక్వణనమేదురసింహనాదభరితరోదసీకుహరం
బయ్యె నచ్చిడిముడిపడుట యవలోకించి. 214

క. మందస్మితసుందరవద,నేందు లగుచు హరియు నరుఁడు నే త్తెఱఁ బ్రియముల్
డెందములం బొంద భవ,న్నందనుపై నురవడించిరనం గని కడఁకన్. 215

వృషసేనుండు లోనగునెనమండ్రు రథికు లొక్కపెట్ట యర్జునుపైఁ గవియుట.

క. వారలఁ బొదువ నడరుబలు, తేరులమొత్తముల మిగిలి దీప్తపటురథో
దారు లగుచు నెనమండ్రురు, వీరులు దఱిమిరి నితాంతవేగోజ్జ్వలు లై. 216

వ. వా రెవ్వ రెవ్వ రం టేని. 217

క. దండిమగ లైనవృషసే,నుండు శలుఁడు సైంధవుండును గృపుఁడును గ
ర్ణుండు గురునందనుఁడు శ,ల్యుండును భూరిశ్రవుండు నుర్వీనాథా. 218

వ. అందఱు నొక్కమొగం బై. 219

క. తన దైనప్రతిన నెఱపుట,కును ముఖ్యోపాయ మది యగుట నట్లు సుయో
ధనుఁ బరిమార్పఁ గడఁగుఫ,ల్గునుఁ దలపడి రాత్మశంఖఘోషంబులతోన్. 220

క. అట్టియెడ దేవదత్తము, బిట్టొత్తె నరుండు పెక్కుపిడుగుల మ్రోఁతల్
బెట్టు వఱుచుతన్నినదము, వుట్టించెను దిగులు నీదుపుత్త్రకుసేనన్. 221

తే. చెవులు బీఁటలువాఱంగఁ జెలఁగునమ్మహారవమ్మున కులుకక యతనిమీఁద
విభుఁడుఁ గర్ణాదులును శరవృష్టి గురిసి, రడరి సైంధవుదిక్కున కడ్డపడుచు. 222

వ. ఆసమయంబున నశ్వత్థామ యుబ్బి డెబ్బదిమూఁడుమార్గణంబుల మురవైరిని భల్ల
త్రయంబునం బార్థుని నైదుశరంబులం దురంగంబులం గేతువు నేసిన నవ్వాసవి
యతని నూటయాఱింటను గర్ణునిఁ బదింటను వృషసేనుని మూఁటను నొప్పించి
యొక్కకత్తివాతియమ్మున శల్యుచాపంబు ముష్టికిం ద్రుంచిన. 223

సీ. వేగంబ వే ఱొక్కవిల్లు గొని మద్రేశుఁ, డతనిపైఁ దొమ్మిదియమ్ము లేయ
ముప్పదిరెంటను మూఁట నేనింటను, బదియింట నఱువదిబాణములను
గర్ణభూరిశ్రవకర్ణనందనకృప, గురుపుత్త్రు లేసి రన్నరుని మఱియు
నాతనిమీఁద దివ్యాస్త్రంబు లైదు గో,విందుమై సప్తతివిశిఖములును

తే. ద్రౌణి నిగిడించె నట్టిసందడి జయద్ర,థుండు వారలమఱువున నుండి పఱపె
సరభసముగఁ ద్రిసప్తతిసాయకంబు, లమ్మహాబాహుదెసఁ గౌరవాధినాథ. 224

వ. ఇట్లు పెక్కండ్రొక్కపెట్ట పై నేసినం గినుక నూనిననవ్వు రౌద్రరసంబు
నలంకరింప. 225

క. వడి రాధేయుని నాతని, కొడుకును బంద్రెంట మూఁటఁ గుదియించుచుఁ గ
వ్వడి యొకబలుతూపున నె, క్కుడురయమునఁ దునిమె శల్యుకోదండంబున్.

ఆ. తునిమి తోన యతనిఁ దొమ్మిదియమ్ముల, స్రుక్కఁ జేసి మూఁట సోమదత్త
తనయు నెనిమిదింట ద్రౌణిని నిరువదే, నింటఁ గృపుని నొంచి నిలువరించె.

వ. మఱియు నిరువదిమెఱుంగువాలమ్ము లశ్వత్థామయంగంబునం గ్రుచ్చె నిట్లందఱ
తోడను గ్రందుకయ్యంబు సేయుసమయంబున నొక్కొక్కమరి వారిపిఱుంద
[1]నోరవాఱం దోఁచుజయద్రథు నేయం దీఱకున్నం దమకంబున నెడనెడ నఱిము
ఱిం దద్రథంబుదెసకు నతఁడు వాఱ విడిచినవిశిఖంబులు నూఱు గల వప్పుడు
భూరిశ్రవుండు వాసుదేవునిచేతిమునికోల నొకకోలం దునిమి కదిసి క్రీడిమేనం
ద్రిసప్తతిశరంబులు వఱఁగించెం దక్కటివారును నొక్కమొగిం గ్రూరనారాచం
బులు గుప్పించి నొప్పించిన. 228

శా. కోపాటోపమహోగ్రమూర్తి యగుచుం గోదండటంకారలీ
లాపూర్ణంబుగ భూనభోంతర మతం డయ్యోధులన్ బాణజా
లాపాతంబునఁ దూల నేసి చటులవ్యాపారఘోరానిలా
క్షేపక్షోభితవారివాహచయభంగిం జూపె నే పారఁగాన్. 229

వ. అట్లు విచ్చియుం గూడికొని మూఁకలం గూర్చికొని యొండొరులం బురికొల్పికొని.

క. ఆరథికు లొక్కమొగి న,వ్వీరునిపైఁ గవియుటయును విస్ఫురితశరా
సార మతఁడు నిగిడించిన, వారిబలము లెల్ల రక్త[2]వారిం దేలెన్. 231

వ. ఇత్తెఱంగునం దెరలుచుం బొదువుచు భవదీయసైనికలోకంబు వోక పెనంగె
ననిన విని యప్పు డేమేమియడియాలంబులతో నెవ్వరెవ్వరిసిడంబులు మెఱసి
యుండె నని యాంబికేయుం డడిగిన సంజయుం డిట్లనియె. 232

సీ. ప్రస్ఫురద్వానరపతియును సింహలాం, గూలంబు నుజ్జ్వలగోవృషంబు
వారణకక్ష్యయు భూరిమయూరంబు, సీతయుఁ గాంచనసింధురంబు
రత్నయూపంబును రజతవరాహంబు, నుద్దీప్యమానమహోరగంబుఁ
గేతనంబుల నొప్పఁ గ్రీడికి నాచార్య, సుతునకుఁ గృపునకు సూతజునకు

తే. నతనినందనునకును మద్రావనీశ్వ, రునకు శలునకు భూరిశ్రవునకు సైంధ
వునకు రారాజునకు నిట్లు దనరి మెఱయుఁ, బదిసిడంబులు నభమునఁ బ్రభలు నిగుడ.

క. మనతొమ్మిదిసిడములకం, టెను నుజ్జ్వల మగుచు నొక్కటియ పెక్కై మెం
దును దాన తోఁచు నయ్యా, ర్జునుసిడము మహోగ్రతం గురుక్షితినాథా. 234

తే. అనుడు నమ్మేదినీశుఁ డిట్లనియె నట్లు, గ్రీడి విస్మయావహరణక్రీడ సలుప
గురునిదర్పంబుచే నాఁకగొనినధర్మ, సూనుసైన్యంబు లెట్లయ్యె సూతతనయ. 236

వ. అనుటయు సంజయుం డతని కిట్లనియె.

---

1 నరవాఱం. 2 వారిధిఁ.

క. అయ్యెడ ఖేచరులకు వెఱఁ, గయ్యెడుచందమున నట్టిశయవసరమున బ
ల్కయ్యము గురునిబలములో, నయ్యె యుధిష్ఠిరబలోచ్చయంబున కధిపా. 237

వ. ఆసంకులసమరంబున బృహత్క్షత్త్రుని క్షేమధూర్తియు ధృష్టకేతుని వీరధన్వుం డును నకులుని వికర్ణుండును సహదేవుని దుర్ముఖుండును సాత్యకిని వ్యాఘ్ర దత్తుండును దలపడిరి శల్యుండు సేనాముఖంబునకు వచ్చుచుం బోవుచున్నవాఁ డగుట నుచితంబుమెయి నచ్చటియనికిం జొచ్చి ద్రౌపదేయులం దాఁకె భీమ సేనుని నలంబుసుండును ధర్మనందను నాచార్యుండును మార్కొని రప్పు డ య్యుధిష్ఠిరుండు. 238

ధర్మరాజు ద్రోణునితో యుద్ధము సేసి యోడిపోవుట.

క. గురుమెయిఁ దొమ్మిది సునిశిత, శరముల నినుచుటయు నతఁడు సక్రోధుం డై
యిరువదియేనిట నాతని, యురస్థలము నొంచి పొదివె నుగ్రాస్త్రములన్. 239

క. రథమును నశ్వమ్ముల సా, రథిఁ దన్నును గప్పుశరపరంపర లెల్లన్
వృథ సేసెం గరలఘుతా, ప్రథితుం డగుధర్మసుతుఁడు బాణౌఘములన్. 240

చ. అలిగి గురుండు ధర్మజుశరాసన మేడ్తెఱఁ ద్రుంచి పెక్కు ల
మ్ముల సతురంగసూతముగ ముంచె రథం బది యెల్లఁ జూచి సే
న లతఁడు వేర్చె నిమ్మనుజనాథుఁడు సచ్చునొ యోడి పాఱునో
బలిమిఁ దొఱంగి పట్టువడి పా డటె పోవునొ యంచు నున్నెడన్. 241

క. ఒండొకవిలు గొని ధర్మను, తుం డానిబిడాస్త్రసంతతులు రయముమెయిన్
ఖండించి తీవ్రరశ్ముల, మండెడుఘనశక్తి వైచె మార్తురు దలఁకన్. 242

సీ. శక్తి యాచార్యునిశక్తి మాయించుఁ బొ, మ్మని చూప తెల్లను నల్బు లెత్తి
రక్కుంభసంభవుఁ డపుడు బ్రహ్మాస్త్రప్ర, యోగంబు సేసిన నుగ్రభంగి
నయ్యస్త్ర మాశక్తి నద్భుతంబుగ నేలఁ, గలిపి యుధిష్ఠిరువలను నిగుడ
నమ్మహీవిభుఁడు బ్రహ్మాస్త్రంబునన యది, యడఁగునట్లుగఁ జేసి యతనిమేన

తే. నైదుదూపులు నాటె శరాసనంబు, దునుమ గద గొని వైచె నుద్ధురత నతఁడు
పటియు గద వైవఁ దత్సన్నిపాతజాత, చటులపావకజ్వాలలు చదల నిగుడ.

వ. ద్రోణుండు గోపించి. 244

తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁ గూల్చి
ధనువుఁ గేతువుఁ దునుమాడి తనువు నొంప
నాతఁ డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండు నై యూర కుండె నధిప. 245

క. కనుఁగొని గురుఁ డవ్విభు నే, యను బొడువను జేతు లాడ [1]కట పార్శ్వములం
దనచూడ్కిఁ బడినహయరథ, మనుజద్విపసముదయముల మడియించె వెసన్.

1. కపార్శ్వములం.

క. పో నీఁడు పాదువుఁ గుంతీ,సూనుని గురుఁ డనుచు నుండఁ జూపఱగము ల
వ్మానవపతి యతిరయమునఁ, దా నెక్కెఁ బాఱి పిన్నతమ్మునిరథమున్. 247

వ. ఇట్లు పాండవాగ్రజుండు సహదేవునిరథం బెక్కి తొలంగం దోలుకొని పోవ నట్టియెడ. 248

తే. క్షేమధూర్తి బృహత్క్షత్త్రు శితశరముల
నొంచి విలు ద్రుంప నొండుధనువు [1]రయంబు
వఱలఁ గొని హయసారథిధ్వజయుతముగ
నతనిమస్తక మిలఁ గూల్చి యార్చె నతఁడు. 249

చ. కదుపడి వీరధన్వుఁడు త్రిగర్తులు వొంగఁగ ధృష్టకేతువిల్
నడిమికిఁ ద్రుంచినన్ మొగమునం దళు కొత్తెడు కెంపుసొంపుతోఁ
జిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనశక్తి నాతఁ డె
క్కుడుమద మొప్ప నానృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపఁగాన్. 250

వ. సహదేవుండును మగిడి వచ్చి దుర్ముఖునిం దలపడి దోర్విలాసంబు మెఱయం బోరి పోరి. 251

ఉ. కేతువుఁ గూల్చి రథ్యముల గీటడఁగించి శరాసనంబుతోఁ
సూతునికంఠముం దునిమి స్రుక్కఁగ నంగము బాణపంచక
స్యూతము సేయ నీదుతనయుం డరిగెన్ నిరమిత్త్రు తేరిపై
శాతతసంభ్రముం డయి రయంబునఁ బాండవసైన్య ముబ్బఁగాన్. 252

వ. అంత నిలువక. 253

తే. తఱిమి సహదేవుఁ డాత్రిగర్తక్షితీశ
తనయుఁ డగునిరమిత్త్రునిఁ దునిమి యొప్పె
ఖరునితలఁ ద్రెవ్వ నేసి రాఘవుఁడు మెఱయు
తెఱఁగు దోఁప నీసేనకు వెఱపు గదుర. 254

క. నకులునిఁ దాఁకి వికర్ణుం, డాకపరి మైనను బెనంగ నోపక తిరిగెన్
సకలబలముఁ జూడఁగ రా,తికిఁ బైకొని యడరి తగరు దెరలినమాడ్కిన్. 255

తే. వ్యాఘ్రదత్తుండు సాత్యకిపై నస్త్రవృష్టి, [2]ముంచె ముంచిన నతఁడు కోపించి సూతు
జదిపి హయములఁ బొరిగొని చటులవృత్తిఁ, జంపె నమ్మగధక్షితీశ్వరకుమారు.

వ. శల్యుండును ద్రౌపదీపుత్త్రుల నేవుర నైదైదుబాణంబుల నేసి మఱియును మార్గణనికరంబులు నిగిడింపం జలింపక వా రాసోమదత్తి నొక్కుమ్మడిం జుట్టుముట్టిన నతం డందఱ కన్నిరూపు లై యేపునం బెనంగు చుండు. 257

చ. హరిసుతసూతి మావుల బకాంతకసూనుఁడు చాపమున్ యుధి
ష్ఠిరతనయుండు కేతువుఁ గడిందిమగంటిమిఁ ద్రుంప సూతునిం

---

1 రయమునఁ,గొనుచు హయరథసూతకేతనయుతముగ. 2ముంచుటయును నతండు కోపించి.

బోరిగొని యోర్వక వెసన్ నకులపుత్త్రకుఁ డిమ్మెయిఁ జిక్కువడ్డఁ జె
చ్చెర సహదేవనందనుఁడు సేసె శిరంబును మేను వేఱుగాన్. 258

సీ. వెస మారుతియు నలంబుసుఁడును బోరుచో, నద్దానవేంద్రునియుంపబలువు
చేత నతండు మూర్ఛిల్లి యాలోనన, తెలిసి కాటుకకొండపోలువు గెలుచు
నాతనిమేను పెల్లలరిన మోదువు, తెఱఁగుగాఁ జేసిన నుఱక వాఁడు
మాయావిలాసోగ్రకాయంబు గైకొని, యఖిలదిక్కులఁ దోఁచి నిఖిలబలము
తే. నుఱిపి నెత్తురుటేఱులు వఱపి భీమ, సేన మాయన్న బకుని నాలేనిచోట
నట్లు సేసితి గాక నీయలవుఁ జలము, నింక మెఱయంగ వచ్చునె యేను గలుగ.

తే. అనిన విని కెంపు గనుఁగవ నడరఁ గినిసి
యుజ్జ్వలత్వష్ట్రబాణప్రయోగమునఁ బ్ర
భంజనాత్మజుఁ డమ్మాయ వాయఁ జేసి
[1]తఱిమి. యేసి యారక్కసుఁ బఱపె నధిప. 260

వ. ఇవ్విధంబున మనదిక్కునఁ జేయం గలదొరలచావును నోటమియుం జూచి మూఁకలు గలంగినం గుంభసంభవుండు రోషసంరక్తలోచనుం డయి తలకడచి సాత్యకిప్రముఖపాండవపక్షవీరులఁ గ్రూరనారాచనిచయంబుల నిలువరించి నెఱయం బొలిచి నిలిచి మెఱయుటయును. 261

చ. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే
డ్తెఱ నడతేరఁ గాంచి చనుదెంచి యలంబుసుఁ డమ్మహాసురుం
గుఱియుఁగఁ జేసె శాతశరకోటికి నడ్డము సొచ్చుసాత్యకిం
బిఱిఁదికిఁ ద్రోచి యద్దనుజు భీమతనూజుఁడు ముంచె నమ్ములన్. 262

అలంబుసుఁడు ఘటోత్కచునితో యుద్ధము సేసి చచ్చుట.

తే. భూరిచక్రంబు వెస నలంబుసుఁడు వైవ
బెలుచ గద వైచి పొడిసేసె భీమసుతుఁడు
కడుఁదురులు గవిసి కఱచుకరణి యయ్యె
మూఁక నత్తునియలు వెసఁ దాఁకునపుడు. 263

క. ఆచక్రంబట్లయిన ని, శాచరపతి వివిధశక్తిజాలము వఱపం
జూచి ఘటోత్కచుఁ డది వ, మ్మై చెడ నర్ధేందుశరచయం బడరించెన్. 264

వ. ఇట్లు దొడంగి యయ్యిరువురు దానవేశ్వరులును. 265

మ. బహుహేతిప్రకరంబులన్ బహువిధోపాయంబులన్ విస్ఫుర
ద్బహుమాయాకృతరూపజాలముల శుంభద్వీరసంరూఢిమై
మహి యల్లాడఁగఁ బోరఁ బాండుతనయుల్ మాత్సర్యధుర్యాత్ములై
సహితోద్యోగత నయ్యలంబుసు శరచ్ఛన్నాంగునిం జేసినన్. 266

1. బల్లిదుం డగురక్కసుఁ.

సీ. అతఁడు మాయాబలోద్ధతి నాశరావలి, మొఱఁగి దావానలముక్త మైన
కరివిధంబున మ్రోఁగి యిరువదేనమ్ముల, ననిలజు ధర్మనందనుని మూఁట
సహదేవు ద్రౌపదీసంభవులను హిడింబాసుతు నైదైదు బాణములను
నకులు డెబ్బదిమూఁటఁ బ్రకటవిక్రమ మొప్ప, నేసి యార్చిన నల్గి యింతవట్టు
తే. రథికవరులును గిట్టి మార్గణచయంబు
లొక్క మొగిఁ దొరఁగింప వాఁ డుఱుక యేటు
లాడఁ గదిసి ఘటోత్కచుఁ డతనిసూతుఁ
ద్రుంచి యరదంబు రూపడఁగించె నధిప. 267

వ. ఇట్లు విరథుం డయి యలంబుసుం డిలకు లంఘించి మాయ గైకొని సాయక
సారంబు ఘోరంబుగాఁ గురిసిన నమ్మారుతిసుతుండును దేరు డిగ్గి యగ్గలం బగు
మాయాకృతమార్గణజాలంబున నది దూలించి గద వైచిన నక్కిమ్మీరానుజుండు
వీడితుం డయి ఖడ్గంబు గొని గగనతలంబున కెగయుటయు హిడింబకొడుకును
గృపాణపాణి యై తోడన యెగసె నయ్యిరువురును సుడిగాడ్పునం దొడరి తిరు
గుడువడు మొగిళ్లచాడ్పున నొప్పి మెఱుఁగు బెనంగుడేగలచందంబునఁ జిత్రగతులం
బోరి పోరి భూతలగతు లై యుబ్బునం దలపడిన బెబ్బులులకరణి నొండొరులమే
నులు నెత్తుటజొత్తిల్లం జేసి పాసి యొకళ్లొకళ్ల కంఠంబులు లక్ష్యంబులుగాఁ గర
వాలంబులు వైవ నవి యొండొంటిం దాఁకి మండుచు మహిం బడిన మల్లయుద్ధ
సన్నద్ధు లై కిట్టుచుం బట్టుచుఁ బాయుచు వ్రేయుచు నొడుచుచుం బొడుచుచు
మఱియు ననేకప్రకారంబుల వీరత్వంబును విశారదత్వంబు సేనలకు వెఱఁగు
పుట్టింపం బోరాడి రట్టియెడఁ బకావరజుండు డస్సినం బవమానపౌత్త్రుండు పడ
వైచి తాను మీఁదై జానుకూర్పరముష్టిఘాతంబులు నిర్ఘాతపాతంబులుం బోలెఁ
బ్రయోగించి నొప్పించి యతనితొడలు నెమ్ములు నొక్కమ్మడిం బొడిపొడి సేసి
నుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం జమరి చంపి పొంపిరి
వోవుమగంటిమిం బేర్చి యార్చినం బాండవబలంబుల సింహనాదంబులుఁ దూర్య
నినదంబులుం జెలంగె నప్పుడా ఘటోత్కచుండు ధర్మనందనున కభివందనంబు
సేసిన నతండు సంతుష్టాంతరంగుం డై యాలింగనంబును మూర్ధాఘ్రాణంబును
జేసి యగ్గించె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 268

ఉ. అంతకు మున్న ఘటోత్కచున కడ్డము సాత్యకి సొచ్చె నంటి వాఁ
డంతకసన్నిభుండు గురుఁ డద్భుతవిక్రముఁ డుద్ధురుఁడున్ సము
ద్ధాంతతఁ బేర్చి వార లటు దార్కొని మిన్నక పోవ నేర్తురే
కొంత యయినన్ రణంబు గలుగుం గలభంగి యెఱుంగఁ జెప్పుమా. 269

వ. అనవుడు నాసూతనందనుం డతని కిట్లను సాత్యకి దఱిమి మన మొన నుఱుము
సేయం దొడంగిన ద్రోణుండు మార్కొని యిరువదేనుకుప్పెకోలల నతనిచేత

నేటులు వడి మూఁడునారసంబుల నతనినొప్పించె నయ్యాదవవీరుండు పంచాశ
ద్బాణంబుల నొంచిన ధనుర్గురుండు దొమ్మిదియమ్ము లెమ్ములం గీలించి. 270

క. మఱియును శరశతము మెయిఁ, గిఱిగొలిపిన వృష్ణివరుఁడు గనియెఁగ లేకే
పఱి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయు లుబ్బు మిగిలి నరేంద్రా.

వ. అప్పుడు వినియును గనియును ధర్మతనయుండు ధృష్టద్యుమ్నాదియోధవరుల
నాలోకించి. 272

ఆ. పులుఁగుఁ ద్రాటఁ బట్టి యలయించి యాడెడు, బాలునట్లపోలె బాణగురుఁడు
గడఁగి కృష్ణననుజుఁ గారించుచున్నవాఁ, డతనిఁ బొదువుఁ డెతని కడ్డపడుఁడు.

వ. భీమసేనపురస్సరులై కవియుం డనుచుం దానును డఱుముటయు నాసైనికోత్త
ములు సాత్యకిం గడచి యాచార్యుం గదిసిన. 274

క. విందులఁ గనిన ట్లాతఁడు, మందస్మితుఁడై యెదిర్చి మార్గణజాల
స్పందితులఁ జేసె వారల, నందఱ కవ్విధము రోమహర్షణ మయ్యెన్. 275

వ. అట్టియెడ. 276

క. ఇరువదియేవురు పాంచాలురు నూర్వురు కేకయులును లూనాంగకులై
ధరఁ బొఱఁగిరి వెఱమొత్తము, కరినికరము రొంపిఁ బడినగతి నుండె నృపా.

వ. ఇట్లు ద్రోణుండు బరవసంబు సేసినం బాండవయోధులు పైఁబెట్టం జాలక సొలసి
యున్నసమయంబునం బాంచజన్యధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి
గాండీవగుణఘోషంబు గర్ణగోచరంబుగామికి మనంబు గలంగ నెలుంగు గుత్తు
కం దగుల సాత్యకితో ని ట్లనియె. 278

ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట.

ఉ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కు డయ్యె న
ద్దిక్కునఁ బాంచజన్యమ యుదీర్ణత మ్రోయఁ దొడంగె నక్కటా
చిక్కెనొ కౌరవాధములచే నతఁ డియ్యెడ నీవ యొక్కఁడుం
దక్క నొరుండు దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు లేమి వేఁడెదన్. 279

క. త్వరితముగఁ జనుము సఖుఁడు, న్గురుఁడుఁ గదా నీకు నర్జునుం డుపకృతిత
త్పరులై నెగడెదు నుత్తమ,పురుషులు వేచుతఱి వచ్చె భుజవీర్యనిధీ. 280

చ. దురమున బంధుమిత్త్రులకుఁ దోడ్పడు తెంపును ధాత్రి యెల్ల భూ
సురులకు నర్థి నిచ్చుటయు సూరిజనుల్ సుకృతంబు నెన్నుచో
సరియుఁగఁ జేసి చెప్పుదురు శాశ్వతకీర్తియు నిన్ను నొందు నా
హరి నను నాసుహృజ్జనుల నందఱఁ గాచుటఁ గ్రీడిఁ గావవే. 281

క. గురుపుత్త్ర కర్ణ మద్రే,శ్వర కృపభూరిశ్రవసులు శత్రుజనభయం
కరులు జయద్రథునకు నై, పరుఁ బొదివిన నతఁడు నొచ్చె నాకుం జూడన్. 282

క. ఆమోము నాభుజంబులు, నామేనుం గలదె కేశవానుజ యెచ్చో

నేమగలకు నమ్మూర్తికి, నేమి దలంచునొకొ దైవ ✻ మెయ్యది దుదియో. 283

ఉ. ద్వైతవనంబునందు [1]గుణధన్యుఁడు గాండివి నాకుఁ జెప్పె ని
ర్ధూతవిరోధి సత్యకసుతుండు సహాయుఁడు గా జయింతుఁ బ్ర
ఖ్యాతిగ ధార్తరాష్ట్రబల ✻ మంతయు నే నని దానికిం దగం
బ్రీతి యొనర్పవే నరవరేణ్య రయంబునఁ బోయి వానికిన్. 284

క. హరి యొకఁడు నీ వొకండవుఁ, బరమాప్తులు గలిమి నరుఁడు ✻ భారపుఁబనికిం
జొర నలుకఁడు నీకూరిమి, పొరపొచ్చెము గాక యుండఁ ✻ బోవఁగవలదే. 285

ఆ. పరమకరుణ నైన ✻ బంధుభావంబున, నైన భుజబలంబునతిశయమున
నైన నెల్లభంగి ✻ నర్జును రక్షింపఁ, బోవఁ దగు మహానుభావ నీకు. 286

క. అతఁ డొకటి యైన నే నే, గతిఁ బోదుం జెపుమ యెల్ల ✻ కార్యంబులలో
నతనికిఁ దోడ్పడఁ బోవుట, యతిముఖ్యము దానిఁ జేయు ✻ మనఘవిచారా.

క. అలఘుబలుఁడు శైనేయుఁడు, గలుగఁగఁ బాండవుల గెలువఁగా వచ్చునె వా
రల కతఁడు గోట యండ్రు గ,పులు దానికిఁ దగఁగ నెఱపు ✻ భుజగర్వంబున్.

క. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు, గురుఁ డిరువురయెడరు దీర్పఁ ✻ గోరి గురులకున్
గురుఁడ నగు నేన చేసెదఁ, బరమప్రార్థనము దీనిఁ ✻ బాటింపు తగన్. 289

క. కురుబలము సొచ్చి నీ దగు, శరములదర్పంబు సూపి ✻ చయ్యనఁ జని య
న్నరుఁ గైకొని నాయుల్లము, పరితాపము దీర్పవే నృ ✻ పాలురు మెచ్చన్. 290

వ. అనిన విని సాత్యకి ధర్మనందనున కిట్లను నీవచనంబు లుచితంబు లేను నప్పార్థు
నకు రణంబునం బ్రాణంబులు దాఁప విశేషించి నీ వింత ప్రార్థించి పనుప నూర
కుండుదునే యతండు సైంధవవధార్థంబుగా నట సను చుండి కృష్ణుఁడు విను
చుండ నాతోఁ జెప్పిన తెఱంగు విన్నవించెద నవధరింపుము. 291

క. మనకు నిమిత్తము లెంతయు, ననుకూలములయ్యె గెలుతు ✻ మాహవమున [2]నేఁ
జనియెదఁ బ్రతిజ్ఞ దీర్పఁగ, ననఘా ధర్మసుతురక్ష ✻ కరుగుము నీవున్. 292

క. విను సింధురాజువధయును, మనుజాధిపరక్షణంబు ✻ మనకు సరియ కా
వున నే నొకపని నీ వొక, పని మేకొని చేయు టరయఁ ✻ బాడియ కాదే. 293

ఆ. ఏను నిలిచినట్ల ✻ కా నూఱడిల్లు నీ, వున్న నన్న రేశ్వరోత్తముండు
నిర్భరుండ వగుము ✻ నీవు నాదెస నాకు, హరి గలండు గలఁడె ✻ యచట నితఁడు.

వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవ వలయుఁ బరాక్రమధుర్యుం డగు
నాచార్యుప్రతిన యెఱుంగవె యనిచెప్పిన నట్లకాకయని నిన్నతనిచే నిక్షేపంబు
గాఁ గైకొని యేను నీకడకుం జనుదెంచితి గురుండు ప్రతిన నెఱపునేని విజయుండు
జయద్రథుం జంపుట యప్రయోజనంబ కాదే యది యట్లుండనిమ్ము నీచిత్తమ్మున
వలవనివెఱపు గట్టుకొనియెదవు కృష్ణసారథికం బగుజిష్ణురథం బప్రతిహతమనో

1. గుణవర్యుఁడు. 2. కేఁ.

రథం బగుట యెఱుంగ వలవదే యనుటయు నమ్మహీపతి యతని కిట్లనియె. 295

క. అది యగు నైనను ననుఁ బెం, పొదవంగఁ గాచికొని యిచట కనుండుటకంటెన్
మది నధికం బై తోఁచిన, యది నీ వర్జునునిపాలి కరుగుము నాకున్. 296

క. కడువడి నీ వరుగంగ వడ, ముడియును నీవెనుక శీఘ్రకమున నెయిదుం గ
వ్వడి కుశలి యైన విజయం, బొడఁగూడును మనకు దీని కొడఁబడు మనఘా.

చ. ద్రుపదవిరాటకేకయులు దోర్బలధుర్యులు ద్రాపదేయు లు
గ్రపుబిరుదుల్ ఘటోత్కచుఁ డరాతివిదారి శిఖండి ధైర్యసా
రపరుషమూర్తి సంగరధురంధరు లిద్దెసఁ దక్కఁగల్గువా
రపరిమితుల్ గొనండు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁ బోరఁ జీరికిన్. 298

క. విను మాధృష్టద్యుమ్నుం, డనలంబునఁ గుంభభవవధార్థముగాఁ బు
ట్టినవాఁడు గాఁడె నాదెస, ననుమానం బేల యోర్చు నాతం డతనిన్. 299

వ. అనవుడు శినిపుంగవుం డొక్కింత చింతించి పార్థుపజ్జం బోవుట బంటుతనంబున
కూనంబు గా దితండునుం బెద్దయుం దఱిమి పలికెడుఁ బోదున కాక యని మనం
బున నిశ్చయించి యధిపతియాననం బాలోకించి. 300

సాత్యకి ధర్మరాజు వేఁడినచొప్పున నర్జునుకడకుఁ బోవ సమ్మతించుట.

క. భవదీయరక్ష యిమ్మెయి, సువిహిత మగునేని మేలు సొచ్చెద భేరీ
రవబృంహితహేషాఢ్యై, రవకౌరవసేనఁ గలఁగి క్రందుకొనంగన్. 301

శా. వైరం బాత్మల నిండి యుండ భుజగర్వాంబుల్ తలిర్పంగ దు
ర్వారోత్సాహులు వీరె కొందఱు నృపుల్ రారాజుకార్యంబు వి
స్తారోదగ్రము సేయఁ బూని విలసత్సంరంభులై పన్ని యు
న్నా రీదట్టపుమూఁక లెట్టు లగునో నాకోర్తులం జూడుమీ. 302

క. ఈసేనలు భేదించి భు, జాసంపద వెలయఁ బార్థసాహాయ్యం బేఁ
జేసెద నీపం పనియెడు, భాసురదీపమున కన్యబలతమ మెదురే. 303

క. ద వ్వని చూడకు మార్తుర, క్రొ వ్వడఁచెద సింధువిభునిఁ గూల్పఁ గడఁగునా
వివ్వచ్చు మెచ్చు తెఱంగున, నవ్వుచుఁ గవిసెద మరుద్గణంబులు వొగడన్. 304

వ. రథ్యంబులదగ యుడుపను సారథిదప్పియుం దీర్పను రథంబు సవిశేషసన్నాహంబు
సేయను వలయు ననినం బ్రీతి నొంది యప్పాండవాగ్రజుండు వనుపం దజ్జులైన
పరిచారకు లత్తురంగంబుల సీరికిం దిగిచి ఖాణం బెత్తి తడవి దారుకానుజుం డగు
నాసూతు నుపయుక్తహారుం జేయుటయు వాఁడును విశిష్టాయుధసమేతంబుగా
నయ్యరదంబు [1]సుకల్పితంబు సేసి సింహధ్వజంబు గ్రాలం దెచ్చె నంతకు మున్ను

1. సవిశేషకల్పితంబు.

సాత్యకియుఁ గృతస్నానుం డై యాప్యాయనమధుపానంబున నెలమిం బొంది
యమ్మహీపతిపాదంబులకుం బ్రణతుం డైనంగాఁగిలించికొని యతండు దీవించినం
బెండ్లికిఁ బోవులీలం దేరెక్కి యెక్కిడినవిల్లును మెచ్చువచ్చునమ్ములును దొడలపైఁ
బెట్టికొని కదలి చనుసమయంబున భీమసేనుండును నగ్రజునకుం బ్రణామంబు
సేసి తనతోడన రాఁ గదలినం గని యాశినిపుంగవుం డతని కిట్లనియె. 305

క. అక్కట రా వలవదు నా, [1]కెక్కటి యీసేన దఱిసిఽ యేఁగుట భరమే
యిక్కడన నిలువు ద్రోణుని,యుక్కునఁ బతి కెడరు పుట్టఽకుండఁగవలయున్.

వ. అనవుడు నతం డట్లు కాక యేను రాజరక్షణంబునకు నిలిచెద నీ వప్రమత్తుండ
వయి యరుగు మనిన వదనంబు వికసింప నీయట్టిపెనుఁబ్రాపు గలుగ నా కెదు
రెవ్వరు సవ్యసాచి సైంధవుం దెగటార్చినం బేర్చినకౌతుకంబున వచ్చి నిన్నును
మీయన్ననుం గాఁగిలించుకొనియెద ననిపలికి యవ్వీరుని నిలిపి లేళ్లగమిఁ గనుం
గొనుబెబ్బులియుంబోలె నీసేనం జూచుచు నడచె నని యిట్లు సంజయుండు
సాత్యకిసంరంభంబు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన వేడ్క యుల్లంబున
నివ్వటిల్లఁ బదంపడి చెల్లినభండనంబువిధంబు వినిపింపు మనుటయు. 307

ఉ. నిర్మలచిత్తభృంగరమణీయవికస్వరపుండరీకతా
ధర్మనిరూఢ సంసరణఽతాపనిరాకరణప్రగాఢస
త్కర్మఫలాకృతీ భువనఽతా[2]విభవప్రకృతీ తపఃక్రియా
కర్మఠసంయమీశ్వరసఖా సమతాసమవేతచిత్సుఖా. 308

క. పరిధానప్రావరణీ,కరణాదృతపీతవసనఽగజచర్మ సను
ద్ధురవాహనీకృతోజ్జ్వల,గరుడవృషభ పరమమోక్షఽకర దురితహరా. 309

మాలిని. నిరుపమగుణరాశీ ఽ నిర్గుణత్వప్రకాశీ
భరితభువనకార్యా ఽ భవ్యనైష్కర్మ్యధుర్యా
విరతనిరతిభావ్యా ఽ విశ్వలోకైకసేవ్యా
స్ఫురితబహుశరీరా ఽ శుద్ధనైరూప్యసారా. 310

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ
దృతీయాశ్వాసము. 311



1. కెక్కడియీసేన-కెక్కడ నీసేన. 2. విభవత్ప్రకృతీ.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము, చతుర్థాశ్వాసము.

---



మత్త్వాయుష్మత్త్వసు
ధీమత్త్వప్రదకటాక్ష౯ [1]దీపితభక్త
స్తోమారామవసంతా
వ్యామోహప్రశమకరణ౯ హరిహరనాథా. 1

### సాత్యకి మొగ్గరంబు సొరం దొడంగుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ధర్మపుత్త్రుండు వనుప సాత్యకి గడంగి, తనబలముదెస నడచుట౯ వినినయాంబి
కేయుఁ డర్జునుఁ గలయ శైనేయుఁ బోవ, విడిచిరే మనవారని యడుగుటయును.

వ. సంజయుం డతని కిట్లను నట్లు మఱుందిం బనిచి యుధిష్ఠిరుం డాచార్యువల నవ
లోకించి యాశినివరుపిఱుందన తఱిమె నప్పుడు ధృష్టద్యుమ్నుం డవష్టంభంబున
నెలుం గెత్తి పురికొల్పఁ బాండవసైనికులు గవిసిన మనవారును మార్కొనిరి
తదనంతరంబ. 4

క. తలలను గరముల వక్షఃస్థలముల జఘనములఁ దొడల౯ జరణంబుల న
య్యిలఁ గప్పెడుసాత్యకికోలల కోర్వక నీబలము [2]గకలంగం బడియెన్. 5

క. విచ్చినమూఁకల కడ్డము, సొచ్చిన నేడ్వురు నృపాల౯శూరోత్తములం
బుచ్చె జముం గొలువఁగ వి,వ్వచ్చుమఱఁది పెఱనృపాల౯వర్గము దెరలన్. 6

సీ. ఆసమయంబున౯ నతని మార్కొని కుంభ,భవుఁ డేడుదూపుల౯ వఱపె మేన
నతఁ డస్త్రసప్తక౯హతుఁ జేసె నాతని, నగ్గురుఁ డాఱింట౯ నశ్వములను
సూతు నాతని నొంచె౯ నాతఁ డయ్యాచార్యు,నేపుమైఁ బదియును౯ నేడునాఱు
నెనిమిదియును బదు౯నెనిమిదియును శాత,శరముల నొప్పించి౯ తురగచయము

ఆ. నాల్గుసాయకముల౯ నడిఁకించి సారథి, నొక్కమార్గణమున౯ ను బ్బడంచి
యార్చుటయును ద్రోణుఁ ౯డలికి వాలమ్ములఁ, బొదివెఁ దద్రథంబు౯మదమెలర్ప.

వ. ఇట్లు బాణజాలంబులం గప్పి గురుండు సాత్యకి నుపలక్షించి. 8

---

1. దృఢతరభక్త. 2. కలంగం.

క. నాచేతిబలువు గని నీ,యాచార్యుం డోడి తొలఁగి ♦ యరిగెను నీవే
త్రోచి యట వోవువాఁడవు, సూచెదు గా కెట్లు నిన్ను ♦ సుక్కించెదనో. 9

క. అనవుడు ధర్మాత్మజుపను,పున నే గాండీవికడకుఁ ♦ బోయెద న న్నిం
తన నేటికిఁ దడ వయ్యెడు, ననుగ్రహము సేయు మర్హ ♦ మది పెద్దలకున్. 10

క. అని పనికి తొలఁగి పోవుట, మనమున నూహించి దైత్య♦మర్దనుతమ్ముం
డను సూతుతోడ ద్రోణుఁడు, మనలం బో నీక పెనఁగు ♦ మాత్సర్యమునన్. 11

వ. తడసినఁ గార్యంబు దప్పు నితనికి నోసరించి పోవనలయు విను మిదియె బాహ్లికబలం
బదె యంగసైన్యం బల్లదె దాక్షిణాత్యసేన వీనియం దొక్కసందున వెడలుద
మివి గడంగి యడ్డపడిన నొప్పించి చిక్కువఱచి పోద మనిన నట్ల కాక యని
యద్దారుకానుజుండు ద్రోణునకుం దొలంగించి తేరు దోలం దీవ్రబాణంబులు
గురియుచు నగ్గురుండు వెనుతవుల నయ్యాదవసింహుండు సింహవిక్రమంబున
నంగచమూచ్ఛేదనంబు సేసి చనునెడఁ గృతవర్మ యాతనిం దాఁకె. 12

క. ఆయమ్ము లతనిమేనం, దూఱం గా నేసి నాల్గు ♦ తురగాంగములన్
[1]గీఱించినఁ గని ద్రోణుం, డూఱడి ధర్మజునిదెసకు ♦ నున్ముఖుఁ డయ్యెన్. 13

వ. అక్కడ మొగ మయ్యు నిక్కడ నేమఱక యుండె నప్పుడు. 14

క. కృతవర్మ యొడల సాత్యకి, శితసాయకములు పదాఱు ♦ సెరివినఁ గోపో
ద్ధతి మెఱయఁగ బలుదూపుల, నతఁ డాతని నుచ్చి పోవ♦నట్లుగ నేసెన్. 15

వ. వెండియు. 16

చ. విలు దును మాడి వక్షమున ♦ వే పదియమ్ములు నాట నాతఁడు
జ్వలఘనశక్తి వైచి కృత♦వర్ముని బాహువు నొంచి ధైర్యని
శ్చలమతి నొండువిల్లు గొని ♦ సారథిఁ జంపిన సూతకృత్యముల్
వలనుగఁ బూని యారథిక♦వర్యుఁడు నిల్చె నితాంతధీరతన్. 17

వ. నిలిచియు సాత్యకిదెసం దఱుమక భీమసేనపురస్సరం బైనబలంబున కడ్డపడ
నవ్విధంబున నతని బెట్టు వఱచి యాశైనేయుం డచటు గడచి చనియె ననిన
విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 18

చ. గురుకృతవర్మముఖ్యు లతి♦ఘోరపరాక్రమశీలు రట్టియా
దొరలను సైన్యసాగరము ♦ దోర్బలసంపద గాసి సేసె న
న్నరుఁ డది గాక క్రమ్మఱ ని♦నం గడు విస్మయ మిట్లజయ్యుఁ డై
వెరవున లావునం బరిభ♦వించుచు సాత్యకి యేపు సూపెనే. 19

మ. హరియుం బార్థుఁడు నట్లు నేర్పు గలబాహా♦శక్తిమైఁ జొచ్చుచో
దొరలున్ సేనలుఁ బెల్లు గూలుటకు నా♦దుర్యోధనుం డెంతయా
తురతం బొందెనొ దంతిఘోటకపదా♦తుల్ సాత్యకిస్ఫారదో

---

1. బాఱించిన.

స్స్ఫురణఁ బ్రగ్గుట కెట్లు జూను ననుజుల్ [1]శోకించిరో యక్కటా. 20

వ. అనవుడు సూతసూనుం డమ్మానవపతి కి ట్లనియె. 21

క. నీయవినయంబు పెంపున, నీయాపద సంభవించె నింక వగచినం
బాయునె యితరులక్రియ శో,కాయత్తుఁడ వగుట నీకు నర్హమె యధిపా. 22

వ. సుస్థిరుండవై సమరప్రకారంబు వినుము సాత్యకి యత్తెఱంగునం జని కాంభోజ
సేనఁ జొచ్చిన నందలిమేటిమగలు దలపడి రట్టియెడం గుంభసంభవుండు. 23

క. కని కృతవర్మకు సారథి, నొనర్చి తనకృత్యమునకు నునిచి కడఁగి యా
శినివరు వెనుకొన ధర్మసు,తునిదార లయ్యస్త్రగురునిఁ దొడర నడరినన్. 24

క. వారిఁ గృతవర్మ మార్కొని, దారుణశరశిఖల నేర్చి తల్లడపఱుపం
గా రయము గుంది నిలిచిరి, వారొండొరుఁ జూచుచును వివర్ణాకృతులై. 25

వ. ఇట్లు హార్దిక్యబలువిడి కోహటించినరథికులం బురికొలిపికొని వృకోదరుండు
సోదరపుత్త్రమిత్త్రసహితంబుగా నతనిపైఁ గవిసె నట్టిసమయంబున నయ్యనిల
జుండును ధృష్టద్యుమ్నుండును శరత్రయంబులను ధర్మనందనద్రుపదులు బాణ
పంచకంబులను హైడింబుం డేడమ్ములను మత్స్యపతి పదియేనింటను సహదేవుం
డిరువదేనింటను శిఖండి యిరువదింటను ద్రౌపదేయులు డెబ్బదిదూపులను నకు
లుండు సాయకశతంబునను నొక్కుమ్మడి నమ్మేటివిలుకానిం బొదివిన నతండు.

సీ. ఐదైదుశరముల నందఱ స్రుక్కించి, భీముని నేడింటఁ బెట్టు వఱచి
ధనువుఁ గేతనమును దునిమి డెబ్బదిదూపు, లతిరయంబున నురమాడ నేయ
సోలినయమ్మరుత్సుతుఁ జూచి యందఱు, నాకృతవర్మపై నడరి రంతఁ
దెలిసి వృకోదరుం డలఘుదారుణసము,జ్జ్వలశక్తి నాతనిపై వైవ నతఁడు

తే. ముత్తునియఁ జేయ దొడ్డవిల్లెత్తి యతని
యొడలు నెత్తురువఱ్ఱు సేయుటయు నాస
మీరనందనుఁ దక్కటివారి నొంచె
మూఁడుమూఁడమ్ము లేసి యవ్వాఁడిమగఁడు. 27

తే. అందఱనుజుట్టుముట్టి తీవ్రాస్త్ర[2]జాల,కములఁ గృతవర్మ నొంప శిఖండి గదిసి
యాక్రమించిన విలుద్రుంచె నాతఁ డప్పు, డతనిచాపంబు దునిమె నుగ్రాసి వైచి.

క. ఆలోన భోజపతిఁ, వాలమ్ములఁ బొదివి రెల్లవారలు దానం
దూల కతఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమముఖ్యరథికుల నొంచెన్. 29

వ. అప్పుడు. 30

ఉ. ఒండొకచాప మెత్తికొని యుగ్రత శాంతనవాంతకుండు వే
దండమువోలెఁ గిట్టిన నుదగ్రత సింహానఖోపమస్ఫుర
త్కాండములం దడంగము రథంబుపయిం బడ నేసె భోజరాట్.

1. శోకించెనో. 2. సప్తకమునఁ.

ధుం డది యాజికిం దొలఁగఁ గ దోలె రయంబున సూతుఁ డార్తుఁ డై. 31

వ. ఇట్లు శిఖండి గం డడంగి పోయినం గని మత్స్యచేదికేకయాదిసైన్యంబులు బర వసంబుసేసి యురవడించిన నాకృతవర్మ మర్మభేదనస్ఫారనారాచపరంపరాప్రవాహంబుల వాని నెల్లం గలంచెఁ దత్కాలకలం బాలించి సాత్యకి యట్లబ్బలంబులు వికలంబు లగుట యాలోకించి విజయునకుం దోడ్పడం బదంపడి పోఁదగు రాజు వలనారయవలయు నని యూహించి తనకునడ్డపడినభారద్వాజునితోడిసమరంబు సాలించి మరలి యరదంబు దోలుకొని యరుగుదెంచి కృతవర్మునిం దాఁకి యేసిన నతండునుం బొగ లేనిమంటచందంబున నుద్దీపించి సాయకజ్వాలలు నిగిడించిన నవి మగిడించి యాశైనేయుండు. 32

శా. భల్లం బొక్కట విల్లు ద్రుంచి రయ మొప్పన్ నాల్గిటన్ వాజులం
ద్రెళ్లన్ బెట్టుగ నేసి సూతుతల సంఛేదిప్రైకబాణాహతిన్
డొల్లం జేసి యదల్చి యిట్లతఁ డాశస్టంబు మాన్పించి యు
త్ఫుల్లాస్యుం డయి పోవ నడ్డపడినం గ ద్రుంచెం ద్రిగర్తావళిన్. 33

వ. ఇట్లు కృతవర్మ విరథుం డైన రయంబునం బురికొని యురవడించినపాండవ సైన్యంబులం గని కుంభసంభవుం డాశనివరువిక్రమవిహారంబున కడ్డపడం గడంగక యాసైన్యంబులసంరంభంబు దనవిజృంభణంబున వారించి నిలిచె ని త్తెఱంగునం ద్రిగర్తసేనఁ జిక్కువఱచితఱిమిచనునయ్యాదవరత్నంబుప్రయత్నం బునకు భంగంబుసేయ నుత్తుంగమాతంగంబును గొలిపి జలసంధుండు మదాంధుం డయి మార్కొనుటయు. 34

## జలసంధుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. ప్రదరప్రవాహమున న, మ్మదవద్ద్విరదంబుపటుగతమన ముడిపి ముదం
బొదవిన సాత్యకి విలు బెట్టు దునిమె నమ్మగధనాథుఁడు మహోగ్రుం డై. 35

తే. తునిమి నవ్వుచు నేఁబది దూపు లురము, నందు నాటిన శైనేయుఁ డలిగి బెట్టి
దంపువిలు గొని యాతని ధనువునఱకి, యుఱక యఱువదియమ్ములు గవఱపె మేన.

వ. దానికిం జలింపక జలసంధుండు. 37

చ. పటుగతి నాశినిప్రవరుబాహువు దోమరకీలితంబు సే
యుటయును గాక త్రుంచె ధను వుగ్రకృపాణము వైచి యాతఁ డు
త్కట మగునల్క నొండువిలు గైకొని వాని నికృత్తహస్తునిం
ద్రుటితశిరస్కునిం బ్రదరఘాతమదావళుఁ జేసి యార్చినన్. 38

క. పెలుకుఱి యచ్చట మూఁకలు, గలఁగినఁ గని తనముఖంబుకయ్యంబునకున్
బలియురఁ గృతవర్మాదుల, నిలిపి గురుఁడు వచ్చి యాశినిప్రభుఁ దాఁకెన్. 39

వ. ఇవ్విధంబునం గడంగినకుంభసంభవుం జూచి యతనిప్రాపున దుర్మర్షణ దుస్సహ వికర్ణ దుర్ముఖ దుశ్శాసన చిత్రసేనప్రముఖు లగుకురుకుమారు లొక్కపెట్ట కవిసి

మిక్కుటం బగుతూర్యరవంబులతోఁ బెక్కమ్ముల సాత్యకిం బొదువ నత్తుములం
బునకు దుర్యోధనుం డేతెంచి తమ్ములంగలసినం గనుంగొని గురుండు వార లతని
కోపుదు రనుబుద్ధిఁ బాండవసేనాముఖంబునకుం జనుదెంచిన నయ్యచ్యుతానుజుం
డారథికు లందఱ కన్నిరూపు లయి వారలశరాసారంబులు నివారించుచు నొకని
నొకని ననేకబాణజాలంబుల నొప్పించుచుండ నక్కౌరవేశ్వరుం డుద్దామగతిని
గవిసి వాలమ్ము లాతనితనువునం జొనిపిన నతండు. 40

క. నగుచు విలు దునిమి తీవ్రా,శుగముల నొంచుటయు సీదుసూతు లెల్లను నా
మృగపతివిక్రముపైఁ దఱచుగ నిగిడించిరి ప్రదీప్తసునిశితశరముల్. 41

క. చిక్కువడక సాత్యకి యొ,క్కొక్కని నయి దయిదు దృఢమహోగ్రాస్త్రములన్
స్రుక్కించి యెనిమిదిటఁ బే,రుక్కున నక్కురునృపాలునొడలం గ్రుచ్చెన్. 42

ఉ. అంతటఁ బోక రత్నమయమైనభుజంగపతాక గూల్చి య
త్యంతరయంబుమై ధనువు నశ్వచయంబును సూతుమేను నిం
తింతలు వ్రయ్యలై పడఁగ నేసిన బెగ్గలి తేరు డిగ్గి భూ
కాంతుఁడు వాఱె సేన కలఁగం బడి మ్రోయ నతండు నవ్వఁగాన్. 43

వ. ఇట్లు వాఱె చిత్రసేనునరదం బెక్కె నక్కోలాహలం బాలించి కృతవర్మ దన
రథంబు రయంబున నద్దెసకుం బఱపం బనిచి యురవడి నరుగుదెంచినం గని శిని
పుంగవుండును నిజస్యందనంబు సమ్ముఖంబు సేయించె నయ్యిరువురుం గోఱవి
గోఱవిం దాఁకిన తెఱంగునం దలపడి యొండొరులపైఁ బ్రచండబాణంబులు వరఁ
గించుచుం బోరునెడ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్రమించి. 44

తే. హయములను సూతు నొంచి శరాసనంబుఁ
ద్రుంచి మెఱుఁగులు [1]వెరిఁగినదొడ్డనార
సంబు మే నుచ్చి పో నేయఁ జచ్చినట్ల
మూర్ఛవోయి మోఁకాళులు మోవఁ బడియె. 45

వ. ఇత్తెఱంగునం దేరిపయిఁ గూలినకృతవర్మం దెగియె నకాఁ దలంచి ధనంజయుం
గలయం దమకించి సాత్యకి యక్కడఁ బోవ నాభోజపతి దెప్పిఱి సన్నద్ధుం డై
మరలి చని యెప్పటినెలవున నిలిచి యనిలతనయప్రముఖుల కడ్డపడినం జూచి
యాచార్యుం డచ్చోటి కతనిం బాలించి శౌర్యధుర్యుం డగునాశినివరుం డట
సనుట సైరింపం జాలక రయంబున. 46

క. మగుడఁ జని యాఁగి నిశితము,లగునారాచములు మూఁట నతనినుదుట బె
ట్టుగ నాటినఁ ద్రిశిఖరయుత,నగముక్రియం బొలిచె నతఁడు నరవరముఖ్యా.

వ. ఆరథికవరుండును గురునిపైఁ గ్రూరనారాచంబులు నిగిడించె నిట్లు దొడంగి
యయ్యిరువురు నొండొరులశరజాలంబులు వారించుచుఁ దురంగంబులయంగం

1 గిఱిగొను దొడ్డ.

బుల రుధిరంబులు పూరించుచు సారథుల నొప్పించుచు మేనుల వాలమ్ములు గుప్పించుచు నసదృశంబు లగుకరలాఘవంబులు సదృశంబులుగాఁ బోరునప్పుడు.

మ. ధనురాచార్యుఁడు గేశవానుజుధనుర్దండంబు ద్రుంచెఁ గదం
గొనివైచెన్ వడి నాతఁ డగ్గురుఁ డెడం గ్రూరంపుభల్లంబునం
దునుమం గ్రక్కున నొండువిల్లు గొని యాదోర్దర్పదుర్దాంతుఁడై
ఘనబాణంబుల నొంచె నించె నతఁ డాకాశంబు గర్జాధ్వనిన్. 49

ఆ. అలిగి గురుఁడు శక్తి నడరింప నది విధి, ప్రేరణమునఁ జేసి తేరు దాఁకెఁ
గాని యతనిఁ దాఁకఁ గానద యతఁడు త, ద్బాహుశాఖ నొంచెఁ బటుశరమున.

వ. నొంచినం గోపించి. 51

క. చాపాచార్యుఁడు సాత్యకి, చాపము దును మాడి సూతు సమ్మూర్ఛితుఁగా
నేపారి యేయ రథ్య, వ్యాపారము దాన నడపి యతఁ డని సేసెన్. 52

వ. ఆలోన నతనిరథచోదకుండు దెలిసిన నెలమిం బొంది. 53

క. బలువిడి బహుభంగుల ను, జ్జ్వలశరములఁ బోరి పోరి శైనేయుఁడు బె
ట్టిలఁ బడ సారథి నేసినఁ, దొలఁగంగాఁ బఱచె ద్రోణుతురగములు వెసన్. 54

ఆ. అచటిరాజలోక మగ్గురునరదంబు, సనినదిక్కు సనుచు సంభ్రమమున
నాఁగికొనుఁడు పట్టుఁడు డదలుపుఁ డేయుఁ డ, శ్వములననఁగఁ దెరలెఁ సైన్యసమితి.

వ. ఇవ్విధంబున నిజరథంబు విఫలమనోరథం బై పోయిన నదియ పోకగాఁ బోయి సన్నద్ధుం డై సముద్ధతం బైనపాంచాలబలంబుచేతం గలంగుతనమూఁకలం బురికొలిపికొని కుంభసంభవుం డవష్టంభవిజృంభణంబున సేనాముఖంబునం బొలిచి నిలిచె నిత్తెఱంగున ద్రోణికృతవర్మదుర్యోధనాదు లగుజెట్టిజోదుల బెట్టు వఱచి చిఱున వ్వొలయ సాత్యకి సారథితో ని ట్లనియె. 56

క. ఇక్కడఁ గృష్ణుల తేజము, నక్కడఁ బవమాననందనాదిజనులపే
రుక్కును గెలిపించె మనలఁ, జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్. 57

వ. అని పలికి యర్జునుం డున్నదిక్కునకు రథంబు రయంబునం బఱపం బంచిన వాఁడును నట్ల చేయ విమలాశ్వవేగంబునం జారుభీషణం బగున త్తేరు నీవారికి దుర్నిరీక్ష్యం బై నభంబున భానురథంబు సనుచందంబున. 58

సుదర్శనుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. అరుగఁగ సుదర్శనుం డను, ధరణీపతి యడ్డపడి[1]యె దర్ప మలర న
య్యిరువుఁ బెనంగుటయు న, చ్చెరువుం గావించె నచటిసేనల కెల్లన్. 59

వ. అట్టియెడ నమ్మహీనాథుండు. 60

క. పలుదునియలు సేయుచుఁ దూ, పులు దనదెసఁ జేర నీక పోర శినివరుం
డలిగి తురగముల సారథి, నిలఁ గూల్చి తదుత్తమాంగ మేద్తెఱ నఱకెన్. 61

1. యాదరెలఁ బెలుచ నయ్యెరు.

62

వ. నఱికి నిజసారథిం జూచి.

క. గురుఁ డనుజలనిధిఁ గడచితి, నొగులు దలంపంగ నాకు నులిగాలువ లీ
నరపతుల సరకుగొన నీ, వరదము సన నిమ్ము నేఁటి యని కలయకుమీ. 63

వ. అనవుడు వాఁడు నగుచు నీవిక్రమంబునకు నావెరవు సంగడంబు గాదె సంగరంబున నేమి సేయుదు నెవ్వనిపైఁ దేరు నడపుదు ననిన విని శినివరుఁడు విన్వాచ్చు చేతం జచ్చినకరితురగనరనికాయంబులతిట్టలు సూపి యజ్జాడం దేరువఱపుమదె గాండీవగుణచండనాదంబు వీతెంచుచున్నయది నేఁడు పాండవమధ్యముం డిచ్చిన ధనుర్విద్యావిలాసంబు మెఱయను బాండుసూనుల కేనుజేయుభక్తిస్నేహంబులు నెఱపను వలయు నాకడంక గని గురువిభుం డిరువురుఫల్గును లనుబుద్ధిఁ గలంగునట్లు సేసెదనని పలుకునవసరంబున నద్దెసం గాంభోజయవనసైన్యంబు లతని కడ్డపడం గడంగిన నవ్వీరుండుగుణంబుసారించి యబ్బలంబువలనికిఁ దేరువఱపించి.

క. నానాస్త్రంబులు ముందర, వే నిగుడఁగ బడలువడిన వీరభటులపై
నేనుంగుల గుఱ్ఱంబుల, పీనుంగులమీఁదఁ దేరు పెలుచం బఱపెన్. 65

వ. ఇవ్విధంబున వెండియుం గిరాతశకబర్బరపారదయవనప్రముఖమ్లేచ్ఛసేనల రూపడంచి నీమూఁకలు గలఁగం దఱిసి చిత్రవర్మంబు మైచాయగా నారాచంబులు నఖంబులును విల్లు బలుమొగంబును నై బెబ్బులివోలెం బోవం బోవ దుర్యోధస దుశ్శాసన చిత్రసేన వివింశతి శకుని దుస్సహ దుర్ధర్షణక్రథప్రభృతిరథికనికరంబు రభసంబునం బోకు పోకు మనునెలుంగులతోఁ బిఱిందిదెసం దఱిమినం దత్కలకలంబు విని యతండు సూతు నాలోకించి. 66

క. మందగతిఁ జనుము నావెను,కం దగిలెదుసైన్యజలధి గ్రక్కున శోషిం
పం [1]దీవ్రశరార్చుల నం,దంద వడిం బఱపి నగుచు నరుగుద మనినన్. 67

క. అతఁ డట్ల చేయ నబ్బల, మతిరయమున నెయిది పొదువ నరిగి కరిచతు
శ్శతియు హయత్రిశతియు వసు,మతిఁ గూల్చెను శినివరుండు మద మెలరారన్.

వ. అంత నిలువక చలంబున నాసేన శైనేయుపై బెట్టు గిట్టె నట్టియెడ. 69

క. నరతురగద్విరదరథో,త్కరములలో నతనిశరము దాఁకనిరూపుం
బరికించియుఁ గానం ద,త్త్వరితత్వంబునకు వేఱ వర్ణన యేలా. 70

క. నరుబాహాస్ఫురణమునకు, సరి యగు నెక్కుడగుఁ గాని సాత్యకిభుజవి
స్ఫురణం బల్పము గా దని, సురనికురుంబంబు పొగడుచుం జూచె నృపా. 71

మ. కురుముఖ్యుండును దోడిసైనికులుఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం
గురియం బిన్నటినవ్వుతో నతఁడు దక్తోక్కదండసూతాశ్వకే
తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై
వెరవుం జేవయు లావునుం దెలిపె నుర్వీనాథ యాసేనకున్. 72

1 దీవ్రతరశరార్చుల, నందఱ వడిఁ బఱపి.

క. కదిసి నరేంద్రుఁడు సూతుని, మదమును దురగములయుబ్బు మానిచి నిశిత
ప్రదరముల నతనియంగము, పొదివె శకుని దోడుపడఁగ భుజబల మలరన్.

వ. పొదివిన నొదవినకోపంబునాటోపంబున. 75

మ. ధరణీనాథ మురాంతకానుజుఁడు గాంధారేశుచాపంబునుం
గురువంశాగ్రణిసూతుకంఠము నతిక్రూరాస్త్రపాతంబునం
గర మాశ్చర్యము గాఁగఁ ద్రుంచినఁ దురంగస్తోమ మామేదినీ
శ్వరు తేరచ్చటు వాయ నీడ్చికొని పెల్చం బాఱె దుర్వారమై. 76

వ. ఇత్తెఱంగునం బాఱిన, 77

క. తమ్ములు దొరలును నేపఱి, యమ్మనుజాధిపునిపజ్జ కరుగుటయును సై
న్యమ్ము వెఱచఱచి విచ్చిన, నెమ్మదిఁ దనయరుగుదెస శినిప్రభుఁ డరిగెన్. 78

వ. అనిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 79

క. పులికిఁ బసులు వాఱినక్రియ, నలవుఁ జలము సిగ్గు విడిచి య ట్లొక్కనికో
త్తల కోర్వక విఱిగినపు,త్త్రుల నేమని విందు నేను రోయక యుంకన్. 80

క. అనుడు నతఁ డవ్విభుని కి, ట్లను నీపును నగ్రసుతుఁడు నవినయములు సే
సినఁ బాటిల్లినయాపద, వినకుండఁగ వశమె మీఁదు విను తెలియంగాన్.

వ. అట్లు గాసి యై కోపించి నీకొడుకు పురికొల్ప నంబష్ఠకొంకణపారదప్రముఖదేశం
బులబలంబులు దుశ్శాసనపురస్సరంబుగా రయంబునంజని సాత్యకిం జుట్టుముట్టిన
నాజెట్టిమగండు నిజభుజవిక్రమాటోపంబునకుం బాటవంబు దలకొల్పిన. 82

మ. విఱిగెం బెక్కురథంబు లొక్కమొగి నుర్విం గూలె శుండాలముల్
దఱచై రాలెఁ దురంగమావయవసంతానంబు లింతింత లై
కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబు లై
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్ సురల్. 83

దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి పాఱి పోవుట.

క. రోషమున దుస్ససేనుఁడు, పాషాణప్రదరనిపుణపార్వతికతతిన్
భీషణముగఁ గవియింప జి,గీషం బొదువుటయుఁ జూడ్కిఁ గెం పారంగాన్.

క. శినివరుఁ డారా లెల్లను, దునియలుగా నేయ మగిడి తొరఁగుచు నవి వై
చినవారిన నొప్పింపఁగఁ, గనుకని నమ్మాఁక విచ్చెఁ గౌరవనాథా. 85

తే. విచ్చుటయు నంటఁ దాఁకి యవ్వీరుఁ డంప
వెల్లిఁ దేల్చిన వెగ డంది పెల్లగిల్లి
యధిప. దుశ్శాసనుఁడు మొదలై సయోధ
గణము లెల్లను ద్రోణునికడకుఁ బఱచె. 86

వ. ఇవ్విధంబునఁ దనచేగునకుం జనినయాదుశ్శాసనునింగనుంగొని మున్ను శైనేయు
చన్నదెసం బుట్టినయక్కోలాహలం బాకర్ణించు చున్నయగ్గురుం డి ట్లనియె. 87

క. ఏమి యువరాజవిభునకు, సేమమె సైంధవుని నేమి ✻ సేసె నరుఁడు నీ
వేమిటి కి ట్లీరథిక,స్తోమములో విఱిగి తెందుఁ ✻ జొచ్చెద వింకన్. 88

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గు ట్టెత్తినపుడు ✻ గడుఁ బఱచితి నాఁ
డోడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మదుఁగవలసె నిప్పు ✻ డొకసాత్యకిచేన్.

వ. భీమార్జునులబారిం బడి యేమి గాఁ గలవాఁడ వని పలికి యలుక వొడమిన నంత నిలువక. 90

చ. మఱచితె యాసభ ✻ భువన✻మాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ
పఱచినపాటుఁ బాండవులఁ ✻ బల్కినపల్కులు నాఁటికొ్రవ్వ నే
డ్తెఱయును నెందుఁ బోయె రణ✻ధీరుల వారల నల్గఁ జేసి సి
గ్గఱి తుది నిట్టు లైతి తగు ✻ నక్కట తియ్యన గావె ప్రాణముల్. 91

ఆ. బ్రదుకఁ దలఁచితేనిఁ ✻ బాండునందనులకు, నింకనైనఁ బుడమి ✻ యిచ్చునట్లు
గాఁగ నన్నతోడఁ ✻ గార్యంబుఁ జెప్పు మ, వ్వాడఁగు భీష్మబుద్ధి ✻ వినక చెడియె.

వ. ఇట్లు సేయఁ జాల వైతేని. 93

క. ఎట వోవ వచ్చు నిను ముం, దట నిడుకొని పోర నున్న✻తగురాజుల నె
క్కటి దోలెడిసాత్యకి నీ, వట దఱుముదు గాక యొదుఁగ ✻ నగునే నీకున్. 94

క. అనుటయు నతండు వినియును, విననిచెవులు సేసి మగుడ ✻ విక్రమమునకుఁ
గొనకొని యేమియుఁ బలుకక, చనియె శినిప్రవరు[1]పజ్జ ✻ సమరంబునకున్. 95

వ. తదనంతరంబ యాచార్యుం డవార్యదోర్వీర్యంబు మెఱయం దఱిమి మెఱుంగు వాలమ్ముల వేఁడిమి సూపిన. 96

శా. పాండుక్ష్మావరసూనుసైన్యములు ద✻ర్పం బేదుర్చ వీరకే
తుం డుగ్రంబునఁ దాఁకి యగ్గురుని సూ✻తుం ద్రుంచి యేనమ్ములు
ద్దండుం డై తను వాడ నేయుటయు నా✻తం డల్గి దీప్తోజ్జ్వల
చ్చండాస్త్రంబునఁ గూల్చె నాద్రుపదసం✻జాతుఁ మహోదగ్రతన్. 97

వ. ఇట్లు వీరకేతుండు వడినం గినిసి యతనియన్నలుం దమ్ములు [2]నగుచిత్రకేతుం డును సుధన్వుండును జిత్రవర్మయుఁ జిత్రరథుండును ద్రోణురథంబు బాణ మయంబు సేసిన నతండు. 98

క. వారలరథ్యంబులఁ ద,త్సారథులం బొడవడంచి ✻ ధరఁ దొరఁగించెఁ
వారిశిరంబులు పువ్వు ల,వారణమెయి దుల్చుగంధ✻వహుఁడుం బోలెన్. 99

వ. అప్పు డాలోకించి ధృష్టద్యుమ్నుండు గెంజాయ రంజిల్లుకన్నులం గన్నిరొలుకం గవిసి కుంభసంభవునురంబునం గ్రూరనారాచంబులు సొనిపిన మనమూఁకలు హాహాకారంబు లెసఁగ నతండు మూర్ఛిల్లిన నప్పాంచాలవరుండు. 100

తే. పలకయును వాలునుం గొని ✻ యులఘుజవము

---

1. దసక ♦ సైన్యయుతుం డై. 2. దలమిగిలి చిత్ర.

మెఱయ నేలకు లంఘించి మెఱుఁగు మెఱచి
నట్లు సని తల గోయుట కప్పళించి
యెగిరె నగ్గురు తేర్పై కేపు మెఱయ. 101

వ. అంతటం దెలిసి యాచార్యుండు ధైర్యధురంధరుం డై యెదురు గదియం బడి నప్పటికి సాధనంబు లగు జేనకోలందితూపుల నతని నొప్పించినం గడుఁదురులు గఱచిన వెగడుపడునట్లు మొగ మిరిగి యాద్రుపదనందనుండు నిజస్యందనంబునకు వచ్చి విల్లు గొని పెల్లేసిన. 102

క. గురుఁ డతనిసూతుఁ దునుముడుఁ, దురగములు రథంబు ననికిఁ దొలఁగఁ దిగువ నా
ధరణీసురోత్తముఁడు బం,ధురపాండవసైన్యసమితిఁ దోలెం బెలుచన్. 103

క. కలశజుని తెంపుఁ బెంపును, బలిమియునుం జూచి యపుడు పాండునృపతనూ
జులదెస సైనికు లెవ్వరు, నలవు మెఱసి కడఁగఁ జాల రైరి నరేంద్రా. 104

వ. అట్టియెడ. 105

ఆ. అవ్విధమునఁ బల్కి యాచార్యుఁ డట పుచ్చ, నరిగి దుస్ససేనుఁ డాశినిప్ర
వీరుఁ దాఁకుటయును గౌరవపతి ద్రిగ,ర్తానిబలంబుఁ బనిచెఁ దోడువడఁగ.

వ. ఆసంశప్తకులలో దండిమగలు మూఁడువేలరథంబులవారు బెట్టుగిట్టిన నావృష్ణి వీరుండు పంచశతముఖ్యరథికులం బంచత్వంబునొందించి పెఱచతురంగబలంబుల నెత్తుట జొత్తిల్లం జేసిన నాత్రిగర్తసైన్యంబు దైన్యంబు నొంది ద్రోణుదెసకుం బఱచెం బఱచినం బోవక యువరాజు శైనేయుతోడ నానానిశితశరంబుల దురంబు సేయ నతండు. 107

దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడుట.

క. ధనువు దునిమి నవ్విన నీ,తనయుఁడు పటుశక్తి వైచెఁ దలఁకక యది ప
ల్తునియలుగఁ జేసె సాత్యకి, విను మాతం డతని నొండువిలు గొని నొంచెన్.

ఆ. అలిగి కృష్ణుతమ్ముఁ డతనిచాపంబును, సూతుఁ దురగములను గేతనంబుఁ
దునిమిసాగయ నేసియును[1] భీమసేనుప్ర,తిజ్ఞ దలఁచి చంపఁ దెగక చనియె. 109

వ. అట ధర్మజభీమనకులసహదేవులు సాత్యకి సేనం దఱియం జొచ్చుట యెఱింగి సైన్యంబులం బురికొల్పికొని ధృష్టద్యుమ్నాదియోధుల మున్నిడికొని తఱిమిన మనవారును మార్కొని పెనంగి రా శైనేయుండును నీసేన బడలువడం జేయుచు మున్నిటం బెనుఁజోఱ దఱిసి పోవు తెఱంగునం బోవుచుండె నంత నక్కడఁ గవ్వడి యును యుగాంతకాలరుద్రునికైవడి రౌద్రరసమయమూర్తి యై తనమునుము మొనల బారిసమరుచుండె మోహరంబు మొగంబున గురుండునుం గాంతేయ బలంబులం బోరిగొనుచుండె నివ్విధంబున నమ్మువ్వురచేతను బ్రజాక్షయం బగు చుండం గురుపతి భారద్వాజునాజి యరసి పోవ వచ్చి యచ్చటం బాండవసైనికుల సంరంభంబుఁ జూచి రేఁచి యొక్కరుండును దలకడచి యమ్మొన వనజవనంబు

1 భీమసేను. పతిన దలఁచి చంపలేక చనియె.

సొచ్చువారణంబునుంబోలెఁ దఱియంజొచ్చి భీమసేనుం బది బాణంబులను నకుల
సహదేవద్రుపదవిరాటద్రౌపదేయుల సాయకత్రయంబులను గేకయు లేవురను
శరద్వయంబులను ధృష్టద్యుమ్నుని నిరువదింటను శిఖండిని మూఁటను ధర్మ
నందనుని నైదుదూపులను నేసి మఱియు ననేకనరతురగద్విరదరథనికరంబులం
బటుప్రదరశతంబుల నొప్పించె నప్పుడు. 110

తే. అతనిచాపంబుఁ గుంతీసుతాగ్రజుండు, నఱకెఁ బెఱవారు పొదివినఁ దుఱకనారి
నెల్లఁ గుంభజుఁ డమ్ములవెల్లిఁ దేల్చి, యురవడించి యాసైన్యంబులను బ్బడంచె.

వ. కౌరవపతియు మగిడి యాసైంధవుకడకుం జనియెఁ దదనంతరంబ కేకయమహీ
నాథుండు మార్కొని. 112

క. గురుఁ డెన్నిశరము లేసిన, వెరపున నన్నింటి నన్నిశరవిశిఖంబులఁ జా
మరలిచి బ్రహ్మాస్త్రపరి,స్ఫురణము సూపినఁ దదస్త్రమునన యడంచెన్. 113

క. మఱియు నతనిమెయి బాణము, లఱువది గిఱిగొలుప నాబృహత్క్షత్త్రుం డే
డ్తెఱ సూతు నొంప నాతం, డఱిముఱి నారాచతతులఁ దన్విభుఁ బొదివెన్.

తే. చిక్కువడఁ జేసి చనుమఱఁ దొరొక్కదొడ్డ, నారసమ్మున బి ట్టేయ నరవరుండు
ద్రెళ్లె శిశుపాలతనయుండు ధృష్టకేతుఁ, డమ్మహావిరుపై వీఁక నడరి యపుడు.

క. పెనుమంట నుఱుకుశలభం, బునుబోలెం గపిసి కోలుఁబులిఁ గోల్గొని వే
సినమాడ్కి నేసె నఱువది, సునిశితబాణముల సశ్వసూతయుతముగన్. 116

తే. బాణఘట్టనఁ గటకటఁబడ గురుండు, విల్లు ద్రుంచిన నొండొకవింట నొంచె
నాతఁ డక్కుంభసంభవుఁ డతని విరథుఁ, జేసి యావిలు దునిమినఁ జేవ సెడక.

క. గద వైచిన నది ద్రోణుని, ప్రదరంబుల నడఁగఁ దోమరము శక్తియు బె
ట్టిదముగ నతఁ డడరించిన, మదమున నయ్యోధవరుఁడు మడియించె నెడన్.

వ. ఇట్లు వికలసాధనుం జేసి. 119

క. ఆలోనన మెఱుఁగారెడు, వాలికనారసము చేదివరుహృదయమునం
గీలించినఁ [1]బొడ వెగయుచు. నేలం బడి తన్నికొని చనియె జముకడకున్. 120

క. కని యాతనితోఁడు కడలుం, గనలుం బిరిగొనఁగఁ దన్నుఁ గవిసినఁ బొదివెఁ
ధనురాచార్యుఁడు శీఘ్రం, బున బెబ్బులి కొదమ లేడిఁ బొదివినమాడ్కిన్. 121

తే. పొదివి యవలీల నాతనిఁ బొలియఁ జేయు
సమదగతి మాఱుకొని జరాసంధతనయుఁ
డస్త్రగురు నొంచుటయు నతఁ డల్గి యతనిఁ
గూల్చెఁ దత్సైనికులు గనుంగొనుచు నుండ. 122

వ. అట్టియెడ వడముడి ధృష్టద్యుమ్నుండు వినసివ్వప్రవరుం డప్రతిహతతపస్స్వీరుండు
గాకేమి చూపులన దహించునట్లు తూపులవేఁడిమిం బగఱ రూపడంచుచున్నవాఁ

1. బొడవు నెగసి-బోఁడిని సెడి.

డనిన నాద్రుపదనందనుం డతని మార్కొనం గడంగునెడ నాతనిం దలకడచి.

ఆ. క్షత్త్రవర్మ గురుని॰చాపంబు ద్రుంచిన, వేఱ యొక్కదొడ్డ॰విల్లు రయము
మెఱయఁగొనియతండు॰మెఱుఁగులు గిఱిగొను, నారసమున వాని॰నాఁపమడఁచె.

ఉ. అప్పుడు చేకితానుఁడు శర॰తాశుగముల్ గురుమేన గ్రుచ్చి తే
రొ ప్పఱి సూతు నొంచి తురగ॰గోద్ధతి మాన్ప నతండు గన్నులన్
నిప్పులు రాలఁ దద్భుజము ॰ నిష్ఠురబాణహతంబు సేసి వే
కప్పె శరాళి సూతుఁడు దెరల్ హరు లో టఱి గ్రేళ్లువాఱఁగాన్. 125

వ. ఇట్లు విరథుండై చేకితానుం డోటమి కోర్చి యమ్మొయిన తొలంగె నిత్తెఱంగున.

క. పెక్కండ్రుదొరలు దనపైఁ, రుక్కున రాఁ బఱఁగ ద్రోణుఁ ॰ డుద్ధతిఁ దోడ్తో
నెక్కఁగ నితఁడు కుమారుం, డొక్కఁ యనఁగ ముదుకఁడయ్యు॰నుగ్రత మెఱసెన్.

వ. అసహాయుంబునం బాంచాలపతి యీబ్రాహ్మణుండు వృషభంబులుంబోనిభూపా
లుర నెల్లను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాఁడు వారింపవలవదే యని
కడంగి మొనలం బురికొలిపికొనుచు నక్కజం బగుకయ్యంబు సేయుచుండం
బాండవాగ్రజుం డాత్తగతంబున. 128

ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడఁ బుచ్చుట.

ఉ. అర్జునుఁ గాంటి వోయె నని ॰ యక్కడఁ బుచ్చితి బాహుసారవి
స్ఫూర్జితు సాత్యకిం బెలుచఁ ॰ బోవుటయుం గనుఁగొంటి నిద్దఱున్
దుర్జయశత్రుసైన్యముల॰దొండడి నేమయి రొక్కొ విక్రమా
వర్జితసైరి భీముఁడును ॰ వారికిఁ దోడుగ నేఁగు టెట్లొకో. 129

క. తమ్మునిఁ దలంచి కృష్ణుని, తమ్ముఁ బనిచె నాతనిం బ॰దంపడి తనచి
త్తమ్మునఁ దలఁపఁడ ధర్మజుఁ, డెమ్మెయివాఁ డొక్కొ నారె ॰ యీయున్నజనుల్.

తే. పెక్కుచోటుల నెఱిఁగిన॰యుక్కు లావు, గలుగునీతనిఁ బనుచుట ॰ కలుక నేల
యితఁడుగలయనయ్యిరువుర॰కెలమివచ్చుఁ, బనుతు నేనటుశోకంబు॰వాయవలయు.

వ. అని బహువిధంబుల విచారించి నిశ్చయించి. 132

ఆ. భీముఁ జేర నరిగి ॰ బీభత్సు నీతమ్ము
నని యెలుంగు గళము॰నందుఁ దగుల
నస్త్ర లొలుక మాట ॰ యట సెప్ప లేఁ డతఁ
డార్తి సూచి యిట్టు ॰ లనియె నతఁడు. 133

క. ఏము గలంగినయప్పుడు, నీమహిమయు మమ్ముఁ దేర్చు ॰ నీకును గలఁగన్
భూమీశ తగునె యివ్విధ, మేమిటఁ బాటిల్లెఁ బనుపు ॰ మేపని కైనన్. 134

చ. అనవుడు నాతఁ డిట్లనియె ॰ నక్కడ నప్పుడు పాంచజన్యని
స్వనము వినంగ వైన నట ॰ సాత్యకిఁ బుచ్చితి నేమి పుత్తెనో

యను[1]నెత నిప్పు డద్దెస భరయంబు దిగంబడ నీవు వోయి పా
ర్థుని గని సింహనాదమున ౯ రోదసి నింపుము మాకు నింపుగన్. 135

క. సీతమ్ముగుజ్జు రూపసి, నీతివిదుఁడు సకలసుగుణ౯నిధి మధ్యస్థుం
డాతని కెడ రగునో యను, చేతోగతి పల్లటిల్లఁ ౯ జేయదె త్రాల్మిన్. 136

ఆ. అనిన భీముఁ డిట్టు ౯ లనియెఁ ద ద్రథము ర, థ్యముల సారథిని ౯ శరాసనంబు
నెఱుఁగు డవనిఁ గూలఁది ౯ యెఱిఁగినయదియ నీ, కేల వగవ నిపుడ ౯ యేను బోదు.

వ. దేవరయాజ్ఞఁ దల నిడికొని చని యాకృష్ణులఁ గృష్ణానుజునిం గలసి యిక్కడ కెఱుక సేయుదు నని పలికి పాంచాలనందనుం గనుంగొని కుంభసంభవుబలిమియు నతనిప్రతిజ్ఞ తెఱంగును నెఱుంగుదు వేమఱ కుండుము నాకుం బోక గర్జంబు గాదు గా కున్న నేలినవానియానతి నడప వలయు ననవుడు నతండు. 138

క. వినుము భవత్సేనాపతి, తనువునఁ బ్రాణములు గలుగ ౯ ధర్మజుదెసకుం
జనుదెంచువాఁడె ద్రోణుం, డనుమానము దక్కి యరుగు ౯ మర్జునుకడకున్. 139

వ. అనిన ధృష్టద్యుమ్నుపలుకుల కూఁబడిల్లి యనిలతనయుం డన్నచరణంబులకుం బ్రణతుం డై యాలింగనంబును నాశీర్వాదంబునుం బడసియున్నయప్పుడు శౌరి శంఖవిరావంబు వీతెంచిన నవ్విభుం డవ్వీరున కి ట్లనియె. 140

క. విను పాంచజన్యపటుని, స్వన మదె యిది మఱఁది యెడరు ౯ సైరింపక కృ
ష్ణునిరణము సేయురభసం, బని తలఁచెద నెద్దు మెద్దు ౯ మధికరయమునన్.

వ. అనవుడు సవిశేషకల్పితం బగురథంబురవంబును దూర్యనినదంబును దనసింహనాదంబునుం జెలంగ విశోకునిసారథ్యసామర్థ్యంబున రథ్యంబులు నెఱయ మెఱయం గదలి గొనయంబు సారించి కురుబలంబు నవలోకించుచు నడుసనవ్వాడ ముడిం దలపడి నీకొడుకులు దుశ్శల చిత్రసేన కుండభేది వివింశతి దుర్ముఖ దుస్సహులును వికర్ణశలవిందానువిందసుముఖదీర్ఘబాహుసుదర్శనబృందారకులును సుహస్తసుషేణదీర్ఘలోచనాభయరౌద్రకర్మసుశర్మదుర్విమోచనులును వివిధవిశిఖంబులు వరఁగించుటయు లేళ్లగమింజూచి పొంగుసింగంబుచందంబునం జెలంగి యాశరంబులు వారించుచు వారిం గదిసి బృందారకుం దెగఁజూచి యభయరౌద్రకర్మదుర్విమోచను లనుమువ్వురను మూఁడువెడందతూపులం దునిమిన.

క. చలమునఁ బోవక పెనఁగిన, నల వేర్పడ నతఁడు విందు ౯ ననువిందసుశ
ర్మలఁ జంపి సుదర్శను బె, ట్టిలప్పైఁ బడి యపుడు సావ ౯ నేసె నరేంద్రా. 143

క. పెఱవారు వెఱచి సలుగడఁ, బఱచిన వాయుసుతుఁ డార్చి ౯ పఱపె రథం బా
తెఱపిన యరుగుట గని గురుఁ, డుఱక యతనిఁ దాఁకి కప్పె ౯ నుగ్రాస్త్రములన్.

వ. ఇట్లు నిలువరించి నిటలంబున నారాచంబు నాటించి యక్కుంభసంభవుండు దనమనంబున వీఁడు వివ్వచ్చునట్ల న న్ననుసరింపఁ గలవాఁ డని తలంచి య ప్పవనతనయు నుద్దేశించి. 145

1. వెఱ. 2. బుడిపింపఁగ నీవు.

క. నను గెలిచి కాక నీకి, మ్మొన సొరఁగా నెట్లు వచ్చు మును నీతమ్ముం
డనుమతుఁ జ్జై కాదే చొరఁ, గనియె ననుడు నతఁడు గన్నుఁగవఁ గెంపారన్.

క. నరుఁ డేకరథికునియనుమతిఁ, జొరఁ దలఁచునె మనుజసేన సురబల మైనం
దెరలిచికొని విచ్చలవిడి, నరుగుం దనవలచినెడకు నది యట్లుండెన్. 147

చ. ప్రియములు వల్కి నిన్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడు సుమ్ము దు
ర్జయభుజశక్తినిర్మథితశత్రుఁడు భీముఁడు గాని నీవు దం
డ్రియు గురుఁడుం బ్రియుం[1]డు నని ప్రీతి యొనర్చెదఁ బూని వైరికిః
జయ మొనరింతు గాక యని సైఁతునె దర్పము సూప కుందునే. 148

వ. అని పలికి. 149

మ. గద సారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించి య
మ్ముదుకం డుర్వికి దాఁటి పోయె నది రశ్ముల్ మింటఁ బర్వంగ బె
ట్టిద మై మ్రోయుచు వచ్చి బల్పిడుగుమాడ్కిం దాఁకుడున్ గుఱ్ఱముల్
సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వాలిసెన్ సైన్యంబు భీతిల్లఁగాన్. 150

వ. అప్పు డమ్మేటిమగండు. 151

క. మనమూఁక దఱిసి యుద్ధతిఁ, జనఁ జన నీనందనులు వెసం దాఁకియు ను
బ్బినయతనివీఁక కోర్వక, కనుకని సిగ్గు సెడి పాఱఁగా గురుఁ డంతన్. 152

క. ఒండొకతే రెక్కి సము,ద్దండతఁ జని భీమసేనుఁ దాఁకి శరము లొం
డొండ నిగిడించి నొంచిన, గండడఁగక యతఁడు గనలుగదిరినమదితోన్. 153

చ. అరదము డిగ్గి యప్పటుశరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరుఁ డయి వాన పైఁ గురియ వంచినమస్తక మొప్పఁ బోవుసుం
దరవృషభంబులీలఁ జని దర్ప మెలర్పఁగ నొక్కఁ జే నొగల్
వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్మయ మందఁగ వీచి వైచినన్. 154

భీముఁడు ద్రోణాదిరథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁబోవుట.

ఆ. నుగ్గునూచ మైన నగ్గురుఁ డొండొక, యరద మెక్కి యల్ల నరిగె సేన
మొగమునకు రయంబు మిగుల విశోకుఁడు, దేర భీముఁ డెక్కెఁ దేరు ప్రీతి.

వ. అవ్విధంబున ధనురాచార్యు బెట్టు వఱచి బిట్టు సనునాజెట్టిబిరుదున కెదుర్పం
జాలక భోజబలంబును గాంభోజానీకంబును యవనాదిమ్లేచ్ఛసైన్యంబులును
బసులు పులికిం బాఱు తెఱంగునం గలంగి పఱచె న ట్లప్రతిహతగతిం బోయి
సాత్యకిసమరోల్లాసంబు గనుంగొనుచు నల్ల కడచి యవ్వడముడి దివ్యరథంబు
మెఱయఁ గౌరవ్యయోధులతోడం బెనంగుసవ్యసాచిం జూచి సింహనాదంబు సేసిన
నతనిం గనుంగొని ప్రియంబున నయ్యర్జునుండును హరియును గర్జారవంబుల
గగనంబు నినిచి యమ్మహారావంబు లాకర్ణించి యుధిష్ఠిరుండు భీమునాజ్ఞాపనం

1 డు నని ప్రీతి-యొనర్చినఁ... గాక నిను సైఁతునె- యొనర్చెద... మొనరింతుఁ గాక నినఁ

బునకు సంతుష్టాంతరంగుం డై తనలోనన యతని నగ్గించి యన్నరనారాయణుల మెలుంగులు వినం గనుటకుం బొంగుచు నప్పార్థుండు దన ప్రతిజ్ఞ నెఱపి వచ్చి తన్నుం గౌఁగిలించికొనుటం గోరుచుం గౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం దెగం బొలియుట తెలిసి యయినను దీరునకుం జొచ్చి యున్నవారి నైనం గాచికొనునో యని యూహించుచుఁ గయ్యంబు సేయు చుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 156

ఆ. ఇట్లు సింహనాద మిచ్చిన భీముని, మార్కొనంగ మగఁడు మనబలమునఁ గలిగెనే మదాత్మజులఁ గాల్పఁ బుట్టిన,చిచ్చు వాఁడు వానిఁ జెనయు టరిది.

చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రున కప్డు కర్ణుఁ డ య్యనిలతనూజు మార్కొని రణయంబున వింశతిసాయకంబు లే సిన నతఁ డేడుతొమ్మిదులు చెచ్చెర నేసి సిడం బొకంట నే పునఁ [1]గుదియించె సారథికపుంగవు లట్లు దొడంగి యుద్ధతిన్. 158

వ. పెనంగునెడ భీమసేనుండు. 159

క. సూతసుతువిల్లు ద్రుంచిన, నాతఁడు బలువింట నొంచె నతని వెస మరు త్సూతి యదియుఁ ద్రుంచుచుఁ ద,త్సూతునిఁ దురగములఁ ద్రుంచెదుర్దమలీలన్.

ఆ. విరథుఁడై యతండు వృషసేనురథ మెక్కఁ, బాఱుటయును గలఁగి బాఱె సేన లట్టియెడ నృపాలుఁ డాచార్యుపాలికిఁ, జనియెఁ దేరు దోలికొని రయమున.

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱి వాడుట.

వ. చని యడిచిపాటు గదుర నతనితో ని ట్లనియె. 162

క. నరుఁడును సాత్యకియు వృకో,దరుఁడును మనసేనఁ గలఁచెదరు సైంధవుఁ జే రిరి నీకుఁ దగునె నరునిం, జొర నిచ్చితయేని వారిఁ జొర నీ ననఘా. 163

క. సమరంబున నీ వోడుట, సముద్ర మింకుట జయించె సాత్యకి గురుఁ గ య్యమున నని యెసఁగుజనవా,దము మేలుగఁ దలఁచితొక్కొ రధనురాచార్యా.

క. ఈభంగి నీ వడంగుట, మాభాగ్యము గాక యింక మాటలు వల దీ క్షోభం బెట్టు లుడుఁగుఁ జెపు,మా భవదీయబలశౌర్యమతులకుఁ దగఁగాన్. 165

చ. అనవుడు నాతఁ డిట్టు లను నక్కడ నిక్కడ నొక్కరూపునన్ మనమొన కై నయీమెడరు మాన్పఁగ నోపినయంత మాన్చెద న్వినుము విశిష్టకార్య మవనీవర సైంధవుఁ గాచికోల య ర్జునునకు నీకునుం గలిగె జూదము నాఁ డధికంపుటొడ్డుగాన్. 166

క. మును శకునిబుద్ధిమై గెలి,చినయది యస్థిరపుగెలుపు సెడ కీజూదం బున వెడలఁబాటు సూవే, మనవెరవును లావుకలిమి మనుజాధీశా. 167

వ. కావున నీవు సుస్థిరోత్సాహుండ వై సాహాయ్యంబునకు నద్దెస నున్నకర్ణాదులం

---

1 నిగిడించె.

గొని కవ్వడి మొదలగు నమ్మువ్వురకుం జాలి [1]సింధురాజరక్షణంబు నిర్వహింపు మేను సేనాముఖంబున నిలిచి తక్కినయందఱ నిలువరించుట మేలు నీతో వచ్చుట కర్జంబు గాదు పొమ్మనుటయు నతండు మరలి తన్నుం దాన పురికొలిపికొనుచు నటసనియె నప్పుడు యుధామన్యుండును నుత్తమౌజుండును మున్ను కృతవర్మచేత నివారితులై నరునితోడ నడుమం జనక కెలని కుఱికి యుఱిముఱి మనమొన దెఱల్చికొని బయలికి వెడలి కపిధ్వజగాండీవగుణరావంబులకతంబున నతనియున్న యెడ యుపలక్షించి తిరిగి వచ్చి బలువున మనబలంబు వాయఁ బాపికొని చొచ్చి వివ్వచ్చుం జేర వచ్చుచున్నం గని యక్కురువిభుండు వారల వారింపం గడంగిన.

క. ఆయిరువురతో నజ్జన:నాయకునకు నయ్యె దారుణరణం బగురణ మం
డాయతనృపచాపము రో,షాయత్తత నుత్తమౌజుఁ డార్చుచుఁ దునిమెన్. 169

తే. తునిమి తోడన యురమాడ సునిశితాస్త్ర
చయము నిగిడింప రాజొండుచాప మెత్తి
యతనిహయముల సారథి నవనిఁ గూల్చె
నాతఁ డరిగె యుధామన్యునరదమునకు. 170

క. అరిగి తురగముల సూతుం, బొరిగొన విరథుఁ డయి నృపతి పొలివోవక యు
ద్ధురగతి గద గొని చని త,త్తురగంబుల సారథిని జిదుర్పలు సేసెన్. 171

తే. రథము డిగ్గి తొలంగి రాకరథికు లమ్మ,హీశుఁ డేతెంచి యెక్కె మద్రేశు తేరు
వారు నీయోధు లిరువుర బారిసమరి,యారథము లెక్కి యర్జునుఁ జేరఁ జనిరి.

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లను మనవా రెల్లం గర్ణుండు గాంతే యుల గెలుచు సని యాసపడుదు రాధర్మతనయుం డాతనియాటోపంబు దలంచి రే లెల్లను గన్ను మూయండు. 173

ఆ. అట్టిజెట్టి యనిలుపట్టిచే విరథుఁ డై, పోయి పోయినట్ల పోమెఁ గాని
మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు లాతని, తెఱఁగు సెప్ప నాకుఁ దేటపడఁగ.

చ. అనవుడు నాతఁ డిట్టు లను నన్నరనాథున కట్లు సూతనం
దనుఁ బొరివుచ్చి భీముఁడు మదంబున నర్జునుదిక్కు వోవఁగాఁ
గని యతఁ డాయితం బయి తగం దనపేరెలుఁ గెత్తి పిల్చె నా
ధ్వని విని యావృకోదరుఁ డుదగ్రగతి మరలె మహీశ్వరా. 175

వ. అట్లు దార్కొని యర్కప్రతాపు లగునయ్యిరువురు నొండొరుశరంబులు దూలించుచుఁ దురంగంబులయంగంబులం దూపులఁ గీలించుచు సారథుల బెట్టు వఱచుచుఁ జాపంబులు విఱుచుచు మైమఱువు లఱువుల్లు సేయుచు మేనులు నెత్తుట జొత్తిల్లఁ జేయుచు నొండొరులకు వేఁడిమి సూపి యేపునం బెనంగు నెడ నయ్యనిలతనయుండు. 176

---

1. సింధురాజుప్రాణంబులు నిర్వ.

క. విలు దుమురు సేసి గుఱ్ఱం, బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం
బులఁ జేడ్పఱిచిన సిగ్గఱి, కలఁగి పఱచి యొండురథముఁ గర్ణుం డెక్కెన్. 177

క. అన విని ధృతరాష్ట్రుం, డి, ట్లను నమ్మినబంటు పిఱికి యై యిటు పఱవం
గని మందిబుద్ధి దుర్యో, ధనుఁ డేమని తలఁచెనొక్కొ తనచిత్తమునన్. 178

వ. అది యట్లుండె నాకర్ణునిబింకంబు పిదప నెట్లయ్యె ననవుడు సంజయుం డతని కిట్లనియె. 179

తే. ఆననంబునఁ గ్రోధమహానలంబు, భీషణముగ రాధేయుండు భీముదెసకు
మరలియురవడిఁగవియనయ్యిరువురకు మ,హాద్భుతంబగుసంగ్రామమయ్యె నధిప.

క. బలుడేగలకై వడిఁ బె,బ్బులులపగిది మత్తకరులపోలిక దర్పో
జ్జ్వలసింహంబులచాడ్పున, నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రారథికవరుల్.

క. పెనఁగు నెడం గర్ణునిది,క్కునఁ జతురంగములు బెట్టుగోల్తల నాభీ
మునిమీఁదఁ గవిసి మంత్రిం,చినయట్టులు గూలె నతనిచేతిబలువునన్. 182

వ. అనవుడు నాంబికేయుండు. 183

క. తొడరెడుకోలఁదియె వానికి, వడముడిభుజవిక్రమంబు వారల మనమె
ప్పుడు వినమొ కర్ణు వినమో, యడిబీరపుఁదులువ గెలుచునట పాండవులన్

ఉ. సూతసుతుండు పాండునృపసూనులఁ బోర జయించు నంచు గ
ర్వాతిశయంబునన్ మనమబాంధవుఁడు కృష్ణుఁ దృణీకరించి సం
ప్రీతిగ సంధి సేయఁడ యపేతకళంకులు వారు వారి కే
లం తగ నేది దైవము దలంచు రణంబునఁ జేటు సంజయా. 185

వ. తానును దమ్ములుం జెడుదు రింతియ కాక [1](యొండు గలదే) యది యట్లుండె భండనంబుతెఱంగు సెప్పు మనిన నమ్మనుజపతికి నాసూతసంభవుం డిట్లనియె.

చ. సమసినసేనఁ జూచి రభసంబునఁ గర్ణుఁడు భీముఁ గిట్టి ద
ర్పము సిగురొత్త ముప్పదిశరంబుల నొంచినఁ గెంపుసొంపు వ
క్త్రమునకు నొప్పు సేయఁగ నతండు వెసన్ విలు ద్రుంచి సూతుప్రా
ణముఁ గొనినం జలంబెడఁ బెనంగొన వాహనచోదకుండు నై. 187

వ. అతండు శక్తి వైచిన. 188

క. ఎనిమిదితునియలుగా నది, దునిమి మఱున్నందనుండు తొమ్మిదిశరముల్
తను వాడ నేయ బలువిలు, గొని యన్నియ కర్ణుఁ డేసెఁ గ్రూరాస్త్రంబుల్.

క. వాని నెడ నఱికి యుప్పవ,మానతనూభవుఁడు నిశితమార్గణములు పై
పై నిగిడింపఁగ రాధా,సూనుండును సాయకముల[2]సోనలు గురిసెన్. 190

క. చెలఁగువటుసింహనాదం,బులు అంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభం
బులక్రియ నొండొరులకునూ,ర్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలులై.

---

1. ఇది ప్రాఁతప్రతులఁ బెక్కిట లేదు. 2. సోనఁగఁ.

ఉ. అత్తఱిఁ గర్ణువిల్లును హయంబులు నుగ్గుగ నేసి నెత్తురుల్
జొత్తిల మేన బాణములు సొన్పి మరుత్సుతుఁ డార్చె నార్చినం
జిత్తము దల్లడిల్ల గురుసింహుఁడు దుర్జయుఁ బన్న నాతఁ డ
త్యుత్తమసాహసప్రకటితోద్ధతి నాజగ జెట్టెఁ దాఁకినన్. 192

తే. బలము లచ్చెరు వంద నశ్లలవు మెఱయ, నీసుతుఁ డనిలసుతుఁ దాఁకి నిశితసాయ
కములనొప్పించిరథతురంగమములనొంచి, సూతునో నేయఁ గ్రోధవిస్ఫూర్తినతఁడు.

క. తురగములతలలుఁ సూతుని, శిరము నతనిమస్తకంబు శితశరపట్కా
స్ఫురణమున ధరణిమీఁదం, దొరఁగించెం గర్ణుఁ డేద్పుతోఁ గనుఁగొనఁగాన్.

వ. ఆలోనన సూతసూనుండు రథంబు సన్నద్ధంబు సేసికొనినవాఁడగుట నప్పాండుతన
యుం దలపడియె నమ్మేటిమగలు కోపంబులు నాటోపంబులు బలంబులుఁ జలం
బులు శౌర్యంబులు ధైర్యంబులు మెఱయు తెఱంగునం బెనంగి రట్టియెడ. 195

మ. ఖరనారాచము భీమువక్షమున నాకర్ణుండు బాహాబలా
భరణుం డై నిగిడింప నుచ్చి చని భూభాగంబు నాటంగ నా
తురతం బొంద కతండు నిష్ఠురగదం ద్రుంచెం దురంగంబులన్
ధరణిం గూల్చె ధనుర్విలాస మలరం దత్సూతునిం గేతువున్. 196

మ. విరథుం డయ్యును రాధనందనుఁడు దోర్వీర్యం బవార్యంబుగా
శరజాలంబుల భీముఁ గప్పుట మహాశ్చర్యంబు గావించె భూ
వరుఁ డంతం దనతమ్ము నారథికుఁ గారవం బంచె నాదుర్ముఖుం
డు రయం బారఁగఁ దాఁకె భీమునకు నాటోపంబు దీపింపఁగన్. 197

క. అయ్యంగరాజుతోడం, గయ్యము సేయుచును దుర్ముఖప్రాణంబుల్
సయ్యనఁ దొమ్మిదియమ్ములఁ, గ్రుయ్యక డయ్యక యతండు గొనియె నరేంద్రా.

వ. ఇట్లు భవదాత్మజుండు పడుటయు. 199

ఉ. ఆతనిఁ జూచి కన్నుఁగవ నశ్రులు గ్రమ్మఁగ సూతసూతి శో
కాతురుఁ డై తదీయరథ మల్లన యెక్కఁగ భీమసేనుఁడు
ద్యోతిత హేమభూషితచతుర్దశమార్గణవిద్ధుఁ జేయుడు
న్నాతశరంబు లన్ని వెస నాటె నతండును దమ్ముజలంబులన్. 200

వ. దానం గనలి యనిలతనయుండు. 201

ఆ. వాఁడినారసములు మూఁడు కర్ణునిఁబొమ్ము, గాఁడ నేయ నాన గడచి నొవ్వ
భయముఁ గదురఁ జేయ రయమునఁ నరదంబు, దోలికొనియ తండు దోలఁగఁ బాఱె.

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 203

క. విను పౌరుషము నిరర్థక, మనుమానము లేదు దైవ మధికంబు మరు
త్తనయునిచే నారాధా, తనయుం డి ట్లగుట నెవ్విధంబునఁ దలఁపన్. 204

క. అ టన నేల మహాబలు, పట్టికి సురఖచరదనుజపన్నగులును నా

ర్పెట్ట రనినఁ గర్ణాదుల, కెట్టు నిలువ వచ్చు వానికెదురుగం దిర మై. 205

క. పాండవుల గెలుచు నాజి ని, తం డని యగ్గించుసూతతనయుని పుత్
త్రుం డతఁడు భీము నేపున, గం డడఁగినఁ జూచి మనసు గందక యున్నే. 206

క. వినఁడె జరాసంధాదులఁ, దునుముట మనదుర్జయుండు దుర్ముఖుఁడునో భీ
మునితోడఁ బెనఁగువా రే, మని కర్ణునిఁ గావఁ బనిచె నబ్బాలకులన్. 207

క. పవనజుఁ డొక్కఁడె పెఱపాండవులును సాత్యకియు హరియు డాఁతురె యుగ్రా
హవమునఁ [1]బ్రాణము లావున, నవిజయ్యులు వారిఁ దొడర నగు నే తనకున్.

చ. అని పలుమాటలాడుటయు నమ్మనుజేంద్రునితోడ నాతఁ డి
ట్లను విష మెత్తి క్రోలి యది యంగము నారట పెట్ట నన్యులం
గినిసినయట్ల మీఁదు పరికింపక యిమ్మెయి నీవు పాండునం
దనులకుఁ జెట్ట వై హృదయతాపము వచ్చినఁ [2]బల్కెదొందులన్. 209

వ. ఊరక బవరంబు తెఱంగు వినుము నీతనయులు దుర్మర్షణుండును దుర్మదుండును దుస్సహుండును విజయుండును విచిత్రుండును గర్ణునోటమి సయిరింపం జాలక వడముడిం దొడరి తూపు లడరించినం జూచి యాసూతసూనుండు దానును నతనిపయిం గవిసి యేసినఁ దద్విశిఖంబుల వారించుచు మారుతనందనుండు.

ఆ. ఏచి కురుకుమారు లేవురఁ దురగసారథులతోడఁ గూడ రయము మెఱయ
వసుధఁ గూల్చె మెఱుఁగువాలారుతూపులఁ, జాఱు నిగుడఁజేసి యద్భుతముగ.

క. అనిఁ బడినరాచకొడుకులఁ, గని కర్ణుం డేటి బ్రతుకు గా బ్రదికెద నే
నని యింక నెన్నఁటికి [3]లా, వని భీముని నొంప వలదె యని తెంపెసఁగన్. 212

ఆ. కదిసి డెబ్బదేను కాండంబు లాతని, మేనఁ బఱపి యుబ్బు మిగిలి నవ్వ
నతఁడు నూటయేను శితవిశిఖంబుల, నతని నేసి చాపయష్టిఁ ద్రుంచె. 213

మ. రయమారఁగ బలువిల్లు పుచ్చుకొని యారాధాసుతుం డేయ దు
ర్జయుఁ డమ్మారుతి వొంగి సూతుని వెసం జా నేసి విల్ ద్రుంచుచుం
హయసందోహముఁ గూల్చి [4]హాస్యమునకుం హాసంబు సేయంగ గద
న్భయదాకారత వైచె నాతఁ డది భగ్నం బయ్యె నాభీముచేన్. 214

వ. ఇట్లు గద ద్రుంచి పైపై నేయుపావనిబరవసంబునకుం దెరలక యొండుకోదండంబు గొని కర్ణుం డతనితనుత్రాణంబు దునియలు సేసి పెల్లేసిన నతండును దదీయకంకటంబును భుజంబును భేదించె నిష్ఠురుసునఁ బాదచారి యై పెనంగు నయ్యోధవరుం జూచి భూవరుండు సత్వరుం డై పనుపం జిత్రవిచిత్రచిత్రాక్షచారుచిత్రులును జిత్రధ్వజచిత్రాయుధచిత్రకర్ములును ధర్మపుత్త్రానుజుం దాఁకిన నతండు మహావాతపతితభూరుహప్రతతిభంగి దోఁప నక్కుమారసప్తకంబును రథసప్తిసారథిసహితంబుగాఁ బొడవడంగం జేసి నాసందునఁ గల్పితస్యందనుం

1. బ్రాణంబులు విను, మవిజ. 2. నొక్కఁ బల్కెదే. 3. రానన. 4. యాస్య...హాస్యంబు.

డై యాసూతనందనుం డప్పాండునందనునిపై నురవడించిన. 215

క. అతిమతి నిరువురశరములు, తఱుచగ నొండొరుల బెట్టు దాఁకిన నయ్యు
ద్ధము నెత్తుటఁ దోఁగి కడున్, బఱలిరి కల్పాంతనవదివాకరుల క్రియన్. 216

క. అరదములు చిత్రగతులం, జరియింపఁగ ధైర్యములును శౌర్యంబులు ను
ద్ధురబాహావీర్యంబులు, సరి యై మెఱయంగ నధికసంరంభములన్. 217

ఉ. ఒండొరుమీఁద సాయకము లొక్కమొగిం బరఁగింతు రేపుమై
నొండొరుబాణముల్ నఱకి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై
యొండొరుమేనులన్ శరము లుచ్చి చనన్ నిగిడింతు రిట్టు లు
ద్దండతఁ బోరి రాఱనిమదంబుల నొండొరు మీఱునాసలన్. 218

క. మరుదాత్మజుఁ డేచిన న, న్నరుఁడు హరియు సంతసంబున బొదలుదు రు
ద్ధురతం గర్ణుఁడు మిగిలినఁ, గర ముబ్బు విభుండు దమ్ముగమియుం దానున్. 219

తే. సూతనందనునకు నెడ సొచ్చి చొచ్చి, సమదుఁ డగుభీమసేనుచేఁ జచ్చి చచ్చి
బలములఱుగ నాకర్ణుండు దొలఁగిపోవఁ, [1]జూచుఁ దెగిపోఁడుపడిన నీసుతులఁ జూచి.

వ. శోకంబునం గోపంబునం గర్ణవిక్రమాటోపంబు దీపించిన. 221

క. గొడుగునను పింటికొమ్ముల, సిడమున నరదంబునందు సెల లవిసి కడున్
వడి నిగిడెడుచాడ్పున న, న్వడిముడిదెస నమ్ము లడరె వసుధాధీశా. 222

క. దానికి మనమున నించుక, యైనను దలఁకక సమీరణాత్మజుఁ డవి పై
రానీక నిలిపి యతనిం, జా నిరువదినారసములఁ దలరఁగఁ జేసెన్. 223

వ. అప్పుడు. 224

క. మనవారు వారివారలు, ననిలతనయువిక్రమంబు నగ్గింప సుయో
ధనుఁడు దనయొద్దియోధుల, ననుజులనుం గర్ణుఁ గావుఁ డని పనుచుటయున్.

భీమసేనుచేత శత్రుంజయాదికురుకుమారులు చచ్చుట.

వ. అప్పుడు శత్రుంజయుండును శత్రుసహుండును సుదేహుండును మదనుండును ద్రుముండును జిత్రబాహుండును వికర్ణుండును గర్ణరక్షణపరు లై కడిమి వెలయఁ దలకడచి యొక్కట భీమసేనుం దాఁకి [2]ధరాధరంబు సంబుధారలం గప్పు జలధరంబులచందంబున నతని నతినిబిడశరపరంపరలం బొదివినం బెరిఁగిన దర్పంబునం బొదలి యతండు దృఢైకముష్టినిర్ముక్తమార్గణసప్తకంబున వారిం బిలుకుమార్చి యార్చిన నాసింహనాదంబు విని ధర్మతనయుం డది విజయాగ్రజుండు నిజవిజయం బెఱిఁగించుటగా నెఱింగి మనంబునం బొంగి ద్రోణుదెసకుఁ దఱిమి కయ్యంబు సేసె నట్లు పలువురుదమ్ములు వ్రాలిన దుర్యోధనుండు దన మనంబున జూదంబునప్పుడు విదురుండు చెప్పినట్ల యగుచున్న దని విషాదంబు

1. జూచి తెగి మ్రోడువడిన నీసుతులఁ. 2. ధారాధరంబులు నగంబు నంబుధారలం గప్పుచందంబున.

నొంది యాసభ నమ్మెయిఁ బాండవులం బఱిచినపాపఫలం బనుభవించె ననవుడు
వైచిత్రవీర్యుండు. 226

క. గతవృత్తములకు వగవం, గత మేమి యతండు వెట్టి కార్యము నాదు
ర్మతిఁ దప్పె నోర్చి కొడుకుల, కత విని మెదఁ జెప్పు చెప్పఁ గలయది యెల్లన్.

వ. అనిన నతనికి సంజయుం డిట్లను నట్లనిలజుండార్చినం బేర్చి కర్ణుండతనిపయింగవిసి
ఘోరసంగ్రామంబు సేయుచుండ నీసేన భీమసేనుఁ జుట్టుముట్టిన నతండు వెట్టి
దంబు లగుభల్లప్రముఖబాణంబులఁ గేతుచ్ఛత్రచామరంబులు సూతరథరథ్య
రథికావయవంబులుఁ దురంగమాతంగసుభటాంగంబులుఁ దునియ లై తొరఁగి
పెరుఁగు నెత్తురుటేఱులవెంబడిం బాఱం జేయుటయుఁ బరితశేషం బగునబ్బలం
బిరుగెలంకులం దొలంగి [1]యంపపెట్టునేల కవుల సని చూచుచుండె వెండియు
రాధేయుండు రయంబున నతనిం దాఁకి పోరె నట్టియెడ నమ్మారుతనందనుండు.

క. ఆభీలతఁ గర్ణునిక,ర్ణాభరణము చుక్క వడినయట్లు వడఁగ సం
శోభితశరమున నేసి మ,హాభల్ల మురస్స్థలమ్ము నాడఁగ నేసెన్. 229

క. ఆలోనన యారథికుని, ఫాలస్థలి [2]నోలి నెనయఁ బదినారసముల్
గీలించిన నవి యచ్చట, నీలోత్పలమాలవోలె నెఱయం బొలిచెన్. 230

తే. అలిగి బాణశతంబున నాతఁ డతని, నొంచె సర్వీరుచాపంబు ద్రుంచె నతఁడ
పఱపె బలువింటఁ గర్ణుండు పటుశరములఁ, బట్టపవలింటిసూర్యుని ప్రభలు వోలయ.

వ. ఇ ట్లేయునాసూతనందనువిల్లు[3]విదుర్పు దోఁపక గుడుసువడుటఁ జక్రాకృతిం బొ
లుచుననలశిఖలచెలువు దాల్చె నట్టిరయంబునకు భయంబు గొనక భీముండు
నిగిడించుహేమలిప్తనారాచధారలు గగనలక్ష్మి కనకాభరణంబులచెన్ను చేకొ
నియె నప్పుడు కోపంబు రూపంబు గైకొన్నకైవడి నుదీర్ణుం డై యక్కర్ణుండు.

చ. పవనజుచాపమౌర్వి హరులపగ్గములుం దునుమాడి కాఁడిలో
నవి పెనఁగాడఁగా వెడఁదయమ్మునఁ గేతువు గూల్చి సూతుమే
నవియఁగ నేసినం బఱచె నాతఁడు ఫల్గునుచక్రరక్షుతే
రివెనుక కుగ్రశక్తి యడరించెఁ జలింపక భీముఁ డత్తఱిన్. 233

క. అది సూతనందనుఁడు దొ,మ్మిదిశరములఁ దునుముటయు సమీరసుతుఁడు వె
ట్టిదముగ వాలుఁ బలకయు, న్మదమునఁ గొన నతఁడు పలక నఱకె నఱకినన్.

మ. కరవాలంబున వైచి యారథికువిల్ ఖండింప నొండొక్కని
ష్ఠురచాపం బతఁ డెత్తునంతకు జవాటోపంబుఁ గోపంబు మ
చ్చరముం దేటపడన్ వియచ్చరులు మెచ్చన్ భీముఁ డాసూతసూ
తిరథం బల్లలనాడ దానిపయికిం దెం బొప్ప లంఘించినన్. 235

వ. అతండు కేతనంబునకుం గుదుసుగాఁ బెను పొనరం గావించినపీఠంబు[4]నడుగున

1. యంపపెట్టున-కొలంది-కవులం. 2. నోలి నేయ. 3. విడుపు-నిలువు. 4. నాదుఁగున-నొదుకున.

నోదింగినం దేరిపయి నతనిం గానక భీమసేనుండు నలుదిక్కులుం బరికించి యతని పొలుటయు లేకున్న నయ్యరదంబుక్రిందఁ దూఱె ననుతలంపున నతనిం బట్టికొను వాఁడై డిగ్గ నుఱుకుటయుం దోడన తోఁచి రాధేయుండు రథచిత్రగతులు మెఱయరయంబారఁ బెక్కునారాచంబు లొక్కమొగిం దనువునఁజొనుపుచు నేచిన నయ్యనిలతనయుండు సాధనవైకల్యంబున వెడంగుపడియును వెన్నీక మున్ను విన్వచ్చుచేతం జచ్చినసామజంబుల హయంబులఁ బుచ్చికొని డాచేతనొడ్డుకొనుచు వలచేత వైచుచుఁ బెనంగి నవియును వివిధవిశిఖంబులఁ దునియలు సేయుచు నెఱకులు నోనేయుచుఁగర్ణుండు గదిసి తఱుమఁ దదీయస్యందనంబునకు దుర్గమం బగుననియతం డర్జునాస్త్రపతితంబులైనచతురంగంబులతిట్టలమోలంబు సొచ్చిన.

తే. మొనలతోడను దనతోడ ♦ మున్ను పెనఁగి
శ్రమము వొందియు న ట్లరదమున కరిగి
వెండియును బోరి కడు డస్సి ♦ బెండువడిన
యన్నిరాయుధుఁ జూచి సూర్యతాత్మజుండు. 237

క. మనమునఁ గుంతీవాక్యం,బును నొలసిన నేయు టుడిగి ♦ పోయి కదిసి న
వ్వున మో మొప్ప నతని కి, ట్లను వింటం గడుపు లీల ♦ నల్లఁ బొడుచుచున్.

—కర్ణుఁడు భీమసేను నవమానించి నీచోక్తులు పలుకుట.—

ఆ. తిండిపోత నీకు ♦ భండనం బేటికిఁ, గడవఁ జేరి మనసు♦కాంతఁ దీఱ
నోపుకొలఁది మ్రింగి ♦ యూరక నీ వింటి, కడన యుండు మింక ♦ నడిచిపడక.

వ. అని మఱియును. 240

క. వనమున ఫలమూలంబులు, దిని మునివై యుండఁ గాక ♦ ధీరోద్ధతిమై
నని సేయ నీకు వచ్చునె, చను మచటికి [1]నుడిఁగి మడిఁగి ♦ శాంతుఁడవోలెన్.

వ. అట్లు నీయొడ లుండదేని. 242

క. చేయలఁతిం గని సమరము, సేయుము ననుబోఁటితోడఁ ♦ జెనయకు నరనా
రాయణులు వారె యచటికిఁ, బోమెద వేఁ బోయి బ్రదుకు♦పొంక మడుగుమీ.

క. అని పలికె నట్టియెడఁ గృ, ష్ణునిపనుపున నర్జునుండు ♦ సునిశితనారా
చనితాంతపాతముల నా,తనిఁ బిఱుసనఁ జేసి భీము♦దైన్యము వాపెన్. 244

క. మండెదుబలునారసముల, వెండియు నారజ్జులాని ♦ విన్వచ్చుం డు
ద్దండత నేసినమెడ నవి, ఖండించెను గురుసుతుండు ♦ గర్వం బలరన్. 245

వ. అప్పు డశ్వత్థామ యఱువదినాల్గునారసంబుల నొప్పించిన నన్నరుండు నిలు నిలు మని యదలించినం దెరలి యతండు కరులగమిఁ జొచ్చె నాలోనన యన్మావతి సారథి యగువిశోకుండు తే రాయితంబు సేసి తెచ్చిన నెక్కి యాతండు విన్నని మొగంబుతోడఁ గవ్వడికడకుఁ జనియె నప్పుడు సాత్యకియు నద్దిక్కునకు సగర్వ

1. నడఁగి మడఁగి.

గమనంబునం బోయె ననిన విని వైచిత్రవీర్యుండు సంజయునితో ని ట్లనియె. 246

క. బలియురతోఁ బగ గొనినం, గలుగునె మే లెల్లభంగిఁ | గాంగేయులకుం
గలపా లీఁ దగుఁ దోడ్తోఁ, గలిమియుఁ గీర్తియును బొలియఁ | గా విన వశమే.

క. విను మడుగులపైఁ బడి యై, నను నెంగిలి గుడిచి యైన | నరులకుఁ బగ లోఁ
గొని యరుల[1]కును పడఁచి బ్రదు,కనవలయునిహమ్ముఁబరముఁ | గలుగునె చెడినన్.

క. తా నెఱుఁగఁ డొరులు సెప్పిన, నైనను విన నేరఁ డట్టి | యతిబాలిశు నిం
కే నే మందుఁ గొడుకు దు,ర్మాని గనునె బ్రదుకుపోక | రాకలు దెలియన్. 249

250

వ. అది య ట్లుండె.

ఆ. గురునిఁ గడచి నరుఁడు | గురుసేన సొచ్చిన,యపుడ తెగియెఁ గార్య | మదియుఁగాక
కలసి రట్టిబల్లి | దులు భీమసాత్యకు, లకట సైంధవుండు | హతుఁడ కాఁడె. 251

వ. సమరవిశేషంబు తెఱం గెఱింగింపు మనిన నమ్మహీపతి కతం డి ట్లను నట్లు శైనే
యుండు గాంగేయులం గూడం బోవ నలంబుసుం డనురాజు బలంబు మెఱయ
నతని మార్కొనిన నయ్యిరువురకుఁ బరస్పరబాణభంజనరబును వర్మవిదారణం
బును మర్మభేదనంబును ధనుర్దళనంబును భూచరఖేచరవిస్మయకరంబును నగు
సంగరం బయ్యె నొక్కింతసేపునకు నాశినిపుంగవుండు. 252

క. [2]తురగములఁ జంపి సారథి,శిరము ధ్రునిమి కుండలములఁ | జెలు వారెడున
న్నరపతితల యిలఁ బడ ను,ద్ధురభంగి వెడందవాతి | తూపుల నేసెన్. 253

క. ఏసి యెలమి నరుగఁగ దు,శ్శాసనుఁడు మొగంబుగా వెరసఁ | నీకొడుకుల్
డాసిన నవ్వీరుఁ డనా,యాసంబున దుస్ససేను | హయములఁ జంపెన్. 254

వ. చంపి యతనిరథంబునకుఁ గవియుడుఁ ద్రిగర్తులనేకు లడ్డంబు సొచ్చిన నతండు
సేయంగలవారిం బంచశతరథికులం [3](బంచత్వంబు నొందించి బలంబుల) బడలు
వడం జేయఁ బెఱవారు విఱిగిన నాసత్యకసుతుండును మెఱసి చన శూరసేన
సైనికులు దొడరుటయు దోర్విలాసంబు నెఱపి పఱపి కళింగులు గవిసినఁ
గం డడంచి కడచి గాండీవిం గనుంగొని జలాశయంబు [4]వెలువడి సుస్థ
లంబు సేరిన ట్టాశ్వాసించుచున్న నచ్యుతుం డయ్యోధవరు నాలోకించి నరు
నుద్దేశించి. 255

మ. కృతవర్మాదులఁ జెప్ప నేల గురున | క్షీణప్రభావంబు ము
న్నితఁ డెబ్భంగి నడంచె నొక్కొ యొకరుం | డి ట్లేపుమై రాకకుం
గత మాధర్మజుపంపు సేసెన సమ | గ్రస్నేహముం జూపెఁ జూ
చితె నీశిష్యుని సాత్యకిం బటుభుజ | శ్రీగర్వనిర్వాహకున్. 256

---

1. పెను పడఁచి. 2. హరులఁ బడ నేసి సారథి. 3. ఇది పెక్కిట లేదు. 4. వెలువడి సింధు
రంబు సుస్థలంబు సేరిన ట్లాశ్వాసితుండు గా నచ్యుతుండు.

వ. మన కింతప్రియం బగునే యనిన నతనికి నయ్యింద్రనందనుం డిట్లను నితనిరాక నాకప్రియంబై తోఁచె నెట్లంటేని ధర్మరాజరక్షణంబున కితనిం జాలించి వచ్చితి మీరథికుం డచ్చట లేమి నతం డే మగునో యెఱుంగ మాభూపతియును భారద్వాజుబారి నున్నవాఁడు సైంధవుండును నేలకు వ్రాలెండు ప్రొద్దునుం బెద్దయు వ్రాలె నది యట్లుండె బలసారోదారు[1](లైనగురుకృతవర్మాదు)లగుననేక యోధవీరులతోడం బోరి రథ్యసారథిసహితంబుగా నిప్పురుషార్థపరుండు డప్పిం బడి తెప్పిఱం గాననియాలోనన కయ్యంబున డయ్యనివాఁడును సహాయసంపన్నుండును నగుభూరిశ్రవుం డదె తలపడఁగడంగెడు నక్కురుసింహుండు శక్తిచాతుర్యశౌర్యధైర్యాస్త్రవీర్యసమగ్రుండునుం గావున నిది సాత్యకికిఁ జాల డెప్పరం బైన తెఱంగు వాటిల్లెఁ బాండవాగ్రజుం డీయన నిక్కడ కేల పుత్తెంచె గురుం డామిషంబునకు వేచుడేగచందంబునఁ దనకు వేచుట దలంపవలవదే యనుచున్నసమయంబున నాసోమదత్తసూనుండు శైనేయున కడ్డంబు వచ్చి నిలు నిలు మని యదల్చి వెండియు. 257

భూరిశ్రవుండు సాత్యకితో యుద్ధంబు చేసి మడియుట.

సీ. తేఁకువ లేక పుఽత్తెంచిన [2]యప్పాండ,వజ్యేష్ఠునకుఁ దలఽవంపు గాఁగ
వచ్చుచో మార్కొని ఽ చచ్చినవారల,బంధులోకమునకుఁ ఽ బ్రమద మెసఁగ
నంతంతఁ జనుదేర ఽ నాదట గనుఁగొను, శౌరికిఁ బ్రాణంబు ఽ జల్లనంగఁ
బెనఁగించి గెలిపింతు ఽ నని యాస సేయుకి,రీటికి నాలావు ఽ దేటపడఁగ
తే. నాయుధంబులఁ దునిమి రఽథ్యములఁ గూల్చి
సూతుఁ దెగటార్చి తనువునఽశోణితంబు
వఱపి పఱుపుదు నిలిచిన ఽ నుఱక పట్టి
వ్రచ్చి పడవైతు నెందు వోఽ వచ్చు నీకు 258

క. అనిన విని నవ్వి నాతో, నని సేఁతకుఁ దెంపుసేసి ఽ యడరెదురథికుం
గనుట యది నాకుఁ బండువు, వినవే మీ కెల్ల వేరుఽవిత్తని నన్నున్. 259

వ. అని పలికి సాత్యకి మఱియును. 260

ఆ. ఎదుర నుండ వెఱచి ఽమదమ మఱి దవ్వుగా, వచ్చి యొదిఁగి తేల ఽ పెచ్చువెఱిగి
ప్రేలె దిపుడ పట్టి ఽ నాలుక గోసెద, మాను మాను రిత్తఽమాట లేల. 261

వ. అనియె నట్లయ్యిరువురు నొండొరులఁ బరుసంబులు వలుకుచుఁ దలపడి పలుతెఱంగుల మెఱుంగుటమ్ము లొండొరులపై నిగిడించుచు నొకల్లొకల్లమార్గణంబులు మగిడించుచు వర్మంబులు వ్రయ్యనేయుచుఁ దనువులు నెత్తుట జొత్తిల్లంజేయుచుఁ దమ్ము సేన లేనికపోరు సూచునట్లు సూడం బోరి పోరి పరస్పరతురంగదారణంబును మిథస్సూతమారణంబును నన్యోన్యధ్వజపాతనంబును నితరేతర

1. ఇది పెక్కిటలేదు. 2. పాండవాగ్రజునకుఁగడుఁ-యప్పాండవాగ్రజునకుఁ-దల-వంపు-ప్రాపు-గాఁగ.

ధనుశ్శాతనంబునుం జేసి యీసునం గరవాలంబులుఁ బలకలుం గొని పాదచా రులై చేరి వివిధచిత్రగతులం బెనంగి పాసి యించుకసేపు డప్పి దీర్చుకొని క్రమ్మఱం గదిసి పలకలు పఱియలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబు లను వ్రేటుపోటుల సవదరింప కుండం గాచికొనునోజ మెఱయు చుండి విన్నాణంబుతగులున మేనులు నెరసిన మల్లయుద్ధప్రకారం బగుపెనంకువకుఁ జొచ్చి రప్పు డాభూరిశ్రవుండు [1]మేలుచే యయి పోరుట గనుంగొని కృష్ణుండు జిష్ణున కిట్లనియె. 262

చ. పెనుమొనతోడ మూఁకఁ బెనఁగి కడు పెద్దయు డయ్యుటఁ జేసి సోమద
త్తునిసుతుచేతఁ జిక్కి కడు దుర్దశఁ బొందె శినిప్రవీరుఁ డా
తనిఁ దగుఁ గావ నీకయి కరదా యిట రాక మృగేంద్రుబారిఁ జొ
చ్చినకరివోలె నయ్యె వెసఁ జేకొని కావుము పాండవోత్తమా. 263

క. అనునెడ భూరిశ్రవసుం, డనూనబల మొప్ప దానవాంతకునసుజ
న్మునిఁ బట్టి పుడమిపై వై,చినఁ గ్రిందై యోపినంత సేయుచు నుండెన్.

వ. అమ్మురహరుండు మఱియుం దఱిమి ధనంజయుతో నీకుం దోడ్పడ వచ్చి నీ శిష్యుం డొరులచేత దురవస్థం బొందఁ జూడ నూరకునికి యుచితం బగునే యనిన నతం డతని కిట్లనియె. 265

తే. ఒండుదెసఁ జక్కఁ జూడరాకుండునట్లు, గాఁగ రథములు పయిపయిఁ గ్రమ్మెవార
లెక్కటెక్కటి పోరెద రిపుడు నాకు, నేయఁ గాఁ దగ దీరెండు నిట్టు లుండ.

వ. నెచ్చెలిచావునుం జూడంజాల నీరథికులను వారించెద నయ్యోధవరునిం గాచెద ననియె నప్పుడు సాత్యకి చాల డస్సిన సౌమదత్తి యతిక్రమించి మొగసి (పడ వైచి) వానివలచేయు నురంబును నిరుగాలం ద్రొక్కి మెక్కుడుమదంబున మణి కంకణకిరణస్ఫురణసుందరం బగుకరంబు మెఱయం గృపాణం బెత్తి గళంబు దునియ వ్రేయువాఁడై పూఁచిన నాభుజం బింద్రధ్వజంబునుంబోలెఁ బొలిచి నీసైనికులచూడ్కులకు వేడ్కలు సేయ వాసుదేవుండు వేగిరపడి యేయు మేయు మని పలికినఁ బార్థుం డక్కారవోత్తముం జిత్తంబున నగ్గించుచు వెడందవాతి యమ్ము గ్రక్కునం దొడిగి గాఢాకర్షణంబును దీవ్రతేజంబును [2]రయంబునుం బరఁగం జేసి యేసినం దునిసి పడి యబ్బాహువు మహాభుజంగంబుచందంబున శోభిల్లె నిచ్చటిసేన యెల్ల దురపిల్లె నాభూరిశ్రవుండు దన్ను నఫలితప్రయత్నుం జేసినవాఁడు గాండీవి యగు టెఱింగి యాఱనికోపంబున గర్హించుమనంబుతో నతనిదిక్కు సూచి తగునెలుంగున ని ట్లనియె. 267

ఉ. నీదెసఁ జూడ నొండొకరుకనిం దగ మార్కొని పోరుచుండఁ బెం
పేది విసీచకర్మమున కియ్యకొనం దగునే భవాదృశుం

1. మేలుచేయి గైకొని కదియం బోరుట. 2. రయంబునం జేసి యేసినం.

డీదురుపాయ మగ్గురుఁడో యింద్రుఁడో రుద్రుఁడో నీకుఁ జెప్పె దా
మోదరుఁ డింతపాపమున కోర్వఁగఁ జేయునె నిన్ను నర్జునా. 268

వ. అనిన విని యతం డబ్బాహ్లికపౌత్త్రు నాలోకించి. 269

చ. నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధులుఁ దోడుపాటు నీ
చపుఁబనియే నినుం బగఱు సంపఁగఁ గావఁగ లేనిమీబలా
ధిపతుల దూఱు సాత్యకి యశక్తిశ్రమ మొందినచోటఁ దాఁకి క
ష్టపఱిచి చంపె దీ వతఁడు సచ్చునె యీఱడి యేను గల్గఁగాన్. 270

వ. మీ రందఱు నట్ల కాదే యధర్మపరు లయి యభిమన్యు ననుచితంపుఁజంపు చం
పితి రని నిరుత్తరుం జేసి యప్పుడు దన్ను నీకొడుకులుం గొందఱు రాజులును
నిందించిన నత్తెఱంగునన పలికి వారలపలుకుల నుడిపి యాసౌమదత్తి నుప
లక్షించి శోకించి యతనికుందు మాన్పం దలంచి. 271

తే. క్షత్త్రధర్మంబుకీడునఁ గటకటా మహాత్మ నీయట్టివాని కి ట్లధికపీడ
సేయవలసెనాప్రతినచర్చింపుమెల్ల,పనులకునుమూలమాసుయోధనుఁడమూవె.

వ. అన్నరపతి నరకంబునం బడం గలవాఁడు నీవు సద్గతిం బొందు మనవుడు నతండు
నై నేయు విడిచి యపసవ్యకరంబున శరంబులు వఱుచుకొని ప్రాయోపవేశనమతి
నుండిప్రాణాయామపరాయణుం డై యోగయుక్తుం డయ్యె నంత నొడలి కుత్సా
హంబు వచ్చి లేచి సాత్యకి గరవాలం బమర్చికొని మాధవధనంజయభీమాశ్వ
త్థామకృపకర్ణులు వలదు వల దని మెలుంగెత్తి వారింపఁ గ్రోధోన్మాదంబున శిర
శ్ఛేదనంబు సేసిన భూరిశ్రవుండు సిద్ధచారణగణాభినందితుం డగుచుఁ బుణ్య
లోకంబున కరిగె నాశినివరుండు దన్ను వారించినవారల నుద్దేశించి యభిమన్యు
వధప్రకారం బుపన్యసించె నప్పుడు మనసైనికు లిట్టుదగునే యనువారును గోపం
బేమి సేయింప దనువారును నతనిచేతఁ బడినవాఁ డుడుగునే యనువారును నిది
విధివశంబు పొమ్మనువారును నై రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

క. గురుకృతవర్మాదిరథిక,వరులకు నవిజయ్యుఁ డైనశివాఁడు శినివరుం
డరయఁగ మహాద్భుతం బ,క్కురువరుచే నాతఁ డి ట్లకగుట సూతసుతా. 274

సంజయుఁడు ధృతరాష్ట్రునకు సాత్యకిపరాభవకారణంబు చెప్పుట.

వ. అనవుడు నతఁ డమ్మహీపతి కిట్లను దీనికిం గారణంబు గల దాకర్ణింపుము సోమ
వంశవరుం డగుయయాతినందనుం డయినయదునికులంబున జనియించిన దేవ
మీఢునకుఁ బుట్టినశూరునికొడుకు వసుదేవుండు రూపగుణంబులం బ్రసిద్ధుం
డై పెరుఁగుచుండ దేవకుం డనుభూవల్లభుండు దనపుత్త్రికి దేవకికి స్వయంవరమ
హోత్సవం బాచరించిన నవ్వసుదేవునకై నయ్యాదవాన్వయజాతుం డగుశిని య
వ్వనితఁ బరాక్రమంబునఁ దేరం గూడినరాజలోకంబుదొడరిపోరంజాలక నిలిచిన

సోమదత్తుం డొక్కరుండునుం బోక పెనంగె నయ్యిరువురు నొండొరులచేత విరథు లై కృపాణంబులు గొని ధరణికి లంఘించి పోరునెడ నయ్యాదవవీరుం డాక్రమించి బాహ్లికతనయుం గొప్పు వట్టి యొఱగం దిగిచి యనుకంపపెంపునం జంప నొల్లక తన్ను విడిచినం బోయి సిగ్గునఁ దల యెత్తి తిరుగ నేరక వనంబున కరిగి హరు నుద్దేశించి పెద్దకాలంబు దపంబు సేసిన నప్పరమేశ్వరుండు ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనినఁ దత్కాలంబునకు శినియును దదీయసుతుండును గడచనుటం జేసి శినిమనుమని ననిం బడ వైచి తన్నుం జాలుతనయు నీ వలయు నని యడిగిన నద్దేవుం డట్ల యగుం గాక యని యానతిచ్చి యంతర్హితుం డయ్యెఁ దద్వరప్రభావంబున భూరిశ్రవుండు సాత్యకి నిట్లు సేసె నని చెప్పిన నాంబికేయుండు గయ్యం బటమీఁద నెట్లు సెల్లె సనుటయు సంజయుం డతని కిట్లనియె.

ఆ. సౌమదత్తి యిట్లు ✽ సచ్చినఁ దదనంత, రంబ రథము సింధు ✽ రాజుదెసకు
నరుఁడు నడపఁ బంచె ✽ నారాయణు నపుడు, గురుసుతాదిరథిక ✽ వరులు నృపుఁడు.

వ. బరవసంబు సేసి యడ్డపడి రట్టియెడఁ గర్ణసాత్యకులకుఁ గయ్యం బయ్యె నత్తె అంగు వివరించెద వినుము కృష్ణుండు త్రికాలవేది యగుటఁ దనతమ్మునికి భూరిశ్రవునివలనం బుట్టునెడరు తెలిసి గెలింగి తొలునాఁటిరాత్రి నిజసారథి యగు దారుకునితోడఁ బార్థునిప్రతిన నెఱపం బూని పలుకు నెపంబున మనయరదం బాయితంబు సేసికొని యెల్లి గయ్యంబునకుం గొని రమ్మని చెప్పె నప్పు డెట్టియెడ యాలంబులతోఁ బాంచజన్యంబు పూరింపంగలవాఁ డై పలికె నాచందంబున నంతకు మున్న యాసూతునకు నేతేరవలయుతడవు గనుంగొని శంఖంబు పూరించిన వాఁడును శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబు లనువాహనంబుల వేగంబు నెఱయ మెఱయం బొలుచు గరుడకేతనంబు గ్రాలఁ దేరు తత్కాలంబున కొదవం దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు నాశైనేయున కిచ్చినం జూచి కౌంతేయుం డచ్చెరు వందిన నతనికి నవ్విధంబు గొంత సూచించె నిట్లు సాత్యకి సన్నద్ధుం డై.

తే. ఏచి నరునకు సాహాయ్య ✽ మాచరించు, కౌతుకంబున నేతేరఁ ✽ గర్ణుఁ డతని
నధికసంరంభమునఁ దాఁకె ✽ నక్కిరీటి, కని జనార్దనుతోడ ని ✽ ట్లనియె నగుచు.

క. భూరిశ్రవుండు సచ్చుట, సైరింపక సూతసుతుఁడు ✽ సాత్యకితోడం
బోరం దొడంగె మనము వి, చారింపక యెద్దువలయు ✽ సరిగొన కుండన్. 279

ఆ. అనుడు నతఁడు సాలు ✽ నతనికి నాచక్ర, రక్షకులు గడంగి ✽ రయము మెఱయఁ
గదిసి తోడుపడిరి ✽ కావున నక్కడి, చింత వలవ దని ము ✽ రాంతకుండు. 280

వ. తేరు సైంధవునిదెసకుం దఱిమె నప్పుడు శైనేయరాధేయులపో రెల్లవారును వెఱఁగుపడి చూచుచుండి రత్తెఱంగు సంగరంబు సురాసురగంధర్వులయందునుం గలుగదు విను మట్లు పోరి పోరి యన్నారాయణానుజుండు. 281

### కర్ణుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడి పోవుట.

చ. నిరుపమశక్తిఁ గర్ణుమెయి నెత్తురు వఱ్ఱుగఁ జేసి సూతునిం
దురగములన్ సిడంబు వెసఁ ద్రుంచి రథంబును నాతపత్రముం
దర మిడి నుగ్గుసేసె వసుధావర తమ్ములు రాజుఁ జూడ న
ప్పురుషత సూచి చేయఁ గలపార్థివు లాతనిఁ జుట్టు ముట్టినన్. 282

క. శరవేగము రథగమన,స్ఫురణవిచిత్రతయు మెఱయఁ బోరి యతం డ
య్యరదములగములు సుడివడఁ, దెరల మరలఁ బఱవఁ జేసి దీపించె నృపా. 283

క. అనుటయు ధృతరాష్ట్రుఁడు గృ,ష్ణునిరథమును రథ్యములును సూతుఁడు నగుటన్
శినివరునకు నుత్సాహం, బనూన మయి చూపె యంత యధికుం డయ్యెన్.

వ. అనిన విని సంజయుం డతని కిట్లను నట్టియెడ మున్న దారుకుండు దేరు దెచ్చు సంరంభంబు సూచి యది కృష్ణునిపను పని యెఱుంగనివాఁ డగుటఁ గయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వానిపిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగుతురంగంబులం బూన్చికొని వివిధాయుధంబు లమర్చికొని కేతనోద్ద్యోతితంబు సేసి యారథంబు వచ్చినజాడ నేతెంచి సన్నిహితుం డగుటయు సాత్యకి సముచితంబుగా నయ్యరదం బెక్కి విక్రమాటోపంబు సూపుచుండ రథాంగధరునిసారథి రథసహితంబుగా నతనికడకుం జనియె నీకొడుకులు కర్ణుం గల్పితరథోదీర్ణుం గావించి రనవుడు నాంబికేయుం డట్లు కిరీటిం గలసి భీముం డేమి సేసె నని యడిగిన.

తే. ఆతనికి సంజయుం డిట్టులనియెఁ గర్ణు,చేత నవమానితుం డయి చిన్నఁబోయి
పార్థుపాలికి- నరిగియుఁ బలుకకుండెఁ, గినుక నెరియుమనంబుతో మనుజనాథ.

వ. పదంపడి తన్నాసూతపుత్త్రుండు పలికినపలుకు లాఫల్గునునితో నుగ్గడించి వానిం దొడరి యే నెల్లభంగులం బరిమార్తు ననిన నాతం డవి నాచెవి సోఁక నాడుట నన్నుఁ బలుకుట గాక నీకుం బని యేమి నీ వటుండు మని రాధేయురథంబున కభిముఖుం డై. 287

ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టి తతండు దోల సి
గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్పు సం
గ్రామములోనఁ దప్పిదము గల్గినయంతన యింతగర్వ మే
లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే. 288

క. గెలుపును నోటమియును ననిఁ, గలుగవె యెడపెట్టి మెట్టి ఘనులకు నిమ్మైఁ
బలుకుదురే తగువారిం, దులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. 289

వ. ఇంతవట్టును వెలారింతు నీమాటలు మఱవకుండు మిదియునుం గాక నాయసన్నిధి నధర్మంబున నభిమన్యువిల్లు దునిమితివి దానికి నీవు గనుంగొనుచుండ ధర్మప్రకారంబున వృషసేనుతల దునుముదు మఱియు నీతోడం గూడ నప్పు డప్పాపం బాచరించినవారిని నిన్నును నెల్లు సేసెదనో యటుసూడు మని పలికి తఱిమిన

మనసైన్యంబు లతిముతి నతనిపైఁ గవిసినఁ దత్సమరవిహారంబు దారుణప్రకా
రం బయ్యె మిహిరుండును మందరశ్మి యగుచువచ్చె నాసమయంబున సుయో
ధనుండు రాధేయున కిట్లనియె. 290

సీ. శైనేయుఁడును భీమసేనుఁడు నిరుదెస, రా నర్జునుఁడు సింధురాజుదెసకు
నేఁడ్తెఱఁ దఱిమెదు నింక నొక్కించుక, ప్రొద్దాఁగి పెనఁగినఁ బ్రొద్దు దాను
నస్తమించెడును నీయట్టిజోదునకు శ, ల్యుండును గురునందనుండుఁ గృపుఁడు
దుశ్శాసనుఁడు నేనుఁ దోడ్పడ నతనికిఁ, జే యార్పవచ్చునె చేటుకాల
ఆ. మైనఁ బ్రతిన వట్టె నంతియ తనతోడి, వారసోదరులును వీరు సనిన
నేల యెల్ల మనమ యేలుద మిత్తఱి, నలవుఁ జలముఁ జూప వలయు నీవు. 291

వ. అనిన విని సూతనందనుం డమ్మానవపతి నాలోకించి. 292

చ. అనిలతనూజుబాణముల నంగము లెల్లను జాల నొచ్చె నై
నను నను మీఱ వచ్చునె రణంబునఁ గ్రీడికి మేదినీశుమ
న్నన గలమేటిబంటు ప్రధనంబున [1]నింతలు సేయ కున్న నొ
ప్పునె యనిఁ బేర్చువాఁ[2]డ నట భూవర దైవమ నేర్చు నావుడున్. 293

వ. అతఁడు ప్రీతుం డయ్యె నయ్యవసరంబున భీమసాత్యకిసహాయుం డగునాసవ్య
సాచి గాడ్పుతోడు గలయగ్నిదేవుండునుంబోలెం దేజరిల్లి భల్లాదిబాణంబులు
నీబలంబులపై నిగిడింపఁ జతురంగంబులయవయవంబులుఁ జామరచ్ఛత్త్రకేతుశక
లంబులుఁ గోదం [3](డగదాదం) డాదిహేతిఖండంబులుం [4]బెరసిపాఱునెత్తురుటే
ఱులఁ దెట్టువలు గట్టె నట్టియెడ దుర్యోధనకర్ణవృషసేనశల్యకృపాశ్వత్థామలు
గడంగి తమతోడన తఱుముజయద్రథుం బిఱిందికిఁ ద్రోచుకొని ప్రొద్దులావునం
జేవ యెక్కి యక్కిరీటిం దాఁకి తీవ్రశరంబులు వరఁగించిన నవి యతం డొక్కొ
క్కటిం బెక్కుతునియలు సేయం దఱిమి యందఱు నొక్కుమ్మడి నొక్కొక్క
రుండు పెక్కుమ్ము లమ్మధుసూదనధనంజయులతనువులం బఱపిన నన్నరుం డుఱక
యొక్కొక్కరునిం బెక్కునారాచంబుల నుక్కించి. 294

కర్ణార్జునులద్వంద్వయుద్ధము.

క. సింధుపతిదెసకు మదప, త్సింధురగతిఁ గవియఁ జూచి ధీరోద్ధతిఁ గో
పాంధమతి నడ్డపడియె వ, సుంధర గ్రక్కదల సూతసూనుం డధిపా. 295

వ. అప్పుడు, 296

ఆ. పదియు నేను నిశితబాణంబు లర్జునుఁ, డనిలనందనుండు శినివరుండు
మూఁడుమూఁడు మెఱుఁగువాడితూపులు మేను, గాఁడ నేయ నొచ్చి కర్ణుఁ డలిగి.

క. అఱువదియఱువదియమ్ముల, నెఱఁకులు నో నాడఁ నేసి నిలిపి తనరయం
బెఱిఁగించె మువ్వురకు న, త్తెఱఁ గద్భుతరసము వెల్లిఁ దేల్చె జనములన్. 298

1. వింతలు. 2. డనుట. 3. ఇది వ్రాఁతప్రతుల లేదు. 4. గడసి-గీడ్పెుచి-గీడ్బెరసి.

ఆ. నరుఁడు నూఱుతీవ్రశరముల నయ్యోధ, వరునితనువు రక్తవారిఁ దోఁప
నాతఁ డట్టినూఱు నైదడరించె న, వ్వేగమునకు రోషవివశుఁ డగుచు. 299

క. ఆవిజయుఁడు గర్ణునివిలు, వావిరిఁ దునుమాడి విపులవక్షము నవబా
ణావిద్ధము సేసి యతని, జీవము గొనునట్టిఘనవిశిఖ మేసె వడిన్. 300

వ. అది యర్ధచంద్రసాయకంబున నశ్వత్థామ త్రుంచె నంతం గాంచనభాసితం బగు శరాసనంబు గొని రాధేయుండు రయంబునఁ దీవ్రశరంబులు పరఁగింప నర్జునుండు నిలు నిలు కర్ణ యర్జును నెఱుంగవే యనుచు ననేకచండకాండంబులం గప్పినఁ గర్ణుండు నిలు నిలు మర్జున కర్ణు నెఱుంగవే యనుచు నతని బహుపటుప్రదరంబులం బొదివె న ట్లయ్యిరువురు నొండొరుల కదృశ్యమూర్తు లై సురలగ్గింపం బోరుచుండం గౌరవపతి తనవారి నెలుం గెత్తి కర్ణునకుఁ దోడ్పడుం డని పనిచె నక్కాలందికిం గిరీటి గోపాటోపంబున. 301

మ. తురగవ్రాతముఁ గూల్చి సూతుతనువుం దున్మాడి విద్వేషిభీ
కరనారాచపరంపరానిహతి నంగం బార్తి నొందింప నా
తురుఁ డై కర్ణుఁడు దర్పహీనుఁ డగుడున్ ద్రోణాత్మజుం డెద్ది యా
త్మరథస్థుండుగఁ జేసి యేసె విజయున్ మద్రేశుఁడుం దోడ్పడన్. 302

తే. కృపుఁడు వృషసేనుఁడును వారి గెడన కూడి, పార్థుతనువునఁ దూపులు వఱపిరట్లు
పొదువునలువుర పిఱుఁదను బొంచి సింధు, వరుఁడు నిగిడించె నమ్ములు నరునిమీఁద.

క. గురుతనయప్రముఖరథిక, వరులభుజావిక్రమంబు వారించుచు ని
ర్భరరోషమునం బార్థుఁడు, శరంబు లఱిముఱి నిగిడ్చె సైంధవుమీఁదన్. 304

వ. ఆసమయంబున సుయోధనుండు సేనలకుం జేయి వీచిన నొక్కుమ్మడిం గవ్వడిఁ గదిసి వివిధహేతివ్రాతంబులు మేన నించినఁ గలంక లేక కడంగి. 305

శా. గాండీవంబుగుణంబుఘోరరవ మాకాశంబునం బర్వ వే
దండస్యందనఘోటకంబులు మహాస్త్రక్రూరపాతంబుల
ఖండీభూతములున్ విదారితములు న్భగ్నంబులుం గా సము
ద్దండుం డై యడరం గలంగి పఱచెం దత్సైన్యసంతానముల్. 306

వ. ఇట్లు ప్రచండమూర్తియై మధ్యందినమార్తాండుండునుంబోలె వెలింగి వివ్వచ్చుండు వియచ్చరుల కచ్చెరు వందించె వెండియుం దొర లందఱు నొక్కట దఱుమ నతం డదల్చి యమ్ములవెల్లిం దేల్చి తెరల్చి దీప్తబాణపాతపూర్వకంబుగా జయద్రథునకుం గవిసిన నమ్మహారథుండు. 307

క. పోవక హయకేతనగాం, డీవములం బార్థుమైఁ గడిందివడిన్ సై
న్యావళియు చేవతలు నా, నావిధములఁ బొగడ నాటె నారాచంబుల్. 308

క. విజయుం డతనివరాహ, ధ్వజమును సారథిశిరంబు ధర నొక్కట న

క్కజముగఁ బడ నేసిన నీ, ప్రజ దామరపాకునీటి భంగిం దలఁకెన్. 309

క. ప్రాణములు గలుగునంతకుఁ, ద్రాణపరాయణత నీదు రథికోత్తము ల
క్షీణజవమునఁ బ్రసారిత, బాణు లగుచు నతని కడ్డపడిరి నరేంద్రా. 310

వ. ఇవ్విధంబునం గృపాశ్వత్థామశల్యవృషసేనులు దెంపుసేసి సైంధవున కడ్డం బైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁజూడ నెడ గానక యవుడు గఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డి ట్లనియె. 311

ఆ. చక్కఁ [1]జలము పెనఁగఁ జన దింక నినుఁడు ప, శ్చిమధరాధరంబు సేరఁబోయె
దీని కొకయుపాయ మేను గల్పించెద, దానఁ జేసి కాని దాయ వడఁడు. 312

వ. అది యెయ్యది యం టేని. 313

క. ఇనమండలంబు మఱువడ, నొనరించెదఁ దమము పాండవోత్తమ యది గ్రుం
కినచంద మైన సైంధవుఁ, డును గౌరవయోధులుం గడుం బ్రమదమునన్. 314

వ. ప్రతిజ్ఞాభంగం బయ్యె నని కయ్యంబుకడంక దక్కి వీచ్చలవిడి నొండొరుల మెచ్చుచుఁ బొంగి చెలంగుదు రప్పుడు నీపూన్కి దీర్చుకొ మ్మని పలికినం బరాక్రమంబు సవ్యాజం బయ్యె నని మనోవ్యథం జెందుసవ్యసాచిం గనుంగొనుచు నమ్మాధవుండు మాయాతిమిరంబునఁ దిమిరవైరిం గప్పిన. 315

క. అది రవి గ్రుంకుటగాఁ గొని, మద మెసకం బెసఁగ నార్చి మనసైన్యంబుల్
వాద లెఁ దలయెత్తి హర్షా, స్పదమతి సింధుపతి యవుడు పడమర సూచెన్.

వ. తదవసరంబున. 317

ఆ. ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమ ర, త్రెత్తి చూచుచున్న యిద్దురాత్ము
మస్తకంబు దునుము మసలక యని యర్జు, నునకుఁ జూపె సైంధవుని మురారి.

అర్జునుఁడు సైంధవునితల దునుముట.

క. అతఁడు గని గంధమాల్యా, ర్చిత మై దొన మెఱయుచున్న శితశర ముగ్రో
ద్ధతి నేయ డేగ పులుఁగును, గతిఁగొను క్రియ నది హరించె గ్రక్కున శిరమున్.

వ. అప్పుడు సత్వరుం డై. 320

ఆ. శౌరి పార్థ పార్థ సైంధవుతల యిలఁ, బడిన నొప్ప దది నభంబునంద
నిలువఁజేయు మేను నీ కెఱింగించెద, నత్తెఱంగు దెలియ ననిన నతఁడు.

క. పటుశరముల మీఁదికి డా, పటికిఁ వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె [2]సము, త్కటరయమున శిరముఁ గందుకక్రీడగతిన్. 322

వ. అట్టియెడ. 323

క. మాయపుఁజీఁకటి విరియుడుఁ, దోయజమిత్త్రుండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో
పాయత్తు లై [3]బలంబులఁ, జేయం గలవారు గడఁగి [4]శితబాణములన్. 324

క. నరుఁ బొదివి రతఁడు వారల, యురవడి వివిధాస్త్రతతుల నుడుపుచు నింగిం

1. జాఁగి పెనఁగ. 2. వసుత్కటరయమున. 3. చలంబున. 4. చేపారి- చెడి పాటి- వెసన్.

దిరుగ మును నడపుచుండెడు, శిరమును నేమఱక యుండెఁ జిత్రస్ఫురణన్.

వ. ఇట్లత్యాశ్చర్యకరణపరిణతబాహువీర్యుం డై విక్రమవిహారంబు సలుపుచుండి.

ఆ. దనుజవైరి యెంతకడడ వింక నిలుపంగ, వలయు సింధురాజుతల నభమున
నెచట వైచువాఁడ నేమిటి కివ్విధ, మాచరింపవలసె ననిన నతఁడు. 327

వ. వినుము వృద్ధక్షత్త్రుం డనుసింధుదేశాధీశుండు సంతానకరణతపోవిశేషంబున నీ
జయద్రథుం బడసె నితండు కుమారుం డై వర్తిల్లుసమయంబున నొక్కనాఁ
డశరీరవాణి వీఁడు సంగ్రామంబున నేమఱి తల దునుమం బడు నని యాదేశించిన
నతం డెల్లవారును విన వీనిమస్తకంబు మహిం బడ నెవ్వఁ డేసె వానిశిరంబు
శకలశతం బయ్యెడు మని తనతపంబుబలిమిం బలికి యతనిఁ బట్టంబు గట్టి
వనంబునకు నియతుం డై యరిగె నట్లు గావున. 328

క. ఈతల పుడమిం బడ నీ, కాతనితొడమీఁద వైచునది యాపని వి
ఖ్యాతం బగుపాశుపతము, చేతన యగుఁగాక యొంటఁ జెల్లునె మనకున్. 329

వ. అవృద్ధక్షత్త్రుండు శమంతపంచకసమీపంబున నుండు నీ వమ్మహనీయాస్త్రంబు
నాశ్రయింపు మనవుడు నర్జునుం డట్ల కాక యని భక్తియుక్తంబుగా నియత
మతిం దత్ప్రయోగం బాచరించిన నద్దివ్యసాధనంబు సాయకపరంపరాకారం
బయి యాశిరం బట గొని చని తదాశ్రమద్వారంబు సొచ్చునప్పు డజ్జనపతి
జపయుక్తుం డై యుండ నమ్మహాస్త్రంబుమాహాత్మ్యంబున నమ్మస్తకం బతని
తొడమీఁదఁ బడిన నతండు దదీయస్పర్శనంబున నెఱింగి దిగ్గన లేచుచుం ద్రోచిన
నది భూతలపతితం బగుటయు. 330

తే. పగిలి యాతనితల నూఱు[1]పఱియ లయ్యె, శౌరి విజయుని నగ్గించె సకలభూత
ములుమహాద్భుతరసమున మునిఁగెనపుడు, సంహరించె నయ్యస్త్ర మాసవ్యసాచి.

క. ఇవ్విధమున సైంధవుతలఁ, గవ్వడి యట నడపుశక్తి గనుఁగొని సేనల్
నివ్వెఱఁ గందె మనంబుల,క్రొవ్వడఁగెను దొరల కెల్లఁ గురువంశనిధీ. 332

సీ. సైంధవుఘోరకబంధంబు దల యిలఁ, బడునంతకును దేరిపైన నిలిచి
మఱికూలుటయునువిస్మయముగావించె జూ, పఱి కట్లు పార్థుండు ప్రతిన నెఱసె
నీతనూభవులు గన్నీళ్లు దొరఁగ న, త్యంతశోకముఁ బొంది రచ్యుతుండు
నన్నరుండును బరమానందకందళి, తాత్ములై రత్తఱి ననిలసుతుఁడు

ఆ. నలిఁ జెలంగి సింహనాదంబు సేసిన, విని యుధిష్ఠిరుండు విజయుపూన్కి
నెఱయు టెఱిఁగి హర్షనిర్భరాకృతి యయ్యె, నుల్లసిల్లి రతనియోధు లెల్ల.

వ. అచ్చట నార్పులుఁ దూర్యనినదంబులుఁ జెలంగెఁ దద్బలంబులుఁ బరమప్రమో
దంబునం బొందె నని సంజయుండు సైంధవవధప్రకారంబు ధృతరాష్ట్రుని కెఱిం

1. వ్రయ్య లయ్యె.

గించె నని చెప్పినఁ జిత్తంబు గాతుకాయత్తం బగుచుండ నటమీఁదివృత్తాంతం [1]బెఱిఁగింపు మనుటయు. 334

ఉ. బిందుచిదాత్మనాదమయ[2]పీఠచతుష్కలసద్విహార ని
ష్యందిసుధాకృతీ పరమసౌఖ్య[3]విధాయక చిత్స్వరూప ని
ష్పందనిరంజనాస్ఖలితశాశ్వతనిర్మలనైభవా మహా
నందరసైక[4]తాత్మలయనక్రమ నిష్కల బోధపుష్కలా. 335

క. ఆస్తికచేతస్సహితా, కౌస్తుభరత్నాస్థిమాలికాశబలితవ
క్షస్తల సుమహితనిగమ, ప్రస్తవనీయప్రకార పరమోదారా. 336

మాలిని. శ్రుతిఫలరసభావస్తుత్యమూర్తీ నతార్తి
ప్రతిహనన నితాంతప్రౌఢహేలావినోదా
యితభువనవితానాహీన[5]నిర్వాహ మోహ
వ్యతికరతిమిర ప్రధ్వంసనాదీపరూపా. 337

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమదాంధ్రమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము. 338



1. బువివరింపు. 2. పీఠ. 3. విధాయితపస్స్వరూప. 4. తాంతలయ. 5. నిర్వాణమోహా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము, పంచమాశ్వాసము.



ధామలసదపాంగ
వ్యాధూతప్రణతదురితఁవర్గ[1]నిరోహ
ద్బోధాత్మకదేహా జగ
దాధారవిహారనిపుణ ఁ హరిహరనాథా. 1

### కృష్ణార్జునులు సల్లాపము లొనరించుచు ధర్మజుకడ కరుగుచుండుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లద్భుతోదారం బగునరనారాయణులవిక్రమవిహారంబు విని వెఱఁ గంది యాంబికేయుండు సంజయుదిక్కు మొగం బై. 2

క. ఇవ్విధమున సైంధవుఁ డా, కవ్వడిచేఁ బడినపిదపఁ ఁ గౌరవు లె ట్లై
రవ్వార్త సెప్పు మనవుడు, నవ్విభునకు నాతఁ డిట్టుఁ లనియె నరేంద్రా. 3

వ. అట్లు పాండవబలంబులు పొంగి కడంగి కుంభసంభవుమీఁదం గవిసి కయ్యంబు సేసె నాసమయంబున నిక్కడ. 4

చ. కృపుఁడును ద్రౌణియుం గడఁగి ఁ క్రీడిపయిన్ శరవర్షముల్ మహో
గ్రపురభసంబునం గురియఁగా నవి మాన్చి యతండు వారలం
గుపితుఁడు గాకయున్ విశిఖఁకోటుల నల్లన కప్పపెల్లునం
గృపునిశరీర మొయ్య నొఱఁగన్ రుధిరచ్యుతి మూర్ఛ వచ్చినన్. 5

వ. ఇట్లు కృపాచార్యుండు రథంబుమీఁదం బడినఁ దత్సారథి దేరు వొలంగం దోలుకొని పోయె నశ్వత్థామయు నోహటించి తొలంగెఁ దక్కటిరథికులు పైఁ బెట్టం జాలక యంతంత నిలిచి రంత శారద్వతుండు దనయమ్ముల మూర్ఛిల్లుట సూచి సవ్యసాచి వగచె నప్పు డన్నరునిఁ గౌఁగిలించుకొని నారాయణుం డి ట్లనియె. 6

---

1. నిరీహద్బోధాత్మక-నిరాసోద్బోధాత్మక-నిరోధాబోధాత్మక.

క. కురుబలముఁ దొడరి గెలువఁగ, సురగణముల కైన నరిది ✽ శూరోత్తమ నీ
వురవడి గెలిచితి భాగ్య,స్ఫురణంబును బాహుబలముఁ ✽ బొగడం దగదే. 7

క. ఆవృద్ధక్షత్త్రతపము, వావిరి నోర్వంగ నీకు ✽ వచ్చినటుల నీ
రావహునిఁ గ్గణ నోర్వం, గా వచ్చినఁ గాదె నాకుఁ ✽ గడుఁ బ్రీతి యగున్. 8

చ. అనవుడు నాతఁ డిట్లను మ✽హాత్మ భవత్కరుణం బ్రతిజ్ఞ యే
ను నెఱపఁ గంటిఁ బాండవమ✽నోరథసిద్ధి భవద్దయాసమృ
ద్ధి నగుట వింతయే భవద✽ధీనులకున్ విజయంబు ప్రాఁతె నీ
పను పొనరించువార మట ✽ భారము నీయది గాదె [1]యెప్పుడున్. 9

తే. అనుడు నుద్గతమందస్మి✽తాస్యుఁ డగుచు, దనుజమర్దనుఁ డతనితో ✽ [2]ధర్మతనయుఁ
గానఁ బోవంగవలయు భా✽స్కరుఁడు గ్రుంకు,చున్నవాఁ డని పలికిన✽నన్నరుండు.

వ. అట్లు కాక యనుటయుఁ గదలి భీమసేనుండును సాత్యకియును యుధామన్యుం
డును నుత్తమౌజుండును సముచితసల్లాపంబులు [3]సేయుచుఁ దో నేతేర సాంద్ర
శోణితపూర సేకంబున ఘోరం బైనసంగ్రామతలంబునం జని చని శౌరి సవ్య
సాచి నాలోకించి. 11

చ. కరులు రథంబు లశ్వములు ✽ గాలుబలంబు చమూపతుల్ మహీ
శ్వరు లఖిలాస్త్రశస్త్రములు ✽ చామరముల్ గొడుగుల్ సిడంబు లా
భరణము లిత్తెఱంగునను ✽ బార్థ కడుం జెలువొందెఁ జూడ సం
గరమహిఁ జిత్రవస్త్రమునఁ ✽ గప్పినచందముఁ దోఁపఁ జేయుచున్. 12

వ. భవదీయబాహావిహారంబునుదారత్వం బిట్లుండునే యని యగ్గించుచు నరిగి సమ
యోచితం బగుటను బ్రతియోధులు ఱిచ్చవడి యునికిం జేసియు సమరంబు సా
లించి తమరాక కెదురుచూచుచుం గూడికొని యున్నయుధిష్ఠిరాదులసమీపం
బగుటయుం బాంచజన్యంబు పూరించినం బాండవాగ్రజుండు. 13

సైంధవుని సంహరించి కృష్ణార్జునులు వచ్చి ధర్మజునకు నమస్కరించుట.

తే. రథము డిగ్గి హర్షాశ్రులు✽గ్రమ్ము దేర, నెదురుకొనుటయు సంభ్రమ✽మెసక మెసఁగఁ
బార్థుఁడును గేశవుండును✽బాదచారు,లై రయంబునఁ జని మ్రొక్కి✽రవ్విభునకు. 15

వ. ఇట్లు ప్రణమిల్లిన.

క. నరపతి యానందాశ్రులు, గరసరసిరుహముల నొత్తి ✽ కను దనియఁగ న
య్యిరువురఁ జూచుచు మేనులు, గరుపాఱఁగ గ్రుచ్చి యొక్క✽కౌఁగిటఁ జేర్చెన్.

వ. ఇవ్విధంబున నాలింగనంబు సేసి యర్జునుతో నతం డిట్లనియె. 17

క. చే నెత్తురు గా కుండం,గా నాసైంధవునిఁ జంపి ✽ క్రమ్మఱ మీరల్
రా నోఁచితి నాభాగ్యం, బేన పొగడునట్టి దయ్యె ✽ నీతని[4]కరుణన్. 18

---

1. యెయ్యెడన్. 2. మనము ధర్మ, తనయుఁ గానఁ బోవలవదే ✦ యినుఁడు గ్రుంకు.
3. సేయ సాంద్ర...పూరసిక్తం బైనసంగ్రామ. 4 కతనన్.

క. అని వాసుదేవుఁ జూపిన, విని యాతఁడు నీదుకోప౯ వేగంబున దు
ర్జనుఁ డాజయద్రథుఁడు వొలిసిన నెవ్వరి కెట్లు సేయఁ ౯ జెల్లదె యనినన్. 19

వ. అమ్మహీపతి యమ్మహాత్ము నుద్దేశించి. 20

క. దేవాసురసంఘంబులు, నీ వలిగిన రూపడంగు ౯ నీకూరిమి సౌ
ఖ్యావహ మఖిలజగములకు, దేవ భవద్భక్తు లరులఁ ౯ దీర్చుట యరుదే. 21

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించి భీష్మాదు లతనికతన మడియుట యుగ్గడించి నీవు కోపించినట్లు వర్తించుటఁ గౌరవులు సెడిర కాఁ దలంచెద నను టయు నచ్యుతుం డాభూపాలు నాలోకించి ధర్మోత్కృష్టుండ వగునీకు నరిష్టం బాచరించినవారికిఁ జెడకుండ వచ్చునే యనునెడ ననిలసుతుండును సాత్యకియును దనువులఁ గ్రొత్తగంట్లు గొమరార నద్ధరణీపతిచరణంబులకుఁ బ్రణతు లైన నతం డెత్తి కౌఁగిలించికొని వారలు కుంభసంభవకృతవర్మాదులసంరంభంబు మర్దించుట పేర్కొని యభినందించె యుధామన్యుండును నుత్తమౌజుండును దగినతెఱంగునం గాంచిన వారి నుచితవచనంబుల సంభావించెఁ దదీయసైన్యం బెల్లను బ్రమోదభరితంబై కయ్యంబునకుం గాలుద్రవ్వుచుండె నాసమయంబున శోకవిస్మయవివశుం డగుచు దుర్యోధనుం డంతర్గతంబున. 22

ఉ. ద్రోణుఁడుఁ గర్ణుఁడుం గృపుఁడు ౯ ద్రోణసుతుండును నేల వాని గీ
ర్వాణుల కైననుం జెనయ ౯ వచ్చునె యెవ్వరు నాజిఁ గౌరవ
త్రాణపరాయణత్వమున ౯ దర్పము సూపఁగ లేమి దెల్ల మ
క్షీణపరాక్రముం డయిన౯ క్రీడికి నిక్కపుటల్క వచ్చినన్. 23

వ. అనుచు నుత్సాహరహితం బైనచిత్తం బుత్తలపడఁ గుంభసంభవుపాలికిం బోయి పరులజయంబును దమవారు సమయుటయు నుగ్గడించి మఱియును. 24

సీ. బల్లిదుఁ డగుభీష్ముఁ ౯ బడ వైచి సోదరవర్గంబుఁ దాను న౯నర్గళముగఁ
గ్రాలెడు నేచి శి౯ఖండి యింతకు మున్న, పొలిసె నే డక్షౌహి౯ణులు గిరీటి
చేత సైంధవుపాటు ౯ సెప్పఁ [1]జిట్టలు నాకుఁ, బూని యే తెంచి కాం౯భోజవిభుఁడు
జలసంధుఁడును సుద౯ర్శనుఁడును లోనుగాఁ, గలుగుభూపతులు పె౯క్కండ్రు నేఁడు

తే. గలసఁ గూలిరి వీరిలో౯కంబ మైన, నొండెఁ బాంచాలబలమును ౯ బాండవులను
దండి నై తెగఁజూచిన౯ నొండెఁ గాక, యెట్లు వాయు నా కిందఱ౯ బుణము సెపుమ.

క. నరుఁ డనుఁగుబంటు గావునఁ, బోరిగొనఁ జోర వీవు సూత౯పుత్త్రుఁ డొకఁడ మా
ర్తురమార్కొనియెడు నతనికి, వెరవును [2]గఱతలును లేవు ౯ వీరుం డగుటన్.

వ. అతఁడునుం బోరి పోరి చేడ్పడి సైంధవుం గోలుపోయె ననవుడుఁ గటగటం బడి యాచార్యుం డతని కిట్లనియె. 27

చ. నను మది దూఁఱుచుఁ వోపునచ౯నంబుల నేటికి నిట్లు నొంప న

---

1. జెట్టలు. 2. 'గఱడలును' అనియే ప్రతుల నెల్లఁ జూపట్టెడి.

గ్గునుని జయింప రామి పలుకఁ జోటులఁ జెప్పనె దేవకోటి కై
నను నవిజయ్యు భీష్ముఁ బ్రథనంబున నాతఁడు సంపఁ గౌరవుల్
మన రని తోఁచె నాకు నభిమానముఁ గాచుట కై పెనంగెదన్. 28

ఆ. శకునిచేతియడ్డసాళ్లులు నేఁడు గాం, డీవముక్తబహుపటిష్ఠ బాణ
మూర్తిఁ గవిసి నీకు నార్తి యొనర్పంగ, [1]నాఁకఁ గొనఁగ నెట్టు కలుగుఁ గుమార.

క. భూరమణ విదురుఁ డమ్మెయి, వారింపఁగ నతులపుణ్యవతిఁ గృష్ణను మీ
వా రెల్లఁ జూడఁ బఱచిన, క్రూరపుఁబాపపుఫలంబు గుడుపక యున్నే. 30

క. ఆసభ నీవును మీదు, శ్శాసనుఁడును గర్ణుఁడును బ్రశస్తచరిత్రో
ద్భాసితు లగుపాండవులకుఁ, జేసినకీ డెల్లభంగిఁ జెఱుపదె మిమ్మున్. 31

ఉ. అన్నివిధంబులం బఱచి మైనను నక్కటికంబు లేక వా
రి న్నెఱి మాలి కానలఁ జరింపఁగఁ బంచినఁ బోయి వచ్చి య
య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యసగం బిల వేఁడి కాన కి
ట్లున్నను వారి మార్కొనుట కోర్చితి నే నొకబ్రాహ్మణుండ నే. 32

క. నీవును నచ్చటఁ బన్నిన, నీవారును సైంధవుని నరనిం బడకుండం
గావఁగఁ జాలర యేనును, నీవాఁడన కానె యేల నిందింపంగన్. 33

వ. అని వీడ నాడి వెండియు. 34

క. పాంచాలురుఁ బాండవులు ను, దంచితగర్వమున ననికిఁ దఱిమి యొడలు మం
డించుచు నుండఁగ ని ట్లుడి, కించెద వొకవలన నీవుఁ గీడుపలుకులన్. 35

ద్రోణుఁడు పాంచాలురఁ జంపక కవచంబు విడువ నని ప్రతిజ్ఞ సేయుట.

వ. అని పగతురయుత్సాహం బుపన్యసించి. 36

క. పలుకులఁ బని లే దీరే, తలపెట్టక పోరువా రురదగ్రత నేనుం
జలము మెఱయఁ బాంచాలురఁ, బొలియింపక కత్తళంబు పుచ్చ నరేంద్రా.

క. కావున మనసైన్యంబులు, సేవ సెడక సంగరంబు సేయునటులుగా
నీ వుత్సహించి నిజబాహావిభవము సూపు శక్తి కనురూపముగాన్. 38

వ. అని తెంపు సేసి. 39

క. భూసురభక్తియు వృద్ధో, పాసనముం గలిగి ధర్మపథవర్తనని
త్యాసక్తుఁడ వగు మనఘా, నాసుతు బోధింపు వగపునకుఁ జొరకుండన్. 40

వ. నాచేతఁ దెగనిపాంచాలురు గలిగి రేనియు వారిం బోనీక పొదివి తెగఁజూచు
నది యని చెప్పెము. 41

క. అని పలికి గాఢనిశ్చయ, మున వదనం బెలమిఁ బొంద మును కలఁగిననీ
మొన లెల్ల నొక్కమొగముగ, నొనరిచి తిలకొలిపె భూసురోత్తముఁ డనికిన్.

1. నాఁక గొలుప; మాన్ప నెట్టు లగుఁ గుమార నాకు. 2. కలఁగి కలం,గని మొన లొక్కమొగంబుగ.

వ. అట్లాచార్యుండు పురికొల్పినం గౌరవపతి సమరసముత్సాహరహితం బగుమ
నంబుతో సూతనందనుఁ జేర నరిగి యి ట్లనియె. 43

క. అరుల కభేద్యం బగున,ప్పురుసున బలుమోహరంబు ǂ పన్నించి తుదిం
జొర విడిచెఁ గాని గురుఁ డ,న్నరు నాఁగఁడ యతఁడు గీడు ǂ నాకుం జూడన్. 44

క. ఒకఁ డట్లు సొచ్చి భూప,ప్రకరంబులఁ గూల్చి సింధు ǂ రాజుఁ దునిమె నె
ట్లొకొ యతనికడిమి కుంభజు,నికి వారింపంగ రామి ǂ నిక్కం బరయన్. 45

క. తనమాట నమ్మి సైంధవు, మొనకుం దెచ్చితిమి గాక ǂ ము న్నెఱిఁగిన నా
తని నింటఁ బెట్టి వత్తుము, మనసేనయు నివ్విధమున ǂ మడియక యుండున్. 46

క. మన మెంతసెట్టలమొ ఫ,ల్గునుపై నాతనికి నంత ǂ గూర్మి గలిగె నే
మనఁ గల దింక నతనిఁ గొని, యని సేయుద మనుట కార్య ǂ మగునే మనకున్.

చ. అన విని కర్ణుఁ డి ట్లనియె ǂ నగ్గురు దూఱఁగ నేల యాతఁ డో
పినటులు పోరుఁగాక నరు ǂ బీరము లావును నెక్కు డైన వా
ని నుడుప వచ్చునే విధియు ǂ నేర్చు విషం బిడి యిల్లు గాల్చి కా
ననమున కేఁగఁ జేసి యొక ǂ నాశముఁ గంటిమె గొంతిసంతతిన్. 48

క. కావున మనసైంధవునిఁ, దైవము తెగటార్చె నంతఁ ǂ దలరి మనమునం
జేవ సెడ నేల పోరం,గా విధి [1]పంచినటు లయ్యెఁ ǂ గడఁగన వలయున్. 49

క. అనునెడఁ బాండవసేనలు, మొనసి కదియ నడచె నీదు ǂ మొనలుం దగ మా
ర్కొనియె నిటు లుభయబలములు, ననిమిషులకు వేడ్క పుట్టు ǂ నట్లుగఁ దాఁకెన్.

క. తురగము తురగముఁ గరి కరి, నరుఁడు నరుఁడుఁ దేరు తేరు ǂ నలిఁ దాఁకినయ
ప్పరుసఁదన మేమి సెప్పుదుఁ, బోరి మిడుఁగుఱు లెగసి కైదు ǂ వులపొడి రాలెన్.

వ. అట్టియెడ నీకొడుకు సైంధవునిచావునకు దుఃఖితుం డగుటఁ బ్రాణంబులదెస
నిరపేక్షుం డయి కడంగినం గని ద్రోణకృపకర్ణులు వారింపం దొడంగి తలకడచి
దర్పప్రచండగతిం బాండవసైన్యంబు సొచ్చి నిశితవివిధవిశిఖపరంపరలు వఱఁగించి
నఁ జతురంగంబులయంగంబులు ధరం దొరఁగి చిక్కువడి మదకలమాతంగంబు
గలంచినకమలాకరంబుచందం బయ్యె నప్పు డందుఁ జేయం గలబలుమగ లెల్ల
నొక్కమొగిం గవిసి యమ్మహీపతిం బొదివిన నతండు భీమసేనుఁ బది బాణంబులను
నకులసహదేవద్రుపదవిరాటద్రౌపదేయులమూఁడుమూఁడుమార్గణంబులను శిఖం
డిని నూటను ధృష్టద్యుమ్ను డెబ్బదింటను ధర్మపుత్త్రసాత్యకుల నైదైదమ్ములను
ఘటోత్కచు నఱువదినాలుగింటను నొప్పించి కేకయచేదిప్రముఖయోధవరుల
ననేకసాయకంబుల బెట్టు వఱచి సింహనాదంబు సేసిన. 52

క. ఆధర్మనందనుఁడు స,క్రోధాత్ముం డగుచు నేసెఁ ǂ గోదండము ను
గ్గ ధరఁ దొరఁగఁగ నాతఁ డ,బోధంబునఁ దేరిమీఁదఁ ǂ బొలు పఱి వ్రాలెన్.

1. ఘొటు పంచె నట్లు గడఁగన-గడపఁగ-వలయున్.

తే. ఇట్లు మూర్ఛిల్లుటయుఁ గౌరవేశ్వరుండు, సచ్చెనని యెదు నెలుఁగులు శంఖకాహ
ళారవంబులు సెలఁగఁ బ్రియంబు నొందె, వారిబలములు ద్రోణుఁ డేపారి కదిసె 55

వ. అంత.

క. తెలి వొంది యుధిష్ఠిర నిలు, నిలు మని రభసమునఁ దాఁకు నేసుతుఁ గని యా
బల మేచిన నీబలముం, బెలుచ నిగుడ నపుడు రణము భీషణ మయ్యెన్. 56

వ. అనిన విని ధృతరాష్ట్రుం డట్టియెడ నాచార్యుం డెవ్విధంబున నరివధంబు సేసె
నిందఱియందలిచేయంగలసైనికోత్తము లెత్తెఱంగునం బెనంగిరి చెప్పు మన
వుడు సంజయుం డి ట్లను న ట్లుభయబలంబులుఁ బురికొని పోరుచుండ నుద్దండ
రయంబు మెఱసి యుధిష్ఠిరప్రముఖపాండవులును శైనేయాదియాదవులును ద్రు
పదప్రభృతిపాంచాలురును విరాటపురస్సరమాత్స్యులును గుమారవర్గంబును
మఱియు ననేకదండనాయకులును సాయకాసారంబు వరఁగించుచు భారద్వాజు
పై నడరిన నతం డత్యుదీర్ణుం డయి కర్ణుండు మొదలుగాఁ గలబలుమగ లిరు
గెలంకుల సంరంభంబునం దఱుమ విజృంభించె నయ్యవసరంబున నెగసినధరణీ
పరాగంబు జనంబులచూడ్కులు నిగుడనీక యుండె నాలోనన శుండాలసుభట
ఘోటకంబులయంగంబులఁ గ్రమ్ముదెంచురుధిరం బది యడంచిన నమ్మొనల
కడంక రెట్టించె నప్పుడు కౌరవులదిక్కున ఘూకసృగాలరవంబులు సెలంగ వా
రది సరకుసేయక సమరోన్మత్తులై నెత్తురుటేఱులు వాఱఁ గేలి సలిపి రాసమ
యంబునఁ గేకయరథికులును ధృష్టద్యుమ్నతనయులును లోనగువారిం బెక్కం
డ్ర నక్కుంభసంభవుండు నుఱిపియు మఱియుఁ బలువురఁ బఱపియుఁ గడిమి నె
ఱపం బ్రతాపశీలుం డగుశిబి సాహసరసికుం డై. 57

క. ఉరవడిఁ దాఁకుటయును బది, శరము లతనిమేన గ్రుచ్చె సాయకగురుఁ డ
చ్చెరు వగుమగఁటిమి నతఁ డు,ద్ధురుఁ డై తత్సూతుశిరము ద్రుంచెం బెలుచన్.

తే. త్రుంచి తోడన ముప్పదితూపు లతని
యొడల నాటుడు హయములమెడలు నూతు
గళము నజ్జనపతికుత్తుకయును దునిమె
ఘోరభల్లషట్కమ్మునఁ గుంభభవుఁడు. 59

60

వ. అప్పుడు.

తే. భానుమంతునిఁ జంపినపగ మనమునఁ, బెట్టికొని యుండి యాతనిపట్టి భీమ
సేనుపై పడిఁ గాళింగసేనతోడఁ, గవిసి నారాచధారలఁ గప్పి యొప్పె. 61

క. కినిసి బకమర్దనుఁడు వెసఁ, దనయరదము వాని తేరు దాఁకఁ బఱపి యా
తనిమీఁద నుఱికి క్రుమ్మెం, గనుకని నెంపపొడి సెదరఁ గాలం గేలన్. 62

భీమసేనుఁడు దుర్మదదుష్కర్ణులం జంపుట.

వ. అమ్మహోగ్రసముద్ధతిం జూచి పాంచాలసైనికులు సింహనాదంబులు సేసిన

సహింపక సూతసుతుండును దత్సోదరులును నవ్వీరుం బొదివిన నతం డద్భుతం
బుగా [1]ధుర్యునరదంబుమీఁదికి లంఘించి వానిఁ బిడికిటిపోటునఁ జావం బొడిచి
జయరాతునిపైఁ గవిసి యాతని నతనిసూతునిఁ గాళ్లు లిరుగేలం బట్టి [2]బెట్టిలపై
వ్రేసి గతాసులం జేసిన నలిగి కర్ణుండు శక్తి వైవ మలంగి వెరవున నొడిసికొని
దానిన యవ్వాడమిడి యతనిపై వైచినం గని గాంధారమహీవల్లభుండు భల్లం
బున నడుమన నఱకె నంతఁ గురుకుమారు లమ్మారుతిం జుట్టు ముట్టి [3]విశిఖం
బులు నిగిడించినం గోపించి దుర్మదుని తేరి కురవడించి తురంగంబులం బొరివుచ్చి
సారథిం జదిపిన నాతండు దుష్కర్ణుస్యందనం బెక్కె నయ్యిరువురు నప్పాండు
తనయుతనువున మెఱుంగుటమ్ములు గిఱికొలుపం గిట్టి యారథంబు గూల నవ
లీలం దన్ని దుర్యోధనద్రోణకృపకృతవర్మకర్ణశల్యబాహ్లికులు సూచుచుండ
నక్కుమారుల నిద్దఱం గాల నొక్కనిం గేల నొక్కనింగా సమయించె నివ్విధం
బునం జిత్రవధవిహారంబున విజృంభించునాభీమసేనుం జూచి రుద్రుండు రభసోద్రే
కంబునం బాండవేయులకుఁ దోడ్పడం జనుదెంచెం గాక మానవు లిట్టివారునుం
గలరే యనుచు నీవా రెల్లను వెఱచఱచి యిద్ద ఱొక్క తెరువునం బోక పఱచి
రక్కుమారకంఠీరవుం డుక్కునం దమసేనదిక్కు సూచి యెల్లవిరిదామరలం
దెగడుకన్నులం గౌంతేయాగ్రజు నుపలక్షించి కేలు మొగిచి ఫాలంబునం జేర్చె
నప్పుడు తన్మూర్తి నతండును నకులసహదేవద్రుపదవిరాటులును దేఱి చూడ
శంకించి మాఱుమొగంబులతో నగ్గించి రాసమయంబున. 63

క. కడువడి గురుఁ డనిలజుపై, నడరిన రాధాతనూభరవాదులు దోడై
కడఁగుటయుఁ గనుంగొని స్వీ,కొడుకుగమియుఁ గదిసె నుదితరకోపస్ఫురణన్. 64

తే. వారుఁ దలపడి పోరిరి దారుణముగ, ధర్మసుతుఁడును గవలు నుద్దండవృత్తిఁ
దఱుమద్రుపదవిరాటసాత్యకులు మఱియుఁ, జేయఁగలయట్టిమేదినీనాయకులును.

వ. అయ్యవసరంబున సోమదత్తుండు దనకు సాత్యకి సన్నిహితుం డగుటయు నతని
తో ని ట్లనుఁ బ్రాయోపవిష్టుం డగుభూరిశ్రవుఁ జంపితది బోయచందంబు గాక
రాజధర్మం బగునే యీ రేయి నీవు నాచేత బ్రదికిపోవువాఁడవే యని పలికి సింహ
నాదంబు సేసి శంఖంబు పూరించిన నాశైనేయుండు భూరిశ్రవుండు సచ్చుట
యొప్పదేని నిన్నొప్పెడునట్లు సంపెద నిట్లు రమ్ము శలునిచా వొప్పనొప్ప. దని
యుగ్గడింప వది యేమి నీ కెట్లయునం గాని కా దని భంగించె నిత్తెఱంగున నొం
డొరుల నోనాడి యేటు లాడం దొడంగి రప్పుడు నీకొడుకు ఘోటకస్యందనసందో
హసమేతంబుగా నక్కౌరవునకుం దోడ్పడియె శకునియుఁ దనబలంబునుం దానును
నాతనిం గూడుకొనియె నవ్విధంబునం బలువు రొక్కనిపైఁ గవిసినం గని ధృష్ట
ద్యుమ్నుండు భూరిసైన్యసమేతుం డై వారల నెదుర్కొనినం బోరు ఘోరం

1. ‘గ్రుమునరదంబు’ అని వ్రా. ప్ర. 2. బెట్టిలతో నేసి. 3. విశిఖశిఖలం-గుప్పిన-గుదియించిన.

బయ్యె నట్టియెడ. 66

తే. సోమదత్తుండు దొమ్మిది ✽ సునిశితాస్త్ర, ముల శినిప్రభు నేసిన ✽ నలిగి యతఁడు
నతని [1]నన్నియమ్ములన మ్మూర్ఛితునిఁ జేయ, రథముదోలఁగఁ దోలె సారథి గలంగి.

మ. కని ద్రోణాత్మజుఁ డేచి సాత్యకిభుజాగర్వంబు మాన్పింతుఁ బొ
మ్మని పోఁ బో నడుమన్ ఘటోత్కచుఁడు ఘోరాకార దైత్యవ్రజం
బును దానుం బటుభంగిఁ దాఁకుటయు నీపుత్త్రుండుఁ గర్ణుండుఁ ద
క్కినవారున్ [2]వెఱ వానితోడియనికిం ✽ గ్రేడించి రుర్వీశ్వరా. 68

వ. ఇట్లు సంధ్యాసమయసంవర్ధితబలుం డగునప్పూర్వగీర్వాణునికోల్తల కోర్వక మేటి
మగ లెల్లం దొలంగిన. 69

క. గురుసుతుఁ డొక్కరుఁడును సు, స్థిరుఁ డై తద్బాణనిహతిఁ ✽ దెరలక యతిని
ష్ఠురనారాచంబులు పది, యురమున నాటింప దానవో త్తముఁ డలుకన్. 70

క. వడిఁ జక్రంబున వైచిన, నడుమన గురునందనుండు ✽ నఱికెం బుణ్యాం
బెడలిన నరుసంకల్పము, వడువున నది వమ్ము గాఁగ ✽ వసుధాధీశా. 71

—— అంజనపర్వుం డశ్వత్థామతో యుద్ధంబు సేసి చచ్చుట. ——

వ. అప్పు డద్దనుజునితనయుం డంజనపర్వుం డశ్వత్థామం దలపడి బలుతూపులం
బొదివిన బెదరక యతం డయ్యసురవీరునివిల్లు ద్రుంచి విరథుం జేయుటయు
వాఁడు కరవాలంబు గొనినం దునిమె గద వైచినం దుమురు సేసె నింగి కెగసి
మ్రోఁగుచుం బాషాణవర్షంబు గురియ నదియును వారించి యమ్మాయావి మేన
మేఘంబున గిఱికొనుతరణికిరణంబులం శ్రేణిసేయుపటుబాణంబుల నిగిడించె
మగిడి యొండురథంబున నరుదెంచినఁ దల ద్రెంచె నిట్లు గురుపుత్త్రుండు వానిం
బరిమార్చి పేర్చి పాండవబలంబులఁ బరిమార్పం దొడంగినం గని కడంగి హిడిం
బానందనుండు నిలు నిలు నాబారిం బడీ యెందుఁ బో వచ్చు ననవుడు నా
రథికుం డతని నవలోకించి. 72

ఆ. వలదు రన్న పిన్నవాఁడవు దండ్రి నే, నకట నిన్నుఁ జూచి ✽ [3]యలుగ రాదు
పెనఁగు మొరులతోడ ✽ ననవుడుఁ బుత్త్రశో, కాభితప్తుఁ డైన ✽ యతఁడు గనలి.

క. ఎక్కడితండ్రివి నీ వే, నక్కౌంతేయులకుఁ గొడుక ✽ నై పగతుర పే
రుక్కు సహింతునె తనయుం, గ్రక్కించెద నిపుడ పట్టి ✽ కండలు దిందున్. 74

క. [4]అని పలికి యిరుసులంతలు, సునిశితబాణమ్ము, లేయుచుం దఱిమిన ద్రో
ణునికొడుకు వాని నన్నిటిఁ, దునుమ నసుర మాయఁ బెఱిగి ✽ దుర్దాంతగతిన్.

క. గిరి మైఁ బఱతేర నశని, శరమును మేఘత్వ మొంది ✽ సాయకవృష్టిం
గురిసినఁ బవనాస్త్రంబును, బరువడి నిగిడించి గురుని పట్టి దెరల్చెన్. 76

సీ. హైడింబుఁ డల్గి యుగ్రాకృతిఁ గవిసిన, దనుజగణంబు మాతంగతురగ

1. ఁ బదిసాయకముల మూర్ఛి. 2. వెఱవారితోడి. 3. యలుక. 4. అని పలుకుచు దానవపతి.

రథనివహంబులతో రారాజుమొన నెల్ల, [1]నొక్కెత్తుగాఁ బ్రేల్చి యురవడింప
నన్నరనాథుండు విన్నఁబోయిన గురు,తనయుండు నీకు నీయనికి నేమి
పని నీవు సంభ్రమింపకుము దానవుల న,క్కడిమానవులను వ్రేల్మిడి నడంతు

ఆ. ననిన సంతసిల్లి యతఁడు సౌబలుఁ జూచి, వీరె ద్రోణిబాణదారితాంగు
లైరి పాండుసుతులు దేరిగములతోడ, సత్వరముగ నరిగి జయము గొనుము.

వ. అని యవ్వలను సూపి కృపకృతవర్మకర్ణవృషసేనులను దుశ్శాసనప్రముఖు లైన
కొందఱు దమ్ములను నిరూపించి వీరును నీవును గూడుకొని కవియుం డని పనిచిన
నతండును బింకంబుతోడం బోయె నశ్వత్థామభీమనందనులసంగ్రామంబు భీమం
బయ్యె నట్టియెడ నాఘటోత్కచుండు. 78

మ. పటుబాణాహతి ద్రోణియంగము చలింపంజేసి తచ్చాప ము
త్కటవేగంబునఁ ద్రుంచినం గినిసి యాతం డొండువి ల్లెత్తి యు
ద్భటబాహాబలశౌర్యముల్ నెఱపె నాదైత్యుండు సైన్యంబు నొ
చ్చుటయుం జచ్చుటయుర్ మహీపతికి మెచ్చుం బ్రీతియుం జేయఁగాన్. 79

వ. ఇట్లసురబలంబు నశ్వత్థామ సించి చెండాడం బాండవబలంబులు దర్పం బేది
మార్పెట్ట లేక చూచు చుండ నుద్దండపరాక్రముం డగునాఘటోత్కచుండు ద
ర్పంబున నెక్కటెక్కటి తలపడి పరిఘంబున వైచినం బట్టుకొని యతండు దానిన
యద్దానవుపై వైచుటయు వాఁడు దొలంగ నుఱికి ద్రుపదనందనస్యందనంబునకుం
బోయె నయ్యుగ్రసాధనం బతనితురంగసారథిరథంబుల రూ పడంచిన. 80

ఆ. ఒక్కతేరిమీఁదనుండి ధృష్టద్యుమ్న,భీమసేనసుతులు పెనఁగి రస్త్ర
గురుతనూజు వీఁకఁ జెరలక యంత ను,ద్దామసేనతోడ భీముఁ డడరె. 81

వ. అప్పు డశ్వత్థామ నవ్వుచు నమ్మువ్వురం గ్రొవ్వఱ నేసి భాసమానమార్గణంబులు
నిగిడించిన. 82

మ. భటగాత్రంబుల ఘోటకాంగముల శుంభత్కుంభికాయంబులం
జటులస్యందనఖండసంచయములర్ సంగ్రామరంగంబు గ
ప్పుట చూడర్ వెఱఁ గయ్యె నబ్బలములుం బో [2]కేచి క్రమ్మంగ నె
త్తుటఁ దేల్చెం బోరిమార్చె నాతఁ డడరం ద్రుంచెర్ మథంచెం గడున్. 83

వ. ఇట్లేకాక్షౌహిణీబలక్షయం బాపాదించి యాతపత్రశతపత్త్రంబును జామరమరా
ళంబును గేశశైవాలంబును నాయుధమీనంబును మాంసమేదోమస్తిష్కపంకం
బును రక్తజలోద్రిక్తంబును నగునదీప్రవాహంబు నుత్పాదించె నప్పుడు దర్పంబున
సురథుండును శత్రుంజయుండును బలానీకుండును జయానీకుండును జయుండును
బృషధ్రుండును జంద్రసేనుండును జండరయంబునం గదిసి బాణంబులు వరఁగిం
చిన నప్పాంచాలకుమారుల నమానుషవిక్రమంబున సమయించినం గోపించి

1. నువ్వెత్తుగాఁ-బ్రేల్చి-గొని. 2. కేచినం జెర్మి నెత్తుటఁ.

కుంతిభోజతనూజు లొక్కపెట్ట పదుమువ్వు రతనిం బొదివినఁ బదుమూఁడు మేటి తూపులం గీటడంచి కెరలి జముచందంబున గర్జిల్లి ఘటోత్కచుం గాలదండంబుఁబోనికోలం దేరిపై ద్రెళ్లి మూర్ఛిల్ల నేసిన నోసరిల నయ్యరదంబుఁ దోడన ధృష్టద్యుమ్నుండు గొనిపోవుటయుఁ బొంగి సింగంబుచాడ్పున గర్జిల్లిన నిర్జరులగ్గురునందను నగ్గించి రంతయుం గనుంగొని. 84

ఆ. పాండవాగ్రజుండు౹ పవనాత్మజునిఁ గూడి, తఱిమి సాత్యకియును౹ దాను గవిసె
నంత మూర్ఛ దేఱి౹ హైడింబుఁ డొక్కతే, రనువు గాఁగఁ జేసి౹కొని కడంగె.

వ. తోడన ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినం దత్సైన్యంబు లొక్కమొగిన మొనయుటయును మనమూఁకలును సోమదత్తబాహ్లీకపురస్సరంబుగా నురవడించిన సందడికయ్యం బయ్యె నందు సంజచీఁకటి చూపునకుఁ జొరవ యీకున్నను సైనికనికరవివిధాభరణమణికిరణకలాపంబులుఁ జర్మవర్మాతపత్రకేతుకీలితరత్నరశ్మిజాలంబులు నాలోకనంబు నాపాదించె నట్టిరువాఁగును గలయ బెరసి పోరునప్పుడు. 86

భీమసేనునిచేత బాహ్లికుఁడు సచ్చుట.

క. శినివరుఁడు సోమదత్తుఁడుఁ, బెనఁగఁగఁ దోడ్పడియె వచ్చి౹ భీముఁడు గడఁకం
దనమఱఁదికి నక్కారవుఁ, డెనయే యని బిరుదు [1]వాడి౹ యేత్తెఱ నొంచెన్.

వ. అట్టియెడ. 88

క. అనలశిఖవోనినారసమున సాత్యకి యేయు నెడను౹ ముద్గరమున భీ
మునికొడుకు వైచె రెంటం, దనువున నొవ్వడరి సోమ౹దత్తుఁడు సోలన్. 89

చ. తనయుఁడు మూర్ఛవోయిన ను౹దగ్రత బాహ్లికుఁ డచ్యుతానుజ
[2]న్మని దలపడ్డ నాతనికి౹ మించి వృకోదరుఁ డన్నరేంద్రు నే
సిన నతఁ డుగ్రశక్తి [3]వయి౹చెన్ మెయి నొటుడు సోలి యంతలో
నన తెలి వొంది ముద్గరము౹నం బవనాత్మజుఁ డేచి వైచినన్. 90

క. తల వ్రయ్యలైన నిష్ఠుర,కులిశగతిం బగిలి కూలు౹కులపర్వతముం
దలఁపించుచుఁ గురువృద్ధుం, డిలఁ గూలెం బ్రతిబలంబు౹ లేపారంగాన్. 91

వ. అయ్యవసరంబున దశరథసుతసన్నిభం బగుభవత్కుమారదశకం బాకిమ్మీరవైరిం బొదువుటయు దశనిశితబాణంబులం బ్రాణంబులు గొనియెఁ గర్ణానుజుం డగువృకరథుండు గడంగి వచ్చినం బొరివుచ్చె సౌబలసోదరులు పన్నిరువురు బరవసంబు సేసినం బడనేసె నిట్లు పరాక్రమంబునం బేర్చినభీమసేనుమీఁద శూరసేనవసాతిమాళవత్రిగర్తబాహ్లీకప్రముఖంబు లగు దేశంబులబలంబులు బలువిడిం గవిసినం గని కౌంతేయాగ్రజుండు సైన్యసంతానసమేతంబుగా నురవడించి భుజాటోపంబు సూపిన నవి మఱిసియుఁ జడిసియు జిక్కువడియు నుక్కుమడిఁగియు వెఱఁగుపడి

1. లాడి...నోర్చెన్. 2. న్మని...మించి వృకో. 3. కొని.♦ చెచ్చెర-మెయిఁ ♦ కేకొని.

చూచుచుండ నాచార్యుని దుర్యోధనుండు పురికొల్పిన నతం డుత్సాహదీప్తుండై యాధర్మతనయుఁ దాఁకి వాయవ్యయామ్యవారుణాగ్నేయత్వాష్ట్రసావిత్రంబులగు సాయకంబులు వరుస నేయ నమ్మెయ్యయస్త్రంబుల నవ్విభుండు ప్రత్యస్త్రంబుల వారించిననతం డైంద్రాస్త్రంబున నిజప్రతిజ్ఞ నెఱపం జూచిన నదియు నట్ల యడంగుటయుం గోపించి సకలభూతభయంకరం బగుబ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నమ్మహీపతియు నమ్మహనీయాస్త్రంబుననె సమయించె నంత ధృష్టద్యుమ్నుం డతని కడ్డపడిన నారథికుతోడియనికిం గ్రేడించి కుంభసంభవుండు. 92

చ. ద్రుపదునిసేనపై నడరి కత్తోలినఁ జూచి వృకోదరుండు దే
వపతిసుతుండుఁ దాఁకి యనివారణ నగ్గురు నొంప నేచి యు
గ్రపువడి మాత్స్యకేకయముఖం బగుపాండవసైన్య మొక్కపె
ట్ట పఱఁగి నీబలంబులకడంక యడంచి మదించి పేర్చినన్. 93

వ. కనుంగొని కౌరవేశ్వరుండు కర్ణుని కిట్లనియె. 94

క. పాండవపాంచాలాదులు, గండు మిగిలి పెట్టు దఱుమఁ గౌరవబల మొం
డొండ కలంగెడు నీ దగు, దండితనము సూపి కావఁ దగుతఱి వచ్చెన్. 95

వ. అనవుడు. 96

శా. చంపం జాలుదు నే నొకండన భుజాశక్తిన్ నరున్ వెండి మ
ర్దింపం జుల్కన భీమముఖ్యుల భవత్తేజంబు రాజ్యంబుఁ బా
లింపం బూనినయేను గల్గఁగ రిపుల్ జృంభింతురే చూడు నా
తెంపుం బెంపును నంచుఁ గర్ణుఁడు మహోద్దీప్తాకృతిం బొల్చినన్. 97

కృపాచార్యుండు గర్ణు నుపాలంభించుట.

వ. కనుంగొని కృపాచార్యుం డలంతినవ్వుతో నతని కిట్లనియె. 98

చ. అగు నగు మేలు మేలు మనరాజాధిపుఁడున్ మహి నీ మేలుమాటల
న్మగఁటిమి యిమ్మెయిన్ నెఱపినం జెడుఁ బాండుతనూజకోటియుం
దగు మును ఘోషయాత్రను బఱదంపడి గోగ్రహణంబునందుఁ బే
రుగొనినసీరు ని ట్లనుటకు [1]క్రొవ్వులు దక్కుము పాలు నిన్నియున్. 99

వ. అని వెండియు. 100

క. నిన్నును బాండుతనూజుల, నెన్నంమను బోరఁ జూచి మెఱుఁగనివాఁడం
గన్నట్లు వలుక నేటికి, నిన్ని సెనఁటిరజ్జు లనికి నివి దోడ్పడునే. 101

క. క్రీడికి మును మన మందఱు, నోడుటెఱుఁగు దన్నలును ఘటోత్కచుఁడుఁ దగం
దోడుపడ బంధునృపతులుఁ, గూడి నడవ మనకు గెలుపుగొన నెట్లు లగున్. 102

చ. అనవుడుఁ గర్ణుఁ డిట్లనియె నాడినయంతయుఁ జేయఁ జాలుబం
టున కెటు లన్న నే మగుఁ గరంబు బెలుచన్ మును మ్రోసి కాదన్న

1. క్రొవ్వులు వల్కుటు.

ష్టి నిగుడఁజేయు నంబుదము ✽ సెల్లదు నీపలు కింతవట్టు స్సైఁ
పనతగు నింక నే మనినఁ ✽ బాఱుఁడ నాలుక గోయుదుం జుమీ. 103

వ. అని పలికి మఱియును. 104

క. నరు నద్దెసఁ గలవారిని, గురుబల ముబ్బుసెడఁ [1]బాగడి ✽ కొఱకొఱ గాఁగన్
గురుని గుసుతనయు మద్రే,శ్వరు నను నేమిటికిఁ గాని ✽ వారిం జేయన్. 105

క. అని మామఁ బలుకుపలుకులు, విని యశ్వత్థామ క్రోధ ✽ వివశుం డయి గ్ర
క్కున వాలు వెఱికికొని క,ర్ణుని దెసకుం గవియ భూవ ✽ రుం డెడ సొచ్చెన్. 106

ఆ. నృపతితోడఁ గూడి ✽ కృపుఁడును నెడసొచ్చె, వార లతనిఁ బట్టి ✽ వలదు రోష
ముడుగ వలయు ననిన ✽ నుగ్రత నాతఁడు, పెనఁగఁ గర్ణుఁ డిట్టు ✽ లనియెఁ గనలి.

క. విడు విడు మాతం డిమ్మెయి, నడిచిపడఁగ నేల పట్టె ✽ దవనీశ్వర నీ
వుడిపెడు తెఱఁగున నాబిరు, దుడుగునె నాచేయి దాఁకి ✽ యుడిగినభంగిన్. 108

క. అనుడుఁ గృపాచార్యుం డి,జ్జనపతికిం గాఁగ నేను ✽ సైరించిన నే
మని పలికితేని నీకుం, జనియెం బొమ్మింక వలదు ✽ సంభ్రమ మనియెన్. 109

వ. అప్పు డక్కురుపతి గురుపుత్త్రు నుద్దేశించి. 110

క. గురుఁడును నీవును మద్రే,శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు ✽ సౌబలుఁడు నన్
ధర యేలింపఁగ నున్నా,రరు మీకుం దగునె సంగ ✽ రములోఁ గలఁగన్. 111

క. క్షమియింపు మనుడు నతఁ డుప,శమ మొందినఁ గర్ణుఁడుం బ్ర ✽ శాంతుం డై వి
క్రమకేలి సలుపఁ బ్రతిసై,న్యముదెస మొగ మయ్యెఁ బటుగు ✽ ణధ్వని సెలఁగన్.

వ. ఇట్లు గడంగినం బ్రత్యర్థి పార్థివు లయ్యోధవరు నాలోకించి పాండవులకుఁ బాటి
ల్లినయనర్థంబుల కెల్లను మూలంబు వీఁడ కాఁడే వీనిం బొడువుఁడు పోనీకుఁడు
పడవైవుం డనుచుఁ దలపడిన నాసూతసూనుండు నిజనామాంకితంబు లగునా
రాచంబుల నన్నరపతులఁ గరుల నరులఁ దురంగంబుల నరదంబుల రూపుమాపి
యేపునఁ దదీయాంగంబులు రుధిరంబున మునుంగునట్లు సేసినం జూచి సవ్యసాచి
సాయకజాలంబులు నిగిడించుచుం గవిసిన నతండు మూఁడుమార్గణంబులు దన
తనువునఁ జొనుపుటయుం గినిసి యక్కిరీటి ముప్పదిశరంబుల నొప్పించి భుజశిఖరం
బున బలునారసంబులు నాటించినం జేతివిల్లు వడియెం బడుటకుఁ దలంకక యక్క
ర్ణుండు డాక్షణంబ విల్లు వుచ్చుకొని విప్పచ్చుండు వెడంగుపడునట్టివేగంబున వివిధ
విశిఖంబులు నిగిడించిన. 113

మ. కడక న్నెత్తురుచెల్వుఁ దాల్ప నతఁ డుగ్ర ✽ స్ఫూర్తి విల్ ద్రుంచి యె
క్కుడు వేగంబున సూతుమస్తకముతోఁ ✽ గూడం దురంగాంగముల్
గడికండంబులు సేసి యారథికుఁడై ✽ గాఁడంగఁ జెక్కుమ్ము లే
యుచు నొవ్వారినఁ బాఱి యెక్కెఁ గృపుతే ✽ రుర్వీశ నిర్లజ్జుఁ డై. 114

1. బాగడి ✦ గొనకొని యిచటన్.

వ. ఇవ్విధంబున రాధేయుం డోడి పాఱిన నీడం జోవు మనసైనికులం గనుంగొని కురువిభుండు. 115

క. నిలువుఁడు వెఱ పేటికి నేఁ, గలుగఁగ గాండీవిఁ దక్కఁ గలపాండవులన్
గెలిచెద నిదె చూడుఁడు నా, యలవుఁ జలము ననుచు నడచె నన్నరుమీఁదన్.

వ. అప్పుడు కృపాచార్యుం డాచార్యనందనున కిట్లనియె. 117

చ. శలభము వహ్నిమీఁదఁ జనుచందము గాదె నృపాలుఁ డర్జునుం
దలపడఁ బోక యాతనిశితప్రదరంబులబారి కగ్గమై
మెలసినఁ గావఁగా వశమె యాతని నీవును నేను నుండి ము
క్కలమునఁ బోవ నీఁ దగదు గ్రమ్మన నెయ్యము నిల్పు మవ్విభున్. 118

క. అనుటయు గురునందనుఁ డ,మ్మనుజాధిపు నెయిది యేను మాన్పెద భీభ
త్సునికడఁక యేమి మూఁడినఁ, జనియెదు తలకడచి సాహసక్రియ ననుచున్.

ఆ. గురుఁడు పాండవులకుఁ గూర్చు నీవును దాని, నెఱిఁగి బవరమున నుపేక్ష సేయు
దిది మదీయభాగ్యహీనత గాక నీ, వేచితేని నెవ్వ రెదురు సెపుమ. 120

క. పలువురు బంధులు న్నాకై, పొలిసిరి మీ రింకఁ బాండుపుత్త్రులదెస రా
వలవదు పాంచాలాదుల, వలన నిలిచి గెలువుఁ డేను వారలఁ దీర్తున్. 121

వ. అనిన విని యశ్వత్థామ భూమీశ్వరున కిట్లనియె 122

క. గురునకు నాకును బాండవు, లరయఁగఁ గూరిమికిఁ బాత్ర మగుదుర మైనన్
దురమునఁ జుట్టఱికం బను, గరు సిడికొను టేల కలుగుఁ గౌరవనాథా. 123

ఉ. పెక్కురణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు నన్ను మద్గురుం
[1]దక్కినవారు మేము వినుదాఁపము ప్రాణము లోపినట్లు పే
రుక్కునఁ బోర దైవగతి యున్నటు లుండెదుఁ గాక పాండవుల్
మిక్కిలివారు నీతలఁపులే మే గెలువన్ వశమే మహీశ్వరా. 124

వ. మా కిరువురకుం దోడు కృపకర్ణకృతవర్మమద్రపతులు గల రెట్లును బాండవసైన్యంబు సమయింతు మూఱడు మని వెండియు. 125

తే. మమ్ము గాదు నీ వెవ్వరి నమ్మె దెట్లు, నమ్మకున్నను నే మగు నరవరేణ్య
ప్రతిబలంబులలోనికిఁ బసులనడుము, సొచ్చుపులివోలెఁ జొచ్చెదఁ జూడు నన్ను.

వ. నీచెప్పినపాంచాలురం బఱపెదఁ దక్కినబలంబులం గలంచెదం గౌంతేయులు దార్కొనినను మార్కొని నిలువరించెద నని పలికి తలకడచి నడచె నప్పుడు గడంగినకవ్వడికి మించి పాంచాలకేకయప్రభృతిసేన లొక్కపెట్ట కవియుటయు నాజెట్టిబిరుదు వివిధవిశిఖపరంపరలు వరఁగించినన్ బడలువడియును బలుదెసలం బాఱియు నబ్బలంబులు వికలంబు లైనఁ బదుండ్రురాజులు నిలు నిలు మనుచు బరవసంబుసేసిన వారల జమునివశంబు సేసి యేఁచినయయ్యాచార్యసుతుం జూచి రోషా

1. దక్కినవారమే వినుము దాఁపము.

విష్టుం డై ధృష్టద్యుమ్నుండు దాఁకి నీవు గొందఱ నిర్జించితి వని దుర్జయత్వం
బెక్కించుకొనకు మేను జుమ్ము వచ్చినవాఁడ ననుటయు నతండు నిన్నకాదె వెద
కెద మద్బాణంబులకుఁ బ్రాణంబు లిత్తు గా కనవుడు నప్పాంచాలవరుం డతని
నుపలక్షించి. 127

క. మీతండ్రికి నే మృత్యువ, నై తోఁచినవాఁడ నగుట యట్లుండె నినుం
జూతి మట సనక డగ్గఱు, మా తలఁకక వలదు రిత్తమాటలు మనకున్. 128

వ. అనిమె న ట్లన్యోన్యపవురు నొండొరులం బరుసంబులు వలుకుచుం బలుదెఱంగుల
మెఱుంగుటమ్ముల నేట్లాడి రట్టియెడ. 129

మ. ధనువుం గేతువుఁ ద్రుంచి సారథిని రథ్యవ్రాతముం గూల్చి యే
పునఁ బాంచాలతనూజువెల్గొడుగుసాంశపుం జంపి గావించి యా
తనిపార్శ్వంబులయోధవీరశతముం దన్మాన్యులన్ మువ్వురం
దునిమెన్ ద్రోణసుతుండు రాజు వొగడన్ దోర్గర్వదుర్వారుఁ డై. 130

వ. ఇవ్విధంబున వైరివధం బాపాదించి సింహనాదంబు సేసినయశ్వత్థామక ట్టెదుర
నిలువలేక పాండవపాంచాలసైనికులు సెల్లాచెద రైనం గని ధర్మజసమీరసూను
లు స్వసైన్యంబుగా నతనిం బొదివినం గురుపతియును గురుసమేతుం డయి సేనల
తోడ నడరినన్ బలుకయ్యం బయ్యె నప్పుడు విజయుండును మన ప్రజమీఁదఁ
గవిసె నాసమయంబున నంబష్ఠశిబివంగాది దేశంబులబలంబులు భీమసేనుచేత
మ్రగ్గె నాసమయంబున మగధమద్రవంగాంబష్ఠాది దేశంబులబలంబుల సవ్యసాచి
సమయించినం గని కినిసి ద్రోణుండు వాయవ్యబాణంబునఁ [2]గాంతేయుల మొనలఁ
జొక్కాకులచందంబునం దూలం జేసిన. 131

సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట.

క. అలిగి నర్కుఁడు భీముఁడు నిరు, గెలఁకుల నయ్యస్త్రగురునిఁ గిట్టి శరాఘం
బులఁ దేల్చిన మగుడ ననికిఁ, దలకొని వడి నురవడించెఁ దత్సైన్యంబుల్.

తే. అధిపతియు నస్త్రగురుఁడు బేరగ్గలికలఁ
దఱుమఁ జతురంగములుఁ బేర్చి యుఱక వారి
మొనలతోఁ దాఁకి గాండీవశమ్ముక్తవిశిఖ
శిఖలవేఁడిమి కోటలి చెనరి పఱచె. 133

వ. అట్టియెడ సోమదత్తుండు సమరోల్లాసంబునం బాండవసైనికుల నిలునిలు మని యద
ల్చుచు నిల్చినం గనుంగొని సాత్యకి యతనితోడం దలపడినం దత్సంగ్రామంబు
భీమం బయ్యె నందు. 134

సీ. సాత్యకివిల్లు శితచంద్రబాణంబున, నఱకి యాబాహ్లికనందనుండు
ముప్ప దేసమ్ముల నొప్పింప నతఁ డొంచు, విలు గొని యాతని నలుఁగుటమ్ము

---

1. వమ్మ గావించి. 2. గాంతేయబలంబుల; గాంతేయుల మేనుల.

లైదింట నేసి మహారజతధ్వజం, బిలఁ గూల్చి ధనువు సెక్కలుగఁ జేసెఁ
జెఱునవ్వుతో నాతఁ డుఱక వేఱొకవింట, నేట్లాడఁగా భీముఁ డేసె నపుడు

తే. దాఁకి మీఁతండ్రిపై ఘటోత్కచుఁడు వైచెఁ
బరిఘమును నది దునిమె నక్కురువరేణ్యుఁ
డపుడు హయసారథులఁ జంపి యతనియసులు
గొనియె బలునారసమున నాశినివరుండు. 135

క. మారుతి యిమ్మెయి నక్కురు,వీరునిఁ జంపించి మోము వికసిల్లఁగఁ దాఁ
బోరెడునెప్పటిమునుముమ,హీరమణులమీఁదఁ దఱిమె నిభపురనాథా. 136

ఉ. వచ్చినసోమదత్తుఁ గని సాత్యకిపై మనవారు గ్రమ్మినం
జెచ్చెర ధర్మజుం డతనిఁ జేకొని వారలఁ దూలఁ దోలుఁడున్
వచ్చి గురుండు విల్ నఱికి వైచి సిడంబును డొల్లఁ జేసి మే
నుచ్చి చనంగ నేయ నతఁ డుద్భటరోషమహోగ్రమూర్తి యై. 137

క. వేఱొకవిలు గొని యెమ్ముల, గీఱ మెఱుఁగునారసములు గిరిఁ గొలిపిన నో
టాఱి మెయిం గ్రొన్నెత్తురు, వాఱ నతఁడు దేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్.

వ. కొండొకసేపునకు సేద దేఱి యక్కుంభసంభవుండు విజృంభించి వాయుదైవత్యం
బగుశరం బేయుటయు నాభూవిభుండుఁ దద్దేవతాకం బగుసాయకంబున శమి
యింపంజేసి పెల్లేసినం గని కృష్ణుం డతని కిట్లనియె. 139

క. నినుఁ బట్టఁ గుంభజుండు ప్ర,తిన సేయు టెఱుంగు దతనిఁ దేఁకువ సెడి మా
ర్కొనఁ దగదు నీకు భీముం, డని సేయుమొగమునఁ బొదువు మక్కురుసేనన్.

తే. ఇతని వధియించుటకు జనియించె నెవ్వఁ
డతఁడ యాతనితోడఁ బోరాడుఁ గాక
యనుడు నొక్కింత యూహించి యానృపాలుఁ
డరిగె ద్రోణుండు ద్రుపదుసైన్యమున కడరె. 141

వ. ఇట్లు సని యుధిష్ఠిరుండు దనతమ్మునకుఁ బెనుఁబ్రాపయ్యె నయ్యనిలసుతుండును
సాత్యకియు ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినఁ గృపకర్ణకలశభవులు గడంగి
రయ్యుభయసైనికోత్తములు సంరంభంబునం బేర్చిన సైన్యద్వయంబును రయం
బునం గలయఁ బెరసినం బెందూళి యెగసి తఱితోఁ గవియుదెంచుతమంబు
నకుం దోడుపడి చూడ్కులు నిగుడ నీకున్నను దమకంబునం దమతమపేళ్లు
బిరుదులు నుగ్గడించుచు నగ్గలికసొంపునను సన్నల నుద్దేశంబుల నద్దెస నిద్దెస
వీరులు పోరుచుండ నంధకారం బతిసాంద్రం బై చిక్కువఱిచె నట్టియెడ బిట్టడరి
పాండవు లుద్దండబాహాసంపదలు సూపిన నేపఱి కౌరవబలంబులు గలంగి చీకా
కుపడి చీఁకటికతంబునం గూడుకొనం గానక పలుదెసలఁ దొలంగి పోలు పఱిన
నయ్యాచార్యుండు ధైర్యంబు మెఱయ దుర్యోధనుం గూర్చికొని యుదామ

సామర్థ్యంబున సకలచతురంగంబులం [1]బూఁచిన ట్లొనర్చి యొక్క మోహరంబు
గా నమర్చి యం దగ్రభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబ
లుల నునిచి [2]నడుకొన శల్యు నిలిపి యన్నరేంద్రుండు వెన్నుదన్ని నిలుచునట్లు
సేసె ననుటయు ధృతరాష్ట్రుండు సంజయునితో ని త్తెఱంగునం బన్ని బహులతిమి
రంబున సమరం బెటు సేసి రని యడిగిన నతం డతని కి ట్లను నాసమయంబున
నక్కురుభూపాలుండు దమకాలుబలంబుల నెల్ల నాయుధంబులు వెట్టి దివియలు
పట్ట నియోగించిన. 142

క. ము న్నాపని మానుసులం, గ్రన్నన పతి సంఘటింపఁగాఁ బనిచిన సం
పన్నంబుగ నొడఁగూర్చిన, నున్నతకరదీపనికర ముజ్జ్వలితముగాన్. 143

వ. చేసికొని యప్పదాతివర్గంబులు దివియలు దెచ్చిన నద్ధరణీవరుండు రథంబున కై
దును గరికి మూఁడును దురంగంబున కొండును నియతంబుగాఁ బట్టించి మఱియు
వానికెలంకులకును గేతనంబులకును దగం బట్టునట్లు సేసి వెండియు మోహ
రంబు ముందటను బార్శ్వంబులను బెఱుందను బ్రభలు నిగుడం బొడవుగా నెత్తి
పట్టంబనిచిన నవ్వెలుంగు నింగికి నేలకుం జాలి పొలిచె నట్టియెడ మణిభూషణం
బులను రత్నకేతనంబులను వివిధాయుధంబులను బ్రతిప్రభలు ప్రజ్వరిల్ల శోభిల్లి
నీసైన్యం బొప్పె నప్పుడు పాండవబలంబునను [3](రథంబునకుం బదియును గరి
కేడును దురగంబునకు రెండును గాఁ) దప్ప్రకారంబునం గరదీపికాలోకం బాలో
కనీయం బయ్యె నయ్యవసరంబున నయ్యస్త్రగురుండు మధ్యందినమార్తాండు
పగిదిం బ్రదీప్తమూర్తి యై వెలుంగ నమ్మనుజపతి యనుజన్ములతో ని ట్లనియె.

తే. శల్యకృతవర్మముఖయోధసమితిఁ గూర్చి
కొని మహోద్యోగమున మీరు కుంభజన్ము
చెంత కాద్రుపదాత్మజుఁ జేరకుండ
నాఁగుఁ డోరు లెల్లవారల నతఁడు గెలుచు. 145

## పాండవకౌరవవీరులద్వంద్వయుద్ధము.

వ. పదంపడి యాధృష్టద్యుమ్నుం బరిమార్పుఁ గిరీటిం గర్ణుండును భీమసేనుని నేనును
గెలుతు మని పలికి బలంబులకుఁ జేయి వీచి కడంగిన నెదిరిసేనయు నురవడింప
నెన్నండును జూడ వినంబడనియట్టిబవరం బయ్యెఁ బాండవాగ్రజుండుఁ దనదొరల
ద్రోణుమీఁదం గవియుం డని పనిచి తానును దఱిమిన నమ్మనుజపతిం గృతవర్మయు
సాత్యకిని భూరియు సహదేవు రాధేయుండును వాయుసూను సుయోధనుండును
నకులుని శకునియు శిఖండిఁ గృపాచార్యుండును బ్రతివింధ్యుని దుశ్శాసనుండును
ఘటోత్కచుని గురుపుత్త్రుండును బాంచాలవిభుని వృషసేనుండును మత్స్యరాజును
మద్రేశ్వరుండును శతానీకుని జిత్రసేనుండును నర్జునుని [4]హలాయుధుండునుం

1. గూడున ట్లొనర్చి. 2. నడుమన. 3. ఇది పెక్కుప్రతుల లేదు. 4. నలంబుసుండునుం.

దలపడి రిట్లు గురుని నొంపను రక్షింపను బూని మఱియు ననేకు లనేకులఁ దా
ర్కొనిరి సోమకసైన్యంబు సమయించునక్కుంభసంభవుని ధృష్టద్యుమ్నుండు
మార్కొనియె నట్టియెడ. 146

సీ. పాండవాగ్రజునిచాపము ద్రుంచెఁ గృతవర్మ
యతఁ డొండువిలు గొని యతని నొంచె
ధనువును దునిమి హాస్తం బుచ్చి పో శక్తి
యడరింప వేఱ శరాసనంబు
గొని హయసూతులఁ గోదండమును బొడి
సేసి హార్దిక్యుండు సెలఁగి యేసె
నరనాయకుఁడు కృపాణము గొన్న నఱకెఁ దో
మరముఁ బూనిన రూపుమాపి మఱువుఁ
తే. బఱియలుగఁ జేసి తనువునఁ బఱపె నార,సంబు లిట్లమ్మహాబలుచటులవిక్ర
మంబు దుస్సహమగుడు నమ్మానవేంద్రుఁ, డనికిఁదొలఁగినఁ గురుబలమలరె నధిప.
క. భూరియు శినివరుఁడు శరా,సారము లొండొరులమీఁద సరిఁ బఱపి వడిం
బోరు నెడ భల్లమున నా,కౌరవువిలు దుంచె సత్యకసుతుం డధిపా. 148
ఆ. త్రుంచి మేను గాఁడఁ దూపులు నిగిడింప, నాతఁ డొండువింట నతని నొంచి
ధనువు దునుమఁ గోప మినుమడి యై శక్తిఁ, ద్రెళ్లవైచె శినివరేణ్యుఁ డధిప.
వ. ఇట్లు సాత్యకిచేతం జచ్చినభూరిం జూచి భారద్వాజపుత్త్రుం డతనిపయిం గవియు
టయు ఘటోత్కచుండు నిలు నిలు మని మెఱుంగు సూపి దొడ్డతూపు లడరించిన
నతం డవి మగిడించి పెల్లేసిన నేదు వెఱగిన ట్లయ్యసురవరుండు దశవిశిఖంబులు
రయంబున నురంబున గ్రుచ్చిన మూర్ఛ వచ్చి యమ్మేటిజోదు కేతుదండం బవ
లంబించి. 150
క. ఆలోనన తెలిసి మెఱుఁగు, వాలికనారసము [1]దైత్యువక్షమున వెసం
గీలించిన నరదముపై, సోలి పదుడుఁ దేరు దొలఁగ సూతుఁడు దోలెన్. 151
క. భీముఁడుఁ గురుపతియు శర,స్తోమము లొండొరులమీఁదఁ దొరఁగించుచు ను
ద్దామాంభోదపిహితరవి,సోములచందమున నొప్పుచుం బోరు నెడన్. 152
చ. ధనువు సిడంబుఁ దుంచి సముదగ్రత భీముఁడు మేను నొంప న
మ్మనుజవిభుండు వేఱొకసమగ్రబలం బగుచాప మెత్తి యా
యనమెయిఁ గాఁడ విల్ విఱుగునట్లుగ నేసిన నొండువింట న
య్యనిలజుఁ డేడునారసము లానృపుగాత్రమునందు [2]గ్రుచ్చియున్. 153
చ. విలు దునుమాడి వెండియును విశిఖులు నా ల్గతఁ డెత్తి నెత్తను
త్తలముగఁ దుంచి వైచె గదఁ దత్తురగంబుల సూతుఁ జాన న

1. దైదు. 2. గ్రుచ్చుచున్.

గ్గల మగుభీతి రాజు దొలఁగఁగ వెస [1]దాఁటుడుఁ గాన కాతఁడుం
బొలిసెనకాఁ దలంచి మదిఁ గొంగి వృకోదరుఁ డార్చె నార్చినన్. 154

వ. మనమూఁకలు నట్లకాఁ దలంచి హాహాకారంబులతో నాకులతం బొందె నందలి జనంబులు ప్రమదంబునం జెలంగి రక్కారవేందు్రిందు వేఱొక్కతే రెక్కితోఁ చినం గని యెల్లవారును డిందుపడిరి కర్ణసహదేవులు సముదీర్ణవిక్రమంబు వెలయం బెనంగునప్పుడు. 155

క. అమ్మాద్రీసుతుఁ డేవునఁ, దొమ్మిదివాలమ్ము లొడలఁ గ దూర్చిన నతిరో
షమ్మునఁ గర్ణుండు దదం,గమ్ములు నొప్పించెఁ దీవ్రకాండశతమునన్. 156

వ. ఇట్లు సహదేవుం బొదివి రాధేయుండు. 157

చ. రయమున విల్లు దుంచినఁ బరాక్రమ మొండొకవింటఁ జేయఁగా
హయముల సూతుఁ జంపుటయు నాతఁడు ఖడ్గము ఖేటకంబు ని
ర్భయముగఁ బుచ్చుకొన్నబహుశబాణములం దునుమాడె నన్యదు
ర్జయ మగులావునం గడు వెరసఁగ గద వైవ నడంచె నవ్వుచున్ 158

వ. దానం బెండువడక యప్పాండునందనుండు. 159

—కర్ణుఁడు సహదేవుని వింటికోపునం బొడుచుచు నవమానించుట.—

ఆ. శక్తి వైవ నిశితచక్రంబు నిగిడింప, వరుస నదియు నదియు వ్రయ్యలయ్యెఁ
దునియలయ్యె నేలఁ దొరఁగంగఁ జేసి పెల్లేసి తెరలుటయును నెద్దె నతఁడు.

వ. ఇత్తెఱంగునఁ గర్ణుండు గదిసి నిశ్చేష్టితుం డగుసహదేవు నాలోకించి కుంతిమాటలు దలంచి యొండు సేయనొల్లక యల్లన వింటికోపునం గడుపు వొడిచి నవ్వుచు నెక్కుడైనపగఱ నుక్కునం దలపడకు మల్లవాఁడె నరుండు గురుసేనతోడ బిరుదై పెనంగెడు నతనికడకుం బొమ్మని పలికి పోయె నక్కుమారుండును నట్లు గర్ణునేటులను మాటలను గడు నొచ్చి తనబ్రదుకునకు రోయుచుం బోయి వేఱొక్కరథం బెక్కె మత్స్యమద్రేశ్వరులు జంభవాసవులచందంబున సమరంబు సేయుసమయంబున నాశల్యుండు. 161

క. హరులను సూతుని జంపిన, విరటుఁడు పాలివోక వివిధవిశిఖచయంబుల్
గురియ శతానీకుఁడు శల్యురథం బస్త్రములఁ బొదివె నుద్ధతభంగిన్. 162

వ. ఇట్లు మత్స్యానుజుండు దాఁకిన. 163

తే. అతనిఁ గూల్చె మద్రేశుఁ డయ్యరద మెక్కి
విరటుఁ డడలును గినుకయుఁ బిరిగొనంగ
ముట్టె నాతని నాతండు మూర్ఛ వోవ
నేయ సారథి దొలఁగఁగ నెగచె రథము. 164

వ. ఇవ్విధంబున విరటుండు వికలుం డగుటయు నాచక్కటిసైన్యంబులు శల్యునర

1. దాఁటుట గానఁ డాతఁడు.

వడికిం గాఁక తెరలినం దఱిమి ధనంజయుండు నిలువరించిన బలాఢ్యుం డగు[1]హలా
యుధుం డతనిమేన మార్గణంబులు గ్రుచ్చి పేర్చిన నప్పాండవమధ్యముండు. 165

ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధింప ను
తోఁకపవికారుఁ డై యసుర క్రూరకృపాణము గొన్న నేసె ను
గ్గై పృథివీస్థలిం దొరఁగున ట్లలయించి చతుశ్శతిన్ సమా
టోపము సూప నాతఁడు గదన్ వెసఁ బాఱె భయార్తమూర్తి యై. 166

సీ. నకులనందనుఁడు నీనందనుతోఁ బోరు, నెడ నాశతానీకుఁ డేచి యతని
కంకట మంగంబు గ్రక్కునఁ బాసి పోఁ, బడ నేసి విల్లును సిడముఁ ద్రుంపఁ
దలఁకక యొండుకోదండంబు గొని నీదు, పుత్త్రుండు నొంప నాచిత్రసేను
శరముల గోర్చి తత్తురగంబులను సూతు, ధరఁ గూల్చె వెస భవత్పౌత్త్రుఁ డపుడు
తే. గలఁక లేక యతండు శీఘ్రమున నిరువ, దేనుదూపుల నొంచిన నెసక మెసఁగఁ
గినుక నాతఁ డాధనువును దునుమ నక్కు, మారుఁ డేఁగె హార్దిక్యుని తేరిపైకి.

క. ద్రుపదుఁడు వృషసేనుండును, నుపమానాతీతఘోరయుద్ధంబున బా
ణపరీతశోణితప్లుత, వపురుజ్జ్వలు లైరి కౌరవక్షితినాథా. 168

వ. అట్టియెడ నాకర్ణపట్టిచేయి బెట్టిదం బయి వచ్చినం బాంచాలబలంబు నిజపతికిం దలకడచి యతనిం బొదివి యాసైనికోత్తమునంపసోన కోటఱి పఱచినం బ్రదీప్తుం డై యతండు మెఱసె దుశ్శాసనుండును ధర్మనందననందనుండును బోరు నెడ నప్పాండుపౌత్త్రుం డతనిఫాలంబున వాలికనారసంబులు మూఁడు నాటించినం ద్రిశిఖరయుతశైలంబులీల నయ్యువరా జొప్పి యవ్వీరుం గ్రూరశరంబులం గప్పి కేతుసారథిరథంబులఁ దిలప్రమాణశకలంబులు సేసిన. 169

క. వింధ్యాద్రిపోలె నాప్రతి, వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి ద
ర్పాంధ్యమతి నడరి దీప్తా, వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్. 170

ఆ. అలిగి వెడఁదవాతియమ్మున నాతని, ధనువుఁ దునియ నేసి తనువునందు
నిశితవిశిఖచయము నిగిడించె నీకొడు, కంతఁ దత్సహోదరాళి గదిసి. 171

వ. కయ్యంబు సేయ నందు భీమసేననందనుం డగుశ్రుతసోమునరదం బయ్యుధిష్ఠిరతనయుం డెక్కి యొక్కసముద్దండం బగుకోదండంబు పుచ్చికొని భండనంబు సేసె మనవారు నయ్యువరాజున కడ్డంబు సొచ్చి పెనంగిరి నకులుండును శకునియు సమానవిక్రమంబుల సమరంబు సేయునెడ నాసౌబలుండు. 172

చ. ఒకబలుతూ పురంబు గొని యుచ్చి చనం గర మల్గి యేయుడున్
నకులుఁడు మూర్ఛవోవుటయు నాదము రోదసి నిండ నార్చె నం
తకుఁ దెలి వొంది చాపముఁ బరాకయుఁ ద్రుంచి యతండు నీమఱం
దికి నరసా వొనర్చె ఘనతీవ్రసముజ్జ్వలమార్గణంబులన్. 173

1. 'అలంబుసుఁ' డని యచ్చుప్రతులఁ జూపట్టెడి.

వ. ఇట్లు గాంధారపతి పడుటయుఁ దత్సారథి దేరు దోలంగఁ దోలుకొని పోయెఁ
గృపాచార్యుతోడ రణక్రీడఁ జలుపుచుండ శిఖండికోదండంబు బిసకాండంబు గా
ఖండించి యతండు శక్తివైవ నదియును దునిమిన ఘనంబగుధనువు గొని తోరం
పునారసంబున నతనిం దేరిపై సొగయ నేసి యగ్గౌతముండు గోపంబునం జంపఁ
దలం పెత్తి వెండియు నేయ నిగుడునంతకు నద్దెసయోధులు పలువు రొక్కట
నుఱ్ఱున నురవడించిన మనదిక్కుసైనికులు శారద్వతుం గడచి కడిమి నెఱయఁ
బోరిరి మఱియు ననేకద్వంద్వయుద్ధంబులు సెల్లుచుండ సంకులసమరం బయ్యె న
య్యవసరంబున. 174

సీ. ఏచి ధృష్టద్యుమ్నుఁ డాచార్యునురమున, వెస నాఱు నైదునారసము లాతెఁ
డాతని నిరువదేనమ్ముల నొంచి విల్, దునిమిన నొండువిల్ గొని యతండు
మంటలు గ్రమ్మెడుమహితాస్త్ర మేయుడుఁ, గాలంబు గా కిది కలశజునకు
ననుచు నీవారు భయం బంద నేశాద, శాస్త్రంబు లోకముష్టి నలవరించి

తే. యేసి కర్ణుండు దునియలుసేసె నడుమ, నంతఁ గురురాజు యువరాజు నడర గురుసు
తుండు శకునియు శల్యుండుఁ దోడుపడిరి, వార లేడ్వుర తాఁకు నవ్వీరుఁ డోర్చె.

క. ద్రుమసేనుఁ డడరి పటుబాణము లుద్ధతిఁ బఱపె సూతనందనుపైఁ గో
పము గదిరి యతఁడు వానిశిరము గుండలదీప్తమై ధరం బడ నేసెన్. 176

వ. ఇట్లు ద్రుమసేనుండు సచ్చినం బేర్చినకోపంబునం గర్ణుకోదండంబు దునిమి
ధృష్టద్యుమ్నుండు నఱిమిన నొండుబలువింటం బెనంగునతనిం గూడుకొని కురు
రాజు మొదలగు నేగురురథికులు పెలుచ నేసి రాసమయంబున సాత్యకి సమద
గతిం గవిసి నిలు నిలు మని యదల్చి రాధేయుం దలపడియె నయ్యిరువుర
యుక్కును నొక్కరూపున నక్కజం బై యుండె నట్టియెడ వృషసేనుండు వచ్చి
శైనేయు నేయుటయు నతండు వాలమ్ములు నిగిడించి వానిం దేరిపయిం ద్రెళ్లి
మూర్ఛిల్లం జేసినం బుత్త్రశోకపీడితుం డగునాసూతపుత్త్రుం డచ్యుతానుజు నా
నాస్త్రపీడితుం గావించె నంతకుం దెలిసి తనయుండునుం దోడుపడియె నట్లడరు
నయ్యిద్దఱ నాశినివరుండు గినుక మెక్కి నరమెత్తెఱం జిక్కువఱిచె నప్పుడు రాజ
రాజున కిట్లనియె. 177

## కర్ణదుర్యోధనులు దురాలోచన సేసి సాత్యకిం దలపడుట.

క. అదె పార్థుఁడు దనమునుమున, కొదవినసేనలఁ గలంచు నులి వతఁ డితనిం
గదియంగ రాకుండఁగ మును, పొదువుద మే సాత్యకిం బ్రభూతబలముతోన్. 178

వ. అట్లయిన వీఁ డభిమన్యుపోయినపోకం బోవు నది నీకు విజయంబునకుఁ గార
ణం బగు వీనిం బలువురు సుట్టు ముట్టుట మెఱెంగనేని వివ్వచ్చుండు వచ్చు నతం
డెఱుంగకుండ నక్కడ నిలువరించి పోరం జాలుబల్లిదుల నట పుచ్చవలయు

ననుటయు నమ్మనుజవిభుం డిది లెస్స[1]కర్జం బని గాంధారపతిం గనుంగొని నీవు పదివేలేనుంగులు నన్నియరదంబులుం గొని దుశ్శాసనను బాహుదుష్ప్రధర్షణ దుర్విషహులు దోడుగాఁ గ్రీడిపై నడచి కయ్యంబు సేయు మద్దిక్కునం దక్కిన పాండవులు నున్నవా రయ్యన్నదమ్ములం బొదివి గెలువు మనిన నతం డమ్మెయి కిం జనియెఁ దదనంతరంబ. 179

క. చేయఁ గలరథికులును రా, ధేయుఁడు బలయుతముగాఁగఁన్ దెప్పదెరలన్ శై
నేయుపయిఁ గవిసి బహువిధ, సాయకములు గురిసి రధికన్ సంరంభమునన్. 180

వ. అతండునుం గోపాటోపంబున. 181

క. కరులకరంబులు హయముల, శిరములు రథసంచయంబున్ చెక్కులును సమి
ద్ధరఁ గప్పి క్రమ్మఱఁగ నె, త్తురుటేఱులు వఱపి వానిన్ దొలఁగం ద్రోచెన్. 182

క. శినివరునద్భుతవిక్రమ, మున కోర్వక కలఁగఁబడినన్ మొనఁ గనుఁగొని సీ
తనయుఁడు దనయరదము నా, తనియరదముమీఁద నత్యున్ దగ్రతఁ బఱపెన్.

వ. అయ్యిరువురు నక్కజం బగుకయ్యంబు సేయునెడ నాశైనేయుండు. 184

క. తురగముల సూతుఁ జంపినఁ, గురుపతి పొలివోక యతనిన్ [2]గురుసున నేయం
గర మలిగి ధనువు దునుముడు, బరవస మఱి యొరుని తేరిన్ పైకిం బోయెన్. 185

వ. ఇవ్విధంబున. 186

తే. [3]పతి గలంగ శైనేయుఁ డన్ బ్బలము బాణ, నిహతిఁ దూలించె నక్కడన్ నీమఱంది
యడరియర్జునుతో విస్మయావహముగ, నాహవముసేసెఁ దగుసహాయంబుకలిమి.

చ. అతనిసుతుం డులూకుఁడు నున్ దగ్రతఁ గృష్ణునిమేనఁ బార్థుపై
శితశరకోటి నించి విలసిల్లఁగ సౌబలుసూతుఁ జంపి యు
ద్ధతిఁ దురగంబులం దునిమి తద్ఘనచాపము ద్రుంచె నన్నరుం
డతఁడు దనూజు తేరిపయిన్ కాత్మ చలింపఁగఁ బోయి వెండియున్. 188

తే. వాఁడుఁ దోడ్పడఁ గడఁగి విన్ వ్వచ్చు నేసె, నతడు వారలు సేడ్పడున్ నట్లు గాఁగఁ
గడఁక గలయోధవీరులున్ బడలువడఁగ, బలము సెడి పాఱఁ దనవింటిన్ బలువుసూపె.

వ. ఇట్లు వివ్వచ్చుండు పేర్చినయాసమయంబున ధృష్టద్యుమ్నుండు. 190

క. తఱిమి గురువింటిగొనయం, బఱిముఱిఁ దునియంగ నేయన్ నతఁ డాతని నే
త్రైఱ నొండువింట నేసిన, నుఱక తునిమె నాతఁ డమ్మహోగ్రశరంబుల్. 191

వ. వెండియు నాచార్యుం డేయుసాయకంబులు ద్రుంచుచు నంగంబులు నొంచుచు మిగిలి మార్గణజాలంబుల సైన్యంబు దైన్యంబు నొందించె నట్లు సాత్యకి సవ్యసాచిధృష్టద్యుమ్నులచేతం గలయం గలంగి కౌరవానీకంబు గాందిశీకం బగుటయుఁ బాంచజన్యదేవదత్తాదిశంఖరవంబులు సెలంగం బాండవబలంబులు గూడికొని వెన్నడిం గవిసినం గని భీషణరోషాతిరేకవిధేయుం డయి రాధేయుండు. 192

---

1. తలం పని. 2. గురుసన-గురు సఱ. 3. పతి గలంచి సాత్యకి నీదుబలము.

మ. తలలుం జేతులుఁ గాళ్లునుం దనువులుం ♦ ధాత్రీస్థలిం జెక్కతి
ట్టలు గావించి రథప్రతానములు ఘోటశ్రేణులుం వారణా
వలులుం [1]జేడ్పడఁ బైపయిం దఱిమి దుర్వారై కదర్పోద్ధతిం
జలముం జేవయుఁ జూపె నుద్భటభుజాసంరంభ రౌద్రంబుగన్. 193

వ. ఇవ్విధంబున విజృంభించి నొంచినం బఱపఱ యై పఱచునవ్వాహినుల వెనుకొను
నాసూతనందనుం జూచి తల్లడిల్లి ధర్మతనయుం డర్జునునితో ని ట్లనియె. 194

క. నడురేయి తీవ్రభానుఁడు, పుడమి వెలసె ననుతలంపు ♦ పుట్టించుచు ను
గ్గడు వగుతేజంబున వెలిఁగెడుఁ గర్ణుఁడు బాణరుచులు ♦ గిఱికొన దెసలన్.

ఆ. ఇట్లు దఱిమెనేని ♦ నిప్పుడ యాతఁడి, ద్దిక్కువారి నెల్ల ♦ నొక్కమొత్తు
గాఁగఁ బిలుకుమార్చుఁ ♦ గావున నెమ్మెయి, నైనఁ బ్రతివిధాన ♦ మాచరింపు.

వ. అనిన విని యతం డచ్యుతు నాలోకించి రాధేయురభసంబున కిమ్మోహారం బోహ
టించిన భూపతి భీతుం డయ్యె భారద్వాజుండును బైకొని యొక్కవలన మొనలఁ
దెరల్చెడి నే నదల్చి యిక్కగ్గు నుక్కడంచి యక్కుంభసంభవుసంరంభంబు
వారించెదఁ దేరు నడపు మనుటయు నద్దనుజమర్దనుం డతని కి ట్లనియె. 197

క. వినుము నిశాసమయంబున, దనుజులకుం బేర్చు బాహు♦దర్పము శౌర్యం
బును గావున హైడింబుం, డనిఁ గర్ణుని నోర్చుఁ బనుత ♦ మతని నతనికిన్. 198

వ. అని వెండియు. 199

క. మన మంతకు వేఱొకదిక్కున నడతము భీమసుతునకును మాయలుఁ బెం
పొనరినదివ్యాస్త్రంబులు, ననేకములు గలవు వలవ ♦ దనుమానింపన్. 200

వ. అని చెప్పి ఘటోత్కచుం బిలిచిన నతండు సన్నాహసంరంభమూర్తిస్ఫూర్తి
మెఱయం జనుదెంచి పని యేమి యనుటయు. 201

ఉ. పాండవసైన్యముల్ సెదరి ♦ పాఱెడుఁ గర్ణునిచేత నొచ్చి యు
ద్దండత నీదుశౌర్యమును ♦ దర్పము నేర్పడ నిల్వరింపు మీ
తం డని ధాత్రి నీకుఁ గడు♦దక్కువ దండ్రులకుం జయంబు పు
త్త్రం డొసఁగంగఁ గాన్పు మహి ♦ రూఢికి నెక్కదె గెల్వు మీతనిన్. 202

### అలంబుసుండు ఘటోత్కచునిచేతఁ జచ్చుట.

వ. అనిమె ధనంజయుడును దదనురూపంబు లైనయాలాపంబుల ననుమతి సేసినం
గడంగి ఘటోత్కచుండు గర్ణుదెసకుం గవిసె నట్టిమెడ జటాసురసుతుం డగు
నలంబుసుం డేతెంచి కురుపతిం గాంచి నాకుఁ బాండవులదెసం బూర్వవైరంబు
గలదు నీకును బ్రియంబుగా వారిని వారివారిని వధియించెద ననిపలికి యతండు
ప్రీతుం డై యభినందింప నాసూతనందనుం గలసి తలకడచి హిడింబానందనుం
దాఁకిన దారుణరణం బయ్యె నయ్యిరువురును వివిధవిశిఖస్ఫురణంబుల నొండొ

1. గీడ్పరసై-గీడ్చరసై-గీడ్చరచెం-గీడ్వరసై-పడం దఱిమి.

రులఁ దెరల్పం జాలక రథికు లగుట యుడిగి మాయలకుం జొచ్చి మహోరగగరు
డాకారంబులను వారణకంఠీరవరూపంబులను రవిసైంహికేయాకృతులను మేఘ
మారుతమూర్తులను మఱియు బహువిధవికారాకారంబులను జూపుచుం బోరి యే
పునం గదిసి బాహాబాహిం బెనంగునపుడు మేనులు బెరసిన నాభీమనందనుండు.

క. పట్టి బలువుగ జటాసురు, పట్టిం బడవైచి యురము ✶ పాదమునఁ గదుఱ
బిట్టుగఁ ద్రొక్కి యతనితల, యట్టకుఁ బాయంగఁ జేసి ✶ యార్చెం బెలుచన్.

ఆ. ఆర్చి నెత్తురుట్ట ✶ నమ్మస్తకము వట్టి, కొని యతం డుదాత్త✶ఘోరభంగి
బ్రమరి వాఁటి కురునృ✶పాలకునరదంబు, నందు వైచి యిట్టు ✶ లనియె నధిప.

క. కొను మిదె నీపుత్త్రునితల, విను మిట్టుల మాఱు లేని✶విక్రమమునఁ గ
ర్ణునిఁ ద్రుంచెద వడుసం బోరి, గొని యెద నిను భీమసేను✶కొడుక నెఱుఁగవే. 206

వ. అని పలికి యసురవరుం డరుణం బగుతనయరదం బెక్కి గృధ్రకేతనంబు గ్రాల
నీలోన్నతం బయినతనరూపంబున కనురూపం బైనదంష్ట్రాయుగళంబును బింగళో
[1]ద్బద్ధజటాకేశకలాపంబును భీషణంబులుగాఁ గనకభూషణంబులకతంబునఁ దటిల్ల
తావికటం బగునంబుదంబుకైవడిఁ గర్ణుపయిం గవిసి ఘనశరంబు లేయ నతం
డును జండభంగి నెదుర్కొని నిశితనారాచంబులఁ గప్పె నిప్పరుసునం దలపడి
యమ్మనుజదనుజులు మహాద్భుతకరం బగుసంగరంబు సేయు నెడ వివిధాయుధవ్యా
పారఘోరవిచేష్టితవిగళితరక్తసిక్తంబు లగునంగంబులయుచలత్వంబున గైరిక
గిరిద్వయంబుచందంబున నొప్పి రల్లెక్కువదక్కువలు లేక పోరి పోరి రాధేయుం
డొక్కదివ్యాస్త్రంబు ప్రయోగించిన నది భైమసేని ప్రత్యస్త్రంబున నడంచి
[2]మాయసైన్యం బడరించిన నమ్మాయాసైన్యంబు సాయకశూలముద్గరాదిహేతి
వ్రాతంబులును [3]బలలవర్షంబులుసుం గురియం గురువాహిని గలంగి పాఱిన నా
సూతసూనుం డొక్కరుండును నవష్టంభవిజృంభణంబు మెఱయ నిలిచి మహనీయా
స్త్రబలంబున నమ్మాయ మాయించుటయు హైడింబుండు చక్రంబు వైచినం
జక్కడిచె గద నిగిడించిన మగిడించె గగనంబున కరిగి తరుపాషాణపటలంబులు
వరఁగించినం దునిమి ధరం దొరఁగించె మఱియు రథికత్వంబునం గడంగిన నయ్యో
ధవరుండు దురగసారథిసహితంబుగా రథంబు శకలంబులు సేసి యతనితను వేదు
వెఱిగిన తెఱంగుగా మెఱుంగుటమ్ములు గిరికొల్పినం గెరలి యన్నిశాచరనాథుండు.

సీ. మాయామఖంబున ✶ మార్గణజాలంబు, ద్రావఁ గర్ణుం డది ✶ వ్యర్థ నేసి
చెలఁగినఁ గడుఁ బెక్కు✶శిరములతో భీమ, హాకృతి గైకొన ✶ నదియుఁ దునుమఁ
జచ్చె వీఁ డని మన✶సైన్యంబు లుబ్బంగఁ, బడియుండి వివిధరూ✶పములు దాల్చి
[4]భంగించె నవియును ✶ ద్రుంగఁగ నేసిన, శైల మై తద్వజ్ర✶సాయకమున

1. ద్యత్కేశజటాకలాపంబును. 2. మాయాసైన్యంబున సాయక. 3. నుపలవర్ష
4. 'భంగించి యవియును ✶ ద్రుగ్గంగఁ జేసిన' అనియే పెక్కుప్రతులు.

తే. సమసి రథికుఁ డై తనచుట్టుఁ | జాతురంగ,మైనబల మేచి తఱుమంగ | నడరి దీప్త
భూరిశరముల నాసూత|పుత్త్రు నొంచి, యెక్కు డై త్రుంచె నతనివి | లక్కజముగ.

వ. ఆసమయంబున బకునితోడంబుట్టు వగునలాయుధుం డనునసురేంద్రుండు వడ ముడివలని వైరంబు పెద్దకాలం బేనియు మనం బెరియింపం దఱి వేచికొని యుండి యన్నిశాసంగ్రామంబునకు ససైన్యంబుగాఁ జనుదెంచి దుర్యోధనుం గని త న్నెఱింగించుకొని యతనితో ని ట్లనియె. 209

అలాయుధాసురుండు ఘటోత్కచునితో యుద్ధంబుసేసి చచ్చుట.

క. భీమునిఁ దత్సోదరులను, భూమీశ్వర యిప్డ పట్టి | పోరివుచ్చెద ను
ద్దామత ఖ్రింగెదఁ గృష్ణుని,తో మిత్త్రగణంబుతో సుతులతోఁ గూడన్. 210

వ. నీకును నీవారికిం గయ్యంపుటలజడి గాకుండునట్లుగా నరిసేన సమయించెద ననియె నప్పుడు ద్రోణద్రౌణికృపకృతవర్మమద్రపతిప్రముఖయోధవీరులు వెఱఁగుపడి చూచుచుండం బేర్చి హైడింబుండు గవిసినం గర్ణుదెస నఖిలజనంబులును నిరాశు లైరి సుయోధనుం డలాయుధు నాలోకించి. 211

తే. భీమతనయుండు మాయపుఁ|బెనఁకువలను, గర్ణునొప్పించుచున్నాఁడు|గడఁగి వానిఁ
దాఁకి గెలువు నీ వనవుడు | దైత్యవిభుఁ డు,దగ్రగతిఁ జని తాఁకె నా|దైత్యవిభుని.

క. అరదము మొద లైనసకల,పరికరములు రూపు నేపుఁ | బ్రాయంబును న
య్యిరువురు దనుజాధిపులకు, సరి యై యొప్పారెఁ జూడ | జగతీనాథా. 213

వ. ఇ ట్లేపు మెఱయ నిరువురుం దలపడి [1]పోరువారలం జూచి సూతసూనుండు మరుత్సూనుపయిం గవిసిన నతండు దనసుతుం డలాయుధుచేత నొచ్చునో యను తలంపునఁ గర్ణునిం గ్రేడించి యమ్మేటిరక్కసునిమీఁద నాటోపంబున నడరుటయుఁ దదనుచరు లగునిశాచరు లనేకు లొక్క మొగి నతనిం బొదివిన నొద వినకినుక నమ్ములగములు వఱపి యవ్వీరుండు వారిం బఱపిన. 214

తే. పోక నిలిచి యమ్మారుత|పుత్త్రుఁ డేయు
సాయకంబులఁ గొన్నింటిఁ | జంచదస్త్ర
కుంఠితంబులఁ గావించి | కొన్ని యురము
నందు డిందంగ మెఱసె న|య్యసురవరుఁడు. 215

క. భీముఁడు గద వైచిన ను,ద్దామగదాప్రహతి నది [2]య|తండు సదిపి యు
గ్రామేయవివిధవిశిఖ,స్తోమంబుల నతని నొంచె | దుర్జయలీలన్. 216

వ. నిజబలంబులం బురికొల్పిన నవి పాంచాలసైన్యంబుల బడలువఱిచె నప్పుడు శౌరి సవ్యసాచిం జూచి రాత్రియుద్ధంబున రాక్షసులు వేర్చిరి వీరి మరల్ప నకులసహదేవ సాత్యకిప్రభృతుల నియోగింపుము కర్ణుదెసకు శిఖండిధృష్టద్యుమ్నప్రముఖులం బనుపుము గురునిప్రాపున నురవడించునరపతుల నీవు నిలువరింపు మనునెడ నలా

1. పోరుచున్నదైత్యవరులం జూచి. 2. య|తఁడు సదిపి మహాభీమంబు లైనవిశిఖ.

యుధుం డనిలతనయుధనువు దునిమి యతండు వే ఱొక్కవి ల్లెత్తికొనుసందున సారథి రథ్యంబుల సోలనేసినం బాలివోవక యబ్బలుమగండు గదాహస్తుండయి గొదకొన వాఁడును గద గొని మార్కొని ఘోరంబుగాఁ బోర గదలు దుమురగుటయు రథావయవంబులుఁ గరిదంతంబులు లోనుగా [1]దొరకొన్నవియ సాధనంబులుగా నొండొరుల నొప్పింపం దొడంగిన. 217

క. కని హరి గర్ణునితోడం, బెనఁగుఘటోత్కచునిఁ [2]బిలిచి ♦ భీముఁడు వల దిద్దనుజుని మర్దింపుము నీ, [3]వన నాతం డతని విడిచి ♦ యతనికిఁ గవిసెన్. 218

క. నకులాదులు నాదైత్య,ప్రకరంబుఁ దెరల్చి రేఁచి ♦ రాధేయుఁడు నేలకుఁ గోలకుఁ దెచ్చెను సో,మకుల శిఖండ్యాదిరథిక♦మర్దనుఁ డగుచున్. 219

వ. అవిక్రమంబు వీక్షించి సన్నద్ధుం డయి సమీరనందనుం డాసూతనందనుం దలపడినం దోడ్పడి నకులాదులు నానాస్త్రంబులు గురిసిరి కిరీటి పాంచాలురం గూర్చికొని కుంభసంభవసైన్యంబుఁ బొదివి సమయించు చుండె నలాయుధుండు ఘటోత్కచునిం బరిఘపాతనంబున సోలం జేసిన నాలోనన తెలిసి యతండు. 220

క. గద ద్రిప్పి బెట్టు వైచిన, నది రథ్యంబులను సూతు♦నరదము సిడముం జిదురుపలు సేయ నతఁ డం,బుద మై గర్జిల్లె నభము ♦ బూరటిలంగాన్. 221

వ. ఇట్లు మాయ గైకొని నెత్తురుసోనతోఁ బిడుగులు వడం జేయ వాయుతనయతనయుండును దివి కెగసి తనమాయ నమ్మాయ మాయించినఁ గ్రమ్మఱ బకభ్రాతృ భూచారి యయినఁ దోడన హైడింబుండును డిగ్గిన నయ్యిరువురకుం దరువులఁ బాషాణంబుల భీషణం బగురణంబు వాలిసుగ్రీవసమరసమం బై చెల్లె మఱియు వివిధాయుధంబుల నాయోధు లాయోధనంబు సేసి రట్టియెడఁ గరవాలంబు గొని మదంబునఁ గవిసినచో ఘటోత్కచుం డలాయుధుం దలవట్టి బలువిడి నిలం బడఁ దిగిచి మెడ దెగ వ్రేసి యార్చినం బేర్చినపాండవబలంబులఁ దూర్యనినదంబులు సింహనాదంబులుం జెలంగె నప్పుడు. 222

క. పటుగతిఁ జని కురుపతిముం,దట వై చెం జేత నున్న♦తల రౌద్రం బుద్భటముగ ఘటోత్కచుం డు,త్కటశోకము వొంది రతఁడుఁ ♦ దత్సైనికులున్.

క. మును బకుననుజునివలనం, దనతమ్ములు దాను బ్రదుకఁ ♦ దలఁచి యతఁడు సచ్చిన విభుఁడు భీమసేనుప్ర,తిన పారం బెద్దె నని మ♦దిం దలఁచె నృపా. 224

వ. అట్టియెడఁ గర్ణుండు కౌంతేయసైన్యసంతానంబు నానాస్త్రఘట్టనంబుల [4]విఘటితంబు సేయుచున్న నవ్వాయునందననందనుండు నిజస్యందనం బెక్కి యుక్కుమెఱయం దలపడియె నయ్యిద్దఱుం బెద్దసేపు శరపరంపరల సరి యై సంగరంబు సేసిరి పదంపడి రాధేయుండు రథ్యంబులం జంపిన రథసమేతంబుగా నాఘటోత్కచుం డదృశ్యుం డైన నీసైనికులు దల్లడిల్లి యెక్కడవచ్చి యెవ్వరి నేమిసేయు

1. చే దొరకినవియ. 2. బనిచి. 3. వని యాతం...యాతనిఁ దాఁకెన. 4. విఖండితంబు.

నో యనుచు మేనులు వడంక నలుగడలుం గనుంగొనుచుండిరి హైడింబుండును
మహాంబుదంబుచందంబునఁ జదలం దోఁచి మెఱుముచు నుఱుముచు బాణకృపా
ణ ముసలముద్గరకుంతక్షురికాది హేతివాత్రంబులు వర్షోపలపటలంబులుం దొరం
గింపం దొడఁగి దానవులు మొగిళ్లయి గ్రుక్కుమొగి నట్ల చేయ నాసూతసుతునకుం
బ్రతివిధానం బాచరింప నలవి గామిఁ గౌరవబలంబున రథంబులు గజంబులుఁ
దురంగంబులుఁ ద్రెళ్లను గూలను డొల్లను దొడంగె [1]నొండుగడకుం గడంగు
తలంపులు దక్కి తలలు [2]గుట్టికొనియుండి యోధులు భగ్నాపరభాగులై పడం
జొచ్చి రప్పు డిద్దెసవా రెల్ల నాఖండలప్రముఖబృందారకులు పాండునందనుల
కుం దోడ్పడి యిట్లు సేసెద రనువగ వెగ డంది కలంగంబడి రయ్యవసరంబున.

శా. ధీరత్వం బొకఁడున్ సహాయముగ రాధేయుండు దివ్యాస్త్రసం
చారోల్లాసము సూపెఁ జూపుటయు రక్షస్సంచయానేకమా
యారూపావలి భాస్కరాంశుల నదృశ్యాకార మై పోవునీ
హారంబుం దలఁపించుచున్ విరిసె [3]నే నాశ్చర్యముం బొందితిన్. 226

చ. మగుడఁగ దానవప్రవరుమాయ సమంచితదివ్యబాణశ
క్తి గుదియఁ జేసి తొంటితనతీవ్రత గైకొని నీదుసైన్యముల్
బెగడు వడన్ మదించి యతిభీషణసముద్ధతి నింక నెమ్మెయిం
దెగఁ డనుభీతి యోధులమదిన్ జనియింపఁగ నాక్రమించినన్. 227

వ. వార లందఱు సూతనందనుం జూచి యాతండు గలంగమికి నచ్చెరువందుచు న
గ్గించి యతని నుద్దేశించి యిన్నిశాచరుం డిందఱ సమయింపకుండం గాచికొనుము
నీవును బ్రదుకు మాఖండలుండు గవచకుండలంబులు గొనునప్పుడు నీకు నొసం
గినమహాశక్తి యింక నెన్నఁటికి భీమార్జునులు నిన్నేమి సేసెద రిప్పుడు బ్రదికిన
మఱి చూచికొంద మప్పరమసాధనంబు వీనిమీఁదం బ్రయోగింపు మను నెడ
నారక్కసుం డామేటిమగని గీటడంచువాఁడై యాటోపంబునం గదిసి తదీయ
రథ్యంబులఁ బటుగదాపాతంబునం బొలియించె నట్లవ్వీరుండు విరథుం డగుట
యుం దఱిమి యద్దనుజుండు గదాంతరపాతాభితాడితుం జేసిన [4]నొసరిలి యతం
డాసైనికులయాలాపంబులు నాలించి తనకుఁ జావు దప్పించుకొన నది దప్ప
నొం డుపాయంబు లేమిం జేసి. 228

కర్ణుఁ డింద్రదత్తం బైనశక్తిచేత ఘటోత్కచునిం జంపుట.

ఉ. వైరివినాశనక్రియకు వాసవుఁ డిచ్చిన నుంచి యున్నయా
ఘోరపుశక్తి నాలుకలు గ్రోయ మెఱుంగులు ప్రజ్వరిల్ల ఘం
టారవ మభ్రవీథి నిగుడం దగఁ గేల సమర్చి పేర్చి య
వ్వైరికిఁ బూఁచినం దలఁకి వాఁడు మహోన్నతఘూర్ణితాకృతిన్. 229

1. నొండుగడంకలు. 2. గట్టుకొని. 3. నత్యాశ్చర్యముం బొందఁగాన్. 4. నొసరి; నొసి.

తే. తెరలిపాఱఁగఁదలఁచుచోదృష్టితోడఁ, గూడికొనుముష్టి మృత్యువుతోడఁబుట్టు
వనఁగఁజాలునద్దివ్యసాధనము వైచె, గగనతలమున భూతసంఘములు మ్రోయ.

వ. ఇవ్విధంబున రాధేయుండు మహోగ్రంబుగా వైచిన. 231

క. మును మాయ మ్రింగి దనుజేం, ద్రునియురము వగిల్చికొనుచు దుర్భరగతి వీఁ
పున వెడలి శక్తి మెగసెను, [1]వినువీదికి నుడుగణంబు వెలుకం బాఱన్. 232

వ. అప్పుడు. 233

క. సోలుచు బోరగిలం బడి, నాలుక వెడలంగఁ బెట్టి నడుము గఱచుచుర్ణ
లాలలు గ్రమ్మఁగ రక్తుగ, పాలుఁడు వికృతాస్యుఁ డగుచుఁ బ్రాణము విడిచెన్. 234

వ. ఇట్లు ఘటోత్కచుండు పడిన మనసైన్యంబున శంఖభేరీస్వనసహితంబు లగుసింహ
నాదంబులు సెలంగె నీపుత్త్రుండు బంధుమిత్రసమేతంబుగాఁ బ్రమోదంబు నొంది
సూతనందనుం గౌఁగిలించి తనయరదం బెక్కించికొని యుల్లసిల్లె ననిన విని ధృత
రాష్ట్రుండు సంజయున కిట్లనియె. 235.

క. [2]బలుమాయాబలబాహా, బలములు గలవాఁడు భీముపట్టి వడిన న
గ్గల మగుశోకముఁ గోపము, [3]నలఁచుం బాండవుల నెట్టులైరొకో వారల్. 236

వ. అని యడిగిన నమ్మహీపతికి నతం డిట్లను నట్లు మృతుం డైనహిడింబాసుతుం
జూచి కౌంతేయు లత్యంతదీనమానసు లై కన్నీరు గడలుకొన నడలునఁ గుందిరి
గోవిందుండు ప్రమోదంబు నొంది సింహనాదంబు సేసి శంఖంబు పూరించి పగ్గం
బులు నొగలముడిచి మందమారుతాందోళితం బగుమందారంబుచందంబు దోఁప
నర్తించుచు నరదంబునడి కఁగి కిరీటిం గౌఁగిలించివానివీఁ పప్పళించి వెండియు
నార్చిన నాతం డయ్యుపేంద్రు నుపలక్షించి. 237

ఉ. చచ్చె ఘటోత్కచుండు మనసైన్యము లెల్లఁ గలంగి నల్గడ
న్విచ్చుటఁ జూచి యేము వగ నెక్కొన వందెద మిప్పు డెమ్మెయిన్
వచ్చెఁ బ్రమోద మెట్లు గరువంపుఁజరిత్రము దక్కి లాఘవం
బచ్చుపడం జెలంగెదు మహాపురుషా యిది యేమి సెప్పవే. 238

కృష్ణుండు ఘటోత్కచుండు పడఁ దాను సంతసించుటకు నిమిత్తం బర్జునుతోఁ జెప్పుట.

వ. అనుటయు నయ్యచ్యుతుం డతని కిట్లను నింద్రుండు గుండలంబులు గొనుచుండి
కర్ణుని కిచ్చినశక్తి యతనికడ నున్నంతకాలంబును నిన్ను బ్రదికించుట దుష్కరం
బని తలంచుచుండుదు నేఁడు హిడింబానందనుమీఁద నది వోయినం బ్రమో
దంబు నొందితి నాసూతనందనుం డది సేత నుండెనేనిఁ జక్రగాండీవధరుల మై
మన మిరువురముం గవిసితి మేనియు జయించు నతండు దేవసన్నిభుండు దివిజ
పతి వేఁడినఁ గవచకుండలంబులు వికృత్తంబులు సేసి యిచ్చుట వైకర్తనుం

1. వినువీథికి నుడుగణంబు-వినువీది నమర్త్యగణము-వెలు వెలఁబాఱన్-వెలుకంబాఱన్. 2. బల
మాయాబలబాహా. 3. నలఁపఁగఁ బాండుసుతు లెట్టు.

డనం బరఁగె నీకై మీతండ్రి యిట్లు సేయఁడయ్యె నేని వాని కెదు రెవ్వరు కవచ
కుండలవిహీనుండై మానవసామాన్యంబు నొందుటను శక్రదత్తసాధనంబు లేమిం
జేసియు నింక నీకు గెలువ వచ్చు నిట్ల యేకలవ్యశిశుపాలజరాసంధాదుల నీక కా
నొక్కొక్క తెఱంగునం [1]బిలుకుమార్చితి ని త్తఱి వార లున్నఁ గౌరవపతి వార
లం దెచ్చుకొను నమ్మువ్వురుఁ గూడిన నెవ్వరికి నోర్వ రా కుండు ఘటోత్కచుం
డును గిమ్మీరబకహిడింబులతోడివాఁడ ధర్మద్వేషంబును రోషంబును గలిమిం
జేసి యొకప్పు డొప్పమి వచ్చుం గావున నద్దానవులయట్ల వీనిపొలిసిపోకయు నా
కభిమతంబు వీఁడు రావణునట్టివాఁ డగుట నిపుడు సావ కుండెనేనిఁ బదంపడి
నాకుం జంపనలయు నిది సంతోషకాలంబు గాని శోకసమయంబు గాదు మన
మొనలు గలంగెఁ గురుబలంబు పైకొనియెడు నీవుఁ దెలిసి యుత్సాహంబు వాటిం
పు మనియె నని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 239

చ. ఒకనిని జంపి యిట్లు సనునే నుజ్జ్వలశక్తి నెఱింగి కర్ణుఁ డే
టికి నరుమీఁద దాని నిగిడింపక యిన్ని దినంబు లప్రయో
జకముగఁ జేసెఁ గయ్యము భుజాబలశాలి నరుండు వడ్డఁ బో
రికి మఱి యుత్సహింపఁ గలరే పెఱవారలు సూతనందనా. 240

క. పిలిచికొని మైనఁ బార్థుం, బొలియింపఁడ శక్తి నతఁడు [2]పోరికి నెవ్వా
గలు రక్షన్నను వ్రతమయి, తలకొని చనుఁ గర్ణుఁ డేల [3]తప్పం జేసెన్. 241

వ. అని వెండియు. 242

తే. నాతనూజులు దుర్బుద్ధు లీ తెఱంగు, నీవుఁ దలఁపవ యాశక్తి నీరజాక్షుఁ
డొడిచికొనియెనె మొఱకుచేనున్న తియ్య, పండు వెసనాఁచికొనిన నేర్పరియుఁ బోలె.

వ. అనిన నమ్మహీపతికి సంజయుం డి ట్లనియె. 244

తే. రాత్రు లీపని కర్ణుతో రాజు ననుజ, సమితియును నేనుఁ దగఁ జెప్పుదుము నరేంద్ర
[4]యతఁడు లెస్సగవిని మెల్లియక్కిరీటి, సచ్చుఁబటుశక్తి ననిబాసయిచ్చు మాకు.

వ. ఏము వెండియు నాకర్ణునితో ని ట్లందుము వివ్వచ్చుండు సచ్చినం దక్కటిపాండ
వులం దొక్కనిఁ బద్మనాభుండు పట్టంబు గట్టుం గావున ననర్థమూలం బగున
మ్మాధవుండు దెగిన జగతీరాజ్యంబు మనకు దక్కు నింద్రదత్తం బయినశక్తి
నతని సమయించుట గార్యంబు. 246

క. అని చెప్పినయమ్మాటలు, విని యెల్లవిధములఁ గృష్ణవిజయులలో నొ
క్కనిఁ బొరివుచ్చెదఁ జూడుం, డనుచుఁ జనుఁ సూతుసుతుఁ డహంకారముతోన్.

తే. వినుము వేగిన సంగ్రామమునకుఁ బోయి, నప్పు డక్కర్ణునకు మాకు నందఱకును
దోఁప దాబుద్ధి వెండియుఁ దోఁచుమగిడి, వచ్చి శిబిరంబు సొరఁగ దైవంబుకతన.

వ. దైవం బన వేఱొకండు గలదె కృష్ణుండ యది యె ట్లనిన న ట్లర్జునుని బోధించు

1. దీర్చితి. 2. పొలిసెనె. 3. తప్పెం జెపుమా. 4. లెస్సగా విని యాతఁ డొల్లఁడు కిరీటి.

నప్పుడు సాత్యకి శౌరితో నాసూతసుతుం డీశక్తి యిన్నిదినంబులు ధనంజయు
మీఁదఁ బ్రయోగింపమికిఁ గారణం బేమి యని యడిగిన నతండు. 249

తే. వానివారెల్ల నీపని వానికెపుడుఁ, గలవుడురు వాఁడుఁ బూన్కి మైఁ గడఁగివచ్చుఁ
దాఁకుదల నేను వారలం గదలును మఱచు, నట్లు సేయుదు నరునకునై కుమార.

వ. అని పలికి ధృష్టద్యుమ్నాదులం బేర్కొని యాతనిం గలపికొని సాత్యకి నుద్దేశించి.

క. మీరును బ్రాణములుం ద్రిలోకీరాజ్యము నాదుబుద్ధికిం బార్థుక్రియం
గూరిమికిం బాత్రంబులె, యీరేయి గదా సుఖించి యే నిద్రింతున్. 252

వ. అని చెప్పె నట్లుగావున మనకుఁ బశ్చాత్తాపంబు వలవ దనుటయు ధృతరాష్ట్రుండు
మీరు దైవోపహతుల రమ్మహాశక్తి దృణీభూతుం డగుఘటోత్కచునకుంగా
వమ్మయ్యె నింక మీవా రెవ్వరు [1]నెప్పరుసున బ్రదికెదరు చేయునది లే దట
మీఁదివృత్తాంతంబు సెప్పు మనవుడు నజ్జనపతికి సంజయుం డి ట్లనియె. 253

తే. భీమనందనుచావునఁ బ్రేముడించి, ధర్మతనయుండు బాష్పాంబుధార లడర
మేను డిల్లంబుగాఁ దేరిమీఁద వివశుఁ, డగుచుఁ జదికిలఁబడుటయు నచ్యుతుండు.

వ. రయంబునం జని కరంబులం బొదివి యతని నాలోకించి. 255

క. ప్రకృతిజనునట్టు లిమ్మెయి, వికృతిం బొందంగఁ దగునె విను మిట్లయినం
జకితం బగు నీసైన్యము, సకలము లెమ్ముత్సహింపు సమరంబునకున్. 256

వ. నీవు వహించుగురుభారంబు దలంపక యింతయలంత నొందిన జయంబు సేకు
ఱునే యనిన నతండు గన్నీరు కరతలంబున నొత్తికొని మెత్తనిమాటల ఘటో
త్కచుగుణంబులు గణుతించి కామ్యకవనంబునను గంధమాదనయాత్రను దమ
కుం జేసినసాహాయ్యం బుగ్గడించి వాఁడు నాకు భక్తుం డేనును సహదేవుకం
టెను వానికిం గూర్తు నట్టిపట్టి లేకున్న నాకు శోకంబు గాకుండునే యని
తత్ప్రతివీరుని దెసకు నెలసినయంతరంగంబు రోషాక్రాంతం బగుటయు నిక్కు
మూరు నిట్లు సేసినయీదుర్జాతుండ కాఁడె మున్ను నభిమన్యువిల్లు నఱకి చిక్కు
వఱచి యబ్బాలునిం బలువురచేతఁ జంపించె నప్పుడు దవ్వుల నున్నసైంధవుని
సవ్యసాచి సమయించె నది దానికి మాఱు గా దీరెండుక్రూరకర్మంబులకుఁ గర్ణు
నిఁ గడికండలు సేయక శాంతిం బొందనేర్తునే యని బిగువుపెలుంగునం బలికి
దిగ్గన లేచి యాద్రోహికి నిన్నయు నేఁడును దోడ్పడినద్రోణుం దెగటార్పవలయు
నప్పునికిఁ బావని వోవు నే నాసూతసూనుం డున్నెడకుం బోయెద నని శంఖం
బొత్తి చాపంబు వుచ్చికొని రథంబు నడప సూతు నియమించి చనుచుండె నప్పు
డచ్యుతుండు దమ తేరిపైకి వచ్చి వివ్వచ్చు నీక్షించి. 257

1. బ్రదికెదరు.

క. తనచేతన సూతసుతుం, దనుముదుఁ గాకనుచు నలుకఱతోడ రయమునం
జనియెడు ధర్మసుతుం డీ,తని నూరక చూచు చునికి ఱ దగునే మనకున్. 258

ఆ. అని రథంబు పెలుచఁ ఱ జన నిచ్చె నట్లు కోరి,ధాంధవృత్తి నరుగుఱనవ్విభునకు
సమ్ముఖంబు గాఁగ ఱ సత్యవతీసుతుఁ, డరుగుదెంచి కరుణ ఱ నాదరించి. 259

వ. అతండు ప్రణతుం డైన దీవించి యి ట్లనియె. 260

సీ. అనిమిషనాథుఁ డిఱచ్చినశక్తి యర్జును, సమయింపఁ గర్ణుండు ఱ సంగ్రహించె
నది యున్న దాన నఱయ్యాపద వాటిల్లె, నేని నయ్యలఁత సఱహింప వశమె
యీఘటోత్కచునకు ఱ నింతియకాల మై, యానెపంబునఁ దెగఱటాత్తెఁ జూవె
యిట్లు మే లిది దైవ ఱ మిచ్చినదురితని,స్తారంబు [1]నీ కింత ఱ దలఁచి నీవు

ఆ. సంభ్రమంబు దక్కి ఱ సైన్యంబు దోడ్పడ, మనుజపతులఁ దమ్ముఱలను సుహృజ్జ
నములఁ గూర్చికొని రఱణంబుసేయుము కురు,ప్రతతితోడ నీమఱబలము మెఱయ.

క. కలఁక యుడిపి చిత్తము ని,ర్మలధర్మోదాత్తముగ నఱమర్చి నెగడు మె
వ్వలనఁ గలుగు ధర్మం బ, వ్వలనికి జయమంగళము లఱవశ్యముఁ గలుగున్.262

వ. అని హితోపదేశంబు సేసి. 263

క. విను మే నగుదివసంబున, నినుఁ బొందు ననూన మేదిఱనీరాజ్యశ్రీ
యనుమాన మేమియును లే, దని గ్రక్కున నమ్మునీంద్రుఁ ఱ డరిగె నరేంద్రా.264

వ. ఇ ట్లమ్మహాముని సనుటయు సావధానుం డై పాండవాగ్రజుండు ధృష్టద్యుమ్నుం
గనుంగొని గురునిపురోభాగంబునఁ గౌరవసేన భీమసేనుండు దాఁకి తెరల్చు
చున్నవాఁడు నీ వక్కుంభసంభవుసంరంభంబు మాన్పుము తద్వినాశం బాచరిం
చుటకయి యనలంబున జనియించినవాఁడవు శిఖండిప్రముఖపాంచాలకుమా
రులం గొని యరవాయి గొనక యడరు మని పలికి కెలంకుల నున్ననకులసహ
దేవద్రుపదవిరాటద్రౌపదేయశైనేయకేకయుల నాలోకించి మీరును ఫల్గునపుర
స్సరంబుగా ద్రోణవధంబునకుం గడంగుఁ డనుటయు. 265

క. వారలు దమతమబలములుఁ, దారును గవియుటయు నత్యుఱదగ్రత గురుఁ డ
వ్వీరానీకము మాఱ్కొని, పోరికిఁ దనసైన్యసమితిఁ ఱ బురికొల్పి తగన్. 266

వ. బరవసంబు వాటించెఁ గురువిభుండును గోత్తల సేసె నప్పు డిరుదెఱంగులవాహి
నులును దగ మెత్తి తూలం జొచ్చె నీసైనికులు డప్పియు నిదురయుం గదిరి మేను
లలయం [2]గొండలంపడి రెల్లవారికి నాత్రియామ సహస్రయామ యయి తోఁచె
న ట్లైనను నిజధర్మంబు [3]ప్రతిపాలింప నడరి పెనంగుచుండిరి నిద్రాపరవశత్వం
బున దివియలవారును హీనప్రయత్ను లైనం దమంబు గవియం దొడంగె నట్టి
యెడం [4]గునికి కునికి యాయుధంబులు వడ విడుచువారును, వాహనంబులు

---

1. మీఁ దింత. 2. 'మడందపడి' అనియే వ్రాఁతప్రతులు. 3. ప్రతిపాలించునట్టిపెనఁకువం బెనఁగుచుండిరి. 4. గూరికి యాయుధంబులు.

వోయినట్ల పోవం దెరలువారును జొక్కునం దమవారిం దామ యెదిరి పొడుచు
వారును మఱియు ననేకప్రకారంబు లగువికలసంచారంబుల గాసి యగువారును
నగుటయుం గని గాండీవి యిరువాఁగు నుద్దేశించి యెలుం గెత్తి. 267

క. అడరెడునిద్రాభరమునఁ, గడు డస్సితి రెల్లవారుఁ । గలనను జాడ్యం
బెడలఁగఁ [1]జొక్కుమడుఁపుఁ డిప్పుడ చంద్రుఁడు వొడుచు వెండి । బోరుటయొప్పున్.

వ. అనిన విని మనవార లందఱు నట్ల మే లని కర్ణదుశ్శాసనులయనుమతి వడసి
విశ్రమించిరి పాండవసైన్యంబును విశ్రామంబు నొందె గగనంబున దేవగణంబు
ధనంజయుధర్మజ్ఞత్వంబు ప్రస్తుతించె నయ్యవసరంబున. 269

ఆ. కరుణ గలవు ధర్మ । గారవంబున సుఖో,న్నతులఁ జేసి తనఘ । నీకు సురలు
వరము లెపుడు నిచ్చు । వారు గావుత మనో,రథముఁ బొందు మమర । రాజతనయ.

క. అని యక్కౌరవసైన్యము,జనములు సంప్రీతి సవ్య । సాచికిఁ బలుదీ
వన లిచ్చుచు నాతనిఁ గీ,ర్తన సేయుచు నిద్ర వొందె । ధరణీనాథా. 271

వ. ఆసమయంబున నుభయబలంబులయందును. 272

క. తరుణులకుచములపై రతి,పరవశు లై యొఱగుపతుల । పగిది సమరసం
భరితశ్రమమున నిద్రిం,చిరి కరికుంభములఁ జెంది । చెన్నుగ జోదుల్. 273

క. తురగంబులపై నాశ్వికు, లరదంబులమీఁద రథికు । లప్పుడు నిద్రం
బొరసిరి కొందఱు భూస్థలి, నిరవుగ సుఖనిద్ర సేసి । రి ట్లున్నంతన్. 274

సీ. నలువ చెందొవలతే । కులకు [2]నన్నువు వెట్టఁ, గోరి కావించిన । గుళిక యనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ । మగుచకోరచయంబు, తపముసముల్లస । త్ఫల మనంగఁ
జిగురుజొంపమునను । జిగి యొప్పు నుదయాద్రిఁ, బొలుపారునవకల్ప । భూజ మనఁగఁ
బూర్వపయోరాశి । పొంతఁ గెంజాయచె, న్నొందవినపవడంపుఁ । [3]బోద యనంగ

తే. నరుణరుచిఁ దనమండల । మతిశయిల్లఁ, బొడిచె దివిఁ బ్రాఁకి దీధితు । లడరఁ జేసి
యంత కంతకు నెక్కుచు । సంతమసముఁ, గాలుకొననీక చంద్రుండు । గ్రాలె నధిప.

వ. ఇట్లు ప్రౌఢుం డై కామినీగండపాండుచ్ఛవిం దొట్టి కుముదంబులకు జగన్నేత్రంబు
లకు నానందం బాపాదించుచుఁ జంద్రుండు మహేంద్రప్రముఖదిఙ్ముఖంబు లలంక
రింపఁ గౌరవపాండవబలంబులు మేలుకని యాలంబునకుఁ దొడంగె నప్పుడు కురు
రాజు గురునికడకుం జని యతనియస్త్రవీర్యశౌర్యంబు లగ్గించి యిట్టివాఁడవు నీకు
సరిగానివారిం బాండవులఁ బెద్ద సేసికొని శిష్యత్వంబు వాటించి పోటునకుం జొరక
తిరుగుట నాభాగ్యంబుచందంబు గాక నే నేమి సేయ వచ్చు ననవుడు నతండు గనలి
యర్జునుండు శిష్యుండని మన్నించియ కాదె ఖాండవం బాఖండలుండు గోలుపోయె
ఘోషయాత్రఁ జిత్రసేనాదిగంధర్వులు నిన్ను విడిచి వలియం బాఱిరి నివాత
కవచకాలకేయాసురులు వ్రాలిసి రిది రోల వలవనిమురుక్తు లనుటయు నమ్మనుజపతి

1. జొక్కుడుపుం డిప్పుడ. 2. వన్నువ-పన్నువ. 3. బోదె యనఁగ.

గోపించి సంరంభంబుగా నక్కుంభసంభవుతో నీవు సవ్యసాచికిఁ జాల వేనిం జాలవ
కాక నిలువుము కొంత సైన్యంబు గొని నీయోపినవారితోడం బెనంగు మేనును
దుశ్శాసనశకునికర్ణులు నాకవ్వడిం గూల్చెద మనిన నవ్వి యవ్వీరుం డట్ల చేయుం
డిది గర్జం బిత్తెఱంగునన గెలుతురుగాని పొం డని పలికి వెండియు. 276

క. కుడిచితి కట్టితి పెట్టితి, పుడమి సమస్తంబు నఖిలభోగంబుల నె
క్కుడు పేర్మి ననుభవించితి, తొడరుము వెఱ పుడిగి పార్థుతోడఁ గుమారా. 277

వ. అని యప్పాంచాలబలంబుదిక్కుఁ బేరుక్కున నడచెఁ గౌరవపతియును బాండ
వులవలనికి నురవడించె నిట్లు వేకువజామున సంగ్రామంబు సెల్లెఁ బదంపడి
తూర్పు తెల్లనగుచు వచ్చె నప్పు డచ్యుతుం డర్జును నాలోకించి [1]రెండుమైల
గండు మిగిలివచ్చి పోరెడునిమ్మూఁకల నన్నింటిని దాపట నిడి తఱుము వలయు
నని యతం డొడంబడ నమ్మెయి నరదంబు నడపె భీముండును బరవసంపుమా
టల బీభత్సునిం బురికొలిపె నివ్విధంబునం గడంగినగాండీవిం బొదివి దుర్యోధన
దుశ్శాసనశకునికర్ణులు పెల్లేసిన నయ్యోధవరుం డందఱ కన్నిరూపులై యే
ట్లాడ నిరువాఁగును బెరసి [2]తలలు వట్టికొని పోట్లాడెఁ దదనంతరంబ. 278

క. మొనలో నిలువక యుత్తర,మునకై చని యేకతంబ మొనసినగురునిం
గని పాండవసైన్యము పులిఁ, గనినహరిణకులమునట్లు కంపము నొందెన్. 279

వ. ఇత్తెఱంగున నెఱి గలిగి యద్దెసవారిం బిలిచిన నాసైనికు లచ్చెరువడువారును
గోపించువారును గడంకలు దెచ్చుకొనువారును నివ్వెఱఁ గందువారును నయి
రందు విరాటద్రుపదులును ద్రుపదు[3]మనుమలలోన మువ్వురును గేకయపతులును
సబలంబుగా బలువిడిం గవిసి యక్కుంభసంభవుం జుట్టుముట్టిన నతండు. 280

మ. ప్రజ నెల్లం దునుమాడి యుగ్రముఖుఁడై పాంచాల[4]పౌత్రత్రయం
బు జముం జేరఁగఁ బుచ్చి కేకయుల కేవుం జేవయుం జూపి యం
బుజముల్ గోసినకైవడిం దలలు సంఫుల్లాస్యభల్లంబు ల
క్కజమై యుండ నిగిడ్చి త్రుంచెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగాన్. 281

విరాటద్రుపదులు ద్రోణునిచేతఁ జచ్చుట.

వ. వెండియు. 282

శా. చంచద్బాణపరంపరాప్రహతులై సైన్యంబుఁ గ్రూరోద్ధతిం
జించెం జించిన నింక నెన్నఁటికి నిస్సీ భూరిబాహాబలం
బంచుం గూడి కడంగి నొంపఁ గుపితుండై మత్స్యభూవల్లభుం
బాంచాలక్షితినాథునిం దునిమె దర్పస్ఫూర్తి శోభిల్లఁగన్. 283

వ. ఇవ్విధంబున విరాటద్రుపదులు పడినం జూచి ధృష్టద్యుమ్నుండు ద్రోణుం జంప
నయితి నేనిం గులాచారధర్మంబులకుం దప్పినవాఁడ నగుదు నని పలువురు విన బాస

1. 'రెండుమెయిల' అనియే వ్రా.ప్ర. 2. యనితలం దలకొని పోట్లాడె. 3. కొడుకులలో. 4. పుత్రత్రయం.

యిచ్చి పాంచాలసేనాసమన్వితుం డై యతనిపయిం గవిసినం గురుపతి కర్ణాదులుం
దానును నడ్డపడి పెనంగెఁ బెనంగినం దవులంబడినయాద్రుపదనందనుం గనుంగొని
యనిలతనయుం డదల్చి నన్నుఁ జూడు మనుచు నడరిన నప్పార్షతుండును గూడి
కొనిన నక్కౌరవేశ్వరుండును బరవసంబు సేయుటయు నుభయబలంబులుం బురి
కొని తలపడిన సంకులసమరం బయ్యె నంత. 284

క. విరియించి తామరలలో, నరుణాంశులు సొచ్చి సుభగ ౯ మగుసౌందర్య
స్ఫురణము నొందఁగఁ దోఁచెం, దరణి యుదయశిఖరిమీఁద ౯ ధరణీనాథా. 285

వ. అప్పుడు రెండుదెఱంగులజనంబులుం గాలోచితకృత్యంబులు సలిసి క్రమ్మఱఁ
గయ్యంబు సేయం దొడంగిరి ప్రొద్దెక్కిన నెండతాఁకును రేయింటియలజడియు
నప్పటియూఁకలియు నొడళ్లు డిల్లపడం జేసినను మొగంబులు వెడంగుపఱిపినను
బాలివోనిపౌరుషంబుల నయ్యిరువాఁగునుం గడంగి కలయఁ బెరసి పెనంగ నా
రభసంబునం బెల్లెసఁగుధూళికతంబునం బోయినరాత్రి మగుడ వచ్చె ననుబుద్ధి
యెల్లవారికిం బుట్టె నట్టియెడ ద్రోణధనంజయులు మిసిమింతులుగాక సేనలం జీకా
కుపడనీక పొదివి పోరించిరి బెట్టిదంబు లగువివిధాస్త్రశస్త్రపాతంబులం గరితురగ
పదాతివ్రాతంబులశరీరంబులందొరంగురుధిరంబా రేణువునడంచినకొలఁదినిలువక
బహుల ప్రవాహంబుల నుత్పాదించె నార్పులు బొబ్బలుం బోట్ల నొఱలుచప్పుళ్లును
జిందంబుల మ్రోఁతయు బెగసి పరఁగి నలుదిక్కులుం బిక్కటిల్లె నాసమయంబున.

తే. పతియు యువరాజుఁ గవలను౯ బార్థు గురుఁడు, భీముఁ గర్ణుండుఁ దాఁకిరు౯ద్దామలీల
వారిరథబహుగతులు దు౯ర్వారవిశిఖ, విసరణంబులు నద్భుత౯విధము లయ్యె.

క. నకులుఁడు నృపతియు నొక్కం, డొకనిం జుట్టుకొని వచ్చు౯నొప్పను బలువుం
[1]బ్రకటీకృతశౌర్యమ్మును, సకలజనముఁ బ్రస్తుతించె ౯ జగతీనాథా. 288

క. విను సహదేవుఁడు దుశ్శా, సనుసూతునిఁ దునుమ నతఁడు ౯ సారథికృత్యం
బును జలుపుచు నేయుచుఁ [2]గవి, సిన నాతఁడు నొంపఁ బఱచె౯ జెడి తురగంబుల్.

ఉ. భీముఁడు గర్ణుఁడుం గదిసి ౯ భీమసముద్ధతి నేటు లాడి రు
ద్దామగదా[3]నిపాతనవిరోధంబులు నప్పుడు గల్గె నయ్యెడ౯
భీమునివాజుల౯ రయము౯ పెంపునఁ గర్ణుఁడు గూల్చె మార్గణ
స్తోమమునం గురుప్రతతి౯చూడ్కులకుం బ్రమదం బొనర్చుచున్. 290

—ద్రోణార్జునులద్వంద్వయుద్ధము.—

వ. పవననందనుండు నకులస్యందనం బెక్కె గురుండును గిరీటియు వివిధబాణాసారం
బుల నంబరంబు గప్పుచు సమరవిహారంబు సలిపి రట్టియెడ. 291

క. గురుఁ జేయ నరుఁడు దుర్గింపఁగ, నరుఁ జేయఁగ గురుఁడు దుర్గింప ౯ నానావిశిఖ

1. బ్రకటితశౌర్యముఁ గనుఁగొని. 2. గది, యను... నత్తురగంబుల్. 3. నిపాతములదల్పులుఁ జప్పుడుఁ గల్గె.

స్ఫురణపరిహరణముల క్రచ్చెరు వందుచు నుండి రుభయసేనలజనముల్. 292

చ. దొరఁకొని దివ్యబాణములు ద్రోణుఁడు బల్విడి నైంద్ర మాదిగా
నరుపయి నేయ నాతఁడు మనంబునఁ గొంకక తత్తదస్త్రము
ల్వైరవున నేసి యేసి యఫలీకరణం బొనరించి పేర్చుఁ ద
ద్వరశరజాలముల్ గురునివారిత మై యడఁగుం బొరిం బొరిన్. 293

వ. ఇట్లు సదృశంబు లగుశస్త్రబలబాహువీర్యశౌర్యంబు లసదృశంబుగాఁ బోరు నగ్గురుశిష్యుల నుపలక్షించి సురఖచరవిద్యాధరులు దమలోన. 294

క. హరుఁడు వినోదార్థముగా, నిరుమే నయి రణ మొనర్చె నింతియ కాకి
ప్పురుసున నక్కజ మగుసంగర మొనరింపంగ నొరులఁ గంటిమె యెందున్.

వ. అను చుండి రప్పుడు. 296

మ. క్షితియుం బర్వతకోటియుల్ వడఁకె నగ్నిచ్ఛాయ లయ్యెల్ దిశ
ల్చతురంభోనిధులుం గలంగె భయలోలం బయ్యె దేవవ్రజం
బతిసంక్షోభము నొందె నొక్కమొగి సైన్యద్వంద్వముల్ ద్రోణుఁడు
గ్రతి బ్రహ్మాస్త్రము మార్విలో నియతమంత్రస్ఫూర్తి సంధించినన్. 297

వ. ఇట్లు [1]సువిహితసంధానుం డై యతం డమ్మహాస్త్రంబుఁ బ్రయోగించిన. 298

తే. అంతరంగంబునం దొకయింతయేని, యలుకు లేక తనర్చి బ్రహ్మాస్త్రమునన
వేడుకకు [2]మరలించినవిధము దోఁప, నద్భుతంబుగ వారించె నర్జునుండు. 299

వ. ఇత్తెఱంగున గెలుపోటమియు లేక యయ్యిరువురుఁ బోరుటయు నత్తఱిం గెరలిన సందడికయ్యంబుకతంబున మాని యగ్గురుపార్థులు పాంచాలకౌరవబలంబులపైఁ దఱిమి రాసంకులసమరంబున దుశ్శాసనుండు ధృష్టద్యుమ్నుం దాఁకి యోర్వక తొలంగె నతండు ద్రోణుమీఁదం గవిసినఁ గవలును దోడ్పడం గృతవర్మ యడ్డపడి పెనంగె సుయోధనుండును సాత్యకియుఁ దాఁకొని తమశైశవక్రీడలు దలంచి యుగ్గడించి రాజధర్మం బిట్టిద కాక యని తలంచి పోరం జొచ్చి రట్టియెడ నాశినివరుండు భూవరువిల్లు దునించి మేను నొంచిన నోహటించి యోసరించి డప్పిదీర్చికొని మగుడ నమ్మాధవానుజుం దలపడి యెప్పటియట్ల కలంగం జొచ్చినం జూచి రాధేయుఁ డయ్యాధవరుదెసకు నడరినం గని వడముడి యతనిమాఱుకొని తూపులు నిగిడించిన నవి నిలువరించి నవ్వుచు నాతండవ్వీరుసారథి సాగయను శరాసనంబు దునియ లై తొరఁగను జేసిన నాబల్లిదుండు బలుగద ద్రిప్పి బిట్టు వైచిన సూతుండు రథంబును బొడిమైనసుం జెరలక సూతసుతుండు శరవ్రాతంబునిగిడించె నప్పుడ నేకచతురంగంబు లెడసొచ్చె ధర్మతనయుండు మాత్స్యాదిబలంబులం బురికొల్పుకొని కుంభసంభవుదిక్కున కురవడించె నంత మధ్యాహ్నం బగుచు వచ్చె నాసమయంబున నకులసహదేవసమీరనందను లర్జును నుద్దేశించి యలుంగెత్తి. 300

1. నియతసంధా. 2. శ్రమ మిచ్చినవిధము.

తే. కోలుమసఁగి గురుండు పాం*చాలసేన, నేలకును గోలకును దెచ్చె * నీవు గడఁగి
కౌరవులఁ బాయువఱపు మే*కతమమైన, నతనిఁబరిమార్చఁ జేకొని* యబ్బలంబు.

వ. అనుచు నయ్యాచార్యుపైఁ గవిసి రిట్లు పెక్కుబలంబులు గ్రమ్మినఁ బటుప్రదర జాలంబులు వఱపి పొడిసేయునమ్మహాత్ము నాలోకించి ధర్మతనయభీమసేనమాద్రీ తనయులు గూడికొని తమలోన. 302

మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నఱకుచున్ * గర్జిల్లి ఘోటమ్ములన్
నరులన్ నెత్తుటఁ దేల్చుచున్ దొరల నా*నారూపఖండంబులై
తొరఁగం జేయుచుఁ గుంభజుండు విలస*ద్దోర్దండచండాకృతిం
దెరలం బైఁ జనుదెంచునేపు మనలం * దీర్పంగ నోపుం దుదిన్. 303

వ. ఎవ్వారికేని నిలువరింప నలవి గాదు నరుండును ధర్మపరుం డై యూరకున్న[1]వాఁడు దెగువకుఁ జొరం డనుచుఁ దలంకిరి వారి తెఱంగు గనుంగొని కమలనాభుండు దమ తేరు వారలకడకుం గొనిపోయి కిరీటితో ని ట్లనియె. 304

చ. అనిమొన దేవదానవుల * కైనను గెల్వ నశక్య మిమ్మహా
త్ముని నొకమందు సెప్పెద సు*తున్ హతుఁ డయ్యె ననంగ విన్నయం
తన యితఁ డాయుధంబు దిగఁ* ద్రావి యచేష్టతఁ బొందు నప్పుడీ
తనిఁ బరిమార్ప వచ్చు నిది * దప్ప నుపాయము గల్గ దెమ్మెయిన్. 305

వ. కావున నశ్వత్థామ సచ్చె నని యొక్కరుం డతనికిఁ జెప్పుట గర్జం బనిన విని యచ్చటియందఱు నిదియ మే లని రర్జునుండు దాని కొడంబడక యుండెఁ బాండవాగ్రజుండు విషాదంబుతో విచారించెఁ దదనంతరంబ. 306

క. భీమునిచే నని నశ్వ,త్థామ యనం బరఁగుభద్ర*దంతి వడిన ను
ద్దామగతి నన్నెవమ్ముగ, నామారుతపుత్త్రుఁ డేఁగి * యగ్గురుతోడన్. 307

వ. అశ్వత్థామ సచ్చె నని చెప్పుటయుఁ జిత్తంబు జల్లని చెదర బెదరియు నతండు దనకొడుకునస్త్రవీర్యాదిగుణంబులు గణుతించి యప్పలుకులు పెడచెవులం బెట్టి కలంక లేక ధృష్టద్యుమ్నుపైఁ గవిసి పెల్లేసి యతని కడ్డపడినపాంచాలరథికుల నిరువదివేవుర వధియించి మాత్స్యబలంబున కుఱికి యేనూఱురథంబులఁ బదివేలు మాతంగంబుల నన్నియ తురంగంబులం బొరిగొని తేజరిల్లి రాజులగములకు నాది గొనునప్పుడు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ కశ్యప వసిష్ఠాత్రి ప్రభృతిమునివరప్రకరం బాతనిపాలి కేతెంచి భారద్వాజా నీవు బ్రాహ్మణుండవు వేదవేదాంగవిదుండవు నీకు సంగ్రామంబు సేయ ధర్మం బగునే యింతకు మున్ను చేసితేనియుఁ జేసితి గాని కాలంబు పూర్ణం బయ్యెఁ గాన యింక నుడుగుట మేలు మామాటలు వట్టి యాయుధంబులు వెట్టి శాంతిఁ బొందు మని చెప్పి యంతర్ధానంబు సేసిన నవ్విప్రవరుండు వారలపలుకు లూహించి భీమ

2. వాఁ డనుచుం దలంచిరి. 2. కుతుండు మృతుండ యనంగ.

సేనవచనంబులం దలంచి యగ్రభాగంబునకు వచ్చి యున్నధృష్టద్యుమ్నుం
గనుంగొని వికలచిత్తుండును శోకాయత్తుండును నగుచు నిజపుత్త్రుండు సచ్చుట
బ్రదుకుట యజాతశత్రువలన నున్నరూపు దెలియువాఁ డై యతని నడిగె
నయ్యవసరంబున వాసుదేవుం డవ్వసుమతీపతి కి ట్లనియె. 308

తే. అదరి యీదివసమున[1]పఱరాణ్ణమునను, ద్రోణుఁ డని సేసిన శైలిఁ ఱ ద్రుంగిపోక
యుండ నేర్తురె యిక్కడిఱయోధు లెవ్వ,రైన విను నుతి గాదు సఱత్యమ్ము సుమ్ము.

క. మము నీతని కొప్పింపక, సముచితముగఁ గాచికొను మఱసత్యవచనదో
షము లేదు ప్రాణరక్షణ,సమయంబున నతనికొడుకు ఱ సచ్చెన యనుమీ.

వ. అని పనిచె నట్టియెడ నయ్యుధిష్ఠిరుతో భీమసేనుం డే నప్పుడు కృష్ణుండు సెప్ప
నయ్యోధవరు వధియించునుపాయంబు విని యదియ మనంబున నుండ మాళ
వేంద్రుం డగునింద్రవర్మ వారణం బశ్వత్థామ యనుపేరిటిది నాచేతఁ జచ్చె నది
నెపంబుగ నతనికి నశ్వత్థామ సచ్చె నని చెప్పితిఁ జెప్పిన నొక్కింత విచారించి
యమ్మాటదెస ననాదరంబు సేసె నీకు విజయంబు గోరి హితం బుపదేశించునీ
గోవిందునివాక్యం బుల్లంఘింపక నీవు నట్ల చెప్పుము నీవచనమ్ము నమ్ము నమ్మి
యతండు గయ్యంబు సేయఁ జే యాడక చెడు నని యొత్తి చెప్పుటయు. 311

ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామ సచ్చె నని యేనుఁగునెపంబునఁ జెప్పుట.

క. మది నయ్యిరువురమాటలుఁ, బదిలంబుగఁ బట్టికొనుటఁ ఱ బట్టియు నెట్లుం
దుది నది యట్టుల కాఁగల,యది యై యుండుటను దాని ఱకతఁ డొడఁబడియెన్.

వ. ఇట్లు సమ్మతించి. 313

క. [2]అనృతభయము నాజిజయముఁ,గొని యెడుతమకంబు పెంపుఱగుదియింపఁగఁ బాం
డునరేంద్రునగ్రతనయుం, డనుమానము వాయఁ బెట్టి ఱ యస్త్రగురునితోన్.

తే. వలయుకోలఁది నెలుంగెత్తి ఱ వర్ణసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామఱ సచ్చెననియె
నని పదంపడి యల్లన ఱ యతనిచెవికి, వినఁగ రాకుండఁ గుంజరఱమనియె నధిప.

వ. ఇవ్విధంబునం బలుకుటయు. 316

క. నేలకు నల్లెఁడుపొడువునఁ, గ్రాలుచు మును మెఱయుగురునిఱ[3]రథచక్రము ల
క్కాలంబున సమరజయ,శ్రీలోపము దెలియ నంటఱసిలఁ బడియె నృపా. 317

వ. అప్పుడు. 318

క. తనుఁ బాండుతనయులకు ద్రోహి, హలునిఁగా నక్కుంభజన్ముఁ ఱ డూహించుచు న
మ్మును లట్టు సెప్పి రటు గా,వునఁ గా కేమి యిది దగ వఱవుం బొ మ్మనుచున్.

శా. ధృష్టద్యుమ్నునిఁ జూచుచుఁ ఱ రణసముఱద్రేకంబు బాహాబలా
వష్టంభంబును శౌర్యనిర్వహణగఱర్వస్ఫూర్తియుం దొంటియు
త్కృష్టత్వంబును దక్కి స్రుక్కి వగ బుఱద్ధిం బీఁకువీఁ కాడఁగాఁ

---

1. పఱరాంశమునను. 2. అనృతంబున నాజి...గొనియెడుకతమునను బెంపు. 3. రథసత్తమ మక్కా

జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్షిప్తాంగుఁ డై యున్నెడన్. 320

వ. అతనివధంబునకై పాంచాలవిభునివేలిమిం బుట్టినవాఁ డగుట నప్పార్షతుండు ద త్సమయజనితోత్సాహరోషవిశేషాయత్తచిత్తుండగుచునమ్మహీసురవరుమీఁదం గవిసి యేసిన ననికి నొల్లనియుల్లంబునం బరునియుల్లాసంబు సహింప లేని తేజం బునం బురికొని యతండు వోరం దొడంగిన దివ్యాస్త్రంబులు ప్రతిభాసింపక యుండె నట్లయినను మనసుబలిమికలిమిం బ్రకృతిబాణంబుల నాతనిబాణబాణా సనరథరథ్యసూతకేతనంబులు వొడి సేసె నాధృష్టద్యుమ్నుండు గద గొనినం దునియలు గావించెఁ బలకయు వాలునుం గొని వచ్చి యవ్వీరుండు సారథితురంగం బులయంగంబుల వ్రయ్య నేయఁ దత్కరవాలఖేటపాటనంబు సేసి తనువునం జండ కాండంబులు నించె నట్లు నించి నొంచినం గని శినివరుండు గృపకర్ణకృతవర్మల తోడం బెనంగుచుండియుఁ గ్రూరనారాచదశకం బయ్యాచార్యుమీన నిగిడించె నంత నత్యంతరయంబునం జనుదెంచి యనిలనందనుండు ద్రుపదనందనుఁ గుంభ సంభవుబారికిం దప్పించుకొని పోయినం బో పొమ్మని పలికి వెండం బెప్పటిచందం బగుటయు నిశ్చలభావం బొందె నివ్విధంబున నాలుగుదివసంబులునొక్కరాత్రియు నేనగుదివసంబులోనిరువదిగడియలు నిరువది[1]వేలట్ట లాడ భండనంబుసేసి పాండవ బలంబుల నుఱుమాడి పేరడవి గొని కాలి పోనుంగువడినకార్చిచ్చుకైవడిం గుదిసి యమ్మహాత్ముండు. 321

సీ. సంగరంబునఁ దన్వి క సని శాంతిఁ బొందిన, చిత్తంబులోఁ దమ సేనదిక్కు గనుఁగొని పెలుచ నో కర్ణ యో కృప యోసు, యోధన [2]పోరన న్నొత్తిమెపుడుఁ జెప్పుదు రేను నా చే నయినంతయుఁ, జేసితి నింక నిశ్చింతవృత్తి సుగతికిఁ జనఁ గోరి క తగ నుజ్జగించెద, బాణాసనంబును క బాణములును

తే. దెలివి గలిగి మనుం డని పలికి శరశ, రాసనము లూడ్చి తేరిపై క ననఘమూర్తి యొప్పఁగూర్చుండిసంభృత యోగనిష్ఠ, నొంది తేజోమయాత్ముఁ డై యుండెనధిప.

వ. అట్టియెడ ధృష్టద్యుమ్నుండు గృపాణపాణియుఁ బాదచారియు నై భారద్వాజు దెసకుం గవియుటయు నుభయసైన్యంబుల హాహాకారంబు లెసఁగె నంతం దనువు విడిచి యప్పుణ్యపురుషుండు ప్రకటజ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబునకుం జనియెఁ దత్తేజోమూర్తి యేను గంటిఁ గృష్ణార్జునధర్మనందనకృపాచార్యులునుం గనిరి దక్కటిమానవులు గానరు సురలు సూచి సంతసంబునం బొదలి రట్లడరిన యాద్రుపదనందనుండు. 323

ధృష్టద్యుమ్నుఁడు మృతుం డైనద్రోణునికంఠంబు దునుముట.

చ. అరదముపైకి దాటి కుపితాత్మత ద్రోణుశవంబు కేశముల్ గరమున బెట్టమర్చికొని క ఖడ్గహతిన్ మెడఁ ద్రుంచి వైచె న

1. నిరువదియొక్క వే యట్ట లాడ. 2 వినుఁడు మీ కొక్కహితము, సెప్పెద నేను.

త్వరముగ మాను మాను మనుజవాక్యముతో నరుఁ డేఁగఁ [1]దప్పు సు
మ్మర యని ధర్మజుండు దివికి మ్రొట్టు నెలుంగున బి ట్టదల్పఁగన్. 324

వ. ఇ త్తెఱంగునం దనిమి యతం డయ్యట్టియుం దలయును ధరణీతలగతంబుసేసె నట్లు శతవృద్ధుం డగునయ్యగ్రగురుండు నీదుర్మంత్రంబునఁ ద్రుంగి పోయినం బొంగి పాండవానీకంబు పైకొనితఱిమిన మనమొనలు నెఱచఱచి కనుకనిం బఱచెం బఱచిన మనంబు గలంగి యప్పుడు నీకొడుకు లేటమొగంబులు వడుదొరలతోడం గూడఁ దిరిగెనట్టియెడదుర్యోధనదుశ్శాసనకృపకర్ణకృతవర్మమద్రేశ్వరులుమాతంగంబులం దురంగంబుల ముందఱ పెట్టికొని కటకటా యనుచు నింత వుట్టునే యనుచు నింక నేమి గల దనుచు నెట్లు సేయంగలవార మనుచు నేదిదుదియనుచు మరలి మరలి చూచుచుం జనుచుండఁ దక్కినయల్లంతిమానుసు లెల్లను దల చీర వాటించుతలంపు లేక యొండొరుల నిలు నిలు మని పలుకుచుం గాలు నిలువక పలుదిక్కులకుం బాఱి ర త్తఱి నశ్వత్థామ మున్నొక్క కెలనం గయ్యంబు సేయు చుండి నీసేన య ట్లగుటఁ గనుంగొని యక్కురుపతికడకుం జని యతని కి ట్లనియె. 325

తే. బలము లిది యేమి నలుగడఁ బాఱఁజొచ్చె, గర్ణకృపముఖ్యు లేటికిఁ గలఁగి లేట మొగము వడి రేల నీవును 'మున్నవోలె, నిలువరింపంగఁ దగియెడునిలువు లేవ.

వ. అని యడిగిన నతం డతనిమొగంబు సూచి యాచార్యుతెగుట సెప్పం బోయి డగ్గుత్తికవడి యూరకుండె శారద్వతుండు వెలువెలం బాఱుచు నెట్టకేలకు నెలుంగు దెచ్చికొని. 327

సీ. పాంచాలపాండవపరిముఖసైన్యంబుల, ద్రోణుండు బలువిడిఁ ద్రుంచు చుండ
నుక్కఱి పాండవుల్ లొక్కచోటికి వచ్చి, నిలువరింపఁగ లేక తలఁకుటయును
వాయుతనూజుఁ డశ్వత్థామ సచ్చెఁ జు, మ్మని కుంభజునితోడ నాడుటయును
నమ్మాట గొనక ధర్మాత్మజు నవ్వార్త, యాచార్యుఁ డేర్పడ నడుగుటయును

తే. భీముచేత నశ్వత్థామనామగజము
మున్న చచ్చుటకతమున నన్నరాధి
పతియు నది నెపముగ నట్ల పలుకఁ జాల
నడలి యతఁ డాయుధంబులు విడుచుటయును. 328

వ. అప్పుడు. 329

క. గురుఁ డమలయోగనిష్ఠం, దిర మై యుండంగ వచ్చి ధృష్టద్యుమ్నుం
డరదము డిగ్గి కరిగి త, చ్ఛిరోజములు పట్టికొని యసిం దునుముటయున్. 330

వ. చెప్పి యప్పుడు ధర్మనందనధనంజయులు వారింప నతం డుడుగక యట్లు సేసె ననియు నెఱింగించి యిట్లు భారద్వాజుండు వడిన బలంబులు విఱిగె నేమును

---

1. 'వద్దు సుమ్మర' అని యచ్చుప్రతులు. ఇది ప్రాఁతప్రతులం గనుపట్టదు.

నిరుత్సాహుల మయితి మేనుం గుపేరి నెపంబుగా నట్టిమాట వుట్టుట కృష్ణకృతం బయిన కపటోపాయంబు గానోపు నని యంతయు నేర్పడం బలికె ననుటయు ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 330

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ శ్రీరాముతో
సరి సేయం దగువాఁడు దండ్రి తల పాంచాలాత్మజుం డట్లు ని
ష్ఠురుఁ డై పట్టె ననంగఁ ద్రుంచె నన వించున్ వారితోఁ గూడ నా
తురుఁ డై పోయెనొ పోక నిల్చి యలుకన్ దోర్దర్పముం జూపెనో. 331

క. తను నాధృష్టద్యుమ్నుం, దునుముటకై కోరి కనియె ద్రోణుఁడు పరమా
స్త్రనిరూఢిఁ బరశురాముఁ డ, తని కిచ్చినయంతవట్టు దన కతఁ డిచ్చెన్. 332

వ. అట్టిజనకు నాద్రుపదనందనుం డట్లు సేసిన నక్కొడు కెట్లు సేసెనో విన వలతుం జెప్పు మనవుడు నమ్మహీపతి కతం డి ట్లనియె. 333

తే. కృపునిపలుకులు విని దట్ట కెంపు గదుర, కన్నుఁగవ నశ్రుజలములు గ్రమ్ముదేరఁ
బాణితలమున నొత్తి యాద్రోణతనయుఁ, డిట్టు లనుఁ దగఁ గౌరవాధీశుతోడ.

ఉ. చావులు లేవె యెందు ననిఁ జచ్చుట యొప్పదె యిట్లు లోకసం
భావితు నమ్మహాత్ముఁ దల వట్టె నొకం డనువాఁడిమాట య
మ్మై వడిఁ దాఁకి చిత్తమున కార్తి యొనర్ప సహింప రాదు గా
కే విన నున్కివాఁ డెఱుఁగఁడే నను నిమ్మెయి భంగపెట్టునే. 335

క. నాదివ్యాస్త్రంబులు బా, హాదర్పము [1]నింకఁ గాల్పనా గురుఁ డాజిం
దా దిక్కుమాలి పగతుని, చే దైన్యముఁ బొందె నకట యిసీ యే మందున్. 336

క. దీనికి మూలము ధర్మజుఁ, డా నిక్కము గల్గురాజు నని దండితుఁగా
నే నెట్లు సేసి పుత్తునొ, కో నాచిత్తముకలంకయును నెవ్వగయున్. 337

ఆ. పుత్త్రుఁ గనుట యెల్ల శత్రునిచేఁ దల, వట్టి తాను మనుమఁబడుట కయ్యె
నస్త్రగురున కింక నన నేమి గలదు నా, యిచ్చ బాస కౌరవేంద్ర వినుము. 338

మ. హరియుం బాండవులున్ మదీయపటుబాహాశక్తిదివ్యాస్త్రని
ర్భరసంతాపపరీతు లై యొదుఁగ ఘోరస్ఫారసంక్రీడఁ ద
త్తురగస్యందనవారణప్రకరముల్ ద్రుంగన్ విజృంభించెద
న్సురసంఘంబులు వచ్చి యడ్డపడిన న్దుర్వారదర్పోద్ధతిన్. 339

క. తనుఁ దాన చెప్పికొను టొ, ప్పనిపని యగు నైనఁ దండ్రిపరిభవమునకుం
గనలు గదిరి యి ట్లంటిని, విను మే నే మనిన నేమి వృథ [2]వో దధిపా. 340

### అశ్వత్థామవున్కివలనఁ గౌరవయోధులు మరల ననికిఁ గడంగుట.

వ. అని పలికి మఱియు ని ట్లను మాతండ్రి నారాయణు నారాధించి యొక్క మహాస్త్రంబు వడసె నది నాకు నిచ్చె నద్దివ్యసాధనంబు వధ్యు లవధ్యు లనువిభాగంబు

1. గాలు, గాల్ప ♦ మగ్గరు. 2. గా దధిపా.

20

లేక విరోధివిధ్వంసనంబు సేయఁ దత్ప్రయోగంబున జయంబు సేకొనియెదం జూడు మనుటయు నమ్మహీపతియు ననుజులు సేనాపతులును శంఖంబులు పూరించి సింహనాదంబులుసేసి మరలిన భేరీమృదంగాదితూర్యధ్వనులు నింగిముట్టఁ దురంగ రింఖారథనేమిగజపదఘట్టనంబుల నిల గ్రక్కదల మనసైన్యంబులు మరలి యుఱ వడించె ననిన విని ధృతరాష్ట్రుండు. 341

ఆ. అట్లు గడఁగుకౌరవానీకములఁ గని, పాండుపుత్త్రు లేమి। భంగివార
లై రెఱుంగఁ జెప్పు। మనవుడు నమ్మహీ,శ్వరున కిట్టు లనియె। సంజయుండు.

వ. ఇత్తెఱంగునం గురుబలంబులు పురికొనినం గాంగేయులుం గూడుకొని సైన్యంబు నుసంగతంబుసేసికొని సంగరక్రీడ కమరి రప్పుడు గ్రీడి నాలోకించిధర్మతనయుండు.

క. గురుఁడు వడిన నవ్విధమునఁ, బరమభయాకులతఁ బొంది। పఱచియు నట వే
తిరిగి కురుబలము పోరికిఁ, గర ముద్ధతి నగ్గలింపఁ। గత మెయ్యదియో. 344

క. ఇలయును నింగియు నద్రువం, జెలఁగె మహారవము వారి। సేనల గురుచా
వలుక నొనర్చిన నక్కడ, బలరిపుఁ డేతెంచి తోడు। పడి నడచెనొకో. 345

వ. అనిన విని యమ్మనుజపతికి నతం డిట్లనియె. 346

ఆ. న్యస్తశస్త్రుఁ డైన। యాచార్యుఁ జంపిన, నెవ్వరొక్క వారి। కివ్విధంబు
బలిమి గలుగఁజేసి। రలుక మై ననుచు సం,దియము పడఁగ నేల। తెలియవినుము.

చ. జనకు నధర్మవృత్తి మెయిఁ। జంపుటకై తల వట్టె నొక్కరుం
డన విని రిత్త వోవునె మహాద్భుతశౌర్యము నస్త్రవీర్యముం
[1]మనము జగంబుఁ గన్నయతి। మానుషవిక్రమశాలి వీని నె
వ్వని కెదురంగ రా దనఁగ। వ్రాలినద్రోణసుతుండు భూవరా. 348

తే. జన్మవేళన యాతఁ డు। చ్చైశ్శ్రవంబు, భంగి హేషించెఁ బృథివి గం। పంబునొంద
నప్పు డతని కశ్వత్థామ। యని యొనర్చెఁ, బేరు జనములు విన నశ। రీరవాణి. 349

వ. అతండు సూవె కౌరవసైన్యంబునిప్పటిసంరంభంబునకుం గారణం బని చెప్పి వెండియు. 350

ఆ. అనఘ నిన్ను శిష్యుఁడును ధార్మికుండు స,త్యవ్రతుండు నని మహాదరమున
నడిగె నీవు ధర్మ। హానికి నోర్చిన, గురుఁడు నిశ్చయించెఁ। గొడుకుచావు. 351

క. చలముకొని యిట్లు వడయఁగ, వలయునె రాజ్యంబు దీన। వచ్చినకలిమిం
గలుగునె పెంపుం బేరును, వెలి యైతిమి లోకమునకు। వేయును నేలా. 352

వ. అదియునుం గాక. 353

మ. వల దిట్లే లని యేను బేరెలుఁగునన్। వారించుచుం బాఱఁగాఁ
దల యిట్లేటికిఁ బట్టి త్రెవ్వ నడిచెన్। ధర్మప్రణాశం బెదం

---

1. మనము బలమునుం గలయ। మానుష; మనలు జగంబునుం గనున। మానుష.

దలఁపం డాగ్రహవృత్తిఁ బార్షతుఁడు దదైన్యంబునం గోధవి
హ్వాలుఁ డై యాతనిపై వడిం బడక యశ్వత్థామ సైరించునే. 354

క. మనసేనల నొక్కెత్తునఁ, గొనఁ దలఁచి కడంగి వచ్చు గురుపుత్త్రుని మా
ర్కొన ధృష్టద్యుమ్నునిఁ గా,వను శక్యమె నీకు నిచటి వారికి నధిపా. 355

వ. అనినం గోపించి యనిలనందనుం డాసంక్రందననందనున కిట్లనియె. 356

చ. అడవుల నుండు తాపసుల యట్టులు పల్కెదు రాజనీతి యి
ట్లొడఁబడి చేయ వచ్చి వధ కొల్లమి యొప్పునె ధర్మనిష్ఠ యె
క్కడఁ గల దాసభన్ ద్రుపదకన్యక పాటున కిట్టి వెన్నియుం
గడుకొని చేసిరే మనలఁ గల్మష మొందఁగ నేర దర్జునా. 357

తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర, నేము సిడిముడిపడుచుండ నిట్టు లనుట
యొప్ప దురిసినపుండుల నుప్పు [1]వెట్టె, దరయ దీనికి నిన్ను నే మందుఁ బార్థ.

క. కురువీరు లెఱుఁగుదురు ననుఁ, గురువీరుల తెఱఁగు నేను గొంత యెఱుఁగుదున్
శరపరిఘప్రహరణములఁ, బోరిగొని యెదఁ గాక వారిఁ బో నిచ్చెదనే. 359

వ. అని పలికె నప్పుడు ధృష్టద్యుమ్నుండు బీభత్సున కిట్లనియె. 360

చ. వెరవును లావు లేని ప్రజ వేయువిధంబుల దివ్యబాణవి
స్ఫురణము సూపి చూపి పొరివుచ్చె మహోగ్రత ధార్మికుండె య
గ్గురుఁ డది గాక యే నతనిఁ గూల్పన పుట్టినవాఁడ నింతవ
ట్టరయక నన్ను నిట్లు సెడ నాడుట పాడియె నీకు వాసవీ. 361

క. పితృసఖుఁ డగు భగదత్తునిఁ, బితామహుం డైనవృద్ధు భీష్ముని నీ వు
ద్ధతిఁ జంపుట పుణ్యంబే, ప్రతివీరునిఁ జంపు టేల పాపం బయ్యెన్. 362

క. భూనాథుఁడు బొంకఁడు విను, మేనును ధర్మంబు దప్ప నిది యేటికి మి
థ్యానింద శిష్యవంచకుఁ, డైనగురుఁడు సచ్చె గెలువు మరి సైన్యంబున్. 363

ఆ. అనియె ననుడు సంజయుఁడు కాంబికేయుఁ డి, ట్లను మునీంద్రజాతుఁ డైన ద్రోణు
నట్లు సేసి యద్దురాత్ముఁ డమ్మెయిఁ బల్క, వినుచు నచటివారు గనల రెట్లు.

— ద్రోణుపరిభవంబునకుఁ గోపించి సాత్యకి ధృష్టద్యుమ్ను నాక్షేపించుట. —

సీ. అనుటయు నా సూతతనయుఁ డవ్విభునకు, ని ట్లను నతని రూక్షేక్షణముల
నరుఁ డుపలక్షించి తొరఁగుకన్నీరితో, నిట్టూర్పు నిగిడించి యిట్టిరోఁత
మాట లేటికి నన మాఱు పల్కక హరి, ధర్మపుత్త్రాదులు దలలు వంప
నలిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని, నీజిహ్వ దునియదు నీశిరంబు

తే. వగుల దమ్మెయి గురునకుఁ బరిభవంబు, సేసి యిమ్మెయిఁ బలుకంగఁ జేయునదియుఁ
గలదె యీరాజుసన్నిధిఁ గాన బ్రదికి, తింకఁ బలికిస నోరు వ్రేయింతుఁ జుమ్ము.

---

1. కట్టె దరయ నతఁ డిందఱికి నెక్కెవయ్య; నట్టు టరయ నిది నిన్న నే మందువయ్య.

క. తనమాఁతే యని గంగా, తనయు శిఖండియ వధించెఁ దత్కార్యం బా
తనికిఁ బ్రియ మైనఁ బనిచెం, దనమనుమనిఁ బనుపు సేఁత చగదె నరునకున్.

వ. అశిఖండియు నీవు నుద్భవించి పాంచాలకులంబు గీర్తికిం బుణ్యలోకంబునకుం
బాపితి రనిన ధృష్టద్యుమ్నుండు నవ్వుచు నతని నవలోకించి. 367

క. సైరించిన నెఱుఁగవు నీ, చారిత్రము దలఁప నన్యశరకృత్తకరున్
భూరిశ్రవుఁ జంపి తదియు, వీరవ్యవహార మే వివేకవిహీనా. 368

తే. అతఁడు నీయొమ్ము ద్రొక్కి నయపుడొకండుఁ, జేయఁజాలవ యగ్గురుసాయకములఁ
బాండవానీకములు విచ్చిపాఱ నెన్ని, యెడలమార్కొంటి వాతని నెఱుఁగ వెట్లు.

క. వలవని ప్రేలరిమాటల, నలిగింపకు నన్ను నేమి యాడిన నింకం
దల ద్రెవ్వ నేయుదుం గురు,బల మదె పురణించె బడలుపఱుతము రమ్మా. 370

వ. అని పలికిన శినివరుండు రోషారుణితలోచనుం డై కోదండంబు రథంబున నిడి
గద పుచ్చికొని మాటల నలిగెదేని వ్రేటున శిక్షించెద ననుచు ధరణికి లంఘించి
కవిసినం గని కేశవుండు వనుపం బవనతనయుండు రథంబు డిగ్గి రయంబునం
జని పట్టి యాఁడుగులకొలఁది నిలువరించె నట్టియెడ సహదేవుం డా శైనేయు
నుద్దేశించి మిమ్మును బాంచాలురం గడచినబంధువులు మాకును మమ్మును
మిమ్మును మిగిలినబాంధవులా పాంచాలురకును వారలకంటె మాకంటె నెక్కుడు
సుహృజ్జనులు మీకును లే కునికి దెల్లం బిట్టిమీలో మీ రెరవుపడం దగునే
యలుక దక్కు మనునెడ నాధృష్టద్యుమ్నుండు వడముడితో నతనిం బట్టక
విడువుము నాచేతం గాని నీచేత నిలువండు నే నొక్కచేతిభూరిశ్రవుండనే యేల
యడిచిపడిమెడు ననవుడు నాభీమసేనుబాహువులలోనం దిరుగుడువడుచు నుర
గంబుచందంబున సాత్యకి రోఁజుచున్నం గృష్ణయుధిష్ఠిరు లయ్యిరువురం బ్రయ
త్నంబున వారించిరి తదనంతరంబ. 371

క. భేరీమృదంగశంఖమ,హారవములు సెలఁగఁ బాండవానీకంబుం
గౌరవసైన్యము దాఁకెను, వారిధు లొండొంటిఁ దాఁకువడు వమరంగన్. 372

క. మును ద్రోణునిఁ బొలియించితి, మని పాండవబలము బలియు నశ్వత్థామం
గొని కురుసేనయు నత్తఱి, ననూనగర్వమున నుద్భటాటోపమునన్. 373

వ. పెనంగం దొడంగె నప్పుడు ద్రౌణి దుర్యోధనుం గనుంగొని. 374

క. అనృతంబు వలికి బ్రదికెడ, మని చూచినరాజుమూఁక లన్నియు నె ట్లై
యనిఁ బడిమెడునో యెమ్మెయిఁ, గనుకనిఁ బఱచెడునొ చూడు కన్నారంగన్.

వ. అని పలికి నియతుం డయి యతండు నారాయణాస్త్రంబు ప్రయోగించిన. 376

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు గుంఠీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్ మహీ

ధరసంతానము లోలి గ్రక్కదలె నుద్వాంతంబు లై యంబుధు
ల్వారలెం గట్టలమీఁద బిట్టు పిడుగుల్ సోకి సెగ మహోదగ్రతన్. 377

వ. ఇట్లు భీకరాకారం బై దుర్వారం బయినయద్దివ్యసాధనంబు మండలార్ధచంద్ర భల్ల నారాచ క్షురప్రముఖంబులు ననలమయంబులు నగుననేకదేదీప్యమాన మార్గణమూర్తులు గైకొని కౌంతేయసైన్యసంతానం బంతయు నొక్కపా యగాఁ గవిసినం గని తెంపుపెంపునం దత్సైనికనికరంబులు వివిధవిశిఖంబుల నయ్యాయిముఖంబుల మగిడించుచు బలువునం బొంగుచు నింగిని నేలను నడు మను నాభీలజ్వాలాజటిలంబుగాఁ బైపయి నడరి యమ్మహాస్త్రంబు చతురంగం బులం ద్రుంగించుచు నెదు రెంతెంత పెనంగె నంతంతియ పేర్చి యేర్చుచుం బలువం దొడంగిన నమ్మొనలు పలువం దొడంగె నప్పుడు నరుం డూరకునికి సూచి నారాయణుండును నతండును విను చుండ ధర్మసూనుండు సాత్యకిధృష్ట ద్యుమ్నుల నాలోకించి యి ట్లనియె. 378

సీ. ఆసభఁ బాంచాలి కగాసిసేయఁగ నుపేక్షకుఁ డయి చూచెఁ బెక్కండ్రఁ గూర్చి కొని బాలు నభిమన్యుఁ గూల్చె నించుకవడి, యాఁగిన నర్జునుఁ గడగ్నిఁ జొచ్చు ననువగ మనల నాకతనికిఁ దోడ్పడఁ బోవ, నీ కాఁగె నమ్మెయి నిట్టిధర్మ పరుఁ డైనకలశసంభవుతోడ సరివచ్చు, టుచితంబె యీవచ్చునుజ్వలాగ్ని
తే. వలని కరిగెద మీరు మీవాహినులును, బాటి పొం డెక్కడేని నవ్వార్థుకోర్కి యంత సఫలతఁ బొందెడునచ్యుతుండు, [1]నెట్లు దనకు రుచించెఁ దా నట్లు సేయు.

వ. అనిన విని జనార్దనుండు సత్వరుం డై పెద్దయెలుంగున నెల్లవారును విన సైనికు లారా సామజహయరథంబులు డిగ్గి యాయుధంబులు వెట్టి నిలువుండు భూమి గతు లగునిరాయుధుల నిమ్మహాస్త్రం బేమియుం జేయ దది యెట్లనిన నిట్లగుట దీనికిఁ బ్రతివిధానంబు గా దీని నొసంగినమహాత్ముండు విధియించె ననుటయు సకలజనంబులు నమ్మాట కియ్యకొని యట్లు సేయం జూచినసమయంబున సమీర నందనుండు. 380

చ. డిగకుఁడు వాహనంబులు గరండింది మగంటిమి గోలుపోవ మీ
రు గడఁక దక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధముల్ మహాస్త్రశ
క్తి గెలుతు గోత్రభిత్కులిశశక్తిప్రశరంబుల వైభవంబు భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్. 381

వ. అని బరవసంబు సేసి శంఖం బొత్తి మల్లచఱచి సింహనాదంబు సెలంగ నశ్వ త్థామకు మార్కొనుటయు నవ్వీరుం డదల్పుతో నన్నారాయణాస్త్రంబు నిగుడం జేసిన. 382

క. అనలశిఖాసదృశము లగు, ననేకబాణములు భీమునరదము వొదువం

1. నపుడు దనకును రుచియించు నట్లు సేయు.

గని యమ్మెయి నయోధులు వా, హనములు వెస డిగ్గి పెట్టి రాయుధము లిలన్.

వ. పదాతిజనంబులుం గైదువులు వెట్టి రప్పు డద్దివ్యసాధనం బెవ్వరికి బాధకంబు గాక యాభీమసేనుదెసకు మొగం బగుటయు. 384

క. నరుఁడు గని సత్వరంబుగ, వరుణాస్త్రం బేయుటయును వావిరి నది త
త్పరుషత మానెడునట్లుగఁ, బరఁగిన గురుసుతుఁడు పెద్ద ప్రబలం జేసెన్.

నారాయణాస్త్రపీడితుఁ డగుభీముఁ గృష్ణార్జునులు రథంబు డిగ్గఁ జేయుట.

వ. ఇవ్విధంబున నశ్వత్థామ యమ్మహాస్త్రంబు దీపింపం జేసిన నది పేర్చి కార్చిచ్చు వోదువుచందంబున సమీరనందనుం జుట్టు ముట్టె నట్లు సమరవిముఖులై యేమియుం గాకున్న ధర్మనందనాదులను బలిమి వదలనిచలంబున ననలంబు చేతం బొదువం బడినవృకోదరునిం గని కృష్ణార్జునులు దేరు డిగ్గి రిత్తచేతులం బాఱి వారుణాస్త్రంబుకతంబునం బెద్ద గాలక యున్నయాభీముని రథంబు డిగ్గఁ ద్రోవ డిగక బిగిసిన నచ్యుతుం డతని కి ట్లనియె. 386

తే. ఇమ్మహాస్త్రంబుఁ గడిమిమైఁ గ్రమ్మఱింప, నెవ్వరికి రామిఁ జేసి కా కేము శక్య
మైన నూరకయుండుదు మయ్యు వలవ, దుడుగు నాబుద్ధి విని డిగ కనుఱుకు తేరు.

వ. అనుచు నతని నిరాయుధుం జేసి యర్జునుండును దోడ్పడ నరదంబు డిగ్గఁ ద్రోచె నిత్తెఱంగునఁ బాండవసైన్యం బంతయు దైన్యంబు నొందుటయు నారాయణాస్త్రంబు ప్రశాంతిం బొందెఁ దదనంతరంబ. 388

క. హరి వనుప వారిబలములు, పురికొని వాహనవితానములు శస్త్రాస్త్రో
ద్ధురభంగి నొప్ప నడరెం, గురుసేనలమీఁదఁ దూర్యఘోషము సెలఁగన్.

వ. ఆసంరంభంబు సూచి సుయోధనుం డశ్వత్థామతో నింకను నమ్మహాస్త్రంబు ప్రయోగింపు మనుటయు నతం డది పునఃప్రయోగంబున కర్హంబు గాదట్లయినం బ్రయోగించినవారిన వధియించు నిట్లగుట గురునకు వరదానకాలంబునం గేశవుం డానతిచ్చెఁ జావోటములు రెండును నొక్కరూప కావున నమ్మహనీయాస్త్రంబు పగతుర నోడించి యంతటితోడఁ దెగియెఁ గృష్ణుం డీయుపాయంబున నప్పరమసాధనంబు గడపి పుచ్చె మన మేమి సేయుద మనుచు నిట్టూర్పు నిగిడించె ననవుడు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 390

క. నారాయణాస్త్ర మిమ్మెయి, వైరిచమూసంచయంబు వధియింపక పో
రారాజును ద్రోణియుఁ దా, రేరూపున సంచరించి రెఱిఁగింపు తగన్. 391

వ. అని యడిగిన నమ్మనుజపతికి సూతసూనుం డి ట్లనియె. 392

క. ఆమనుజపతికి నశ్వత్థామ యటులు సెప్పుటయు నతం డన్యాస్త్ర
స్తోమంబునఁ బాండవసేనామర్దన మాచరింపు నావుడుఁ గడిమిన్. 393

తే. ద్రోణి గౌంతేయసేనపై బాణవితతిఁ, బరఁగ జేయుచు నాచార్యమరణ మంత
రంగసంతాప మొనరింప నక్కజముగఁ, దఱిమి పాంచాలతనయునిఁ దాఁకె నధిప.

తే. తాఁకి యిరువదేనమ్ము లుదగ్రవృత్తి, నతనితనువునఁ బఱపి రయంబు మెఱయ
మఱియు నిరువదిమూఁ డుగ్రమార్గణములు, నిగుడఁ జేసిన నాతండు వెగడుపడక
వ. నిశితనారాచంబుల నొప్పించినం గోపించి. 396

మ. గురుపుత్త్రుండు గడంగి సూతు హరులం గోదండముం గేతువుం
ధరణిం గూల్చినఁ జూచి సాత్యకి మదోద్ధత్యంబునం దాఁకుడుం
శర మొక్కంటన మూర్ఛ వుచ్చి వెస ధృష్టద్యుమ్నుఫాలంబు ని
ష్ఠురనారాచహతంబు సేయుటయు వాఁడుం దేరిపై సోలినన్. 397

వ. కనుంగొని రోషవిషాదంబులు మనంబునం బెనంగొనం గిరీటియు భీమసేనుండు
నుం గవిసినం బాసట యై శిశుపాలపౌత్త్రుం డగుయువరాజును మాళవుం డగు
సుదర్శనుండును బౌరవుం డగువృద్ధక్షత్త్రుండునుం గూడికొని యయ్యేవురు నయి
దయిదుసాయకంబు లేయ నక్కుంభసంభవసంభవుండు వానిం బంచవింశతికాం
డంబుల ఖండించె నిట్లు దొడంగి యందఱు నన్నిరూపు లై యేపునం బోరు
చుండి ప్రచండభల్లత్రయంబున భుజంబులు శిరంబునుం దునిమి సుదర్శనుఁ గృ
తాంతదర్శనంబున కనిచి పౌరవుతేరునుం దలయును నఱికి విశిఖశిఖలం జేదికు
మారు వ్రందించి మదంబున సింహనాదంబు సేసి శంఖం బొత్తినం జిత్తంబులు
గలంగి పాంచాలురుం [1]బాండవబలంబులుం జలం బెడలి పాఱినం బోక నిలిచి
భీమార్జును లమ్మొన మరల్చి రప్పుడు పాకశాసనతనయుం డతని నిలు నిలు మని
యదల్చి సంరంభవిజృంభితుం డై. 398

క. గురుసుత నీదుభుజావిస్ఫురణము దివ్యాస్త్రవీర్యమును గురుధరణీ
వరుదెసకూర్మియుఁ జూపితి, దెరలకుమీ యనుడు నతఁడు దీప్తాకృతి యై. 399

మ. నియతిం బావకబాణ మేయుడు మహాగ్నిజ్వాలికామాలిక
ల్హాఘుసందోహరథవ్రజద్విరదమాలాసద్భటశ్రేణికా
క్షయముం జేయుచు సర్వభూతభయదాకారంబునం బేర్చి య
త్యయకాలజ్వలనోద్ధతిం గవిసి యేకాక్షౌహిణిం ద్రుంపఁగన్. 400

క. కురుసేన యుబ్బి యార్చుచు, హరియు నరుఁడు మడియుదురు శరానలశిఖలం
సరి గలరే త్రిభువనముల, గురుసుతునకు ననఁగఁ దూర్యఘోషము లెసఁగెన్.

తే. ఎల్లదివ్యబాణంబులుఁ బొల్ల వోవఁ, జేయునట్లుగ బ్రహ్మ సృజించినట్టి
కీర్తనీయమహాస్త్రంబు గ్రీడి మంత్రనిష్ఠ యొప్పఁ బ్రయోగించె నృపవరేణ్య.

వ. ఆబ్రహ్మాస్త్రంబుచేత నద్భుతం బగునశ్వత్థామయాగ్నేయాస్త్రంబు సంక్షీణం
బగుటయుఁ గైటభాంతకుండును గిరీటియుం బాంచజన్యదేవదత్తంబులు పూ
రించినఁ బాండవసైన్యంబు సింహనాదశంఖభేరీమహారావంబులు సెలంగెఁ

---

1. 'పవమానసూనుండు లోనుగాఁ గలపాండవబలంబులు చలం బెడలి పాఱినం బోక నిలిచి యప్పాకశాసనతనయుం డమ్మొనల మరల్చి యతని నిలు నిలు మని.' వ్రా. ప్ర.

గారవసేన లేటమొగంబు వడిమె నప్పు డగ్గురునందనుండు. 403

ఆ. తెల్ల మయ్యె నాకు దివ్యాస్త్రబలము లే, దునికి సిగ్గు మాలి యనికి నింకఁ
గడఁగ నేల దీని నుడిగెదఁ గా కని, యుల్లమునఁ దలంచి విల్లు వైచి. 404

వ. అరదంబు డిగ్గి తొలంగి పోవం బోవ. 405

క. జిగి దొలఁకాడఁగ నేలకు, మొగి లేలాగో డిగ్గ నసఁగ ముందటఁ దోఁచెన్
విగతదురితత్వభాసుం, డగు వేదవ్యాసుఁ డమ్మహాపురుషునకున్. 406

అశ్వత్థామకు వ్యాసుఁడు కృష్ణార్జునులమహిమ సెప్పుట.

వ. తోఁచిన వినయసంభ్రమంబులతోడ వినతుం డై గద్గదకంఠుం డగుచు మునీంద్రా మదీయం బగునాగ్నేయాస్త్రంబు వృథయయ్యె నిది యేమిమాయయో యెఱుంగ సురాసురగంధర్వాదిజాతులకును దుస్సహం బయినయద్దివ్యసాధనంబు మనుష్యు లగుకృష్ణార్జునుల దహింపఁ జాల దయ్యె ననవుడు నాతపోధనవర్యుండు వినుము నీసంశయంబు వాపెద నని యతని కి ట్లనియె. 407

ఆ. ఆదిదేవుఁ డైన యవ్విష్ణుఁ డఖిలలో, కాభిరక్షణార్థ మై జనించి
మహితతపము సేసె మైనాకశైలంబు, నందుఁ బెద్దకాల మభవుఁ గుఱిచి. 408

సీ. పవనాసనుఁడు నూర్ధ్వబాహుండు నగుచు న, న్నారాయణుం డతిఘోరనిష్ఠఁ
జలుపునాతపమున సంతుష్టుఁ డై బాల, శశిరేఖ నొప్పారుజడముడియును
శూలపినాకాదిసుమహాదాయుధముల, వెలిఁగెడుచేతులు విలసదురగ
యజ్ఞోపవీతసమంచితవక్షంబు, శోభిల్లఁగాఁ బొడసూపె శంభుఁ

తే. డపుడు పద్మాక్షుఁ డవ్విరూపాక్షునకు ధ, రాతలము జానుపాణిశిరంబు లొంది
మ్రొక్కి నిలుచుండి నుదుటిపై మోడ్పుఁగేలు, భక్తిఁ గదియించి యిట్లని ప్రస్తుతించె.

క. స్థావరములు జంగమములు, నీవలనం గలిగెఁ దద్వినిర్మలరక్షా
ప్రావీణ్యము దగఁ బ్రభువుల, కేవారల కైన నీవ యిత్తు మహేశా. 410

క. సుర లాదిగఁ గలజీవులు, పురుషార్థచతుష్టయంబుఁ బొంది సుఖత్వ
స్ఫురణము నొందుట నీ దగు, కరుణాతిశయంబు వడసి కాదె కపర్దీ. 411

క. వేదములు [1]ధర్మవాచక, వాదంబులుఁ దద్విలాసవంతం బగుధా
త్రీదేవోత్కరము భవ, త్ప్రాదుర్భావములు గావె బాలేందుధరా. 412

క. నినుఁ దనుఁగా నతినిర్మల, మనస్సమాధిప్రకర్షమగ్నతవలనం
గనుఁగొని తద్రూపభజన, మొనరించుమహాత్ముఁ డమృత మొందుఁ బశుపతీ.

వ. అని మఱియు ననేకభంగులం బ్రస్తుతించి దేవా నిన్ను భక్తి భజియించునాకు ననన్యసులభప్రభావం బొసంగు మని యభ్యర్థించుటయు దేవముఖ్యుం డగువిష్ణుదేవుం బ్రసన్నదృష్టి నాలోకించి యప్పరమేశ్వరుండు నీవు నరసురగంధర్వకిన్నరగరుడోరగాదిభూతంబుల నవలీల గెలిచి పరమతేజోవిరాజమానుండ వై

1. ధర్మవాక్చయ.

వర్తింపుము నీకు నస్త్రంబుల శస్త్రంబుల నగ్నిజలంబుల నశని నార్ద్రంబునను శుష్కంబునను స్థావరంబునను జంగమంబునను జావునొప్పులు లేకుండం గలయవి దొడరిన నన్నైనన జయింపు మని వరం బిచ్చెం గావున నన్నారాయణుండవిజయ్యుం డై నెగడె నతనియందు జనియించిననరుండును నట్టివాం డై కూడి సంచరించు నరసఖుం డగునద్దేవుండు నిజమాయావిశేషంబుల జగన్మోహనుండై విహరించు నమ్మహాత్ము లిరువురును దానవుల వధియించుటకును ధర్మసంస్థాపనంబు సేయుటకు నై వలసినయప్పు డెల్లను జననాదికృత్యంబులు గైకొని వినోదింతురు వారలు గదా యీకృష్ణార్జును లని చెప్పి కృష్ణద్వైపాయనుండు వెండియు ని ట్లనియె. 414

క. నీవుం దపస్తేజోవిద్యావిభవసమగ్రమూర్తి వగు దైనను నీ
కే వినిపించెదం దెలియం, గా విను వారలకు నీకుం గలయంతరముల్. 415

తే. శుభ్రమగునుర్విమూర్తికసురుచిరంపుం, బ్రతిమగావించికొనియందుం బరమునావ
హించి పూజావిశేషంబు లెల్లం జేసి, నీవు దొలుమేనం గొలిచితి నిష్ఠతోడ.

క. వారలు లింగాధిష్ఠానారూఢుం గా నొనర్చి యర్చించిరి భ
వ్యారాధనపరు లై మును, గౌరీపతి నతులనియమకల్పన వెలయన్. 417

వ. ఎత్తెఱంగునం జేసినను బరమేశ్వరారాధనంబు సర్వార్థసాధన మగు నందును లింగంబునందుం బూజించుట యర్చయం దారాధించుకంటె ననేకగుణంబు లెక్కుడు గావున లింగార్చనపరు లగువారల నర్చారాధకుండ వగునీకు నెట్లు జయింపవచ్చు మీమీపూర్వజన్మంబులయర్చనంబులఫలంబులు దారతమ్యంబులతో ననుభవింపవలదే యని తెలియం బలుకుటయు నశ్వత్థామ పులకితాంగుండును సమాహితాంతరంగుండు నై రుద్రునిం దలంచి నమస్కరించి కేశవుం గొనియాడి పరాశరనందనున కభివందనంబు సేసిన నమ్మహాముని యంతర్ధానంబు సేయం దానును మరలివచ్చి నిజరథారూఢుండై యరుణగభస్తి యస్తగిరిసమీపంబున కరుగుటం గనుంగొనుచుం గురుపతిపాలికిం జని యతనికిం గాలోచితం బెఱింగించినవాండై బలంబులం దివియ నియమించె నట్లు దిరిగి దీనంబు లగునాననంబులతోడం గౌరవులు విడిదలకుం బోయిరి పాండవులు బహుతూర్యనినదంబులు సింహనాదంబులుం జెలంగం బొంగారినసముద్రంబుచందంబున నుల్లసిల్లుసైన్యంబు మగిడించికొని నిశ్చింతంబు లగునంతఃకరణంబులతోం గృష్ణోపలాలిత లగుచు నిజశిబిరంబులకుం జనిరి తదనంతరంబ ధనంజయుండు. 418

— వేదవ్యాసమునీంద్రుం డర్జునునకుం బరమేశ్వరుమహిమ సెప్పుట. —

మ. మహనీయ[illegible] స్ఫూర్తి [illegible] ప్రవరు [illegible] సంకీర్తనీ
యు [illegible] ప్రసమాస తేజం గరుణాకయుక్తుం బ్రతీపాన్వయో
ద్వహు నాశ్చర్యకర ప్రబోధనిధి వేదవ్యాసుం బూజ్యుర్ జ[illegible]

వహుఁ డై వచ్చినవాని నాగమసుఖావాసాననాంభోరుహున్. 419

వ. అంతంతం గనుంగొని యత్యంతవినయసంభ్రమంబులతో దండప్రణామంబు సేసి యాసనార్ఘ్యపాద్యాదిపూజనంబుల నారాధించి సమీపభూమిం గూర్చుండి కృతాంజలి యై సుప్రసన్నం బగునమ్మహామునివదనంబు వీక్షించి. 420

తే. అవధరింపు మహాత్మక యయ్యమున నేను, శాత్రవుల నేయఁబూనుచో సరభసముగ
నడరిముందట నొకరుఁడు పుడమినడుగు, లిడక పావకనిభమూర్తి యెసక మెసఁగ.

చ. కిరణము లుల్లసిల్లఁ దన కేల నుదగ్రపుశూల ముండఁగాఁ
బొరిఁ బొరి నందు ఘోరముగఁ బుట్టినశూలపరంపరల్ గరం
బరుదుగ వారి నెల్లఁ దెగటార్పఁగ నే వెనుకన్ శరంబులం
గురియుచుఁ జంపినాఁడ [1]ననిఁ గొందు జయంబు సముద్భటంబు గన్ 422

క. అప్పురుషుఁ డెవ్వఁడో యని, యెప్పుడు మదిఁ దలఁతు నతని నేర్పడ నాకుం
జెప్పవలయు నని యడిగిన, నప్పార్థున కిట్టు లనియె నమ్ముని ప్రీతిన్. 423

వ. నీయడిగినయతండు. 424

ఉ. ఆదికి నాదిలోకముల కన్నిటికిం బ్రభుఁ డవ్యయుండు వే
దాదిపవిత్రవాచకస[2]హస్రపరిస్ఫుటవాక్యరూపుఁ డం
హోదళనప్రకారక శుభోదయకారణదివ్యనాముఁ డం
బాదయితుండు దృఙ్మహితఫాలుఁడు లోలుఁడు భక్తియుక్తికిన్. 425

క. యోగీంద్రచిత్తకమలా, భోగమధుపవిభుఁడు ప్రకృతిపురుషాత్ముఁడు ని
ర్భోగస్వరూపుఁ డవ్యక్తాగోచరుఁ డధికసులభుఁ డమలాత్ములకున్. 426

ఉ. నీలగళుండు శంకరుఁడు నిత్యుఁడు సత్యసురూపుఁ డుజ్జ్వల
త్కాలమహానలప్రశమకప్రచురామృతవృష్టివిస్ఫుర
ద్బాలమృగాంకశేఖరుఁడు దైత్యకులప్రవిదారణక్రియా
లోలపరశ్వథుండు [3]సకలుం డమలుండు ప్రియుండు శాంతికిన్. 427

వ. అని ప్రశంసించి కవ్వడి గనినవాఁడు రుద్రుం డగుటఁ దేటపఱిచి దక్షమఖమథన త్రిపురమర్దనాదు లగున ద్దేవునిదివ్యలీల లుపన్యసించి మహాదేవపశుపతిశివప్రముఖంబు లగుతదీయభవ్యనామంబులకుం బ్రవృత్తినిమిత్తంబు లగునర్థంబులు దెలియ నిర్వచనంబు సేసి యట్టిపరమేశ్వరుండు నీకు వరదుం డయి సన్నిధిసేసె నతనిం గని పెన్నిధిఁ గన్నపేదవోలెం గృతార్థుండ వై తయ్యంధకాసురభంజను కతంబునం గడిందిపగ అడంగుడు రయ్యాదిమథనుఁ డదుం డిప్పిధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపు గొనుట సుకరం బయ్యె నీతపంబు పెంపునం దొల్లి సన్నిహితుం డై నీకుం బ్రియంబుగా దివ్యాస్త్రంబు లొసంగె నంతటం దనివి సనక యిత్తెఱంగున భక్తపరాధీనత్వంబు ప్రకటించె నీవు పుణ్యాత్ముండ వప్పర

1. నయి. 2. మగ్రపరిస్ఫుటగోచరుండు. 3. కుశలుండు గలం డఘతాపశాంతికిన్.

మాత్మ నాత్మ నిలిపి నమస్కరింపు మాసర్వలోకశరణ్యుని శరణంబు సొరు మక్కరుణాకరుండుశరణాగతులకునాయురారోగ్యైశ్వర్యాదిసకలాభిమతంబులు నిత్యంబులుగాఁ బ్రసాదించు నని నిర్దేశించిన నయ్యర్జునుండు దండప్రణామ పూర్వకంబుగా భక్తిరసాయత్తం బగుచిత్తంబునం జంద్రధరు నెలకొలిపి సాంద్రానందం బనుభవించి సాత్యవతేయుచరణంబుల కెఱఁగిన నమ్మునీంద్రుం డయ్యైంద్రనందను నభినందించి సుఖవిగమ్మని దీవించి [1]విజయంచేసె నని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని జనమేజయునకు వైశంపాయ నుండు సెప్పుటయు. 428

క. మునివర ద్రోణునివృత్తము, విని సంతుష్టుండ నైతి వినువేడుక నా
మనమునఁ దొడ్తొ నొదవెడు, వినిపింపు దగంగ మీఁదికవృత్తాంతంబున్. 429

వ. అని యడుగుటయు. 430

చ. అమరకిరీటకోటికలితారుణరత్నమరీచివీచికా
సముదయఖేలనోల్లసనచారుపదాంబుజకాంతిపూర దు
ర్దమ్మదనుసూనుసంచయవిదారణ[3]చిత్తవిహార [4]బోధనా
గమహితవాదనిర్వహణకౌతుకమిశ్రిత రక్షితాశ్రితా. 431

క. జనవినుత బాదరాయణ, మునీంద్రవాగమృతనిధిసముద్భూతాహ్లా
దనకీర్తిసుధాకిరణా, వినతాఖిలభద్రకరణవిశ్రుతచరణా. 432

మాలిని. అమృతమయవిలాసా యోగభోగోద్వికాసా
విమలహృదయరమ్యా వీతరాగాదిగమ్యా
కమలభవనమస్యా గౌరవాధిక్యశస్యా
[5]శమదమపరివర్తీ శాశ్వతానందమూర్తీ. 433

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమదాంధ్రమహాభారతంబున ద్రోణపర్వంబు నందు సర్వంబును బంచమాశ్వాసము. 434

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
ద్రోణపర్వము సంపూర్ణము.



1. నిజేచ్ఛం జనియె నని. 2. దనుజానుశాసనవిధానతచిత్తవిహార. 3. విత్త. 4. ఘోర-సంగమ-నాగమ-యాగమ-హితనాగనిగ్రహనకౌతుక. 5. సమపరిమళవర్తీ ♦ శశ్వదానందమూర్తీ.

Printed at the Kesari Printing Works, Madras.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## కర్ణపర్వము, ప్రథమాశ్వాసము.

---



పరిణామస్థితివి
ద్యాపారీణత్వకారికిఁ దానిరతాపాం
గా పరమనైష్ఠికత్వ
వ్యాపారప[1]రానుషక్త హరిహరనాథా.

సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని తెగుటం జెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు మహాప్రాజ్ఞుం డగు సంజయుండు దండుననుండి హస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రుమందిరంబు ప్రవేశించి యంతఃపురంబున నున్నయన్నరనాథుం గనుంగొని కృతప్రణాముం డగుటయు నతం డాదరించిన నాసీనుం డై. 2

క. బలవిక్రమములు వినుతం,బులుగా మనమొనలుఁ బాండుపుత్త్రానీకం
బులు రెండునాళ్లు పోరుట, దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. 3

వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి. 4

చ. సరకుగొనండు పాండుసుతసైన్యనికాయము నించుకేనియుం
గరులు రథంబులున్ హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకుమాఱియు నల్లడఁ బాఱియున్ వియ
చ్చరులకు వేడ్క సేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. 5

వ. చూపి యక్కౌంతేయులం గలంచి యాడి పడంబడి. 6

తే. తనకు [2]బిమ్మిటి యైనయర్జునునిబాహు,లీల నెమ్మెయిఁ ద్రోవంగరాక తెగియె
నధిప యాఁబోతు బెబ్బులికిఁ గగ్గ మైన,పగిది[3]యై పాండవులకును బగ యడంగె.

వ. అనుచు శోకోపహతుం డై సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. 8

చ. అదియొకఁ డేల కౌరవచయంబుల యాశ యడంగిపోవ [4]బె
ట్టిదుఁ డగుభీమసేనుఁడు గరందిమగంటిమి నున్నసేనను

---

1. క. రాసురక్త. 2. గ. (బిమ్మట యైన. జ. మిక్కుట మైన. 3. జ. యయ్యెఁ బాండవులకుఁ బగ.

ర్మద మడఁగించి పేరురము వ్రచ్చి మహోగ్రతఁ ద్రావె నెత్తు[1]ర
య్యది దుది నింత వుట్టు నని యాప్తజనంబులు మున్న చెప్పరే. 9

తే. కొడుకు లంతరాజ్యంబును గొనఁగ శక్తు, లనుదురాశను వారలయవినయములు
నీ వుపేక్షింతు మానునే యావిరుద్ధ, కర్మమున ఫల మొందక కౌరవేంద్ర. 10

వ. అనిన విని యాంబికేయుండు దుర్యోధనుండును దెగియనకాఁ దలంచి విహ్వాలించి
మూర్ఛిల్లినం దల్లడిల్లి యార్తనాదంబులతో వివశంబు లయి వనితాజనంబులు
గన్నీరు గ్రమ్మ వసుంధర నొఱగిన నంతకు మున్న వచ్చి యున్నవిదురుండును నా
సూతనందనుండును జేరి చేసేత శీతలజలసేచనమృదువ్యజనవీజనంబుల సన్నర
నాథుని నారీసముదయంబును సేద దేర్చిన నాసీనుం డై యతండు దీర్ఘనిశ్వాసంబు
లడరం జింతిల్లి యంతర్గతంబున దైవంబు గర్హించి పాండవుల నగ్గించి తనబుద్ధియు
శకుని వెరవును నిందించి తన్నుం దాన యుపశమించుకొని ధైర్యంబు సిక్కం బట్టి.

క. తెలియ విన నీవు సెప్పిన, పలుకులు దుర్యోధనుండు పడఁడు గదా వై
రులవిక్రమమున సంజయ, కలహా పెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్. 12

చ. అనుటయు నాతఁ డిట్లనియె నమ్మనుజేంద్రున కాజిఁ గర్ణుఁడుం
దనయులుఁ దమ్ములుం బడిరి దారుణవిక్రమకేలి సల్పి నె
ట్టన బలుఁ బారఁ బట్టి వికటంబుగ వక్షము వ్రచ్చి దుస్ససే
నునిరుధిరంబు మారుతతనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్. 13

క. అనిన విని [2]ఘూంత కేమియు, నన కూరక యుండు సంజయా నీమాటల్
విన నేరదు విభ్రాంతిని, మునిఁగినయది చిత్త మని విమూఢాత్ముఁ డై. 14

వ. ధృతరాష్ట్రుండు మ్రానుపడి యుండి కొండొకసేపునకు సేద దేఱి యాసూతనంద
నుని కి ట్లనియె. 15

క. నాదుర్నయమునఁ జేసియు, నాదుర్యోధనునిబుద్ధిహానివలననుం
గాదె యిటు లగుట మర్మవి, భేదన మగుశోక మింత పెల్లయి యున్నే. 16

వ. దుఃఖంబు నిస్తరింప నోపుదునొకో యని తలంచుచున్న నాదుసంశయంబు వాయ
నింతకుమున్ను కయ్యంబునం గడచని మనవారిని వారివారిని నేర్పడం జెప్పు మనిన
నతనికి సంజయుం డిట్లను మనయందు భీష్మద్రోణకర్ణవికర్ణవృషసేనదుశ్శాసన
లక్ష్మణాదులును వారలలోన విరాటశంఖోత్తరద్రుపదఘటోత్కచాభిమన్యుపాం
డ్యప్రముఖులును [3]బేరువేర నిట్టిట్టివారిచేత నిట్టిట్టివారు దెగి రని యేర్పడ నెఱిం
గించిన నమ్మహీపతి కురుసేన నింక నెవ్వరు గల రని యడుగుటయు నతం డశ్వ
త్థామ కృతవర్మ శల్య శకుని కృపాచార్యులం బేర్కొని బ్రదికినకురుకుమారులను

---

1. గ. రెయ్యది. 2. జ. యంతకేనియు. 3. గ. పేరువేఱ యిట్టిట్టి.

గర్ణుకొడుకులలో నున్నవారలను మఱియుం గలయోధులను జెప్పి వీరలం గొని
యనికి నుత్సహించి పొనుఁగువడ్డయగ్గివేఁడిమివోనివాఁడిమిలో దుర్యోధనుండు
ధైర్యం బవలంబించి జయార్థి యై యున్నవాఁ డనిన విని కొడుకుకడిమికి వెడవెడ
యూఁఅడిల్లినయుల్లంబునం దనవారు పెక్కండ్రు వొలిసినయలమట మునింగి
యొక్కింతప్రొద్దూర కుండి రాధేయుదెగుట దలపోసి యమ్మనుజనాథుండు. 17

తే. అలలోనియాఁబోతునుకఁబోలె నొప్పుఁ, గురుబలంబులో నున్నదకద్విరదమూర్తి
సింహసంహననుండు నిస్సీమవిక్ర, మాభిరాముండు వోయెనే యక్కటకట.

వ. అని తొడంగి హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు. 19

క. సంజయ మురభంజనుని ధ, నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుం జెనకి యైన గెలుతు న, నుం జచ్చెనె యట్టివాఁడు నేనుం గయ్యమునన్. 20

ధృతరాష్ట్రుఁడు కర్ణమరణంబు విని పలవించుట.

సీ. పాండుసూనులతోడి కపగ కోర్చె నెవ్వని, యుత్సాహ మూఁది సుయోధనుండు
వైదేహపౌండ్రాదివసుధేశు లెవ్వని, కడిమిసొంపున నరిఁగాఁపు లైరి
మనమూఁక లెవ్వని పెనుఁబ్రాపు గాంచి గ, ర్వితము లై సంగరక్రీడ సలుపు
నద్భుతం బొనరించు నమరుల కెవ్వని, యసమానవివిధదివ్యాస్త్రమహిమ

ఆ. యట్టికర్ణుఁ డీల్గె.[1]నట్టె యిం కెక్కడి, బ్రదుకు మనకు నేటిభండనంబు
దీని వినియు నాదుమానసం బేమియుఁ, గాదు వజ్రమయము గాఁగ నోపు.

వ. అని [2]విలాపించి మఱియును. 22

క. పోరి బంధుపుత్త్రమిత్త్రుల, పరిభవములు వించు నిట్లు ప్రాణముతో న
వ్వారు నుండుదు చే యే నొ, క్కరుఁడును దక్కంగ నింతకష్టం బగునే. 23

వ. అని పలికి మరణోద్యుక్తుం డై జలాగ్నివిషప్రాయోపవేశాదు లుగ్గడించిన విని
సంజయుం డతని కిట్లనియె. 24

చ. కులమును శ్రీయుఁ దేజము నకుంఠితకీర్తియు జూడఁ దొంటిరా
జుల కెన వత్తు నీ విటులు శోకసమాకులచిత్తవృత్తివై
గలఁగుట యొప్పునే శ్రుతము గౌరవముం బొగ డొందునట్లుగా
నిలుపుము ధీరతాతిశయనిష్ఠఁ జలింపక యుండ భూవరా. 25

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 26

తే. శోకవారిధిపారంబు నాకుఁ బొంద, నేల వచ్చుఁ జిత్తంబునఁ గీలుకొని య
సహ్య మై కర్ణమరణోపజనిత మైన, పరిభవం బనుశల్య మాతురతఁ జేయ.

క. పౌరుష మేటికి దైవం, బేరూపునఁ జూడ ఫలద మే మందము నో
స్సారనితాంతోజ్జ్వలుఁ డగు, నారాధేయుండు సచ్చె [3]నర్జునుచేతన్. 28

1. గ. వంటి విం కెక్కడి, భండనంబు దీనిఁ బరఁగ వినియు. 2. క. పలవించి. 3. ఇ. నకొ యర్జునుచేన్.

క. అలఘుతరాయువు నాకుం, గల దది యె ట్లనినఁ బోరఁ । గర్ణునిపాటేఁ
దెలియ వినఁగ నాడెందము, పలువఱియలు గాక యున్న । భంగి నెఱిఁగితిన్. 29

క. మును లోకముచే సత్కృతి, గని నెగడెడువాఁడ నాకుఁ । గలవా రెల్లం
జన శోచ్యుఁడ నై దుర్దశ, నునికి మనికి యగునె దీని । కోర్వఁగ వశమే. 30

సీ. దుఃఖపరంపర । [1]ద్రొక్కఁ బెట్టె నా, చిత్తంబు ననిమిష । సింధుతనయు
పడుటయు ద్రోణుండు । పరలోకమున కేఁగు, టయుసూతజుని తెగు । టయును విని యు
నందుఁ గర్ణుఁడు లేమి । యత్యంతదుఃఖంబు, సేసె దుర్యోధను । నాస మానె
నతఁ డేదుగడయును । నై యుండు నతనికి, నెవ్వరు గలరు ది । క్కింకఁ జెపుమ

ఆ. మనబలంబు చేవ । యును వైరిసైన్యంబు, భయముఁ జెడఁగ రాధ । పట్టి గొంతి
పట్టిచేత సమసి । పడి యున్నవాఁడె వా, సవునికడిమిఁ బడిన । జంభునట్లు. 31

క. విను [2]పిచ్చుకకుం టతిరయ, మునఁ బోకకుఁ బడుట పేద । ముదుకఁడు వేశ్యా
జనముం గోరుట దుర్యో, ధనుఁ డింక జయంబు గోసఁగఁ । దలఁచుట యరయన్.

క. మనలోఁ గయ్యం బేటికి, నని ధర్మసుతుండు సెప్పె । నది మీపతి కై
కొనఁ డయ్యె రోగి పథ్యా, శనమునకుం జొరనిభంగి । సంజయ యెట్లున్. 33

సీ. శరతల్పమున నుండి । శాంతనవుండు బీ, భత్సుదివ్యాస్త్రవై । భవము దెలుపఁ
దివిరి జలం బట్లు । దెప్పించికొని యష్ట, పాండుసూనులతోడి । బాంధవంబు
నడపుము సిరి పంచి । కుడుచుట మే లింత, తోఁ గయ్య ముడిగి శాం । తుఁడవు గమ్ము
బ్రదుకుము నీ నన్న । పనుపు సేయఁడు సుయో, ధనుఁ డిప్డు శోకాబ్ధి । మునుఁగకున్న

ఆ. పడుచు లీఁక లూడ్చి । పట్టి యాడెడునట్టి, పులుఁగుచంద మయ్యెఁ । దలఁప నాయ
వస్థ యెందుఁ జొచ్చు । వాఁడ నీయలమట, దీర్ప నెవ్వ రింక । దిక్కు గలరు.

వ. అని పెక్కుభంగుల నివ్వటిలు నెవ్వగలు బయలుపడం బలుమాటలాడి గాఢేయు
తెగిన తెఱంగు తెలియ విసం దలంచి యి ట్లనియె. 35

మ. విజయుం దాఁకి పెనంగుచో నతనిదో । ర్వీర్యంబు సైరించెనో
భుజదర్పోద్ధతిఁ జూప నోపెనొ చలం । బుం జేవయుం సైన్యయు
గ్మజనంబుల్ వినుతింపఁ బేర్చెనొ తొలం । గం బాఱెనో పేరు న
క్కజపుం బెంపును వేఱిఁడింపఁడు గదా । కర్ణుండు దీనాకృతిన్. 36

క. తక్కటిసైనికు [3]లని న, య్యొక్కని దిగ విడిచి పాఱి । రో లావుం జే
రుక్కును మెఱయఁగఁ దోడ్పడి, పెక్కండ్రురు వడిరొ బెరసు । బీనుంగులు గాన్.

వ. అని మఱియును. 38

క. ముందర శిఖండి నిడి సం, క్రందనసందనుఁడు సేరి । గంగాతనయుం
మ్రుందించెఁ గపటమున నా, చండ మొకటి కన్ననందుఁ । జర్చించిరోకో 39

క. సామజము పడిన నశ్వ, త్థామ పడియె ననఁడె ధర్మ । తనయుఁడు గురునిం

---

1. క. త్రొక్కఁ బెట్టు. గ. త్రొక్కఁడు వెట్టు. 2. గ. పిచ్చుకుంటి యతిరయ. 3. గ. లాఁతని, నొక్కని.

దా మడియించుటకై యు, ట్టేమేని నొనర్చిరొక్కొ యితఁడు వడుటకున్. 40

క. మాయోపాయంబుల గాం, గేయుండును గురుఁడు నని దెగిర రాక రణ
న్యాయంబు దప్ప కుండఁగ, నాయిరువుర నోర్వ నెవరి కైనను వశమే. 41

సీ. పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్రహ్మాస్త్రంబు సర్వముఖాస్త్ర మలఁతిఁ
బోవునె దివ్యాస్త్రములు పెక్కు మఱియును, గలవు రాధేయున కలవు మెఱసి
యభిమన్యువిల్ దునుమాడఁడె నాఁగాయు,తప్రాణు ననిలనందనుని బాడు
దలఁ బట్టి సహదేవుఁ జులుకన మర్దించి, మందల విడువఁడే మాయలాని
తే. మేటిమగని ఘటోత్కచు గీటడఁపఁడె, యట్టిజెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి
నయ్యెఁ దేరికిసూతువ కంచితాస్త్ర,ములకుదైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ.

క. రథ మవితథ మైనను సా,రథిపని నెఱసిన మహాస్త్రరాజి విధికృతిఁ
వృథ గా కున్నను గర్ణుని, బ్రథనంబున గెల్వ దేవపతికి వశమే. 43

ఉ. సారథి యెవ్వఁ డాతనికి శల్యుఁడు ద్రోణతనూభవుండు గాం
ధారవిభుండునుం గృపుఁడుఁ దత్సమయంబున నేమిభంగిఁ దో
డై రి సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మ దర్పము
స్థిరము నచ్చి యుండుఁ దగ నెయ్యము సూపెనె యాతఁ డత్తఱిన్. 44

క. వారలు గెలుఁకుల నడపఁగ రారాజు పిఱుందఁ గదిసి రా నెబ్భంగిం
గారణము లేదు చావఁగ, నారాధేయునకుఁ జోద్య మయ్యెడుఁ దలఁపన్. 45

ఉ. పాండవకోటి సూతసుతుపై నడతెంచినచంద మెట్టు లా
ఖండలసూతి సర్పముఖకాండము తాఁకున రూపుమాసి పో
కుండుట యెట్లు గల్గె సమరోద్ధతి దక్కటినల్వురందు నె
ట్లుండె బలద్వయంబు నెటు లోపి పెనంగె దినద్వయంబునన్. 46

వ. అనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియెఁ గయ్యంబు తెఱంగు మొదలు
కొని చెప్పెదనాకర్ణింపుము ద్రోణుండు దెగిన నశ్వత్థామ దన యోపినంతసమరంబు
సేసి చాలించి సేనలఁ దివియించి మరలి వచ్చిన దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చి
యుండి యశ్వత్థామ లోనగుదొరలం గలయం గనుంగొని మనకు నిటమీఁదఁ
జేయం గలపని యెయ్యది యని యడుగుటయు నగ్గురుసుతుండు. 47

క. విను మాదర ముత్సాహం, బనూనధార్ష్ట్యంబు నీతి యనుసద్గుణముల్
పని సఫలం బగునట్లుగ, జననాథ యొనర్చు దైవసాహాయ్యమునన్. 48

చ. తలఁపఁగ సద్గుణంబులకుఁ దావల మై పెను పొందునుజ్జ్వలా
త్ములు సని రైన [1]చేభరము దోఁపఁగ నీ దగుతోంటిశౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ దైవముతోడుపాటునుం

---

1. క. నేభరముఁ దోఁపఁగ నీక తోడంగి కార్యముం.

గలిగెడుఁ గాక యున్నరథికప్రవరుల్ గలపోయ నల్పులే. 49

క. మనము బలశౌర్యఘనుఁ గర్ణుని సేనాముఖము సేసి కనూలొల్కొని యరిమ
ర్దన మొనరింత మితనియం, దనూనతం బొల్చు సద్గుణావలియు నృపా. 50

క. వైనస్వతుచందంబున, నీవీరుఁడు రిపుబలంబు నెల్ల నడంపం
గా వలఁతి దివ్యశరశి,క్షావైభవపరమనిష్ఠకలిమి నరేంద్రా. 51

వ. అని సూతపుత్త్రుం జూపిన భవత్పుత్త్రుండు ప్రీతుం డయి యతండు పాండవుల
జయించు ననునాస యగ్గలం బైనయంతరంగంబుతో నయ్యంగపతి కిట్లనియె.

శా. నీవిక్రాంతియు నాపయిం గలయతిస్నేహంబుఁ బ్రఖ్యాతముల్
గావే భీష్ముఁడు ద్రోణుఁడుం దెగుట నీకౌరవ్యసైన్యంబులం
గావంగాఁ దగు నీకు వారలయుపేక్షం గాక యిన్నాళ్లు లే
లా వైరం బడఁగింప నీ వయిన లీలం గెల్తు కౌంతేయులన్. 53

వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు విశేషించి నా కేడుగడయు నీవ కావున నీకును
మదీయహితం బవశ్యకర్తవ్యం బట్లుం గాక మన మాభీష్మద్రోణుల నవమానిం
తుము వారలు భండనంబునం బడిన నొదిఁగి యుండ నేర్తుమే కడంగుము పగఱకు
నీకడంకచీఁకటికి సూర్యునుదయం బెట్టి దట్టిదయ్యెడుంగాక బృందారకసేన సేనాని
నడపినకైవడిం గౌరవసైన్యంబు నడపి నన్ను గెలిపింపుము నిన్ను నీవ సర్వసేనాధి
పత్యంబునకుఁ బట్టంబు గట్టికొమ్మనినం బ్రీతుం డై రాధేయుండు గాంధారే
యునకుం బ్రహర్షంబు గా భూవల్లభు లెల్ల నాకర్ణింప నిట్లనియె. 54

మ. విను నీ కిచ్చిన బాస యే మఱతునే నీ వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీభూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్త్రుల మనోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయం బైనసంగ్రామమున్. 55

## దుర్యోధనుఁడు గర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట.

వ. నన్ను సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు మనవుడుఁ బొంగి రారాజు దగు
రాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలంబులు దెప్పించి మహనీయ
మణికుసుమాపధిగంధాక్షతమంత్రకలనం బాచరించి సమున్నతౌదుంబరపీఠంబు
నం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి పుణ్యాహఘోషంబులుఁ
దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి యలంకరించి పట్టంబు
గట్టిన నతండు [1]భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దాన
త్యాగరూపంబున నొసంగుచు వెలింగె నప్పు డుబ్బిననూర యోధులజయజయ
శబ్దంబులును భూపతులయభినందనవాక్యంబులును గృష్ణసమేతు లగుపాండవుల
గెలువు మని దీవన లిచ్చుమాగధులమెలుంగులును నింగి ముట్టి [2]ననోదితుం

1. గ. భూసురార్థులకు వందిమాగధజనంబులకు. 2 గ. నభోదధితుఁ.

డై నభానుంపునుంబోలె శోభిల్లునాకర్ణుండు సముదీర్ణుండై యక్కురుపతియాననం బాలోకించి. 56

తే. బంధుమిత్రయుతంబుగఁ బార్థు రూపు, మాపి యే నిత్తు నీకు సామ్రాజ్యలక్ష్మి ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ బుత్రపౌత్ర, గాఢభోగార్హ మగునట్లుగాఁగ నధిప.

క. విను [1]సత్యధర్మరతుఁ డగు, మనుజునకుం గార్యసిద్ధి మసలక యగుచా డ్పున శౌర్యబాహువిక్రమ, ఘనుఁ డగునా కాజి జయము గలుగుం జులుకన్.

వ. అని పలికి నిత్తెఱంగున రాధేయు సర్వసైన్యముఖ్యుం జేసి యతనిమందిరంబు నకు మహావిభవసమేతంబుగాఁ బుచ్చి సమస్తపరిజనంబులను నిజనివాసంబులకుం బోవంబనిచి సంతోషం బంతరంగంబు నిండ నదసంబున వెల్లిగొన నీకొడు కభ్యం తరావాసంబున కరిగె నారాత్రి యే నిట వచ్చి ద్రోణువృత్తాంతం బంతయు నీకుం జెప్పి నీ వనుప మగిడి చని సూర్యోదయసమయంబున మనశిబిరంబు ప్రవేశించితి నయ్యవసరంబున. 59

సీ. తళతళ మని మెఱుం [2]దంతప్రభలతోడ, ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ హంసవర్ణము లైనహయములపటుగతి, నర్కప్రభం బగునరద మొప్ప దీప్తకాంచనరసలిప్త మై చెలు వొందు, సజ్యకార్ముకము హస్తమున వెలుఁగ వీఁకకి సమరసమాటోప మొదవ నా, భీలశంఖము దన మ్రోల మ్రోయ

తే. రణసముత్సాహలక్ష్మి వక్త్రమున వింత, చెన్ను వెలయింప నాప్తులు సేరి రెండు పక్కియలయందు బవరంపుఁబలుకు లెసఁగ, నడవ సాంప్రతికర్ణుండు వెడలె నధిప.

వ. అతండు పడవాళ్లం బనిచి వెడల నియమించిన నెల్లదొరలును దురంబునకుఁ వెడలి రిట్లు సకలబలంబులు నడవం దొడంగిన. 61

సీ. తురగరింఖాముఖో[3]ద్ధూతధూళీపట, లములు నల్దిక్కు లలంకరించె మాతంగకటగళన్మదజలబహుళప్ర, వాహవిలాసంబు వాని నడఁచె బహువిధవాదిత్రభైరవారావంబు, పెల్లంబరము పిక్కటిల్లఁ జేసె శింజినీటంకారసింహనాదంబుల, పెక్కువ యామ్రోఁతఁ [4]బిలుచుకొనియె

ఆ. రథికభూషణములరశ్ములఁ గేతన, చ్ఛత్రచామరోపసక్తమణుల రుచుల సుభటహేతిరోచులఁ బవలింటి, దివియచందమయ్యె దినకరుండు. 62

వ. అట్టియెడ. 63

క. జనములు భీష్మద్రోణులు, సనినవగలు డిగ్గద్రావి సంతోషము నె క్కొని మెఱు [5]మనములతోఁ గ, ర్ణుని గనుఁగొని రతివికాసరుచిరనయను లై.

—కర్ణుని మొదటినాఁటియుద్ధము.—

వ. ఇవ్విధంబున బలంబులకుం బ్రమోదం బెసంగ నడచి రాధేయుండు దుస్సహం

1. గ. మాతిథ్యరతుం డగు. 2. జ. ధవళప్రభల. 3. క. ధ్ధుతధూళిపటలంబు. కలయఁగ దిక్కులఁ గప్పె మత్త, మాతంగ. 4. క. బీర్చుకొనియె. 5. ఖ. మనములఁ గర్ణునిఁ, గనుఁగొని రతిరుచిరమదవికాసనయను లై.

బుగా మకరవ్యూహంబు సమకట్టి నెడ నందుఁ దుండంబునఁ దాను నిలిచి నయ
నంబుల శకునియు నులూకుండును శిరంబున నశ్వత్థామయుఁ గంఠంబున దుర్యో
ధనానుజులును నుదరంబున దుర్యోధనుండును ముందట వామపాదంబున నారా
యణగోపాలయుతుం డై కృతవర్మయు దక్షిణపాదంబునఁ ద్రిగర్తదాక్షిణాత్య
సంవృతుం డై కృపాచార్యుండును వెనుక డాకాల నానాదేశసేనలతోఁ శల్యుం
డును వలకాల ననేకరథకరితురగసమేతుం డై సుషేణజననాథుండును బుచ్ఛం
బున మహాసైన్యసమగ్రుం డయి చిత్రుండును నతనితమ్ముం డగు చిత్రసేనుండును
నిలుచున ట్లొనర్చి తక్కినవారల [1]నెడ నెడం బన్నించె నట మున్న యుధిష్ఠిరుం
డుద్దామసామజాదిచతురంగోల్లాసభాసితుం డయి నడతెంచె నట్లు నడతెంచి
యమ్మనుజవిభుండు మన మొనం జూచి సవ్యసాచి కి ట్లనియె. 65

చ. కనుఁగొనఁ జుల్కనై నయది కౌరవసైన్యము గంటె సూతనం
దనుఁ డొకఁ డొడ్డుగా నిలిపి తాను ముఖంబున నిల్చి కయ్య మె
ల్లను దనమీఁదఁ బెట్టికొని లావును బీరముఁ జూపఁ బూని యే
పున నజిమెఱఁ భవద్విశిఖపుంజములం దెగటార్పు మీతనిన్. 66

క. వనమునఁ బండ్రెండేఁడులు, మన [2]ముత్కటదుఃఖవార్ధిమగ్నుల మై యు
ట్లునికికిఁ దగ నితని భవ,త్సునిశితబాణాబ్ధి ముంపు దుర్దమలీలన్. 67

ఉ. [3]వీఁ డొకరుండె యింక బలవిక్రమసంపద గల్గి పోరిలోఁ
వాఁడిమిసొంపు సూపఁ గలవాఁడు సుయోధనుపాలఁ బేర్చు నీ
వేఁడిమి సూపి రూపడఁపు వీనిఁ బురందరపుత్త్ర యంతతోఁ
బోఁడిమి మాలు నాతఁడు ప్రభూతజయోన్నతి నిల్చు నీకడన్. 68

వ. నీకుం బోలిన మొగ్గరంబు గావింపు మనవుడు నర్జునుం డర్ధచంద్రవ్యూ[4]హవిధా
నంబున మోహరించి తాను మధ్యప్రదేశస్థుం డై వామదక్షిణశృంగంబుల భీమ
ధృష్టద్యుమ్నుల నిలిపి యుధిష్ఠిరనకులసహదేవులం బింగలి గా నొనర్చె నతని
చక్రరక్షకు లగుయుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపువేడుక
మొగంబులం జిగు రొత్తఁ బొలిచిరి తక్కినయోధులుం దగినచోట్ల నిలిచి రి
ట్లిరువాఁగును బన్ని యున్నసమయంబున. 69

చ. హరియును బాండునందనులు నాజి నవశ్యము నేఁడు సూడఁ బో
దురు జము నంచు నాత్మఁ బరితోషముఁ బొందె భవత్తనూజుఁ డుర్
దురమునఁ గర్ణయుక్తముగఁ ద్రుంగు సుయోధనుఁ డన్ తలంపుతోఁ
బరమసముద్యమస్ఫురణఁ బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా. 70

ఆ. ఒకటి కొకటి కంటె నుబ్బుచు వర్తించు, చాడ్పు దోఁప రెండుసైన్యములును

---

1. క. నెడనెడలం బన్నించె-జ. కలయం-బన్నించె నంత నక్కడ యుధి. 2. క. మొక్కటి; చ. మాదట. 3. క. వీఁ డొకరుండు దక్క...సుయోధనుపాల లేమి. 4. క. హాభిధానంబున.

[1]బొలిచె నపుడు సెలఁగెఁ భూరిభేరీముఖ, తూర్యములు నభంబు దూఁటుకట్ట.

వ. చిందంబులమ్రోఁతకు నిందు నందనుం దమకించి భటులు గెలంకులం దాఁకఁ
దోడ్తో నెఱసినయగ్గలిక నొండొంటి బెరయ మొగ్గరంబు లురవడించిన. 73

సీ. నిబిడఘంటావళీనిక్వణంబులతోడ, భీషణబృంహితఘోషములును
ఘననేమినిష్ఠురధ్వనుల[2]పొందునఁ గేతు, నిర్భరకింకిణీనినదములును
జటులఖురవ్రాతపటురవంబులతోడ, నాభీలహేషామహాస్వనములు
భూరిభుజాస్ఫాలనారావములతోడ, మేదురతరసింహనాదములును

ఆ. బరఁగి దిక్తటములఁ బగిలింప ననిమిష, ఖచరసిద్ధయక్షగరుడగణము
లంతరంగములు నితాంతకౌతుకభరి, తములు గాఁగఁ జూడ్కి[3]గములు వఱపె.

వ. ఇట్లు దలపడి యిరువాఁగును [4]బేరువాఁడిఁ బోరునెడ గరుడప్రహారంబుల
నొచ్చినపంచాస్యపన్నగంబులంబోని బాహువులనుగాంతత్వరుచిసౌరభంబుల పెం
పున సంపూర్ణచంద్రార్కకమలంబులం గ్రేణి సేయునాననంబులను సంగ్రామ
రంగం బలంకృతం బయ్యె వాహనంబులమీఁద నుండి భూషణకిరణంబులు మెఱ
య సైనికులు నేలం గూలునప్పుడు పుణ్యావసానకాలంబున నాకలోకపరిభ్రష్టం
బగుమహాత్మలోకంబుచందంబు దోఁచెఁ జతురంగంబులునుం దమతమజాతిచేతం
బడుటయు నేనుంగు లడరిన నరదంబులు సదియుటయు నాశ్వికులు వోదివిసం
గరులు ధరం దొరంగుటయు భటు లురవడించినం దురంగంబులు గడికండంబు
లగుటయు రథంబులు గవిసినం గాల్బురు దుము రగుటయుఁ గ్రందున నెల్ల
తెఱంగులు నన్నిదెఱంగులం గలయ బడలువఱుచుటయు రౌద్రరసంబుఁ [5]బెనిచె
నాసమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన ద్రౌపదేయులు ప్రభద్రక చేది
పాండ్య చోళ మగధ వంగాది దేశంబులబలంబులతోడ బరవసంబు సేసి తఱిమి
రట్టియెడ. 74

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడతేర దర్పదు
ర్దాంతగజాధిరోహణనితాంతసముజ్జ్వలభంగిఁ బ్రాభవి
క్రాంతివిలాస మొప్పఁగ నఖండితపౌరుషుఁ డైనభీముఁ డ
త్యంతసముద్ధతిం గవిసె నస్మదనీకము సంచలింపఁగన్. 75

క. ఉదయాచలమున రుచిసం, పదఁ బొలుచుపతంగుపగిదిఁ బ్రసరత్తీవ్ర
ప్రదరములు నెఱయ మెఱయఁగ, మదావళముమీఁద వెలిఁగె మారుతి యధిపా.

క్షేమధూర్తి యనురాజు భీముతో యుద్ధము సేసి చచ్చుట.

వ. అమ్మహావీరు నాలోకించి కులూతదేశాధీశుం డయినక్షేమధూర్తి నిజబలంబులం
బురికొల్పికొని యేచి త్రోచి యాహ్వానంబు సేసి తనకరటిం గొలిపిన నది గిరి

1. గ. బొదలినట్లు సెలఁగెఁ జదల భేరీముఖ. 2. గ. తోడుతఁ గేతు. 3. క. తగులుపఱిచె.
4. క. బేరు వాడి-జ. బేరువాడ- ట. బేరువాడుచు-పంచాస్య. 5. క. బెరసె; జ. వేర్చె.

గిరిం దాఁకు తెఱంగున నతనిమాతంగమునకు మార్కొనియె నయ్యిరువురు నొండొ
డొరులపైఁ దోమరస్తోమంబు లడరించి యార్చుచు నుద్దండవరాక్రమంబు లగు
వేదండంబులప్రచారంబులు చారుభీషణంబులుగా నొక ళ్లొకళ్లం జుట్టుకొని
వచ్చుచుం బెనంగి. 77

క. కోదండంబులు గొని బాహాదర్పము లెసఁగఁ బోరి యన్యోన్యధను
శ్ఛేదంబులఁ బోరిఁ బోరి నాపాదించిరి [1]రయము జనులు ప్రస్తుతి సేయన్. 78

వ. దానం గోపం బగ్గలించి. 79

తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ, బోరుచో భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వలతోమరంబు, [2]లేడు నాటించె దర్పంబు రూఢి కెక్క.

చ. అనిలతనూభవుండు దపనాంశునిభం బగుతోమరంబు వై
చిన నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి వీక నా
తనిఁ బటుమష్టికాండపరితాడితదేహునిఁ జేయ మేటివిల్
గొని యతఁ డక్కులూతపతికుంజరమున్ వెసఁ గప్పె నమ్ములన్. 81

వ. అట్లు భీమసేనుండు గరూశపతివిక్రమంబు సరకుసేయక యతనిదిక్కునుం జూడక
క్షేమధూర్తిసామజంబును సాయకమయంబుఁ జేసిన నది మొగతిరిగి పఱచినం బో
వనీక యప్పావని వెనుకొనుటయు నక్కులూతపతి ప్రయత్నంబున నమ్మాతంగంబు
మరల్చియతనియంగంబుననుదద్గజంబుశరీరంబుననునిశాతశరపరంపరలువఱపిన.

చ. ఉఱక సమీరసూనుఁడు దదుగ్రధనుర్దళనం బొనర్చి యే
త్తెఱఁ గరి నొంప నాతఁడు గడిందిమగంటిమి నొండువింట ను
న్మెఱుఁగులు [3]గ్రమ్ముకోల నతనిం గడు నొంచి తదీయహస్తి పా
ల్పఱి మహి మ్రొగ్గ నేసిన ధరాధిప నీబలు మార్చె నుబ్బునన్. 83

మ. గద సేతం గొని దంతి డిగ్గి చని యాశాంతేయుఁ డవ్వీరు ను
న్మదమాతంగముఁ గూల నేసినఁ గృపాణస్ఫారదోర్దండుఁడై
కదియన్ వచ్చి యతండు నిష్ఠురగదాఘాతంబునం గూల్చె నే
పు దలిర్పన్ వెస నామరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా. 84

వ. ఇవ్విధంబున నేనుంగుపీనుంగుకడన పడినక్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన
కులశైలంబుసమీపంబున నిర్ఘాతపాతపతితం బయినకంఠీరవంబుకరణి నొప్పె
నతనిం గనుంగొని మనమొన వెఱచఱచినం బాండవబలంబులు వెనుకొనుటయు.

మ. పటుబాణప్రకరంబు లంబరముఁ గప్పం గ్ణుఁ డాసేనఁ దాఁ
కుటయున్ సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్నన్ భుజాసంపదు
త్కటగర్వోద్ధురభంగిఁ బాండుసుతులున్ దర్పంబు సొం పేర్పరిం

---

1. గ. °రణము. 2. గ. రెండు...రట్టిగాఁగ; జ. లేడు...వేడు కెక్క; ట. లేడు...మాడి కెక్క. 3. క. గ్రమ్ముకో నతని మే న్గడు.

చుటకుం జొచ్చినఁ బేర్చెఁ బో రనిమిష౯స్తోమాద్భుతాపాది యై. 86

వ. అందు. 87

క. సూతతనయనారాచ,స్యూతము లై వారణంబు ౯ లోఁ ఱలును సొగయున్
భూతలమునఁ బొరలుఁ బెరలు, వే తూలును జిఱ్ఱఁ దిరుగు ౯ విచ్చుం బచ్చున్.

వ. అప్పుడు నకులుం డతని మార్కొ-నియె భీమసేనుం డశ్వత్థామను సాత్యకి కై
కేయులగువిందానువిందులను జిత్రసేనుం డనురాజు శ్రుతకర్మను బ్రతివింధ్యుండు
చిత్రుండనుమనుజనాథుని ధర్మపుత్త్రుండు దుర్యోధనుని ధనంజయుండు సంశప్త
కులను ధృష్టద్యుమ్నుండు గృపాచార్యుని శిఖండి గృతవర్మను శ్రుతకీర్తి శల్యుని
సహదేవుండు దుశ్శాసనునిం దలపడి రట్టియెడ. 89

సీ. కైకేయుఁతోడ విం౯దానువిందులు మహా,హవము సేయంగ న౯య్యాదవోత్త
ముఁడు పేర్చి వారికా౯ర్ముకములు రెంటిని, దునిమి యంగంబుల ౯ నినిచెఁ దూపు
లవ్వీరు లన్యశ౯రాస[1]నోద్ధారు లై, యతనిపైఁ బఱపిరి ౯ శితశరంబు
లతఁడును వారు న౯న్యోన్యచాపచ్ఛిదా,వైచిత్రి నొప్పారి ౯ రేచి డొడ్డ
తే. విల్లు గొని యతిరయమున౯భల్లనిహతి, నాతఁ డనువిందుతల ద్రుంప ౯నది ప్రదీప్త
రత్నకుండలశోభాభి౯రామ[2]పతన,భంగిఁ దదనీకశోకసం౯పాది యయ్యె. 90

మ. కని విందుండు ప్రదీప్తచాపధరుఁ డై ౯ కాండప్రసారంబులన్
శినివీరుం గుసుమాఢ్యకింశుకసముం ౯ జేయంగ నయ్యోధుఁ డా
తనియంగంబులఁ బంచవింశతిశితా౯స్త్రంబుల్ వడిన్ గ్రుచ్చె నే
పున వా రొండొరుసూతులం దునిమి ని౯ప్పుల్ రాలుకన్దోయితోన్. 91

తే. ఒకళు లొకళులహయముల ౯ నుర్విఁ గూల్చి
యొండొరులకార్ముకమ్ములు ౯ ఖండితములు
సేసి తేరులు డిగ్గి రు౯ద్భాసితాసి
చర్మశోభితహస్తు లై ౯ సరభసముగ. 92

వ. ఇట్లు పాదచారు లై మండలప్రచారంబుల మెఱయుచు. 93

క. చేరి బహుచిత్రగతులం, బోరంగా నొడ్డనములఁ ౯ బొలిసెం బలకల్
నేరిమి మై [3]గెళవున శిని,వీరుం డిరువఱియ గాఁగ ౯ విందుని వ్రేసెన్. 94

వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి సాత్యకి యుధామన్యు తేరెక్కి యుక్కున వేఱొ
క్కరథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ జిత్రసేనుం
డును నీమనుమం డగుశ్రుతకర్మయుం బెనంగు నెడ [4]నాశ్రుతకర్ముఁడు. 95

క. ఆరాజు నైదువాలిక, నారసముల నొంప నతఁడు ౯ నవశరముల న
క్కారవుని నేసి నొంచెను, సారథి నైదింట నధిక౯సంరంభమునన్. 96

---

1. క. నోదారు లై; జ. నధారు లై. 2. క. భంగిఁ, బడియెఁ దదనీకశోకసంపాది యగుచు.
3. క. గెలువున. జ. గెడవున. 4. క. నాశ్రుతవర్ముఁడు.

సీ. శ్రుతకర్మ గోపించి క్రూరనారాచ మ, జ్జననాథుజత్రుదేశమున నాటఁ
బడి మూర్ఛపోయినఁ బైపయి వెండియు, నేయఁ దప్పి తె యతం డెసక మెసఁగ
నుక్కునఁ దునుమాడె నక్కుమారునిశరా,సన మతఁ డొండొకచాప మెత్తి
తఱచుటమ్ముల నేదు పెఱిగినచందంబు, సేసె రయంబునఁ జిత్రసేను

తే. వాతఁ డాతనియురమున శాతశరము
దూఱ నేయ నబ్బాలుండు దోఁచె వివిధ
బాణజాల మన్నరపతిశోణితమున
భల్లు మొక్కటఁ దల నేల డొల్ల నేసె. 97

ప్రతివింధ్యుఁడు చిత్రుఁ డనురాజుం జంపుట.

ఉ. ఏలినవానిపాటు గని యేడ్తెఱఁ దద్బల మొక్కపెట్ట యా
భీలతఁ జుట్టు ముట్టుటయుఁ బేర్చినయుద్ధతిఁ దీవ్రసాయక
జ్వాలల నేర్చి యుద్భటభుజావిభవం బలరంగ నల్లడం
దోలె నుదాత్తవిక్రమకుతూహలి నీమనుమండు భూవరా. 98

సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ డైదుబాణములఁ జి,త్రుని మేను నొంచి తత్తూణతువ
మునఁ గ్రూరశరములు మూఁడు నాటించి యొ,క్కమ్మునఁ గేతు వవ్వల్లార్చి పేర్చి
యతఁడు దన్నుగ్రసహాస్త్ర[1]పీడితుఁ జేయ,విలుద్రుంచి వెసఁ బంచవిశిఖనిహతుఁ
గావించి శక్తి యుగ్రమ్ముగ వైచినఁ, బెలుచ నాలుగుదునియలు గఁ జేసె

తే. నలిగి యాతండు గద వైచి యక్కుమారు
ఘోటకంబుల సూతునిఁ గూల్చె నదియ
పట్టుకొని వైచె మగుడ నప్పాండుపౌత్త్రు
చేయి వడి నుచ్చి పోవ నచ్చిత్రుఁ డధిప. 99

ఉ. బాహువు నొచ్చినం గినిసి భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప నతఁ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చి పోవుటయుఁ ద్రెళ్లె నరేశ్వర యవ్విభుండు వ
జ్రాహతిఁ గూలుపర్వతముచాకృతి నుత్కటవైకృతంబుగన్. 100

వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని మనయోధులు ప్రతివింధ్యుపై నడరి యనేకాస్త్రశస్త్రంబులం బొదివినం బొలివోనికలితనంబున నేల కుఱికి యక్కుమారుండు గోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు పర్వఁగింపఁ బాండవసైనికులు బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం దోడ్పడుటయు మనవారలు వెన్నిచ్చి పఱచి రప్పు డశ్వత్థామభీమసేనులసంగ్రామంబు భీమంబయి చెల్లె నందు. 101

క. గురుపుత్త్రుఁడు దొంబదిశిత,శరములఁ బావనిరథంబు సంవృతముగఁ జే

1. క. తాడితుఁ జేయ.

సెరయం బారఁగ సాయక, పరంపరలు వఱపె నతనిపై నతఁ డలుకన్. 102

వ. వాని మగిడించి. 103

క. అనిలజుఫాలము గురునం, దనుఁడు పటుప్రదరకీలితము సేయుడు నా
తనినిటలంబున నతఁ డేఁపున బాణత్రయము నాటె భూవరముఖ్యా. 104

వ. మఱియును. 105

చ. గురుసుతభీమసేను లతిఘోరవిధంబులఁ బోరి యొండొరుం
దెరలుప లేనిసామ్యమున దీపితులై లయకాలవిస్ఫుర
త్తరణియుగంబుఁబోలె శరధామసమగ్రతఁ బ్రజ్వరిల్లి యొ
ప్పిరి [1]రథచిత్రచారులఘుభీషణసంచరణంబు లొప్పఁగన్. 106

తే. వారి వీక్షించి ఖచరు లాపోరు లెందుఁ, జూడమే దీని కెన యని యాడఁ గలదె
కలుగ వితకను వీరలబలముఁ జలము, నలువు వెరవు నిట్లుండునే యనుచునుండ.

ఉ. ఒండొరుకేతువుల్ దునిమి యొండొరుసూతుల నొంచి యేపుమై
నొండొరు తేరివాహములయు బ్బడఁగించి నిశాతవిస్ఫుర
త్కాండచయంబు లొండొరులకాయములన్ వడి గ్రుచ్చి వ్రాలి ర
ప్పాండుసుతుండుఁ గుంభజునిపట్టియు మూర్ఛలు దమ్ముఁ గ్రమ్మినన్. 108

వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన. 109

క. అనిలజుసారథియును గురు, తనయునిరథచోదకుఁడు నతని నాతనినిం
[2]గొని యుల్లంబుల బలితపుఁ, దునుకు సొరఁగ ననికిఁ దొలఁగఁ దోలిరి రథముల్.

ఉ. క్రీడితనూజుఁ డైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కు ల
ల్లాడఁగఁ బోరుచో శరము లాఱయిదుల్ శ్రుతకీర్తి శల్యుమైఁ
గాడఁగ నేయ మూఁడుపటుకాండము లాతనిమేనఁ గ్రుచ్చి సం
తాడితుఁ జేసె సూతు నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్. 111

చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ము లేసి స
త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటె ని
ష్ఠురశరపంచకస్ఫురణ జూపినఁ గోప మెలర్ప నమ్మహీ
శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్. 112

వ. అట్టియెడ. 113

సీ. వేఱొక్కవిల్లెత్తి వివ్వచ్చుకొడుకు కఱు, వదినాలుగమ్ములు వఱపె మద్ర
పతిమేన నతఁడు తొంబదితూపు లడరించి, యేసె సవీరు శరాసనంబు
ఖండంబులుగ వాఁడు గం డడంగక గద, వైచినఁ బొడిసేసి యేచి శక్తి
నిగిడింపఁ దునుమాడె నిశితభల్లంబునఁ, ద్రుంచెఁ దదీయసూతునిశిరంబు

ఆ. వాయుజనములైన వాహంబు లప్పుడు, గలఁగి యరద మనికిఁ దొలఁగ నీడ్చెఁ

---

1. క. లఘుచిత్రచారపటుభీషణమార్గణభైరవంబుగన్. 2. క. గనుఁగొని యుల్లంబుల బలు, తొనఁకు.

దెలిపి గాంచి శల్యుఁ గడఁకమీఱఁ జొచ్చి క, లంచెఁ బాండుసుతుబలంబు నధిప.

సీ. కమలాకరము లీలఁ గలఁచి యాడెడుగంధ, దంతావళముసముద్దండతయును
దర మిడి మృగసముత్కరము ఘోరంబుగా, వధియించుకంఠీరవంబునేపు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ, గాల్చుదావాగ్నియుగ్రక్రమంబుఁ
బ్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ, యించుఫాలాక్షునికయ్యెడ్డెఱియును

ఆ. బోల్పఁ [1]బట్టు నయ్యె భుజగర్వశౌర్యప్ర, తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య, హననకేళి సల్పునవసరమున. 115

దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబు సేసి మూర్ఛిల్లుట.

ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు [2]మైగలి దుస్ససేనుఁడుర్
వీరులు పిచ్చలింపఁ బ్రజ వి న్నద్రువం బోరి నార్వఁ బోరుచో
వారక సాయకత్రయము వాఁడిమి నయ్యువరాజు నొంచె వి
స్తారమనోజ్ఞహారలసితం బగునాఘనబాహువక్షమున్. 116

చ. ధృతి వాగ డొంద నేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్తస
ప్తతిశరవిద్ధుఁ జేసి వడిఁ దద్రథచోదకు మార్గణత్రయా
హతుఁడుగఁ జేయ నల్గి వెస నాతనిచాపము ద్రుంచి యాతఁడు
ద్ధతి యలరంగ డెబ్బదిశితప్రదరంబుల మేను నొంచినన్. 117

సీ. నకులానుజుఁడు గృపాణంబున నైచిన, దుస్ససేనునివిల్లు దునియ లయ్యె
నెడ గని యవ్వీరుఁ డేచి బల్వింట మం, టలు గ్రమ్మన మ్మేయుటయు నతండు
గడువెస నెత్తినకరవాలమునఁ ద్రుంచి, యతనిమై లక్షించి యదియ వైవ
నడుమన యాతండు నఱకినఁ బ్రస్ఫిత, చాపంబు గొని చతుష్షష్టినిశిత

ఆ. కంకపత్త్రములను గడఁక నయ్యువరాజు, పరఁగఁ జేయుటయును బాండుతనయుఁ
డడఁచె నొక్కటొకటి నైదైదు తీవ్రశి, లీముఖముల బాహులీల మెఱయ. 118

వ. ఇట్లు విక్రమవిజృంభితుఁడై సహదేవుండు శతశాతశిలీముఖంబు లడరించిన. 119

చ. రయమున వాని నన్నిటి శరత్రితయంబునఁ ద్రుంచి సాయక
ద్వయమున నాతనిం బటునవప్రదరంబుల సారథిఁ భవ
త్ప్రియతనయుండు నొంచి దివి దీటుకొనంగఁ జెలంగి యార్వ న
త్యయసమవర్తిచాడ్పున నతం డుదితభ్రుకుటీవిలాసుఁడై. 120

మ. పటునారాచముదీప్తిజాలము నభోభాగంబునం బర్వ ను
త్కటవేగంబున నేయఁ గంకటము వక్షఃపీఠముం దూఱి నె
త్తుటిపొం దేమియు లేక యుచ్చి చనినం దూగాడి యాతండు వా
లుటయుం దేరు దొలంగ సూతుఁడు భయాలోలాకృతిం దోలినన్. 121

క. అమ్మాద్రీపుత్త్రుఁడు వా, లమ్ముల దుశ్శాసనునిమహాసైన్యము రా

---

1. గ. బడియె నపుడు. 2. క. మైగలి-గ. మైగలి-చ. మైగని-జ. మైగమి- ట. నగ్గలి- ఆ. కూరుఁడు

ద్రమ్ముగఁ గలంచె దివిజగ,ణమ్ము వినుతి సేయఁ దమ మొనలు నలి నార్వన్. 122

చ. నకులుఁడు సూతపుత్త్రుఁడుఁ బెనంగు నెదుర్ నకులుండు సూతపు
త్త్రకునకు. నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్నదృ
ష్టికి ననుఁ బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగ వచ్చె నాదుచూ
డ్కికి నిను గోచరంబుగ ఘటించినయాచతురత్వసంపదన్. 123

క. కౌరవపాండవులకు నీ,వైరము నీవలనఁ గాదె వచ్చెను నిను మ
ద్ఘోరశరనిహతిఁ బడఁగ,న్నారఁగనుంగొనక కోప మాఱునె యొంటన్. 124

చ. అనవుడు రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని
ట్లనుట దలంప నర్హ మగు నైనను జెన్నఁటిపల్కు లేల నె
ట్లన భుజశక్తి మార్తురకడంక యడంచినఁ బల్కు టొప్పుఁ గా
క నిలిచి చూపు నీచలము కల్మియుఁ జేతులబల్మియుం దగన్. 125

వ. అని పలికి కర్ణుండు. 126

సీ. ఉబ్బి మాద్రీసుతు డెబ్బదిమూఁడుదూ,పులఁ గప్పటయు నతఁ డలిగి యతని
[1]పైని శతనిశాతబాణంబు లేసిన, నాసూతనందనుఁ డక్కుమారు
ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది,కాండముల్ సొనిపిన నొండువిల్లు
గొని డెబ్బదింట నాతనినొంచి మూఁడుమా,ర్గణములు సూతునంగమునఁ బఱపి
తే. భల్లమున విల్లు దునుమాడి యెల్లజనులు, నద్భుతం బందఁ ద్రిశతసాయకపరీతుఁ
జేసి నకులుఁడు నిష్ఠురహాసభాసి,తాననాంభోజుఁ డై పొలు పారె నధిప. 127

క. సూతసుతుఁడు బలువిలు గొని, [2]యాతనివక్షమున నాఱె నైదమ్ములు ని
ర్ఘాతసమస్తశరముల, నాతఁ డతని నొంచి విల్లు నఱిముఱిఁ ద్రుంచెన్. 128

వ. మఱియు నొక్కమహనీయకార్ముకంబు గొని కర్ణుండు గడంగె నప్పు డయ్యిరువురు నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొకళ్లొకళ్ల నెత్తుట ముంచుచుం బేర్చి వివిధవిశిఖజాలంబు లడరించిన నంబరంబు శలభపటలసంవృతంబునుం బోలె నుండె నాసమయంబున నకులునగ్రభాగంబునకు వచ్చిన సోమకబలంబులు గర్ణక్రూరనారాచాదిబహుళబాణపాతంబులఁ బలాయితంబు లయ్యెఁ గర్ణునకు బాసటయై తఱిమినకౌరవసైనికులు మాద్రేయుశౌగ్రవిజృంభణంబున దూరవిఘటితులై రట్లిరువాఁగును నెడ గలిగి చూచుచుండ నారథికోత్తము లుదారఘోరాకారంబుల నుల్లసిల్లి భల్లప్రముఖప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి యంబుదపిహితమూర్తు లగుమార్తాండశశాంకులచందంబు నొంది యన్యోన్యదివ్యాస్త్రతేజోవిలాసంబుల నయ్యైయస్త్రంబుల వారించుచుం బోరి రట్టియెడ. 129

క. అలుక వొడమి కర్ణుండు న,కులుచాపము ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం

1. క. పై నశితనిశిత. పై నశతనిశాత. 2. అ. యాతనియశ్వముల.

బులఁ జంపి చక్రరక్షుల,తలలు నఱికి సిడము ద్రుంచి ॥ దరహాసముతోన్. 130

వ. మెఱసినం గుపితచిత్తుం డై. 131

చ. పలకయు వాలునుం గొని మెఁ ॥ బాండుకుమారుఁడు పెక్కు చెక్కులై
యిలఁ దొరఁగంగ నేసె గద ॥ యెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు
జ్జ్వలపరిఘాభిరాముఁ డయి ॥ వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి లసితలాఘవస్ఫురణ ॥ పెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. 132

ఆ. మర్మభేదు లైన ॥ మార్గణంబుల కోహ,టించి సిగ్గుఁ జలము ॥ డిగ్గఁ ద్రావి
యెల్లజనులుఁ జూడఁ ॥ బొల్లఁదనంబున, గోర్చి యక్కుమారుఁ ॥ డోడి పాఱె. 133

కర్ణుఁడు నకులుని విరథుం జేసి యవమానించుట.

క. వెనుకొని రాధేయుఁడు నిజ,ధను వాతనికంధరమునఁ ॥ దగిలిచి నలిఁ బ
ట్టిన నింద్రచాప[1]పరిగత,ఘనాకృతిని బోలిచె నతఁడు ॥ కౌరవనాథా. 134

వ. ఇట్లు పాండుతనయు బాడుపలఁ బట్టి మందస్మితసుందరాననుం డై. 135

క. పలుకులు వృథగా నన్నుం, బలికితి మున్నింక నెన్ని ॥ పలుక వలసినం
బలుకుము నీ కేఁ దగ నా,యలవుఁ జలము నీ వెఱింగి ॥ తంతియ చాలున్. 136

క. అల వెఱ్ఱి పెనఁగు పెనఁగం, దలఁచిన నది గాక సిగ్గు ॥ దలకొని యనికిం
దొలఁగుట యిం కిట దగు వి,చ్చలవిడి నర్జునునికడకుఁ ॥ జనుము కుమారా. 137

క. అని విడిచె నకులుఁ గుంతివ,చనములు దృఢవృత్తిఁ జిత్త ॥ సంకలితము లై
యునికిం గర్ణుం డతఁడును, జని ధర్మజునరద మెక్కె ॥ సవ్రీడముగన్. 138

వ. ఎక్కి నిట్టూర్పు నిగుడం గుంభనిక్షిప్తభుజంగంబుచందంబున నుండె నివ్విధంబున మాద్రీపుత్త్రమానమదనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతం బైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుంబోలెఁ బ్రదీప్తమూర్తియై వెలిమావులును వెలిపడగయు నుల్లసిల్ల శోభిల్లుతనరథంబు రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దఱిసి పెక్కు తెఱంగుల మెఱుంగుటమ్ములగములు గదియించి.

సీ. సూతులఁ దెగటార్చి ॥ కేతనంబుల వీట,[2]తాటంబు సేసి రథ్యములఁ గూల్చి
చామరచ్ఛత్త్రభూషణములు పొడిసేసి, [3]రథికజనములశిరములు ద్రుంచి
కొమ్ములునఱికి యంకుశములు దునిమి తొం,డములు ఖండించి కుంభములువ్రచ్చి
జోదులతనువులు ॥ భేదించి మోరలు, [4]గళ్యాలతోడఁ జెక్కలుగఁ జేసి

ఆ. కందములు పగిల్చి ॥ కాళ్లులు ద్రెంచి యా,శ్వికులఁ జంపి చర్మ ॥ విశిఖకుంత
ముసలముద్గరప్రముఖసాధనములు భ,గ్నములు సేసి భటుల ॥ సమయఁ జూచి.

వ. బాహువిలాసంబు మెఱయ నెఱయం బోలిచె భవత్సుతుం డగుయుయుత్సుండు

---

1. గ. పరివృత. 2. జ. తాటనంబుగ రథ్య. 3. గ. రథికశిరంబులఁ బృథివిఁ గూల్చి.
4. చ. గళ్లెలుగూడఁ జెక్కలుగ- జ. గల్లు చెక్కలు గాఁగ-ట. గళ్యాలు చెక్కలు గాఁగ.

పర్వతప్రతిముం డగునులూకుపయిం గవిసి కులిశనిభం బగువిశిఖంబున నొంచినఁ
గోపించి యాబల్లిదుండు విల్లు విఱుగ నేయుటయు నక్కుమారుండు. 141

తే. మేలువిలు గొని యఱువదినాలుగమ్ము
లతనిమెయి గ్రుచ్చి సాయకత్రితయనిహతి
సూతు నొప్పించి మఱియు నిశాతశరచ
యమ్ము పరఁగించె నధికరయమ్ము మెఱయ. 142

వ. దానం గనలి. 143

క. బలువిడి నులూకుఁ డిరువది, శిలీముఖము లొడలఁ జొనిపి సిడము రయముమై
నిలఁ గూల్చిన నీసుతుఁ డు,జ్జ్వలవిశిఖము లయిదు నాటెవానియురమునన్. 144

వ. నొచ్చి యాసౌబలనందనుండు రౌద్రంబు రూపంబు దాల్చినవిధంబున విజృంభించి. 145

శా. భల్లం బొక్కటఁ ద్రుంచె సూతునిఁ జతుర్బాణాహతిన్ వాజులన్
డొల్లం జేసె నిశాతపంచవిశిఖాటోపంబునం జించె వీ
రోల్లాసంబు వికాసముం బొరయ మే [1]నుక్కెది నీనందనుం
డెల్లం జూడఁగఁ బాఱె యొండొకరథం బెక్కెం గురుగ్రామణీ. 146

క. గెలుపున మెయి వొదలఁగ సౌ,బలసూనుఁడు రథము వఱపి పాంచాలబలం
బులు గలఁగఁ బలుదెఱంగుల,యలుఁగుల విహరించె నుద్భటాటోపమునన్. 147

సీ. శ్రుతకర్మ నకులునిసుతుని శతానీకుఁ, దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి
సూతునిఁ బరిమార్చె నాతఁడు గద వైచి, రథవాహనముల సారథిని గేత
నముఁ బొలియించె భూరమణ యిమ్మెయినీసు,తనయుండునకులనందనుఁడువిరథు
లై యొండుదేరుల కరిగిరి [2]సుతసోముఁ, దలపడి కడిమి గాంధారనాథుఁ

తే. డతనియడరించువివిధసాయకము లెల్లఁ
దునిమి బాణత్రయంబునఁ [3]దనువు నొంచి
తురగముల నరదమ్ముఁ గేతువుఁ దిలప్ర
మాణశకలంబులుగఁ జేసె మదమెలర్ప. 148

మ. విరథుం డై పొలివోనిబీరమునఁ బృథ్వీభాగసంచారి యై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీమఱిం
దిరథం బేర్తెఱఁ గప్పినం దునిమె నుత్సేకోగ్రుఁ డై యమ్మహీ
వరుఁ డబ్బాలునిచాపదండము భుజావష్టంభ మేపారఁగన్. 149

చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యానృపాలుఁ డు
ద్ధతిఁ బరఁగించుసాయకశతంబులు ద్రుంచుచు నుల్లసిల్లన
ప్పతి పటుభల్లఖండితకృపాణునిఁ జేసిన నీడఁబోక చే

1. క. నుక్కారి. 2. జ. శ్రుతసోము. 3. జ. ధనువు.

తితునియ బెట్టు వైచె జగతీవర యాతనివిల్లు రెండు గన్. 150

వ. ఇట్లు కోదండంబు దుండంబులు సేసి తొలంగి యక్కుమారుండు శ్రుతకీర్తిస్యం
దనం బెక్కె సౌబలుండు వేఱొక్కవిల్లెత్తి యత్తెఱపి నురవణించి పాండవరథి
కులం గలంచెఁ గృపాచార్యధృష్టద్యుమ్నులు పెనంగునెడ గౌతముండు పాంచాల
వరుం బొదువునాటోపం బాలోకించి యక్కౌంతేయసైనికులు దమలోన. 151

ధృష్టద్యుమ్నుఁడు గృపాచార్యునితోఁ దలపడి యోడి పోవుట.

ఉ. ద్రోణుపరాభవం బధికరోషము సేయఁగ నున్నయీతఁడ
క్షీణపరాక్రమంబు విలసిల్లఁగ నీద్రుపదాత్మజుఁ గత
ప్రాణునిఁ జేయ కేలుడుగుఁ బైకొను నంతటఁ బోక విస్ఫుర
ద్బాణవిలాసముల్ నెఱపుఁ దా మనసైన్యము దల్లడిల్లఁగన్. 152

వ. అని వెండియు. 153

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుబలగర్వక్షేమనిర్వాహకుం
డరులం జీరికిఁ జేకొనం డితఁడు [1]క్రోధాత్తాత్ముఁడై నేఁడు ని
ర్భరశౌర్యంబు నుదాత్తధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు
స్తరదర్పోద్ధతిఁ దేక యున్నె మనలం దా నేలకుం గోలకున్. 154

వ. ధృష్టద్యుమ్నుండును బెండువడి యున్నవాఁ డనుచు నుండి రట్టియెడ [2]బెట్టిదంబు
లగుకృపాచార్యుతూపులయేపు రథ్యంబుల నొంచి సారథిక్రొవ్వడంచి యాద్రు
పదనందనుతనువు నెత్తుటం దోఁచి యుల్లంబు గలంచె నప్పు డాతనిసూతుం డత
నితో ని ట్లనియె. 155

చ. వినుము కుమార విప్రభుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం
జనవు భవత్సమగ్రశరజాలము లీతనిమీఁద దైవసం
జనితము సువ్వె యిమ్మెయిడరు సంగర మిట్టిద తొల్లి యెందు నా
కనినది లేదు తేరు దొలఁగం గొని పోవుట కార్య మిత్తఱిన్. 156

వ. నీయట్టివానివిక్రమంబునుందిట్టినయట్లుసమయుటం జేసి యిమ్మహాత్ముఁడవధ్యుండని
నిశ్చయించితి నామాట కియ్యకొను మనవుడు నాప్పృషతపౌత్రుం డిది యట్టిదయని
నిశ్చయించి పలికి మఱియు హీనస్వరంబున ని ట్లనియె. 157

చ. చరణములుం గరంబులును సంచలభావము నొందఁ జొచ్చె మేన్
విరవిరఁ బోవు చున్నయది విహ్వల మయ్యె మనంబు నీతలం
పరయఁగ మేలు మారుతసురాధిపసూనులలోన నల్ల నొ
క్కరుదెసకై రథంబు దొలఁగం గొని పొమ్మడిబీర మేటికిన్. 158

చ. అనవుడు సూతుఁ డెంతయు రయంబునఁ దేరు వృకోదరాంతికం
బున కెగవంగ శంఖరవముల్ గుణనిస్వనముల్ నిగిడ్చి యేఁ

1. క. క్రోధావిష్టుఁడై. 2. క. బెట్టిదంబుగాఁ గృపాచార్యుం డేపు నూపి రథ్యం.

పునఃకృపుఁ డుజ్జ్వలప్రదరపుంజములం బరఁగంగఁ జేయుచుం
వెనుకొని పొల్చి నిల్చె గిరి వెన్కను నిల్చినవజ్రికైవడిన్. 159

తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు, చుండి శరపంచకంబున నురము నొంప
నతని నయ్యాదవోత్తముఁ డలఘుషష్టి,విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె.

క. ఒండుశరాసన మెత్తి శి,ఖండి గురియునవతిసాయకమ్ములు పెలుచం
ఖండించె నతఁడు తత్క్ష,దండం బాద్రుపదనృపతితనయుఁడు నఱకెన్. 161

క. ధనువు దునిమి కొమ్ములు మురి,సినవృషభముచంద మగుడు శీఘ్రస్ఫురణం
దనువున శితశరములు వడిఁ, జొనిపి యుతం డతని గళితశోణితుఁ జేసెన్. 162

చ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొండువింట దో
ర్బల మెసఁగంగ డెబ్బదిశరంబులు[1]వాఁడిమి మేన రక్తధా
రలు దొరఁగించి పెక్కుప్రదరంబులు పైపయి నేయు చుండ న
గ్గలికఁ బెనంగె వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁ డై. 163

వ. ఆద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయంబు నాటించిన. 164

శా. క్రూరోల్లాసము పల్లవింపఁ గృతవర్ముం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనం గ్రువ్వ మూర్ఛిల్లె న
వ్వీరాగ్రేసరుఁ డపు సారథి భయావిర్భావదీనాత్ముఁ డై
తేరు చప్పటు దొలంగఁ దోలుటయు భీతిం బాతెఁ దత్సేనయున్. 165

వ. విభ్వచ్చువిక్రమవిహారంబున కోర్చి శిబి త్రిగర్త సాల్వ సంశప్తకసైన్య నారా
యణ గోపాలోపేతుం డై సత్యసేన చంద్రదేవ మిత్రదేవ మిత్రవర్మ సౌశ్రుతి
సువర్మ సుశర్మాదు లగుసోదరసుతులు బొసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు.

సీ. సత్యసేనుఁడు మూఁడుసాయకంబుల మిత్ర, దేవుండు షష్టిసందీప్తమార్గ
ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను, జంద్రదేవుఁడు శరసప్తకమున
మిత్రవర్ముఁడు గంకపత్రత్రిసప్తతి, [2]సౌశ్రుతి యేదునిశాతవిశిఖ
ములను శత్రుంజయుఁ డలఘువింశతికాండ,ములను సుశర్ముఁ డుజ్జ్వలనవాస్త్ర

తే. ములను గప్పి రపార్థు నాబలియుఁ డంబు,దములధారలు వొదువ నుదాత్తరేఖ
గరము పొలుపారుమేదినీధరముభంగి, దలఁపఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప.

వ. ఇట్లు సుస్థిరుం డై మిత్రదేవునంగంబునఁ గంకపత్రశతంబును సత్యసేనుతనువున
మార్గణత్రయంబును సుశర్మమిత్రవర్మలశరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను
బఱపి శత్రుంజయు శిలాశితశరంబులం బడ వైచి సౌశ్రుతిం బంచవింశతికాండం
బుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిదియమ్ములం దునిమి యుల్లసిల్లిన.

చ. కనకపుఁగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భునిభుజశాఖ యుచ్చి చన భూరిబలుం డగుసత్యసేనుఁ డు

1. గ. పాలని మేన. 2. ఙ. సామస్యుఁ డేడు.

క్కన నిగిడింపఁ జేతిమునికోలయుఁ బగ్గములుఁ మహీతలం
బున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు గ్రోధదీప్తుఁ డై. 169

క. హరిదెసఁ గన్గొని యాతని, యరదముఁ గదియంగ నడపు మరద మనుడుఁ జె
చ్చెర నొండొకమునికోలం, గర ముద్ధతి నడపె ఘోటకంబుల నతఁడున్. 170

క. తే. రతనియరదమునకుం, జేరువ యగుటయును గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో, దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్. 171

వ. ఇట్లు సత్యసేనునిఁ జిత్రవధంబు సేసి. 172

చ. ఘనతరవత్సదంతశరఘాతమునం బడ వైచి మిత్రవ
ర్మని రథసూతు [1]నట్టి దొకక్రూరపుఁదూపున నుర్విఁ గూల్చె నా
తని సముదీర్ణ మై పెలుచఁ దాఁకి త్రిగర్తబలంబు సుట్టు ము
ట్టిన వివిధోగ్రసాయకపరిక్షత నొప్పి కలంచె నేపునన్. 173

వ. వెండియు సుశర్మనిజ్ఞాతులు పోర పెనంగిన. 174

ఆ. వెండిపింజఁ బొలుచు వెడఁదయమ్మున మిత్ర, సేనధరణినాథుశిరముఁ ద్రుంచి
వాఁడినారసము [2]సువర్మునికునికిట, నాఱె నయ్యమర్త్యనాథసుతుఁడు. 175

వ. అట్టియెడ సంశప్తకగణంబు లన్నియు నార్పులు నింగి ముట్ట నలుదిక్కులం గిట్టి బెట్టిదంబు లగునస్త్రశస్త్రపరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁ డలుక నూనిన యలంతినవ్వుచెలువంబు మొగంబునకు వింతచె న్నొసంగ విజృంభించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది ప్రదీప్తభల్లాంజలికప్రముఖంబులం బరఁగుటయు.

సీ. తేరులచెక్కలు వారణంబులఖండ, ములు భూషణంబులపొడియు ఘోట
కంబులతునియలుఁ గరవాలతోమర, శరపరిఘాదులశకలములును
రథికజనంబులవ్రయ్యలుఁ జామర, చ్ఛత్త్రకేతువులయంశములు భటుల
తుమురును [3]రౌతులతుండంబులునుగంక, టములభాగములుఁ జిందములనుఱుమఁ

తే. గలసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి, మెదడుబ్రుంగివియచ్చరహృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప, సంగరాంగణ మతిఘోరభంగి యయ్యె.

వ. అప్పుడు. 178

క. కరిహయశవముల విఱిగిన, యరదంబుల విషమ మైనయాజిక్షితి నె
త్తురుఁగ్రొంపిలోన రథ్య, స్ఫురణకతనఁ దవులఁబడక శోభితగతి మై. 179

దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధంబు సేసి విరథుఁ డగుట.

తే. నరుఁడు దీవ్రశరార్చులు పరఁగఁజేయఁ
గలఁగి హతశేషసంశప్తకవ్రజంబు
పలుగడల విచ్చుటయుఁ బొగ వాసి మెఱయు

---

1. క. వి ట్టదురఁ గ్రూరపు. 2. ఖ. సువర్మునిమఱుకిట. గ. సువర్మునిపత్తుక. 3. జ. రావుతుతుండం

నగ్నియునుబోలె వెలుఁగొందె నాతఁ డధిప. 180

ఉ. కౌరవరాజు ధర్మజుఁడుఁ గయ్యము సేయు నెడం గడంకమైఁ
గౌరవరాజు ధర్మజుని గాయమునన్ నవసాయకంబులన్
సారథిమేన నొక్కపటుసాయకమున్ నిగిడింప నాతఁడు
న్ఘోరతరాత్ముఁడై యతని నొంచెఁ ద్రయోదశసాయకాహతిన్. 181

వ. నొంచి తోడన. 182

తే. తునియలుగఁ జేసె హరులఁ జతుశ్శరముల
సూతుఁ బంచమమున ఘనకేతుయష్టి
షష్ఠమునఁ జాపదండంబు సప్తమమున
నలిగి మెత్తినకరవాల మష్టమమున. 183

క. ఆలోనన యజ్ఞనపతి, వాలికనారసము లైదు వక్షమున వడిం
గీలించి ధైర్యసారము, దూలించినఁ దొలఁగి నీసుతుం డిల కుటికెన్. 184

చ. వికలరథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక
ర్ణకృపులుఁ దక్కనుం గలుగునాయకులున్ రయ మార వచ్చి కూ
డికొనుట చూచి యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూనుపొం
తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకంబునన్. 185

వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరలమొత్తంబు లొక్కదెసకుం దార్కొనిన నుభ
యబలంబులు నురవడించి కలయం బెరసినం గ్రందుకయ్యం బయ్యె నందుఁ జిందం
బులమ్రోఁతయు నార్పులయులివును బాణకృపాణాది హేతిసంఘట్టనంబునం బుట్టు
రణనంబును రథావయవాస్థికపాలభంజనంబున నెసంగునినదంబునుం గూడి పరఁ
గిన దిక్కులు పిక్కటిల్లెఁ గరులకొమ్ములం జిక్కి వ్రేలుతురంగంబులును సందు
గొని చొచ్చినసుభటులు [1]సెరివిన నొఱగి కూలుశుండాలంబులును నాశ్వికుల
మొగంబునం బడి లులాయంబులు సొచ్చినసరోవరంబులచందం బగుకాల్బలంబు
లును రథికులు వోక పెనంగిన నఱవఱ లయినయరదంబులును నెత్తురుకాలు
వలును గండలతిట్టలును బ్రేవులప్రోవులును నెమ్ములరాసులును నత్యంతరౌద్రంబు
నావహించె ననుటయు నాంబికేయుండు. 186

చ. సమరము[2]పెంపు సెప్పెదవు సంజయ చెప్పవు నీవు నీమహీ
రమణునిభంగి ధర్మజుశరంబులచే విరథత్వ మొంది మా
నముఁ జలముం దెగం దొలఁగెనా మగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజుభుజగర్వవిహీనత నొంచెఁ జిత్తమున్. 187

వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కి ట్లనియె. 188

తే. విరథుఁ డయ్యెన కాని యవ్వీరుఁ డాహవంబు దక్కక యొందురథంబు పన్ని

---

1. జ. వొదివిన. 2. గ. సొంపు.

కొని సముద్ధతి వచ్చి సక్రోధ మైన, మనముతో సూతునకు నిట్టు లనియె నధిప.

ఆ. [1]తెల్లసీవిరులును వెల్లనిగొడుగు నై, యల్లవాఁడె పాండవాగ్రజుండు
మెఱసియున్నవాఁడు పఱపు మచ్చోటికి, రథము ఘోటకముల రయము మెఱయ.

వ. అనుటయు నతండు నట్ల చేయ నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహి
కేతుమహితం బై వచ్చుచున్నధృతరాష్ట్రనందనస్యందనంబునకు సమ్ముఖంబుగా
మనరథంబు నడుపు మనుటయు, నాతం డవ్విధం బాచరింప నయ్యిరువు రతిరథి
కులకుఁ బ్రకటప్రధనం బయ్యె నట్టియెడ. 191

సీ. పాండవుచాపంబు ఖండించె నీకొడు, కొండొకధను వెత్తి యుఱక యాతఁ
డక్కురునాథువిల్ గ్రక్కునఁ దునుమాడె, నతఁడు వేఱొకవింట నతని నేయ
నయ్యుధిష్ఠిరుఁడు నానాస్త్రంబు లేసిన, నాచ్ఛాదితం బయ్యె నంబరంబు
వా రొండొరుల రక్తధారాప్లుతులఁ జేసి, ఫుల్లకింశుకభంగిఁ బొలిచి రేచి

ఆ. ఘోరశక్తి వైచెఁ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు
నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మ,హీశునురము దర్ప మెసక మెసఁగ. 192

వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీనందనుండు. 193

చ. బరవస మొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె నమ్మహీ
శ్వరు నతఁ డల్గి బల్విడుగుచాడ్పుశిలీముఖ ముచ్చి పోవ న
క్కురుపతి నేయఁ గయ్యమునకుం దుది యప్పుడు చేయువాఁడు గా
నరదము డిగ్గె నాతఁడు గదాకలనోద్భటబాహుదండుఁ డై. 194

క. డిగి రయమునఁ గదిసిన నా, జగతీపతి యేచి యుగ్రశక్తి నురము బె
ట్టుగ వైచిన నీతనయుఁడు, మగుడఁగ రథ మెక్కి వింట మూర్కొనువాఁ డై.

దుర్యోధనుఁడు ధర్మజుతో యుద్ధము సేసి మూర్ఛిల్లుట.

క. అత్తఱిఁ గడుఁబెల్లుగఁ గ్రొ, న్నెత్తురు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ గృతవర్ముఁడు, దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్.

ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్డు బలంబు మారుతో
ద్ధూతపయోధిపోలె వడిఁ దోడ్పడియెం గృతవర్మ కంత ను
ద్ద్యోతితభంగి వచ్చి విజయుండు వెసం దునుమాడె లీలమైఁ
జేతులతీఁట వోవ రథసింధురవాజిభటోత్కరంబులన్. 197

వ. అంత. 198

క. కురుపతి దెప్పిఱి బాహు,స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మూర్కొని ని
ష్ఠురవివిధవిశిఖవినిహత, శరీరుఁ జేయుటయు నతఁడు సక్రోధుం డై. 199

తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల సూతు
వెడఁదబలుతూపు లేడింటఁ బుడమిఁ గూల్చి

1. గ. తెల్ల నైనసిడము తెల్ల నిగొడుగు నై.

భల్ల మొక్కట నతనిపెన్విల్లు దునిమి
ప్రాణముల్ గొనఁ జాలెదుశరబాణ మేసె. 200

క. కని యాఅమ్ముల నెడ నది, దునియలు గావించె గురుసుతుం డాతనివి
ల్లును హరులఁదునిమి పార్థుఁడు,దను మార్కొనుకృపునిచాపదండముద్రుంచెన్.

చ. వడిఁ గృతవర్మ దాఁకిన నవారణఁ దద్ధనువుఙ్ హయంబులన్
సిడమును రూపుమాపి విలసిల్లి యెదిర్చినదుస్ససేనువిల్
నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల నె
క్కుడుమద మొప్పఁ గగ్గుదెసకుం జన నారథికుం డుదగ్రుఁ డై. 202

క. అన్నరుని మూఁడుశరముల, నెన్నని నిరువదిని శాతవిశిఖముల వెస
భిన్నాంగులఁ జేసి విజయు, మ న్నేసినయన్ని బాణములబి ట్టేసెన్. 203

వ. అంతకు మున్ను సాత్యకితోడం బోరి పోరి యారాధేయుండు దనదెస కడరిన
కవ్వడిం గని యక్కడ మొగం బయి యిటు పరాక్రమించినం జూచి యేచి యా
సవ్యసాచి కడ్డపడి యక్కేశవానుజుండు. 204

తే. నవతిశరముల నవమార్గణముల శతశి,లీముఖంబుల నేసి దోర్లీల మెఱయ
సారథిధ్వజహయరథసహితము గ ను,దీర్ణదర్పుఁ డై కప్పె నక్కర్ణుఁ డధిప.205

వ. అప్పుడు యుధామన్యుండును శిఖండియు ద్రౌపదేయులు నుత్తమౌజుండును యు
యుత్సుండునుగవలునుధృష్టద్యుమ్నుండును జేకితానుండును బ్రభద్రకచేదికరూశ
మాత్స్య కేకయ వత్స బలసమేతంబుగా ధర్మనందనోత్సాహదీపితాటోపశోభితు
లయి కవిసి వివిధాస్త్రశస్త్రవ్రాతము లాసూతసూనుపయి నడరించిన నవ్వీరుండు.

మ. అవి వేగంబ మరల్చి భూరిపవనవ్యాపారనిర్మర్దితా
టవులం బోలఁగఁ జేసి దంతిభటఘోటస్యందనశ్రేణులన్
దివిజవ్రాతము పిచ్చలింప రథసోద్రేకంబు రౌద్రంబుఁ బెం
ప విజృంభించె ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్. [illegible]

మ. కని గాండీవధరుండు దర్ప మెసఁగం గర్ణాస్త్రజాలంబు నీ
సున వారించి శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ బే
ర్చినఁ గార్చిచ్చడరన్ మృగంబులు భయోద్రేకంబునం జాఱుచా
డ్పున నీమూఁకలు నల్గడం బఱచె [1]నుద్భ్యాతభగ్నమార్తంబు లై. 208

వ. అంత నంశుమంతుం డపరగిరియవులకుం జనుటయు ధరాధూళికిఁ దోడు సంధ్యా
రాగమిళితం బై నతిమిరంబు గవిసిన నెద్దియుం గాన రామిం జిత్తంబులు గలంగ
రాత్రియుద్ధంబునకు నోహటించుటం జేసి మనవారలఁ బాండవసైనికులు దఱిమినం
దాల్మి వాటింపక తిరిగిపోయిరి జయంబు సేకొని వీరినవ్వుచు వారు గవ్వడిం గమల

---

1. క. నిష్ఫ్యాతాంబుదాభంబు లై.

నాథునిం బ్రశంసించుచుం జని రివ్విధంబున నుభయసైన్యంబులు నిజశిబిరంబుల కరిగి విశ్రామంబు నొందె నని చెప్పుటయు సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె.

ఉ. తెల్లము మిమ్ము నందఱ వధింపఁగ నయ్యమరేంద్రనందనుం
[1]డొల్లక పోక వాఁడు దనయుగ్రత నూపెద నన్న మీమహీ
వల్లభు[2]వారి కేల యమవహ్నుల కైనను రూపుతోడఁ బోఁ
[3]జెల్లదు గాన తద్భుజవిశేషము రూఢము గాదె సంజయా. 210

సీ. యాదవవీరచయంబునాటోపస, ముద్రేక ముడిపి సుభద్రఁ దెచ్చె
ఖాండవం బాహుతిగా లీల నొనరించి, సప్తార్చి నత్యంతతృప్తుఁ జేసె
శబరవేషముఁ దాల్చి చనుదెంచి తొడరిన, శివునితోఁ బెనఁగి మెచ్చించె నతని
గంధర్వుచేపడ్డకౌరవసత్తము, విడిపించె లావును వెరవు మెఱయఁ

ఆ. కాలకేయకులముఁ గాలునిప్రోలికి, ననిచె నఖిలనృపుల ననికి నియ్య
కొలిపెఁ గ్రీడి [4]జగము గొనియాడ నేక కో, దండచండవిలసితమునఁ గాదె.

వ. కావున మనవారికి నోటమి యక్కిరీటివలనం గలిగె ననుకలుచ వారి గర్వింపం దగ దట్టిజెట్టితోడం బెనంగుటఁ బ్రశంసకుం దగుదురు పదంపడి వా రేమి సేసి రనిన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 212

ఆ. [5]అట్లు దివిసి పోయియాటుఁ బోటు నొడల్లఁ, గలయఁ గలిగి డప్పిగదిరి సురియు
దొరలుఁ దాను నపుడు దుర్యోధనుఁడు విచా, రాభియుక్తి నున్నయవసరమున.

వ. పార్థుదెసఁ బలుకు పుట్టినం గ్రోధంబున నూర్పులు సందడింపఁ గర్ణుండు [6]భగ్నదంష్ట్రం బయి విమంబు లేనిభుజంగంబునుం బోల్పం దగి పరాజయంబు నొంది దీనదశకువచ్చియున్నయారథికవరులంగలయంగనుంగొని కౌరవేశ్వరున కిట్లనియె.

ఆ. అలవు వెరవుఁ దలఁపఁ గలఁ డితం డన వాసి, కెక్కినట్టిరథికుఁ డక్కిరీటి
వలయునెడల నతనివాసుదేవుండు బోధించు నెల్ల తెఱఁగుఁ దేటపడఁగ. 215

క. అనిమిషనాథుం డిచ్చిన, ఘనశక్తికి నసుర నొడ్డి గాండివిఁ దొలఁగిం
చినహరివంచన పదపడి, మన మెల్లను దెలియ వినమె మనుజాధీశా. 216

క. అగుఁ గాక యతని నాతని, మగఁటిమియును నేర్పు నెల్లి మాన్పెద నీకుం
బగ యనియెడుమాటయు ని, జ్జగమునఁ గలుగంగ నీను జగతీనాథా. 217

కర్ణునిరెండవనాఁటియుద్ధము.

వ. అనినం బ్రియం బంది నీనందనుం డతనిం దగువారలను నిజనివాసంబులకుం బోవం బనిచి తానును నభ్యంతరమందిరంబున కరిగె నారాత్రి సుఖనిద్ర సేసి

1 గ. డొల్లక పోయె-జ. డొల్లఁడు గాక. 2 క. వారికే శమనవహ్ను-జ. వాఁడే యెదిర్చుయమ. 3 గ. జెల్లునె. 4 క. గుణము. 5 జ. ఇట్లు...యేటుఁబోటు లొడల్ల. 6 ఇది పెక్కింటఁ గానరాదు.

రేపకడ సమస్తజనంబులు సంగ్రామంబునకు నడచి రంత నక్కడ నుక్కు మిగిలి
పాండవబలంబులుం దోఁతెంచె ధర్మనందనుండు బృహస్పతిమతం బైనదుర్జయ
వ్యూహంబు పన్నించినం జూచి మనవారును దానికిం బ్రతిగా మోహరించుట కై
రాధేయురాకకు నెదురుచూచుచు నొకభంగిం బన్నిరనిన విని యాంబికేయుండు.

క. శీతార్తజనంబులు ప్ర,ద్యోతనునుదయంబు గోరు౯చున్నకరణిఁ దా
నే తేరఁ గోరుజనులకు, నాతఁడు నిజతేజమునఁ బ్రి౯యం బొసఁగెనొకో. 219

ఉ. అమ్మెయి ధర్మనందనుని౯యగ్గలికం దొలునాఁడు రాజు బ
న్నమ్ములపాటు సూచుచు ర౯ణంబుకడంక దొఱంగి చన్నబం
టమ్మెయి నద్దినంబున న౯హీనపరాక్రమలీల సూపెనో
తమ్ము నెఱుంగ రేమియు న౯తండును నాతఁడు నేమి సేయుదున్. 220

ఆ. కర్ణుఁ డట్టె కలనఁ ౯ గౌంతేయవర్గంబుఁ, గృష్ణయుతము గాఁగ ౯ గెలువఁజాలు
నేమి సెప్పఁ గలదు ౯ మీమానవేంద్రుని, చిత్తమాంద్య మతని ౯ జెఱుప కున్నె.

క. సౌబలునీతియుఁ గర్ణుభు,జాబలమును గూడి తనకు ౯ సామ్రాజ్యం బీఁ
గా బలసి వెలయువాఁ డై, యా బేలూఱడు మనంబు౯నం దేప్రొద్దున్. 222

క. జూదంబునాఁడు మొలచిన, యాదుర్దశ పెరిఁగి సంజ౯యా నిర్భరదుః
ఖోదయపరంపరాసం, పాదిని యై మనసు నిట్లు ౯ పఱిగొనియెడినే. 223

క. దుర్యోధనుచేసినయవ, కార్యంబున వచ్చినట్టి౯కష్టంబులు దా
త్పర్యంబున వినియెదఁ బ్రతి, కార్యంబులు [1]గామి మనసు ౯గందుచు నుండన్. 224

క. పాండునృపసుతులలో నొ,క్కండైనను నొవ్వఁ డింత౯కును మును వనితా
మండలిచేరువ మెలఁగెడు, గండున మెఱసెదరు కురుని౯కాయము[2]నడుమన్. 225

వ. దైవంబు బలవంతం బనిన విని సంజయుం డజ్జననాథునితో దేవా వినుము వగచినం
గృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడమునే డెందము గుందు నంతియకాక యట్లుం
గాక నీవు సేసినయదియ చూవె ఫలించె భండనంబు వల దని యెన్నిభంగులం
జెప్పినం బాండవులకుం గీడు దలంచి యప్పలుకులు గొన వైతివి వారలవలన ము
న్న నేకపాపంబు లాచరించితి నీవలన జనక్షయంబు వాటిల్లెం గావునఁ గడవంబడిన
దానికి వగవం బనిలేదు దారుణం బైనరణంబు విను మనుటయు నతండు కర్ణుం
డట్లు దడసినకారణంబుఁ దొడంగి యెఱింగింపు మనుటయు నమ్మానవేశ్వరునకు
నాసూతనూనుం డిట్లనియె. 226

క. రేపకడ సకలబలములు, భూపాలురు వెడలి నడవఁ ౯ బోఁటికిఁ బిదపన్
నీపుత్త్రుఁడు వెడలెను సా,టోపతఁ దమ్ములును గర్ణుఁ౯డును దో నడవన్. 227

వ. అయ్యవసరంబున. 228

సీ. రథము రథమ్ముఁ జే౯రఁగఁ దెచ్చి యమ్మేది,నీశ్వరులోఁ గర్ణుఁ ౯ డిట్టు లనియె

1. క. గనమి మనసు. 2. క. నెదురన్; ఖ. మునుమున్.

నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగెము, న్నాధనంజయునకు నట్ల కాన
యీరసంబున మాకు నిద్దఱ కొండొరు, విడువక పెనఁగఁ జొప్పడద యింకఁ
[1]గలహ మొక్కమొగంబు గావున నేఁ డేము, దలపడి పోరుదు మలవుఁ జలము
ఆ. నుల్లసిల్ల నొక్క రొకరుని నొంపను, జంపఁ జూతు మానిలింపనాథు
వల్లనఁ గన్నశక్తి వాలియుట నామీఁద, నలుకు లేక తఱుము నాతఁ డధిప. 229

వ. అప్పుడు చేనెత్తుకు గాకుండ నక్కిరీటి గీటడంగించువిధం బూహింపుము. 230

చ. సరి యగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ న
న్నరుఁడు దృఢత్వలాఘవగుణంబులఁ దక్కువ దూరపాతవి
స్ఫురణఁ గరంబు [2]వట్రపడు భూవర సౌష్ఠవరేఖ నేమియుం
దొరయఁడు ధైర్యశౌర్యపటుదోర్విభవంబుల హీనుఁ డెంతయున్. 231

క. మును విశ్వకర్మ దేవేం,ద్రునకై నిర్మించె మహితరూపము విజయం
బనుచాపము దానన బహు,దనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్. 232

చ. పరిచయసక్తచిత్తుఁ డయి భార్గవరామున కాతఁ డిచ్చినం
బరమపరాక్రమమ్మున నృపాలుర నెల్లను నిమ్మహాభుజుం
డిరువదియొక్కమాఱు సమయించెఁ దదీయనితాంతశక్తి న
ప్పరమదయాపరుం డొసఁగెఁ బార్థివ నా కది కూర్మి పెంపునన్. 233

ఉ. ఆమహనీయచాపమున నర్జునుదర్ప మడంచి నేఁడు సం
గ్రామము నుజ్జగించెద నకంటకసుస్థితి గల్గ మేటి నై
భూమి [3]యమర్చెదం గొనుము భూవర నీ దగుపుత్త్రపౌత్త్రులన్
శ్రీమహిమన్ సమస్తజనసేవ్యమహోన్నతిఁ బొందునట్లుగన్. 234

వ. అని పలికి వెండియు నిట్లను నావిజయంబును విజయుగాండీవంబును నొక్క రూప యతనికి నక్షయతూణీరంబులు నగ్నిదేవుం డిచ్చినయభేద్యరథంబును నవధ్యరథ్యంబులుం గల వవి యెక్కుడయినను దాని కంతఁ జింతింప. 235

క. నారాచము లాదిగఁ గల,ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్
తేరులు దృఢవాజులు నా, తేరివెనుకఁ బెక్క మర్చి తెచ్చెద నధిపా. 236

వ. మఱియు నొక్కం డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయినకృష్ణుండు సారథ్యంబు సేయుట నప్పార్థుపరాక్రమం బసాధ్యం బై యుండు నట్లగుటం జేసి. 237

తే. భండనము నేర్పు మెయిఁ గృష్ణుపాటియనఁగ, మహిఁ బొగడ్తకు నెక్కినమద్రనాథు
న్నాకు సారథి గాఁగ నొనర్పవలయు, గెలుతు నట్లైన నన్నరు నలవు మెఱయ.

క. హరి కెక్కు డరయ మద్రే,శ్వరుఁ డశ్వజ్ఞానమున నసంశయ మే న
న్నరునకు మిక్కిలి బలవి,స్ఫురణంబునఁ గర్మకుశలబుద్ధిఁ దలంపన్. 239

క. కావున నవ్వీర మిమ్మటు, గావించుట యెల్ల హితముఁ గావించినయ

1. చ. గలహమొన మొగియదు గావున. 2. జ. దొట్రుపడు. 3. జ. యొనర్చెదం.

స్త్రై వెలయు నింత సేసి మహీవర ననుఁ జూడు పోర నెఱ్ఱెంచెదనో. 240

క. విను మిత్త్రెఱఁగున నే న్యయ్యనిమిషవర్గంబు నైన నాజి జయింతుర్
మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్కసరకే తలఁపన్. 241

వ. అనిన విని నీపుత్త్రుండు ప్రీతుండయి రాధేయు నగ్గించి నీ కెల్లభంగిని శల్యు సార
థిం గావించెద నని పలికి యుత్సాహదీప్తుం డై. 242

క. అమ్ములబండ్లను రథర,థ్యమ్ములునుం బెక్కు దెత్తు నవనీశులు నా
తమ్ములు నేనును నీపా,ర్శ్వమ్మున నడచెదము [1]బరవసం బుగ్రముగన్. 243

క. అని చెప్పి ప్రీతుఁ డగునా,తనిఁ దోడ్కొని నడచి సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁ డై యి, ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్.

దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట.

సీ. సత్యవ్రతంబును శాత్త్రవదుర్దశా,పాదనంబును మహాభాగతయును
నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్తు, గావున ని న్నేను గారవించి
వినతుండ నై వేఁడికొని యెద రాజుల,నడుమ నీ దగుసౌమనస్య మెఱిఁగి
యర్జును ననిఁ దెగటార్పఁగ వలయుట, యూహించి సంభృతోత్సాహలీలఁ

ఆ. గావు మితని ననుచుఁ గర్ణునిఁ జూపి యీ,తని రథంబు గడపు మనఘ యిట్టు
లైన నితఁడు పగఱఁ బోనీక పొదివి య,స్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.

చ. గురుఁడును భీష్ముఁడుం జనినఁ గొంచెపుమూఁకలతోడ నేను సం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సడి సన్నపాండుభూ
వరసుతవర్గముం దొడరువాఁడన కా మది నిశ్చయించు టె
వ్వరిఁ గొని యింత నీ వెఱుఁగవా నినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. 246

క. ఇమ్మివ్వర[2]మ్ము సార,థ్య మ్మితనికిఁ జేయు మినుని కరుణుఁడు సాహా
య్య మ్మొనరిచినట్లుగఁ దిమి,రమ్ముక్రియన్ రూపు సెడి యరాతు లడంగన్.

క. అనిన విని కెంపుసొంపునఁ, గనుఁగవ యుగ్రముగ బొమలు గదియఁగ ఫాల
మ్మునఁ జెమటవొడమ నీసుతుఁ, గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్

సీ. నను నింతనీచపుఁబనికిఁ బంపఁగ నీకుఁ, దగునె భూవర వర్ణధర్మవిధము
లెఱుఁగవే శూద్రులు కేనాఁటఁ బరిచర్య, సేసిరి మూర్ధాభిషిక్తు లైన
రాజులు సూతజు రాధేయు దొరఁ జేసి,కొని వేఁను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల నీతని బలశాలిఁగాఁ దలఁచెదు, [3]నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె

ఆ. పగఱలోన నొకనిఁ బాల్పెట్టు మెట్టివాఁ, డైన సమయఁ జూచి యరుగువాఁడ
నట్టిభంగి సాల దండేనిఁ [4]దరవాయి, గొని వధింతు శత్త్రుకోటి నెల్ల. 249

---

1. క. బరవసము దగ్రముగన్. 2. గ. మితనికి సహాయమ్ముగ నినునకు ననూరు సారథ్యసహా
య మ్మొదవి-జ. మ్ము సార,థ్య మ్మితనికిఁ జేయు వినతతనయుసహాయ,త్వ మ్మొదవినరవిగతి. 3. క.
నా కింతకంటె బన్నంబు. 4. క. దరువాయి-గ. అరవాయి.

క. వినుమేను విక్రమింపఁగఁ, గనుఁగొని యెదు నంత వాఁడుఁ । గలఁడే కులశై
లనికాయంబు పగుల్తుఁ, వననిధులు గలంతు ధరణి । వ్రత్తుం గలయన్. 25

చ. నరవర చూడవే తెలియ । నా దగుబాహులు మద్బలంబు నీ
వరయక పల్కితే నొకని । కక్కట సారథి నై రథిత్వవి
స్ఫురణము దక్కనోపుదునె । సూతతనూజుఁడు షోడశాంశముఁ
దొరయఁడు నాకు వాసవసు । తుఁ మురమర్దనుఁ జేరికిం గొనన్. 251

వ. ఇట్లగు ఱుఁగక చెప్పితి. వెఱింగియుం గర్ణుపక్షపాతంబున నవమానించెదేని మా(ద్ర)
భూమికిం బోయి వచ్చెద నని పలికి రాజమధ్యంబున నుండి వెడలి పోవం జూచినం
గురుపతి సప్రణయబహుమానంబునం జని నిలువరించి సాంత్వనస్వరంబున మధుర
రాక్షరవిన్యాసంబుగా నతనితోఁ [1]గర్ణుండ యేల తక్కనీ కెక్కుడయిన రథికులుం
గలరే కడిందిపగఱకు హృదయశల్యం బగుటఁ గాదె నీకు శల్యుం డనునభిధానం
బయ్యె నాయభిప్రాయంబు వినుము ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు
మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీ వధికుండవు ధనంజయునకుఁ బ్రతి
వీరుంగా మనము కర్ణుం జాలించితి మది కృష్ణుండు సెల్లనీకునికిం జేసి కృష్ణువ
నంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుం గోరితి నింతపని నీకుం దక్క నొరులకు
శక్యం బగునే యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుండు. 252

క. ననుఁ గృష్ణుకంటె నధికుం, డని యిమ్మనుజేంద్రకోటి । యాకర్ణింపం
గొనియాడితి విమలయశో,ఘనుఁ డగుకర్ణునకు రథము । గడపెద నధిపా. 253

వ. అని యాసూతునందను నుద్దేశించి వెండియు నిట్లనియె. 254

క. జనవల్లభ యొకసమయము, విను మీతనితోడ నేను । విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు, నను నెగ్గులు పట్టకుండి । నం బొం దొనరున్. 255

క. అనుటయు గౌరవమున నీ,తనయుఁడు రాధేయుఁ జూచి । తగు నిట్లగుఁ గా
కని పలికి శల్యునిం గనుఁ,గొని యిది గడు లెస్స యనియెఁ । గురువంశనిధీ. 256

వ. ఇట్లభినందించి యున్నయన్న రేంద్రుం డమ్మద్రపతిమనం బురియాడునో యని శం
కించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు
తొల్లింటి పెద్దలవృత్తాంతంబు వినుము మార్కండేయమహాముని మాతండ్రి కేను
వినుచుండఁ జెప్పినయది నీకుం జెప్పెద సురలతోడి దురంబున నసురవరుండగు తార
కుండు దెగినపిదపఁ దదీయతనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును గమలా
క్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి. 257

దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురులవృత్తాంతంబు సెప్పుట.

క. దమమున నియమంబున ను,త్తమమును ఘోరంబు నై న । తప మతినిష్ఠం
బ్రముదితు లై చేయఁగ న,క్కమలభవుఁడు దోఁచి పరమ । కారుణ్యమునన్. 258

1. క. గర్ణుండ యేల తక్కనీ కెక్కుడురథికులుం.

వ. వరంబులు గోరికొం డనవుడు వా రందఱు నొక్కమాటయ కాసకలభూతంబుల
వలనను సర్వకాలంబులయందును నవధ్యత్వంబు మాకు నీ వలయు నని యడుగు
టయు నయ్యజుండు. 259

క. ఆచంద మెందుఁ గల దది, గోచరమే [1]యిచ్చుటకును గొనుటకుఁ దగుమై
సూచి యడుగుండు [2]శుభదం, బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్. 260

వ. అనవుడు నయ్యసుర లట్లేని మాకు ముగ్వురకు మూఁడుపురంబు లెల్లసుఖంబులుం
గలిగి కామగమనంబు లై దేవదానవయక్షోరగాదిజాతులకుం జెఱుప రాక విల
సిల్లునట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబుసొంపున నిర్భయుల మై పెం పొంది
సంచరించెద మనుటయుఁ బద్మభవుఁ డిది లెస్స దీనికిం దుది యిట్టిద యని నుడివి
యట్టిద గాకుండ నప్రమత్తుల రై వర్తిలుం డనిన నద్దనుజేంద్రు లప్పురంబు లెప్పు
డొక్కెడం గూడె నప్పుడు బలియుం డగువాఁడు సెఱుపం దలంచినం జెడునదిగా
నొడంబడితిమి త్రిపురంబులు సంగతంబులు గా కున్న నసాధ్యంబు లై వెలయ
వలయు నని పల్కిన నద్దేవుండు మీరు పురత్రయంబును సంపాదించుకొనుం డే
నమ్మహానుభావంబులం బొందునట్లు గా నిచ్చితి నని నిజస్థానంబునకుం జనియె
నిత్తెఱంగున. 261

తే. వరము వడసినయాదైత్యవరులు దమకుఁ
బురము లొనరింప దానవపూజ్యు మయుని
వేఁడికొనుటయు నాతఁడు విపులతపము
కలిమి నొప్పారుపురవరమ్ములు ఘటించె. 262

వ. అవియుం బ్రాకారగోపురప్రాసాదప్రముఖవివిధావయవంబులు పసిండియు వెండి
యు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసియోజనంబులు గలిగి యుండు నందుఁ
బసిండిం జేసినయది దివంబునను వెండి నొనరించినయది యంతరిక్షంబునను ని
నుమునం గావించినయది భూమిని సంచరింపను వరుసన వానికిం దారకాక్షుండును
గమలాక్షుండును విద్యున్మాలియు రాజు లయి దివ్యంబు లగునంబరంబులను నాభర
ణంబులనుమాల్యానులేపనంబులను మఱియు ననేకవిభవంబుల నుజ్జ్వలులై [3]నెగ
డుదు రిట్లు పురత్రయవిహారంబున జగత్త్రయంబును నాక్రమించి యసురత్రయం
బప్రతిహతవిభూతిమై వర్తించు నమ్మువ్వురుం దన్ను నాశ్రయించుటం జేసి వారల
యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్లం దన
మాయాబలంబున మయుం డొదవించుచుండు నవ్విధంబునఁ బరమసౌఖ్యంబు
లనుభవించు చుండ బహుకోటిసంవత్సరంబులు సనియె నట్టియెడ. 263

1. చ. నిచ్చువరము గొనుఁడు దగవుమై. 2. జ. సుఖదం బై. 3. జ. నెగడి రట్లు.

సీ. తారకాక్షున కొక్క తనయుండు హరి యన, జనియించి వారిజాసను గుఱించి
తపము సేయంగఁ బ్రత్యక్షమై యద్దేవుఁ, డడుగుము వర మన్న నతఁడు త్రిపుర
ములవార లాయుధంబులు దాఁకి చచ్చినఁ, బీనుఁగుల్ నీరిలోఁ బెట్టి తడుప
నొక్కఁడు పదుగురై యెక్కుడు లావును, బీరంబు మెఱయ సంప్రీతి నుల్ల
ఆ. సిల్లునట్టి బావి చిరతరతోయమై, మాపురములఁ జిత్రమహిమ వెలయ
నావహిల్ల వలయు ననిన నిచ్చితి నని, యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె. 264

వ. ఇట్లు మహాప్రభావంబైన[1] యబ్బావి వడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జరభయంకరు లగుచు భువనంబు లన్నియు బాధించుచుం బెఱిగి లోభమోహ వశతం బొంది విచ్చలవిడిఁ దిరుగం దొడంగిన దేవపితృమునిజనస్థానంబులకు హాని పుట్టినం బురందరుం డఖిలబృందారకులుఁ బరివేష్టింప నప్పురంబులపై నెత్తి చని పెనంగి భేదింపం జాలక విషణ్ణుం డయ్యె నంత నతండు దివిజులుం దాను సంయమి సహితుండై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా నద్దానవుల తెఱం గెఱింగించి తద్వధోపాయం బడిగిన నతండు వారల కిట్లనియె. 265

ఉ. ఏచిన యాపురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాని పెఱచొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చను దెంచెనేని మదనాంతకుచే నది సెల్లు నొండ్లకు
న్గోచర[2]మట్టె యింతలు పనుల్ సనుఁ డమ్మహితాత్ముపాలికిన్. 266

ఆ. అనిన నట్ల కాక యని దివ్యవర్షసహస్రకంబు వారలధికనిష్ఠ
నతులతపము సేసి యత్యంతశుద్ధాత్ములై మహేశుకడకు నరుగునపుడు. 267

వ. అవ్విరించిం బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి. 268

క. వరదు శరణ్యు శశాంక, స్ఫురితశిరోభాగు సర్వభూతేశ్వరు శం
కరు సాంఖ్యయోగనిష్ఠా, పరసులభు ననంగదమనుఁ బరమాత్ము శివున్. 269

### త్రిపురసంహారమునకు బ్రహ్మాదులు రుద్రునిం బ్రార్థించుట.

వ. కని ఫాలంబులు భూమి సోఁకం బ్రణమిల్లిన నద్దేవుండు మీరాకకుం గారణం బేమి యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి. 270

క. సత్యానుభావ నిర్మల, నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ చిత్, సత్యాత్మక భక్తలోకదౌర్గత్యహరా. 271

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై భవుం డాదరించి మీకు భయంబు వలవదు మీ చెప్పినయట్ల చేసెద వలయు కార్యం బెయ్యది యనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొంది నరవిందభవుం డప్పరమేశ్వరున కిట్లనియె.

---

1. క. యవ్వరంబు వడసి 2. క. మెట్టు లింతలు పనుల్ సనుఁ డమ్ము; మెట్లగుం జనుఁడు గొబ్బున నమ్ము

సీ. ప్రజలకుఁ బతి గాఁగఁ బనిచితి నీవు న, న్నట్లు పదస్థుండ నగుటఁ జేసి
విచ్చలవిడి వరం బిచ్చితి నసురత్ర, యమునకు దుర్గత్రయంబు గలిగి
యమ్మువ్వురును దారుణాక్రమమున భువ, [1]నత్రయసంబాధనం బొనర్చు
చున్నారు వారల నోరులకు నుడువ శ, క్యము గాదు నీవ శీఘ్రంబ చెఱుప
ఆ. వలయు మునులు దేవతలు నేను శరణుచొ, చ్చితిమి నిన్నుఁ గరుణఁ జేకొనంగ
వలదె మమ్ము నోరులు గలరె జగంబులు, గావ భూతనాథ నీవు దక్క. 273
వ. అనవుడు నద్దేవుం డయ్యసురులు సెఱుపవలయువా రగుదురు వారలు బలవంతులే నొంటిమై నాపనికి నుత్సహింప నేర మదీయంబు లయిన తేజోబలంబులం దర్ధంబు పుచ్చికొని మీరందఱుం గూడి యాదుష్టదైత్యుల మర్దించుట కార్యం బనిన నద్ది విజులు మా కందఱకుంగల తేజోబలంబులకు నద్దనుజుల తేజోబలంబులు రెట్టియయి యుండు నట్లగుటం జేసి మాచేతం జెడరు భవదీయ తేజోబలంబులు భరియింప మేము శక్తులము గాము మాయందఱ తేజోబలంబులలో సగంబు పుచ్చికొని నీవ యాశత్రుల సమయింపు మెల్లభంగిని నీకు రక్షణీయుల మగు మమ్ము రక్షింపు మనుటయు నజ్జగన్నాథుండు. 274
క. అమరులకు నసురులకు నే, సముఁడ శివం బఖిలభూతజాలంబులకుఁ
సమత నొనరింప శివనా, మము నాకుం జెల్లు లోకమాన్యం బగుచున్. 275
వ. అయినను. 276
చ. అనయముఁ గ్రూరకర్ము లగునట్టివిమూఢులఁ బిల్కుమార్పఁ బూ
నన తగు ధర్మవర్తను లనం జనుమీయెడ ద్రోహు లైనయ
ద్దనుజులఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేజముం బలం
బును సగపాలు వెట్టి ననుఁ బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్. 277
వ. అని మఱియు నొక్కటి సెప్పెద లోకంబుల కెల్లను బశుత్వంబును నాకుం బశుపతిత్వంబునుం గావలయు నట్లయినఁ బశుహననంబునం బాపంబు లేకుండు. 278
క. ఒనరింపుఁడు దివ్యరథం, బును దచ్చోదకుని నశ్వముల విల్లును న
మ్మును నాకు నట్టు లైనను, దనుజులదుర్గములు వినిహతము లగు నాచేన్. 279
ఆ. అనిన విని పశుత్వమునకు శంకించి వి, షణ్ణు లైనసురల చంద మెఱిఁగి
భయముగొనఁగవలదు పశుభావమోక్షణ, విధియుఁ గలదు దాని వినుఁడు మీరు.
వ. అని పలికి హరుండు వారలతోఁ బాశుపతవ్రతానుష్ఠానంబునం బశుత్వమోక్షణం బగు నదియును ద్వాదశాబ్దంబులు నడపవలయు నిష్ఠానురూపంబుగా సంవత్సరంబునఁ దదర్ధంబున ఋతువున మాసంబునఁ బండ్రెండుదినంబుల మాత్రను ఫలించు ననుటయు నట్లకాక యని వార లందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశు

---

1 క. నత్రయంబును బాధ నలఁచుచున్న, వారల నుడుప నెవ్వారికి శక్యంబు, తఱి గాదు శీఘ్రంబ చెఱుప నిపుడ.

త్వంబుఁ బశుపతిత్వంబుఁ గలుగుటకు నొడంబడి యమ్మహాత్మునిఁ బశుపతి యని
పేర్కొని నిజతేజోబలార్ధంబులు సమర్పించివం గైకొని యత్యధికబలుం డై తొల్లిం
టికంటె వెలింగె నప్పు డద్దేవునకు దేవతలు విభవంబెసఁగఁ బురహననంబునకయి
యభిషేకంబుసేసిత్వష్టనాలోకించి మహాదేవునకుదివ్యరథంబునుదగియెడుసాధనం
బులనుగల్పింపు మనవుడుఁ దపగప్రభావమహనీయుండగువిశ్వకర్మయవహితుండై.

సీ. సామర్థ్య మొప్ప విశ్వంభరాచక్రంబు, రథము గఁ జేసి చంద్రముని నుష్ణ
కరునిఁ జక్రంబులు గాఁ బెట్టి వారిధి, నతు మొనర్చి హిమావనీధ
రంబున వింధ్యనగంబున నస్తాచలంబున నుదయశైలమున [1]బలుపు
టవయవంబులు దీర్చి యగ్నుల మూఁటఁ ద్రి, వేణుకరచనఁ గావించి మేరు

ఆ. పర్వతమున నాతపత్రంబుఁ గల్పించి, హరులు వేదములు శరాసనంబు
వత్సరంబు శరము [2]వాసుదేవుండును, గాఁగ సంఘటించె గౌరవమున. 282

వ. ఇట్లు చరాచరాత్మకం బై తేజరిల్లునత్తేరు వీక్షించి ఫాలాక్షుండు గ్రహమండిత
వ్యోమమండలం బుపాదానకారణంబుగా విశ్వకర్మ గావించినకవచంబు దొడిగి
శరాసనంబు [3]ధరియించి శరంబు పుచ్చికొని దానవసంత్రాసనోత్సాహుం డగుచు
నారోహణంబు సేసి వృషభధ్వజంబునం బొలు పొంది. 283

ఆ. అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు, సంతసమునఁ జెలఁగ సకలమునులు
బహువిధములఁ దన్నుఁ బ్రస్తుతి సేయంగ, నమరవరులఁ జూచి యల్ల నగుచు.

క. సారథి యెవ్వం డనుటయు, వారలు నీచిత్తమునకు వచ్చినవానిం
గారుణ్యంబునఁ గైకొని, తేరు నడపఁ బనుపు మనిరి ధీరవిచారా. 285

వ. అనవుడు నద్దేవుండు. 286

తే. అరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ డతని
మీఱ నెఱిఁగి యొనర్పఁడు సారథిత్వ
మునకు నని చెప్పుటయు మహామునులఁ గూర్చి
కొని యమర్త్యులు సంభృతవినయు లగుచు. 287

వ. కమలాసనుకట్టెదిరికిం జని భక్తిం బ్రణమిల్లి దేవా నీవలన నీలగ్రీవుండు ప్రసన్నుం
డయ్యె భవదాజ్ఞ నే మితనికి రథంబుం దగుసాధనంబులు సమకట్టితిమి సారథిదొరక
కున్నవాఁ డది యెట్లనిన సారథ్యం బాచరించుపురుషుండు బలసత్త్వంబుల రథి
కున కధికుండు గావలసి యుండు రథంబు పృథ్వి రథ్యంబులు వేదంబులు రథికుండు
రుద్రుండు రథచోదకుండు సులభుం డగునే గుణాఢ్యుండ వగునీ విప్పనికిం బూన
వలయు దానవభయభ్రాంతుల మైనమమ్ము రక్షింపుము మా కేడుగడయు నీవ

---

1 ఆ. నవయవంబులు దీరిచి వర్గత్రయమునఁ ద్రి. 2 ఆ. వాయుసోమాగ్నులుఁ. 3 క. ధరియించి విష్ణుసోమాగ్నిసంభవం బై వెలుంగుశరంబు.

భవదీయప్రసాదంబున బ్రదికెద మని చాఁగిలి మ్రొక్కినఁ బరమాదరంబున
నెత్తి యప్పరమేష్ఠి వారలఁ గారుణ్యంబునం గనుంగొని. 288

ఉ. మీరు నిజంబ చెప్పితిరి మిక్కిలి నేర్పును లావుఁ గల్గినన్
సారథి పోరులన్ రథికసత్తముఁ దా గెలిపించు బుద్ధిదో
స్సారవిలాసభంగులకు శర్వుఁడు మెచ్చఁగ నాగమాత్మకో
దారహయంబులన్ నడపెదన్ దనుజుల్ వెఱఁ గందునట్లుగన్. 289

వ. అని పలికి సురగణంబు ముదంబునం బొదలఁ దనచేతికమండలు వొక్కెడ నిడి
జడముడి బిగియించి యజినపరిధానంబు దృఢంబుగాబంధించి ప్రణవంబునం ద్వ్యష్ట
యొనర్చినమునికోల పుచ్చికొని నొగ లెక్కె నిట్లు లోకపితామహుని సురలు
శంకరసారథ్యంబు సేయించి రని చెప్పి దుర్యోధనుండు వెండియు ని ట్లనియె.

క. హరు లమ్మ/హాత్ము లిరువుర, భరియించుట కోర్వ లేక పడుటయు నెత్తెన్
వెరవున లావున వాగెలు, ధరియించుచుఁ బద్మభవుఁడు ధరణీనాథా. 291

వ. ఎత్తి యత్తురంగంబులకు వీర్యశౌర్యంబులు గలుగ ననుగ్రహించి రథంబు గడపం
దత్కౌశలంబు గొనియాడి కామదమనుం డాదనుజులదుర్గంబులదెసకు నరదంబు
వఱపుము నేఁడు జగంబులయలజడి మాన్చెద నాచేతిబలువు సూడు మని పలికిన
నప్పరమసారథి మనోమారుతజవసత్త్వంబులు గలుగున వ్వేదాశ్వంబులం బఱప
నథర్వాంగిరసులు చక్రరక్షకు లయి [1]చనుదేర నత్తే రాపురంబుల కడరిన
నయ్యాదిమరథికుండు. 292

రుద్రుఁడు త్రిపురంబుల సంహరించి సురల సంతోషపఱచుట.

సీ. కోపసందీప్తుఁడై చాపంబు సజ్యంబు, గావించి మూర్వి మార్గణముఁ గూర్చి
పాశుపతాస్త్రసంబద్ధంబుగాఁ జేసి, పురములు మూఁటిని బుద్ధి నిలుప
నవి యొక్కచోటికి నప్పుడ కూడిన, మునులును సురలును ముదముఁ బొంది
గెలు గెలు మంచు నగ్గింప నయ్యుగ్రుఁడు, దెగ వాపి యేసిన [2]దితిజయుతము

ఆ. గాఁ బురత్రయంబు గాలి నీఱై పశ్చి, మాబ్ధిఁ దొరఁగ నమ్మహాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁ బురహరుఁ డది మాన్చె, సంతసిల్లె సకలజంతువులును.

వ. అప్పు డనిమిషమునిజనంబులు గృతకృత్యు లయి భూతనాథుం బ్రణుతించి యతం
డనుమతిసేయ నంబుజాసనుండు లోనుగానందఱు నిజస్థానంబులకుం జని రివ్విధం
బున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె నీవు నట్ల
పోలెఁ గౌరవరక్షణార్థంబుగా రాధేయురథంబు గడపు మిక్కర్ణునకు నక్కిరీటికిఁ
గృష్ణునకుం బలశౌర్యంబుల నెక్కుడయునవాఁడవు మదీయజీవితంబును రాజ్యం
బును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును సుఖంబును గావింపను నీవ
యొడయుండ విక్కార్యం బాచరించి నన్ను రక్షింపు మని ప్రార్థించి నీపుత్త్రుండు

1. ఖ. నడతేర. 2. గ. దివిజరిపుయుతంబుగాఁ బురత్రయంబు నీఱై.

మద్రపతికి మఱియు ని ట్లనియె. 294

సీ. ఇది యొక్క యితిహాస మే నొద్దనుండ ధ,ర్మప్రవీణుం డగు బ్రాహ్మణుండు
ధృతరాష్ట్రవసుమతీపతికిఁ జెప్పినయది, వినుము భార్గవవంశమునఁ బ్రసిద్ధుఁ
డగుజమదగ్నికి నత్యంతనిర్మల, మతి రాముఁ డుదయించె నతనిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన, నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును

ఆ. నమ్మహాత్ముఁ డశుచు లైనవారల నవి, నిర్దహించుఁ గాన నీవు పరమ
శుచివి గమ్ము నీకుఁ జొప్పడు నఖిలమ,హాస్త్రవీర్య మనియె నాదరమున.

వ. అనిన విని జామదగ్న్యుండు వినతుండై నా కెప్పుడు పాత్రత్వంబు గలిగె [1]నప్పుడు
నీవ తలంచి దయసేయుదువుగాక నీకు శుశ్రూషసేయుచుండునట్లుగాఁ బ్రసాదింప
వలయు నని విన్నవించిన విని కరుణాయత్తచిత్తుం డగుభవుం డవ్వరం బిచ్చిన న
మ్మహాత్ముఁడు [2]నియమనిష్ఠాపరుం డై పూజోపహారప్రముఖవిధానంబుల నద్దేవు
నారాధించుచుండ ననేకసంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు
ప్రసాదలసితాననుం డై గౌరీదేవికి నతనిం జూపుచు. 296

క. రాముఁడు విమలవ్రతచ,ర్యామహితుఁడు నాకు భక్తుఁ డని పలుమాఱుం
దా ముద్దు సేసి మృదువచ,నామృతసంసిక్తుఁ జేయు నాసమయమునన్. 297

వ. బలవంతు లగుదనుజులచేత బాధితు లయి బృందారకు లయ్యిందుధరుపాలికి
భయసంభ్రమంబులతో నరుగుదెంచి తమయలజడి యెఱింగించిన. 298

ఆ. జామదగ్న్యుఁ జూచి చయ్యనఁ జని దాన,వుల వధించి దేవతలకుఁ బ్రీతి
యాచరింపుమనియె హరుఁడు దానికిమది, మదముఁ బొంది కేలు మొగిచి యతఁడు.

క. అకృతాస్త్రుఁడ నగునాకుం, బ్రకటభుజాబలులు నస్త్రపారీణులు నై
సకలసురనికరసంబా,ధకు లగుదానవుల గెలువ దరమే యనుడున్. 300

తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ
దలఁపు నీదెస నిలిపెద దానఁ జేసి
పగఱ నిర్జింప నగుఁ బదంపడి మనోర
థంబు సిద్ధించు నరుగుము దడయ కనఘ. 301

చ. అనవుడు నట్ల కాక యని యాజమదగ్నిసుతుండు ధీరతం
జని సముదగ్రు లైనసురశత్రులఁ దీవ్రత[3]రాయుధోత్కరం
బున వధియించి వారిబలు పోటుల నొచ్చినమేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ గరంబున నంటి యాతనిన్. 302

వ. ఇవ్విధంబునం [4]బ్రకృతిస్థశరీరుం గావించి భర్గుం డాభార్గవుపయిం బ్రీతిశీతలం
బగునాలోకనం బొలయ నాతని కిట్లనియె. 303

---

1. క. నప్పుడ నీతలంచినట్ల దయసేసెదవు గాక. 2. గ. యమనియమానుష్ఠానపరత్వంబు గలిగి పూజో. 3. గ. గాఢగోత్కరం. 4. క. బ్రదీప్తశరీ.

క. అనివర్తనమతిఁ గవయఁగ, నని నీ దగుతనువు సునిశితాయుధములు [1]దాఁ
కిన నొవ్వఁడు శత్రులు పన్నిన నుడుపుము గర్వ మడఁచి నిర్మలచరితా. 304

వ. కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు. 305

క. కొను మని దివ్యం బగున,స్త్రనికాయము శస్త్రచయముఁ దద్దయుదయ ని
చ్చిన నవి యాతఁడు సాష్టాం,గనమస్కారంబు సేసి కైకొనియె నృపా. 306

వ. తదనంతరంబ లోకగురుం డగునాహారునిచేత ననుజ్ఞాతుండై యతండునిజస్థానంబు నకుం జనియె నయ్యితిహాసప్రకారం బిట్టిది యివ్విధంబున వివిధదుష్కరసత్కర్మానుష్ఠానఫలంబు లై వచ్చినసర్వదివ్యాస్త్రంబులు నారాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె నట్టిమహాత్ములు హీనకులజాతుల నాదరింతురే యప్పుణ్యపురుషుండుగ యికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుం డనితలంచెద వదనవక్షోబాహుప్రముఖాంగకంబులు సూడ దేవకుమారుండుంబోలె నున్నవాఁడు ప్రకృతికాంత కుండలవజ్రకవచంబులతోడ నాదిత్యసన్నిభుం డగుకొడుకుం గాంచునే సింగంబు లేడి కెట్లు వుట్టు నితనికి సూతసంవర్ధితుం డై నకీడు దొడరె నింతియ కానోపు రుద్రశిష్యత్వంబున విశ్రుతుం డగుభార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగునంగరాజు ననంగదమనుం బరిగ్రహించినవిరించిభంగిఁ బరిగ్రహించి నీవుసారథ్యం బాచరింపు మఖిలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయు ననునీతి నీవు ప్రసన్నుండ వగుటం జేసి నాకు సిద్ధించె ననుటయు. 307

తే. గ్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మాననమునఁ దొలిర్ప నృపకు
మార నీవు నాకొలఁది యిట్లరయ నెఱుఁగు
దేని నిది లెస్స నీకోర్కి యేను దీర్తు. 308

వ. అని మఱియును. 309

శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట.

క. వీనులకుం బలుకులు సేఁ, దైనను జెప్పుదు హితంబు లగుకార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం, గాని యలుక వలదు నీకుఁ గర్ణున కధిపా. 310

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ, హరున కజుఁడు నరున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ, శాలి నాకు నీవు సంగరమున. 311

వ. అనవుడు నట్ల కాక యని శల్యుండు వెండియు. 312

క. తగువార లొరులు దెగడుట, పొగడుట యగుపలుకుపొంతఁ బోవరు హితకా
ర్యగతులు సెప్పఁగఁ [2]దెగ డగుఁ బొగ డగు నెదురోర్వవలయు బుద్ధి గలిగినన్.

తే. శక్రు తేరైన నడపంగఁ జాలువాఁడ, [3]నుఱవు సెప్పుదు రథికు నేమఱఁగ[4]నీను

---

1. జ. దాఁకిన నొవ్వ కుండఁ జేసెద, విను మానుషకర్మ మడఁచి విమలచరిత్రా. 2. క. దెగ డఁగఁ, బొగడఁగ నెదు. 3. గ. నొఱవు; క. నొఱపు. 4. జ. నీక.

కృష్ణసారథ్యమునఁ దగుక్రీడి గెలువఁ, దలఁచునీ కేను గడపుట దగు రథంబు.

చ. అన విని భూవిభుండు ప్రియ మారఁగఁ గర్ణునిఁ జూచి దేవకీ
తనయుఁడు మద్రనాథునకుఁ దక్కువ మాతలియుం దలంప నీ
తని కెన రాఁడు భాగ్యముకతంబున సారథి యయ్యె నీకు నీ
యనఁ గొని నీవు పార్థునియహంకృతి మాన్పుము ధీరమానసా. 315

క. అని యతఁడు శల్యుఁ గనుఁగొని, వినతుం డై నీవు లావు వెరవును మెఱయం
దనుఁ గావ నంగపతి యర్జునుఁ గలన జయించువాఁడు రూఢిగ ననుడున్. 316

వ. అట్లయ్యెడుం గాక యని పలికి మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపం బగు సన్నాహంబు వాటించినం బ్రీతుం డగుచు సూతనందనుండు దనసూతు నాలోకించి తగురథంబునకుం గల్పన యొనర్పు మని సత్వరంబుగాఁ బనిచిన వాఁడును రయంబున దృఢసుందరం బగుస్యందనంబు సుకల్పితంబు సేసి తెచ్చి దీవించి యిచ్చిన నయ్యరదంబుఁ బూజింపం బురోహితు నియమించి తదీయమంగళవిధానానంతరంబ తాను నర్చించి కృతప్రదక్షిణుం డై ప్రణమిల్లి భాస్కరోపస్థానం బాచరించి సవినయంబున శల్యు నారోహణంబు సేయు మనుటయు నతం డచలతటంబునకు లంఘించుసింగంబుచందంబున నొగ లెక్కిన. 317

ఆ. మెఱుఁగుతోడి లలితమేఘంబుమీఁదికిఁ, బోయి వెలుఁగుభానుపోలుపు దోఁప
మద్రరాజసహితమహిత మై యొప్పన, త్తేరు కర్ణుఁ డెక్కి తేజరిల్లె. 318

వ. అని యిట్లు కర్ణసారథిత్వంబునకు శల్యుండు మెయికొనుట సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని విని యటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 319

చ. అవిరళదర్శనస్థిరమహామునిమానస[1]వాసఖేలనో
త్సవరసికా రసాత్మక నిరంతకృపాకరదివ్యచిత్తస
త్త్వవిభవసంభృతైక్యసుఖతామయదేహ నిరామయా పున
ర్భవపరిహార[2]హారిపదపద్మయుగ స్తవహృద్యసంస్తవా. 320

క. కమలవనసదృశదృగ్రుచి, సముదయశమితార్తిభక్త[3]సంఘా లక్ష్మీ
రమణత్వశివాప్రియతా, సమవా[4]యాలంబ్యమానసౌందర్యనిధీ. 321

మాలిని. అనుభవశమరమ్యా హంసభావైకగమ్యా
వినమదఘవిదారీ విశ్వలోకోపకారీ
దినకరశశినేత్రా [5]ధీపరిస్పందచిత్రా
దనుజమథనలీలా ధర్మతత్త్వానుకూలా. 322

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబునఁ గర్ణపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 323

1. గ. ఖేలనోజ్జ్వలోత్సవ. 2. గ. సారపద. 3. క. సంభృతలక్ష్మీ. 4. క. యాలంబ్యమాన. 5. గ. ధీపరిస్పంద



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## కర్ణపర్వము, ద్వితీయాశ్వాసము.



నిష్పాదననిపుణకృ
పానిరతిశయార్ద్రీభావ భావాతీతా
భానుసహస్రప్రభ ర
మ్యానంతవపుఃప్రకాశ హరిహరనాథా.

శల్యుఁడు కర్ణునుత్సాహంబునకు విఘ్నకరంబు లగువాక్యంబులు సెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనసుతుండు సూతసుతుకోర్కి దీర్పం బూని యతిప్రయత్నంబు సేయుట యాకర్ణించి యాంబికేయుండు. 2

ఆ. ఎట్లు ప్రియ మొనర్చె నట్లు సంప్రార్థితుం, డై నమద్రనాథుఁ [1]డంతఁ గోరి
తేరు గడప సతని తెచ్చికొన్నట్టియ, వ్వీరుఁ డేమిభంగి విక్రమించె. 3

వ. అని యడిగిన సంజయుం డిట్లనియె నట్లు రథిసారథులు విలసిల్లి వందిమాగధప్రస్తూయమాను లగుచుఁ దనవలనను గౌరవంబునం గనుంగొనుటయుఁ గురురాజయ్యంగరాజు నుద్దేశించి. 4

చ. గురుఁడును భీష్ముఁడున్ నరునకున్ బకవైరికి నగ్గలంబు వీ
రిరువురు వారి నిద్దఱ నహీనపరాక్రమలీల గీటడం
తురు ధ్రువ మంచు నాత్మఁ బరితోషముఁ బొందుదు నట్లు [2]గాక ని
ర్భరబలశౌర్యముల్ మెఱయ గ్రక్కున నాపని నిర్వహింపుమీ. 5

తే. బాడుదల నొండెఁ బట్టము పాండుతనయ
ముఖ్యు వీరు వారన నేల మునుము వట్టి
వైరివర్గంబు నెల్లను బారి సమరి
సైన్యయుతముగ నద్భుతజయము గొనుము. 6

1. క. నంత గోరి తేరు నడప. 2. గ. గాద నిర్భర.

వ. నడవు మనుటయు నమ్మాటఁ గైకొని కర్ణుండు శల్యునిం దేరు నడపు మనిన నతం డట్ల చేసె నప్పుడు శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వలంబు గావించె నివ్విధంబునం జని చని గర్వాగ్రహవిధేయుం డగు రాధేయుం డమ్మద్రపతి కి ట్లనియె. 7

శా. నారాచాదిమహోగ్రబాణపటలీ నానావిధోల్లాసముల్
సైరింపక ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ వి
స్మేరం బై ఖచరవ్రజంబు వొగడన్ మెచ్చంగ నీచూడ్కి దు
ర్వారోదగ్రత నేడు సూపెద భుజావష్టంభసంరంభి నై. 8

సీ. అన విని మద్రరాజాతని కి ట్లను, సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్యమహితులు భూరితేజోధను, లఖిలాస్త్రవిత్తము లార్యు లమర
పతి కైన రణమున భయము పుట్టింపంగ, నోపుదు రప్పాండుభూపతనయు
లేల వారల నింత దూలపోఁ బలికెద, విప్పుడు వల్కు రా దెట్లు నీకు

తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
వివరనము సేసినను భీముగద మెఱుంగు
లొలసి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను భ
యంబు పెల్లున నపుడు వా యడఁగుఁ గాక. 9

వ. అని వెండియు. 10

చ. నరునిశరంబులన్ రథగణంబులు గూలఁగ భీమునుల్లస
త్పరిఘమునన్ గజవ్రజము భగ్నము గాఁ బెలుతమ్ములున్ యుధి
ష్ఠిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం
దిర మయి నీవు నాలుకకుఁ దెచ్చినమాట గదా వినం దగున్. 11

క. అనుపలుకులు వినియుం దా, విననిచెవులు సేసి మద్రవిభుతో రాధా
[1]తనయుఁడు నాచేతిబలువు, గనుఁగొని మెద విపుడ యనియె గగం డమరంగన్. 12

వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుం డై నడతెంచునతని నుపలక్షించి. 13

చ. కురుబల ముబ్బి యార్చెఁ బటుఘోటకహేషితనిస్వనంబులుం
గరివరబృంహితధ్వనులు గాఢము లై విలసిల్లె నెత్తురుల్
గురిసె నభంబు మ్రోఁయఁ బిడుగుల్ మొరసెం బొరి నుల్క లెల్లెడం
దొరఁగెఁ బ్రదీప్తమారుతము ధూళిఁ గడున్ వడిఁ జల్లె భూపరా. 14

వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశం బగుటం దెలుపుచుం దోఁచెఁ దోఁచిన నవి యెల్ల సరకుగొనక వారు దైవమోహితులు గావున శల్యసహితుం డై నకర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁబడుదుర కాఁ దలంచి

---

1. గ. తనయుండు మాట లేటికిఁ.

సంతోషించి రతండు భీష్మద్రోణులదోర్వీర్యంబులు పాండుతనయులచేతం గోలు
పోయె నని మనంబున వారల మెచ్చక ముంగలి యై మెఱసి నడచు చుండి
పార్థపరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప మాన
దర్పోన్మాదంబున మద్రపతి కి ట్లనియె. 15

మ. అరదం బెక్కి శరాసనంబు గొని తెం పారంగ నే నేచి సం
గరసంక్రీడకుఁ జొచ్చినం దృణసముం గాఁ గొందు సద్దేవతా
వరు నైనన్ గురు నాపగాతనయుఁ జావం జూచుటల్ వైరు [1]లే
తురు చెండాడెద నుగ్రతం దలఁచు నాదోర్దర్పముం జూడుమీ. 16

వ. అని పలికి యనంతరంబ గాంగేయకుంభసంభవులంతటిమానుసులు నిట్లు రిత్త
సావు సత్తు రే యని యుగ్గడించి మఱియు ని ట్లనియె. 17

ఉ. వారల లోకవీరుల నవధ్యుల గీటడఁగించి పల్వురన్
వారలయట్ల యొందు ననివార్యు లనం జనుమేదినీశులం
బోర వధించి రౌద్రమునఁ బొంగి క్రమాగతమృత్యువో కా నాఁ
గా రణకేళికిం గడఁగుగాండివి నేన యెదిర్చి యోర్చెదన్. 18

ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ బావనియుం గవలుం జలంబు మై
నొండొరు మూదలించుకొని యొక్కటఁ దాఁకినఁ దీవ్రవిస్ఫుర
త్కాండవిదారితాంగకులఁ గా నొనరించి యలంచి లీల మై
గం డడఁగింతుఁ బోక పెనఁగం గలచంద మెఱింగి చెండుదున్. 19

వ. [2]అని వెండియు ని ట్లను భీష్ముఁడు దెగినను ద్రోణుదోర్విలాసంబునాస గలిగియుండె.

సీ. ద్రోణుండు బహుదివ్యబాణదీప్తుఁడు భుజా, బలశాలి శౌర్యసంపన్నహృదయుఁ
డక్షీణవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డ, వ్వీరుండు పార్థుచేఁ బోరఁ బడిన
ధార్తరాష్ట్రులయేపు దఱిఁగెఁ దదాప్తసై, నికులు గం డడఁగిరి నీ వెఱుంగ
నైనను రాముకృపాతిశయంబునఁ, గనినయారథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులును గలిమి నే, నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు నెల్లభంగిఁ గురురాజుమన్నన, యప్పు దీర్తుఁ బ్రాణ మాసపడక. 21

శల్యుఁ డర్జునపరాక్రమం బుగ్గడించి కర్ణునిఁ దూలం బలుకుట.

వ. అనిన విని శల్యుండు కర్ణున కి ట్లనియె. 22

చ. వినినజనంబు లీతఁ డవివేకి యనన్ వల దింతరజ్జ ల
ర్జునుబలశౌర్యసంపదలు సూచి యెఱుంగమె మున్ను నిన్న నా
తనిఁ గలనన్ జగం బెఱుఁగదా యతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్దివిజేంద్రనందనున్. 23

---

1. క. లేతురు. 2. ఆ. క. అని పలికి వెండియును ని,ట్లను భీష్ముఁడు దెగిన ద్రోణు♦నతులిత దివ్యా,స్త్రనిచయము దోర్విలాసం,బును జాలం గలిగి యుండె ♦ భూనుత మగుచున్.

సీ. రాత్రియై తాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి, వాసినయంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱవట్టి, మాన మేదినచిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుఁ గావ నేరక సిగ్గు, వడి చన్ననిర్జరప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగఁ, బెనఁగి చిక్కినత్రిలోచనునికంటె
ఆ. నెక్కుడైనవీరుఁడే నర్జునునితోడఁ, బొడుతు నొడుతు ననినఁ బోలుఁ గాక
వినుము సూతతనయ మనబోఁటు లాతని, జెఱుతు మనుట నోరిచేటుగాదె.

చ. నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు ను
గ్రపుబల మేచి తో నడవఁగాఁ [1]బెనుదాడిగఁ బోయి మత్స్యనా
థుపసులఁ బట్టి యుద్ధారలతోఁ జెడి పాఱితి కర్ణ యప్డు క
య్యపుబలు పాడె [2]దిప్డు మనయర్జునునమ్ములు దుప్ప వట్టెనే. 25

ఉ. ముందరియట్లు గాదు జనముల్ దెగడఁగ వెఱఁ బాఱ నేఁడు సం
క్రందనసూతి మార్కొని తిరం బయి పోరెద దాఁపఁ బ్రాణముల్
నిందకుఁ జాల నింక ననునిక్కపుఁబల్కులు వల్కు టొప్పు దా
నం దుదిఁ జచ్చినం జను మొనర్ నరుఁ దాఁకుట రిత్త వోవునే. 26

వ. అనవుడు నలుక వొడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కిట్లనియె. 27

చ. నరునకుఁ బూని పల్కితి విసనం జవి మాలినదొడ్డపల్కు లే
[3]నరగలి లేక బెట్టడరినప్పుడు సూడుము నన్ను నాతనిం
దిర మయి బాహుశక్తియును ధీరతయుం బెరవుం జలంబు నె
వ్వరిదెసఁ గాంచె దెక్కుడుగ వారి నుతింపుము మాను మంతకున్. 28

వ. అనుటయు నట్ల చేసెద నని పలికి శల్యుం డూరకుండెఁ దేరు వోనిమ్మని
రాధేయుండు దఱిమి పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా
నడపె నివ్విధంబునం జని మన మొన సొచ్చి సైనికులు సంతసిల్లి వారలం
గలయం గనుంగొని కర్ణుం డిట్లనియె. 29

సీ. వలను శోభిల్ల నెవ్వాఁడైన వీఁడె యర్జునుఁ డని నాకిప్డు సూపెనేనిఁ
బసదనం బే నిచ్చుభంగి యందఱకును, వివరించి చెప్పెద వినుఁడు మీరు
పొగడంగఁ దగురథ్యములతోడిసౌవర్ణ,రథములు వలసిన రయము లావుఁ
బొలుపును గలుగుకాంభోజహయంబుల, వలసినఁ [4]బేర్చుసత్త్వంబునందుఁ
తే. బరిణతము లగుసుందరకరివరముల, వలసినను జారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి, నెక్కుడమ్మేటిమగని కేనిచ్చువాఁడ.

క. మఱి యొక్కటి సెప్పెద ని,ద్దఱు కృష్ణులఁ జంపి వారిధనములు నాకి
త్తఱిఁ దత్రథ మిదియే యని, మెఱఁగించినయతని కిత్తు నేను ముదమునన్.

వ. అని పలికి శంఖంబు వొత్తిన దుర్యోధనుం డనుజసహితంబుగాఁ బ్రమోదంబు నొందె

1. గ. వెస దాడిగ: 2. గ. దీవు. 3. ఖ. నరవయి లేక. 4. క. చ. జ. బెక్కుశ్రవంబులందు.

నప్పుడు నిస్సాణాదితూర్యనిస్వనంబులు దిక్కులం జిక్కటిల్లె మనయోధవరులును వరూధినియు నుబ్బునం బేర్చి యార్చిననినదంబులు నింగి ముట్టె నయ్యెడఁ బ్రహాస భాసురముఖుం డై మద్రవిభుండు రాధేయున కి ట్లనియె. 32

ఉ. ఎవ్వరు సూడ నేల నరు ఱ నిప్పుడ కాంచెద రి త్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు ఱ గొం డని యీ వల దిట్టు లిచ్చినన్
నవ్వఁ జనంబు మిక్కిలి ధ ఱ నంబులు గల్గినఁ జేయ రాదె నీ
కెవ్విధి నైన సద్వ్యయము ఱ [1]లెందు నపాత్రపుటీవి యొప్పునే. 33

వ. అని యంత నిలువక. 34

క. కోలంది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియె దీవు ఱ గంటిమె సింగం
బుల నె త్తఱి నైనను [2]నే,పాలమున నేనియును వక్క ఱ పోరి గెలువఁగన్. 35

ఉ. అగ్ని సొరం దలంచునటు ఱ లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ
కె గ్గిది యూను [3]మీఁపలుకు ఱ లెవ్వరుఁ జెప్పఁగ లేరు దూ పఱ
న్మ్రగ్గఁగఁ గాల మయ్యెనొకో ఱ నావచనంబు లొకింత కర్ణము
ల్డగ్గఱ నిచ్చి యోధులు బ ఱ లంబులుఁ దోడు గఁ బోరు [4]టొప్పగున్. 36

ఆ. ఏను ధార్తరాష్ట్ర ఱ హిత మాచరించుట,కై పెనంగి చెవుల ఱ కప్రియంబు
లైన నిన్నిమాట ఱ లాడితి నాబుద్ధి, విని దురాగ్రహంబు ఱ విడుప వలయు. 37

చ. అనవుడు నల్గి సూతసుతుఁ ఱ డాతని కి ట్లను మద్బలంబు న
మ్మిన నను నిత్తెఱంగునకు ఱ మేకొన కుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబు గా దనినఁ ఱ జొప్పడునే నినుబోఁటి [5]కాప్తిఁ జె
ప్పినక్రియఁ జెప్పి నీవు వెఱ ఱ పించిన నే వెఱ పెక్కువాఁడనే. 38

వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుటకై శల్యుండు నుఱియు ని ట్లనియె.

తే. ఇప్పు డే నీకు బుద్ధులు ఱ సెప్ప నేల, నరుఁడు గాండీవగుణనిక్వ ఱ ణంబు సెలఁగఁ
గదిసి నీమెయి బలుతూపు ఱ గములు నిగుడఁ, జేసి నిను బుద్ధిమంతునిఁ ఱ జేయుఁగాక.

వ. అని యంతం దనివోక యతండు. 41

సీ. రోషమహాటోప ఱ భీషణహరితోడ, సమరంబునకు హరి ఱ ణము గడంగి
దానధారాభీల ఱ దంతావళముతోడ, సంగ్రామమునకు శ ఱ శంబు గడఁగి
చండస్వభావోగ్ర ఱ పుండరీకముతోడ, నాజికి సార మే ఱ యంబు గడఁగి
దారుణతుండాతి ఱ ఘోరగృధ్రముతోడఁ, గలహంబునకు నుర ఱ గంబు గడఁగి

ఆ. యడరునట్లు గాదె ఱ యస్త్రకళాసము,జ్జ్వలుఁడు పార్థుతోడ ఱ సంగరమున
కీవు గడఁగి యడరు ఱ టెల్ల రాధేయ నీ, కేటిబలము నమ్మ ఱ నెందుఁ గలదు. 42

---

1. లింతయపాత్రపుటీవి. అ. ప్ర. 2. క. బెబ్బులి సేనియు నెదిరి పక్కఱపోతు గెలువఁగన్.
3. అ. మన్పలుకు. 4. క. మొప్పగున్-గ. మెప్పడున్. 5. అ. కాప్తు చెప్పిన.

వ. అనిమె నివ్విధంబున నధిక్షేపింపంబడి కర్ణుండు గోపించి కెంపారుకన్నుల నాశల్యు నాలోకించి. 43

క. గుణవంతులగుణములు ని,ర్గుణుఁ డెఱుఁగమి ధెల్ల మీవు । గుణహీనుఁడ వీ
గుణ మితనియందుఁ గల దని, గణుతింపఁగ [1]నైపుణంబు । గలదే నీకున్. 44

సీ. అర్జును నస్త్రవిశద్యాప్రమాణంబు నా, యెఱిఁగినయంత నీ । వెఱుఁగ వతని
కోలఁదియు వనమాలికోలఁదియుఁగాంచి నా, కోలఁదియు నెఱిఁగి వాశరలమదీయ
దివ్యాస్త్రబలమునఁ । దెగటార్ప నగు నని, యే నిశ్చయించితి । నెట్టు లనినఁ
గడుఁబెద్దకాలంబు । గంధపుష్పాదుల, నర్చించు చున్నాఁడ । ననుదినంబు

ఆ. దానఁ గరంబు భక్తి । ననిచిన నున్నది, యహిమయంబు దారుణాస్త్ర మింత
యంతయనక యెదిరి । నాహుతి గొను దాన, జిష్ణు నోర్తు నొండెఁ । గృష్ణు [2]నోర్తు.

వ. భార్గవాస్త్రంబున నొక్కనిం బొరివుత్తు నట్లుఁగాక యాదవపాండవనివహంబు లోనం గృష్ణార్జునులయందు లక్ష్మీవిజయంబులు సుప్రతిష్ఠితంబులై యుండు నయ్యిరువురం బొడివి పెనంగం గనుటకంటె మేలునుం గలదే వారలగరుడకపి ధ్వజంబులుఁ జక్రగాండీవంబులు బెండుమానుసులకు భీషణంబులు నాకుఁ బరితోషణంబులు వేవురుగోవిందులుఁ బదివేవురుపార్థులుఁ బన్నినం బోరెద నీవు మహాయుద్ధకోవిదుండవు గామింజేసి వెఱచఱచి కాఱు లఱచెద వక్కడిపటుపాతంబునఁ బ్రేలెదవో యెఱుంగ నింక నిట్టిమాట లాడితేనిఁ బ్రాణంబులు కొఱ యొల్ల వని పలికి వెండియు. 46

కర్ణుఁడు శల్యునిపైఁ గోపించి యతనిదురాచారంబు లుగ్గడించుట.

సీ. విను పాపదేశసంజనితుండ [3]వగునీకు, దుర్బుద్ధి గాక సద్బుద్ధి గలదె
క్షత్త్రియాధమ నీచ । కలను లోకంబున, నాబాలగోపాల । మైనవాక్య
మతికుటిలుండు సంగతుఁడు గాఁ డేమిటఁ, జెలికిఁ గీ డొనరించుఁ । జెట్ట వలుకు
దుష్టాత్మకుఁడుఁ గడుఁ । గష్టుఁడు మద్రకుం, డనునంతవట్టుఁ బ్రత్యక్ష మయ్యె

ఆ. వావి లేక యెల్ల । వనితలుఁ బురుషులుఁ, గలయ మీరు నెగ్గు । గాక యుండు
మున్ను గల్లు పిదపఁ । జన్నుఁబాలై పెరుఁ, గుదురు సెప్ప నేల । గుణము లింక.

క. పలువురకుఁ బుట్టి నిచ్చలుఁ, గలు ద్రావుచుఁ బెరిఁగి [4]యెట్లు । గఱతురు శీలం
బులు నుచితము లగుభాషణ, ములు నీ విమ్మాట లుడిగి । పొదపొద మనికిన్. 48

చ. మఱియొకఁ డేను జెప్పెద నశేమానుషవిక్రమలీల నల్లడం
బఱపియుఁ జంపియుం రిపునృపాలకసైన్యము రూపడంచి మై
దొఱఁగుట యొప్పదే తనువు । దూఁటులు గాఁ [5]బెఱవారి గెల్వుకో

---

1. గ. సైనగుణము. 2 క. జ. దీర్తు. 3. క. గ. జ. వగుట దుర్బుద్ధియ కాక సద్బుద్ధి గలదె. 4. కీ. గ. చ. యిట్లు గడుదుశ్శీలంబులు ననుచితభాషణములుఁ, బలుమఱుఁ బలుకంగ నేల పద పద మనికిన్. 5. క. బెరవారి - చ. బలుపారి - జ. జెలువారి - గెల్వఁగా.

లుఱ దోఁకొ నాదు పెం పుడుపక నోపుదురే నినుబోఁటు లెమ్మెయిన్. 49

వ. కినియించి గదం దల వగుల వ్రేటువడక యూరక తేరు వోని మ్మనవుడు మద్ర
పతి యతని నవలోకించి. 50

ఆ. హితము సెప్పఁ దగనె యే నీకు నదియును, గాక నీరథంబు గడపు చుండి
కౌరవాధినాథకార్యార్థి నగునాకు, నున్నరూపు సెప్పకుండ నగునె. 51

ఉ. సారథి దక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానమున్ రణవిరోధంబు నిమిత్తశుభాశుభత్వని
ర్ధారణమున్ మదిం గని హితం బెఱిఁగించుట నీతి గాన నీ
వీరస మెత్తి నోఁ బలికి తేనియుఁ జెప్పెదు సూతనందనా. 52

వ. ఏ నేమితప్పు సేసిన గదం దల వగుల వ్రేసెదవు నీ వి ట్లంటివి గదా యని హి
తోపదేశంబు నూన నేర్తునే యిది యొకదృష్టాంతంబు వివరించెద వినుము
విని నీవు నాచెప్పినట్లు చేసి తేనియు మేలు సేయ కుండినం గడుమే లని యి
ట్లనియె. 53

సీ. అంబుధిలో నొక్కయలఘుతరద్వీపమున ధర్మవర్తి నాఁ జనునరేంద్రు
పురమున నొకవైశ్యవరుఁ డర్థ్వరాదిస, త్కర్మరుఁడును శాంతిదాంతియుతుఁడుఁ
గరుణాపరుఁడు దాననిరతుండు ధనధాన్య,శోభియు బహుపుత్రలాభవిలసి
తుండు నై వర్తించు చుండఁగ నిలు సేరె, నొకకాకి యతనిపుత్త్రకులు దాని

తే. కెంగిళులు వెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి
క్రొవ్వి కడు మిఱ్ఱి మెట్టిపక్షులును దన్నుఁ
బోల వనిమెడుదుర్మానమునఁ దృణీక
రించి యది పెక్కుభంగులఁ గ్రీడ సలుపు. 54

వ. ఇట్లు విహరించు చుండ నొక్కనాఁడు గొన్నిహంసంబులు పక్షబలంబున సుప
ర్ణుతో [1]సరిసేయం దగునట్టివి సముద్రంబుచేరువఁ జనం గని యాకోమటికొడుకు
లక్కాకంబునకు వానిం జూపి యి ట్లనిరి. 55

క. పులుఁగులలో నీ వెక్కుడు, విలసద్గతి నంచ లిట్లు వినువీథిఁ గరం
బెలమిం జనిమెడు వీనిం, గలసి పఱచి గెలువ వలదె [2]గతులబహులతన్.

వ. అని తారతమ్యజ్ఞానహీను లగునయ్యల్పబుద్ధులు సెప్పిన నుచ్ఛిష్టదర్పితం బగు
నదియును మౌర్ఖ్యంబునం దా నంతటిదాన నని తలంచి వానిదెసకుం జని మనం
బున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి తనచూడ్కికి వచ్చినయంచం
బుగుడించి పఱతము ర మ్మని పిలిచిన నయ్యంచ లన్నియు నిలిచి పెలుచ నవ్వి
యవ్వాయసంబున కి ట్లనియె. 57

క. మానససరసి వసింతు మ,హీనబలము జవముఁ బక్షు లెల్లను బొగడం

1. క. నొరయునట్టివి. 2. జ. గతిబహుగతులన్.

గా నెందుఁ దిరుగుడుము ద, వ్వైనను ఖేదంబు లేదు। హంసల మగుటన్. 58

59

వ. ఇట్టిమాయందును.

క. బలశాలి యైనహంసముఁ, బలిచితి పురుడించి పాఱ। [1]బేలతనమునన్
గలవే యింతకు మును హం,సలతోఁ బురుడించువాయసంబులు జగతిన్. 60

సీ. అనుటయుఁ గాక మి। ట్లను హంసములతోడ, గతులునూటొక్కటి। గలవు వాన
నొక్కటొక్కట శత। యోజనవ్యాప్తి నే, మెఱయుదుఁ బొడవుగా। మీఁది కెగసి
చనుట యచ్చటనుండి। చక్క నేలకుఁ జొడు, వట్టి డిగ్గుట దూర। పాతభంగి
సంగతి పసువడి। చాలులీలాగతి, వక్రయానము పల। యక్రమంబు

ఆ. లోను గాఁగ నెట్టు। లైనను మీకోరి,నట్ల పఱచి మేటి। యంచ యైన
దాని నిపుడ గెలుతుఁ। దక్కటియంచలు, భయమువొందఁ గాకి। యదువువొంగ.

~~~ కాకము హంసములో సముద్రముమీఁదఁ బఱచి భంగపడుట. ~~~

వ. అనుటయు విని మున్నాహూతం బైనహంసం బక్కాకంబు నాలోకించి. 62

ఆ. నూఱుగతుల నీవు। వాఱు దే నన్నియు; నెఱుఁగఁ బలుఁగు లెల్ల। నెట్లు వాఱు
నడరి యాకసమున। [3]నిడుబాట సట్ల పాఱుదము రమ్ము జలధి। చదల ననిన. 63

వ. అయ్యెడం గూడినకాకంబు లపహసించి శతప్రకారగతి యగుదీనితో నేకయాన
పర్యవసానహీనసముత్సాహదోహలి వగుని వెట్లు మచ్చరించెదవు పఱచి భంగ
పడియెదవు గాక యనుటయు నమ్మరాళం బాగమిం బాసి పఱవఁ దొడంగినం
దోన యవ్వాయసంబునుం బఱచె నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి
పాఱునట్టియెడ. 64

క. రాయంచ మందగతిఁ జను, వాయస మతితీవ్రభంగి। వలను మెఱసి లీ
[4]లాయితము లొప్ప బహుగమ,నాయాసము నొంది పఱచు। నగ్గలికమెయిన్.

ఆ. ఎలమిఁ గడచి పోవుఁ। బిలుచుఁ గ్రమ్మఱి వచ్చి
ముక్కు ముక్కుమీఁద। మోపుఁ జుట్టు
నేచి తిరుగు నీఁక। లీఁకలతో రాయఁ
నొరయుఁ జిత్రగతుల। మురియు నవ్వు. 66

వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకారప్రసరణచతురం బై సంచరించుటం జూచి
ముదితంబు లైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలి
గొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుళ్లి త్రుళ్లి యాడుచు మరాళంబు పరాభవంబుఁ
బొందెడుఁ జూడుం డని పెద్దయెలుంగునం బలుకుచుండఁ దదీయకలకలం బాలించి
హంసంబు భరితోత్సాహం బై. 67

క. పొడవునకు నెగసి యెప్పటి, పడమటి పెస నిగిడి పెలుచఁ। బఱచినఁ గూడం

---

1. క. గ. చ. జ. బేలుఁదనమునన్. 2. క. చ. సంగడిఁ బరువిడి. 3. క. గ. చ. నిడు
బాఱు - జ. విడువాఱు. 4. క. లాయతము నొప్ప.
~~~

గడురయమునఁ జని యంచం, [1]గడవం గా [2]కిలకఱచి కాకము పాఱున్. 68

వ. పాఱి పాఱి డయ్యుటయు నయ్యంచ యుదంచితత్వరితగమనకళావైదగ్ధ్యంబు మెఱయం బఱచిన [3]బీఱువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యిట్లని వితర్కించు. 69

క. నేరక తొడరితిఁ గాల్కొన, భూరుహములు లతలు గిరులుఁ బాద లేమియు లే వారయ బహుసత్త్వమయము, వారిధి డిగి సోఁకినపుడ వలయుం బొలియన్.

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి డప్పి సొగసి యవశత నంత కంతకు డిగుచు చున్నయక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె. 71

ఆ. నీ వనేకగతులు నేర్తు విది యొకగతిఁ, జనుట చెపుము వాయసంబ యేను గడవ నరిగి పిలువఁ గా నేల తడసెద, వెఱక లేటికిట్టు లెడల విడువ. 72

వ. అనియె నట్టియెడ. 73

క. తలకొని జలములు పక్షంబులు దుండము దోఁక సోఁకఁ బోరిఁబోరి నెగయఁ బల మఱి మెయి దిగఁబడఁగా, సొలసి యెగయలేక వాయసుఁడు వెగడొందెన్.

వ. ఇట్లు మున్నీటిసీటిప యుం బడి [4]నగ్గలం బగుదురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి పలుక నగుం గాక పలికినట్ల యెవ్వరికిఁ జేయఁ దీఱఁ బని తీరెం గదా యనిన రాయంచకు నక్కాకం బిట్లనియె. 75

క. ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ, బొంగినమెయితోడ గర్వమునఁ దిరుగుచు నా కుం గలదె యెందు నెదురు వి,హంగమపతి నైన గెలుతు నని మునుదలఁతున్.

క. నాకొలఁగి యిప్పు డెఱిఁగితి, నీకరుణాలోకనంబు నిగిడించి శర ణ్యా కావు నన్ను మగుడం, గాకులలోఁ గలుపఁ [5]దగవు గాదే నీకున్. 77

వ. అని యిత్తెఱంగున. 78

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ, గా కా యని చంచు [6]దెఱపగా నఱచుచు నీ రాకరమున మునిఁగెడున, క్కాకిం గలహంస పరమకారుణ్యమునన్. 79

క. వెరవునఁ దత్తనువుం దన, చరణంబుల నిఱికి యెత్తి చావుడిపి బల స్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్.

వ. ఇవ్విధంబునం దెచ్చి యెప్పటి నెలవున డించి రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటి కాకులు విన నింక నిట్టియవినయంబు లెన్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె నీవు నాకోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగినయక్కాకంబుచందంబునఁ గురు కుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు నీకొలఁది యెఱుంగవు దీనం జేటు వాటిల్లుఁ గాన లేటపడ నెఱింగించెద నాకర్ణింపుము. 81

1. క. గడవఁగఁ జనుకినుక నేచి. 2. క. గ. చ. జ. 'కిలుకఱచి'. 3. గ. బీఱు వడి-అ. బరువిడి.
4. గ. యగ్గలం బగుదురవస్థకు బెగ్గడిలునక్కాకంబు. 5. క. దరము గాదే. 6. గ. దెఱవఁగా నఱచుచు.

చ. విరటునిగోవులన్ మరల వెల్చి మదంబున నీదుతమ్మునిం
బొరిఁగొనఁ బార్థుఁ డాఁక కెట పోయితి నాఁ డలఘోషయాత్రలోఁ
గురుపతి డించి క్రీడి కృపకుం దగుపాత్రము సేసి యెక్కడన్
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ నాకు నేర్పడన్. 82

వ. అని వెండియు. 83

చ. పనివడి జామదగ్న్యుఁడు సభర్తన్ వినిపింపఁడె మీకు నెల్ల న
స్జనుభుజవైభవంబు మధుసూదను పెంపును నాఁడ ద్రోణశాం
తనవులుఁ జెప్ప రే బహువిరోధంబుల వారల గెల్వ రామి [1]మున్
వినమె యెఱింగియున్ మఱియు పీఱేఁడి[2]మాటలు వేయు నేటికిన్. 84

క. ఒంటిమెయిఁ దాఁక నాను,క్కంటికి వశ మగునె కృష్ణగాండీవుల ని
ట్లంట యుడిగి తగురథికుల, జంటగొని రణమ్ము సలుపు శత్రులు దలఁకన్. 85

తే. గొంతికొడుకును దేవకికొడుకు మనము
గనియెదము దినకరనిశాకరులుఁ బోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోతవిలసితంబు
తోడి దగుఁ గాక నీపెంపు దోఁపఁ గలదె. 86

వ. అనిన విని కర్ణుండు గమలనాభుని పెంపును బార్థుబలిమియు నెఱుంగక యే నేల వారిఁ దొడరెద నెట్లు సెప్పినను దొడరుదుఁ దొడరి వారొండె నే నొండె నగుదు నింతియ నీవు వెడమాట లాడక యుడుగు మని పలికి యచ్చటిమహీపతులు విన నమ్మద్రపతి కిట్లనియె. 87

కర్ణుఁడు శల్యునితోఁ దనకుఁ గలిగినశాపంబు తెఱంగు సెప్పుట.

సీ. తలఁచిన నెడకు సంతాపంబుఁ జేయంగఁ, జాలెడునట్టివి జామదగ్న్య
కోపంబు బ్రాహ్మణశాపంబుఁ గాక యే, సరకు గొందు నె మురహరుఁ గిరీటిఁ
జెప్పెద విను మస్త్రశిక్షార్థి నై మహేంద్రనగంబునకు జమదగ్నిసుతునిఁ
గోరి పోయినఁ గృపాంభోరాశి యగునమ్మహాముని గులము న న్నడుగుటయును

తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాఁగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ శిక్షించె నలఘుబహువి
ధాస్త్రశస్త్రసంవేదిఁ గా నతఁడు నన్ను. 88

వ. భార్గవాభిధానం బగుమహాస్త్రంబు లోనుగా ననేకదివ్యాస్త్రంబు లిచ్చెఁ బదంపడి బ్రాహ్మం బగునస్త్రంబు నొసంగె నొసంగి సమరంబున నాపత్సమయంబున దీనిం బ్రయోగింపుమని యానతిచ్చె మఱు నాఁడ త్తపోధనసత్తముండు మదీయాంకతలం

---

1. క. ఘ, వినమి యెఱుంగుదుర్. గ. మీ, వినమి యెఱుంగుచున్, 2. క. గ. చ. మాటలు బుద్ధిఁ జెప్పెదన్ - జ. జెప్పుచున్.

బున నొఱిగి నిద్రించుచుండ నొక్కజంతువు నాక్రిందితొడఁ దొలిచిన నామహా
త్మునకు నిద్రాభంగం బయ్యెడునని కదలకుండితిఁ దదనంతరంబ మేలుకని యతండు
నెత్తుటివెల్లువఁగని తత్ప్రకారం బడిగి యేను జెప్ప విని మద్ధైర్యంబున కచ్చెరువడి
నీవు బ్రాహ్మణుండవు గా వెవ్వండవని యొత్తియడుగుటయు వెఱచి సూతసుతుండ
నని చెప్పితిఁ జెప్పనప్పు డక్కీటకంబు నాలోకించిన నది యదృష్టపూర్వవికృతా
కారం బై యుండె నర్జునహితంబు గోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేట
పఱిచి యతనిం గోపింపం జేయువాఁడై కీటతనువు దాల్చి యిట్లు సేసెం గానోపు
నాసంయమి గోపించి కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి తది నీకు వలయు
కాలంబునఁ దోఁపమియు మృత్యు వాసన్నం బైనం దోఁచుటయు నాపద నుట్టిన
యెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుటయుం గలిగెడు మని శపించె నిది జామదగ్న్య
కోపంబు తెఱంగు బ్రాహ్మణశాపంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 89

సీ. [1]శ్రమమునకై యేను ✽ [2]సకలాంబకములు నెక్కుడు వెసనేయ న ✽ య్యెడకు నొక్క
యాఁబెయ్య యుఱికి నా ✽ యజ్ఞానమున నంప, తాఁకునఁ గూలుడు ✽ దానిఁ గలుగు
బ్రాహ్మణుం డధికకో ✽ పంబున నిది హోమ, [3]ధేనువత్సం బిట్లు ✽ దీని శల్య
నిహతంబుఁ జేసితి ✽ నీవు నావచనశ, ల్యంబున నిహతుండ ✽ వగుము నీకు

తే. సమర మేకాగ్రనిర్భరో ✽ త్సాహవృత్తి, నడవ నరదంబుచక్రంబు ✽ పుడమిఁ గ్రుంగి
వలయు నెవ్వీగు మార్కొని ✽ గెలువఁగోరి, శ్రమముసేసెదవతనిచేఁ ✽ జావు మీవు.

చ. అనుటయు భీతి వేఁడికొని ✽ యావులు వేయును నెడ్లనాఱునూ
ఱును రథముల్ శతంబును మె ✽ ఱుంగుల ముత్తెపుఁ బోనియంగనా
జనశతకంబు దంతిశత ✽ సప్తకముం గొని శాంతిఁ బొంద వే
యనినను మాన దయ్యె వసు ✽ ధామరుకోపము తీవ్రరూపమై. 91

వ. మానక యున్న మఱియును. 92

క. నాకుఁ గలసొమ్ము లెల్లను, నీ కిచ్చెద నను ✽ బ్రసాద ✽ నిరతకటాక్షా
లోకితుఁ జేయు మనుడు నతఁ, డీకాఱులు మాను మనుచు ✽ నేఁగెం బలుచన్. 93

వ. ఇట్లరుగుచు నలుక పెంపునం గన్నుల నిప్పులు రాల మరలి కనుంగొని నాపలుకు
లకు బొంకునుం గలదే నీకీదుష్కర్మంబు పరలోకంబునకు బాధకంబు గాకుండ
నిదియ ప్రాయశ్చిత్తం బయ్యెడుంగాక పొమ్ము సూతనందనా యే నెట్లంటి నట్లగుట
దప్ప దరుగు మనియెం గావున నాజామదగ్న్యబ్రాహ్మణుల శాపంబులకు వెఱతు
సత్యంబపలికితి నీయున్నరాజులును నాతోడిసుఖదుఃఖంబులకుం గలవారగుటం జేసి

1. క. గ. చ. 'శ్రవమునకై యేను వివిధాంబకంబుల'. 2. గ. వివిధాంబకంబుల, నెక్కుడు వెసనేయ ✽ నొక్కచిఱుత, యాఁబెయ్య. 3. చ. ధేనువువత్సంబు ✽ దీని నిట్లు.

కృష్ణార్జునులకు నే వెఱవ నింద్రయమవరుణకుబేరులు వజ్రదండపాశగదాహస్తులై బెట్టు ముట్టినను బెదర నని యుండుదుఁ దక్కినవారిం జెప్పనేల యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం దోఁచుచున్నది యన్నరుని యున్నెడకు మనరథంబు నడపుము పుడమి జనంబులు మదీయకోదండపాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు వందుచుండు నట్లు సేసెద నమ్మేటిమగని మృత్యునివాసంబు నొందించెద. 94

సీ. కాండమహాతరంగముల వైరుల ముంచు, విజయాంబురాశికి వేల నగుదు
బాణరశ్ములఁ బరిపంథులఁ బొదివెడు, నర్జునాదిత్యున కభ్ర మగుదు
విశిఖోగ్రశిఖల విద్విషుల నేర్చుకిరీటి, ఘోరదావాగ్ని కాసార మగుదుఁ
బ్రదరవేగమున నరాతులఁ గూల్చుపార్థానిలాయువునకు నచల మగుదు

తే. విల్లు వట్టెడువారికి నెల్ల నెక్కు, డనఁగ నెగడినగాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడుల ఘుప్ర, కారులకు వచ్చునే నాకుఁ గాక శల్య.

వ. అనిపలికిన విని యమ్మద్రపతి వీనియంతరంగంబు గలంగఁ దా నర్జునుచేతం జచ్చుట నిర్ణయించె నెట్లనిన నిట్టియప్పుడు జనులు దనమీఁదం జాలమి వెట్ట కుండుటకుం గాదె జామదగ్న్యబ్రాహ్మణులశాపంబులు భూపాలురు విన నుగ్గడించె నిక్కలంకయే నీరజ్జులానికి నర్జునుగుణవిశేషంబు లెఱింగించి మదం బడంచినకతంబునం గలిగెఁ గాంగేయాగ్రజునకు నాయిచ్చినవరంబు సఫలం బయ్యె నని మనంబునం దలంచె మనుజేశ్వర విను మాశల్యుండు సెప్పినయాఖ్యానంబునం జిత్తం బెరియ చునికిం జేసి యాసూతనందనుం డతనితో మఱియు నిట్లనియె. 96

—⊱ కర్ణుఁడు హంసకాకీయోపాఖ్యానము విని కోపించి శల్యుని దూఱుట. ⊰—

క. దృష్టాంతము సెప్పెద నని, కష్టాత్మా నీవు నన్నుఁ గాకము నరు ను
త్కృష్టమరాళము గాఁగ ని, కృష్టపుఁగథఁ జెప్పి తిది సఖిత్వము తెఱఁగే. 97

ఆ. నీచులకు బలంబు నెట్టన పరుసని, కాఱు లఱచు చున్కి గాన యిట్లు
వలికి తింతఁ జేసి భయ మయ్యెనే నాకు, నట్టిమాట లింక నాడ కుడుగు. 98

క. అడిగితి నే నిను నాక, వ్వడిభుజబల మెట్టి దని యవారణ నీ వి
ప్పుడు నృపు లెల్లను విన వా, విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్. 99

చ. అని మొన శత్రులం బొగడు టారయ మూర్ఖత గాదె యిట్టిదు
ర్జనుని సహింతురే పెలుచఁ జంపక సైరణ సేయుకాల మై
నినుఁ దెగఁ జూడ నైతి ధరణీపతి కయ్యము పైభరంబునన్
గొనకొని సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్. 100

వ. అని వెండియు. 101

తే. అకుటిలుం డగునాకు నత్యంతకుటిల
వృత్తి సహితంబు సేసెద వి త్తెఱంగు

మిత్త్రవంచన మారయ కై మైత్త్రిసప్త
పదకృతోద్భూతి యనియెడుకపలుకు వినవె. 102

క. జను లెట్టిది మిత్త్రవిధం, బని చెప్పుదు రట్టిచంద కై మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ, మన మూఁడిఁడి యుండు నా కకమంద్రప్రీతిన్. 103

క. జను లెట్టిది శత్రువిధం, బని చెప్పుదు రట్టిచంద కై మారయఁగా దు
ర్జనుఁడ వగుదీకు నాయెడ, వినుము కలిగె దీన మనసు కై విచ్చెం గుటిలా. 104

ఉ. కావున నీకు నప్రియముఁ కై గౌరవరాజునకుం బ్రియంబునుం
గా విధి మెచ్చ బాహుబలకగర్వ మఖర్వము గాఁగ లక్ష్మికిం
జేవయుఁ గీర్తి కున్నతవికజృంభణముం గలుగక్ ముకుందగాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గకడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 105

వ. అని పలికి మఱియును. 106

తే. భండనంబునఁ బార్థుచేఁ కై బడక [1]నేఁడు, సేలునే మైతి నేనియు కై మృత్యువునకు
నెన్నఁడును నగపడ నాకు కై నివ్విధంబు సందియము లేక చిత్తంబుకనందుఁ దోఁచె.

చ. వినుతమహాస్త్రముల్ వఱపి కై విక్రమసంపద నాకుఁ జూపున
ర్జునుభుజలీల కోర్చెద వకసుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు నవార్య మై యెడరు కై వుట్టక తక్కిన శల్య చూడుమీ
నను విశిఖావలీవిలసకనంబున నాతని యేపు మాపెదన్. 108

వ. నీకు వెఱపింప నయ్యెడుకొలందివారిని వెఱపింపుము కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని భయంబు గొనుటకుం గాదు కురుపతిసన్నిధి నీవు సారథ్యంబునకుం బూను చుండి పలికికొన్న బాసకతంబున బ్రదికి పోయి తనిన విని శల్యుం డీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి వినుము కర్ణ కర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే యనుటయు నితండు గినుక [2]నెఱ్ఱ నై నకన్నుంగవతోడినవ్వు నవ్వుచు నిట్లను ధృతరాష్ట్రుసన్నిధి నుత్తమద్విజులగోష్ఠి నఖిల దేశాచారవిదుం డై నవృద్ధబ్రాహ్మణుండు సెప్ప వింటి బాహ్లీక దేశంబునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి నగ్ను లై యసంగతదురాలాపంబులతోఁ దిరుగుదు రని తొడంగి యనేకప్రకారంబుల బాహ్లీక దేశనిందోపన్యాసంబు సేసె నట్టిబాహ్లీకుల కొడయుండవు తత్కృతంబు లగుపుణ్యపాపంబులు నాఱవపాలు నిన్నుం జేరు నట్లుంగాక వారియనాచారంబులు వారింపమింజేసి యాకల్మషంబు లెల్లను నిన్నుఁ బొందు బాహ్లీకులకంటె మద్రదేశజాతు లవినీతు లని యార్యులు సెప్పుదురు నిన్నేమి సెప్పం గల దింతవట్టు నెఱింగి నాలుక యడంచి యుండు మనవుడు నమ్మద్రేశ్వరుండు. 109

క. లావులు [3]రథాతిరథసం, ఖ్యావేళం దెలియఁ జెప్పెఁ కై గాదే భీష్ముం

1. క. నేను. 2. అ. నెఱ్ఱ నై నకన్నుంగవతో నవ్వుచు. 3. అ. రథ్యతిరథసంఖ్యా.

డావచనమ్ములు మనమున, భావింపుము క్రోధ మేల బలియుఁడ నీకున్. 110

తే. విడుతు రాప్తుల బంధుల వెలలు గన్న, నమ్ముదురు కులకాంతల నంగ దేశ
జనితు లగువారు విభుఁడ వర్జనుల [1]కిట్టు, లేలొకో నొడ్ల చరితంబు లెన్న నీకు.

క. పరదోషము సెప్పఁగ నే, ర్తురు గా కాత్మీయ మైన దోషంబు మదిం
బరికింపఁగ నధములు నే, ర్తురె తలఁపక యుంటి వలుకతో నుండకుమీ. 112

వ. అని యుల్లసం బాడి మఱియును. 113

ఆ. సకలదేశములను సన్మార్గవర్తులుఁ, గలరు దుష్టతతియుఁ గలిగి యుండు
మది నెఱుంగ నేర్చు మధ్యస్థు లదియును, నదియు నుగ్గడింతు రెదురు మెచ్చ.

వ. ఒకదేశంబు దాఁ గీడ యగుట కలుగునే యట్లుం గాక సదాచారదురాచారంబులు దైవం బెఱింగెడు [2]నీవనాత్మజ్ఞుండ వూరకుండు మనియె న ట్లియ్యిరువురు వివాదంబు సేయుట యాలించి చేరి కౌరవపతి సఖభావం బుపన్యసించి రాధేయురాజత్వగౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నాసూతనందనుండు నగుచు శల్యు నుద్దేశించి పోద పోద రథమ్ము పో నిమ్ము పో ని మ్మని పలికె న ట్లరిగి శల్యుండు సస్మితుం డగుచు వెండియు నర్జును [3]నుగ్గడించి కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబును నై యప్రతిహతమనోరథుం డగునారథికుతోడం బెనంగ నోపితేని నీవ మాకెల్లను రాజ వష్మేటిమగనియరదంబు మన మొగ్గరంబు చిక్కువఱుచుట గలుగు నని యెఱుంగ నయ్యెడు మన మేమఱక యుండ వలయు నీతోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. 115

శల్యుఁడు కర్ణునితో నప్పుడు దోఁచు నుత్పాతంబులు సెప్పుట.

క. పఱభులు మనచేరువఁ బె, ల్లఱచుట బెట్టెదురు గాలి యడరుట గ్రద్దల్
తఱచయి యాడుట వికృతపు, టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే. 116

వ. అని వెండియు. 117

ఆ. సిడము కామ సూడు వడఁకెడు మన తేరి, చుట్టు మెఱయఁ గట్టినట్టి చిఱుత
పడగ లందుఁ గంటె వెడలెడు మంట లు, గ్రంబు గాఁగ నోపు రణము నేఁడు.

వ. అనియె నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితం బయిన ధర్మతనయవ్యూహంబు గనుంగొని రథికవరులం దగినయెడల నమర్చి తన మోహారం బాయితంబు సేసికొని యురవడింప నమ్మద్రపతి య త్తెఱ్తి యాలోకించి. 119

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటులై నత్రిగర్తులేపు శో
భిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వొంగ వారలన్. 120

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లనియె సంశప్తక, బలముచేతఁ బొదువఁబడి కిరీటి

---

1. అ. కెల్ల, నొడ్ల చరితంబు లెన్న నీ కుచిత మగునె. 2. అ. నీవు నాత్మజ్ఞుండవు. 3. గ. వర్గించి.

మేఘపిహితుఁ డైన ♦ మిహిరునిచాడ్పున, వాఁడి లేక యున్న ♦ వాఁడు గంటె. 121

వ. అనుటయు శల్యుండు. 122

చ. వరుణుఁడు నీళ్లచేఁ జెడునె ♦ వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే సరుఁడు ♦ వోరుల నేపఱు టేల కల్గు నె
వ్వరికిని వానిఁ గీడ్పఱుప ♦ వచ్చునె గాలిఁ బరాభవింపఁగా
[1]దొరకొనినం జలంబుమెయిఁ ♦ దోయధి యంతయుఁ ద్రావ వచ్చినన్. 123

ఆ. దేవతలకు నైన ♦ దేవేంద్రపుత్త్రుని, నాహవమున గెలువ ♦ నలవి గాదు
మనము గెలుతు మిట్టి ♦ మాట లాతనిఁ జేరఁ, జనక యాడి దీన ♦ సంతసింపు. 124

ఉ. మేరువుఁబోలె నొప్పినసఁ ♦ మీరణపుత్త్రుని పేర్మి యొక్క మహో
దారుఁడు ధర్మనందనుసు ♦ దాత్తతయుం విజయానుజన్ము లే
పారఁగ నున్నసొంపును న ♦ హంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
[2]ల్వీరల మీఱి పొల్పసఁగు ♦ లీలయుఁ జూడుము సూతనందనా. 125

వ. పాండవులు ధర్మపరు లెవ్వాలన ధర్మంబు గలుగు నవ్వాలనికి జయంబు గలుగుట
దప్పదనుసమయంబున సంశప్తకకులంబుంగనుంగొని మనసైన్యంబునుసవ్యసాచిం
జూచి వారిసేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన గంగాయమునలసంపా
తంబుచందంబు దోఁచె నట్టియెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగురా
జులను సాదరావలోకంబున సంభావించి యట్లనియె. 126

ఆ. ఎద్ది ప్రియము సేయు ♦ నేపారుశూరుల
చిత్తములకు నది యు ♦ దాత్తభంగి
నొదవె మీకు బాహు ♦ మదమునఁ గొనియాడుఁ
డుగ్రశౌర్యమహిమ ♦ యుల్లసిల్ల. 127

క. బలు పెసఁగఁ బాండుపుత్త్రులఁ, బొలియించిన నతులరాజ్య ♦ భోగంబును వా
రలచేతం బొలిసిన నుజ్జ్వలనాకసుఖంబుఁ గలుగు ♦ ప్రాలుఁడు పోరన్. 128

వ. అనిన వార లందఱు నుబ్బి సింహనాదంబులు సేయఁ దూర్యనినదంబులు సెలంగ
సైన్యంబులు సంతసంబునం బొదలె నప్పు డశ్వత్థామ రథికజనంబులమనంబులం
బ్రమదం బెసంగ నిట్లనియె. 129

క. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగురు మీరు సూడఁ ♦ జంపినకష్టా
పాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియు కాని తొడిన ♦ మఱు వేసూడ్పన్.

క. కడువడి వడముడియును గ, వ్వడియు నలనిఁ గావఁ బూని ♦ వచ్చిర యేనిం
జెడుదురు మచ్చాపంబున, వెడలువివిధనిశితశిఖల ♦ వేఁడిమిచేతన్. 131

చ. అన విని యన్వరిష్ఠరథ ♦ కానలి పెల్లుగఁ బాండుపుత్త్రయో
ధసులపయిం వెసం గవియు ♦ నప్పము వార లుదగ్రవృత్తి సూ

1. అ. దొరకొనునే చలం...ద్రావ వచ్చునే. 2. అ. ల్వీరల.

ర్కొనినమహోగ్రభంగియును ఘోరపులీలల విస్మయం బొన
ర్చె సనిమిషాంతరంగములఁ జెల్లె రణంబు నుదీర్ణరౌద్రమై. 132

క. జనసంక్షయంబు పెల్లే, మన వచ్చుం బ్రళయకాల మయ్యెనొ కా కెం
దును నిట్టివి గలవే యని, మనమునఁ దలపోయ వలసె మముబోఁటులకున్.

వ. అట్టియెడ. 134

ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి యప్సరో
వ్రాతము గంధపుష్పపరివర్షణకేళి యొనర్ప సౌరభం
బాతతి సంచరించులలితానిలుఁ డెక్కుడు సేసి వీచె సం
జాతనవీనఘర్మజలజాలకసైనికలాలనీయుఁ డై. 135

ఉ. ఆసమయంబునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె వైరిసం
త్రాసనమత్తవారణకదంబసముద్భటుఁ డై యతండునుం
జేసె రణంబు దత్ప్రబలసేన దలంకెడునట్లుగా సము
ద్భాసితదుర్నివార్యబహుబాణవిసారణదారుణోద్ధతిన్. 136

క. పదపడి రాధేయుండు, న్మదవృత్తిం గవిసె గుణనినాదంబును బె
ట్టిద మగురథనిస్వనముం, జదల నిగుడఁ బాండవాగ్రజన్ముని దెసకున్. 137

వ. ఇట్లు గవిసిన మనసైనికు లిట్లని రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన నరుండు వచ్చి యడ్డంబు సొచ్చునపుడు. 138

చ. నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతిఘోరభంగి నం
దరయ నితండు గీటడఁచు నాతని నన్నటు లున్నవాఁడు దు
ర్భరరిపుబాధ దక్కి కురురాజు సుఖత్వముఁ బొందు నిప్డు రం
డరదము సేరి యీతనిమహాస్త్రవిలాసము సూత మేర్పడన్. 139

క. గెలు పెల్లభంగి నితనికిఁ, గలుగు ననుతలంపు వుట్టఁ గా నిపుడు మనం
బుల జనియించు మనోరథ, మలవడుటయుఁ బోర నెఱుఁగన య్యెడు నదియున్.

వ. అనుచుఁ గూడుకొని రథకరితురగసమ్మర్దనిర్దళితభూభాగంబు గా నురవడింప రాధేయుం డతిభీషణం బగురణంబున. 141

తే. మిగిలి యప్పాండవాగ్రజుమగఁటిమియును
జలముఁ గోల్పుచ్చి తూలఁ బోఁ బలికి మెఱసె
నధిప యతనికి వీఁకమై నడ్డపడఁగఁ
గడఁగునద్దెసయోధులగర్వ మడఁచి. 142

కర్ణుఁడు ధర్మజుపైఁ గవిసి విజృంభించుట.

వ. అనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియెఁ గర్ణుండు దన కొనిన యెట్లాయితంబుసేసెఁ గాంగేయముఖ్యసైన్యసన్నాహం బెట్టి దతం డతనిం బొదివినయప్పుడు గవ్వడి యెవ్వలనునుండె నవ్వీరుం డన్నకడనున్న నాసూతనందనున కట్లుసేయ వశం

బగుసే వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని యన్నరునిపై వచ్చి ఖాండవంబు గాల్ప కుండఁ గావం జాలెనే బ్రదుకున కాసపడుమగల కతని మార్కొన వచ్చునే రాధేయునకు వచ్చుం గాక యనుటయు. 143

తే. ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు
నంగపతి మోహరంబు తెఱంగు ధర్మ
సుతునియొద్దువిధంబు నర్జునుఁడు వారి
పోరునెడ లేమియును మీఁదిపోరు వినుము. 144

వ. కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు వలపట శకునియు నులూకుండును గుఱ్ఱపుదడంబులతో వారికెలనను సంశప్తకగణం బిరువదినాలుగువేలు ముఖ్యరథంబు లగ్గలిక నుల్లసిల్లి దాపటను నీకొడుకులందుఁ గొందఱు కాంభోజశకయవనసైన్యసమేతంబుగా వారియవులను బహుబలభాసితుం డై దుశ్శాసనుండు వెనుకనుం గతిపయసోదరపరివృతుం డై కురురాజు పిఱుందను నశ్వత్థామప్రముఖయోధులు గరినికరకృతసన్నాహు లై యన్నరపతి నియోగింప నతనిపజ్జ నిలువ నిజపుత్త్రులుఁ దనచుట్టునుం గదిసి మెసక మెసఁగుబరవసంబున మెఱయ సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకం బై నిలిచి పొలిచె నట్లు మోహరించి మదకలమాతంగంబులతఱుచుకతంబున మొయిళ్లమొత్తంబుల కైవడిం గాఱుకొనునమ్మొన నురవడి నడపించునాకర్ణునిం గనుంగొని కౌంతేయాగ్రజుండు గాండీవి రావించి యిట్లనియె. 145

ఉ. సూతతనూజుమోహరము సూచితె యెంతయు గట్టి యై సము
ద్ద్యోతితభంగిఁ దోఁచె నది యుక్కనఁ బై పడి యిబ్బలంబు ని
ర్ధూతము సేయ కుండఁగ నెదుర్కొని యెమ్మెయి నిల్వరింత మ
న్నీతి విధింపుమా బలుపు నేర్పును దద్జ్ఞులు పిచ్చలింపఁగన్. 146

వ. అనుటయు సంక్రందననందనుండు. 147

తే. సారవంత మై కర్ణునిసైన్య మురవ
ణించుఁ గా కేమి దీనికి నృపవరేణ్య
పూని చేయంగ వలయుఁ బ్రధానకార్య
మతని సమయించుటయ నాకు నది భరంబె. 148

వ. అనిన విని యమ్మనుజపతి యతని కిట్లను నట్లేని నీవు రాధేయుని గెలువుము భీమసేనుండు సుయోధనుని నకులుండు వృషసేనుని సహదేవుండు సౌబలుని శతానీకుండు దుశ్శాసనుని సాత్యకి గృతవర్మను ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్త్రుని ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటిధార్తరాష్ట్రులం దలపడువారేను గృపునితోడం బెనంగెద ననుటయు నట్ల కాక యని యతండు మున్న దననిలి

చిన నెలవునకుం జను నెడ నయ్యుధిష్ఠిరుపనుపు తెఱంగు వార లందఱకు నెఱిం
గించె నతండు వలపటివలన సైన్యాగ్రవర్తి యయ్యెను వృకోదరుండు వామ
పార్శ్వవర్తి యయ్యెను శైనేయద్రౌపదేయసమేతంబుగా నప్పాండవాగ్రజుండు
మధ్యభాగస్థుం డయ్యె నున్నయమ్మోహరం బాసూతనందను మొనయురవణి
సరకుగొనక మార్కొనియె ననవుడు నాంబికేయుండు. 149

మ. నరుఁ డమ్మై విని వచ్చె నన్నరునకున్ సంశప్తకశ్రేణికి
న్దుర మత్యుద్భటభంగిఁ జెల్లుటయు మున్ సూచించి తీ వయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియున్ జెప్పంగ వింటిన్ రణం
బరయం జిత్రము సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా. 150

వ. అని యడిగిన సంజయుం డమ్మానవపతి కి ట్లను నట్లు ధర్మజుండు సెప్పిన కాని
యయ్యిరువాఁగుం గదిసినప్పు డన్నియమంబు నడపక [1]కయ్యంపుటౌచిత్యంబున
నొండుదెఱంగు సెల్లె నది యెఱింగించెద నవధరింపు మవ్విధంబున మొనలు
రెండును నొండొంటిం బార్కొనుసమయంబున సవ్యసాచి గర్ణునడచుచక్కటికి
నడరం గడంగినఁ గ్రాలుకపికేతనంబు గనుంగొని తెంపుపెంపునఁ బొంపిరి
వోవుచుఁ ద్రిగర్తాదిసంశప్తకులు సరభసంబుగా నడ్డపడి పైకొని తఱిమి పొం
గినపయోనిధిం బోలిన నబ్బలియుండు సెలియలికట్టం బోలి నిలువరించి
మాతంగప్రముఖసేనాంగసకలాంగశకలంబుల నిలాతలంబు గప్పుచుండ నొం
డొండ పేర్చి యాబలం బాబలమర్దననందనువరదంబు ముంచికొనిన నవ్వీ
రుండు విజృంభితవిక్రముం డై బడబాగ్నికీలాకలాపంబుచందం బగుసాయకనికా
యంబు నిగిడించుచు నెక్కుడుమదంబున నమ్మూఁకలం ద్రెక్కొను చుండఁ
దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుండు. 151

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటు లైనత్రిగర్తు లేపు శో
భిల్లఁగ వారె యన్నరునిన్ బెట్టుగఁ దాఁకి రతండు నంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదెన్ నింగి గుణధ్వని వొంగ వారలన్. 152

వ. అని చెప్పి చూపెఁ బదంపడి భారద్వాజపుత్త్రునిబరవసంపుమాటల నాటోపంబు
మిగిలి మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని యాకర్ణించి తది యేర్పడ
వినుము వివరించెద. 153

సీ. కృపుఁడు సౌబలుఁడునున్ గృతవర్మయును నలిఁ
జెలఁగుమూఁకలతోడన్ బెలుచఁ గవిసి
కాశకైకయమాత్స్యకౌసలపాండ్యాది
బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ

---

1. క. చ. జ. 'కయ్యంపుటుచితంబున'.

నారెండువాఁగుల । నాయుధంబుల[1]మెడ
మంటలుఁ బొల్లును । మింటఁ బుడమిఁ
జూడ నక్కజము గ । శోణిత[2]ధామము
ప్రచురధూళీతిమిరములు నడఁప
తే. భగ్నరథములు నిపతితేభములు నిహత
హయములును మృతభటులును । రయమునకు వి
ఘాత మొనరింప నున్మదగమనభంగు
లందు బలువెర వొలయఁ బోరాడి రధిప. 154

వ. ఆలోన. 155

కర్ణుఁడు పాంచాలకుమారుల వనేకులం జంపుట.

ఉ. మేలిమదావళంబులును । మేటిహయంబులుఁ దమ్ముపిందు నా
భీలతఁ జుట్టి రాఁగ రథబృందములోఁ గురురాజు కర్ణుదో
ర్లీలకుఁ దోడ్పడం గడఁగె । రేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె । శౌర్యసముద్భటబాహువీర్యుఁ డై. 156

వ. అబ్బలంబునకు బాసట యై చేదిసైన్యంబును బెనుఁబ్రా పై పాండవానీకంబునుం దఱిమినఁ బెఱిగినదర్పంబునం బ్రదీప్తుం డయి యక్కర్ణుం డాగట్టిమూఁకలం దఱిసి మెఱుంగువాలమ్ములు వఱప నవి పీనుంగుపెంట లగుచుండ నుఱక యుక్కునం బొదివినబలుమగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి తమవారి కంటెఁ బ్రమోదభరితులం జేయుచు సాయకాసారంబులు వరఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల నాసేనలును గృపకృతవర్మాదియోధబృందంబులతో బెనంగుమొనలును నొక్కటిగాఁ గలంచి యందు శోణితజలంబులను మాంసమజ్జామస్తిష్కకర్దమంబులను బతితాతపత్రహంసంబులనుం బొలుచునట్టినదీప్రవాహంబులు వఱపె ననుటయు ధృతరాష్ట్రుండు ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి రిక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి రనుటయు సంజయుం డవ్విభున కి ట్లనియె. 157

తే. ఇవ్విధంబున సేనలక్రొవ్వడంచి
సూతసూనుండు ధర్మజుకేతనంబు
డెసకు నడర ధృష్టద్యుమ్నుఁ । డెసక మెసఁగ
బంధులును దాను వడి నడ్డపడియె నధిప. 158

క. వారలఁ గడచి ప్రభద్రకు, లారాధేయుపయిఁ గవియ । నాతండు మహో
దారుల నేడ్వుర భద్రా,కారుల నారాచస్తరకంబునఁ గూల్చెన్. 159

క. కని పాంచాలురు గోపం,బును దర్పము నెఱయ మెఱయఁ । బొదివిన రాధా

1. క. గ. చ. మొఱమంటలుఁ బొగలును. 2. క. గ. చ. ధారలు.

తనయుం డిరువదియేవురఁ, దునిమె నిరువదేను వెడఁద తూపులఁ బెలుచన్. 160

క. వెండియు నేపునఁ బైకొని, చండశరప్రకరములు వెసం గురియంగ ను
ద్దండతఁ బాంచాలురఁ గ,గ్గొం డేవురఁ జంపె నైదుఁ గ్రూరాస్త్రములన్. 161

వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి యాటోపదీపి
తుండయి చక్రరక్షకు లగు సుషేణసత్యసేనులును వెనుక బలసి వచ్చు వృషసేనుండు
నిమ్మువ్వురుగాఁ డుకులఁ గడిమిఁ దూఁకి కెక్కొం దనకు రణక్రీడకుం దోడుపడియెడు
నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం బాండవబలంబులం గలంచు నయ్యంగపతి మీఁద
ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖ పాంచాలకుమారులును సాత్యకినకుల
సహదేవ ద్రౌపదేయులును గేకయ మాత్స్య యోధవీర వ్రాతంబును భీమసేనపుర
స్సరంబుగాఁ దోఁతెంచిన బహుళజలధరంబులు ధరణీధరంబుపయిం గురియు
పెనుసోనచందంబు దోఁప వివిధాస్త్రశస్త్రంబు లతనిపయిం దొరఁగింపం గనుం
గొని కౌరవేశ్వరుండు దుశ్శాసన శకుని తదీయ తనయులు దన కెలంకులం దఱుమఁ
గరిఘటలతోడం గడంగి యవ్వాడముడిని మార్కొని. 162

క. తానును వారును దూపుల,వాన పయిం గురియ నతఁడు వారించి గళ
ద్దానాంబులోలమధుకర, మైన గజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్. 163

క. పొదివెడునప్పుడు శౌర్యో,న్మదుఁ డగు నయ్యనిలతనయు మార్గణములు బె
ట్టిదముగఁ గవియుడు నోటఱి, యెదురుప లేరైరి కురుకులేంద్రుఁడు వారున్.

మ. బలుగాలిం నలుదిక్కులం జెదరు నభ్రశ్రేణి[1] మాడ్కిం సము
జ్జ్వలసూర్యాంశులచేత విచ్చు నిబిడ ధ్వాంతంబు చందంబుఁ జూ
డ్కులకుం దోఁచెఁ బ్రచండసంగరపటిష్ఠుం డైన యాభీముతూ
పులమొత్తం బడరం గరిప్రకర ముద్భూతార్తి మై తూలినన్. 165

వ. అట్టియెడం గృపప్రముఖరథికులు రాధానందన భవన్నందనులకుం దలకడచి పవస
నందను పార్శ్వంబులం దఱుము ధృష్టద్యుమ్నాది యోధులం దలపడిరి దుశ్శాసన
ప్రభృతులును వారిం గూడికొనిరి కర్ణనందను లక్కిమ్మీరమర్దనుం దాఁకి రందు
సుషేణుండు. 166

క. ఖరభల్లంబున నాతని, శరాసనము ద్రుంచి నారసములు రయము మై
నురమున నేడు సొనిపి ని,ష్ఠురనినదం బెసఁగ నార్చెఁ సురలు నుతింపన్. 167

భీమసేనుఁడు గర్ణనందనుఁ డగు సత్యసేనుం జంపి విజృంభించుట.

సీ. కనలి యొండొకవిల్లుఁ గొని కీచకాంతకుఁ, డక్కుమారుని చాపయష్టి విఱుగ
నేసి మై బల్దూపుఁ లీరేడు నాటించి, తన్నడ్డ దొడరు రాధాతనూజు
నుబ్బువాలమ్ములుఁ డెబ్బదిమూఁట వా,రించి తత్సుతుఁడు దోర్కల్లల మెఱయఁ
జేరిన నాసత్యసేను రథ్యంబుల, సూతుఁ గార్ముకమునుఁ గేతనంబు

1. 'మాడ్కిన్' అనియే వ్రా. ప్ర.

తే. నేడుదూపులఁ దునుమాడి వేఁచి మూఁడు
నారసము లంగమున గ్రుచ్చి నాళమునకు
వికసితాంభోరుహముఁ బాపు వెరవు దోఁపఁ
దునిమె వెసఁ గత్తివాతియమ్మున శిరంబు. 168

వ. తునిమి దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కటిరథికజనంబులపయి నడరి [1]కృపకృతవర్మాదిరథికవరులకోదండంబులు దుండంబులు సేసి వారిం గ్రూరమార్గణంబుల మర్దించి దుశ్శాసనుని సాయకత్రయంబునను సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను స్రుక్కించి యులూకుని నతనితమ్ముని నొక్కుమ్మడి విరథులం గావించి కర్ణుకొడుకుం గని యోరిసుషేణా పొలిసితి పొమ్మనుచు బలునారసంబు నిగిడించిన నది నడుమన కర్ణుండు నఱికి మెఱుంగుటమ్ములు మూఁడు మేనం బఱప నుఱక మఱియు నట్టిమార్గణం బక్కుమారు నుపలక్షించి యేసిన నా సూతనందనుం డదియునుం ద్రుంచి యవ్వాడముడిమీఁదఁ ద్రిసప్తతితీవ్రప్రదరంబులు వరఁగించె నప్పుడు నకులుండు గవిసిన. 169

ఆ. చిత్రచాపముక్తశితశరపంచక, హతశరీరుఁ జేసె నాసుషేణుఁ
డేచి నకులుఁ డతని నిరువదియమ్ముల, నొంచి కర్ణుమనము నొవ్వ నార్చె.

చ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిదివాఁడితూ
పులు మెయిఁ జొన్పి విల్ దునిమి పొంగిన నొండొకదీప్తచాప మ
గ్గలిక దలిర్ప నెత్తి వెసఁ గార్ముకదండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తము గఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్. 171

ఆ. అన్యచాపలసితహస్తుఁ డై కడఁగి సు, షేణుఁ డతనిపష్టిబాణగాఢ
నిహతదేహుఁ జేసె సహదేవుఁ డడరిన, మేటితూపు లేడు మేన గ్రుచ్చె.

క. అయ్యిరువుర యబ్బాలుని, కయ్య మమరదైత్యరణముకరణి మహోగ్రం
బయ్యె వృషసేనుఁ డత్తఱి, నియ్యని సాత్యకి నెదిర్చె నిషుచయ మడరన్.

సీ. సాత్యకి వృషసేను సప్తసప్తతిమార్గ, ణంబులఁ బొదివి బాణత్రయంబు
సూతుమైఁ బఱపిన నాతఁ డాతని పెనుఁ, [2]గడఁత వాలికయమ్ము గాఁడ నేయఁ
గోపించి మూఁడుబల్దూపుల సారథి, నొకభల్లమున విల్లు నుజ్జ్వలాస్త్ర
సప్తకనిహతి నశ్వంబుల నేకకాండస్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి

ఆ. శినివరుండు వక్షమున మూఁడుశరములు, నాట సొగసి కర్ణనందనుండు
వెలిసి కనలి వాలుఁ బలకయుఁ గొని తేరు, [3]డిగ్గ నవియు నతఁడు నుగ్గుసేసె.

వ. ఇవ్విధంబున విరథుండును నిరాయుధుండును నగునక్కుమారుం గనుంగొని దుశ్శాసనుండు రయంబున నెయిది నిజరథంబుమీఁదికిం దిగిచికొని తోలంగం గొనిపోయిన నతండు వేఱొక్కయరదం బెక్కి యెప్పటియట్ల తండ్రి తేరి వెనుక వర్తించె నయ్యంగపతి దొమ్మిదియమ్ము లడరించి శైనేయుసూతాశ్వచాపంబులు

1. క,గ,చ. కృపకృతవర్మలకోదం. 2,గ. గణఁత వాలమ్మున. 3,ఆ. డిగ్గి కవియు నవియు నుగ్గు.

రూ పడంచి యతనిఫాలమ్మున మూఁడువాలికయమ్ములు నాటించె నాసత్యక
నందనుం డన్యస్యందనారూఢుం డయి కవిసి కర్ణునకుఁ దోడుపడుబలంబులం
గలంచి యతనితనువున నేను నారసంబులు నిగిడించెఁ గూడికొని శతానీకుం
డన్నియశరంబు లేసె నప్పు డురవడించి తక్కటిద్రౌపదేయులు డెబ్బదిమూఁ
డును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం బదిపదియు భీమసేనుం డఱువదినాల్గును
సహదేవుం డేడును నకులుండు ముప్పదియును [1](యుయుధానుం డేడును) బాండ
వాగ్రజుండు నూఱును బాణంబు లాసూతపుత్త్రుపయి గుప్పించి నొప్పించిన.

క. మదమున నతఁ డందఱఁ బది,పదితూపుల నేఁ బడంచి బహువిధగతులం
దదనీకంబునఁ దేరొ,ప్పిదముగ వడి సంచరింపఁ బెద్దయు మెఱసెన్. 176

శా. శైనేయుండును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడున్ ద్రౌపదీ
సూనుల్ మున్నడరంగఁ గిట్టి విశిఖస్తోమంబు లొక్కుమ్మడిన్
మేనన్ గ్రువ్వ శిఖండియున్ భుజబలోన్మేషంబు చూపన్ వెసం
దా నయ్యోధుల సూతసూతి [2]విరథత్వాస్త్రఘ్నులం జేసినన్ 177

వ. వియచ్చరులు వెఱఁ గందిరి వెండియు నవ్వీరుండు వారల నందఱ నస్త్రధారలం
బొదువుచు నే త్తెఱం బెఱవారిని బాణాంధకారంబునం గప్పినం ద్రిప్పికొనియును
దొలంగియుఁ దెరలియు మరలియు నారథికసంఘంబు దైన్యంబు నొందె నంత
ధర్మనందనుని బాధింపఁ [3]దలం పెద్దిన. 178

క. అరాధేయుం డాతని,పై రయమునఁ గవియుఘోరభంగిఁ గని మహో
దారంబుగఁ జేదిబలము, బోరన నెడసొచ్చెఁ దూర్యరవములు మొరయంగన్.

ఉ. సూతతనూజుఁ డబ్బలము చొచ్చి శతత్రయయోధవీరులం
జేతులతీఁట వో నుఱుము సేసి విశృంఖలదర్పదుర్దముం
డై తఱుమంగఁ గల్పితరథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం
బ్రీతునిఁ జేయుచుం గడిమిఁ బేర్చిరి సాత్యకియున్ శిఖండియున్. 180

క. వారికిఁ దోడ్పడి యక్కడి,వీరులు గొండఱు గడంగి వివిధోగ్రశరా
సారము లంగాధీశ్వరు,పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్. 181

క. కురుపక్షయోధులును స,త్వరులై యారథికవరులఁ దాఁకి భుజావి
స్ఫురణము చూపిన నద్భుత,కర మయ్యెఁ దదవసరంబుకయ్యం బధిపా. 182

వ. ఆసంకులసమరంబునందు. 183

శా. బాణజ్వాలలు బిట్టు పర్వ గగనప్రక్షోభణజ్యాలతా
క్వాణస్ఫూర్తి ఘటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవనభస్మీభావనిర్వాపా
రీణం బై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే ముబ్బఁగన్. 184

1. ఇది వ్రాఁతప్రతుల లేదు. 2. అ. విరథధ్వస్తాంగులం. 3. గ. జ. దలఁ పెత్తిన.

వ. అమ్మహోగ్రవిజృంభణంబున. 185

క. ఆటోప [1]మడఁగి యచ్చటి, మేటిమగలు తిచ్చవడిరి [2]మెఱుఁగలి కర్ణుం
డేటలవికిఁ గవిసె ధనుర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజుఁ బెలుచన్. 186

వ. ఇత్తెఱంగునం గవిసిన నతనిమీఁద నమ్మేదినీనాయకుండు సాయకజాలంబులు పరఁగించిన నతం డుఱక యతిరయంబున నవి వారించి. 187

సీ. నవ్విభుఁ జాపంబు సడిమికిఁ ద్రుంచి మై, మఱువుఁ దొంబదిశితమార్గణముల
భేదింప రత్నప్రభాదీప్త మగునది, సౌదామనీచారుజలద మంబు
జాప్తునితనువున కడ్డ మై యుండి వా, తాహతం బై పాయునట్టువోలెఁ
బడుటయు మణినయాభరణసుందర మైన, యతనిగాత్రము సతారాంబరంబుఁ

తే. బోలి యప్పుడ యాసూతపుత్త్రుచేత, రక్తమయ మైనపల్లవోద్రిక్తకల్ప
తరువుచందంబు నొందె నతండు రాజ, ధర్మ మూఁది చలింప కదల్చె నధిప. 188

వ. ఇట్లదల్చుచు. 189

క. చదల మెఱుంగులు పర్వం, గొదమపిడుగునట్ల నిగుడఁ గుంతీసుతుఁ డు
బ్బు దలిర్ప శక్తి వైచిన, నది కర్ణుఁడు సప్తభల్లహతి నెడఁ దునిమెన్. 190

సీ. పాండవాగ్రజుఁడు దర్పంబును వేగంబు, నొప్ప నవ్వీరునియురమునందుఁ
గరముల ఫాలభాగంబున నాల్గుతో, మరములు సొనిపి నెత్తురులు వఱపి
యార్చినఁ బేర్చినయగ్గలికంబున, నాసూతనందనుఁ డతనిసూతుఁ
జంపి కేతువుఁ ద్రుంచి శాతశరంబుల, నంగంబు నొప్పించె నపుడు సాత్య

తే. కియు శిఖండియు నెడసొచ్చి రయము బలువు
మెఱయ రాధాతనూజుని మేన నమ్ము
లొక్కమొగి నింప నయ్యోధుఁ డుఱక వారి
విరథులుగఁ జేసి విండులుఁ విఱుగ నేసి. 191

క. తనువులఁ బటుబాణంబులు, నినిచి వెగడుపఱచి కడచి నిరతిశయరయం
బునఁ గదిసి ధర్మనందను, ననేకసాయకపరిష్కృతాంగుం జేసెన్. 192

వ. ఇవ్విధంబున రాధేయుండు నొప్పించినం దదీయసంరంభంబు సైరింపంజాలక యమ్మహీపతి హతసారథికం బగురథంబు డొలంగం దోలుకొని పోయినం దోడన తవిలి నిలువరించి హాసభాసితుం డగుచు నయ్యంగపతి యతనితో నిట్లనియె. 193

కర్ణుండు ధర్మరాజు నొప్పించి యవమానించుట.

సీ. క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ, మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి
నట్టిసి [2]కిట్టిమహాహవమునఁ బ్రాణ, ములు డాఁచికొన శాత్రవులకుఁ దొలఁగి
పోవుట దగునె నీబుద్ధి గానఁగ నయ్యె, నృపనీతి యెఱుఁగవు నీవు బ్రాహ్మ

1. గ. ముడిగియక్కడి. 2. క. మేగలి-జ. మేగరి. ఇట మాడు కర్ణ. ౧. ఆ. ౧౧౬. పద్య. మైగలి దుస్సహేసుఁడుగా. 3. క. గ. చ. కిట్లు మహా.

ణాచారవేదివి । యాగాధ్యయనముల, వర్తింపు కయ్యంబు । వలవ దుడుగు
తే. మింక ననుబోఁటిఁ దొడరిన । నింతకంటె, నెడరు వాటిల్లు వేగ పో । మ్మింటికడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడ । కైన నరుగు, మేను దెగ నీదుప్రాణాన । కింత నిజము.

వ. అని పలికి గొంతివచనంబులు మనంబున నునికిం జేసి వధియింప నొల్లనివాఁడై యప్పాండవాగ్రజు విడిచి యాపురుషసత్తముండు తదీయసేనాసముదయంబు నానాస్త్రనిహతంబు సేసె లజ్జాకులమానసుం డగునమ్మానవపతియును దత్ప్రదేశంబున నిలువక తొలంగి పోయెం బోవుటయు. 195

క. విను మతనియోధజనములు, మొనయుఁ దిరిగె నట్లు సమర । మున విముఖం బై
చనునబ్బలముం గని వెను, కొనియెం గర్ణుండు నీదు । కొడుకులుఁ దానున్. 196

క. పటుసింహనాదతూర్య, త్కటరవగుణనిస్వనములు । గలసి యఖిలది
క్తటదారణకేలిసము, ద్భటములగుచుఁ గురుబలమునఁ । బరఁగె నరేంద్రా. 197

ఉ. ఇమ్మెయి సూతనందనుని । యేత్తెఱ కోడినయోధవీరసం
ఘమ్ములఁ బాండవాగ్రజుఁడు । గన్గొని పేర్కొని పేరెలుంగునం
గ్రమ్మఱ దెంచుకౌరవని । కాయముగర్వ మడంపుఁ డన్నదై
ర్యమ్మిగురొత్త వే తిరిగి । రారథికుల్ మఱలెన్ బలంబులున్. 198

వ. ఇవ్విధంబున వృకోదరపురస్సరంబుగాఁ బాండవబలంబులు మార్కొనినమన మూఁకలుం గూడికొని తిరం బై [1]త్రోచి తలపడుటయు నయ్యిరువాఁగునందు.

మ. కరిబృందంబులు ద్రెళ్లెఁ బెల్లుగఁ దురంగస్తోమముల్ పెక్కు గూ
లె రథానీకము లగ్గలంబు గెడసెన్ । లెక్కింపఁ బెక్కైన కా
ల్వురమొత్తంబులు రూపడంగె సిడము । ల్నుగ్గయ్యె నన్నేల నె
త్తురు వెల్లిన్ మునిఁగెన్ మరుత్ఖచరపం । క్తుల్ వెక్కసం బందఁగన్. 200

వ. అట్టిసందడిగయ్యంబున భీమసేనుండును శైనేయుండును బెట్టిదంపుటురవడింగవిసిన ధృష్టద్యుమ్నాదిరథికప్రకరంబును బరవసంబుసేయం గురుబలంబు వెఱచఱచిపఱచినఁ గర్ణుం డదల్చి కరతలం బెత్తి నిలునిలుమని పలికిన నమ్మోహరంబు నిలువ దయ్యె నవష్టంభవిజృంభితుండై నయాసూతసూనుండు వెండియుం గౌరవుల[2]వేఱువేఱ పురికొల్పి మరల్చిన నమ్మొనయును మొగకట్టి నిలిచె నంతం బవమానసూనుం దాను మార్కొన నగ్గలించె నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తిస్యందనం బెక్కి యున్నతమయన్నవలను సాత్యకిధృష్టద్యుమ్నులకుం జూపి వారలతో ని ట్లనియె.

ఉ. ఈతఁడు దుర్దశం బొరసె । నేను గనుంగొనఁ గర్ణుఁ డేచి దు
ర్నీతిపరున్ సుయోధనునిఁ । బ్రీతునిఁ జేయుటకై కడంగె మీ
చేతికి నిచ్చి [3]యి ట్లరువు । సేసెద నిన్నరనాథు నాకు నా

1. క. తోడంబడుటయు. 2. గ. పేరువాటి-క. చ. వేరువేరం. 3. అ. యిల్లడము; క. ఠ. యి ల్లెరవు:— ఇది 'యిల్లఱువు' అని యుండనోపు.

సూతతనూభవున్ సమయఁ జూడక పోదు విషాద మెమ్మెయిన్. 202

క. ఏ నొండె నతనిచే నా, చే నొండె నతండు దెగుట సిద్ధముగ మదిం
బూని కడంగెద మీ రీ, భూనాథునిఁ గాచికొనియ పోరు నడపుఁడీ. 203

చ. అని పటుసింహనాదమున నంబరముం బగిలించి తేరు క
ర్ణునిదెసఁ బోవ నిచ్చినఁ గనుంగొని శల్యుఁడు కర్ణుతోడ ని
ట్లను మనమీఁద వచ్చు ననిలాత్మజుఁ జూచితె యంతరంగ మే
ర్చునలుక కామిషం [1]బిడఁగఁ జూచినచందము గాన నయ్యెడున్. 204

చ. అలిగిన మూఁడులోకముల నైనను జీరికిఁ జేకొనం డితం
డలఘుపరాక్రమస్ఫురణుఁ డర్జునసూనుఁడు నాత్మపుత్త్రుఁడుం
బొలిసిర కాని కోపమునఁ బొంగఁడు [2]నాఁడును నాఁడు నింత దో
ర్బలమును శౌర్యసారముఁ దిరం బగు చూపఁడు మెచ్చఁ జూపుమీ. 205

చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కిట్లను నట్టివాఁడ కా
కనిలజుఁ డల్పుఁ డెట్లు సమరాగ్రమునన్ భవదుక్తియట్ల [3]యిం
తను వగు నే కిరీటిఁ దెగ టార్పఁగ నీతని నొంపఁ జంపఁ [4]దాఁ
గని వెస వచ్చు నాతఁ డధికం బగుమద్బల మపు సూడుమీ. 206

చ. తర మిడి చంపెఁ గీచకశతంబు నితం డది ఖేల యెల్లెడన్
బిరు దనఁగా బలాఢ్యుఁ డనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగున్ వృకో
దరుఁ డటు లైన నీతనిమదం బడఁగించుట లీల నాకు నీ
వరదము సమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగ నిమ్ము భూవరా. 207

ఉ. నావుడుఁ దేరు మద్రనరనాథుఁడు భీమునిదిక్కు దగ్రతం
బోవఁగ నిచ్చెఁ దూర్యరవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల న
ప్పావని నవ్వుచున్ బలము వాయ వడం గడుబెట్టు గిట్టినం
జేవ దలిర్ప నారథికసింహునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్. 208

వ. కప్పి యాలోన. 209

క. వెస నతనియురము బలునా, రసమున నొంచుటయు నతఁడు రాధేయతను
ప్రసరన్నవనారాచో, ల్లసితుం డై మెఱసెఁ గురుబలంబు దలంకన్. 210

ఉ. సూతతనూభవుం డనిలసూనునిచాపము ద్రుంచి వేచి యు
ద్ద్యోతితమార్గణంబు మెయి నుచ్చి చనన్ నిగిడింప నొండువి
ల్లాతఁడు ధైర్యసారము రయంబును జూపఁడు మెచ్చ నెత్తి సం
స్ఫీతశరోత్కరం బతని పేరుర మాడఁగ నేసి యార్చినన్. 211

తే. ఈడఁబోక రాధాసుతుఁ డేసె నిరువ, దేనునారాచములు పవమానతనయు
కత్తళము దూఱి యంగంబు గాఁడి పాఱి, నిలువ కట చని మేదినీతలము సారఁగ.

1. క.గ. బడుగఁ. 2.క.గ. వాఁడు నితండు నింత. 3.క.గ. యిం, తనఁ దగు నే. 4.క.గ. గాఁ గని.

మ. అలుకం గెంపు గనుంగవం గదురఁగా నప్పాండవుం డేసినం
గులిశంబో యనఁ బ్రజ్వరిల్లి నిగిడెన్ ఘోరంపుభల్లం బుర
స్స్థలి భేదిల్లఁగఁ దేరిమీఁదఁ బడి మూర్ఛం బొంది కర్ణుండు ని
శ్చలతం జచ్చినయట్టు లుండె వెఱఁ దత్సైన్యంబుఁ దూలెం గడున్. 213

భీముండు కర్ణుని మూర్ఛితుం జేసి నాలుక గోయం బూనుట.

వ. అప్పు డయ్యనిలతనయుండు దనయరదంబు గదియం దెచ్చి యాసూతనందనుం
గనుంగొని యిన్నీచునాలుక గోసెద ననుచుం గట్టినయలుఁగు వెఱికి యతనియర
దంబుమీఁది కరుగ నుత్సహించినం జూచి మద్రవిభుండు వారించి యిది మూర్ఛ
గాని మరణంబు గా దీయవస్థ నాలుక గోసినం జచ్చు నితనిం జంపుటకుఁ బార్థుండు
ప్రతిన వట్టినవాఁడు నీవు సంపిన నతండు నెవ్వగం బొందు ననిన విని యవ్వీరుండు
వీఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండ నై యది మఱచితిం
గాని చావు గామియు నిట్టియెడ నాలుక గోయం [1]దడవఁ జచ్చుటయు నెఱుంగుదు
ని త్తెఱంగు నీవు దలంపించి లెస్సచేసి తిద్దురాత్ముండు సభలోన నసభ్యంబు లగు
మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించినకోపం బజాతశత్రునకుఁ బ్రియం
బుగా నడంచికొని యుండితి నేఁడు తద్వేదన వెలార్పం జూచితి నట్ల చేసితి నేని
మానధనుం డైనధనంజయుండు దనచేసినపూనిక నెఱపం గానక మనంబునం
[2]గుంది మఱియుఁ గృష్ణయుధిష్ఠిరులు నాతనితోడివార యింతప్రమాదంబు నీవు
గలిమిం దెలిసితి మే లయ్యె మాతులా నీయాజ్ఞ యుల్లంఘింప నని పలికి నిలిచె.
శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె ననుటయు నాంబికేయుండు సంజయున
కి ట్లనియె. 214

క. పాండవుల నాజి నోర్చు ని,తం డని మీరాజు సూతతనయునిఁ బొగడున్
గం డడఁచె భీముఁ డిట్టిమ,గండుఁ గలఁడె పిదప నెట్లు గయ్యము చెల్లెన్.

భీముఁడు శ్రుతవర్మాది కురుకుమారులఁ బెక్కండ్రఁ జంపుట.

వ. అనవుడు సంజయుం డాంబికేయున కిట్లను నట్లు బాధితుం డయినరాధేయుం గనుం
గొని కురుపతి దమ్ములతో భీమసేనుచేత సూతసూనుండు గడు నొచ్చెం గావలయు
వేగం బెయిదుఁ డనుటయు శ్రుతవర్మాదికుమారులు గొందఱు పటుగతిం గవిసి
యక్కౌంతేయుం జుట్టుముట్టిన నతండుఁ దదనుచరుల సేనాటయేఁబండ్రువీరరథి
కులం బిలుకుమార్చి శ్రుతవర్మశిరంబు భల్లంబునం ద్రుంచిన నది ముఖకాంతి మెఱ
యం జంద్రమండలంబు మహి కెఱఁగు తెఱంగుఁ దోఁపం బడియెఁ బటుబాణద్వ
యంబున వికటునిసముని బెట్టేసిన బెడిదంపుగాలిం దూలుతరువులకరణి ధరణిం
ద్రెళ్ళిరి తదనంతరంబ తీవ్రనారాచంబునఁ గ్రాథుం గూల్చి నందోపనందుల నొక్క-
పెట్ట పెక్కమ్ములం బొరివుచ్చె నిట్లు నీకొడుకులార్వురుం దెగినఁ దక్కటివారువిచ్చి

1. క. గ. రామియు నెఱుంగుదు. 2. జ. గుందు మఱియు.

దైన్యంబు నొందిన సైన్యంబు గలంగ నంతకుఁ దెప్పిటి యొప్పటిబరవసంబు
శోభిల్లం గర్ణుండు గడంగి డగ్గఱి. 216

చ. అనిలజుమీఁద నేయ నతఁ డాశరముల్ దునుమాడి సప్తకాం
డనిహతుఁ జేసె నాతని దృఢప్రదరంబులఁ గప్పె నాతఁడున్
వినుము సముజ్జ్వలప్రదరవిద్ధునిఁ గా నొనరించి యమ్మరు
త్తనయుఁడు పేర్చి యార్వ వసుధావర యారథికుం డుదగ్రుఁడై. 217

మ. పదిబాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీతదీప్త్యుజ్జ్వల
ద్గద వైచెం బవనాత్మజుం డది యొడ్డఁ ఖండించె నవ్వీరుఁ డు
న్మదుఁడై పాండవుఁ డొండువిల్లు గొని నానాకంకపత్త్రంబులం
బొదువం గర్ణుఁడు నొంచెఁ దత్తను వతిస్ఫూర్జద్ఘనాస్త్రంబులన్. 218

వ. దానం గోపించి. 219

చ. పటుతర మైననారసము పాండునృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమున బెట్టు గ్రువ్వ సుగతం బయి వీఁపున నుచ్చి పోవ ను
త్కటధరణీప్రకంపచలితం బగుశైలముఁ బోలి తాల్మి మి
క్కుటముగ రోమరంజితముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్. 220

చ. రయమునఁ బంచవింశతిశరంబులు మేన నిగిడ్చి భల్లసం
చయహతి విల్లు సక్కడఁచి సస్మితవక్త్ర సహస్రపత్త్రల
క్ష్మీ యతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి నొచి విద్విష
ద్భయదగదారుచిస్ఫురితబాహువిలాసవిభాసమానుఁడై. 221

వ. అరదంబు డిగ్గ నుఱికి కర్ణునిదెసం గవియం గురుపతి సేనం గలయేనుంగులం బది
యేడింటిం బురికొల్పిన నవి దివాకరుఁ బొదువునంబుదంబులచందంబున నాజెట్టి
మగనిం గిట్టిన నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం జదుపుటయు సౌబ
లుని ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట నురవడించిన వాని
ప్రాపున నరదంబులుం గాలుబలంబులుం గవిసి కూడికొని పొదివిన మఱం
బొదవి యమ్మహాబలనందనుండు దారుణరణవిహారంబున నొండొండ పేర్చిన
యబ్బలం బుజ్జ్వలానలంబున వైచినచర్మంబుచాడ్పున ముడింగి యొదిఁగె నప్పు
డాశకునియోధులు పంచశతరథికులు రభసంబున నడరిన వారల సూతాశ్వ
కేతుస్యందనసమేతంబుగా నఱిముఱి నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని
యగ్గాంధారరాజు వనుపం గడంగినయవనదేశీయు లగునాశ్వికులం ద్రిసహస్ర
సంఖ్యుల నవ్వడముడి పొడిసేయుచప్పుళ్లు నార్చిచ్చు వెమురుటడవి నేర్చుచెఱం
గునం దోఁచె నిట్లు గడపండువు సేసి యొండురథం బెక్కి యుక్కొంతేయుండు
భండనంబు సేయ రాధేయుండు పాండవేయాగ్రజుం దాఁకి తీవ్రప్రకాండంబులం

గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు దొలంగ నీడ్చికొని పాఱిన వెనుకొనునయ్యంగపతిం గనుంగొని. 222

ఉ. భీముఁ డదల్చుచుం దఱుము భీమగతిం గవియింప నాతఁ డు
ద్దామత మాఱుకొన్న వివిధస్ఫురదస్త్రపరంపరాద్వయ
శ్రీ మొన లప్పు డచ్చెరువుఁ జెంది నుతించె మురాంతకానుజుం
డామరుదాత్మజుం గడచి యంగపతిన్ వెసఁ దాఁకెఁ దాఁకినన్. 223

క. ఆయిరువురనిబిడకనత్సాయకపటలములు నిగుడ సరి మధ్యాహ్న
స్ఫాయత్ప్రభాఢ్యుఁ డయ్యెం, దోయజబాంధవుఁడు మింటఁ దోఁపక యుండెన్.

వ. వా రొండొరులశరపరంపర లడఁగించి రాసమయంబున. 225

చ. తనకరముల్ నిగిడ్చి [1]యుచితంపు మెయిం గొనియాడి యంతటం
దనియక లీలఁ జేరి సముదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి జనాధిప చూడ శమంతపంచకం
బున విరిదమ్మితేనియలఁ బొల్పెసఁగెం బ్రతిబింబ మెంతయున్. 226

వ. అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామలయుద్దామ[2]సాహాయ్యంబున సమధికోత్సాహుం డగునాసూతనందనునిసంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగి నివ్విధంబున నిరువాఁగును గలయం బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసఁగునులివు తూర్యరవంబుల గెలువ నమ్మేదిని నెత్తుటం జొత్తిల్లి కెంజాయ రంజిల్లు పుట్టంబు ముసుంగు వెట్టినయంగనచందంబు నొందె మస్తకప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతిభూషణంబులును నాతపత్రధ్వజచామరంబులుం దునిసి పడి భీమాభిరామంబులుగాఁ గరిహయనరసమూహంబులు రక్తసిక్తంబు లైన నకాలబాలాతపలీల యావహిల్లం దక్కినసేనాంగంబుల మిగిలినమాతంగంబులు పెనంగినకనకలిప్తకాండంబు [3]లూఁడుకొనం దాఁకిన నెరగల్లు వోవుకొండలకైవడిం బొలుచునవియును నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్మురుధిరమ్ముల గైరికనిర్ఝరంబులతోడిధరాధరంబుల ననుకరించునవియును మెయిమఱువు లఱువు లై నానానిశితశరంబులు నాటినం జేష్టలు దక్కి ఱెక్కలు దెగియున్న శైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగునుల్లాసంబున శోణితం బడంగ మట్టవిసి రేణువు లెగసినం జూడ్కులు నిగుడ కున్ననుం దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీజనకనామంబుల బిరుదాంకంబులం దమ్మెఱింగించికొనుచు వీరులు పోరుచక్కటికిం జొచ్చి ప్రాపై [4]పేరువాడుతదీయబంధుమిత్త్రులం బొగడునమరులమెలుంగులు నింగి నిండం బెల్లు దొరఁగుకీలాలం బాఘాళి

1. గ. యుచితంబు మెయిం. 2. జ. సహాయంబున. 3. చ. లూఁదికొనం. 4. జ. పేరువాడి.

నడంచినకొలంది నిలువక యేఱు లయి పాఱ నుబ్బి భూతబేతాళక్రవ్యాదంబు లోల లాడుచుం ద్రావుచు మదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్ట లాడ వెక్కసపా టొనర్పం జాలునాసమయంబున మనంబు లెప్పటితమకంబున ననిం దనివి సనమిం గవిసి కయ్యంబు సేయుసైనికోత్తములసింహనాదంబులు దిక్కులం బిక్కటిల్ల నాకలనికెలన నట మున్న తన్నుఁ బొదివిన త్రిగర్త కోసల నారాయణ గోపాలబలంబుల నబ్బలసూదనసూనుండు గాండీవారావం బాకసంబు వగిలింప నొప్పించి. 227

చ. తఱిమి సుశర్మఁ దాఁకిన నతండుఁ దదంగమునన్ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్పి బల్వెడఁద యమ్మున నుజ్జ్వలకేతుదండ మే
డ్తెఱఁ జలియింప నేసిన నతఁ దీర్ణతఁ దత్కపి యార్చె నార్చినన్. 228

సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునరథంబుపైఁ బడి యాఁగుట.

సీ. వెగడునఁ [1]జెద్వేది వేగంబ తేఱి సంశప్తకు లర్జునుసాయకముల
కోహటింపక సముత్సాహంబు వదల కందఱు నొక్కపెట్ట తత్ప్రథము వొదివి
హరులతోఁ గాఁడియు హరి కేలు నొగలును, [2]బలుగాఁడియును గండ్లుఁ బట్టి మెలఁగ
మిడుక రాకుండ నమ్మోటివిల్కాని మేను నిగ్రహించుట గనుఁగొనంగ
తే. నద్భుతం బయ్యె నపుడు సేన యార్చి శౌరి
లీలఁ గొందఱ మత్తశుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర సమయఁ జేసె. 229

వ. అంతఁ గొంతయూరుపు వోయినం జెఱునవ్వు నవ్వి కవ్వడి కమలనాభున కిట్లనియె.

ఆ. తేరు గదల నీక వైరులు బలువిడిఁ, బొదివి పట్ట రాచపొల్ల నైన
యేను దక్క నృపతిసూనుఁ డిట్లోరుఁడు సహించు నెట్లు విక్రమించుఁగాక.

క. అని పలికి చూడుమీ య, న్ననుచు భుజంగాస్త్ర మేయ నది యరులకు గ్ర
క్కునఁ బాదబంధ మొనరించిన ముంచె నతండు వారి శితవిశిఖములన్. 232

వ. ఇవ్విధంబున. 233

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి, వారు వివిధబాణదారితాంగు
లై రథంబు విడిచి రప్పు డాసంశప్త,క వ్రజంబు గని త్రిగర్తవిభుఁడు. 234

క. గరుడాస్త్రం బేసిన న,చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు
స్ఫురణము మెఱయఁగ వెస న,య్యురగాత్మకబంధ మూడ నుర్వీనాథా. 235

క. తనకడిమి బంధమోక్షము, గనినరథికకోటి గడఁగి గాండివిపయి నే

1. క. జేద్వడి. 2. జ. బలుబండి కండ్లును బట్టి లోఁగ.

పుసఁ దూపులు దొరఁగింపఁగ, ఘనభుజుఁడు సుశర్ముఁ డేసెఁ గనదస్త్రమునన్.

చ. అది [1]నరుఁడెంద మాడుటయుఁ నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ
జదికిలఁ బడ్డ నుబ్బి యదెచచ్చె సుశర్మునియేటు దాఁకి బ
ల్లిదుఁ డగుపార్థుఁ డంచు మదకేలిల నార్చిరి సీధుసైనికుల్
చదలను దిక్కులం బరఁగెఁ శంఖముఖోద్భటతూర్యనాదముల్. 237

సీ. అంతఁ దెప్పిటె విలకయాంతకుకై వడిఁ, గవ్వడి యేచి మార్గణచయంబు
పెల్లడరించినఁ బీఱువోయె సుశర్మ, యాసేనమీఁద నైంద్రాస్త్ర మక్కి
రీటి నవ్వుచు నేయ నాటోపమున నది, వివిధబాణాకృతిఁ గవిసి నుఱుము
గావింపఁగాఁ బదివేవురు సంశప్తకాగ్రేసరులు దెగకటాఁటి రప్పు

ఆ. డుక్కు దక్కి తలరి తక్కటియోధులు, చేష్టితంబు లెడలఁ జిత్రరూపు
లట్టు లైరి ధూమ మడఁగిన వెలుఁగొందు, ననలుచంద మయ్యె నన్నరుండు.

వ. హతశేషు లైనసంశప్తకులు చతుర్దశసహస్రయోధముఖ్యు లవ్విజయువిజయంబు సహింపకయుండొరులం బురికొల్పికొనిబలంబులతోఁడం గడంగిననతండతిదారుణం బగురణంబు సేయఁ దక్కటిపాండవులదెసఁ బోరుకౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిం గలంగి పఱచినం గృతవర్మకృపగురుపుత్త్రకర్ణులు నులూకసౌబల సుయోధనులును దుశ్శాసనాదికుమారులును బరవసంబు సేసి యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి రట్టియెడఁ గృపునియపరిమితశరజాలంబు పాంచాలపుంజంబుం బొదివినం గనలి శిఖండి యమ్మహీసురవరుని మార్కొనియె నయ్యిరువుర సమరంబు రామరావణులరణంబుకరణి నొప్పె నట్లు పోరి పోరి శారద్వతుండు.

చ. హయులను సూతుఁ జంపిన నుకదగ్రత నాద్రుపదాత్మజుండు వి
స్ఫురితకృపాణచర్మపరికశోభితుఁ డై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర శరకవాహినిపై నిగిడించె నాతఁ [2]డ
య్యరి వెఱఁగందుచుఁ నిలుచుకనట్లుగ జోదులు పిచ్చలింపఁగన్. 240

వ. అ ట్లేచినకృపాచార్యుపై నురవడించినధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండునుం దలపడి నిలువరించి రగ్గౌతముండు శిఖండిపలక పఱియలు సేసిన నతండు దెరలక కేవలకరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు. 241

క. వాలికతూపులు మేనం, గీలుకొలిపి నొంపఁ గని సుకకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడరి యా,భీలత నాకృపునితోడఁ బెనఁగె నరేంద్రా. 242

తే. తనకు నెడ సొచ్చి యిట్టు లకతండు పెనఁగ
ద్రుపదనందనుఁ డల్లన తొలఁగి పోయె

1. అ. నరుమేన నాటుటయు. 2. క. డయ్యర.

నాసుకేతుండు గృపునిమై ౯ నాడ నిరువ
దాఱుశరములు పఱపి రక్తయంబు మెఱయ. 243

వ. ధనువు దునిమి యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి. 244

క. తోడన హయసూతుల [1]నోఁ, గాఁడఁగ నేయుటయు నతఁడు కగనలుచు బలువిల్
క్రీడయపోలెం గొని మే, న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. 245

కృపాచార్యుండు సుకేతుం డనుపాంచాలకుమారునిం జంపుట.

తే. అట్లు నొప్పింపఁ దూగాడుకన్నాసుకేతు
కంధరము మెఱుఁగారెడుకకత్తిపాతి
దొడ్డతూపున నేపునఁ ౯ ద్రుంచుటయును
శిరము ధర డొల్లెఁ గుండలకస్ఫురణ మెఱయ. 246

వ. ఇట్లు సుకేతుండు సచ్చిన నతనిమూఁకలు విచ్చె ధృష్టద్యుమ్నుండుఁ గృతవర్మ యుం బోరునెడ ధృష్టద్యుమ్నుండు గృతవర్మవక్షస్థలంబు విశిఖనవకంబున నొప్పించుటయు నప్పాంచాలవరు నతండు సూతకేతుహయస్యందనసమేతంబుగా నిబిడశరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహకపిహితమూర్తి యగుమా ర్తాండు ననుకరించి తాను సైంధవవధదినంబునం బారావతవర్ణంబు లగురథ్యంబు లగ్గురునరుణాశ్వంబులఁ బెరయం బఱపిన తెఱంగున. 247

తే. అలిగి నొగ నొగతోఁ దాఁక ౯ నతిరయమునఁ
దేరు వఱపి కృపాణప్రదీప్తపాణి
యగుడు గద పుచ్చికొనియును ౯ నఱుమ లేక
చలము డిగఁ ద్రావి కృతవర్మ ౯ యిలకు దాఁటె. 248

వ. అక్కుంభసంభవుచందంబు గాక వంచకుం డై యప్పరుసున నబ్బలుమగండు దొలంగిన నయ్యరదంబుమీఁదికి లంఘించి యాధృష్టద్యుమ్నుండు. 249

క. ఆరథికు నచటఁ గానక, సారథితల దునుముటయును ౯ సంతసమునఁ బొం
గారి [2]తనశబ్ద మిచ్చి మ,హారవమున నిక్క డిక్క ౯ డనియె నతండున్. 250

చ. విని కృతవర్మఁ గాంచి పటువిక్రమకేళి యొనర్ప నాత్మవా
హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతఁడు లోను గాఁగ న
మ్మొనఁ గలమేటిజోదులసముద్ధతి యేర్తెఱ నిల్వరింప వి
గ్గొనెఁ బటుశౌర్యశోభితబలుం డగునయ్యదుముఖ్యుఁ డొక్కఁడున్. 251

వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచి కొని యనికిం దొలంగం గొనిపోయెఁ బాంచాలోత్తముండును దనమునుము బలంబు గలంగం బరాక్రమించు చుండె. 252

సీ. ధర్మపుత్త్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచోఁ, బాసట యై శినిపౌత్త్రుఁ డడరె

---

1. క. మైఁ గాఁడఁగ, 2. క. గ. తలశబ్ద.

నా యిద్దఱును దాఁపఱదేయులు వెలుఁగందు, నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి యమ్మేటి, విలుకానిసాయకవితతి నింగి
ఘనమయంబుగఁ బర్వ జననాథ వారల్గి, యొక్కొక్కరుం డనేకోగ్రబాణ

ఆ. నిహతుఁ జేయ నతఁడు ప్రహసితవదనుఁడై, యొకని నొకసి బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి వివ్వచ్చుకొడుకుచా, పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. 253

క. ధృతి నొండువిల్లు గొని యా, శ్రుతకీర్తి దదీయతనువు సొనిపెం బ్రదర
త్రితయంబుఁ గనలి యాతం, డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్.

క. ముంచుమహోద్ధతి యాలో, కించి తనదుచూడ్కి దట్టకెం పెసఁగం గో
పించి శరనికరములు గు, ప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్. 255

చ. కదిసిన నమ్మహాభుజుఁడు గార్ముకముం దును మాడి మూఁడుబె
ట్టిదపుమెఱుంగుతూపులఁ బటిష్ఠత సూపిన నానృపాలుఁ డు
న్మదుఁ డయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసె మూఁడు న
ర్వదియును నద్ధరామరునిపై శినివంశవరుండు దోడ్పడన్. 256

వ. ఇట్లు ప్రాపై కడంగి. 257

ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్త్రుని, ధనువు శినివరుండు దునుముటయును
శక్తి వైచి యతఁడు సారథిఁ గూల్చి బల్, వింటఁ గురిసె బహుళవిశిఖవృష్టి

క. సారథి లేమిని సాత్యకి, తేరిడ్చెఁ దురంగములు దేరటు వాఱ
భూరమణ ధర్మనందను, వారు వొదివి రంపగముల వడి గురుతనయున్. 259

క. భీమాస్త్రశిఖల నశ్వ, త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొక వ్రేల్మిడి, నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా. 260

వ. అప్పుడు కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దెగినవారలంగాఁ దలంచె
నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం బీడితుం జేసి.

సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండ, వని నిన్ను నెఱుఁగుదు నైన నెల్ల
సొంపు పార్షతునకుఁ జూప నోపినఁ దెల్ల, మగు నది యట్లుండె నరయ నీకు
నెయ్యంబు వాటించునేర్పు కృతజ్ఞత, యనునివి లేవు బ్రాహ్మణుఁడు దపము
దమమును గల్గువర్తనమున నుండుఁ గా, కని సేయు నే మెంత యడచిపడినఁ

ఆ. బడితి గాని యద్దపడ లేవు కౌరవ, కులము నెల్లభంగి గెలుతు మేము
నీవ చూడ ననుడు నావీరుఁ డేమియు, ననక నగుచుఁ బఱపె సంపవెల్లి. 262

వ. ఆవెల్లికి నోర్వ లేక యాంభూవిభుండు దొలంగె నట్లంతటిమానిసిఁ గెలిచినవాఁ
డై నిలిచి నిజపార్శ్వంబులమూఁకలం గనుంగొని గురుపుత్త్రుండు గ్రూరవిహారం
బునకు నమరి మెఱసె మారుతితోడం బోరుకగ్గుండు దదనుచరంబు లగుకరూశ
చేదిసృంజయపుంజంబులుం దన్నుం బొదివిన నబ్బలంబునకు బాహుబలంబు
సూపుచుండ నతని విడిచి యాభీమసేనుండు కౌరవసేనపయిం గవిసి కనుపుగొట్టె

నారాధేయవృకోదరులమునుములు ధనంజయుమునుముభంగిం బ్రజాక్షయం
బగు చుండె నీదుర్మంత్రంబున ననేకులకుం బొలియవలసె నయ్యవసరంబున. 263

సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డ,న్నకులునంగంబున నవశరములు
సొనిపి యాసహదేవు కనకపుసిడము ద్రుం,చిన వార లిరువురు నెనిమిదింటఁ
బదితూపులను నొంపఁ బతి రెండువిండులుఁ, దునుమాడుటయు నన్య ధనువులెత్తి
యన్నయుఁ దమ్ముండుఁ [1]దన్నుఁ బెక్కమ్ములఁ, బొదివినఁ గనలి యా భూవిభుండు
తే. వారి దివ్యాస్త్రములఁ గప్పు ఘోరభంగి
గాంచి జను లక్కుమారులు గాలవశతఁ
బొందుదుర కాఁ దలంప నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున. 264

వ. ఇట్లు పాండవసేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు. 265

## ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట.

ఆ. ఇరువదేనునిశితశరముల నొప్పింప, నలిగి యాతఁ డతనియంగకముల
నఱువదేనుతూపు లడరింప నఱికె న,క్కౌరవేశ్వరుండు గార్ముకంబు. 266

మ. బలువి ల్లుగ్రత నెత్తి యొక్క మొగి నప్పాంచాలవర్యుండు దీ
ప్తులు గ్రమ్మం బది యేనుమార్గణము లాభూమీశుపై నేసినం
గలయం బూచినకింశుకంబుచెలు వంగం బొందఁ దచ్చాపముం
బెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెఁ దశోగ్రాస్త్రముల్. 267

క. కాలాయసనారాచము, లోలి నుదుట నాటి యున్న నొప్పారెం బాం
చాలవరుముఖము మధుకర,మాలికచేఁ బొలుచుతమ్మిమాడ్కిం జూడన్. 268

సీ. కనలి యవ్వీరుండు కార్ముకాంతరమునఁ, గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును, దునుమాడఁగా భవత్పుత్త్రుఁ డేపు
గుందక శక్తి [2]నిగుడ్పఁగఁ ద్రుంచె నే,డ్తెఱఁ గృపాణము గొన నఱుము నేసె
గద యెత్తఁ బఱియలు గావించె నుబ్బి ర,త్నమయాహికేతువు నఱికి వైచె
తే. నిట్లు హయసూతకోదండహీను దళిత,రథుని విగతాతపత్రు నిర్భగ్నశక్తి
ఖడ్గముద్గరకేతు విఖండితాపి,ధానుఁ జేసె నప్పార్షతుం డానరేంద్ర. 269

తే. వికలసాధనుఁ డైనయవ్విభుని నతని
తమ్ముఁ డగుదండధారుండు తనదు తేరి
మీఁద నిడుకొని శత్రుసమీపభూమి
వాయఁ గొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు. 270

క. శినివంశవరునితోడం, బెనఁగి పెనఁగి యతని విడిచి పెలుచ ద్రుపదనం
దనునిరథమునకు నెదురుగఁ, దనయరదము సనఁగ నిచ్చె ధరణీనాథా. 271

1. క. గ. చ. 'నెన్నఁ బెక్కు'. 2. 'నిగుడ్చిన' అనియే వ్రా. ప్ర.

వ. సాత్యకియును శరంబులు గురియుచుఁ ద్రోన తవిలె నుభయసేనాపతు లగు నా నూతనందనధృష్టద్యుమ్నులట్లుదార్కొనిన నయ్యిరువాఁగునందు నొక్కరుండైన నోల మాసగొనక కడంగినం బోరు ఘోరం బయ్యె నట్టియెడఁ బాంచాలకుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయ రోచమాన సింహసేనులును బలు దేరుల మొత్తంబులతోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యేనమండ్రు వీరుల నెనిమిది భల్లంబులం దునిమి తత్సహచరుల బహుసహస్రరథికుల సమయించినం జేదిరథికప్రవరులు జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును దండ చిత్ర చిత్రాయుధులును హరి సింహకేతు రోచమానశలభులును సబలంబుగాఁ దలపడిన [1]నాపదునొక్కండ్ర నొక్కపెట్ట బెట్టిదంపుటంపఱవాలుచేసి మఱియును బిరుదు లయి పయింబడినదొరలను వారిపరివారంబులను వసుధం గూల్చియు నలంచియుఁ గలంచియుం గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడమని జనంబులు వెక్కసపడ వివిధసమరవిహారంబు సలిపి వెండియు. 272

సీ. సింహంబుబారిఁ జొచ్చినగజంబులభంగిఁ, బులి కగ్గ మైనజింకలవిధమున
జ్వలనంబుఁ గిట్టినశలభంబులట్లుఁ బాం,చాలయోధులుఁ జేదిసైనికులును
దనుఁ దాఁకి పొలియ రాధాతనూభవుఁ డనిఁ, దనివోక ధర్మనందనునియున్న
చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప,దీపుత్త్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గలమహీశులుఁ బొదివి రక్కర్ణు నతఁడు
పెక్కుపాములు బొదివినఁ బెనఁగుగరుడు
ననువు దోఁపఁగ బోరాడె మనుజనాథ. 273

వ. ఆసమయంబున భీమసేనుబారిం బడినకౌరవసైన్యంబునం బ్రబలచతురంగంబులొక్కమొగిఁ బడలువడి రణాంగణంబు [2]మూసికొనియెం బెఱమూఁకలు వెఱఁగునం జెవ్వేది కర ళ్లడంగినమున్నిటియ ట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషం బగుబలంబు విచ్చుటయు వాసుదేవు నాలోకించి.

ఆ. అమరులకు నజయ్యు లగునట్టసంశప్తకులు మదీయబాణఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు భీముని, మునుము కౌరవులును మొనయ లేరు.

క. కర్ణుం డొక్కరుఁడును సము,దీర్ణుం డై సిడము మెఱయఁ దిరిగి బలువిడిఁ
ఘూర్ణితము సేసె మనసై,న్యార్ణవమును మంథనగమునను వమరంగన్. 276

చ. అరదము వోవ నిమ్ము రయ మారఁగ నాతనిదిక్కు నావుడు

---

1. క. గ. చ. నాపదునొకళ్ల. 2. క. ముసురుకొనియె; గ. ముసుంగుపడియె.

ద్దరహసితంబుతో నలిననాభుఁడు భీమునిచేతఁ బోదు నీ
శరములవేఁడిఁ గౌరవులసంగరవాంఛ యడంపు మన్న న
న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథునియోధులు బెగ్గడిల్లఁగన్. 277

ఆ. అమ్మురారి ధవళహయములు మెఱయ నద్దిక్కు సత్వరముగఁ దేరు వోవ
నిచ్చుటయును జూచి విచ్చె నబ్బలము సింగంబుఁ గనిన లేడిగమియుఁ బోలె.

వ. అప్పుడు నీకొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండువేలరథంబులును మున్నూ
ఱేనుంగులును జతుర్దశసహస్రతురంగంబులును లక్షద్వయపదాతులును నప్పార్థు
పయిం గవిసిన నతండు శింజినీటంకారంబునం బటుశరాసారంబున నింగి నించి
పదివేవు రుద్భటక్షత్రియులం బొలియించి యక్కొలనం గాంభోజబలంబు దోఁచిన
నం దుఱికి తదీయసైనికులకరంబులు శిరంబులు నఱికిన నది [1]మహావాతనిహత
విటపం బైనయారామంబుచందం బయ్యె నట్టిమెడ. 279

క. అడరి సుదక్షిణుతమ్ముఁడు, గడువడి నేయుటయు నతనికరశాఖలు న
వ్వాడి యర్ధచంద్రశరముల, వెడందతూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. 280

క. యవనశకసైన్యములు పైఁ, గవిసినఁ దద్రుధిరజలము గాలువ లై పా
ఱ వెసం బఱపెను వివిధా, స్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా. 281

మ. కని సంశప్తకు లేచి యొక్కమొగి నాకాంతేయునిం జుట్టు ము
ట్టిన సేనాంగచతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె నా
తనిబాణోత్కరవేగ ముత్కటమరుత్సంక్రీడజీమూతపా
టనముం జేసినభంగిఁ జిత్రబలగాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. 282

క. హరి వెరవున ధవళాశ్వ, స్ఫురణమున రథంబు మెఱయఁ బొలు పారెడున
న్నరునత్యద్భుతవిక్రమ, పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్. 283

క. ననుబోఁటులమనములు మెచ్చునఁ గరఁగె ననంగ నేల సురతతి కృష్ణా
ర్జునులం గని దుందుభిని, స్వనములతోఁ గురిసె విరులవాన వొగడుచున్. 284

వ. అయ్యవసరంబున నశరీరవాణి యయ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నాక
ర్ణింప వీరు చంద్రార్కులం గడచినకాంతిదీప్తుల నుల్లసిల్లెదరు తొల్లి యేకరథస్థు
లైనబ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు గంటిరే వీరలు పరమమును లగునారా
యణుండును నరుండును జుండీ యనియె నిట్లు మహనీయాశ్చర్యంబులు గనియును
వినియును మాత్సర్యధుర్యుం డగునాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మా
ర్కొని మార్గణోజ్జ్వలం బగుదక్షిణకరంబున నాఫల్గునుఁ బిలిచి హాసభాసిత
ముఖుం డగుచుఁ గుపితుం డగునతని కిట్లనియె. 285

అశ్వత్థామ యర్జునుం బేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట.

క. ననుఁ దగిమెదునతిథిం గా, మనంబునఁ దలంచి నీవు మన్నించెద వే

1. క. మహాశనిపాతనిహతవిటపం.

నిని వచ్చెద నీపాలికి, ననఘా సంగ్రామ మొసఁగు మాతిథ్యము గన్. 286

ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్య, తనయు గెలువ కునికి దైన్య మిపుడు సమయఁ జూడ వలయు సంశప్తకులను నీ, మనసు వచ్చుపనికిఁ బనుపు మనుడు.

ఉ. తేరు మురారి ద్రోణసుతుదిక్కునకుం జన నిచ్చి మేలుమేల్
పోరు ఋణంబు దీర్ప కురుభూపతికిన్ నరు బాహులీలకు
న్నేరణ గల్గి నిల్వు మనినన్ విని యట్టుల కాక యంచు న
వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె నుదగ్రుఁ డై వెసన్. 288

ఉ. అమ్ములు మూఁడు పార్థతను వాడఁగ నేసినఁ ద్రుంచి వైచెఁ జా
ప మ్మతఁ డమ్మహాద్విజుఁడు భారవహ మ్మగునొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి చేతులను గాల్లను మోమున [1]వింటికొమ్మునం
గ్రమ్మినభంగి గా శితశ[2]రప్రతతుల్ వడి నించెఁ బైపయిన్. 289

క. కడుఁ బెక్కువేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల సరథవాహంబుగ నె
క్కుడుమదమునఁ బొదివినఁ జె, య్వొడలి వెఱఁగుపడిరి వార లిద్దఱు నధిపా.

వ. ఇవ్విధంబున వివిధవిశిఖజాలంబులఁ గాలు సేయార్ప రాకుండఁ గప్పి యార్చిన నప్పార్థుం డతనిచేతఁ దనవిక్రమం బపహృతం బయ్యె నని తలంపఁ దత్సైన్యంబున హాహాకారంబు లెసంగెం జారణసిద్ధగణంబు లట్లు నిశ్చేష్టితు లైనయాలోకరక్షకుల నాలోకించి లోకంబులకు బ్రదుకు గలుగునో యని పలుక నప్పద్మనాభుండు గనలి యక్కవ్వడి నుద్దేశించి. 291

క. గురుసుతుఁడు నిన్ను మిగులుట, గర మాశ్చర్యంబు ముష్టి గాండీవము దాఁ
దిర మయి యుండదొ బాహుల, వెరవుబలువు గుందెనో వివేకింపు మెదన్.

క. గురునికొడు కనుతలంపునఁ, బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితొ యు
ద్ధురతఁ గడుఁ జెడియె ననవుడు, [3]సరోషసంరంభుఁ డై విజయుఁ డాతనితోన్.

క. వెసఁ బెక్కమ్ములు మనపై, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన సం
తస మందెడు నింతన యేఁ, గసి మసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. 294

మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుక్కుం దాల్మియుం దోఁప నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్. 295

ఆ. ఇట్లు ద్రోణసుతుని యేపు పార్థుఁడు దుహి, నంబుఁ జెఱచునినువిధంబు మెఱయఁ
జెఱచె నంతఁ బొదివె నుఱక యారథికు సం, శప్తకవ్రజంబు సరభసముగ. 296

క. ఎందఱు వొదివిరి వారల, కందఱకును దమక తమక యర్జునచటుల
స్యందన మెదు రైనట్లు మ, దిం దోఁచెఁ దదీయ బాణతీవ్రబహులతన్. 297

1. అ. వింటికొప్పునం. 2. అ. రమ్ములు వే నిగిడించె. 3. అ. సరోషుఁ డై క్రీడి యనియెఁ జక్రాయుధుతోన్.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం
గుప్పనఁగూర వఱప నరుఁ, [1]డప్పరుసఁదనమున గోర్చి యతఁడుం బెనఁగెన్. 

వ. అట్లశ్వత్థామ పెనంగుచుండ సంశప్తకవ్రజంబునందు. 299

క. చేతులు దలలును బహువిధ, హేతులఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం
జేతులకసి వోవంగ న, రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. 300

క. తురగద్విపరథతూర్యా, భరణధ్వజచామరాతపత్రశకలముల్
పొరిఁ బొరి ధరఁ గప్పఁగ నె, త్తురు టేఱులు వానిఁ దొలఁగఁ ద్రోచుచు వచ్చెన్.

వ. అట్టియెడ. 302

తే. అంగవంగనిషాదకళింగబలము, లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును
గురుతనూభవుఁ డతనిని మురవిరోధి, నంపపెనువెల్లి ముంచి బెట్టార్చి పేర్చె.

వ. అవ్విక్రమవిశేషంబునకు రోషంబు నొంది. 304

క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును నాసైన్యసమితిక్రూరోద్ధతియుం
నివ్వటిల నీక ఖచరులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్. 305

వ. మెఱసిన నెఱసినరోషంబున మఱియును. 306

మ. గురుపుత్త్రుం డసురాంతకుం విజయునిం గ్రూరాస్త్రసంతానని
ష్ఠురపాతంబున నొంప నాహరి దదాటోపంబు సైరింప క
న్నరుతో నౌషధ మూఁది చేసి తెవులు న్మర్దింప కున్నం దుది
న్బర మై యుండదె యే పడంపుము రిపు న్సంరంభి వై నావుడున్. 307

వ. అతండు విజృంభించి గుణంబు సారించి. 308

చ. శిరమునఁ గంఠదేశమున జేతులయందు నురస్స్థలంబునం
జరణములం శరంబులు వెసం నిబిడంబుగఁ గీలుకొల్పుచుం
వెరవునఁ బగ్గముల్ దునుమ వేగమ యీడ్చెఁ దురంగమంబు ల
గ్గురుసుతుతేరు గయ్యమునకుం గడుదవ్వు దొలంగ భూవరా. 309

వ. ఆభూదేవుండును భగ్నోత్సాహుం డై యల్లన సూతనందనుసమీపంబునకుం
జనియె నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబుదెసకుం దేరు నడపుచుం దమసేనదిక్కు
కోలాహలం బాకర్ణించి చూడ్కి యట నిగిడించి యర్జును నుద్దేశించి వేదండా
రూఢుం డై నదండధారుండు మనబలంబులం గలంచుచున్నవాఁ డమ్మగధోత్త
ముండు భగదత్తునంతవాఁడ యతని మడియించి మఱి చేయం గలపని సూచి
కొంద మనిపలికిన నక్కవ్వడి యొడంబడ నక్కడ కరదంబు వోవనిచ్చె నట్టియెడ.

దండధారుం డనురాజు వేదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట.

క. పాండవసైన్యంబుల వే,దండంబుల ఘోటముల రథంబుల భటులం
జండగతి మగధపతి నిజ,శుండాలముఁ బఱపి మేపుఁ జూపి తెరల్చెన్. 311

---

1. క. డప్పరుసన గోర్చి యప్పు డతఁడుం.

312

వ. అవ్విక్రమవిహారంబు వీక్షించి.

తే. మాగధునికోల్తలకుఁ గాక [1]మనబలంబు
విఱిగెఁ బోద పోద మని తాను దఱిమెఁ దేరు
హరియుఁ బఱపంగ నర్జునుం డడ్డపడియెఁ
జండచేష్టితోద్దండ వేదండమునకు. 313

క. అగ్గలిక దండధారుఁడు, దిగ్గజనిభ నిజగజంబుఁ దీవ్రత మెఱయన్
డగ్గఱఁగఁ బఱపి హయముల, నగ్గరుడధ్వజుని నరుని నమ్ములఁ గప్పెన్. 314

చ. అలిగి కిరీటి మాగధధరాధిపుబాహులు ద్రెంచి గ్రక్కునం
దలయును ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె నట్లు గొం
దల మొకయింత లేక తనితమ్ముఁడు దండుఁడు దాఁకి తోమరం
బులు వరఁగింపఁ గేలు శిరముం గరటిం దునుమాడె నుగ్రతన్. 315

క. తదనీకంబుగజంబులు, పొదివిన బలుగాలి మేఘములఁ దీవ్రగతిం
జెదరించుపగిది నరుఁ డున్మదుఁ డై నలుదెసలఁ దోలె మనుజాధీశా. 316

వ. ఇవ్విధంబున మగధసైన్యంబు మర్దించి సంశప్తకసైన్యంబుపైఁ గవిసి కపికేత
నంబు మెఱుంగులు మెఱయ మధుమథను వెరవున వెలిమావులగతు లక్కజంబు
గా నుక్కునఁ బార్థుండు భల్లనారాచప్రముఖప్రదరపరంపరలసొంపును బాహు
వీర్యధైర్యంబులపెంపును నిలింపనికరంబు వర్ణింప నందు మహార్ణవంబునం
దిరుగుమందరనగంబుచందంబున నిజస్యందనం బొప్ప నప్పటప్పటి కెక్కు
డొదవుమదంబునం ద్రిగర్తాదు లగునమ్మార్తురు పైపయిం గ్రమ్మికురియునస్త్ర
శస్త్రంబులు విదళితచ్ఛిన్నచూర్ణితంబులు సేయుచుఁ దదీయగాత్రంబులుం గరటి
ఘోటకతనువులుం దునియ లయ్యును నుగ్గు లయ్యును బఱియ లయ్యును గుదు
లయ్యును ధరం దొరఁగఁ దామరబావిం గేలిసల్పుసామజంబుచాడ్పున విహరించి
యవిహతధృతివ్రతమహితు లగునహితుల నత్యుత్తమలోకంబులకుం బుచ్చినం
గొంచెపుమూఁక విచ్చినం బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి వచ్చునెడ
నచ్యుతుం డర్జును నుద్దేశించి భవద్విక్రమవిహారస్థలంబు సూచితే యని పలికి
వివిధాయుధఖండంబులను వేదండాశ్వరథపదాతిశకలంబులను భూషణాతపత్ర
కేతుచామరాంశంబులను జక్షుశ్చమత్కరణపరిణతం బగురణస్థలంబు సూపె
నప్పుడు గొఱప్రాణంబులతో నొఱలునరతురగద్విరదంబులను గొందఱు దమ
వారిం గానక [2]కన్నీళ్లు నించుచు నాలింగనరోదనప్రముఖంబు లైనకరుణాభాష
ణంబు లగునవస్థావిశేషంబులం బొందువారలం గృపాళు లై యాలోకించుచు
నయ్యోగపురుషుఁ దమమోహారంబున నెసంగుకలకలంబు విని యుదీర్ణగమనం
బునం జనుదెంచుచుండి రట మున్న కౌరవ్యులమొనయును గగ్గని మొగ్గ

1. క. రయమునన్. 2. క. గ. వారలకు నీళ్లిచ్చుచు.

రంబును రెండుముఖంబులం బెనంగు చుండి కయ్యంపు[1]టుచితత్వంబునం గలసె నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుఁ బ్రాపయి పుళింద బాహ్లిక కేంకణాంధ్రభోజానీకంబు గవిసినం గాంగేయబలంబునకు భరం బగుటయు. 317

మలయధ్వజుం డనుపాండ్యమహారాజు అశ్వత్థామచేతఁ జచ్చుట.

సీ. పాండ్యుఁ డాసేనలపై బెట్టిదంబుగ, నడరి బాహాబల విక్రమమునఁ
[2]బేరిచి పీనుంగుపెంటగాఁ జతురంగ,ముల రూపుమాపె నయ్యలఘుభుజుఁడు
ద్రోణభీష్ములు దనతోఁ బాటి యనుపలు,కున కోర్వఁ డచ్యుతార్జునులు దనకు
నెక్కుఁడు నా పిన్న సేవగించుచునుండు, నవ్వీఁడు డమ్మెయి నాక్రమింపఁ
ఆ. గని కడంగి యెదురు చని గురుతనయుండు
నగుచుఁ బగఱ నీవు మృగకులంబు
గలఁచుహరియుఁబోలెఁ గలఁచెదు నాదిక్కు
మొగము సేసి యనికి మొనయు మనియె. 318

చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపునారసంబుఁ ద
త్తనువున గ్రుచ్చి మాఱ్వినదంబు నభంబునఁ బర్వ నంపవె
ల్లి నిగుడఁ జేయఁ దొమ్మిదిశిలీముఖముల్ వెస నమ్మహీశుపై
ననిమిషవర్ణనీయగతి నగ్గురునందనుఁ డేసె నేసినన్. 319

వ. అల్తొమ్మిదింటిలోన. 320

క. ప్రతిశరములు పాండ్యమహీ,పతియును [3]బరఁగింప నైదు భగ్నము లయ్యెన్
గతి సెడక నిగిడి రథ్య,ప్రతతి ధరం గూల్చె నాల్గుబాణము లధిపా. 321

తే. మఱియు గురుపుత్త్రుఁ డేయ నమ్మలయ కేతుఁ
డాశరంబులుఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల నభముఁ గప్పె. 322

వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యనంతుం డయి వాయవ్యాస్త్రంబున నయ్యంపపరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయచక్రరక్షకులం దెగటార్చి యార్చినం గెరలి యగ్గురునందనుండు దత్సహచరుల నుఱుమాడి రత్నమయాగురుచందనసుందరంబై నమలయగిరిప్రకారంబునం బోలుచు కేతనంబు గూల్చి గుఱ్ఱంబుల గీటడంగించి సూతుప్రాణంబులు గొని చాపంబు ద్రుంచి తేరు దుముకుసేసి యతండు వాలివోనిపౌరుషంబునం బ్రయోగించునస్త్రశస్త్రంబుల నుఱుక నఱికి యగ్గమై యున్నను గయ్యంబువలని వేడుక నతని సమయింప నొల్లక యరవాయి గొనినయాలోనఁ బతితయోధం బైనసుకల్పితమాతంగంబు నెక్కి గిరిశిఖరంబు

1. క. గ. జ. టుచితంబునం. 2. క. గ. చ. బేర్చినఁ బీనుంగుపెంట లై... రూపుమాపె. 3. క. జ. నడరింప నేను.

నలంకరించు కేసరియట్లొప్పి యాద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం దఱిమి
భీమాభిరామం బైనతోమరంబు వైచిన మణిగణోజ్జ్వలం బైనయాదాక్షిణిశిరో
భూషణంబు ధరణిం బడినం ద్రొక్కంబడినభుజంగంబుపోలికం గనలి యబ్బలు
మగండు తత్పార్శ్వవర్తుల నార్వుర రథికవరులం దద్వేదండంబుతుండంబును
జరణచతుష్టయంబును సమ్మేదినీపతిపాదంబులుం గరంబులు శిరంబును నతితీవ్ర
భల్లంబులం దునుమాడిన నద్దిక్కుమూఁకలు విచ్చెం గురుభూవరుం డమ్మహీసుర
వరుం జేరం జని యగ్గించె నప్పుడు. 323

క. నిలు నిలు మని తమమూఁకల, నిలిపి వృకోదరుఁడు గవిసె నీబలములపైఁ
దలకొని ధృష్టద్యుమ్నా,దులు సంరంభోద్భటముగఁ దోడ్పడి రధిపా. 324

క. [1]వారలవడిఁ గోర్వక య,క్కౌరవసైన్యంబు దెరలఁ గర్ణుఁడు దర్ప
స్ఫారత నదల్చి నిల్చి యు,దారగతిన్ వైరిరథికతతి మార్కొనియెన్. 325

వ. అతనికిఁ బాసటయై యడరినయశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వ్రాలిసిరి
కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి సమీరనందనకర్ణాదు లగు
నిరువురురథికులపరాక్రమంబును వేఱువేఱ నిరూపించి చూపిన నతండును రథం
బు మనసేనలోనికిం బోవ నిమ్మనిన నతం డట్లచేయ నుబ్బినపాండవానీకంబునకును
రాధేయగురుపుత్త్రులరభసంబునం జేర్చినమన మొనకును సంకులసమరం బయ్యె
నం దాకర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పరశరకర్తనంబును నితరేతరచ్ఛత్త్ర
కేతుఖండనంబును నన్యోన్యవర్మవిదారణంబును మిథశ్శరీర[2]పాతనంబును నగుసం
గ్రామంబు సెల్లె నట్టియెడ నాసూతనందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపద
నందనుం గవిసి బ్రహ్మఘ్న నిలునిలు మేను గలుగ నెట్లు బ్రదికెద వని పలికి వెండియు.

క. మాతండ్రి నెడం జేసిన,పాతకము కతంబు గాఁగఁ బాంచాలనికృ
ష్టా తునిమెద నిను నగుఁ డిట, నేతేరక యున్నఁ బాఱ కీవు నిలిచినన్. 327

వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కిట్లనియె. 328

క. మీతండ్రి [3]కుఱకి నఱకిన,[4]పేఱియ నీకొఱకు నునిచి తిపుడ నఱుకుదున్
నీతులువపలుకులకు నీ,డై తోఁచినయుత్తరంబు నదియె దురాత్మా. 329

వ. అని యంత నిలువక. 330

తే. వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకుఁ జనునె బ్రాహ్మ
ణబ్రువఘ్నుఁడ నై సమున్నతి వహించు
నన్నుఁ గిల్బిషపరుఁ డను నిన్ను జనకు
కడకుఁ బుచ్చెద వేగిరపడక నిలుము. 331

---

1. క. వారలయురవడి గోర్వక, కౌరవ. 2. క. శాతనంబును. గ. పాటనంబును. 3. క. గ. చ. కోర్కి నఱికిన. 4. క. గ. జ. పేఱియ నీకోరికియును నిప్పుడ నఱుకున్. చ. పేలిస నీదైనకోర్కి నిపుడ నఱుకుదున్.

వ. అనిమెన ట్లయ్యిరువురు నొండొరులఁ బరుషంబులు వలికి తలపడి వియత్తలంబు విశిఖశిఖాకలాపంబులం గప్పిరి రాధేయుండు యుధామన్యు నుత్తమౌజో న్స్రాపదేయశైనేయులను మఱియుం జేయం గలపాండవపాంచాలయోధులను బొదివి భండనంబు సేయుచుండె నాధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రకోదండంబు మండంబులు సేసినం గుపితుం డై యొండువిల్లు గొని యవ్వీరుండు. 332

క. సూతతురంగస్యందన, కేతనచాపములు నఱికి కేలిమెయిఁ న
గ్గైతొరఁగ నేసెఁ దోడ్తోఁ, నాతతశక్తియును గదయు నతఁడెత్తంగన్. 333

వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలకయుం గొని కవియం గడంగిన నవియును దుమురు సేసి పెల్లేసి పడకున్న నశ్వత్థామ [1]వేగిరపడి వెఱఁ గందుచుఁ జేతిబాణాసనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబుదెస కడువిహంగపతివిధంబునఁ జనుట సూచి సవ్యసాచితో శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుబారిం బడియెం గావ వలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్వరుం డై యవ్వీరుం డాద్రుపదపుత్త్రుం గవిసినకొలంది గ్రూరంబు లగునారాచంబులు గుప్పించుచు నొప్పించిన నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి మరలి యరదంబున కరుగ సహదేవుండు దన తేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవసంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి బెట్టిదంబుగాఁ గనుకనిం దాఁకి యతండు నాటిననునిశితశరంబున సొలె సారథి రథం భొండువలనికిం దోలె నర్జునుం డట్లు నిజసేనానాథు రక్షించి ప్రాణిమదం బడంగించుట గనుంగొని కొంతేయసైనికులు సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదులనాదం బెసంగి నింగి నిండిన. 334

తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితాక్షుఁ డై తలపడఁ దలఁచె నపుడు
తత్క్షణమున సంశప్తకతతియుఁ దోఁచె
రెండుఁ గని యిట్లు లనియె నాక్రీడి హరికి. 335

వ. కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులుఁ గ్రమ్మఱం [2]బొదివిరి కర్ణు చేతం దగులువడితి మేని సంశప్తకుల కోహటించినవార మగుదుము వారల దిక్కు దేరు వోవ నిమ్ము. 336

చ. అన విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డరిపుకోటి ముట్టి యే
పున నులుమాడు చుండెఁ గురుభూవర యప్పుడు ధర్మసూతనం
దనులు సముద్ధతిం గడఁగ దండడి క్రొత్తగ వారిసేనయుఁ
మనమొనయుం బెనంగె నుపమారహితం బగువిక్రమంబునన్. 337

ఉ. సంగర మేను బెక్కుదివసంబులు సూచితిఁ గాని యెప్డు నా
భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము వోసు చున్కి యో

1. క. గ. చ. వెఱఁగుపడి చేతి. 2. క. ననికిఁ బొదివిరి కర్ణు.

త్రుంగుచు నున్కి యో [1]మెఱుఁగుఁ గ్రొందూలక పైపయిఁ గ్రమ్ముఁ గూలు సే
నాంగము లందు నిందుఁ గలకాంబుమహోగ్రత యేమి సెప్పుదున్. 338

కర్ణుఁడు పాంచాలసైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట.

తే. అందుఁ బాంచాలవీరుల కశ్వసూత,రథసమేతంబుగా సంగరాజు దర్ప
మెసఁగ నేవురఁ బడువురఁ నేడ్వురను మ,హాస్యమార్గణములఁ దునుమాడె నధిప.

క. పడపడి పాండవయోధు, ల్వొదివినఁ బెనుఁదుంగమడువుల్లో గజపతి యు
న్మదవృత్తిఁ గేలి సలుపుప,గిది నాతఁడు [2]వోలె సురలు కీర్తన సేయన్. 340

వ. అట్టియెడ. 341

చ. ద్రుపదతనూజులుం గవలుఁ ద్రోవదిపుత్త్రులు శౌరితమ్ముఁడుం
గుపితమనస్కులై బలుపుఁ గోల్తలఁ దాఁకి రతంబు డదల్చి యు
గ్రపురభసంబునన్ శరపరంపరలం బరఁగించెఁ గౌరవా
ధిపుహృదయంబు మోదమునఁ దేలఁగ నందఱయుంగకంబులన్. 342

వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగుకయ్యంబునకు నెఱవు గలకళింగవంగాంగ
మగధసుహ్మపౌండ్రాదిదేశంబులబలంబులం గవియించిన నవి తదీయచతురంగ
బలంబుల మట్టి మల్లాడి చిత్రవధవిహారంబు సలుప నగ్గజప్రధానసేన లగ్గలికం
బంచి చెండాడుచు నాదండిమగలును జేకితానప్రభద్రకులును రౌద్రరసంబునం
బెనఁచినం గనుంగొని మదంబునం బొదలి యుత్తరించి యురవడించిన. 343

శా. వంగాధీశుఁ గరీంద్రుతో [3]నడఁగ గర్వస్ఫూర్తి సైనేయుఁ డే
యం గేలీగతి మాద్రిలేఁగొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
భంగిం గూల్పఁ దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబున ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్. 344

క. విను మక్లేచి నకులుఁ బొది,వె నుదగ్రధ్వని ననేకవేదండము లం
దనిమిదటిఁ గూల్చె బాణము, లెనిమిదియెనిమిదులఁ దమ్ముఁ డేడ్తెఱ నధిపా. 345

క. ఆధృష్టద్యుమ్నాదులు, క్రోధాంధత నడరి వేనుఁగుల నస్త్రహతిన్
వ్యాఘాతములుగఁ జేయుచు, రాధేయుం గనియ సంగరము పేర్చె నృపా. 346

వ. ఆసమయంబున శోణితంబు వెల్లున మున్నగసిన రేణు వడంగిన నిడువాఁగుసైనికు
లును దమతమయడిదాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు మెఱసి
పెనంగుచుండ సంశప్తకసంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబు సేసినసవ్య
సాచికి శౌరి యక్కౌరవపాండవబలంబులపోరు సూపి యప్పుడు దుర్యోధనుండు
దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టుతలంపున బెట్టు పొదు
వుటయు నమ్మూలంబున కాసపడి యడనసుమల మరల్చుశక్రాగ్నులచందంబున

1. క. గ. జ. యానఁగఁ. 2. ఆ. దోలె. 3. క. నడవ; గ. జ నపుడు.

భీమసేనుండును సాత్యకియుం బ్రతిహతులం జేయుటయు నంత నిలువక యక్కురు విభుండును గర్ణకృపాశ్వత్థామలును నుద్దామగతి నయ్యిరువురశరజాలంబుల నమ్ముల జడియుచుం గదిసి యక్కొంతేయాగ్రజకంకటంబు ద్రుంచివైచుటయుఁ గర్ణునుత్సాహంబునం గడంగుధార్తరాష్ట్రులసింహనాదంబులకుం దెరలక మరు త్సుతుండు మండలప్రచారుం డగుటయు నాసూతనందనుండు మొనలగునమ్మేటి మగలమార్గణమ్ము లమ్మనుజపతిపైఁ బరఁగుటయు నకులసహదేవసాత్యకిధృష్ట ద్యుమ్నద్రౌపదేయప్రభృతు లైనపాండవేయపాంచాలాదియోధులం గలంచి యక్కర్ణుండు కమలాకరంబునం గేలి సలుపుశుండాలంబులీల నటించుటయు నవ్వీరుం డగ్గలిక నక్కవ్వడి రాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన యప్పరిపాటి యంతయు నేర్పడం జెప్పి యారాధేయురభసం బుగ్గడించి మఱి యు నిట్లనియె. 347

క. నినుఁ దలపడఁ జూచినయీ, తనియేడ్తెఱ మంట సొరఁగఁ ✽ దలఁచుమిదుతయు
బ్బున కైన నైమె నాకుం దోఁ,చినయది మ్రందింపు మితని ✽ శితవిశిఖములన్. 348

వ. అని పలికి యతని కప్పుడు దోడ్పడ నుత్సహించుభవత్సుతు నుపలక్షించి బీభ త్సునకుం జూపి. 349.

ఉ. ఇత్తఱిఁ ద్రుళ్లు సూపి నిను ✽ నేపున మార్కొని గెల్తు నన్తలం
పెత్తి సుయోధనుం డటె యశ✽హీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో
మత్తగజంబు లీల నెల✽మామిడిఁ గూల్చినభంగిఁ బాండుపు
త్రోత్తమ వీనిఁ గూల్పు మతఁ ✽ డొంటి గ రాజ్యము నీకుఁ జేకుఱున్. 350

వ. అనునవసరంబున. 351

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృ✽ష్టద్యుమ్నుశైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడర దో✽ర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి వొగడం ✽ రారాజుసైన్యంబు లో
క్కొమొగిం బెల్లగిలంగ బెట్టడరె స✽క్రోధాంతరంగంబుతోన్. 352

క. అడరి పటుబాణజాలం, బడరింపఁగ వారిబలము ✽ లధికరయమునె
క్కుడుమదము నోలయఁ బైకొని, బడలుపడఁగఁ జేసె నీదు✽బలముల నధిపా.

క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగినసేన నేమి ✽ సెప్పుదుఁ దనదాం
డడిఁ దాన చదిసె వెనుకొను,కడిఁదిమగలచేత గాసి ✽ గాదె నరేంద్రా. 354

ఉ. మ్రొగ్గెడువాహనంబులును ✽ మోములు వాడఁగ వాహనంబుల
న్డిగ్గి తలంగుసైనికులు ✽ నేలకుఁ గప్పుఁజొప్పు సొప్పడం
దగ్గుసిడంబులుం గులముఁ ✽ దన్నుఁ దలంచి మొదిర్చి యొంటిమై
మ్రగ్గెడువాఁడు నై కురుధ✽రావరుసైన్యము రూపు మాయఁగన్. 355

1. గ. గప్పపుటొప్పు.

ఆ. పావనికి నిషాదపతినందనుఁడు మాఱుకొనిన నాతఁ డతనికుంజరంబు
కరముతోఁ దదీయకరములు శిరమును, నఱకె శితశరములు నాలుగింట. 356

క. మూఁడక్షౌహిణులు లిమ్మెయిఁ, బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్త్రునియెదురన్
వేఁడిమి సూపఁగ నొకఁడును, వ్వాఁడిమగఁడు లేఁడ యే మహనం గల దధిపా. 357

వ. ఇవ్విధంబున విక్రమించినభీమసేనుబరవసంబును దదీయసైనికులసంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 358

క. నీచెప్పెడుమెయి సూడఁగ, నీచత వాటిల్లె మనయనీకమునకుఁ దా
రేచేసి సెడిరొ కౌరవు, లాచరిత ముపన్యసింపు మంతయుఁ దెలియన్. 359

క. అనవుడు నతఁ డిట్లను న, మ్మనుజపతికి హితులు సెప్ప మానక నీచే
సినదుర్ణయమునఁ జేటొం, దెను వగవక రణము వినుము ధీరవిచారా. 360

వ. ఇట్లు భీముకడంక గని కవ్వడి దనమునుముక్కొంచెపుమూఁకలం దోలి మగిడి మన సేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.

దుర్యోధనుఁడు భీమసేనుం దలపడి పోరుట.

తే. ఎందు వచ్చెదు నిలు నిలు మేను గలుగఁ, గడిమి సెల్లునె నీకు నీక్షణమ నిన్ను
నంతకునిపాలి కనిచెద ననుచు రోష, రక్తలోచనరుచుల శరములు వఱపె.

క. రాధేయుండు నుదీర్ణక్రోధుం డై గర్జితోద్ధగుణరవము నభో
[1]బాధం బొనర్పఁగా నిజ, యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్. 363

వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పోరికి నమరుటయుఁ బాండవబలంబును దిరం బయి పెనంగం దొడంగె నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయం గలదొరలు దలపడి యుక్కున నక్కజం బగుసమరక్రీడ సలిపి రందు. 364

సీ. కర్ణుఁ డేపారి శిఖండిరథ్యముల సా, రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ
విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడునుగాను, దగ్రుఁ డై తఱుమనంతం దొలఁగఁ
బాఱె దుశ్శాసనపార్షతు లొండొరు, తనువులు నొంచుచు ననిమిషులకు
నచ్చెరు వగునట్టియని సేయ వారల, యనుచరు లెడ సొచ్చి పెనఁగి రంగ

తే. రాజు సూడఁ దత్పుత్త్రసారథిశిరంబు, నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ జకితమైక
లంగునచ్చటిమూఁకఁ జలంబు మెఱయ, నిలిపె నాసూతసూనుండు నృపవరేణ్య.

వ. అట్లు సారథిరహితుం డై నవృషసేనుండు వేఱొక్కసూతు నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుం డై నిలిచె నకులుండు నొండుదెస కడచె సహదేవుం డులూకుని విరథుం జేసి పఱపె సాత్యకిసౌబలు లన్యోన్యకేతుపాతనంబును బరస్పర

1. ఆ. వేఁధి యగుచు నిగుడఁగ నిజ; గ. వీథిఁ బొలుపారఁగా నిజ.

శంకటకర్తనంబునుం జేసి రాశై నేయుండు దురంగంబులం జదిపిన నరదంబు డిగ్గ నుఱికి యోసరించునగ్గాంధారవిభుం గని యులూకుండు. 366

క. మును సహదేవుం డెగవం, జనినప్పుడ యొండుదేసకు నవరించుకొనం
గనుట నది సేర్చి యతనిం, గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. 367

ఉ. అచ్చటిమూఁక నల్గడలకు నాతురతం జెడి పాఱి భీముచేఁ
జచ్చెఁ గురుక్షితీశ్వరునిసారథి గూలె హయాలి నుగ్గుగాఁ
జొచ్చె రథం బతండు వెలికు సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె
న్నిచ్చిన నీదుయోధవరుల్ లేడ్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్. 368

వ. యుధామన్యుండు గృపాచార్యుధనువు దునిమిన నమ్మహాత్ముండు వేఱొక్కవిల్లెత్తి.

ఆ. కేతనంబు గూల్చి యాతపత్రము దును,మాడి సూతుఁ జంపనధికభయము
గదిరి తేరు ధానకయ్యంబునకుఁ దొలఁ,గంగఁ దోలె నతఁడు కౌరవేంద్ర.

క. శితశరము లుత్తమౌజుఁడు, గృతవర్మునిమేన నింపఁ గినుక గదిరి మూ
ర్ఛితుఁడుగఁ జేసె నతఁడు వెస, నతనిం దత్సూతుఁ డెగచె నరదము దొలఁగన్.

అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట.

చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురముకడంకమైఁ దఱుమ దోర్బలశౌర్యము లుల్లసిల్ల ని
ష్ఠురశరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవుఁ వియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీనయనోత్సవంబు గన్. 372

క. అలిగి నరుఁ డైంద్ర మాదిగఁ, గలదివ్యాస్త్రంబు లేయఁగా నయ్యెయు
జ్జ్వలమార్గణంబులను న,క్కలశభవసుతుండు ఘూర్ణెఁ గౌరవముఖ్యా. 373

వ. ఇవ్విధంబున వివిధాస్త్రంబులం బోరి పోరి. 374

సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు, విజయునిదక్షిణభుజము దూఱి
మూఁ డేయ నొచ్చియుఁ బోఁడిమి సెడకయ, బ్బలియుం డదల్చెఁ దత్పార్శ్వవర్తు
లగుపెనుమూఁకల నమ్ములవెల్లిఁ బ్రే,రల్కనక్కుంభజునాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర,ధ్వజము నవ్వీరుగాత్రమును బొదివె

తే. మెఱుఁగువాలంపగముల నరమ్మెయి నరుండు,ద్రోణితోడ భరంపడి రణమొనర్చు
చుండ నట మున్న ధర్మజుఁ దురవడించి,చిత్రసేనుని నమ్ములఁ జిక్కువఱిచి. 375

క. తఱిమి తనమునుముసైన్యము, నుఱుమాడఁగఁ గని సుయోధనుఁడు మున్నగ నే
డ్తెఱ నీయోధులు మార్కొని, యఱిముఱి నొప్పించి పట్ట[1]నమరి పొదివినన్.

ఉ. పావని మున్నుగాఁ గవలుఁ బార్షతులోడ్డు వెస వారిఁ దాఁకినం
జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్రబా
ణావృతమూర్తిఁ జేసె మనుజాధిప యారథికావళిఁ దను

1. వఱిమి.

[1]జ్యావితతస్వనంబున వియద్వివరంబు ప్రపూరితంబు గన్. 377

క. అట్టియెడ [2]మాద్రిపిదపటి, పట్టి కురునృపాలు రెండుపదు లమ్ములు దా
బెట్టుగ నేసిన వేదన, ముట్టుడుఁ జేడ్పడియె నతఁడు మొనయును దలఁకెన్.

మ. కని రాధేయుఁడు దివ్యబాణనిహతిం గాంగేయసైన్యంబు నె
ల్లను నొప్పించిన బీఱువోయె నది యుల్లాసోగ్రుఁడై ధర్మనం
దను నమ్మేటిమగండు గిట్టుటయు నాతం డల్గి పెల్లేసినన్
విను మందస్మితసుందరుం డగుచు నవ్వీరుండు ధీరోద్ధతిన్. 379

వ. అనేకచండకాండంబు లంగంబునం గీలించి. 380

ఆ. వలుఁదనారసంబు వక్షంబు దూఱంగ, నేయుటయును బాండవేయుఁ డార్తిఁ
గూరి నిలువలేక కూర్చుండఁబడి సూతు, నరద మెగవు తోలఁగ ననియె నధిపు.

వ. అనుటయు వాఁ డట్లు చేయం గౌరవులు గడంగి పోనీక పొదువుం డనుచెలుం
గులతో నక్కౌంతేయాగ్రజు వెన్నాడి కవిసినం గేకయపాంచాలబలంబు లడ్డపడి
పెనంగె భీమసేనుండు సుయోధను నిలు నిలు మని యదల్చి యమ్ములం గప్పె 382
నప్పుడు రాధేయుండు రభసంబున.

క. పాంచాలురఁ గేకయుల ను,దంచితగర్వమున వాలుశరమ్ముల వెల్లిన్
ముంచిన నోటఱి యరికరి,పంచాననమూర్తి భీముపజ్జ కొదిఁగినన్. 383

వ. అక్కర్ణుండు నిజరథంబు మెఱయ ధర్మనందను వెనుకొనియె నతండు విశిఖవేద
నం జేడ్పడినచిత్తంబుతో శిబిరంబున కల్లనల్లన పోవుచుండియుఁ దన్ను నా
సూతనందనుండు మూఁడుదూపుల నేసిన మరలి యమ్మేటిమగని మేనం బలు
మార్గణంబులు సొనిపి తత్సారథి సాయకత్రయంబునను హయంబుల శరచతు
ష్టయంబునను స్రుక్కించె నట్టియెడ. 384

క. ఇరుదెసల నున్నకవ ల,న్నరపతిదురవస్థ సూచి నారాచపరం
పరలు వరఁగించుచును జె,చ్చెరఁ గర్ణునిఁ దాఁకి రతఁడు చిఱున వ్వొలయన్.

తే. వార లిరువుర నుగ్రంపునారసములఁ
గప్పి దంతవర్ణములును [3]గాలవాల
సుందరంబులు నగుధర్మనందనునితు
రంగమంబులఁ బడ నేసి రయము మెఱయ. 386

క. అతనిశిరస్త్రాణంబును, శితవిశిఖనిపాతితంబు సేసి యుదారో
ద్ధతి నకులుకార్ముకము హయ,తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్.

క. సహదేవునితే రెక్కిన, సహితాంతకుఁడై నకర్ణుఁ డమ్మువ్వుర సం
పిహితశరీరులఁ జేసెను, బహువిధబాణములఁ జలము బలమును మెఱయన్.

చ. కనుఁగొని శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో నిది యేల ధర్మనం

1. జ్యావిలసత్స్వనంబున. 2. మాద్రిపదషటి. 3. గాళవాల.

దనుపయి నాగ్రహించెదు హితంబగు కార్యమె యమ్మహీశు నీ
వని డెగటార్చిన ట్లయిన నర్జునుఁ డుత్కటకోపశరముల్
వెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయ కుండునే. 389

తే. ఇతఁడు డెగటార్చె నేనియు నేమిఫలము, గలదు నరుఁబోలి యుంచుట యలఘుశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్య, సిద్ధియును జేయు నింక నీబుద్ధి వినుము. 390

వ. అదియునుం గాక. 391

క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొంగువఁబడియె న
వ్వాఁడిమగని కడ్డము నీ, వేఁడిమి దక్కంగఁ గలదె వేలొకఁ డరయన్. 392

క. పవనసుతుచేత నాభూ, ధవుఁ డీల్గెన యేని నీవు ధర్మతనయునిం
గవలన్ సమయించుట దలఁప వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ. 393

క. అన విని య త్త్రైత్తి భవ, త్తనయుని దెసఁ జూచి వాయుతనయుని చే నా
తని పొదువఁబడుట యేర్పడఁ, గని రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్. 394

క. చనుటయు నజాతశత్రుఁడు, దనశిబిరంబునకుఁ బిన్నతమ్మునియరదం
బున నతని నతనియన్నను, గొని చనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా. 395

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందనుపలాయనం బెఱింగించె
ననుటయు. 396

ఆ. మొదలిరాజు సభయముగ నిట్లు సనురంబు, దొఱఁగి చనియె నట్టె పెఱబలంబు
దొరలు నిలిచి పోరు టరిది యనంతర, వర్తనంబు విప్రవర్య చెప్పుము. 397

వ. అని యడుగుటయు. 398

చ. అనిమిషవంద్యమాన ఘనసాదరశీలసుధాయమాన స
త్త్వనలినగంధరూప విబుధద్విపదంతకరప్రతాప సం
జనితనిరస్తకామ మునిసంఘమహార్ణవపూర్ణసోమ వే
దనికరసంవిధేయనిజతత్త్వపరిష్క్రియ నిత్యనిష్క్రియా. 399

క. ప్రమితివిదూరాగా సుమన, స్సమితిసమారాధనప్రసన్నాకారా
గమనాగమననిరసనా, శమనదమనసాధ్యపరమసారోల్లసనా. 400

మాలిని. ద్విజపతివృషభాంకోదీర్ణ కారుణ్యపూర్ణా
భజననిరతరక్షాప్రౌఢ నిర్భేదరూఢా
గజదురితసముత్సేకఘ్న హృత్పద్మనిఘ్నా
యజనవిధిఫలత్వవ్యాప్త నిత్యప్రదీపా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందు ద్వితీ
యాశ్వాసము. 403



శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## కర్ణపర్వము, తృతీయాశ్వాసము.



మచ్చరణాంబుజయుగ
ళీమధుమూర్తిప్రభావిశాలీనవిమలచే
తోమత్తభృంగభక్తజ
నామృతసరసీస్వరూప హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు కర్ణుండు గౌంతేయాగ్రజు విడిచి దుర్యోధనసంరక్షణంబునకుం జనుట విని ధృతరాష్ట్రుండు దనమనంబున. 2

క. అనిలజునకుఁ జాలఁడె నా,తనయుఁడు మోసంబు గాక ధర్మజుఁ డట్ల
బ్బినఁ బో నిచ్చుట రాధా,తనయునకుఁ బుద్ధి యగునె తప్పెం దప్పెన్. 3

వ. అని వగచి యుధిష్ఠిరుండు సనినపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె నట్లు సని యాధర్మతనయుండు రథావతరణంబు సేసి మందిరంబు ప్రవేశించి సెజ్జ నొడలు సేర్చి నాటి యున్నయమ్ములు వెలికిఁచుకొని హృదయంబున నమ్మెయి నున్నపరిభవంబు పీడ యొనర్ప విషాదవివర్ణుం డగుచుఁ గవలం గనుంగొని మీరు సమీరనందనుకడకుం జనుం డని చెప్పె నట మున్న నకులుం డొక్కయరదం బాయితంబు [1]సేసికొని యుండుట నయ్యిరువురుఁ ద్వరితగతిం జని యంబుదంబుచందంబున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయుచున్నభీమసేనుఁ [2]జేరం జని యవష్టంభవిజృంభణంబునం బొలిచి రంత నప్పాండవాగ్రజు తెఱం గేమియు నెఱుంగక నరుండు ద్రోణితోడ భరంపడి రణం బొనర్చుచుండె. 4

క. నెఱి దగఁ దేజితమై గమి, మెఱుఁగు లడరు నారసమున మిక్కిలివడి నే
ర్తెఱ మెఱయ నురము నొంచిన, నుఱ కవ్విప్రుండు వైచె నుగ్రంపుగదన్. 5

వ. వైచిన నవ్వీరుండు. 6

చ. అది దునుమాడి మేనఁ బదిరయమ్ములు గ్రమ్మఱ గ్రుచ్చి సూతు బె
ట్టిద మగుకోలఁ గూల్చినఁ గడిఁదిమగంటిమిఁ దాన రథ్యసం

1. సేసికొనియె నయ్యిరువురుఁ. 2. సేనం జొచ్చి.

పదయును నూలుకొల్పికొని కపార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం
బాదవఁగ దేవకోటికి నృపోత్తమ యగ్గురుపుత్త్రుఁ డుగ్రుఁడై. 7

వ. అట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన సహింపక. 8

చ. హయములు పగ్గముల్ వెడఁదయమ్మున నుగ్గుగఁ గ్రీడి యేయుదుర్
రయమున నిడ్చెఁ దేరటు దుకరంబునకుం దొలఁగంగ నెంతయుఁ
భరమున నీమొనల్ గలఁగి పాఱె నరేశ్వర వారిసైన్యసం
చయ మెగవఁ మహీతలము సంభృతకంపము గాఁగ నల్లడన్. 9

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపదఁ
మీఱిన నీవె సూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
ల్మాఱె తలంప నీ దగుబలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. 10

వ. అనిన విని యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె.

చ. కనుఁగొను మిప్డు డేను మురఘస్మరుఁ బార్థుని భీమసేనునిం
దుని మెద నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పార మెద్దు మే
దిని గురునాథుఁ డొక్కఁడ యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్. 12

వ. రథరథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జుమ్మీ యని పలికి విజయంబు వీక్షించి గుణంబు సారించి గాండీవంబు నీ కైదువే యని యగ్గించి యప్పుడు పైపయి నురవడించుపరసైనికులం జే మెత్తి యదల్చి భార్గవాస్త్రంబు ప్రయోగించిన నమ్మహనీయసాధనంబు. 13

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం
దేరుల్ ద్రుంగఁగ వారణంబులు ధరం ద్రెళ్లంగ నశ్వాలి ను
గ్గై రక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతచూర్ణీకృతా
కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గాంగేయసైన్యంబునన్. 14

వ. ఇప్పరుసున భార్గవాస్త్రబాధితం బై యప్పాండవబలంబు వెఱచఱచి మరలి పఱచిన మనమూఁకలు వెన్నడిం దఱుము నాసూతనందనుం డప్లేచి యార్చి యంతం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ లేనిమంటపగిదిఁ బ్రదీప్తుం డయినఁ దదుత్సాహంబున కోటువడి యాసైన్యంబుజనంబులు హాహాకారంబు లెసంగ దీనదశం బొంది ముకుందపురందరనందనులం జేకొని యాక్రందించి రట్టియెడ. 15

ఉ. గాండివి శౌరి కిట్టు లను ✽ గర్ణునిఁ జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి పటు ✽ దర్పము సూపుచుఁ దేఱి చూడ రా
కుండెడునట్లుగా నలుక ✽ నుగ్రత మండెడు నిప్డు నేర్పునై
నుండక నీసునం దొడరి ✽ యోటమి దెచ్చికొనంగ నేటికిన్. 16

క. చచ్చిన మఱి గెల్పు గొనఁగ, వచ్చునె తనయొడలు గలుగ ✽ వైరుల గెలువఁగ
వచ్చుం దఱి వచ్చిన నది, మెచ్చు జయార్థులకు [1]మరుద ✽ మిత్రధ్వంసీ. 17

తే. పట్టపగలింటిసూర్యుని ✽ పగిదిఁ గర్ణుఁ, డుగ్రమూర్తియై వెలుఁగుచు ✽ నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ ✽ మరల నిమ్ము, బ్రదికియుండిన శుభములు ✽ వడయవచ్చు.

వ. అనిన విని వాసుదేవుండు వడముడిదిక్కు విలోకించు నెడ నతండు కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ద్రౌపదేయాదిరథికు లారథికునిం దలపడఁ దానును గౌరవులపయిం గడంగె నట్లమ్మేటిమగనియాటోపం బప్పటికి వైరినివారణంబునకుఁ జాలియు నికి యనుసంధించి రాధేయుం డొరులతో డయ్యం బోరుటయుఁ బార్థుండు దప్పి దీర్చికొనుటయు మేల కాక యని యూహించి యమ్మురారి దేరక్కురుసేనాధిపతి సంగ్రామంబు సేయుచక్కటి కెడ గలుగం గొని చని యన్నరునితో మన నశ్వత్థామతోడి పెనంకువర జక్కినసమయంబున ధర్మనందనుండు సూతనందనున కగ్గమై యుండె నాతం డతనియమ్ముల నొచ్చెనో యని తలంచెద నయ్యవనీశు నవస్థ యెఱింగి మఱి నీ వయ్యంగరాజు సమయింపం గలవాఁడ వనుటయు. 19

ఆ. అన్న నొచ్చె నన్న ✽ యమ్మాట చిత్తంబు, గలఁప నిజబలంబుఁ ✽ గలయఁ జూచి
యన్నరేంద్రుఁ గాన ✽ కనిలనందనుకడ, కేఁగి యడిగె నతఁడు ✽ నిట్టు లనియె.

ఉ. కౌరవకోటి నేఁ బొదివి ✽ క్రందుగఁ గయ్యము సేయఁ గర్ణుఁ డా
భూరమణుం వడిం గదిసి ✽ భూరిశరంబులు మేన నింప నొ
వ్వారుటయుం దొలంగె నతఁ ✽ డాహవరంగమునందు లేఁడు నీ
వారయు మింత కెట్లగునొ ✽ యచ్యుతుఁ డుండఁగ నట్టు లేలగున్. 21

వ. అనిస విని వివ్వచ్చుండు వృకోదరున కిట్లనియె. 22

క. క్రూరము లగుసూతసుతుని, నారాచము లొడలఁ బెక్కు ✽ నాటినఁ జేత
స్సారము సెడి శిబిరమునకు, నారాజేఁగినొకొ యకట ✽ యటు గానోపున్.

క. ద్రోణాచార్యునియుగ్రపు, బాణంబుల కోర్చి యతఁడు ✽ వడునంతకు న
క్షీణధృతి నసమసమర, క్షోణి నిలిచి కర్ణుచేతఁ ✽ గోల్పోయెఁ గదే. 2[illegible]

వ. అని పలికి యనిలనందను నాలోకించి యన్నరుం డానృపాలు తెఱం గెఱుంగుటకు నీ వరుగు మేను సేసమొగంబున నిలిచెద ననిన విని యవ్వీరుం డవ్విధంబు

1. నం ద్రమిత్రధ్వంసీ.

నడవడి నీకుఁ జనుం గాని జనంబులు న న్నయినం బోరి కోపటించి పోమె నని
యాడుదు రని చెప్పిన నప్పార్థుండు. 25

ఆ. సరభసముగ నన్ను సంశప్తకులు వీరె, తొడరు చున్నవారు దొలఁగి నాకు
నరుగ నెట్లు వచ్చు నని చూపె నతనికి, నపుడు గడఁగి వచ్చు నబ్బలములు. 26

క. చూపుటయు నగ్గలం బగు, నేపునఁ గిమ్మీరవైరి యేన కలఁచెదర్
రూపు సెడఁగ నిమ్మొనలను, భూపతి నరయంగ నీవ పొమ్మనియె నృపా. 27

కృష్ణార్జునులు ధర్మరాజు సేమం బరయ నతనిశిబిరంబునకుఁ బోవుట.

వ. అనిన నట్లకాక యని యర్జునుం డచ్యుతు నాలోకించి యామహీపాలుం గను
నంతకు నామనంబు గలంగెడు రథంబు రయంబునం బోవ ని మ్మని పలుకుట
యు నతండు భీమునుం జూచి యేము మీయన్నసేమం బరయుట వలయుపని
గావునం జనియెదము నీవు కురుసైన్యంబుల జయించుట యరుదె గెలుపు గొను
మని యగ్గించు తెఱంగున దీవన లిచ్చి తురంగమంబులం ద్వరితగతి నడపె నివ్వి
ధంబున మాధవధనంజయులు సమరంబునకు సమీరనందనుం జాలించి శిబిరం
బున కరిగి ధర్మనందనుమందిరంబు ప్రవేశించి యేకతంబ శయ్యాతలంబున
నున్నయన్నరపతిం గని యాతండు కుశలి యయి యునికికి ముదంబు నొందు
చుం దదీయచరణంబులకుఁ బ్రణతు లగు నాధరణీనాథుండు వారలు రాధేయు
వధించి వచ్చిరకాఁ దలంచి డెందం బలర మందస్మితంబుతో నభినందించి
వారలవదనంబులు వీక్షించి యి ట్లనియె. 28

మ. సుర లైనం జల మెత్తి కర్ణుని రణక్షోణిం జయింపంగ నే
ర్తురె యవ్వీరుఁడు జామదగ్న్యకలితాస్త్రశ్రీం డిద్ధతేజంబునన్
దొర సప్తార్చికి లావునం బవనుతోఁ దుల్యుం [1]డగణ్యుండు సం
గరసంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ గాంభీర్యధైర్యంబులన్. 29

తే. అట్టిబల్లిదు ననిఁ దెగటార్చి మీర, లేమియును గాక వచ్చితి రింతసంత
సంబు దొరకొనునే నామనంబుచింత, వంత మెల్లను జెడ సరసవర్యులార. 30

చ. అతనికి నాకునుం గలిగె నాహవ మింతకు ముంద రందుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు సూతహయధ్వజపాతనంబు సే
సి తనువు దీవ్రకాండములఁ జెండఁగ నే వెగ డందితిం గడున్. 31

వ. అప్పుడు దుర్యోధనప్రభృతిధార్తరాష్ట్రులకు భీమసేనుప్రభావంబున బ్రమకరాని
యంత పుట్టిన నన్ను విడిచి యాతం డట వోవ నే నిట వచ్చితి నని చెప్పి
వెండియు గాండీవి నుద్దేశించి. 32

1. డకల్యుండు - డు శల్యుండు.

సీ. పదుమూఁడువర్షముల్ పగలును రేలును, గర్ణుదర్పం బెట్లు గడతునొక్కొ
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక, పరితాప మందితిఁ బశువుఁ జేయ
విప్రులు పట్ట రా వెఱపొచ్చి యొదిఁగెదు, గవయంబుచాడ్పునఁ గర్ణభీతి
నల్లల నుడుకుచు నుండుమఁ [1]గర్ణుండు, విడువక మోమున వ్రేలు నాకు
తే. సురనదీసుతుచేతను గురునిచేతఁ, బడనిపరిభవమున వాఁడు వఱిచె నన్ను
నంతయును నీఁగఁ గాంచి నీయట్టియనుజు,వలనఁ దేజంబు వడసితి సలఘుచరిత.

చ. వెరవును లావు దివ్యశరవీర్యము శౌర్యముఁ గల్గుకర్ణు నె
ప్పురుసునఁ జంపి తీ వతనిబంధులు మిత్త్రులుఁ బుత్త్రులున్ సము
ద్ధురబలు లాజికేలినిరతుల్ ధృతరాష్ట్రునిపుత్త్రు లెల్లఁ ద
త్పరిజను లెట్టు లట్టు లనిఁ బ్రాణము లిత్తురు వాని కడ్డమై. 34

చ. అరు దిది నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి తాతఁ డ
క్కురుపతి సంతసింప నరుఁ గూల్చెద సంగరభూమి నేన యొ
క్కరుఁడను వీఁకఁ దాఁకి యనుగర్వపుమాట సనంగ నీక నేఁ
టిరణములోన నిట్లు ప్రకటింతె భవద్భుజవీర్యశౌర్యముల్. 35

చ. పలికిన నేమి బీరములు వల్కుట సేవకనీతి యాసభం
బలుకుని యట్లు జూదపునెపంబున ద్రౌపది నింతకాల మ
ప్పలుకు దలంచు చుండె మదిఁ బాయవు గీఱినయమ్ములట్ల దో
ర్బలదృఢలీల నిప్పు డవి వాపితి తీర్చి తలంత యంతయున్. 36

క. అతిగర్వ[2]సమున్నత మగు, నతనిశిరము వానివార లందఱు బాష్పో
ద్గతితోఁ జూడఁగ సమర,క్షితి డొల్లెనె విజయ నీదుశితభల్లమునన్. 37

క. ఉరసమునఁ గదిసి శరా,సారము పైఁ గురియ నీవు సక్రోధుఁడ వై
పేరురమున వెస నాటిన,తోరం బగునారసమునఁ ద్రుళ్లి కెడసెనే. 38

వ. అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం డి ట్లను నేను సంశప్తకులతోడఁ బెనంగుచుండ ననేకరథసమూహసమేతుం డయి యశ్వత్థామ వచ్చి నన్నుం బొదివిన. 39

క. ఏనూఱురథంబులు వెసఁ, బీనుఁగుపెంటలుగఁ జేసి పేర్చినఁ గుపితుం
డై నిప్పు లురలుకన్నుల,తో నక్కోదండగురుసుతుఁడు నామీఁదన్. 40

క. ఉఱక యడరి మెఱసిన యే, డ్తెఱ నెఱయఁగ గుడుసువడి యతిస్ఫురితరుచిన్
మెఱసి ధను వనలవలయము, తెఱఁగునఁ జతురగతి ప్రతిహతిం జేసెన్. 41

క. స్వాతిగతుం డగుశుక్రుం, డే తెఱఁగునఁ బరఁగఁ జేయు నెసకపువర్షం
బా తెఱఁగున సాయకవ,ర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా. 42

క. తనయరదం బెడ్దైసఁ జూ,చిన మొగమున వ్రేల దీప్తశితవిశిఖములన్

1. దన్మూర్తి. 2. సమున్నతుఁ డగు.

ననుఁ గృష్ణుం గప్పిన నే, ననఘా కెల నరయఁ జాల కైతి వెగడునన్. 43

క. పదపడి యొకభంగి నతని,మద మడఁచినఁ దొలఁగఁ బాఱె కమానము దూలం
దదనంతరంబ నిన్ను, న్వెదకితి నరనాథ మనయుకనీకములోవన్. 44

క. ఆలోఁ గర్ణునిచేతం, దూలనిచతురంగములను కదొరలను ధరణీ
పాల మనమొనలఁ గానను, వ్రాలినదర్పమున మెఱయుకవడముడిఁ దక్కన్. 45

క. ఆతనిచే నీ విక్కడ, [1]కే తెంచుట వింటి సేమ కమెఱుఁగుతలఁపునై
నే తెంచితి నవ్వీరుని,చేతులలా వస్మదీయకసేన నిలుపుటన్. 46

క. మనుజేంద్ర కుశలి వగుదునుఁ, గని నామన మూఅడిల్లెఁ కగావున మగుడం
జనియెదఁ గొనియెద రాధా,తనయునితల సలము నెఱయ కదర్పము మెఱయన్.

క. ననుఁ జూడుము వేడుకకుం, జనుదెంచి భవద్బలంబు కసంతస మందం
దునిమెదఁ గర్ణుని దుర్యో,ధనుకోర్కియు నీమనంబుకతాపముఁ దీఱన్. 48

మ. ధనురాచార్యునిచావు సూచి తగ రాకధానందనుం డాసుయో
ధనునిం దమ్ముల వారిసైన్యములనుం కదాఁ గాచువాఁ డై రణం
బునకుం బూనుట నింత సేయ వలదే కభూపాల యేపారి మం
డుసె యాఱం గలదీపమ ట్లతఁడు మంకడుం గాక యే నార్చెదన్. 49

చ. నరవర పంపు మేను బ్రథకనంబున కేఁగిన సూతసూనుఁ దు
ర్ధరత నెదిర్చెనేనిఁ డల కద్రుంపక తక్కిన విప్రులోడ ని
ష్పురుసున నిచ్చువాఁడ నని కపల్కి పదంపడి యొక తక్కుడు
ష్పురుషునిఁ జూచుమాడ్కి ననుఁ కజూడుఁడు నీవును వాసుదేవుఁడున్. 50

వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండు నేనునుం దడయుట గర్జంబు గాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు కుశలి మై యుండుట యెఱింగి యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి య క్కిరీటితో ని ట్లనియె. 51

ధర్మరాజు గర్ణుండు బ్రదికి యున్నవాఁ డని విని యర్జునుం గినిసి పలుకుట.

క. అనిలోఁ దెరలుట దొలఁగుట, యనునివి ననుఁ గాక నొచ్చి కనైనను గల [2]నె
ల్లను వెడలఁ జనునె యే న,ట్లును గా కిట వచ్చుటం జుకలుక నైతిఁ గడున్.

క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీవు నోడి కతనిలజమాద్రీ
తనయులు మున్నే యోడిరి, మనతోఁ గూడంగఁ గంసక[3]మర్దియు నోడెన్. 53

క. కావున మన మిఁక ననికిం, బోవం బని లేదు విపినకభూమికిఁ జని య
చ్చో వెఱపు దక్కి తపసుల, మై విచ్చలవిడిఁ జరింత కమందఱముఁ దగన్.

క. కాదేని బిరుదు లాడక, సాదుల మై వినయ మొప్పఁ కజని కురునాథుం
డేది వనిచినను జేసి ద,యాదృష్టి నతండు సూచుకన ట్లుండఁ దగున్. 55

1. 'యేతెంచుట' అనియే వ్రా. ప్ర. 2. నెల్లును. 3. మర్దనుఁ డోడెన్.

వ. అని కెంజాయ రంజిల్లుకన్నుల నన్నరు నాలోకించి. 56

ఉ. నీతెఱఁ గిట్టి దేని రణ।నిష్ఠురుఁ బూనక కార్యవాది వై
ద్వైతవనంబునంద సము।దగ్రభుజాబలదుర్జయుండు రా
ధాతనయుండు వాని ననిఁ। దాఁక నశక్యము నాకు నన్న నే
నీతెరు వేల వత్తు మహి।గ్నేల నశక్తుఁడు గాంతు సేయునే. 57

తే. అని వధించెదఁ గర్ణు నే। నని ప్రతిజ్ఞ, సేసి యిటు దెచ్చి నన్నిట్లు। సేసి తింత
కెట్లు నేర్చితి పాడవుగా। నెత్తి [1]నేల, పైవ నోర్చితి ననుఁ బగ।వారినడుమ, 58

ఉ. పంకజనాభుఁడుర్వి వినఁగఁ। బల్కి నయప్పలు కిమ్మెయిం దుదిన్
బొంకగు టోర్చి తిట్టినినుఁ। బుట్టినయప్డు నుతించెఁ బోరికిన్
శంక గొనందు గెల్చుఁ గురు।సంఘము నీతఁడు పుణ్యుఁ డన్నయా
బొంకరి దివ్యవాణియుఁ ద।పోధనులున్ మము నిట్లలంతురే. 59

క. విను మప్పలుకులు పాటిగఁ, గొని దుర్యోధనునితోడఁ। గొంటిని బగ ము
న్న నిజంబుగ నెఱుఁగను వీఁ, డని రాధేయునకు వెఱచు। నని యే నిన్నున్.

సీ. దేవత లిచ్చిన। తేరు నశ్వంబులుఁ, గపికేతనంబును। గలవు దైవి
కంబుచే నున్నది। గాండీవ మనఁ జాటి,యంతవి ల్లది గాక। హరి రథంబు
గడపెడు నటె పరి।కర మిట్టి దై యుండ, నెట్లు కర్ణున కోడి। యిట్లు వలియఁ
బాఱు తెంచితి నీవు। భండనంబునఁ గర్ణుఁ,గని పాఱు దని సుయో।ధనుఁడు సెప్పె

తే. నది నిజంబుగఁ గానక। బేర్లైతి నాదు, [2]బేలతనమునఁ గాదె పాం।చాలమాత్స్య
పాండ్యు లాదిగఁ గలిగిన। బంధుమిత్ర,జనులు దెగటాఱి రప్రయో।జనముగాఁగ.

వ. అని పలికి కృష్ణునాననం బాలోకించి కర్ణు నిగ్రహించుట యశక్యం బయ్యె సుయోధనాదికౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతో నునికిం గడచినకష్టంబునుం గలదే యది యట్లుండె నేను జావు దప్పి వచ్చుట వడముడికతంబునం గలిగె నతం డొక్కరుండును బ్రాణంబులు డాఁపక పరబలంబులు బడలువడం బోరుచున్నవాఁడు. 62

క. అని పార్థుఁ జూచి యతఁ డి, ట్లను నేఁ డభిమన్యుఁ డొండె। హైడింబుం డొం
డెను గలిగిన నిట్లగునే, విను మును చేసినది యనుభ।వింపఁగ వలదే, 63

ఆ. నిన్నుఁ దృణముఁ జేసి। నన్నాదురాత్ముండు, బంధుహీనుఁ బోలెఁ। బఱుప నెడరు
దోఁచినప్పు డొదవి। తొలఁగించువానిఁ గా, కన్య లేల బంధుఁ। డంద్రు జనులు.

చ. హరి గలుగంగ నేటికి భ।యంబున వచ్చితి నీదుగాండివం
బెరవుగ నిచ్చి నీవు నొఁగ। లెక్కి హరిన్ రథిఁ జేయఁ గన్న ని
ష్ఠురభుజవిక్రమోగ్రుఁ డగు।సూతతనూభవుఁ డత్సహాయులం
బోరిగొనఁడె సుయోధనుని।పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. 65

1. బయలనైవ నేర్చితి. 2. బేలుఁదనమునఁ.

ఆ. గొంతికడుపునందుఁ గొడుకుఁజూలై నీవు, దోపకుండ వైతి తోఁచినట్టి
పిండ మెడలి మైనఁ బిదప దిగంబడ, దయ్యె నింతవుట్ట దట్టులైన. 66

{ అర్జునుఁడు దన్ను ధర్మజుఁ డాడినపలుకులకుఁ గోపించి యతనితల నఱుకఁ వాలు వెదకికొనుట. }

సీ. అనినఁ గృపాణంబుఁ గొని సవ్యసాచి య,వ్విభు వేఁకయఁ దలఁచిన విష్ణుఁ డెఱిఁగి
వాలు గేల నమర్ప వలసినకత మేమి, కౌరవు లిమ్మెడ లేరు మనము
ధరణీశ్వరుని సేమ మరయంగ వచ్చితి, మీతనికుశల మి ట్లేర్పడంగఁ
గంటిమి సంతోషకాలంబు గా కిది, క్రోధకాలమె వధ్యకోటి యిచట
ఆ. నేది గాఁగ నలిగి తీ వని పలికిన, రూక్షభంగి యగుకటాక్షదృష్టి
యానరేంద్రుమీఁద నడరంగ నర్జునుఁ, డమ్మురారి కిట్టు లనియె నధిప. 67
క. విను మొరులకు గాండీవ మి, మ్మని నన్నెవ్వాండు వలికె నతనిశిరము గ్ర
క్కునఁ బగుల వ్రేయుటకుఁ జే,సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదుచిత్తములోనన్. 68
తే. ఇట్టికష్టపుఁ గేలికై యిట్లు సేయఁ
బ్రతిన వట్టుట దగదె యిప్పలుకు నీవు
వినఁగ నితఁ డాడ నిమ్మహీవిభుఁడు ధర్మ
వంతుఁ డగుఁ గాక చంపనవలయుఁ గృష్ణ. 69
వ. చంపి పాలితప్రతిజ్ఞుండ నైననాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద దీనికి నీ వేమి సెప్పెదవు సెప్పుము జగత్కృత్యసాకల్యవేదివి నీచెప్పినట్ల చేయం గల వాఁడ ననుటయు నచ్యుతుండు పోపొమ్మెక్కడివాఁడ వని యదల్చి వెండియు ని ట్లనియె. 70
ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ, నయ్యె రిత్త యిట్టు లడిచిపడుటఁ
బట్టి ధర్మవిధివిభాగజ్ఞు లైనవా, రేల చేయఁ జొత్తు రిట్టిదాని. 71
క. చేయంగ వలయువానిం, జేయుట యిట్టివియె క్రొన్ని చేయ కునికి ధ
ర్మాయత్తచిత్తుఁ డైనా,నాయోగ్యస్థలము లెఱిఁగి నడవఁగ వలదే. 72
క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమధర్మయుగళమందు నహింసా
సత్యము గాచుట ధర్మ మ,సత్యమున నహింసఁ గావఁ జను నండ్రు బుధుల్. 73
ఆ. కర్మసూక్ష్మభంగి గానక యిమ్మెయి, సత్యరక్షణంబు సలుపుపొంటె
భ్రాంత ధర్మపరుఁడు రా జిమ్మహాత్ముఁ జం,పఁగఁ దలఁచుట ధర్మపథము గాదు.
క. విను పిన్ననాఁడు నీ వీ,యనుచిత మగువ్రతము వట్టి తది గాకయు వె
ట్టనృతము సూనృతమును నీ,కని యెదుచందంబు బుధులు గయికొన రెందున్.
వ. అది యె ట్లం టేని. 76
ఆ. ప్రాణహాని వచ్చుపట్టున సర్వథ,నాపహార వేళయందు నడవు
సత్య మనృత మండ్రు సత్యంబు సూనృతే, మని పరిగ్రహింతు రార్యజనులు. 77

వ. విను పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుం డనునొక్కవిప్రుం డొక్కవిశిష్టగ్రామం
బున కనతిదూరంబున సరిత్సంగమపుణ్యక్షేత్రంబున వసియించి సత్యంబ పలుకు
వాఁడ నని వ్రతంబు వట్టి సత్యవాది యనం బ్రసిద్ధుం డయి తపంబు సేయు
చుండ నొక్కనాఁడు. మ్రుచ్చులం గని వెఱచఱచి పఱతెంచినజనులు గొంద
ఱయ్యాశ్రమంబుచేరువఁ బొదలఁ దూఱి రంత వెనుతగిలి వచ్చుమ్రుచ్చు
ల త్తపోధనునికడ కేతెంచి యిప్పు డిట వచ్చినవార లెట వోయి రని యడిగిన
నతండు సత్యవిభాగవిధిజ్ఞుండు గామింజేసి తన కసత్యంబు వాటిల్లు ననుశంక
నీగుల్మలతాగహనంబు సొచ్చి రని చూపి చెప్పిన నత్తెక్కలికాండ్రు వారలం
జంపి ధనమ్ము గొని రమ్మని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యె ననునితి
హాసంబు విందుము హింసాకరం బగుసత్యంబు ధర్మంబు గాదు తొలుత వినిన
దానిన పట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు
నింతవట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం గాఁ డని నిశ్చయింపు
మనుటయు నర్జునుం డి ట్లనియె. 78

తే. తల్లిదండ్రులమాడ్కి హి✱తంబు సెప్పి, నన్ను ననుచితకృత్యంబు✱నకుఁ దొలంగఁ
ద్రోచితివి లోకమున నీకు ✱ గోచరంబు, గానిధర్మనిబోధంబు ✱ గలదె కృష్ణ. 79

క. జనములు వృథాప్రతిజ్ఞుం, డని నను నిందింప కుండ ✱ నగ్రజుఁడు సుఖం
బునికియుఁ గలిగెడునట్లుగ, ననుగ్రహముఁ జేసి చేయు✱నది పనుపు దగన్. 80

వ. అనిన నతం డతని కి ట్లనియె. 81

కృష్ణుఁ డర్జునునిఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ ధర్మజు దూఱు మని చెప్పుట.

చ. అతిశితకర్ణబాణహతి ✱ నంగము నొచ్చినదాన నల్గి యి
ప్పతి నిను నొవ్వఁ బల్కు టిది ✱ ప్రాభవ మింతియె కాక నీమెడ౯
మతిఁ బటుకోపముం గలదె ✱ మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతనివ✱శంబునఁ గాదె చరింతు రెప్పుడున్. 82

క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడినది యెల్ల ✱ నెగ్గు గొనక నా
చే వినుము నీదుప్రతినకు, నేవిధి సేయ నగు దాని ✱ నేర్పడ ననఘా. 83

క. నీ విట్టివాఁడ వని ధర,ణీవిభునిం బలుకు నుదియ ✱ నీచంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ, వై వినయము సేయు చిత్త ✱ మలర నతనికిన్. 84

వ. అట్లయిన నసత్యదోషంబునకును గురువధపాతకంబునకుం దొలంగి సమాహి
తుండ వగుదు తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు నిమ్మనుజపతియను
మతి వడయుద మనుటయు నప్పలుకుల కభినందించి పురందరనందనుండు ధర్మ
నందను నుద్దేశించి. 85

మ. కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భటగదా✱ఘాతంబులం గాలఁ గే
లను విద్విట్చతురంగసంఘములు గూ✱లం గేలి సల్పంగఁ జా

లినయాభీముఁడు వల్కఁ గాక నను దోర్లీలాసమగ్రుండ వై
యనిలో నిల్వఁగ లేనినీ విటులు కీడాడంగ నర్హుండవే. 86

క. న న్నెఱిఁగి యెఱిఁగి యి ట్లనఁ, జన్నే నీజిహ్వ పెక్కుశకలము లై పో
కున్నది యే లొకొ రణమున, నెన్నఁడుః నీ వేమి సేసితింత యనుటకున్. 87

క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గోలకుఁ దెత్తురు నో,రికి వచ్చినయట్టు లాడిరే యిబ్భంగిన్. 88

సీ. నీవు జూదం బాడఁగా వైరబంధంబు, గౌరవజాతితోఁ గలిగె మనకు
రాజ్యనాశంబు నరణ్యావాసంబును, దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ
ములుఁ దెచ్చికొంటి సిగ్గొలయదు నీమనం,బున నించుకేనియు ననికిఁ జాల
కున్నవానికిఁ దాల్మి యొప్పగుఁ గాక ప్ర,ల్లదములు వలికిన లాఘవంబు
తే. సెందు మున్నేమి సేసినఁ జేసి తింక
నైన దుర్బుద్ధితనములు మాని తగిన
పౌరుషము లేము సేయఁగ నూర కుండు
మిదుమ వడువారు సైఁతురే యింతవట్టు. 89

వ. అని యగ్రజు నప్రియంబులు వలికి యంతరంగంబు సంతాపంబు వొంద నిట్టూ
ర్పు నిగిడించి యంతకము న్నొఱఁ బెట్టినవాలు వెఱికినం గనుంగొని పద్మనా
భుండు గ్రమ్మఱ నిది యేమి యని యడిగిన నతం డే నిన్నరనాథు నో నాడిన
పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దల ద్రెంచుకొనుటయ కా నిశ్చయించితి ననుటయు
నమ్మహాత్ముఁ డాత్మప్రశంస సేయు మది మరణం బని పెద్దలు సెప్పుదు రనుటయు
నీచెప్పినట్ల చేయ కునికికిం గడచినయధర్మంబును గలదె యట్లు సేయువాఁడన
కాక యని యాధనంజయుండు ధనుర్ధరుం డై ధర్మనందనున కి ట్లనియె. 90

ఆ. హరుఁడు దక్కఁ జాపధరుఁ డొరుఁ డెన నాకుఁ
ద్రిభువనముల లేఁడు దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ జెనుపారు
ధనము రాజసూయదక్షిణలకు. 91

వ. దీప్తప్రతాపం బగుసంశప్తకసంచయంబు నడఁగించి కించిదవశిష్టంబుగా నష్టం
బు సేసితిఁ గురుసేన నాచేతం గూలి యె ట్లున్నదియో యటు సూడు మని పలికి
మొగంబు బిగు వుడిపికొని సవినయంబుగా దండప్రణామంబు సేసి నిలిచి చేతులు
మొగిడ్చి యజాతశత్రున కప్పురుహూతపుత్త్రుం డి ట్లనియె. 92

క. నను సుప్రసాదదృష్టిం, గనుఁగొను మే నిపుడు గొన్నికాఱులు లఱచితిన్
మనుజేంద్ర వానిఁ బెడచెవు,లను బెట్టుము వేలుగాఁ దలంపక దయతోన్
తే. వినుము సత్యంబ పలికెదఁ దనువుఁ బ్రాణ
ములును నీసొమ్ముగా మదిఁ దలఁతు నేను

నాదువృత్తంబు భవదధీనం బనంగ
నేల పనుపుము నను భీముఁ బాలి కధిప. 94

క. ఓపి యతనిరణభారము, వాపెదఁ గౌరవ్యసేన బడలువఱిచి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద, మా పెదఁ గురురాజుదురభిమానము బలమున్.

వ. ఎల్లభంగుల నేఁడు రాధం బుత్త్రరహితం జేసెదఁ గా దేని గొంతి నైన నట్టిద యగుం గాక. 96

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను మీకు నాకతం
బున బహుదుఃఖముల్ గలిగెఁ భూరికులంబున కప్రియం బొన
ర్చినయవినీతుఁ బాపపరుఁ బ్రేయఁ దగుం దల ద్రెవ్వ నీమనం
బునఁ గృప పుట్టి కాచినను బోయెద నిప్పుడ యేను గానకున్. 97

క. ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం,బున నుండుము సమరభీతు భుజబలహీనుఁ
జనపతిఁ గాఁ జేయుట యొ,ప్పునె కట్టుము పట్ట మనిలపుత్త్రునిఁ బ్రీతిన్. 98

వ. అని పలికి సెజ్జ డిగ్గి వనవాసగమనోన్ముఖుం డయినం గనుంగొని కమలనాభుం డాభూపతిచరణంబులకుం బ్రణతుం డై యిట్లనియె. 99

సీ. నరునిప్రతిజ్ఞ భూవర మున్నెఱుంగని, యింతియ [1]కా దేను నితఁడు నిప్పు
డాడినమాటలు నంతరంగంబునఁ, బట్టవు పేర్చుకోపమున నీకుఁ
దను నెవ్వఁ డుఱక యన్యునకు గాండీవ మి,మ్మని ధిక్కరించె నాతని వధింప
బ్రతిన [2]వట్టినవాఁడు భావ్యంబు గానియ,ప్పలు కీవు పలికితి పరమధర్మ

ఆ. మైనసత్యనిష్ఠహానిఁ బొందుట కోర్వ, కునికిఁ జూచి యేన యుల్లమునఁ ద
లంచి యట్లు వలుకఁబంచితి గురునిఁ గీ, టాడుటయ వధించు టగుటఁ జేసి. 100

క. శరణము వేఁడెదను భవ,చ్చరణంబులు వట్టికొని నిసర్గదయాని
ర్భరబుద్ధిని గావుము మ,మ్మిరువుర నీతప్పు సైఁపు మెల్లవిధములన్. 101

క. సూతసుతునిమెడ నెత్తురు, భూతలమున నివురు నేఁడు భూనాయక నీ
వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని [3]యేన చుమ్ము పలికెదన్. 102

క. విను సత్యం బాడెదఁ బా,ర్థునిచేఁ నేఁ డెల్లభంగిఁ దునుమంబడుక
ర్ణునిదెసఁ జింతయు వంతయు, మనుజేశ్వర విడువు పంపు మమ్ముఁ దెలివితోన్.

ధర్మరాజు కృష్ణునివాక్యంబులం గలంక దేఱి ప్రసన్నుఁ డగుట.

వ. అనుటయు ధర్మసూనుండు ససంభ్రమంబుగాఁ గృష్ణు నెత్తి యతండు ప్రాంజలి యై యుండ నతని కిట్లనియె. 104

క. ఇది యట్టిద మోసంబునఁ, బదిలుఁడఁ గా కేను మున్ను పదిరినకతసర్
హృదయము గలఁగిన నా కె,య్యదియును దోఁపమి వికారి నైతి మహాత్మా. 105

ఆ. ఇట్టినన్ను ననుసరించి బోధించితి, కరుణపేర్మిఁ జేసి గారవమున

---

1. కాదు ని ♦ న్నితఁ డిప్పు. 2. వట్టినవాని. 3. 'యేను ♦ సుమ్ము' వ్రా. ప్ర.

నజ్ఞు లైనమమ్ము నాపత్పయోనిధి, మునుఁగ కుండఁ గాచి తనఘమూర్తి.

వ. అనియె నప్పుడు వివర్ణం బగువదనంబు వాంచి యున్నవాసవిం జూచి వాసు దేవుండు నీ విల్లు విషణ్ణుండ వగుట గర్జంబు గా దిమ్మేదినీపతిముఖప్రసాదం బభి నందించి యనుమతి వడసి చని రాధేయవధవిహారంబున నితనికిం బ్రియం బాపాదింతుగాక యింకఁ దడయ నేల యని పల్కి వెండియు. 107

ఉ. ఈతని నొవ్వఁ బల్కుటను యీదురవస్థకు వచ్చి తక్కటా
శాతమహాసి నీనృపతిఁ జంపిన నెట్లగుదో విపత్తికిం
బాతకఘోరవృత్తికిని బాసితి దైవ మనుగ్రహించుటన్
నీ తెలి వాప్తబంధుజననిర్మితపుణ్యవిపాక మర్జునా. 108

వ. అనిన నతండు గన్నీ రొలుక నన్నపాదంబులపైఁ బడిన నప్పాండవాగ్రజుండును బాష్పాప్లావితముఖుం డగుచు నతనిమీఁద నొఱగెని ట్లయ్యిరువురు నొండొరులం బట్టికొని యేడ్చి రచ్యుతుం డుడుప నుడిగి తత్కాలోపగతసముచితపరిజనానీతజ లంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి తదనంతరంబ ధర్మనందనుండు దమ్మునిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి చిఱునవ్వుతో మనల నింత వఱు చునే కర్ణుం డని పలికి మఱియును. 109

ఆ. ఎల్లఁ జూడ సిడము విల్లు నశ్వంబుల, సూతుఁ దునిమి నన్ను నాతఁ డలవు
నెఱయ గెలిచె నతని నీ విట్లు నంపక, యున్న నాకు బ్రదికి యుండఁదగునె.

చ. అనవుడు నమ్మహీపతికి నర్జునుఁ డి ట్లను నేఁడు కర్ణు నే
ననిఁ బడ వైతు నీయడుగు లాన తదీయసుహృద్గణంబుతో
విను మటు సేయ కే మగిడి వెల్వెలఁబాఱెడుమోముతోఁడ వ
త్తునె యిట కృష్ణసారథియుఁ బూనునె మానవిహీనవృత్తి నై. 111

వ. అని గోపాలదేవు నాలోకించి నీమనంబునం గర్ణుండు దెగటాఱ వలయు నని యించుక దలంపుము దాన నే నతని వధియింతు ననిన నమ్మహాత్ముం డట్టిపని కిం జాలుదు వని యుత్సాహదీప్తుం డై పలుకుటయుఁ బార్థుండు నిజరథంబు సవిశేషకల్పితంబు సేయించి రథ్యంబుల జలపానఖాద్య[1]ఖాదనంబులం బ్రబలం బులఁ గావించి పూన్పించి యగ్రజు వీడ్కొని గమనోన్ముఖుం డగుటయు నచ్యుతుం డవ్విభు నీక్షించి నీతమ్మునిం గారుణ్యార్ద్రకటాక్షంబుల నిరీక్షింపుము దీవన యిచ్చి పనుపు మని చెప్పిన నన్నరవరుండు గిరీటిం దిగిచి బిగియారు కౌఁగిటం జేర్చి నీవు కృష్ణుపనుపునం దగుమాట లాడి తత్తెఱంగు నేనునుం దెలిసితి నామెఱుంగమి నిన్నుం బలికినపలుకులకు నుమ్మలింపకుమీ యనుట యు నతండు వికసితవదనుం డగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణతుం డయిన నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి కర్ణుని గెలువు

1. ఖాణంబులం.

విజయ నీకు విజయంబు శాశ్వతం బయ్యెడు మని దీవించిన నమ్మేటిమగండు నాటోపంబుగా దేవ నిన్ను నొప్పించినయప్పాపకర్ము మత్కార్ముకము క్తశిలీముఖంబులం బొలివుచ్చి యిదె వచ్చెద ననుచు నంజలిపుటంబు నిటలంబునఁ గదియించి వీడ్కొనియెఁ దదనంతరంబ దామోదరుండును నన్నరుండును వరదం బెక్కియలరునుల్లంబులతో నరిగి శుభప్రదంబు లగునిమిత్తంబులకుం బ్రమోదంబు నొందిరి పదంపడి రాధేయవధప్రకారచింతాక్రాంతుం డైనగాండీవితనువునం బ్రస్వేదకణమ్ములు గ్రమ్మినం గనుంగొని కమలనాభుం డతని కి ట్లనియె. 112

ఆ. అమరులకు నజయ్యు లగువారిఁ బెక్కండ్రు, గెలిచి దీవు నీకుఁ గలయుదాత్త
దివ్యబాణములు నుదీర్ణధనుర్వేద, కౌశలంబు బలముఁ గలదె యెందు. 113

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండు భవన్మహాస్త్రది
వ్యమహిమలో నడంగిరి జయద్రథుచావధికాద్భుతంబు మ
ర్త్యమునన కాదు లోకముల నన్నిట నీ కెదు రెవ్వ రేల చి
త్తమునఁ గలంక యాఱడుము దర్పము నెక్కుడు నంతకంతకున్. 114

క. బలమును శౌర్యముఁ దేజముఁ, గలఁ డని కౌరవులు నమ్మి కర్ణుని నీతోఁ
దలపెట్టిరి నీబాణం,బులఁ గూలెడు నతఁడు కీర్తి వొందెదు నిన్నున్. 115

క. కురుపతియాశలు మాలఁగ, దురమున రాధాతనూజుఁ దునుమాడి జయ
స్ఫురణంబునఁ గృతకృత్యతఁ, బొరయుము నీవారు మోదమునఁ దేలంగన్.

వ. అని వెండియు. 117

ఉ. కౌరవసైన్య మగ్గలము గాదె కదుర్ధ భవదీయసేన క
వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
వీరభటావళుల్ బహుళవిక్రమకౌతుకి వైననీశరా
సారముల్గ బడల్పడఁ గృశం బగు టిప్పుడు నీకుఁ దోఁపదే. 118

క. కురుసేనలకుం బతి యై, సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెన్
శరమహిమ నతఁడు నీచేఁ, బరిరక్షితుఁ డైనసైన్యపాలు మిగిలెనే. 119

చ. అతని శిఖండిబాణముల క క్లెర సేసితి ద్రోణునిం జమూ
పతియుఁగఁ జేసెఁ గౌరవనృపాలకుఁ డగ్గురుఁడుర్ధ భవచ్చమూ
పతి నడఁగించెనే దివసపంచక మమ్మెయిఁ బోరి తావకా
ప్రతిహతబాహురక్ష యిరువాఁగును జూడదె పాండవోత్తమా. 120

క. భీమునిరథవిహరణ ము,ద్దామం బగు టెల్ల నీదుదర్పంబునఁ గా
దే మాఱు లేనిభవద,ప్రామేయబలంబు దెలియు నంతయు నాకున్. 121

వ. కృపాశ్వత్థామకృతవర్మకర్ణశల్యులు నీచేతం బోయెడువారు కృపాశ్వత్థామల దెసం గృప సేసి తేనియుం జంపక గెలిచి విడుము చుట్టం బని యరవాయి

గొనుట కర్జంబు గాదు కృతవర్మను సమయింపుము శల్యుండు మేనమామ యై
నను బగవారిం గూడి పరాక్రమించు చున్నవాఁడు గావున నతని వధియించుట
పాపం బని తలంప వలవదు కర్ణుండు జతుగృహదాహంబును గపటద్యూతోత్సా
హంబును లోనుగాఁ గలదుర్యోధనుదుర్నయంబులకు మూలం బట్లుఁ గాక జూదం
బునప్పు డాసభలోన ద్రౌపతి నుద్దేశించి యప్పాపాత్ముండు. 122

క. లే రిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి రె విడిచిరి నిన్నుఁ గా
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకికొను మొరు ననఁడే. 123

తే. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రమానసములఁ బగ రాఁజఁ బెట్టి
నన్నుఁ బట్టింపఁ జూడఁడె యెన్నఁ డైన, నాదికారణ మతఁడ మీ కాపదలకు.

చ. వినుము సుభద్రపట్టి బలుకవిల్ మును వంచన వాఁడు డాసి త్రుం
చిన మఱి కాదె యందఱును జేరి వధించుట యాపరాభవం
బనలమపోలె నున్నది యహర్నిశముం బరితాపకారి యై
మనమున నస్త్రవృష్టి నది మాన్పుము బంధులు మోద మందఁగన్. 125

క. ఆసభ నాదుష్టాత్ముఁడు, సేసినదుర్నయము సూచి చిత్తమునఁ గడుఁ
[1]నోసినబంధులు వానిని, గాసిగ గ్రద్దగమి దొలువఁ గనుఁగొన వలదే. 126

వ. వాఁడు వడినం దక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్టరని చెప్పి యిట్లు సెప్పు
చు సమరస్థలంబున కనతిదూరంబుగాఁ జని యత్తెత్తి చూచి కర్ణుండు సంగరంబు
సేయుసంరంభం బుగ్గడించి యగ్గాండీవికిం జూపి పుండరీకాక్షుండు. 127

క. కేతనము రథముఁ దురగ, వ్రాతముఁ బొడిచేసి నిశితశరంబులఁ గర్ణుఁ
వే తునిమినఁ గని శల్యుఁడు, వాతెఱ యెండంగఁ బాఱవల దె కిరీటీ. 128

వ. పూనిక నెఱపి శోకం బుజ్జగించి లోకంబు సంస్తుతింప సుఖివి గమ్మనినం బ్రము
దితహృదయుం డై. 129

శా. నీతోడ్పాటున నేఁ ద్రివిష్టపములన్ నెల్వొంగ నూఁకింతు నా
చేతం గర్ణుఁడు దూపు మాలి చను మెచ్చింతుర్ నినుం జూడుమీ
దై తేయాంతక యంచు శేషనిభహస్తం బుద్ధతిం [2]జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంతకోదండమున్. 130

—అర్జునుఁడు కృష్ణునివాక్యంబులచేఁ గర్ణునివధ కుత్సహించుట.—

వ. ఇట్లు గాండీవం బెత్తి యెక్కువెట్టి యన్నరుండు నేఁడు నాబాణంబులు బాణాస
నంబును సరదంబును జూచి సుయోధనుండు శకునియక్షపాళ్లను బలకయు సమ్మం
డపంబును దలంపవలయుఁ దననమ్మినబం టైనకర్ణుండు నే నేయుతూపులతాఁకున
రూపడంగినం గని యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమికి వగం బొందవలయు
ధృతరాష్ట్రుండు దనకుం గార్యదర్శనంబు లేమి యుగ్గడించి తన్ను నిందించికొన

1. మోసిన; ప్రోసిన. 2. జాఁచి.

వలయు నతండు గొడుకులదెసను వారు రాజ్యంబుదెసను విగతాశులు గావలయు
నని పలికి మఱియును. 131

ఆ. రాజరాజుఁ బాసి | రాజ్యసంపద ధర్మ,తనయుఁ జేరుపెంపు | దారు దెలియఁ
గాంచి సాత్యకియును | గవలును భీముండు, గారవించువారు | గాక నన్ను. 132

క. సురగరుడోరగవిద్యా,ధరాదిభూతములు సూత | తనయుని నేఁ డేఁ
బారి పుచ్చిన ననుఁ బొగడుచు, నరుగుం గా కునికిపట్ల | కంబుజనాభా. 133

వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం గృష్ణార్జునులు నిజసేనఁ జేరి రంతకు మున్న
యిరువాఁగుసం జేయం గలదొరలు దలపడినం బోరు ఘోరం బయ్యె నందు. 134

సీ. కర్ణసూనులలో నొకం డుత్తమౌజుని,చేతఁ జచ్చుటయు | శోకాతురుండుఁ
గ్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని,తురగకేతనములఁ | దునుమ నాతఁ
డడిదంబు సేకొని | యరదంబు డిగి కృపా,చార్యరథ్యంబులఁ | జంపి భీష్మ
వైరితే రెక్క నా | శారద్వతుం డట్లు, విరథుఁ డయ్యును బలు | విడిఁ గడంగ

ఆ. నతఁడు పాదచారి | యని యాశిఖండి యు,వ్విప్ర నేయఁ డయ్యె | వేగ మెద్ది
ద్రౌణి యతనిఁ దనర | థంబుపై నిడికొని, యనికిఁ దొలఁగిచని | యె మనుజనాథ. 135

వ. అట్టియెడ. 136

చ. అనిలసుతుండు దీవ్రవిశిఖంబులు పర్వఁగ నేచి యంబరం
బునడుమఁ దేజరిల్లురవిఁ | బోలెడు వేఁడిమి గోహటించి నీ
మొన దెరలంగ నారథిక | ముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం
గనుఁగొని మానసంబు దలఁ | కంగ రణోగ్రత దక్కి యిట్లనున్. 137

క. నరుఁ డన్నవర్తనము తెఱఁ, గరయుటకై మది గలంగ | నట చనినాఁ డ
న్నరపతిదుర్దశ గని దు, స్తరశోకం బడరి తానుఁ | దదవస్థుఁ డగున్. 138

తే. అయ్యెకువురకు నొకటి యై | నట్టి దైన, మనము కౌరవసంఘంబు | మ్రగ్గఁ జేసి
గెలుపుగొంటిమ యేనియు | ఫలము దాన, నేమిగల దనువగఁ జిత్త | మెరియఁ జొచ్చె.

భీముఁ డర్జునురాక గోరి విశోకునితో విచారించుట.

క. వినను నిప్పటిదుఃఖము, మానింపఁగ మనకు నొండు | మం దెయ్యది యీ
సేనల దొరలను గౌరవ, భూనాథుని సమయఁ జూచి | పోవుట దక్కన్. 140

వ. అని పలికి యవ్విశోకునకు మనదిక్కు సిడంబులు సూపి యవి యెవ్వ రెవ్వరి
చిహ్నంబు లేర్పడం జూచికొనుము మనశరంబులకొలంది యెట్లున్న దరయు
మనవుడు నతండు వీ రెవ్వరైరేమి నీ వలిగినఁ బడక పాఱక నిలువం జాలువాఁ
డిం దెవ్వం డస్త్రశస్త్రంబులసంపద యడుగ వలదు నేఁడు దెచ్చినవానిలోన
నాతెల్లు వ్రేఁగుపడి పూని వచ్చుబండి యొక్కటి యించుకయు వెలితి గాక యున్న
యది గాక యున్న నేమి భవద్బాహుదండంబునకు మూలధనం బైనగదా
దండం బెల్లపనికిఁ జాలునని చెప్పినఁ బవమానసూతి యాసూతుచే సేత నప్పళించి.

ఉ. వేడుకఁ జూడు మేను బటు - విక్రమకౌతుకలీలఁ బేర్చి చెం
డాడెద నైరులన్ విదురుఁ - డప్పుడు సెప్పఁడె జూడ మిట్లు గా
నాడెను రాజరాజకట - యాప్రతిసల్ గడతేర్పఁ గాక బొం
కాడునె ధర్మజావరజుఁ - డంచుఁ దదాప్తులు వంతఁ బొందఁగన్. 142

వ. అని వెండియు. 143

ఉ. ఉత్తమకర్మ మిట్టి దని - యొక్కరుఁడుం దగఁ జెప్ప [2]లేఁడ నా
కిత్తఱి నేన పోలుతెఱఁ - గెల్లను జేసెద నట్లుఁ గాక నా
చిత్తము మార్దవవృత్తియుఁగ - శిక్షక మయ్యెడు దైవ మంచు న
త్రైత్తి భవద్బలంబుపయి - నెల్లను జూ పడరించె నేపునన్. 144

వ. ఇట్లు గలయం గనుంగొని యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి విశోకునితోఁ గౌరవసైన్యంబు మనము దఱుమకయ తాన కలంగెఁ గెలనం గవ్వడి గదిసెనో కాక యనుటయు వాఁడు నిపుణంబుగా నిరూపించి ముదంబునం బొదలుచు. 145

క. నరుఁ డదె కంటే కౌరవ, కరిసేనం గవిసెఁ గేతు - కపిరుచు లంభో
ధరబృందముపైఁ గలయం, బరఁగుతటిల్లతలఁ దలఁపఁ - బట్టయి నిగుడన్. 146

క. హరిమేనికాంతియును నరు, కిరీటరత్నాంశువులును - గిఱిగొన రథర
థ్యరుచులు బెరసి విచిత్ర, స్ఫురణంబునఁ దేజరిల్లెఁ - జూడు కుమారా. 147

వ. అనిన విని యంతరంగంబు సంతోషమయంబుగా నంగంబు వొంగ నేర్పడ నాలోకించి విశోకునకు వృకోదరుం డిట్లనియె. 148

తే. వరవుడుల నూర్వురను మేలి - వాజు లిరువ, దింటి నూళులు పదునాల్గు - నిత్తు నీకుఁ
బసదనము నీవు నాకు బీ - భత్సు రాక, సూపి ముద మొనరించితి - సూతవర్య. 149

వ. అనియె నప్పుడు వారణఘటావిదారణంబు సేసి వాసవి వాసుదేవుతో మన తేరు భీమసేనుఁ జేరం బోవ ని మ్మనుటయు. 150

క. అతఁడు హరులఁ దఱుమఁగ ను,ద్ధతిఁ జనునెడ మనబలంబు - దర్పమహోగ్రా
కృతిఁ బొదివినఁ జతురంగ, ప్రతతుల నన్నరుఁడు నేల - పాలుగఁ జేసెన్. 151

ఆ. మందరంబుచేత - మథిత మై తిరుగుసా, గరమునులివు గెలిచె - ధరణినాథ
పార్థుఁ డురవణింప - బలువడిఁ [2]గలఁగెడు, కౌరవేంద్రసేన - [3]కలకలంబు. 152

వ. కేతుచామరాతపత్రభూషణశకలంబుల నాశౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె నట్లు కర్ణువధంబునకు వేగిరపడి తఱుమ నుఱుక మన మొన వెండియు నొండొండ పయిం గ్రమ్మిన నమ్మేటిమగండు. 153

క. పేరు గలరథికముఖ్యుల, సారథిరథరథ్యకేతు - సహితంబుగ దు
ర్వారవిశిఖ[4]విస్ఫురణవి, హారంబున శతచతుష్టయము - పొడి చేసెన్. 154

1. దైర; నేల. 2. గడఁగెడు. 3. కళకళంబు. 4. 'విస్తరణ' అనియె. వ్రా. ప్ర.

వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ గర్ణునుండటి మోహరం బుత్సాహతీవ్రం బయి యురవణించినం గని యన్నరుం డురగనికరంబునకుఁ గనియుగరుడుని కైవడి నద్దెస కడరె నట్లడరుట యాలోకించి తనకట్టెదుటి మొన బెట్టు దాఁకె. 155

తే. వాయుసత్త్వుండు వాయుజవప్రదీప్తతనుఁడు వాయుతనూజుఁ డుగ్రప్రవృత్తి నేచి బాహాసముల్లాసన్ మెసక మెసఁగఁ గనుపుగొట్టె వాలమ్ములన్ గౌరవేంద్ర.

వ. అవ్వీరునాటోపంబు సూచి కురుభూపతి ప్రధానసైనికులకుం జూపి యితండు సమసిన నక్కడ సకలంబు సమయు మీ రొక్కుమ్మడిం బొదివి పోరివుచ్చుం డనిన వారును వారణాదిచతురంగంబులయగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి యస్త్రశస్త్రంబులం బొదువుటయు నతండు. 157

ఆ. వాని నెల్లఁ ద్రుంచి న్ వల వ్రచ్చికొని లీల, నిగుడుచో నవోలెన్ నెగడువడక తఱిమిః రక్తనదులున్ వఱపె మస్తకకూర్మ,హాస్తభుజగతతులన్ నతిశయిల్ల. 158

క. కురువిభుఁడు సూచి శకునిం, బురికొల్పిన నాతఁ డుగ్రన్ముగ మార్కొని పే రురమున నారాచంబులు, గురిసినఁ బవనజుఁడు సరకున్ గొన కారథికున్. 159

క. బలునారసమున నేసిన, నలఘులఘుత మెఱయ నాతఁ డదది యిరుమూఁడ మ్ములఁ దునియలు సేయుడు నతఁ, డలిగి ఘతనిధనువు దునిమెన్ నల్లన నగుచున్.

ఉ. ఒండొకవిల్లు వుచ్చికొని న్ యుజ్జ్వలషోడశభల్లముల్ సము ద్దండత నేసె నీమఱఁది న్ తత్తను వాఁడఁగఁ జాపకేతువుల్ ఖండము లై పడంగఁ దురన్గంబులు నొవ్వఁగ సూతుమేనఁ బెక్ గండలు నెత్తురుల్ దొరఁగఁ న్ గౌరవపుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. 161

తే. అలిగిజమునాలుకయుఁబోనిన్యతులశక్తి, వాయుపుత్త్రుఁడారథికుపైన్వై చెనతఁడు నెరవుమైఁ బట్టి దాన నన్వీరుబాహు,వుచ్చిపోవైన మన మొనన్ యుబ్బ యార్చె.

—శకుని భీమసేనుం దలపడి మూర్ఛితుండై తనరథంబుమీఁదఁ గూలుట.—

చ. అనిలజుఁ డట్లు పెల్లెసఁగుఁనార్పులు సైఁపక మేటివిల్లు వే కొని కనుదోయి గెంపు గ నన్కుంఠితవిక్రమ మొప్పఁ గ్రుంచె నా తనిఘనకార్ముకంబు నిశితప్రదరంబులు మేన నించె నిం చిన నతఁ డుర్విఁ గూలెఁ గురున్సేనకు బెగ్గల మగ్గలంబు గన్. 163

తే. కూలి మూర్ఛ మునింగినన్ గురువిభుండు
దనరథంబుపై నిడికొని న్ యనికిఁ దొలఁగఁ
బోవుటయుఁ జూచి తమతమన్పోరు మాని
దొరలు దెరలిన మూఁకలు న్ మరలి పఱచె. 164

వ. ఇట్లు వెఱచఱచి యవిసినకలంబుజనంబులు దీవి సేరినయట్లు కర్ణుం జేరి కాలు దన్ని నిలిచె నన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 165

తే. అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజులుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గినియఁ జాల
రయిరె కిమ్మీరవైరికరయ్యంబుకడఁక
యిట్టు లుండునె పడపడిఁ గొట్టు లయ్యె. 166

వ. అనిన సంజయుం డమ్మహీపతి కిట్లనియె నప్పుడు కరూశపాంచాలచేదిసైన్యంబులఁ దఱుముటయుం గని కర్ణుండు గడంగిన మనమూఁకలుం బురికొని పవనతనయుతోడం బోరె నప్పాండవసేనాసముదయంబు రథసంభున నారాధేయుం బొదివిన.

క. అతఁడు వివిధోగ్రవిశిఖ, ప్రతతులు నిగిడించి ఘోరరథంగి నుదారో
ద్ధతి సూపినఁ జేడ్పడి త, చ్చతురంగంబులును గలఁగెఁ జగతీనాథా. 168

చ. కనుఁగొని భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడుఁ దాఁకిన సందఱ కన్నిరూపులై
తనువులు సించుచుం బ్రహయవిశ్రాంతానము నొంచుచుఁ గేతుదండఖం
డన మొనరించుచుం బెనఁగి దయ్యాక క్రుయ్య కతండు గండునన్. 169

క. నకులసహదేవులును వా, రికిఁ దోడ్పడి నిశితశరపరీతునిఁ జేయం
బ్రకటితబలశౌర్యుఁడు సూ, తకులోద్వహుఁ డేచి వారిఁ దలఁకం జేసెన్. 170

క. పెక్కండ్రతోడఁ గర్ణుం, డొక్కఁడ పోరాడి యెక్కుడుక్కన వారిం
జిక్కువడం జేయుట గడు, నక్కజమై యుండెఁ గౌరవాధిప చూడన్. 171

వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయం గలమగల వెగ డందించినం బోక పొదువుపాంచాలచేదిమాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళప్రసారంబు లగుశరాసారంబులు నిగిడించినం గరిరథఘోటకభటావయవఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబులును జామరచ్ఛత్రకేతుభూషణభాగంబులును భూభాగంబునం దొరఁగం బెరిఁగి నెత్తురుటేఱులు వాఱ మఱియుం బాండవయోధవరులు వరుసం బోరి పోరి యంతకంతకు నివ్వటిల్లునాకర్ణుక్రొవ్వున నివ్వెఱపడిన నవ్వీరుండు గోవులం దోలుకోల్పులికైవడిఁ గౌంతేయబలంబులం బఱపఁ బాంచాలురు వెండియు దండితనంబున నతనిం దలపడిన నాతండు పంచవింశతిరథికులం దునిమి వైవస్వతుచందంబునం బేర్చినం దూర్యరవంబులు సెలంగం దత్పుత్త్రులును దుర్యోధనకృపదుశ్శాసనులు నశ్వత్థామశకునికృతవర్మలుం బైకొని యాధర్మనందనుసైన్యంబు సమయింప నది విచ్చిన నెలుం గిచ్చి పోనీక నిలిపి భీమ నకులసహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవసైనికులం గనువు గొట్టం దొడంగినం బోరు ఘోరం బయ్యె ని త్తెఱంగున రెండుదెఱంగులమూఁకలు దెగటాఱు చుండ గాండీవి దమమోహారంబున కుత్సాహం బెసంగ నొక్కవలన మనమొనల నెత్తుటం దోఁచుచుం గదిసి దలమెత్తి చూచి శౌరి నుద్దేశించి.

సీ. కర్ణుని కేతువు గ్రాలెడుఁ జూచితే, భీమాదు లైసేయు యోద్ధామరథిక
జనులు పెక్కండ్రతోఁ బనిసేయుచున్నవాఁ, డితని ప్రాపున గురుసుతుఁడుఁ గృపుఁడు
గృతవర్మయును గుభ్రపతి సురక్షితుఁ జేసికొని వీకఁ బాంచాలకోటి బడలు
వఱిచెద రురవడిఁ దఱిమి యారాధేయు, గీటడఁగింతము ఘోటకములఁ
తే. బటురయమునఁ బోనిమ్మని పలుకుటయును, శౌరి యట్టులు సేయంగ శల్యుఁ డమ్మ
హోగ్రరథవేగమును నరునుజ్జ్వలంపు, టేపుఁ గని సూతపుత్త్రుతో నిట్టు లనియె.
క. కేతనకపిభయదం బై, తోఁ తేరఁగఁ జక్రధరచతురసారథ్య
ద్యోతితవల్గనచారు, శ్వేతహయులు మెఱయ వచ్చె వీరునిఁ గంటే. 174
వ. అని మఱియును. 175
సీ. నవ్వేడుతలలను గ్రొవ్వారుచేతుల, బిరుదులు వెట్టిన చరణములను
వాతులు దెఱచిన వాజిమస్తకముల, గిరిశృంగములఁ బోని కరిశిరముల
నవయవభేదంబు గలడఁగెడునట్లుగఁ, దుము లైనబహుగాత్రసముదయముల
భయదంబు లై మహిఁ బడువిమానములట్ల, యఱవఱ లైనట్టి యురదములను
తే. నేలఁ గప్పుచుఁ దనబాణజాల మడర, నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును
దవులఁబడక సముద్ధతిఁ దివిరి మనలఁ, దేఱి చూచుచుఁ బార్థుఁ డీదిక్కు గవిసె,
క. తోడై డాపట వలపటఁ, గూడి తఱుమువాఁడు లేరు కోపంబున నీ
తోడిబవరమున కడరెడుఁ, గ్రీడి మనతలంపు గూడె గెలువుము గడఁకన్.
ఆ. పాయ వడియె సేన బరవస మలరంగ, మార్కొనంగ మేటిమగఁ డొకండుఁ
గలుగ నోపఁ డేపు దలకొన మనమయి, బ్బలియుఁ దలపడంగ వలయుఁ గర్ణ.
వ. అనిన విని కర్ణుండు గవ్వడిబాహాబలంబును శౌర్యసారంబును దపఃప్రభావం
బును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాదిదివ్యాస్త్రంబులు
వడయుటయును బురందరప్రముఖబృందారకులకు నజయ్యు లగు కాలకేయుల
నిర్జించుటయు విరాటుపసులం బట్టించుకొనుటయు లోనుగాఁ గలవిశేషంబు లుగ్గ
డించి కృష్ణుమాహాత్మ్యంబు వొగడి యిట్టివారల నే నొక్కరుండన మార్కొని
మడం బడఁగించెద మద్రనాయక మనతేరు వారియరదంబునకు సమ్ముఖంబుగాఁ
జనని మ్మనిన నతం డట్లు చేయఁ గనుంగొని కురుపతి పురికొలుపఁ గృప కృత
వర్మ గురుపుత్త్ర గాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు
దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యాఫల్గునుం బొదివిన నమ్మహాభుజుండు
హరిణకులంబు గనినసింగంబువిధమున విజృంభించి యారథికులపైఁ గలయ
వివిధవిశిఖంబులు నిగిడించి ధనువులు దునిమియు ఘోటకంబులఁ గూల్చియు
సారథుల సమయించియు దత్సేనాతురంగంబుల బడలువఱిచియు నబ్బలు
మగలం దెరల్చి యొత్తరించి కెలనన దురంబు సేయుసమ్మరుత్తనయుం జేరం

జని బహువిరోధిజనపయోధిమగ్నుం డగుచున్నయతని నుద్ధరించి సంప్రీతుం డగునతనికి నగ్రజుకుశలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి నీ విఁక డప్పి యార్చికొ మ్మని పలికి రాధేయరథసోత్సాహసహితం బగునీబలంబు మీఁదం గవిసిన. 179

కురుకుమారులు పదుగు రర్జునుం దాఁకి మృతు లగుట.

చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టు ముట్టుటయు ✽ వారలసూతహయధ్వజంబులం
బొడి పొడి సేసి యాతఁడు రిపుల్ వెగ డంద వెడందతూపులన్
మెడలు దెగంగ నేసి రణ✽మేదినికిన్ బలి సేసె నత్తలల్. 180

వ. అట్టియెడ. 181

తే. నవతికౌరవరథికులు ✽ గవిసి కడిమిఁ
బొదువుటయు నన్నిశరముల ✽ భూరిరయము
మెఱయ నందఱఁ దెగటార్చి ✽ తఱుమునతని
దాఁకె వేయుమున్నూఱుదంతావళములు. 182

వ. ఇట్లు దాఁకినయాభీరాదిమ్లేచ్ఛనికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల విరియింపం బైపైఁ గరితురగసుభటరథసమూహమ్ములు గ్రమ్మినం గని కడంగినవడముడిలోడ్పాటునం జేడ్పడియు నవి వోక పొదివి పెనంగిన గద గొని యరదంబు డిగ్గి యగ్గలికనప్పవనతనయుండు దారుణరణవిహారంబున నెఱయ మెఱయం దఱచుగా మెఱుంగువాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్మొఖంబు చతురంగంబులయం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగనియట్టిది లేకయుండె నట్లుగార్చిచ్చువొదివినకాననంబుచందం బయి యాసైన్యంబురూపఱి విఱిగి కర్ణ కర్ణ కావుకావు మను నెలుంగులతో నతనివెనుక కొదిఁగిన నీకొడుకు లబ్బలుమగని బలసి నిలువ నావీరుండు దీవికై వడి సమరార్ణవంబున మునుంగనీక యమ్మోహరంబునుద్ధరించి మార్విఁ దాటించి కిరీటిదెసకు నడరె నంతకు మున్న యరదం బెక్కి యనిలతనయుం డాధనంజయునిం గూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రాసూతనందనుం దలపడుటయు. 183

తే. ద్రౌపదీనందనులును సాత్యకియు లోను
గాఁగఁ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియెఁ బాంచాలురఁ ✽ గురువరేణ్య
యందఱకు నన్నిరూపులై ✽ యతఁడు వెనఁగ. 184

వ. అప్పుడు. 185

సీ. జనమేజయునిసూతుఁ ✽ దునిమి రథ్యంబుల, నో నేసి భీమతనూజనకుల
సుతులచాపములు ఖండితములు సేసి ధృష్టద్యుమ్నుమాపుల ✽ సమయఁ జూచి

మెఱు వెంచి సాత్యకి హయములఁ గూల్చి కే, కయకుమారునిజముకడకు ననుపఁ
దజ్జనకుం డగ్గిఁ తన్నునొప్పించి ¹ప్ర, సేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు

తే. టయును బుత్త్రశోకంబుఁ, గినుకయు మనంబు
నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకె
శినివరుం డొండువాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి తత్సుతుఁ బొదివె నధిప. 186

వ. ఇట్లు సూతపౌత్త్రుం డగుసుషేణుం బొదివి శినిపౌత్త్రుండు. 187

చ. హయములఁ జంపి ముప్పదిశితాస్త్రములం డగటార్పఁ జూచి తం
డ్రి యమునిచంద మై ²త్రెగితిరే శినివీరుఁడ యంచు నేయుడు
న్భయదమహోగ్రతఁ నిగుడ్చునారసమగ్ర నడుమగ్ర శిలీముఖ
త్రయమునఁ ద్రుంచి మేనఁ బ్రదరత్రితయంబు శిఖండి గ్రుచ్చినన్. 188

తే. కనలి యాసూతపుత్త్రుఁ డాతనిసిడంబు
[illegible]వుఁ దును మాడి పార్షతతనయుఁ డగుసు
దేవుఁ దండ్రులు గనుఁగొనం గా వధించి
వేసె సుతసోముఁ డతరిన నేపు దఱుఁగ. 189

వ. అంతియుఁ బాంచాలరథికసంఘంబులు రాధేయుమీఁద నురవణింప సమీరణసుతసహాయుం డగుసవ్యసాచి వానిం గడచి యక్కర్ణునరదంబున కడరె నట్టియెడ నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు ధృష్టద్యుమ్నుండును నతనిం దలమిగిలి యబ్బలుమగనిం బొదివి యింద్రియంబులు దృఢాత్మునిం గలంపం జాలనిచందంబున నాసూతనందనుఁ ³దెరల్పం జాల రైరి వారల[illegible]చ్ఛత్రసూతతురగధనుస్తూణీరంబులు రేణువులు సేసి బహుబాణంబులఁ దనువులు నో సేసి సింహనాదంబు సేసినయయ్యంగపతిపై సుసంగతు లై ద్రౌపదికొడుకులు గవిసిరి వారిం గూడికొని శినివరుం డాసేనాపతి వారి నేయుసాయకంబులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగినకౌరవపతియంగంబున నెనిమిది[illegible]తవిశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. 190

క. అలిగినయన్నరనాథుని, కెలఁకుల వెసఁ దఱిమి కర్ణకృపకృతవర్మల్
ములుతూపుల నేయఁగ న,న్నలువుర గ్రుక్కించె నతఁడు నారాచములన్. 191

తే. దొరలఁ గడచి బలంబు లుద్ధురత నిగుడ
[illegible]రిటునలు నెదిర్చిన ఘోరతుముల
సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ
[illegible] దుశ్శాసనుఁ[illegible] వాయుతనయుతోడ. 192

1. 'సు, దేవునిఁ దాఁ జూడఁ గా వధించు' వ్రా. ప్ర. 2. 'తెగితే'. అ. ప్ర. 3. గదల్ప రైరి.

దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుట.

తే. సారథులయుబ్బు వాజులచటులతయును, మెఱయ నొప్పారు తేరులమీఁదఁ బొలిచి
రపుడు గయ్యంపువేడుక నాతఁడును న, తండుఁ జూపఱకన్నులపండు వగుచు.

క. ఒండొరులమీఁద నుజ్జ్వల, కాండము లడరించు చొల్లు గదిసినయెడ భీ
ముండు ప్రమోదభరితచి, త్తుం డయి తగ నిట్టు లనియె దుశ్శాసనుతోన్. 194

ఉ. ఆసభలోనఁ గొన్నబుణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితోఁ
బాస కొకింతయుం దొలఁగఁ బాఱకు తీర్చెద నిష్టు నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు సేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా. 195

వ. అనిన విని యతఁ డతని కిట్లనియె. 196

సీ. ఎఱుఁగుదు మఱచితి నే లక్కయింటఁ జి, చ్చిడి మిమ్ముఁ బఱచిన యుడుము లవియుఁ
[1]గాకయు నమ్మెయి గాంధారరాజు మీ, యన్నతో వెడజూద [2]మార్చి రాజ్య
లక్ష్మిఁ జేకొని కానలకుఁ బోవ నడిచితి, మందుఁ బెక్కాపద లనుభవించి
యజ్ఞాతవాసార్థ మవ్విరాటునిప్రోలి, కరిగి యత్యంతదైన్యంబు నొంది

ఆ. యట్లు మీర లునికి యప్రసిద్ధమె యివి, యేల రిత్తమాట లేటు పోటు
తలకువచ్చియనుడు దరహాసమునఁ గెంపు, గదురఁ బవనసుతుఁడు గడఁగి డాసి.

క. భల్లములు మూఁట సిడమును, విల్లు నఱకి సూతకంఠవిశసనమున శో
భిల్లి నిటలమునఁ బటుద, ర్పోల్లసితుం డగుచు నాటె నొకనారసమున్. 198

వ. దాన బీఱువోవక దుశ్శాసనుండు. 199

క. తురగములఁ దాన నడపుచు, వెరవు రయము నెఱయ నొందు విలు గొని గాఢ
స్ఫురణమున భీముతనువునఁ, బరఁగించె మెఱుంగు లడరఁ బండ్రెం డమ్ముల్. 200

క. తోడన కోదండము దును, మాడెను సూతుమెయి గ్రుచ్చె నాఱమ్ములు సం
క్రీడయ పోలెను ముప్పది, యాడించెను మఱియుఁ దూపు లనిలజుమేనన్. 201

మ. ధను వొం డుగ్రత నెత్తి యేఁబది శిలాశస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబున గ్రుచ్చినం గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మయుగళీస్ఫారాహతిన్ వాజులం
దునిమెం జూపఱు పిచ్చలింప విలసద్దోర్గర్వదుర్వారుఁ డై. 202

వ. ఇట్లు విరథుం డై వృకోదరుండు మెయి వెంచి. 203

మ. గద లీలం గొని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
న్మదయానంబునఁ గిట్టి ఘోటకములన్ మర్దించి బాహాబలం
బు దలిర్పన్ భవదీయసూనునరథంబుం ద్రెళ్లఁ ద్రోవంగ బె
ట్టిదపుం దోమర మెత్తికొం చతఁడు దాఁకెన్ నేలకున్ గ్రక్కునన్. 204

1. క. గాః యే మమ్మెయిఁ. 2. జ. మాడి రాజ్య.

వ. అట్లు దాఁటి బెట్టు వైచినయత్తోమరం బురం బొడ నేచి యక్కీచకారాతి పధ్ధు మూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్ల నుద్దండగదాదండంబున దుశ్శాసను వైవ నతండు నెత్తురు దొరఁగ ధరణిం బడిన బెబ్బులి లేడిఁగొదమం బొదువుపోలికం బొదివి మెడ ద్రొక్కి యెక్కుడుమదంబున నక్కుమారునితో ని ట్లనియె. 205

క. మును సభఁ బలికినదానం, దని ఏవక యిచ్చటికి వెరదకి వచ్చితి [1]యే మనియె దనుము నీమాటలు, వినుటకు నాకినుక సాల వేడ్కపడియెడున్. 206

వ. అని యమ్మహాబలనందనుండు మహోగ్రలోచనప్రభలు నిగుడ మనబలంబులం జూచిన. 207

క. నిగుడుదవాగ్నిజ్వాలల, వెగ డందినమృగకులంబువిధమున నతిభీ తి గదిరి నలుగడ విచ్చిన, జగతీశ్వర యతఁడు మెఱసెం జక్కనిబయలన్. 208

వ. అప్పుడు నీయందుఁ జేయం గలసైనికులు సూచి తత్తేజోవిశేషంబునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి యంతంత యిచ్చవడి యుండ. 209

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా భీలత్వం బలరింపఁ ద్రిప్పఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు ముం గాలం ద్రోచు మొగంబు ద్రేయు దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ కాలూఁదుం బయిఁ గ్రమ్మఱంగ మెడ [2]చిక్కం ద్రొక్కి నిల్చుం నగున్. 210

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి భీమవిక్రముం డగునాభీమసేనుం డయ్యువ రాజునాననం బాలోకించి. 211

క. ఏ నురము వ్రచ్చి నెత్తురు, దేనియ [3]యిదె ద్రావెదం గదిసి ననుఁ గడిమిన్ మానుప దిక్కు గలిగిన, న్రా ని [4]మ్మెలుఁగింపు మీమొనం గలవారిన్. 212

వ. అని పెలుచం బలికి కుఠారంబు వెఱికి యతనిమొగంబుమీఁద జళిపించి. 213

భీమసేనుఁడు దుస్ససేనునియురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట.

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణిన్ క్రౌర్యం బుదగ్రంబు గా నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్ముురుధిరమ్ముల్లాసి వైదోయిట స్వైర వారం గొని త్రావు మెచ్చుఁ జవికిన్ న్మేనున్ మొగంబున్ భయం కర రేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. 214

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి. 215

తే. తల్లిచన్నులపా లేను ద్రావ నెట్టు, లాననే పలుతెఱఁగులన్ తేనియలును ఖండశర్కరతోడిదుగ్ధంబు లనుభవింపఁబడవే యవియు నింతయింపు గావు.

చ. అని యెలుఁ గెత్తి పల్కు నలినాడు మహోద్ధతిఁ ద్రుళ్లు నార్చుఁ బె ల్చన భుజ మప్పళించుఁ దమసైనికులున్ మనవారు రక్కసుం

1. జ. వే, మనియెద వను. 2. క. సక్కం ద్రొక్కు. 3. క. వల్లె ద్రావెదం. 4. క. మెఱఁగింపు.

డని వెఱఁ గందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారు నై రణవిరామముఁ బొంద మదోత్కటాకృతిన్. 217

వ. పదంపడి. 218

మ. గద సేతం గొని యంత్యకాలయమ రేఖం బేర్చి రక్తంబు చా
య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచి యు
న్మదమాతంగములీల బోఁప మనసేనం బొల్పఱం దోలి వే
సాదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తి యై. 219

వ. చలంబు నెఱయ నలనికాలు నేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కిమ్మీర
వైరి యిట్లనియె. 220

క. ఏమిర పసు లని యార్చితి, నీమాటలు నిలువఁబడియె నే పసరమ మి
మ్మేము మగుడ నిదె యార్చెద, మీమాటకు మాఱు పల్క నెవ్వరుఁ గంటే.

ఉ. నెట్టన యల్గినం దగు నె నీళ్లను ద్రోచుటయుం విషాన్నముం
బెట్టుటయుం మహాభుజగభీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడ సభం నెఱి మాలి యమ్మెయిం
దిట్టున కోర్చు టెందుఁ గలదే విను గెల్వరె జూద మెవ్వరున్. 222

క. అని పలికి కృష్ణఁ గనుఁగొని, మునమీఁదం బ్రమరివాటి ముంగురలలితం
బునఁ గేలు మెఱయఁ జని తన, కన [1]లడఁగక దుస్ససేనుఁ గనుఁగొని పలుకున్.

ఉ. పైబడి పోయెఁ గాక ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసభం
దా వల దన్నఁ గొ. డుడుగదా పతి లేఁ డనఁ బడ్డకాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతియేడ్తెఱ నొప్పెఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు నేడ్పడి రిట్లపతిత్వదీనతన్. 224

క. విను మేను జేయఁ బూనిన, పనులం దొకటి గడ తేఱెఁ బాపాత్మ సుయో
ధనుఁ బొరిగొని తల దన్నుదు, నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్. 225

చ. అని యెలుఁ గెత్తి చెప్పి యతఁ డాతనిఁ గీటడఁగించి యార్చెఁ గ
ర్ణునకును లోను గా మనవరూథినియోధులకుం మహాభయం
బున మనముల్ గలంగఁబడి పోరికి నాల్కొన నీనిటిచ్చపా
టున సకలాంగకంబులు గడుం శిథిలంబులు గా మహోగ్రుఁ డై. 226

క. జనపతియుఁ గృపప్రముఖులుఁ, గనుఁగొన నిట్లనిలసుతుఁడు గార్య మొదల్ గై
కొనినట్లు సేర్చి దుశ్శాసనుఁ జంపుటఁ జూచి రోషసంరంభమునన్. 227

వ. నీకొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుం
డును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుం
డును గూడి కవిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకు మున్న దుశ్శాసన

1. క. లడరఁగ.

రక్తపానకౌతుకాధీనమానసుం డై నయాభీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని క న్నిడి యుండి యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకు [1]ఫల్గునుండు ప్రీతచిత్తుం డై యుండె నంత భీముండు భల్లదశకంబున నక్కుమారదశకంబుశిరంబులు దునుమాడె [2]నట్టిభీమునియాటోపంబున కోటఁజె నీసైన్యంబు సమరవిముఖం బయ్యె నాసూతనందనుండు భీతుం డై వదనంబు వెలవెలఁ బాఱ నూరకుండె నప్పుడు శల్యుం డతని నాలోకించి యి ట్లనియె. 228

తే. ఉగ్రుఁ డై దుస్ససేనునిరయురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావుమరుత్తనూజుఁ
జూచి చేడ్పడి చె ద్వేదెఁ. జూచితే సు
యోధనుని నీవు న ట్లైన నొప్పు నెట్లు. 229

క. బలియు రగురాజులును గాల్, నిలువక తెరలంగ వీరె నీప్రాపున శ
త్రులఁ దాఁకఁ దలంచి కృపాదులు నిలిచిరి కూర్చికొను మతుల ధైర్యమునన్. 230

చ. కడువెగ డంది యున్ననినుఁ గన్గొని [3]వీఁడె యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెదు నరు. నీవు దాఁక వలదే రణభారము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు దానిఁ దలంపు మిత్తఱిన్. 231

వ. అనిన విని యతండు సమరోన్ముఖుం డయ్యె వృషసేనుండు భీమసేనుపై నురవణింప నకులుం డడ్డపడి యక్కుమారునిసిడంబును గొడుగును గోదండంబును ఖండించిన.

చ. అలిగి యతండు వే ఱొకశరాసన మెత్తి రథమ్ము ఘోటక
మ్ముల నిలఁ గూల నేయఁ బొలివోవనిధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు మాద్రితో లుపట్టి ధరిత్రికి దాఁటి బెట్టుగో
ల్తలఁ జని తత్సహాయభటదారుణకేలి యొనర్చి పేర్చినన్. 233

ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి కృష్ణసర్పంబుఁ బోలిపటుకృపాణ ముఱక
నఱకి నారసములు నాటించె నయ్యగ్రజు, నానుజన్ము మేన నల్ల నగుచు. 234

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండును యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల కైవడి వృషసేనుపయిం గవిసినఁ గృతవర్మకృపద్రోణిదుర్యోధనులును శకునియుఁ దలోదరులు గొందఱును గ్రందం దఱిమి దుర్వారవిశిఖవర్షంబుల వారలం గప్పినం గని గజసాధను లగుకళింగు లురవణించి. 235

క. కృతవర్మ సిక్కువడ భూపతి నేడ్పడ శకుని నెగడుపడఁ దదవరజ
ద్వితయము ధరఁ బడఁ దీవ్రోద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్. 236

1. క. గ. చ. ప్రీతచిత్తుం డగుఫల్గునుండు భల్లదశకంబున. 2. క. గ. చ. నాభీమార్జునుల యాటోపంబున. 3. గ. వెండి అ. ద్యుతి...టంకృతులు సెలఁగంగన్.

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి. 237

క. ఆమువ్వురుఁ జలమున నుద్దామద్విపసహితచిత్రదళనంబున సం
గ్రామతలము రక్తాక్తం, బై మెఱయ బలాధిపత్రయముఁ బోరిగొనినన్. 238

క. తక్కటిరథికజనులు పేరుక్కున సఝ్యుభచయంబు నొదిఁగించియునుం
జిక్కువఱచియుం దునిమియు, నెక్కుడుమద మొప్ప మెఱసి రిభపురనాథా. 239

వ. మెఱసినం జూచి. 240

ఆ. అరద మెక్కి తఱిమి ననిలతనూజుఁ డ,వ్వీరుతోన పాండవేయసేనఁ
జేయఁ గలుగుదొరలు శితశరాసారంబు, లడర వానిమీఁద నడరుటయును.

వ. రణంబు దారుణం బయ్యె నందు. 242

సీ. కర్ణునియగ్రభాగంబునఁ గరిఘటల్, దునుమాడునకులనందనునిఁ గిట్టి
వృషసేనుఁ డమ్ములవెల్లి పైఁ బరఁగించి, శితభల్లమున సూతుశిరము ద్రుంపఁ
గనుఁగొని యక్కర్ణతనయునిమీఁదఁ బా,ర్థాదులు గవిసిన నతఁడు పార్థు
ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి, యాశతానీకుని నట్ల చేసి

తే. నకులుతనువున బాణసప్తకము సొనిపి, శార్ఙ్గధరుమేనఁ బంద్రెండుసాయకములు
వఱపి పేర్చినఁ గౌరవప్రతతి మెచ్చి, పార్థువేఁడిమి యూహించి భయముఁ బొందె.

చ. కెలఁకులయోధులం గడచి క్రీడి వడిన్ వృషసేనుమీఁద న
మ్ములు నిగిడింప నారథికముఖ్యునిమూఁపున నక్కుమారుఁ డే
పలరఁగ వాఁడితూపులు రయంబుమెఱుం బది బెట్టు గ్రుచ్చి య
గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి ముట్ట నార్చుచున్. 244

వ. ఇట్లు విజృంభించిన. 245

### అర్జునుఁడు వృషసేనుని మృతిఁ బొందించుట.

మ. భ్రుకుటిస్ఫూర్జితఫాలభాగుఁ డగుచుం బొంగారి యాసూతపౌ
త్రకుకోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్లవిలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళాదుర్దముఁ డన్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్. 246

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి కర్ణుండు శోకవ్యాకులచిత్తుం
డై కన్నీ రొలుకం గోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని తేఱికి
సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి యర్జున యర్జున యని యాహ్వానంబు
సేసిన నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె నట్టియెడ దురం
బు దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొను చుండ నయ్యిరు
వురు రామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు
నాకారంబుల నుల్లసిల్లిరి వారలయెక్కటికయ్యం బాలోకించుకుతూహలంబున
సురపితృవిద్యాధరసంయమిసంఘంబులును శచీపతిప్రజాపతిపశుపతులును లోను

గా ననేకదివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి రప్పుడు బ్రహ్మ రుద్రున
కి ట్లనియె. 247

కర్ణార్జునులద్వంద్వయుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రులప్రశ్నోత్తరములు.

క. ఇరువురు నతిరథులు సమ, స్ఫురణులు విక్రాంతిపరులు శౌరులు వీ రొం
డొరువులతోఁ బెనఁగఁగ న,శ్వర మగు జగ ముడుప రాదె సమరం బనఘా. 248

క. అని విని యాదేవుం డ,వ్వనజభవున కిట్టు లను నరవార్యోఘతు లీ
ఘనభుజులు వీరిరణ మె,ట్లును జెల్లుం దప్ప దప్పరలుకు విడు మింకన్. 249

వ. అని యి ట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ నాకర్ణించి పాకశాసనుండు సప్ర
ణయంబు గా బ్రహ్మ కి ట్లనియె. 250

చ. తపము నుదాత్తశౌర్యము నరిద గ్రబలంబును గల్గు క్రీడిక
య్యపువెర వెక్కుడై గెలుచునట్లు గ నీవు దలంప వే పురా
ణపురుషు లైనకృష్ణులు రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కులైన నిలరుర్ల బ్రదు కెమ్మెయిఁ గల్గ నేర్చునే. 251

వ. నరనారాయణులకు నెందును జయంబు ధ్రువం బని తొల్లియుం జెప్పితి రిమ్మహా
త్ములు జయించుట లోకహితంబు గర్ణుండు ద్రోణభీష్మప్రాప్తం బైనపుణ్యలోకంబు
వడయుఁ గిరీటి, చిరకాలం బిదుమలం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు
లనుభవించుం గాక యనిన నప్పరమేష్ఠి వీరలజయాపజయంబులు నిశ్చయించి
పలుక నేల యనుటయు నీశానుం డతని నాలోకించి నిశ్చయించుట మేల కాక
మె గ్గేమి నిశ్చయింత మని కలిసికొని యతండునుం దానును వాసవువలను విలో
కించి కృష్ణార్జునుల నుద్దేశించి. 252

తే. మహితమును లగువీ రెండు మాఱు లేక, మెలఁగువా రయి కాదె జనించినారు
వినుము నీచెప్పినట్టుల వీరి నొరులు, ధిక్కరించుట లోకహితంబు గాదు. 253

వ. వీరికి జయంబు ధ్రువం బని పలికి యంత నిలువక వీరిజయంబు ధ్రువం బయ్యెడు
మనవుడు నయ్యమరవిభుండు సురమునిప్రభృతులం గలయం గనుంగొని దేవ
దేవు లిరువురు నేకమతంబు గా నిశ్చయించిన లోకహితం బగునానతి యాక
ర్ణించితి రే మిమ్మ చిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గా వలయు ననిన నందఱు
నది యట్టిద కాక యొం డగునే యని రనిమిషులును గుసుమవర్షంబులు గురియిం
చుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలంగించి రయ్యవసరంబున నఖిలభూతంబు
లును విస్మయోత్ఫుల్లనయనంబు లగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించు
వేడుక నొందుతలరపులు దక్కి యుండె నట్లు దార్కొనినమహాసీయరథంబులు
రెంటియందును నస్నాహసముజ్జ్వలు లై యొప్పువాసు దేవార్జునులును గర్ణశల్యు
లును దమతమశంఖంబు లొత్తి రప్పుడు. 254

తే. రెండుసేనలశంఖభేరీముఖంబు, లైనబహుతూర్యములపటుధ్వాన మడరి

నింగి [1]వాంగారె సత్యాంతకనిశ్చలంబు, లయ్యె సైనికనికరంబు లద్భుతముగ.

సీ. కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహా, బలు లిద్దఱును దపోబలమువలనఁ
గన్నవి యై బుద్ధిఁ గల్గి శోభిల్లును, ర్వాళి యప్పుడు కపి యెఱఁగి హస్తి
కక్ష్యపై నడరినఁ గయ్య మారెంటికిఁ, గలిగె నం దాహస్తికక్ష్య దరలె
నంబుజాక్షుండు మద్రాధినాథుండును, దృక్కలహంబునఁ దేజరిల్లి

తే. రర్జునుండును గర్ణుండుఁ దర్జనంబు, లైనచూడ్కు లొండొరువుల యాననములఁ
బఱపి రాకృష్ణపార్థులబలువు శల్య, కర్ణచిత్తదౌర్బల్యముల్ గానవచ్చె. 256

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి. 257

తే. అర్జునుఁడు నన్ను నోర్చినయట్టు లైన, నెట్లు సెప్పుమ యనుడు మద్రేశుఁ డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర, బహుళశరజాలములపాలు పఱుతు ననియె.

ఆ. అల్ల సవ్యసాచి యడిగిన మురవైరి, నగుచు నినుఁడు గూలినను ధరిత్రి
పఱియ లైన మేరు వొఱిగినఁ గర్ణుచే, నీవు గోలుపోవు వేల కలుగు. 259

వ. అని వెండియు. 260

ఉ. [2]అట్టిద లోకపర్యవస మాదురవస్థకు స్రుక్క నేర్తునే
కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం
బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ ధర్మజుం
గట్టుదుఁ బట్ట మన్న నగి గాండివి యద్దనుజారి కిట్లనున్. 261

ఉ. నవ్వుల కంటెఁ గాక యని నాకు నశక్యమె కర్ణశల్యులం
గ్రొవ్వడఁగించు టే ద్రుపదుకూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్
నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁ గాని యింక నా
మువ్వురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్. 262

మ. అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులుఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి ని
ష్ఠురభల్లం బొకటన్ సుయోధనునిచూడ్కుల్ నీఱుగా నిద్ధ యు
ద్ధురగర్వోన్నత మైనకర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్. 263

ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు చెన్ను మిగిలి
నగుచు నేఁడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతుని చెవులఁ దనుపు సినుపు. 264

క. సంతసపువార్త పుచ్చుము, కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట, యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత యెలమిన్.

వ. అని పలికె నాసమయంబున నుభయసైన్యంబులజనంబులకు సంబరంబున నున్న
దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లునప్సరోగణంబులుం గాన
నైన నద్భుతంబున వారు ననిమిషులై యుండి రప్పు డేకనిశ్చయు లగుకర్ణం

1. క. బొంగారె. 2. 'ఇట్టిద లోకపర్యవస మే దురవస్థకు' నని యుండు నని తోఁచెడిని.

డును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక దురంబుమీఁది భరంబునం బాలించి రిరువాఁగు సైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబు గాఁ దల మిగులఁ దగ దనుబుద్ధిన భయంబునను దద్రథంబులు రెంటిని బలిసి నిలిచి రమ్మహావీరులు ధను ర్ద్యుతులను బాణప్రభలను దీవ్ర తేజంబులను బ్రదీప్తులై కల్పాంతసూర్యులచందం బగుచు నొండొరుల నోర్చుకడంకలఁ బేర్చి రయ్యవసరంబున నశ్వత్థామ కురు పతిఁ జేరం జని కరంబు సేతం దెమల్చి సాంత్వన[1]స్వరంబున నిట్లనియె. 266

## ఆశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట.

ఉ. కలన గురుండు భీష్ముఁడును । గాండివిచేఁ బడి రంగరాజు వా
రల కధికుండె యాతని దురంబున నోర్వఁ గలండె పూని యే
వల దని బుద్ధి సెప్పిన న। వశ్యము నాతఁడు నిల్చు నీతనిన్
నిలుపుము నీవు ధర్మసుతు। నిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్. 267

వ. తెలిపిన దామోదరుండును దెలివి నొందు. 268

క. భీముఁడుఁ గవలును ధర్మజు,చే మరలెదువార లేను । జెప్పెడిపలుకుల్
భూమీశ కురుకులమునకు, నీమొనరాజులకుఁ బ్రజకు । హిత మ్మూహింపన్. 269

ఉ. వలవదు నన్నునుం గృపు న। వధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప భీష్ముఁడును । ద్రోణుఁడు నొక్క మెఱుంగఁగా నవ
ధ్యుల హరికల్మి నారథికు। దోర్బలలీల నడంగి [2]పోరె య
చ్చలమొ ఫలంబొ [3]యింక నయిన । సంధి యొనర్చుట మేలు వారితోన్. 270

ఉ. హరి సనుదెంచినపు మన । మమ్మెయిఁ బల్కితి మింక సంధికి
న్వార వగు వేళ గల్గు నని । నీవు దలంపకు మాంబికేయు భూ
వరుఁడుగఁ జేయు ధర్మజుఁ డ। వశ్యముఁ బాండునృపాలుపాల యే
వురకు నమర్చుఁ గాని చన। వుర్వి వెలిమెచ్చును నొల్లఁ డేమియున్. 271

తే. పాండవులయట్ల రాధాసు।తుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు । బ్రదుకు తెరువు
వట్టు బ్రదికిన నెల్ల శు। భములుఁ గలుగు
నీసు మానుము చచ్చిన । నేమి గలదు. 272

క. వెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడు మిది లెస్స దీని । నొడఁబడమి గడుం
జెడు తెరు విప్పటిపదనున్, గడవఁబడుట ద్రాటఁ దప్పు। కరణియ చుమ్మీ. 273

చ. అన విని యమ్మహీరమణుఁ । డాతని కిట్లను నిష్ఠు దుస్సనే
నునిపని దీర్చి మారుతత। నూభవుఁ డాడినమాట యేర్పడ
న్ననియును సంధి సేయుటకు । నీ వభిలాషము సేఁత యొప్పునే

1. క. పూర్వంబున. 2. క. పోఁదరె చలమొ. 3. ఖ. యింతటను. 4. జ. వదనం, గడవఁబడుట

పెనఁకువ కర్ణుఁ డే లుడుగు * బేలవె మానుము ద్రోణనందనా. 274

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరి* శ్రాంతుండు గర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీ* తం డాతనిన్ వహ్ని య
త్యంతంబున్ శిశిరత్వ మొందినను గో* త్రాళుల్ వడం కాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం * గోల్పాటు వాటిల్లునే. 275

వ. అని పలికి యజ్ఞనపతి తనసైనికుల నాలోకించి సమరసముత్సాహపోషణంబు లగుభాషణంబుల ముఖసుం డగుటయు నఖిలతూర్యంబు లొండొండ మ్రోసెఁ బాండవబలంబునను భేరీపణవాద్యులరణనంబులు నిగిడె నప్పుడు కర్ణుండును నర్జునుండును. 276

క. కరి కరి గిరి గిరి నంభో,ధర మంభోధరముఁ బెలుచఁ * దాఁకినక్రియఁ దాఁ
కిరి కడఁగి గగనతటియును, ధరణియు మ్రోయుచు వడంక * ధరణీనాథా. 277

క. మెఱయు వెలిపూవులును గడు, మెఱుఁగారెడునరదములును * మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ,పఱ నత్తొలుతాఁకు వెఱఁగు*పడఁ జేసె నృపా. 278

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం గలపడి పెనంగం దొడంగిన నుభయసేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి రట్టియెడ. 279

మ. భరితోత్సాహతఁ బేర్చి దీప్తు లడరన్ * భల్లమ్ము లొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రములలోఁ * బార్థుండ వే త్రుంపు మి
క్కురుభూపాలకురాజ్యకాంక్ష [1]దొరయ * కోదండపాండిత్యవి
స్ఫురణం గర్ణుఁడు నీకు నీబలుపు నే* ర్పుం జూపు మత్యుగ్రతన్. 280

వ. అని పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు నేసిరి కౌరవులును గర్ణు డగ్గఱి.

చ. కడఁగుము నీదుబాణములఁ * గవ్వడి కూలినఁ జాలు సంతతోఁ
జెడుదురు పాండవుల్ రణము * సేయు మదగ్రత యెల్లఁ దక్కి పే
రడవుల కేఁగి సాధుమును * లై చరియింతురు కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బాగడు * పొంపిరివోవఁగ నేలు లీలతోన్. 282

వ. అని తఱిమిరి ప్రొద్దునుం జాల ప్రాలెఁ గాలాంతకప్రతిము లగునప్పార్థకర్ణు లన్యోన్యజయార్థు లై పెనంగునప్పుడు. 283

కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁ బూనుట.

సీ. కర్ణుండు పదిచండ* కాండంబు లర్జును,తనువునఁ జొనుప న* ర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదు* నెనిమిది కర్ణుమైఁ, బరఁగింప నయ్యంగ* పతి దశోగ్ర
చక్రమార్గణముల * సరభసంబున నొంచె, నన్నరు నాతండు * నట్టె వన్ని
శరములు రాధేయు* నురమున నాటించె, నతఁడు దొమ్మిదివాలు* శరమ్ము లతని

తే. వక్షమున గ్రుచ్చి సాయక* జ్వాలము శౌరి, మేన నిగిడించ బీభత్సుఁ * డేను మెఱుఁగుఁ

1. జ. దొరయం. 2. గ. నురము నాడించిన.

దూపు లాసూతపుత్త్రు నెత్తుట మునుంగ, నేసె బాహాసముల్లాస మెసక మెసఁగ.

చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువం బరాక్రమకుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వాలసి ముఖాంబుజంబునకు నొప్పఁగఁ దద్రథరథ్యకేతుసూ
తులన్ దదీయగాత్రమును దూపులవెల్లి మునుఁగఁ జేసినన్. 235

క. అతఁడును దురగసారథి, కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడియపోలెన్
శాతశరవృష్టి నన్నరు, నీ తెఱఁగున మఱియుఁ బెనఁగి [1]రిద్దఱుఁ గడఁకన్. 286

శా. ఆయుగ్రాహవకేలి నిట్లు నిపుణుండై యొప్పనప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరిఁ బోసి దారుణమహాగ్నిజ్వాలికల్ భీషణ
స్ఫాయద్భంగి నభస్స్థలిన్ నిగుడ దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగోద్దహనాభిలాష మెడఁదన్ దీపింప బెట్టేసినన్. 287

ఉ. అంతకకోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు మి
న్నంతయుఁ దానయై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా
వంతయు శంక లేక సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు గర్ణుఁడు మాకు నుబ్బఁగన్. 288

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన భూన,భోంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు, నాతమంబు విరిసె నాక్షణంబ.

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచితభక్తి [2]ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు మహోగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలి యై యది కర్ణుఁ గిట్టినన్. 290

క. అతఁ డభిమంత్రితబాణ,ప్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థుని మేనన్
శితశరములు నినిచిన మా,రుతపుత్త్రుఁడు గనలి యన్నరునకి ట్లనియెన్. 291

ఉ. సూతసుతుండు నీయెదుర స్రుక్కక నిల్చుట కాక నీశర
వ్రాతము నిల్వరించి యసివారణ నొంపఁ దొడంగె ఖాండవం
బే తెలి వొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా
నా తెలి వాత్మ నూల్కొలిపి యగ్గలికం బెగటార్పు మీతనిన్. 292

చ. తెగి మన కగ్గమై యరుగుదెంచినవాఁ డితఁ [3]డల్క యింక నేఁ
డుగడకుఁ బోవకుండఁగఁ గడున్ వెస డగ్గఱి యేఁగపాలముం
బగులుతునో గదానిహతిఁ బార్థ భవత్ప్రకటప్రతిజ్ఞకై
తగ దని మాన్చె దేని నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్. 293

వ. అని పలికె నప్పుడు. 294

1. గ. రిద్దఱును దగన్. 2. క. దలంచి. 3. చ. డన్క.

సీ. పుండరీకాక్షుండు గాండీవితో నీదు, దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలిపోవుటయు బలీయదూపుల నాతండు, నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు
నుత్సాహ మెడలి నీ యునికియుఁ గని కురు,సంతతి యార్వఁ బాంచాలకోటి
సిలుసని పోవంగ నెఱుఁగవో మెఱుఁగియుఁ,దగఁ జేయునది లేక వెగడుపడితొ
తే. చక్ర మిచ్చెద నితనిమస్తకము దునుము, మనిన నగుచుఁ గిరీటి బ్రహ్మాస్త్రమధిక
నిష్ఠ మై నేయ నది బహునిష్ఠురప్ర,దీప్తశరమూర్తిఁ గర్ణునిదెసకు నడరె. 295

క. ఆరథికుఁడు దలఁకక నియ,మారూఢప్రౌఢభావుఁ డగుచుఁ దదస్త్రో
దారతరబలమునన త,ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా. 296

తే. ఉడిపి లోడన కవ్వడియొడలఁ గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకములుఁ
జించెఁ దొమ్మిదితొమ్మిది శితశరముల. 297

ఆ. మొనసి క్రీడి మఱియు మూఁడు నెనిమిదియు, రెండునాల్గు పదియుఁ జండమార్గ
ణములు గ్రుచ్చె సూతనందనుమైఁ నతఁ, డుఱక యతనిమార్వి యయూడ నేసె.

వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బొలివోవక పార్థుం డాగుణంబు సమా
హితంబు సేసి పెల్లేసినరయంబున రాధేయుం డతనిశింజిని శిథిలంబు గాద కాక
యని తలంచె నాధనంజయుం డతనివింటినారి వికలంబుఁ గాఁ జేసి. 299

క. చిలుపగవుతోడ మైమఱు, వలువ్ఫుల్గఁ జేసి యతనియంగము దోఁగం
బఱపెరుధిరంబు బెడిదపు, మెఱుఁగు వెడఁదయంపగమి నరమిత్రులు దలఁకన్. 300

చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి మం
దరధను నస్త్రపంచకనితాంతహతిం గడు నొంచె నాశరో
త్కరము వరప్రభావకలితం బగుటన్ మగుడంగ వచ్చె ని
ష్ఠురరభసం బెలర్ప మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. 301

క. అలఘుపటుభల్లపంచక,ముల రెంటం గ్రీడి చిత్రముగ నయ్యస్త్ర
మ్ములుమూఁడుమూఁడుశకల,మ్ములుగాఁ దునుమాడె జనులు పొగడ నరేంద్రా.

క. కర్ణునిమెయి నాలోనన, కర్ణాంతాకృష్టచండకాండము లధికో
దీర్ణక్రోధంబున న,భ్యర్ణగతుం డగుచు గ్రుచ్చె నతఁడే పలరన్. 303

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్మునమ్ముల వినిశ్చలధైర్యము పేర్మి నాతఁ డు
క్కఱక పెనంగె దానఁ గన లగ్గల మై వెస నమ్మహాభుజుం
డఱిముఱిఁ జీకటుల్ గవియునట్లుగ రోదసి నింపెఁ దూపులన్. 304

తే. వెగడుపడి చక్రరక్షకుల్ వెనుకదిక్కు,గాచురథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము
విడువఁ జాలక లజ్జ వోవిడిచి రపుడు, గర్ణువారలు వాఱుట గని విభుండు. 305

క. ఆదిక్కువాఁడు భీముం, డాదిగ నని సేయ కుండఁ గన్నియతియెడం
దా దైన్య మొంది తప్పం, గా దని యూహింప నీ కొకలఁక కతమునన్. 306

దుర్యోధనుఁడు తనయోధుల నర్జునుం దలపడఁ బురికొలుపుట.

వ. ఇరుగెలంకులమూఁకలం గలయం గనుంగొని యెలుం గెత్తి. 307

క. తొడరుఁడు పొదువుం డేయుఁడు, పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పోనీక వెసం
బడ వైవుం డొక్కుమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా. 308

క. విను మతఁ డిమ్మెయిఁ బురికొలి, పిన రథకరితురగసుభటబృందములు రయం
బున నురవణించె నయ్య,ర్జునుపైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్. 309

వ. ఎదిరిసైన్యంబు సమరంబు దొడంగి యుండుట యెఱింగి కడంగుట పాడి గా దని
దొరలు దురంబునకుం జొర కుండిరి గాండీవి కోదండగుణరణనభరితభూనభోంత
రుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబుల వేఁడిమి సూపిన నే పఱి వెఱచి య
మ్మూఁకలు పఱచిన నక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 310

క. బీరమును లావుఁ గల్గిన, మీ రందఱుఁ గర్ణు నొకనిమీఁదన యిమ్మెయిఁ
బో రెల్లఁ ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోపజీవులతెఱఁగే. 311

వ. అనిన విని యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నుర
వడించిన. 312

మ. భరితక్రోధమహోగ్రవృత్తి సిడముల్ భంజించుచుం సూతుల
న్ధరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు న్రథ్యంబులం జంపుచుం
నరుఁ డాభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱు దివ్యసంఘము నుతించెం జూచి యవ్వీరునిన్. 313

చ. కురుపతి వెండియుం దఱిమి గోత్రులు సేయఁ గ్రమ్మఱంగ నె
వ్వరు నతిభీతి నిల్వ మనవా రెడ గాఁ జని చూచు చుండి ర
ప్పురుసున నాసమిద్ధరణిభాగము శూన్యతఁ బొందఁ గన్గొఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యె భూవరా. 314

చ. శ్రమమున సోలు చుండియుఁ బరాక్రమసంపదసొంపు మీఱ దు
ర్దమవివిధాస్త్రజాలతిమిరంబుల నొండొరుఁ గప్పి కప్పి శౌ
ర్యములును బాహువీర్యములు రాజుల నచ్చెరు వందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్. 315

వ. అట్టియెడఁ దక్షకునపత్యం బై తత్సోదరుం డగునైరావతుండు పెనిచి యుప
లాలింప నుల్లసిల్లినయశ్వసేనాభిధానుం డగునాగకుమారుండు సర్పముఖశరా
కారంబు గైకొని తనయొద్ద నుండఁ దానుఁ బసిండి[illegible]ఱం బెట్టి యనుదినంబును
గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు
వాఁ డై యున్నయట్టియమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి

క్రొని తల దెగ వ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణజ్వాలాజాలంబు లంబరంబునం
బర్వఁ జూపఱ హాహాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగవాపినం
గని [1]యారథికుచూపు కంఠంబుచక్కటికింగాక తప్పి యపాంగప్రదేశంబుకొలంది
యగుటం జేసి యది నెపంబుగా శల్యుం డతనికిం జిత్తవైకల్యం బాపాదింపందలంచి
యీసంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు నిపుణంబుగా నిరూపించి
యొండుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గడలుకొన
నమ్మద్రపతిం జుఱచుఱం జూచి. 316

క. నను బోటిజోదునుం గా, దని పలుకఁగ నేర్పు నీకు నెంత గలదె య
ట్లును గాక వినుము కర్ణుం, డినుమాఱొకశరము దొడుగునె నేపరుల నగన్. 317

వ. అని పలికి కలుషం బగుచిత్తంబుతో నెలుం గెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తంచు నేసిన. 318

క. పలుదెస మంటలు ప్రబ్బఁగ, నలఘుస్ఫురణమున నిగుడునయ్యస్త్రంబుల్
జలజాక్షుఁడు గని పంచాం,గుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్.

క. సురగరుడఖచరవిద్యా,ధరఖేచరు లంబరంబునుదాత్తధ్వనిసం
భరితముగఁ బొగడి రమ్ముర,హరు దివ్యప్రసవవిరచితార్చనతోడన్. 320

సర్పముఖశరంబున నర్జునకిరీటంబు భూమిపైఁ బడుట.

మ. కురువంశోత్తమ వారిదిక్కుప్రజ సంక్షోభింప నప్పాఁపతూ
పు రయం బుగ్రము గాఁగ బిట్టడరి దంభోళిప్రభగ్నక్షమా
ధరశృంగాకృతి గా హరించె బహురత్నస్ఫీతరశ్మిచ్ఛటా
స్ఫురితం బైనకిరీటముల్ విజయునొప్పుం దేజముం గుందఁగన్. 321

తే. జనులు విహ్వలు లగునట్టిఘనరవంబు, దిశలయందు నాకసమున నదీటుకొనఁగఁ
గర్ణుఁ డట్లు భేదించె దితిసుతులచేత, నైనఁ జెడనికిరీట మయ్యహిశరమున. 322

క. సురపతి జపంబు సేసినఁ, బరమేష్ఠి ప్రియంబుఁ బొంది బహుమానపుర
స్సరముగ నిచ్చినయది య, క్కిరీట మరిభీషణత్వకీర్తిదము నృపా. 323

ఆ. వనధివాసు లగునివాతకవచు లను,దనుజు లాపురందరునకు నజయ్యు
లైన నతఁడు వనుప నర్జునుఁ డోర్చిన, మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప. 324

చ. వినుము నరేంద్ర చూడ విన విస్మయ మిట్టిది [2]పాఁపరమ్మువా
త నెగయుఘోరరూపభయద[3]దంష్ట్రధమానవిషాగ్నిజిహ్విక
ల్దనికినఁ బెల్లు మండుచు నిలాస్థలి డొల్లె నినుండు పశ్చిమాం
బునిధి నితాంతదృశ్యరుచి పొల్పెసఁగం బదంభంగి దోఁపఁగన్. 325

వ. అప్పుడు. 326

ఉ. శృంగము లేనినీలగిరిచెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ

1. క. యాపాఁపపూపశరంబు. 2. గ. పాముఱమ్ము. జ. పాముటమ్ము. 3. జ. దంష్ట్రధమాన.

యుగ్మం గనుపట్టె వెల్లతలఁ బొల్చియు మౌళి దృఢంబుగా నమ
ర్చెం గురునాథ పూర్ణశశిఁ జెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్నయంతము ప్రతీతము గాఁగ నటించుచాడ్పునన్. 327

వ. అట్లు రాధేయకరప్రముక్తం బై కిరీటంబు నిర్దహించి నేలం గలపినయమ్మహో
రగంబు గ్రమ్మఱం గవిసినం గని కపులాంఛనుండు గవ్వడితో మనమీఁద మగుడ
నిమ్మహాసర్పంబు సనుదెంచుచున్నయది యనిన నతం డిది యెక్కడిపా మిట్లు వచ్చు
టకుఁ గతం బేమి యని యడిగిన దీని నెఱుంగవే ఖాండవం బేర్చునప్పుడు దన
తల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోనం బోవ నీక నీ వేసిన నన్నాగాంగన
మృతిం బొందె నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మై యున్నయశ్వసేనాభిధాన
భుజంగంబు. 328

తే. ఆతఁ డేయఁ గిరీటంబు నపహరించి
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు నన్న నాజిఁ
యాఱుపటుభల్లములఁ దునుమాడె నతఁడు. 329

వ. అత్తెఱంగున. 330

సీ. ఉరగంబుఁ దునిమి వేవురలి క్రొవ్వునిమీఁద, బదియుఁ బండ్రెండు నేఁబటుశరములు
నిగిడించి యుజ్జ్వలం బగుదోర్దండసారసం, బేసిన నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుచ్చి చనిన దం, డాహతం బైనమహాహివోలె
నాసూతనందనుఁ డత్యుగ్రుం డయ్యు, నంతకుమును [1]పాఁపరమ్ముచేత

తే. నర్జునుఁడు సావమికి వెఱఁగంది యాతఁ, డటులు గెరలి పండ్రెండువాలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి, కొఱఁత గా నూఱుశరములనుఱక నొంచె.

క. వెండియు బలువిడి నయ్యా, ఖండలసుతుఁ డురము క్రూరకాండంబుల నొం
ప్పొండ కదు నొవ్వ నేసి య, తం డుబ్బున నార్చె గగనతల మద్రువఁగన్. 332

ఆ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పొలుపఱ నఱకి యు, ల్లసితమకుటకుండలములు దులిచె. 333

వ. దులిచిన నబ్బలుమగండు. 334

క. శిరమునఁ గర్ణంబుల నెత్తు రొలుక బరిమేనితోడఁ దూలక బాహు
స్ఫురణంబు మెఱయ సాయక పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్. 335

తే. వానిఁ దునుమాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుష్కంబుఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱవ గైరికధారకప్రకరశోభి

1. గ. పాఁపరమ్ము; చ. పాఁగుటమ్ము.

తాచలము వోలి పొలిచె నయ్యంగరాజు. 336

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియుఁ నర్జునుఁ డుజ్జ్వలవత్సదంతకాం
డమ్ములు పెక్కు సత్వరదృఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనముఁ నాతని తేరును గూడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరముఁ గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్. 337

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నప్పుడు. 338

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయఁ భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండలకాంతిపూరము
న్మొత్తపుదీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్. 339

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బోలివోనిబంటుతనంబున జంటమెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబులు రేణువులు గాఁ జేయుచుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె నయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున. 340

బ్రాహ్మణశాపంబునఁ గర్ణరథచక్రంబు భూమిం గ్రుంగుట.

క. భూసురశాపంబున నిదె, యీసూతజురథముచక్ర మిలఁ గ్రుంగెడు వీ
తాసుఁ డగు నీతఁ డని సే, నాసముదయయుగ్మకము విరసం బలికెఁ నృపా. 341

వ. పరశురామదత్తం బయినభార్గవాస్త్రం బనుపేరిటిమహనీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింప కుండె డాపటికల్లు [1]గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె నట్లు జామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱుచుటయును సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం బగుటయును దనమనంబున నొవ్వడరి యక్కర్ణుండు శరంబులు విదుర్చుచు. 342

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన, చిత్తు లగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకు గావించెఁ నతులధర్మ, శీలుఁ డగునాకు ధర్మువుఁ సెలవు లేద.

క. అని ధర్మంబును దూఱఁగఁ, దను నర్జునుబాణవితతి [2]దద్దయునడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదం, బున వెండియుఁ బెద్ద దూఱు భూసురముఖ్యా. 344

క. కన లధిక మైన లావె, క్కి నయయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశితశరములు మఱియుం, జొనిపెను దనధైర్యమహిమ సుర [3]లగ్గింపన్. 345

వ. అలిగి యర్జునుం డాశీవిషంబులుంబోనివిశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చన నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 346

1. క. డిందిన; చ. డించిన. 2. క. దాఁకిన నొవ్వారినఁ గర్ణుండు. 3. క. "లు నుతింపన్.

క. అమితబలం బగు బ్రహ్మా,స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ జి
త్తమున విషాదము దనుకఁగఁ, గమలాక్షుఁడు గారవమున ♦ గాండివిఁ దోడన్. 347

వ. నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచేత విధ్వస్తం బయ్యె నిట్లు గా నేల యన
వుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహానీయసాధనంబు బాధితంబు సేసి
రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటిమగండు గాండీవంబు
మౌర్వి గోఁటఁ బాసి పోనేసిన నాసవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగి
డించుసరయంబున నాసూతపుత్రుచూడ్కి కవ్వార్వి యాడుట దోఁప కుండె
నవ్వీరుండు విష్వచ్చువిశిఖంబులు వారించి యతని నొంచిన వెండియుఁ బుండరీ
కాక్షుండు సహస్రాక్షునందను నుద్దేశించి. 348

క. నిను నొంచువాఁడె కర్ణుం, డనితరసులభప్రకార ♦ మగుభుజవీర్యం
బున [1]నసమానోజ్జ్వలఖే,లసమునఁ దెగటార్పు ♦ శరవిలాస[2]నిరూఢా. 349

వ. అనునప్పుడు విషవిస్ఫురద్భుజంగభంగికంబైన బాణంబు రౌద్రమంత్రసహితంబు
సేసి కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నప్పళించి సంధింప మున్ను గొండొక క్రుం
గినచక్రంబు [3]కుండ మునుంగం దిగఁబడిన నొడ్డగెడవై యరదం బేటునకుననువీక
తక్కిన నుక్కటి యక్కర్ణుండు ప్రతీకారంబు లగురోషవిషాదంబులఁ గన్నీరొలుక
రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు నిట్లనియె. 350

సీ. అరదంబుచక్రంబు ♦ ధరఁ జాలఁ గ్రుంగిన, నెత్తెద నంతకు ♦ నేయ కుండు
మేను భూమిస్థుఁడ ♦ నీవు రథస్థుండ, వియ్యెడఁ దగ వగు ♦ నేయ కునికి
విఱిదలవానిని ♦ విరథుని నాయుధం, బిడినవానిని జూపు ♦ లేయ రెండు
మహిని శూరుఁడ వను♦మాత్ర గా దుత్తమ,కులుఁడవు రణధర్మ♦కోవిదుండ

ఆ. విట్టినీవు దగిన♦యట్టిభంగిన యని, సేయ వలయు నిట్లు ♦ సెప్ప నెల్లఁ
జూడఁ దేర్పడంగఁ ♦ బలుకుట గాని గో,విందునకును నీకు ♦ వెఱచి కాదు. 351

వ. అనిన విని యచ్యుతుం డతని కిట్లనియె. 352

క. ఏమీ తగవును ధర్మము, నీమనమున నేఁడ పుట్టెనే గర్వము ను
ద్దామదురభిమానము నేలా మఱచితి కర్ణ యాచారం బెట వోయెన్. 353

ఆ. పరమధర్మపరులు ♦ పాండుభూవల్లభ,సుతులు వారి నతుల♦శుభము లొందు
ధర్మహీను లైన♦ధార్తరాష్ట్రులకుఁ బా,టిల్లు నివ్విధమున ♦ నెల్లచేటు. 354

వ. దీనికి నీవు కటకటంబడినం బోవునే యని పలికి వెండియు. 355

సీ. గొంతియు నందఱు♦గొడుకులు సుప్తులై, యుండంగ లక్కయిల్ ♦ మండఁ జేసి
కపటంపుజూదంబు ♦ ఘటియించి ధర్మాత్ముఁ, డగుధర్మసుతుసిరి ♦ యపహరించి
యంతఁ బోవక ద్రుపద♦దాత్మజఁ దెచ్చి స,భాస్థలి నమ్మెయి ♦ భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప ♦ నడవికి ఘోషయా,త్రావిధానమున ♦ దాడివెట్టి

1. గ. లసమానో. 2. గ. నిరూఢిన్. 3. చ. కుండు; జ. గుండు.

తే. బాలు నభిమన్యు నొక్కని కె బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ
గానియిప్పాపముల కాదికర్త వీవ
యిన్నియెడలను నీపాడి యెందుఁ బోయె. 356

వ. అని యిట్లు కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగినయర్జునంజయు మనంబురోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతివిస్మయప్రదం బై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్రపరాక్రమంబునం గురియు పటుబాణాసారంబు వారించి యవ్వీరునంగంబున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట-మహాద్భుతం బయ్యె నత్తెఱంగున నీడంబోక పెనంగునతం డతిరయంబున నన్నరునిం బదిదొడ్డనారసంబుల నొప్పించిన నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుంబోలె మండి శత్రుసంత్రాసనంబును మిత్త్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగునతనికేతనంబు గనకపుంఖప్రభాభాసితం బైనభల్లంబునఁ బడనేసినం గౌరవులు నిజయశోబలదర్పప్రియంబుల మొత్తంబులు వడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయునిదెసనిరాశు లై రట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించి[1](న దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు గృష్ణార్జునులమీఁదం గురిసి వెగడుపఱచియరదంబుపిఱిందికొమ్ముక్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి కులపర్వతకాననసముద్రసహితం బాఱంగుళంబు లెగసె నట్లు కర్ణుండు రథంబు నిలిపి మీఁదికిం జని యెప్పటిబాణంబు సంధింప నెండియుఁ జక్రంబు క్రుంగినఁ గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్త నమరె నయ్యవసరంబునఁ గృష్ణుపనుపునం) గ్రీడి దోడన. 357

మ. కులిశప్రస్ఫురణాపహాసనవిభాగుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమై వచ్చుకృతాంతువక్త్ర మన నుగ్రం బై మురారాతిరు
ద్రులచక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు నం
జలికం బైనమహాస్త్రముం దొడివి కర్షం బుబ్బునం జేయుచున్. 358

క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర మనిమెన్. 359

క. అని తెగ నిండఁ దిగిచి వేసిన నయ్యాస్త్రంబు రోదసీకుహరంబుం
దనమెఱుఁగుల నించుచు నిరు, మొనలజనుల గాఢమూర్ఛ నొముంచుచు నిగిడెన్.

అర్జునప్రయుక్తం బగుఘోరశరంబు గర్ణుశిరంబు ద్రుంచుట.

చ. నినదసముద్భటస్ఫురణ నింగి వగుల్పఁగ సర్వఘాతకం

---

1. (......) ఈపాఠము పెక్కుప్రతులఁ గానిపింపదు.

పన మగు చమ్మెయిర్గి నిగిడి । పార్థివసత్తమ యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ । దోఁగుచుఁ గర్ణునియట్ట వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధ।రాధరముం [1]దలఁపింపఁ బట్టు గన్. 361

క. చరమగిరినుండి పడియెడు, తరణికరణి సూతపుత్త్రు।తల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం,దరమును నగు కాయ మట్లు । ధరణిం బడియెన్. 362

తే. అధిప యంతన కను విచ్చి । యఖిలజనులు
గనుఁగొనంగ నయ్యుజ్జ్వల।తనువు విడిచి
చని సముద్దీప్త మైన తే।జంబు వారి
జాప్తబింబంబు సొచ్చె న।త్యద్భుతముగ. 363

వ. అట్టియెడ. 364

క. వినుము మహీసురుశాపము, మనుజేంద్రా సూతపుత్త్రు।మరణాంతం బై
యునికినొ రథచక్రము మే,దినిఁ గ్రుంగుట లేక తొంటి। తెఱఁగున నుండెన్. 365

తే. దారుణాస్త్రజాలాంశుల।వైరిసైన్య,తాప మొనరించి యాసూత।తనయతరణి
పార్థదుస్తరకాలవై।భవము గడవ, నసువు లేమి నవ్విధమున । నస్తమించె. 366

క. సూతతనూజుఁడు పడినం, బ్రీతిం బాంచాలు రార్వఁ । బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ సమ్మో,దాతిశయము వొందెఁ బాండు।వాసీకంబుల్. 367

క. సిడుఁగేల్గ్ బలుతొడలు, న్వెడఁదయురము నై రణావ।నిం గర్ణునొడల్
పడి యున్నఁ గని విషాదం, బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె । నర్కుం డంతన్.

తే. నిర్గతప్రాణు రాధేయు । నిజకరములఁ, గరుణ పెంపున నంటుట । కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ । బోవునట్టు, లపరజలనిధిలోనికి । నరిగె నినుఁడు. 369

వ. అప్పుడు. 370

తే. కామఁ బాసినకమలంబు।కరణిఁ బొలుచు
కర్ణుతల యిలఁ బడియు న।దీర్ణకాంతి
నొప్పునట్టియుఁ జూచి శ।ల్యుండు సిడము
త్రెస్సి మోడ్డై నయరదంబు । ద్రిప్పె నధిప. 371

క. జలితపువెస నాఁబోతుం, బులి గొనినం బసులు వాఱు।పోలికిఁ గోర్కిధో
జ్జ్వలుఁ డగుపార్థుఁడు కర్ణునిఁ, బొలియించిన నీదుసైన్య।ములు వెఱఁ బఱచెన్.

తే. దీనవృత్తి శల్యుండు నీ।సేనజనులు, నట్లు పాంచాలు రుబ్బున । నార్వ సిగ్గు
వడక పాండవమధ్యము।సిడము మరలి, మరలి చూచుచుఁ బాఱిరి । మనుజనాథ.

ఉ. గాండివముక్తబాణమునఁ । గర్ణుఁడు గూలుటయుం దలంకి శ
ల్యుం డరదంబు దోలుటయు । నొక్కమొగిగ్ భవదీయసేన లొం
డొండ [2]కలంగి పాఱుటయు । నుల్లసితుం డయి చూచి వాయుపు

1. గ. జ. దలఁపించునట్లుగన్. 2. క. కలంగఁ బాఱుటయు.

త్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. 374

క. అనినదంబునఁ బాండవ,సైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్
మానవనాథ భవత్సుత,మానసములు శోకఘూర్ణమానము లయ్యెన్. 375

వ. ఇవ్విధంబున నరదంబు దోలికొని యరిగి యమ్మద్రపతి బాష్పాకులలోచనుండును దీనాననుండును సుదీర్ఘతరనిశ్వాసుండును నై యున్నకౌరవేశ్వరుం జేరం జని యతనితో ని ట్లనియె. 376

చ. నరవర యెందుఁ జూడమె రణంబులు గర్ణుఁడు నర్జునుండు సం
గర మొనరింతురే యటులు క్రౌర్యనిరూఢికి దివ్యు లొంది ర
చ్చెరు వది యట్టు లుండె విను చెప్పెద నంతయు భీతిఁ బొంది రా
హరియు నరుండుఁ గర్ణువడి కంత విధాత్రుఁడు దప్పె వానికిన్. 377

వ. అని పెండియు. 378

మ. ధరణీచక్రము నీవ యేలుటకు నుత్సాహంబు వాటించి పో
రిరి ప్రాణంబులు డాపమిం బడిరి వీరిం జూడు మంచుం దురం
గరథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబు లై యుండ నొ
ప్పి రణోర్విం బడి యున్నభూపతులఁ జూపెం జూపి యారాజుతోన్. 379

వ. మఱియు నమ్మద్రపతి యింద్రయమవరుణకుబేరులఁ బోల్పం దగినయింతలింతలు మేటిమగలు మనకార్యంబున కై శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి ధైర్యంబు వాగ డొందం బెనంగుట విఫలం బగుట విధికృతంబు దీనికి వగవం బని లే దని చెప్పి ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్రచామరగజఘంటాతురంగకింకిణులతునియలం గంకణకేయూరహారమకుటంబులతుముల్ల నభిరామభీషణం బగురణాంగణంబు సూపి సీకయి పెనంగి సమసినసైన్యంబు నాలోకింపు మనునప్పు డసురాంతకపార్థులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చునమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంతవికలంబు లయి వినిపాతితరావణనందనుఁ డగుసుమిత్రానందనుసింహనాదంబున భయం బంది పఱచుదానవసేనలచందంబున నీకొడు కున్న నెలవు విడిచి వలియుం బాఱిన వెలవెలం బాఱునక్కురుపతితో నాశల్యుండు సంధ్యాసమయం బయ్యె నేటికిఁ గయ్యంబు సాలింపుము వేగుటయుఁ జేయువలయుకర్తవ్యంబు సూచికొంద మనియె నట్టియెడఁ గృపాశ్వత్థామకృతవర్మశకునిసుశర్మప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబు నొందినయాననంబులతో నిశ్వాసంబులు నిగుడ నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటలతెఱంగు నూహించి నురలి కర్ణుం జేర్కొని విలాపంబుసేయుచు హాకర్ణ హాకర్ణ యనునెలుంగులతో [2](బలంబులఁ

---

1. క. గ. చ. నంత. 2. (...) ఇది కొన్నిటఁ గానరాదు.

దివియ-నియమించినం దివిసి) కౌరవులు దోడం జనుదేర నిజశిబిరంబునకుం బోయె నప్పోవుట జూదంబున నోడి పాండునృపకుమారులు పురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి యై యుండె నయ్యవసరంబున. 380

చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెలు వొంద గౌరవుల్
కనుకనిఁ బాఱ శౌరియును గవ్వడియుం జెలుఁ గొంది రొక్కెడ
న్వినుతమరీచు లై పొడిచి నిర్భరసంతమసంబు నల్గడం
జన నభిరామమూర్తు లగుచందుని సూర్యునిఁ బోల్పఁ బట్టు గన్. 381

వ. ఇట్లొప్పి యమ్మెఱుంగుటమ్ములు నెఱికి వైచి యొండొరులయాననంబు లాలోకించి రాత్రిముఖం బయ్యె విరోధుల వెనుకొనుటకు సమయంబు గా దని సంభాషణంబులు సేసి తమసేనలం దివియ నియమించి. 382

తే. బలునిఁ దెగటార్చి మరలుగోపతియు హరియుఁ
బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. 383

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు నిజనివాసంబులకుం జనిరి పాండవసేనాజనంబులు సంతసంబున దేలుచు ధనంజయుం జెలంగి పొగడుచుం బోయి రివ్విధంబున జయంబునం బొంపిరివోవుచుఁ బాండవులు విడిదల కరిగి ధర్మనందనునగరి మొగసాలఁ జొచ్చి రట్టియెడ. 384

క. చెన్నునఁ బాంచాలురు మును, ము న్నానృపుకడకు నేఁగి ముదితాత్ముం డై
యున్నయతనిఁ గని దీవన,ల న్నతులను సమ్మదానులాపములఁ దగన్. 385

వ. గారవించిరి వివ్వచ్చుండు వేగంబ యరదంబు డిగ్గి చని యజ్జనపతిచరణంబులకుఁ బ్రణతుం డైన నతం డెత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె భీమనకులసహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి పార్థుం గౌఁగిలించిరి కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన నమ్మహీవరుం డభినందించె నప్పుడు కృష్ణుం డతని కి ట్లనియె. 386

శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట.

క. భువనము లన్నియు నొక్కటఁ, గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగా నోపునె భూ
ధవ భవదీయక్రోధా,గ్ని విహతుఁ డై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్. 387

ఆ. రథికవర్యుఁ డైనరాధేయుపొలిసిన,యపుడ [1]మెల్లఁ బొలిసె నని తలంపు
కౌరవుల కడంగె వైరంబు నీ కింక, నెదురు లేదు ప్రీతిఁ బొదలు మధిప. 388

చ. అన విని యమ్మురాంతకున కానృపుఁ డి ట్లను నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము శ్రీధర నీదగుకూర్మి కేను భా

1. క. యడఁగఁ బొలిసె - గ. నెఱయఁ బొలిసె.

జన మటె నాకు దుష్కరమె శత్రుజయంబు భవత్ప్రసాదజీ
వనులము మాకు సంపదలు వచ్చు నవశ్యము నింత నమ్ముదున్. 389

ఆ. అఖిలరక్షకుండ వగు నీకు భక్తుల, మైనమమ్ముఁ గాచు టరుదె తలఁప
భయము నెవ్వగయును బాసి నాకంటికి, నిదుర వచ్చు నేఁడు నీరజాక్ష. 390

వ. అనవుడు నచ్యుతుండు. 391

చ. మనమునఁ గూర్తు గాన తగుమాటల నాకుఁ బ్రియంబు బొనర్చుటొ
ప్పును విను నీజయంబునకు భూవర ఏను నిమిత్తమాత్ర మీ
యనుజులు నీమఱందులు మహాద్భుతవిక్రమశీలు రిట్టిని
న్ను నొకఁడు పోర మార్కొనఁగ నూల్కొని రూపఱకుండ నేర్చునే. 392

వ. అని యిట్లు మధురసల్లాపసౌఖ్యంబు నొంది ధర్మనందనుండు పాలికలను సూచు వేడుక దనకుం బుట్టినఁ గృష్ణునితోడం జెప్పి యతం డనుమతి సేయం గాలవాలంబులు దంతవర్ణంబులు నగురథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి యారోహణంబు సేసి కరదీపికాసహస్రంబులు వెలుంగ సమస్తబంధుమిత్రసోదరపరివృతుం డై యరుగునప్పుడు కృష్ణు నాలోకించి. 393

ఆ. సకలధరణివలయసామ్రాజ్యమునకు నేఁ, డేను భర్త నైతి నెల్లపెంపు
గలిగి నీదుకరుణఁ గడిఁదిమగం డగు, పగతుఁ డశ్రమమునఁ దెగుటఁ జేసి. 394

క. అని కీర్తించుచు నరుఁ గనుఁ, గొని యగ్గించుచు ముదంబు గూరినమదితోఁ
జని కర్ణునిశిరమును దత్తనయులగాత్రములుఁ జూచె ధరణీనాథా. 395

వ. చూచి తన్నప్పుడు బ్రహ్మ జన్మించినవానిఁ గాఁ దలంచి యాపదలకుం బాసి సంపదలకు భాజనంబ నైతి నని యూఱడిల్లి యుల్లాసంబున మరలె నిట్లు కర్ణసాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది రని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 396

చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యీక్రతువు విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్. 397

వ. అనుటయు. 398

చ. ప్రకటమహార్థసారభవపరాశరనందనవాక్యమంజరీ
ప్రకరసమర్చితా పరమపావననామ జగత్త్రయీవిధా
యకపరిరక్షకప్రతిసమాహృతికారకచిత్తవృత్తిభా
వక భవబంధమోచన దివాకరచంద్రకృశానులోచనా. 399

క. వినతదురితనిరసనశుభ, జననకలాకల్యా[1]చరణఁసంభావన పా
వనతటినీమాల్య సమ, స్తనిగమసంవేద్య పరమఁసంయమిహృద్యా. 400

మాలిని. కరణఫలపరిత్యాఁగ వ్రతోదాత్తచేతగ
పరిణత[3]సుఖపీఠఁభ్రాజమానా సతాంహో
నిరసనచర[4]ణాబ్జోఁన్నిద్రతారాజమానా
నిరవధిపరిణాహా ఁ నిర్భరానంద దేహా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునఁ గర్ణపర్వంబునందు సర్వం
బును దృతీయాశ్వాసము. 402

శ్రీమదాంధ్రమహాభారతమునందలి

కర్ణపర్వము సమాప్తము.



1. క. దివ్య[illegible]చరణసుసంభా, వనతటినీ. 2. గ. వ్రతోపాత్తచేతః. 3. క.మఖపీఠ-గ. సుఖదేష్ట-
జ. మయపీఠ-భ్రాజమానాః-ఠ.సుఖపీఠభ్రాజినీమానమానా. 4.క. ణాంభో[illegible]నిష్ప్రభావాంజమానా.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము.

## శల్యపర్వము, ప్రథమాశ్వాసము.



గిరిజాసమవాయమ
హాగురుతరశుభగసంపదాలంబసదా
యోగిజనక్షేమసమీ
హాగర్భితదివ్యచిత్త హరిహరనాథా. 1

క. దేవా జనమేజయధా, త్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య
శ్రీవిలసితుఁడై యిట్లనుఁ, దా వైశంపాయనున కుదాత్తవినీతిన్. 2

క. దురమున నమ్మెయిఁ గర్ణుఁడు, పరిమార్పంబడిన సల్పపరిజనుఁడై య
క్కురుపతి యజయ్యు లగున, య్యరులమెడం బిదప నెట్టు లయ్యె మునీంద్రా. 3

తే. ఏను మును విన్నయకౌరవేంద్రపాండు
విభుతనూజులచరితంబు వేడ్కఁ బెంచెఁ
జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ
వారిదైనయనంతరవర్తనంబు. 4

వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లనియె నట్లు కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరులు పరివేష్టింపఁ గొంచెపుమూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దేర్ప విషాదంబుడిగి సముత్సాహదోహలి యై శల్యునిం దనకు సేనాపతిఁ గావించి వేగుటయు బలుపును బొలుపును వెలయఁ బాలికలనికి నడచెఁ బాండవేయులును [1](బలంబులతోడం) బన్ని మేతెంచిన [2](నయ్యిరువాఁగునకు) సురాసురసమరంబునుం బోనిసంగ్రామం బయ్యె నంత మధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బదంపడి భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కుదక్కి యక్కురువిభుం డనిపని సాలించి వెఱఁ బొందెడు డెందంబుతో నొక్కరుండును దొలంగం బాఱి యొక్కమడువు సొచ్చి దాఁగి యుండె నట గెలుపునుబ్బునం బొంపిరివోవుపాండవేయులతం డం

(1) (2) ఇది వ్రాఁతప్రతుల లేవు.

మునికి మెఱింగి యమ్మేడకు నరిగి నలి రేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడి తోడిపెనంకువం బెద్దయుంబ్రొద్దు పెనంగి భూయూనాథుండును బ్రొద్దు సాల వ్రాలి నప్పుడు [1]భీముగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ కృపకృతవర్మలు దనకుం దోడుగా ధర్మనందనస్కంధావారంబుఁ బొదివి పాంచాలప్రభద్రకమాత్స్యప్రభృతిశేషసైన్యంబుల సమయించె మఱు నాఁడు సంజయుండు కురుక్షేత్రంబునందుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 5

చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రువడ సంభృతశోకత రాజవీథి నె
వ్వరిఁ గని యైన హామహితవైభవ హాధృతరాష్ట్రపుత్త్ర హా
కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. 6

క. జననయనచకోరానం, దనుఁ డగునృపచంద్రుఁ డనుచితం బయినవిధం
బున నస్తమించె నంచుం, [2]దనుడోలనభరితభూరిదైన్యుం డగుచున్. 7

వ. చని ధృతరాష్ట్రమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడం డ్రును విదురుండును మఱియును దగుచుట్టంబులునుం బరివేష్టింపఁ గర్ణులేమికిఁ బ్రేముడించుపలుకులు సెల్ల నుల్లంబు దురపిల్ల నున్నయన్నరనాథుం గని డగ్గుత్తిక వెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి పాదప్రణామం బాచరించి యేడ్పు బెరయు నెలుంగుతో ని ట్లనియె. 8

సీ. జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీ, టడఁగె నులూకుండు మడిసె సకల
సంశప్తకులు గడచనిరి కాంభోజశ, తానీకములు దెగటాఱె యవన
పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్, దిక్కులమన్నీలుఁ దక్కఁగలుగు
నరనాయకులును జచ్చిరి కుమారులు గల, యందఱుఁ దెగిరి కర్ణాత్మజులును
తే. బొలిసి రయ్య వృకోదరుపలుకు దప్ప, కుండఁ దద్గదాదండప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ, గూలి రూపఱె రారాజుధూళి బ్రుంగె.

వ. మఱియు ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గలపాంచాలురును జేరి మాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులు లోనుగా నవశిష్టజనంబులునుసీమనుమలైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును సకలరథసామజ ఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొంది రిట్లు కౌరవశిబిరంబును బాండవ స్కంధావారంబును విధివశంబున [3]వనితావశేషంబులయ్యె నిందుఁ గృపకృతవర్మ లు నశ్వత్థామయుఁగా ముప్పురును నంమఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులుగా నేడ్వురును భవత్సుతుం డఁయినయుయుత్సుంఁడును శేషించి రివ్విధంబునఁ బదునొ

1. క. తాను బడియె-జ. తాను వ్రాలె-నంత. 2. గ. తనలోనన-జ తనుదోహల-భరిత. 3. గ. నిరవ శేషంబు లయ్యె.

కందు నేఁ డక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ గావింపను జంపనుం బూని కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందె నని చెప్పుటయు నమ్మహీపతి మూర్ఛిల్లె విదురుండును వివశుం డై యొఱగెఁ గాంధారియుఁ గోడండ్రును జె య్యేది పుడమిం బడిరి తక్కటిచుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబులచందం బైరి సంజయప్రయత్నంబున నంతఱుం గ్రమంబునం దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్త్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితిఁ దమ్ముండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మగుడ నిగుడుమూర్ఛాతిశయంబునం బరవశుం డయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేద దేర్చినం గూర్చుండి యుక్కఱు విభుండు గుంభనిక్షిప్తభుజంగంబుచందంబున నిశ్వాసంబు నిగుడ్చుచు నూరకున్నం గనుంగొని యక్కాంతాసముదయంబును సంజయుండును రోదనంబు సేసిరి పదంపడి యవ్విచిత్రవీర్యనందనుండు. 10

ఆ. అనఘ వశముగాదు ✽ మనసు గోడండ్ర మీ, వదినెఁ జుట్టములను ✽ సదనములకుఁ
బుచ్చు మనియెఁ [1]బలుకు ✽ లచ్చుపాటడఁచుగ, గ్గదిక దైన్య మెసఁగ ✽ విదురుతోడ.

క. అనుటయు నాతం డంద ఱ, కును మెలపునఁ జెప్ప వగలఁ ✽ గుందుచు నల్ల
ల్లన తమనిలయంబులకును, జనిరి మఱియు నేడ్చు చుండె ✽ సంజయుఁ డలఁతన్.

వ. అమ్మేదినీశ్వరుం డేది గతి యని దుఃఖాతిశయంబునఁ జేతులు విదిర్చి యాసూతనందనుదిక్కు మొగం బై. 13

క. చావరు నొవ్వరు పాండవు, లేవురు నని నీవు చెప్ప ✽ నిప్పలుకులు దుః
ఖావేశకరను లై చే, తోవృత్తి దహింపఁ జొచ్చె ✽ దుర్భరభంగిన్. 14

క. తనయు లని నందఱుం బడి, రనఁగా విని పెక్కుపఱియ ✽ లై పోవక యి
ట్లునికి యరయ వజ్రమయం, బని తలఁపఁగఁదగు మదీయ ✽ మగుహృదయంబున్.

ఉ. కన్నులు చీకు లై సుతని ✽ కాయము బాలవిహారలీలలుం
జె న్నగుప్రాయ మొంది విల ✽ సిల్లు తెఱంగును జూడఁ గాన కి
ట్లున్నను బంధుకోటి సమ ✽ యోచితలాలనఁ బల్కుపల్కులన్
విన్నవి సీను లిప్డు గొఱ ✽ విం దముఁ జూఁడినయట్ల పొక్కెడిన్. 16

వ. అని దుర్యోధను నుద్దేశించి. 17

సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁ ✽ గిటఁ జేర్చు కొడుక మీ, యమ్మనూరార్పరా ✽ వయ్య వృద్ధ
లగుమమ్ము విడుచుట ✽ దగు నె వేగఁటిఁ బోవు, వారము సెప్పుము ✽ కౌరవేంద్ర
యంధత్వవికలుల ✽ నరయక యిట్లుపే, క్షించితి నామీఁదఁ ✽ గృపయుఁ బ్రియము
నెక్కడ వోయె భూ ✽ మీశులు గొలువంగ, నుండు [2]దీవ ట్లొంటి ✽ యున్న వాఁడ

1. ఆ బలుకు♦నచ్చుపా. 2. క. నీ వొంటి యె ♦ ట్లున్న ; జ. నీ వె ట్లొంటి ♦ నున్న.

తే. వధికబలదుర్నివారుండ వైననీకుఁ, బాండుపుత్త్రులచేత నపాటఁ జావు
వచ్చె నిచ్చలు భక్తిమై వచ్చి కొలిచి, గారవింపనిం కెవ్వరు గలరు నాకు. 18

వ. కయ్యంపుమాట పుట్టినయప్పుడు నీవు నాతోడ. 19

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాలపుత్త్రు లెదు రింకెవ్వాఁడు దృప్యద్భుజా
వ్యాపారుం డనిఁ గర్ణుఁ డొక్కరుఁడు మాఱయం జేయు మద్బాణవి
ద్యాపారీణత గెల్తు నొక్కఁడన యేనయ్యేవురన్ వ్రేల్మిడిన్. 20

తే. మున్ను చెప్పినవారు గాకెన్నఁ గలరు, నుమ్ము బాహ్లికభగదత్తసోమదత్త
శకునిభూరిశ్రవశ్శలశల్యసింధు,రాజవిందానువిందాదిరథికవరులు. 21

క. ఏనును గర్ణుఁడుఁ దమ్ములు, నా నలువురు వీరు లైన నటు సూడు పృథా
సూనుల నెట్లు జయించెద,నో నమ్ముము నాబలంబునను గలితనంబున్. 22

క. అని యాఱడిల్లఁ బలికిన, విని భవదీయానివార్యవిక్రమమునఁ బాం
డునరేంద్రసుతులు దెగుదుర, యని తలఁచితి నీవె తెగితె యవ్వీరులచేన్. 23

క. అమరనదీతనయుఁడు సిం,హము గాక నరుండె పార్థుఁ డట్టిమహాత్మున్
సమయించె నట్లు జంబుక,సముని శిఖండిఁ గొని విధి కసాధ్యము గలదే. 24

చ. శరగురుఁ డట్టియోధుఁ డటె చచ్చె: నరిన్ వార గానివానిచే
వెరవున లావునన్ జనులు వెక్కస మందఁగఁ జేయుసింధుభూ
వరుఁ డటె రిత్తపోయె ననివార్యుల బాహ్లికసోమదత్తులం
బరు లవలీలఁ జంపి రటె పల్కెదు నే మని యేను దైవమున్. 25

క. నీనమ్మినభూరిశ్రవుఁ, డేనికలా వతఁడు నెందు నైన లేనిమగం
డైనభగదత్తుఁడును [1]వ, మ్మైన తెఱం గట్టె వేఁమి యండుఁ గుమారా. 26

ఉ. నచ్చినకర్ణవిక్రమమునం బరవీరులయం దొకండునుం
జచ్చుట లేదు దుర్దమము శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి దండు నొకమేలు వినంబడ దమ్మహాత్ములన్
ముచ్చులఁ జంపినట్టులు పరుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్. 27

తే. కొడుక తమ్ములు దోడ్పడఁగడఁగి శత్రు,వరుల గెలిచెదనంటివొక్కరుఁడు దక్క
కుండ నీతమ్ముఁగుఱ్ఱలనూచముట్టు, గొనియె నే విధి యేగతిఁ జనుదుఁ జెపుమ.

క. కదిసి పవనజుఁడు బెట్టుగ, గద వేసినఁ దొడలు విఱిగి కయ్యపునేలన్
మద మఱి పడినప్పుడు నీ,మది నే మని తలఁచితో కుమార యెఱుంగన్. 29

వ. అని పెక్కుభంగుల విలపించి. 30

చ. తలపఁగ భాగ్యవంతుల కుదాత్తశుభం బగుఁ గాక పుణ్యహీ
నుల కది గల్గ నేర్చునె తనూభవ లాఱడి వోయి రింకఁ గా

1. క. వమ్మైన తెఱఁగు లట్టి దేమి- గ. వమ్మైనతెఱఁగు వింటి నేమి.

నలఁ జరియింపఁ బోవుటయ నా కుచితం బటు గాక చండి నై
నిలిచితి నేని మాటలనె నిచ్చలు భీముఁడు చూఁడు చుండఁడే. 31

క. విను దుర్యోధనదుశ్శాసనులఁ బలికి పలికి నిచ్ఛచావుగ నప్పా
వని యలఁచుఁ గాన యడవికిఁ, జనుటయ మే లైన తెఱఁగు సంజయ నాకున్. 32

వ. అని పలికి యత్యంతదుఃఖదూషితస్వాంతుం డగుచు నమ్మహీకాంతుండు నిట్టూర్పు
నిగిడించి యాసూతనందనున కి ట్లనియె. 33

క. సురసరిదాత్మజుఁడును శర, గురుఁడును గర్ణుండుఁ దెగుటకుం దలఁకక యె
వ్వరిబాహుబలము గొని యే, మరి కో ల్తల సేసిరొక్కొ మనవా రనికిన్. 34

వ. అని తనకొడుకుచలం బూహించి. 35

చ. మును విదురుండు సెప్పె నతిమూర్ఖమనోగతి యైనయీసుయో
ధనుచరితంబు గీ డఖిలధాత్రిజనంబులకుం బొనర్చు నా
శన మని దానిఁ గొంద అవిచారులు పాటిగఁ బట్ట రైరి నా
కును మది వారి కె ట్లటుల కుత్సిత మయ్యె విధాత త్రిప్పనన్. 36

క. అప్పు డటు లతఁడు సెప్పఁగఁ, దప్పఁ దలంచినఫలంబు దగఁ గుడువక పోఁ
జొప్పడునె సూతనందన, చెప్పు మనికి నెవ్వఁ డమరె సేనాపతి యై. 37

చ. దురమున నర్జునప్రకటదోర్విభవంబు నెదుర్పఁ జాలును
ద్ధురుఁ డొకరుండు గల్గెనె విధూతవిరోధిబలుండు శల్యుఁ డె
వ్వరిభుజశక్తిఁ జిక్కెఁ గురువర్గముసంతసయ మెట్లు సెల్లె దు
స్తరబలభాసిభీమునిగదం బడిమెం గురుముఖ్యుఁ డెమ్మెయిన్. 38

వ. కృపకృతవర్మాశ్వత్థామ లెబ్బంగి బ్రతికిరి ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులును నామనుమ లైనప్రతివింధ్యాదిద్రౌపదేయులును దక్కనుం గలుగుయోధవీరులు నెవ్విధంబున మృతిఁ బొందిరి పాండవు లేవురును బద్మనాభసాత్యకులును యుయుత్సుండును నెత్తెఱంగునఁ దెగటారక తప్పి రింతయుఁ బరిపాటిఁ దేటపడం జెప్పుమనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కి ట్లనియె. 39

ఉ. సూతసుతుండుఁ జేయఁ గలశూరులు దర్పసమగ్రభూపతి
వ్రాతముఁ జెక్కుదంతిరథవాజిభటావలులున్ భుజాబల
స్ఫీతులు పాండునందనులచేఁ దెగటారిన నోడి వీటికిన్
నీతనయుండు హీనరథసేయుతుఁ డై యటు లేఁగి నెవ్వగన్. 40

కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట.

వ. మందిరంబుఁ బ్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్రపరిజనపరివృతుం డై నిలిచి నయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుం డై కృపాచార్యుం డన్నరేంద్రున కి ట్లనియె. 41

క. సమరము మిముఁబోంట్లకు ను, త్తమధర్మం బిదియ తొంటిధాత్రీశులు కృ
త్యముగఁ గొని యాచరించిరి, తమకు సుగతి గోరి కీర్తితస్ఫురణమెయిన్. 42

క. [1]ఐనను నొకపలు కడ్డము, గా నొడివెద దాని లెస్స గా విని యది మే
లైనను జేసెదు గాదే, న్మానెద వేర్పడఁగ వినుము మనుజాధీశా. 43

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుఁడుం బరా
క్రమమహనీయు లాహవధురంధరు లట్టిర తక్కఁగల్గుభూ
రమణులు బంధుమిత్రులు దూరంబున నందఱఁ బొందునందనుల్
సమయఁగఁ జేసి రట్లు భుజశక్తియు దైవబలంబు నెక్కుడై. 44

చ. వెరవును లావునుం గలుగువీరులు పోరులఁ బడ్డ హీనతం
బొరసితి మస్త్రశస్త్రహతి భూవర చిక్కినవారు నొల్లఁ బో
యిరి విను పాండురాజసుతు లేవురు గంటికి రెప్పచంద మై
హరి తముఁ గావఁ గా వెలసి రక్షతదేహవిలాససంపదన్. 45.

క. శ్వేతాశ్వపాటవం బు,ద్ద్యోతిత మై మెఱయఁగాఁ జతుర్దంతరుచి
స్ఫీత మగుగజముక్రియ నరుఁ, డాతతకురుసైన్యసరసియందుఁ జరించున్. 46

క. జ్యారవము నాదముగ నతి,ఘోరత వైరు లనుకరటికోటికి రయదు
ర్వారం బగునర్జునకం,ఠీరవము శితాస్త్రనఖపటిష్ఠతఁ జూపున్. 47

తే. అర్జునోదగ్రదవశిఖి హరిమహాని,లంబు ప్రేరేప వైరిబలప్రకీర్ణ
గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ, దేఱిచూడను రాకున్కి దెల్ల మధిప.

ఉ. ద్రోణుఁడు సూతనందనుఁడు ద్రోణతనూజుఁడు నేను శల్యుఁడుం
ద్రాణపరాయణత్వమున దర్పము సూపఁగ నీవుఁ దమ్ములున్
బాణపరంపరల్ గురియ ఫల్గునుఁ డందఱ మీఱి సైంధవ
ప్రాణము నాఁచికోలు నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే. 49

ఉ. ఇంతకమున్న సెల్లెఁ బదియేడుదినంబులసంగరం బతి
శ్రాంతతఁ గుంది రిందుఁ గలసైనికు లద్దెసఁ గల్గుయోధు లా
క్రాంతవిరోధిదర్పుఁడు పురందరనందనుబల్మి కల్మిని
శ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు చెమర్పక కౌరవేశ్వరా. 50

క. బలవిక్రమఘను లగుద్వా,ర, లిలిగిన మనసేన మేదినీశ్వర విను క
న్నులు పెడిన ట్టున్నది యీ,కొలఁదిం బోరిగొనుట నరునకున్ సుకర మగున్. 51

వ. అని చెప్పి కృతవర్మశల్యగురుపుత్త్రులను దన్ను నెన్ని. 52

క. దామోదరుతమ్ముండును, భీముఁడు నిరుగెలఁకులందుఁ బేర్చి తఱుమ ను
ద్దామగతి నడరుకవ్వడి, కే మిందఱుఁ దలఁప నొక్కయెత్తు కుమారా. 53

చ. అనిలసుతుండు పూన్కి బలుపారఁగఁ గొండొక దీర్చె నేపు నొం

---

1. గ. ఏ నొకపలు కడ్డముగా, నే నొడివెద దాని లెస్స విని మది యుది.

దినభుజసంపదం గొఱఁత దీర్పఁగ నింకఁ గడంగ కుండునే
మనకు నజాతశత్రుని సమంచితమార్దవ మూఁది సంధి సే
య నుచిత మైనకాల మిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్. 54

క. సమరము నిష్కారణవై,రమునం బాటిల్లె నెల్లరాజులు భరతో
త్తములును మడిసిరి విడు కో,పము దీర్ఘక్రోధుఁ డైనపతి కీ డొందున్. 55

క. తమకు బలం బెక్కునతఱి, సముచిత మగువిగ్రహంబు శత్రుల కుత్సా
హము మీఱినపుడు కర్తవ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్. 56

క. కలవా రెల్లను దెగి సీ,తలన నిలిచెఁ గార్య మధిప తగ నొడఁబడు మి
ట్టల మగునాత్మవినాశము, కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్. 57

క. తనకై కాదే మది నె,ల్లను గోరుట వినుము దాఁ బ్రళయ మొందెనయే
నిని వారనీయుద్యోగం,బునకు ఫలం బేమి రాజపుంగవ చెపుమా. 58

క. నినుఁ గాచికొనుము నీవు,న్నను సర్వము గల్గు ధర్మనందనునిఁ దగం
గను మతఁడు రాజ నని తన,మనమున నెక్కొంచుకొనఁడు మదగర్వంబుల్.

తే. రాజ్యభాగంబు దగ ధృతరాష్ట్రునకును, నీకు నన్నదమ్ములకు నానృపతి యొసఁగు
నాతఁ డెపుడు శుశ్రూష సేయంగఁ గోరు, గురుజనములకుఁ గావునఁ గూడు టొప్పు.

చ. హరియును గాదనందు కరుణాన్వితు లై తగ నమ్మహాత్ము లె
ప్పరుసునఁ గార్యనిశ్చయము వల్కినఁ గీచకవైరియుం బురం
దరతనయుండునుం గవలు దానికి మార్పలుకంగ నెమ్మెయిం
జొర రగు సంధి యెట్లు ననహాయత నూల్కొని చేయు మిత్తఱిన్. 61

ఆ. ఇంత చెప్ప టనికి నే నోడి ప్రాణర,క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య మనియుఁ దఱిమి పల్కితి విను విన, వేని నొచ్చి తలఁచె దిట్టు లగుట. 62

వ. అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుండు వేఁడినిట్టూర్పు నిగిడించి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యూరకుండి వ్రాల్చినకనుదోయి విచ్చి యవ్విప్రవరు మొగంబు సూచి యిట్లనియె. 63

చ. చెడుటకు నోర్వ కీ విటులు చెప్పితి నాకు హితంబు నెయ్య మె
క్కుడు గలయట్టిచుట్టమునకుఁ నయశిక్ష దగుం గదా భరం
పడి బవరంబులం బెనఁగుభంగిని గార్యము దెల్పఁ జాలిన
ప్పుడు నిను రక్షణార్థి వని భూసురసత్తమ యే నెఱుంగుదున్. 64

వ. నీకూర్మి పేర్మిం జేసి కీడు దొలఁగింపం జూచి సంధి కర్తవ్యం బని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లం టేని. 65

సీ. కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబు, గొని ధర్మజునిమది గుందఁ జేసి
సభ నేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ, బాంచాలి ముందల వట్టి యీడ్చి

సంధి సేయఁగఁ బూని శౌరి యేతెంచిన, నవ్విధంబున కప్రియం బొనర్చి
పలువురు గూడి సౌభద్రు నొక్కని బాలుఁ, గిట్టి యత్తెఱఁగున గీటడంచి

తే. నేఁడు గుశ్వాసనుని యొమ్ము నెత్తురనిల, సుతుఁడు మదమున ద్రావుట సూచి కొఱఁత
ప్రతిన దీర్చునతండని భయముఁ బొంది, పొందుగోరిన నదియేల పాసఁగుఁ జెపుమ.

ఉ. రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి
భ్రాజితవృత్తి నేలి యనురక్తులఁ బోషించుచు శత్రుకోటికి
న్నేజము [1]దప్పఁ జేయుచు [2]నరాతిప్రమదంబున నున్ననాకు నిం
క్రాజియె కాక యొక్కనిదయం గను రాజ్యసుఖంబు లేటికిన్. 67

వ. నిశ్చయం బిట్టిద యగుటం జేసి. 68

ఆ. పొడుతు నెట్లు పాండుపుత్త్రులతోఁ గయ్య, మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమి గాఁగఁ దలఁపకు ముచితంబు, తెఱఁగు ధీరజనుల కెఱుఁగరాదె.

చ. విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు
త్త్రభటసమానవృత్తమున దైన్యము నొందుట కోర్వ రాదు వీ
తభయతఁ బోరఁ [3]బేర్కొని యుదాత్తపదంబున కేఁగి భీష్మకుం
భభవజయద్రథాదు లగుబంధుల మిత్త్రులఁ గూడు టొప్పగున్. 70

వ. అంత వలవ దిమ్మాట మగపాడి కాడితిం గాని. 71

ఆ. ఏను దెంపు చేసి యీయున్నరథికజ, నంబుతోడఁ గడఁగి నడవ బెట్టు
దఱిమి పాండురాజతనయుల మర్దింతు, ననఘ నీవు మెచ్చునట్టు గాఁగ. 72

చ. అన విని చుట్టు నున్ననృపు లందఱు సంతస మంది యన్న రేం
ద్రుని వినుతించి యోటమికి రోయుట నొందినచింత వంత యె
ల్లను దిగఁ ద్రోచి నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లునా
ననములు కోప దర్పవచనంబుల సేనకు నుబ్బొనర్చుచున్. 73

దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీతీరంబు చేరుట.

వ. చెలంగి కృపకృతవర్మాశ్వత్థామశకునిశల్యులు గార్యంబు విచారించి కౌరవేశ్వరు
నాలోకించి మన మీరాత్రి శిబిరంబున నిద్రించుట యొప్ప దెట్లనినఁ గర్ణుం
దెగటార్చుటం జేసి పేర్చినయుబ్బునఁ బాండవులు పైకొని పరాక్రమింప
నప్పలింపఁ గలుగుఁ బో యని తలంచెదము వినుము వంచనఁ దొలంగి యుండి
మనకుం గలచతురంగంబుల నాయితంబు సేసికొని పెనఁకువం బన్ని వారికి వెఱఁ
గగునట్టి బెట్టిదంపుటురవడిం గదిసి రణంబు సేయుద మట్లైన జయంబు గొనవచ్చు
ననిన చెప్పిన నవ్వసుమతీపతి ప్రీతుండై యది లెస్స వెరవు వట్ల చేయుద మ్మని సము
చితభంగిం దగువారల కెఱింగించి కదలి యచటికి రెండామడ యగు సరస్వతీ
ప్రాంతం బయలికి బలంబులం గొని చని సకలజనవాహనసహితంబుగా సమ్మహా

1. గ. దవ్వు సేయుచు. 2. క. ననింద్యపరాక్రమలీల నున్ననా కాజియె. 3. జ. మార్కొని.

నదియం దిచ్చానురూపస్నానపానంబు లాచరించి వలయు తెఱంగున వెనుక నడ
తెంచినవివిధాహారంబులం దుష్టిం బొంది యిష్టాలాపంబులు సెల్లుచుండ నున్న
సమయంబున ము న్నాకర్ణంబు నడపినదొరలును జిత్రసేనాదిభవత్కుమారులును
గర్ణకొడుకు సత్యసేనుండును లో నైనయా ప్తజనంబు లమ్మనుజనాథున కి ట్లనిరి.

చ. వెరవును లావునుం గలిగి విక్రమసంపద సొంపు మీఱి భూ
వర భవదీయ మైనబలవర్గము నొడ్డన మేర్ప వీఁక మైఁ
బురికొలుపంగ నిర్భయతఁ బోలెడునట్లుగఁ దాను ముంద రై[1]
తిరముగఁ జేయఁ జాలు నొకధీరు నొసర్పుము సైన్యనాథుఁ గన్. 75

వ. అనిన విని వృషస్కంధుండును బీనదీర్ఘభుజార్గళుండును భర్గవరలబ్ధజన్ముండును
దివ్యాస్త్రవేదియు నవ్యాహతవిక్రమోద్దాముండును నగు నశ్వత్థామ నాలోకించి
యాదరభరితుం డగుచు నాథరణీవరుం డతని కి ట్లనియె. 76

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల, నేడుగడయుఁ గాన హితము సెప్పఁ
దగు బలాధినాథుఁ డుగఁ జేయ నర్హుని, నెల్ల వినఁగ నిశ్చయింప వలయు. 77

చ. అనుటయు నాతఁ డిట్టు లను నజ్జనపాలున కాజినై పుణం
బును మహనీయశౌర్యమును భూరిబలంబును [2]సర్వసత్త్వవే
ధనముఁ బరాక్రమోద్ధతియు ధైర్యసమగ్రతయుం గలండు శ
ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా. 78

క. నినుఁ బట్టి పాండుపుత్త్రులఁ, దనమేనల్లురఁ దొఱంగె ధరణీశ్వర యీ
తనిఁ గడచినపరమహితులు, మనకుఁ గలరె యితఁడు లోకమాన్యుఁడు గాఁడే.

తే. కార్తికేయుం డధీశుఁడుగా నమర్త్యు, లెలమిఁ బురికొని దైత్యుల గెలుచుకరణి
మద్రవిభుఁ డగ్రణిగ నేచి మనము నడచి, కడిఁదిపగఱ జయింతము కౌరవేంద్ర.

వ. అనిన విని సమస్తజగతీశులును జయజయశబ్దంబులతో శల్యుం బరివేష్టించి సంగ
రోత్సాహంబునం బొంగిరి కురునాథుండు గద్దియ డిగి సవినయంబున నమ్మద్రవిభున
కభిముఖుం డై యి ట్లనియె. 81

ఉ. పొచ్చెము లేని నెయ్యమునఁ బూని విపద్దశ నొంద కుండఁగా
నెచ్చెలిఁ గావఁ జూచుమహనీయున కిట్టిద కాల [3]మిప్పు డీ
వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున నద్భుతంపుగె
ల్పిచ్చి కృతార్థుఁ జేయు నను నే నినుఁ జెందియుఁ దూలఁ బోదునే. 82

క. పూనుము చమూపతిత్వము, నానమ్మినవారు నేను నరపతిబలసం
తానంబుతోడఁ బరిజన, మై నడచెద మాక్రమింపు మరివర్గంబున్. 83

చ. అన విని శల్యుఁ డి ట్లనియె నమ్మనుజేంద్రున కిప్పు డింతప్రా
ర్థన మొనరింప నేల వసుధావర యే నినుఁ జేరినప్డ నా

1. క.: ముంగ లై. 2. క. సర్వశస్త్రవేదనము. 3. గ. మిప్ప మీ వచ్చు.

ధనమును బ్రాణమున్ బలవిశేతానము నీకు సమర్పణంబు సే
సినయవి గావె నీపనుపు సేసెదఁ గౌరవసేనఁ గాచెదన్. 84

మ. భుజవీర్యంబున నచ్యుతార్జునులు నన్ బోలంగ లేరల్క వ
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాచే నొత్తు రే నేచి య
క్కజపుం జేవయు లావుఁ జూపువడికిం గౌంతేయులే యోర్తు రా
ప్రజయున్ నీప్రజయుం గలంగఁ జెలఁగం బాటింతు నాటోపమున్. 85

చ. అతిముతి బాణజాలముల నక్కడిసైనికులం దెరల్చెదన్
గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసినవీరవర్గమున్
నతికెదఁ జూచు ఖేచరగణంబుల కచ్చెరుపాటొనర్చెదన్
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన రూపడంచెదన్. 86

శా. గంగానందనుపోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ
జుం [1]గీడాడుచు నీతఁ డెవ్వఁడొకో యంచున్ శల్యుఁడే యిట్టివా
నిం గయ్యంబుల మున్ను గాన మనుచు న్వోధంగులం జూప తె
ల్లం గీర్తింప ధనుఃకళానిపుణలీ[2]లాఖేలతన్ జూపెదన్. 87

దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట.

వ. అని పలికిన నీసుతుండు ప్రీతుండై కనకకలశంబుల సరస్వతీజలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునఁ దగురాజులుం దానును సేనామధ్యంబున భద్రవిధానోపేతంబుగా నమ్మద్రవిభు నభిషేకించి బలాధిపత్యపట్టబంధంబు నిర్వర్తించిన శంఖభేరీప్రముఖమంగళతూర్యరవంబులు సెలంగ సైనికసింహనాదంబు లుల్లసిల్ల నప్పుడా శల్యు నుద్దేశించి దీవనలం బొగడ్తల నఖలజనంబులును ముఖరు లయి రిట్లు సంతసిల్లి సపరివారంబుగాఁ గురుభూమీశ్వరుండు విశ్రామంబు నొందె నట్టియెడ మున్ను సమరజయంబునం బ్రమోదభరితుండగుచు నిజశిబిరంబునకుం జనినపాండవాగ్రజుండు బంధుమిత్రపరిజనంబులఁ దమతమవిడిదలకుం బోవం బనుపక యుచితప్రదేశంబునఁ బేరోలగం బుండి మనవారివలనివిశేషంబులరయఁ జారులం బనిచినవాఁడై వారలు మగిడి వచ్చునంతకు నేమేని వినోదంబులం బ్రొద్దు పుచ్చి యక్కడియుత్సాహంబు తెఱం గంతయు విని యచ్యుతునాననం బాలోకించి యిట్లనియె. 88

చ. కురుపతి మద్రరాజుఁ దనకున్ బలముఖ్యునిఁగా నొనర్చి సం
గరమున కుత్సహించె నధికప్రమదంబున వారిసేనయుం
దిర మయి పేర్చి యున్నయది దీనికి నెయ్యది సేయువార మీ
వరయుము కార్యవృత్తి హృదయంబునఁ బాండవరక్షణోత్సుకా. 89

1. గ. గీటాడుచు. 2. చ. లాశీలతన్ - జ. లాలోలతన్.

వ. నీ వెట్లు నిశ్చయించి పలికె దట్ల చేయుదు ననిన నమ్మహీకాంతునకు మురాంతకుం డి ట్లనియె. 90

సీ. శల్యు నెఱుంగుదు । శౌర్యధైర్యంబు ల,గ్గల మాతనికి బాహు।బలఘనుండు
గాంగేయకుంభజ।కర్ణుల మిగిలెడుఁ, గాదేని సముఁ డగుఁ । గాని <sup>1</sup>యసదు
గాఁ దలంపఁగ రాదు । కౌరవపతి మాన్యుఁ, జేయుట నధికవి।జృంభణంబుఁ
జూపు భీమునకు న।ర్జునునకు <sup>2</sup>నెనయంగ, రాదు సాత్యకి కోర్వ।రాదు పార్ష
తే. తునకుఁ దత్సోదరులకు మా।రొక్కని పెనంగి, బ్రదుకరాదు నీవీట నా।బల్లిదునకు
నెదురురథికునిఁ గాన న।నేకహేతి,నిపుణశార్దూలవిక్రమ । నీవు దక్క. 91

క. ఒరు లయినఁ బెక్కు<sup>3</sup>దినములఁ, బోరిగొను నీబలము నెల్లఁ । బోరివోవ నతం
డరిభంజన నీ వైనం, బరమోత్సాహమున నెల్లి । పడ వై తతనిన్. 92

ఆ. అతఁడు మేనమామ । యనుకృప దక్కము, రాజధర్మమును బు।రస్కరించి
యతులవిక్రమక్రి।యాపాటవంబున, నవ్విరోధిధామ । మడఁప వలయు. 93

క. గాంగేయునిఁ గుంభజుఁ గ,ర్ణుం గడచితి మింక నుద్ధ।రుం డగుమద్రే
శుం గూల్పు మంతతోడఁ దె,గుం గురుపతిపని జయంబు । గొనుము కడంకన్.

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 95

ఆ. అనఘ నీవు చెప్పి।నట్టులు సేసెద, మున్ను పలికినాఁడ । నన్నరేంద్రు
కడిమి నాకుఁ బాలు । గాఁ బూని యుద్యోగ,వేళయందు నెల్ల।వినుచునుండ.

వ. సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని పలికి పద్మనాభునిఁ దనతమ్ములను ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖులను దక్కటిపరిజనంబులను నిజమందిరంబులకుం బోవంబనిచి వీతశల్యం బైనమాతంగంబుచందంబున శయ్యాతలంబు సేరె బలం బంతయు నత్యంతసంతుష్టం బై విశ్రాంతి నొందె నారాత్రి యే నిట వచ్చి నీకుఁ గర్ణువృత్తాంతంబు సెప్పి నీవు వనుప మగిడి చని తెల్లతెల వేగునప్పుడు కౌరవసేనాసన్నివేశంబు సేరితి నాసమయంబున. 97

క. కురుపతి పడవాళ్లం దగు,దారలకడకు సత్వరముగ । దురమునకు భటో
త్కరము ననువు సేయుటకై, బరవసము దలిర్పఁ బనిచెఁ । బార్థివముఖ్యా. 98

వ. పనిచిన నెల్లవారు నుల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్లఁ దమతమచతురంగంబులకు సవరణలు సంఘటింపం దొడంగినఁ దూర్యంబులు సెలంగ నొండొరులఁ బిలుచునెలుంగులు నింగి ముట్ట రథనేమిగజపదతురంగఖురపుటభటచరణసంఘట్టితం బగుధరణీతలం బద్రువ బహుళం బగునులివు చంద్రోదయసమయఘూర్ణమానం బగుమహార్ణవంబునినదంబు ననుకరించె న ట్లాయితం బై శల్యశకునికృతవర్మాశ్వత్థామలును దక్కనుంగలయోధవరులును నొక్కెడ ననుజసహితుం డై యున్నమనుజపతిసన్నిధిఁ గూడి యతండు వినఁ దమలో ని ట్లనిరి. 99

---

1. క. గ. జ. యాగుదు. 2. గ. కెనయుంగ. 3. గ. విధముల.

క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ, కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ
క్కొకతలగాఁ దలపడి వా, రికడంక యుడుపఁగవలయుఁ గ్రీడయపోలెన్.

వ. మన మొకళ్లొకళ్లకుఁ బ్రాపగుచు నేపారి పోరినం జుల్కన గెల్పు గొనవచ్చు నిత్తెఱంగు మనకు సమయంబు సుండీ యట్లు గాక యొంటి పెనంగెడివాఁడును జెనఁగెడివానిఁ గని కూడుకొనినవాఁడును బంచవిధపాపంబుల నొందఁగలవాఁ డని యొండొరులకుం జెప్పికొని, కదలి యుద్దామసామర్థ్యంబున నమ్మనపతి ముంగలివై నడవం జనునప్పుడు. 101

కౌరవసైన్యంబు యుద్ధసన్నద్ధం బై వెడలుట.

సీ. చంచరీకావళీఝంకృతు[1]ల్ గల్పించు, కర్ణఝుళంఝుళాకలనములును
ధరణీపరాగసంతానంబు గబళించు, కరశీకరచ్ఛటాస్ఫురణములును
ఘంటికాటంకృతికాంతి సంభావించు, నిర్భరబృంహితనిస్వనములు
నంబరభాగంబు సల్పంబు గావించు, నున్నతగాత్రసముద్ధతులును

తే. జారుభీషణరేఖలు భూరిమదభ, రాభిరామమానంబులు నాహవోచి
తోగ్రకల్పనాభంగులు నుల్లసిల్లఁ, గరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడచె.

చ. గతిబహుతాలసత్ఖురవిఘట్టితమేదిని జీవితేశక
ల్పితనఖరేఖలం జెలువుపెంపు వహించుపురంధ్రిఁ బోల ను
ద్ధతదృఢబంధురాంగలలితంబులు నూర్జితకింకిణీఝణ
త్కృతిపటుహేషలుం దగ నుదీర్ణము లై నడచెం దురంగముల్. 103

సీ. మీఱినయుబ్బున [2]మీఁదికిఁ గాళులు, సాఁచురథ్యంబులచటులతయును
[3]లలిఁ బెండ్లికినిఁ బోవుచెలువున విలసిల్లు, సూతజనంబువిస్ఫూర్జితంబు
జతనంబుమేలిమిఁ జాఱుఘోరము లగు, నవయవంబులవిభవాతిశయము
బిరుదుల నుద్భటస్ఫురణంబు లై క్రాలు, కేతనంబులసముద్ద్యోతితంబు

తే. సొంపు మిగులంగ జోదులయంపపొదుల, దీప్తులును లేఁతనవ్వులదీధితులును
[4]హరిరశ్ములుఁ గీడ్పర నగుచు వెలుఁగఁ, దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర.

చ. కడఁకయు లావునుం గరఁగి గట్టిగఁ గూర్చి యొనర్చినట్టిపే
రొడళులఁ దాల్మియుం గడిమియుం గలయం బరికించి యందు నే
ర్పిడుకొని గాఢభంగి రచియించినచందము నెమ్మనంబులం
గడుఁ జెలు వొంద నుబ్బి వడిఁ గాల్బల మేఁగెఁ గరం బునగ్రతన్. 105

వ. ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరం బోవునంతం బాండవబలంబునుం జను దెంచె ననిన విని యాంబికేయుండు సంజయున కి ట్లనియె 106

తే. సురనదీసుతుచావును గురునిచావుఁ, గర్ణుచావును వినినవాకర్ణములకు
శల్యుచావు దుర్యోధనుచావుఁ జెప్పి, యధికతరముగ సంతోషమావహింపు.

1. అ. లల్పించు. 2. గ. మింటికి. 3. ఖ. లీలఁ. 4. జ. హరరశ్ము.

క. అమ్మద్రవిభుని ధర్మజుఁ, డెమ్మెయిఁ బరిమార్చెఁ గౌరవేంద్రుని భీముం
డెమ్మెయిఁ గీటడఁచె రణం, బెమ్మెయిఁ బరిపాటిఁ జెల్లె నేర్పడఁ జెపుమా. 108

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లను వగచుకొలంది కడచనియె ధీరుండ వై
వార్త లవధరింపుము. 109

క. గంగాసుతగురుకర్ణుల, సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా
రం గనియు నీతనయు లా,సం గూఱిరి వారిఁ జంపు శల్యుం డనుచున్. 110

వ. దుర్యోధనుండు దిక్కు మాలియుండియు నడియాసం జేసి తన్ను సంపన్నునింగాఁ
దలంచుచు. 111

చ. అనుజులు దాను శల్యునిఁ బ్రియాశ్రయంబునఁ జేరఁ బోవ నా
యన మును గర్ణుఁ డర్జునశరాహతిఁ గూలిన నుబ్బి భీముఁ డా
ర్చిన నడ లొంది తల్లడిలుచిత్తము లూఱట నొంద వారలం
గనుఁగొని పల్కులన్ శ్రుతిసుఖం బొనరించె నుదగ్రమూర్తి యై. 112

వ. ఇట్లు సమరోత్సాహసమగ్రుం డయిన మద్రపతి సర్వతోభద్రవ్యూహంబు
పన్నించె నందు ముఖంబున మద్రపతి కర్ణపుత్త్రప్రముఖపరివృతుం డై తాను
నిలిచె వలపట శకయవనసమేతుం డై కృపాచార్యుండును దాపటఁ ద్రిగర్త
సహితుం డై కృతవర్మయు వెనుకఁ గాంభోజసహాయుం డై యశ్వత్థామయు
నడుమఁ గురువీరపరిరక్షితుం డయి కౌరవేశ్వరుండును తనిముందటఁ గరిఘటాగ్ర
భాగవర్తి యైబహులచతురంగంబులతో డశకునియు నిలుచునట్లుగా నొనర్చి పేర్చి
యురవణించె నంతకమున్న పాండవులు మూఁడు మొగంబులుగా వ్యూహించిరి
ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రజునగ్రభాగంబున
శోభిల్లి సితారూపవిద్యోతితం బైనశల్యుకేతనంబు సూచి తొలిచి నడచి రనిన
విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ బాండవులకుం గలసేనాంగంబులకొలంది
యెఱింగింపు మనవుడు సంజయుం డాజనపతి కిట్లను మనకుఁ బదునొకండు వేలు
రథంబులును బది వేలు నేడునూఱు గజంబులును రెండులక్షలు హయంబులును
మూఁడుగోట్లు పదాతులును వారికి నాఱు వేలు రథంబులును మూఁడు వేలేనుం
గులును లక్షగుఱ్ఱంబులును గోటికాల్బలంబులును గలిగియుండె నయ్యుభయసంబు
లొండొంటి గెలుచునగ్గలిక డగ్గఱియె నట్టియెడ. 113

ఉ. ఒండొరులన్ జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి యా
ప్పాండవకౌరవుల్ పెనఁగుభంగిఁ గనుంగొనువేడ్క నొక్కొ యా
తండు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగుబింబకాంతి న
ర్కుం డభిరాముఁ డై పొడుపుఁగొండపయిన్ వెలుఁగొందెఁ జూడఁగన్. 114

చ. అరసి యనాగతం బెఱుఁగునట్టిమనంబులు గల్గుపాండుభూ
వరసుతబంధుమిత్త్రకురువర్గసుహృజ్జనకోటు లత్తఱిం

బారసె నతిప్రమోదమును భూరివిషాదము నాఁగ నంబుజో
త్కరము వికాస మయ్యెఁ గుముదంబులు మీలన మొందె నెంతయున్. 115

సీ. కుంజరనికురుంబకుంభస్థలీసంగ,సిందూరరుచులతోఁ జెలిమి చేసి
కేతనవ్రాతసంకీలితమాణిక్య,రశ్ములగెడ విహారంబు సలిపి
సైనికనికరవక్షఃస్థలపరిలిప్త,కాశ్మీర[1]దీప్తులఁ గౌఁగిలించి
దండనాథోత్కరచండభావోద్వృత్త,చక్షుగప్రభలఁ దారు సరస మాడి

తే. యంశుజాలంబు లుభయసైన్యంబులందుఁ
బరఁగి బహువిధశస్త్రాస్త్రకిరణతతుల
బెరసి [2]పరభాగలక్ష్మి దీపించి మెఱయ
బాల్యరమణీయుఁ డగుచిత్రభానుఁ డొప్పె. 116

కురుపాండవులపదునెనిమిదవనాఁటియుద్ధప్రారంభము.

వ. ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దార్కొని భేరీప్రముఖతూర్యనిస్వనంబులు నింగి వొంగం జెలంగ. 117

క. ఒండొంటిఁ దాఁకి హేతులు, మండఁగఁ దచ్చూర్ణతతులు మహి రాలఁగ ను
ద్దండతఁ గలయం బెరసెను, రెండుమొనలుఁ గ్రూరతరపరిస్ఫురణము లై. 118

వ. ఇత్తెఱంగునఁ దలపడి. 119

క. అరదంబులు నరదంబులఁ, గరులు గరుల హరులు హరులఁ గాల్వురు మఱి గా
ల్వురఁ దాఁకి [3]పెనఁగెఁ గడుభీ,కరభంగులు మెచ్చు దేర గగనచరులకున్. 120

చ. పెనుపును నాకసం బవియుబృంహితముల్ దము నుగ్రగర్జిత
స్వనములతోడిమేఘములచందము గా నొనరింప మీఁదిమో
ధనికర మేయుసాయకవితానము భీషణవృష్టి గా రయం
బునఁ బయికొన్నయేనుఁగులపోరునఁ దేరులు దేలె నెత్తుటన్. 121

తే. కరులగమి వొదివి [4]రథముల్ గాలుకొనఁగ, నీక మరలినఘోటకానీకములను
బిరుదుమగలమొత్తములనుబిండిపీఁచు, సేయుబలితంపునేర్పు లచ్చెరువుఁ జెనుప.

క. పటురయమున నాశ్వికు లొ,క్కటఁ బెక్కం డ్రెక్కి రథనికరములు ఝుడిఝ
త్రుటితాకృతులుగ విహరిం,చుట మెక్కుడు వేడ్క సేయ సురగణమునకున్. 123

క. పలువుర నొక్కఁడు నొక్కని, బలువురుఁ దెగటార్చుటయును బలుదెఱఁగులమూఁ
కల్ పలుదెఱఁగులఁ దలపడి,పొలియించుట పొలియుటయును బొరినుగ్రముగన్.

క. చలమునఁ బోక పెనఁగుకా,ల్బలముపయిం దురగములు నిభంబులు నరదం
బులుఁ గూడి కవిసి యింతిం,తలు దునియలు సేతె యనుచితక్రౌర్యము గాన్.

క. తెల్లనిసవరణ మెఱయ స,ముల్లసితము లగుతురంగములమొత్తము చం

1. జ. దీధితుల్. 2. జ. ప్రాగ్భాగలక్ష్మి. 3. పెనఁగాడుభీక...... మెచ్చుదేర. 4. గ. రథికుల్.

చల్లలితపక్షముల శో,భిల్లుగతుల నొప్పనంచ*పిండుం బోలన్. 126

వ. అయ్యిరువాఁగును బేరు వాడునప్పుడు. 127

క. గుణనినదము రథనేమి,క్వణనంబుం దురగఖురర*వముఁ గరిఘంటా
రణనమును హేతిసంఘ,ర్షణనాదముఁ దూర్యఘోష*సంపదఁ గడచెన్. 128

సీ. నెత్తుటఁ దోఁగియు* నిగిడి పోరెడువీరు, లలరిన నడ[1]మోదు*గులవిధంబు
గ్రక్కునఁ దెగి పడి* కదలెడుబాహుదం,డములు మహాభుజం*గములభంగి
యవని రక్తాక్తంబు* లై యున్న[2]యట్టిబ, ల్దలలు గెందామర*కొలనిపగిది
దఱచు గా నెఱి దప్ప* నొఱగినగజములు, గులిశభగ్నాచల*కులమునట్లు

తే. మునిసి తొఱఁగినజోదుల*తొడలు సామ
జములకరములు నొండొంటి*చందములు గ
నుంగొనఁగ వింత లగుటను* సంగరాంగ
ణంబు రమణీయమును భీష*ణంబు నయ్యె. 129

తే. ఏమి చెప్పుదు [3]రౌద్రంపు*సెసకమందుఁ
దఱచుమెదళులు రొంపులు* నుఱుము లైన
యెమ్ము లిసుకయు సితచామ*రమ్ము లంచ
లయ్యె రుధిరంపుటేఱుల* కప్పు డధిప. 130

క. విను మయ్యేఱులలో వా,హనములె యోడలు గఁ జూడ* నక్కజ మగును
క్కున నుద్దామవిహారం, బొనరించిరి వీరయోధు* లుర్వీనాథా. 131

వ. ఇవ్విధంబునం బోరు ఘోరం బై చెల్లుచుండ నుల్లసితవిక్రమవిజృంభితు లగుభీమ
పార్థులు నలి రేఁగి నారాచప్రముఖనానావిశిఖంబుల మన మొనఁ గనుపుగొట్టిన నది
బెగడొంది మగిడిన నమ్మేటిమగ లుబ్బి పౌండ్రదేవదత్తంబుల నొత్తుటయు ధృష్ట
ద్యుమ్నుండును శిఖండియుఁ గౌంతేయాగ్రజు మున్నిడికొని తఱుమఁ దొడఁగ కవ
లును గడఁగి రట్టాటోపదీపితు లైనపాండవేయులయురవడికి నోటఱి నీబలంబు
హాహాకారంబులతోఁ బలుదెసలఁ బఱవం దొడంగినం గనుంగొని శల్యుండు
సారథి కి ట్లనియె. 132

ఉ. అల్లదె కంటె పాండుతన*యాగ్రణి తేరు సితాశ్వయుక్త మై
తెల్లనిమెల్లి నొప్పినది* తీవ్రత మార్కొని యానృపాలుశో
భిల్లుట మాన్పఁగా వలయు* భీషణభంగి రథంబు వోవ ని
మ్మెల్లజనంబు నాకడిమి* యేర్పడ నేఁ డెఱుఁగంగఁ జేసెదన్. 133

ఆ. సురలనైన గెలుతు* దురమున విను సాకుఁ, బాండపుత్త్రు లెదురె* భండనమున
నేర్పు బలుపుఁ జూపి* నిన్ను మెప్పింతు నా, చేతిబలువు సూడు* సూతవర్య. 134

వ. అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురు గా నరదంబు సముచితరయంబున

---

1. క. మ్రోదువుల. 2. జ. పట్టువుల్ దలలు. 3. క. గ. జ. రౌద్రంపుసెస.

నడప నమ్మద్రపతి సముద్రసముద్రేకంబుచందం బైనయాసైన్యంబుసరభసత్వంబు చెలియలికట్టయుం బోలి యుడుపుట యచ్చెరువై యుండె నట్లు శౌర్యధైర్యంబుల నుల్లసిల్లుశల్యుం జూచి మనమూఁకలును మగుడ నిగిడిన సంగ్రామంబు భీమం బయ్యె నందు నకులుండును గర్ణపుత్త్రుం డగుచిత్రసేనుఁడును దలపడి యొండొరు వులకుఁ గృతాస్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం బెనంగు నెడ నా సూతపుత్త్రుండు. 135

కర్ణకొడుకులు చిత్రసేనసత్యసేనసుశర్ములు నకులునిచేతఁ జచ్చుట.

చ. నకులునిచాపదండము ఘనప్రదరంబునఁ దున్మి భాస్వరాం
బకములు మూఁడు దీవ్రగతిఁ ఫాలతలంబున నాటి త్రుంచె ఘో
టకములఁ జేతనం బెలఁ బఱచె విదళించి వధించె సూతు ఖే
టకమును ఖడ్గముం గొని కడంగఁ బయిం బరఁగించె భల్లముల్. 136

క. అనిశతభల్లములు దన, మేనికి రాకుండఁ బలుక మెఱయ జడియుచుఁ జ
ర్వే నిగిడి కదిసె మాద్రీ, సూనుం డాసూతసూతిసూనునకర్దమునన్. 137

తే. కదిసి మీఁదికి లంఘించి కమదమెలక్ప, గళము దునిమిన నమ్మస్తకంబు డొల్లెఁ
గర్ణపూరకిరీటసంకలితవివిధ, రత్నరోచులు మెఱయ ధరాతలమున. 138

వ. ఇట్లు చిత్రసేనుండు వడినం గనుంగొని కౌంతేయసైనికు లార్చినం బేర్చినశోక
క్రోధంబులు మనంబుల ముప్పిరిగొన వానిసోదరులు సత్యసేనుండును సుశర్ముం
డును నప్పాండుపుత్త్రుపైఁ గవిసిన నతండు వేఱొక్కతేరెక్కి బలువిల్లెత్తి
దండధరప్రచండమూర్తి యై మార్కొనిన నబ్బిరుసుమగలయ్యిరదంబు భల్లం
బుల నఱకం దొడంగిన నుఱక చిఱునవ్వు నవ్వి. 139

చ. కడువడి సత్యసేనుతురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జ
క్కడిచిన నొండు తేరికి రయంబు మెయిం జని యన్యచాప మె
క్కిడుటయు నక్కుమారునిశితేషుయుగంబున నొంచి నొంచెఁ గ
వ్వడియనుజన్ముఁ డుగ్రుఁడయి వానిసహోదరు రెండుతూపులన్. 140

తే. అతనిధను వాసుశర్ముఁ డుద్ధతి దలిర్పఁ
ద్రుంచుటయు నొండువింట బల్విదూపు లొడ్డులఁ
బఱపి వానిశిరంబును నఱకి సత్య
సేనువిలు ద్రుంచె నాపాండుసూనుఁ డధిపు. 141

శా. ఆరాధేయతనూజుఁ డన్యధను వుగ్రాకారుఁ డై యెత్తి దు
ర్వారప్రక్రియ సేసె నావిశిఖముల్ వారించి యాతం డతి
స్ఫారస్ఫారశరత్రయం బతనివక్షోభిత్తిఁ గీలించి వే
నారాచంబులు రెండు దమ్మునిమెయిన్ నాటెం గడుర్ బెట్టుగన్. 142

క. వా రలిగి యొక్కయుమ్మడి, సారథిఁ దెగటార్చి యార్చి చాపము దునియం

దేరు వికలము గ మేను వి,దారితము గ నేసి రత్యుగ్రదగ్రస్ఫురణన్. 143

వ. ఇవ్విధంబున. 144

మ. విరథుండై విశీకృత్తచాపుఁడు శరావిద్ధుండునై మేదినీ
వర నీపుత్త్రుఁడు చంచదుగ్రతరజిహ్వాంబైనచండాహి నాఁ
గర మాభీలతఁ బొల్చుశక్తిఁ గొని యుగ్రల్కన్ సత్వసంఢయ్యు సు
స్థిరసంరంభత సత్యసేనుఁ బడ వైచెం జూప అగ్గింపఁగన్. 145

ఆ. అన్నపాటు సూచి యనుజుఁ డుల్లంబున, నడలు కనలు గదుర నంపవానఁ
గప్పెనకులునంతఁ గాంచి భీముకుమారుఁ, డెఱిఁగె నతనియరద మెక్కె నతఁడు.

వ. ఇట్లు ద్రౌపదేయుం డగుశ్రుతసోమునియరదం బెక్కి బలువిల్లు గొని యక్కు
మారుండును దోడుపడ నానుశర్ముని బటుశరపరంపరలం బొదివినఁ బొలివోక
యతండు. 147

తే. వాఁడితూపులు నకులుమైఁ మూఁడు నాటి
యిరువదింట నతనిపుత్త్రునియురము నొంచి
యర్ధచంద్రబాణాహతి నవ్విరోధి
శిరము దునిమె నప్పాండుభూవరసుతుండు. 148

శా. మాద్రీపుత్త్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం జూచి వీ
రోద్రేకం బెడలంగ నీసుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన
న్మద్రాధీశుఁడు సింహనాదము రణాస్మార్వసముల్లాసమున్
రౌద్రప్రక్రమసూచకంబులు గ సంరంభస్ఫురన్మూర్తి యై. 149

శ్లో. హస్తతల మెత్తి నిలునిలుమని యదల్పఁ, బోక తిరిగియమ్మూఁకలు పోరి కమరెఁ
బాండవేయులమొనలు నుద్దండవృత్తి, నురవణించిన సంగర ముగ్ర మయ్యె.

చ. అడరి ధనంజయాదు లగునక్కడివీరులు విక్రమింప ని
క్కడ భవదీయనందనముఖప్రథవోద్భటయోధవర్గము
ల్వడిఁ దఱుమంగ నప్పుడు బలద్వయమున్ విశిఖాగ్ని[1] వేర్చి మె
ఱ్ఱ డయినభీతి నొందె రణఘోరత భూవర యేమి సెప్పుదున్. 151

వ. ఇట్లు మథితం బయ్యును బౌరుషంబు పెంపున నిరువాఁగును వేగంబు గుందక
వింతచందంబునం బేర్చుక్రందు గగనచరులకుఁ గన్నులపండువు గా బృంహిత
ధ్వనులను ఘంటానినదంబులను నేమినిస్స్వనంబులను కేతుకింకిణీక్వాణనంబులను
[2]రింఖారవంబులను హేషాఘోషంబులను భుజాస్ఫాలనంబులను సింహనాదంబు
లను దిక్తటభేదనం బొనర్ప నద్భుతోత్సాహంబున నాహవక్రీడ సలుపుచుండఁ
బుండరీకాక్షురక్షితు లగుపాండుపుత్త్రులబలశౌర్యసంపదలసొంపునం బెంపొదవు
ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖు లైనదండిమగలు గూడికొని తఱుమ దారుణ

1. గ. కేర్చి. 2. జ. శంఖారవంబులను.

నై పుణంబున బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు గవిసినం గలంగుమృగకులంబు
కై వడిం గౌరవసైన్యంబు దైన్యంబు నొందిన. 153

క. పెనురొంపిఁ గోపలను బ్రుం,గినధేనువు నెత్తుపోలికకిని శల్యుం డ
మ్మెనఁ దనభుజబలమునఁ గలఁ,గనియట్లుగ నిలిపె శౌర్యగర్వము మెఱయన్.

వ. నిలిపి పేర్చినసమయంబున మనదిక్కున నుల్కాపాతప్రముఖంబు లగుదుర్ని
మిత్తంబులు వొడమిన నీకొడుకులు గూడికొని చేయం గలసైనికులం గూర్చికొని
తిరం బయి పెనంగి రట్లు పెనంగునెడఁ గడంగి తలకడచి మిగిలి మద్రపతి
మార్గణాసారంబు పరఁగించుచుఁ బాండవాగ్రజునగ్రభాగంబున నున్నభీమసేన
సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయమాద్రేయులఁ దాఁకి పదిపదిప్రదరంబుల
నొప్పించి కదిసి యన్నరపతిని బదితూపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాల
ప్రభద్రకబలంబు లాజెట్టిబిఱుదుచుట్టు ముట్టిన. 154

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం
గూలుగజంబులుం గెడయుగుఱ్ఱపుతండముఁ ద్రెళ్లు తేరులుం
గీ లెడలించినట్ల పడుకేతువితానము నుగ్గునూచ మై
రాలుపదాతివర్గములు రక్తపుటేఱులుఁ బ్రేవుప్రోవులున్. 155

వ. మఱియును. 156

క. ఏరూపు లయిన రూపఱ, ఘోరాశనులట్ల శల్యుకక్రూరాస్త్రంబుల్
కౌరవులు పొంగఁ బాండుకు,మారులసేనపయిఁ దొరఁగె మనుజాధీశా. 157

వ. అట్లు దొరుఁగుదారుణమార్గణాసారంబున వెగడుపడి యాబలంబు పాండవా
గ్రజువెనుక కొదిఁగిన నమ్మహీపతి పురికొలిపికొని శల్యు మార్కొని నిశితవిశిఖ
వర్షంబునం బొదివిన నమ్మద్రవిభుండు క్రూరనారాచం బతనిమే నుచ్చి పో నేయ
నాధర్మనందనునకుఁ దలకడచి యేడమ్ముల నవ్వీడమునఁగియు సహదేవుం డయిదు
తూపులను నకులుండు నవశరంబులను బ్రతివింధ్యాదిద్రౌపదేయులు బహుబాణ
పరంపరలను నవ్వీరు నేయ నప్పుడు కృపాచార్యుండును గృతవర్మయు శకునియుఁ
దత్సుతుం డులూకుండును నీకొడుకులుం గవిసిరి గురుపుత్త్రుండు మందహాసం
బుతో నమందగతి వచ్చి వారిఁ గూడికొనియె నక్కడిసైనికులును రభసంబున
నారథికవరులఁ దాఁకి రట్టియెడ. 158

క. కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు, నుపమాతీతాతిఘోరయుద్ధంబున బా
హుపటుత్వమ్ములు సూపి ర,థిప యొండొరులకు [1]సమత్వదీప్తాకృతులై. 159

క. ఒకని నొకనిఁ బదిపదిసా,యకముల నొప్పించె వీరు లగుపాండుకుమా
రకు లేవురు నంతట ద్రో,ణకుమారుఁడు మోము చిఱుతనగవున నొప్పన్. 160

ఆ. వాయుతనయు [2]బుశ్యవర్ణాశ్వముల మద్రపతి ధరిత్రిఁ గూల్చె నతఁడు దేరు

1. క. సమగ్రదీప్తా. 2. గ. చిత్రవర్ణా.

డిగ్గి నిజగదాపరిస్థితిఁ జూపెఁ గౌ,రవ్యసైన్యమునకు రాజముఖ్య. 161

క. అనిలజునియశ్వములఁ గూ,ల్చినయప్పుడు శల్యు[1]నిం గలితనము మెఱయం
దనయంపవెల్లిచే ముం,చె నకులుతమ్ముండు నీదుసేన దలంకన్. 162

తే. అతనిహయములు నమ్మద్రపతిశరములఁ
బడిన నప్పాండవునిఁ దలఁకడచి బలము
పొదివె నయ్యోధముఖ్యుఁ దత్పుత్త్రుఁ డపుడు
గదిసె నాసహదేవుపైఁ గడిమి మెఱయ. 163

చ. కవిసిన దట్టకెం పడరుకన్నులతోడఁ గృపాణపాణి యై
యవనికిఁ దాఁటి యాతనిశరావలి ద్రుంచుచుఁ గిట్టి తేరిపై
కి వడిఁ జలంబుమై నరిగి కేళియపోలె శిరంబు ద్రుంచి పో
యె వెసఁ బొగడ్త కెక్క ధరణీశ్వర యొండురథంబుమీఁదికిన్. 164

వ. ఇవ్విధంబున. 165

క. సుతుఁ డీల్గిన మద్రమహీ,పతి శోకక్రోధవేగభరితాత్ముఁ డై
శితశరపరంపరల ను,ద్ధతిఁ బాండవసైనికులమదం బడఁగించెన్. 166

### శల్యభీమసేనుల గదాయుద్ధము.

క. ఉరవడి రథికజనంబులఁ, దెరలిచి యేపారుతనదుతేరు మెఱయ ను
ద్ధురగతిఁ గౌంతేయాగ్రజు,నరదమునకుఁ గవిసె వాలుశరమ్ములు నిగుడన్. 167

సీ. కనుఁగొని భీముండు కన్నుల నిప్పులు, రాల కుండలకీలాలరంజి
తంబును రిపుసైన్యదైన్యప్రదంబును, నాత్మీయవాహినీహర్షకరము
నై శతధారామహాభుజగక్ష్మా,ధరశృంగసమత నుదగ్ర మగుచు
నెనిమిదియంచుల నెసఁగుమెఱుంగుల, దారుణం బగుగదాదండ ముగ్ర

తే. రేఖ సారించి రౌద్ర ముద్రేక మందఁ, గదిసి మద్రాధిపునితురంగములఁ జదియ
[2]మోఁదె నాతండు దోమరమునఁ దదీయ,విపులవక్షంబు భేదించె నృపవరేణ్య.

క. ఉరమున నాటినఘనతో,మరమును డాచేతఁ బెఱికి మారుతి మద్రే
శ్వరుసూతు వైచె దానన, ధరణిని బొరగిలఁబడ నుదగ్రస్ఫురణన్. 169

మ. విరథుం డై పాలిపోనిదర్పమున నవ్వీరుండు ఘోరంపుము
ద్గరముం గేల నమర్చి తేరు డిగి దుర్దాంతాకృతిన్ వజ్రభా
సురశక్రుండును దండచండయముఁడున్ శూలోగ్రఫాలాక్షుఁడున్
సరి సేయం దగువారు గాఁగఁ బొలిచెన్ సంస్తుత్యసంరంభతన్. 170

వ. ఇట్లవష్టంభవిజృంభితుం డైనయాసేనాధిపతిం జూచి యేచి భీముఁ డుద్దామరభ
సంబున నతనికిసమ్ముఖంబుగా నడరినఁ బణవాదివాదిత్రనిర్భరనినదంబులు సెలంగ
నప్పు డయ్యిరువాఁగు నిరువుర నేనికపోరు చూచువిధంబునఁ గనుఁగొనుచు గదా

1. గ. దోఃకలితములు. 2. జ. మోఁద.

రణంబునకు శల్యుండు దక్క మారుతి మార్కొనఁ జాలు మేటిమగలు నివ్వడముడి వెలి గా నిమ్మద్రపతిమీఁదఁ గవియునట్టి జెట్టిబిరుదులుం గలరే యనుచు నచ్చెరు వొందు చుండ. 171

ఆ. మండలప్రచారశమహితాకృతులు గర్జ, నలుగఁ బొలిచి మాఱుశమలసి ఆంకె లెసఁగఁ బోరి కమరి శ యే పారువృషభయు,గంబునట్లు వారు శ గవిసి రధిప.172

చ. మదమున నిమ్మెయిం గదిసి శ మద్రవిభుండును భీమసేనుఁడుఁ గదలమెఱుంగు లాకసము శ గ్రమ్మఁగ నుద్భటభంగిఁ ద్రిప్పి బె ట్టిదముగ వ్రేయ నిప్పులు వశడిం దొరఁగించె సమగ్రవిస్మయ [1]ప్రదరవభంగు లై యవి పరస్పరఘోరవిఘట్టనంబునన్. 173

వ. ఇట్లు దొడంగి. 174

క. ధిక్కారంబులు చరణద,భక్కారంబులును మెఱయ శ బలువు వెరవు పే రుక్కును నెక్కుడు వేగము, నక్కజములు గా నుదీర్ణు శ లై పోరు నెడన్. 175

చ. వెరవున నంగముల్ నుసులశ వ్రేటులు వమ్ముగఁ [2]దాఁకినప్డు ది క్కరిరదనప్రహారములఁ శ గంపము నొందక యుండుమేదినీ ధరములఁ బోల్పఁ బట్టగునుశదగ్రిపుమూర్తుల కిద్ద అందు ని ష్ఠురరభసంబు శౌర్యముపశటుత్వముఁ ద్రాసునఁ బెట్టినట్లు గన్. 176

వ. ఒక్కొక్క [3]మా ఱుబ్బున. 177

క. ఎనిమిదియడుగులకొలఁదిని, వెనువెనుకకుఁ బోయి నిగిడి శ వేగంబునఁ గి [4]ట్టినతగళులకై వడి దాఁ,కునగంబులభంగి దోఁచుఁ శ గురుకులముఖ్యా. 178

వ. ఇత్తెఱంగునఁ బెనంగి నెత్తుట జొత్తిల్లినయంగంబులు పుష్పితకింశుకంబులఁ బోలఁ బరిశ్రమంబు నొందియుఁ బొలివోవనిదర్పంబున. 179

### గదాయుద్ధమున మూర్ఛితుఁ డైనశల్యునిఁ గృపుఁడు తోలంగం గొనిపోవుట.

క. ఇరువురును [5]సందు సూడక, వెర వెడలినమాగ్రహముల శ వేసినగద లొం డొరులమెడలకెలఁకుల బ, ల్నరములు దాఁకుటయు వా రిలం బడి రధిపా.180

వ. ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛిల్లుటయు నుభయసైన్యంబులును హాహాకార ముఖరు లై రట్టియెడఁ గృపాచార్యుండు శల్యుకడకుఁ దనరథంబు రయంబునం బఱపించి. 181

క. పడియును గద విడువనియ,క్కడిఁదిమగని గ్రుచ్చి యెత్తి శ గారవమున నం చిడి తోలఁగం గొనిపోయెను, వడముడి దెప్పిఱియె నంత శ వసుధాధీశా. 182

వ. తెప్పిఱి లేచి చూచి సేద దేఱనియమ్మద్రపతిం బేరుకొని యుద్దండగదాదండమండి తం బైనకరంబునం బిలిచె నయ్యుద్ధతి సహింపఁజాలక సింహనాదంబుతోడఁ

---

1. జ. ప్రదరవిభంగు లై. 2. క. దాఁక నప్పుడుం గరి. 3. గ. సమయంబున. 4. గ. ట్టినయె డఁ దగరులు వడిఁ దాఁ. 5. సంధు లూడఁగ.

దూర్యస్వనంబులు సెలంగఁ గురుభూవరుముందరిసైనికులు రభసంబు గా నతఁ
డునుఁ గూడికొని తఱుమఁ గవిసినం గౌంతేయాగ్రజునగ్రభాగంబున రథికులు
చేకితానపురస్సరులై యార్పులు నింగి ముట్ట నయ్యనిలతనయుఁ దల్లకడచి వారిం
దలపడి పెనంగి రప్పుడు. 183

శా. ఆకౌరవ్యవిభుండు వజ్రకఠినం బై యొప్పుప్రాసంబు దీ
ప్తాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బునం గ్రాలఁ గే
లీకల్పంబుగ మింట జంటమెఱుఁగుల్నిండం బ్రదీప్తక్రమ
శ్రీకాంతుం డగుచేకితానుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్. 184

వ. ఇట్లు చేకితానుండు వీతాసుం డైనం గని కౌంతేయులు కోపాటోపంబున సైన్యో
పేతగతిం గడంగి కౌరవసైన్యంబుపైఁ బటుబాణంబులు గురియుచు నడరిన
శల్యుండు ధర్మపుత్త్రుని దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతి పనుప నశ్వ
త్థామత్రిగర్తులు మూఁడువేలరథంబులవారు వివ్వచ్చుని మహోత్సాహంబున
మార్కొనిరి తక్కటియోధులు సేనయునవ్విరోధివరూథినిగలయఁ బెరయుటయు
నక్కజం బయ్యె నప్పుడు పెందూళి మెగసి చూడ్కులు నిగుడ కున్నను సైనికులు
సింహనాదంబులు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకం
బుగాఁ బోరిన బోరనఁ దొరఁగుశోణితంబా రేణువు నడంచినఁ బ్రియంబంది యిరు
వాఁగును వ్రేయుండు పొడువుం డనునెలుంగులు నింగి ముట్టఁ బెనంగునట్టియెడ.

చ. బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నానృపాలుఁడు నరకుంతితుఁ డై పదునాల్గుతూపు ల
న్నరపతిమేన గ్రుచ్చి మెలనవ్వున నొప్పిన నమ్మహీశు పే
రురమున నాటె నారథికుఁ డొక్కసముజ్జ్వలబాణ మేడ్తెఱన్. 186

వ. నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుం డనుతదీయచక్రరక్షకుం దునిమి
సవనారాచంబులు సారథిమేన నిగిడించె. 187

ఆ. అపుడు శినివరుండు ననిలపుత్త్రుఁడుఁ జేది, బలము శల్యుఁ దీవ్రభంగిఁ బొదువ
నాతఁ డాధనంజయాగ్రణిఁ బటుతర, పంచమార్గణముల నొంచె నధిప. 188

క. విను మిరువదియేడమ్ముల, శినిమనుమనియు బ్బడంచెఁ జేదిరథికులం
దునిమెం దీవ్రశరోత్కర, మున నిరువదియేవురఁ బరముద్భటభంగిన్. 189

క. కవలు దనమీఁద రయమునఁ, గవిసిన నిశితతరసాయకములను మార్వో
రవము సెలంగఁగ వారల; యవయవముల నినిచె నతఁ డహంకృతి మెఱయన్.

చ. కనుఁగొని ధర్మసూతి భుజగర్వ మెలర్పఁగ బెట్టు గిట్టి శ
ల్యునిమెయిఁ దీవ్రమార్గణసముత్కరముం బరఁగించి కేతువుం
దునిమిన నాతఁ డాపతికిఁ దూపులవేఁడిమి సూపి వాయుసూ
నుసిఁ గవలన్ శినిప్రవరు నొంచె వడిం బదియేసి యమ్ములన్. 191

ఉ. నొంచి మదించి ఖేచరమనోహరుఁ డై వడి ధర్మపుత్త్రు స్రు
క్కించి మహోగ్రబాణపరికీలితదేహునిఁ జేసె దానఁ గో
పించి శిత్రాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం గడంక గు
ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్. 192

వ. చేసి యొండొకభాసితధ్వజం బెత్తించి మెఱసిన. 193

సీ. భీముఁ డాతనిమెయి బెడిదంపునారసం, బడరించి వెండియు నట్టి వేదు
పఱపె సాత్యకి శతబాణంబు లతనిపై, బె ట్టేసె మాద్రిలోఁ బుట్టి నైదు
తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు, గమ్ములు నవీరునంగకములఁ
బరఁగించి రమ్మద్రపతి భీమసేనాదు, లైనయన్నలుపుర నతిరయమున

తే. వరుస డెబ్బదిమూఁటను నిరువదేను, వాఁడితూపుల నేనింట మూఁడుమార్గ
ణములఁ బీడితులుగఁ జేసి నఱకె భల్ల,నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య.

శా. ఆమాద్రీసుతుఁ డన్యచాపధరుఁ డై యత్యుగ్రబాణంబులన్
మాఁమా యెక్కుడఁ బోయె దంచు వెస నమ్మద్రేశు నేయంగ ను
ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ
స్తోమంబుల్ గురియంగ ధర్మసుతుఁడుం దూపుల్ మెయిన్ గ్రువ్వఁగన్. 195

చ. కలయఁగ నెత్తురుల్ దొరఁగ గైరికనిర్ఝరజాలరంజితా
చలమును బోలి పొ ల్పెసఁగి శల్యుఁడు వారల నస్త్రపంచకం
బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర ధర్మజుచాప మమ్మలో
బలమును శౌర్యముల్ సురలు ప్రస్తుతి సేయ మహోగ్రమూర్తి యై. 196

ఉ. వేఱొకచాప మెత్తి పృథివీవర ధర్మతనూజుఁ డింతలోఁ
దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబు గ నంచు నూతు మైఁ
దూఱఁ దురంగమాంగములు దూఁటులు వోవఁగ శల్యు నెమ్ములన్
గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్. 197

వ. ఇవ్విధంబున విజృంభించిన. 198

క. కోపించి యతఁడు దర్పా,టోప ముదగ్రముగ దళపటుప్రదరము లా
భూపాలుమేనఁ జొనిపిన, భూపాలక యాతఁ డొల్లఁబోవుటయు వెసన్. 199

ధర్మరాజు శల్యునిబాణంబులచేత మూర్ఛితుం డగుట.

క. శై నేయుఁ డడరి యుజ్జ్వల,నానావిశిఖముల మద్రనరపతిఁ బొదువం
దా నలిగి విల్లు దునియలు, గా నొకభల్లమున నేసె గర్వోద్ధతుఁ డై. 200

క. ఆరథికవరుని నకులుని, మారుతి సహదేవు మూఁడుమార్గణముల నే
పారఁగ బలుపారఁగ రయ, మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁ డధిపా. 201

వ. అంతం దెలిసి యక్కొంతేయాగ్రజుండు మద్రపతి ముద్గరంబున నేయ నవ్విరో
ధిపై సాత్యకి దోమరంబును వృకోదరుండు భల్లంబును నకులుండు శక్తియు సహ

వ. నాతేరికి నకులుఁడును సాత్యకియు వలపటను సహదేవుండును ధృష్టద్యుమ్నుం
డును డాపటను గావలి యై రావలయు వెనుకం గదిసి వివ్వచ్చుండును ముందటి
కెలన మొనసి వడముడియును నడచునది యింత యేమిటికిన వలదు నన్నొండె
నతం డతని నొండె నేను సమయించుట యవశ్యంబు[1]ను గలుగం జూచితి నిట్లు
తెంపు చేసి యమ్మద్రపతి మార్కొనునాకు దుర్గమప్రయత్నంబు కర్తవ్యంబు
కృపకృతవర్మాశ్వత్థామసౌబలసుయోధను లయ్యోధముఖ్యు రక్షింపం జేయు
పరాక్రమంబునకు మీరు ప్రతివిక్రమం బాచరించుచుండ నుదీర్ణం బగుమదీయ
బాహుపాటవంబున నమ్మేటిమగని గీటడఁగించువాఁడ నని పలికిన నారథికవరు
లును ధక్కనుగలవార లమ్మానవపతిపూనికి నగ్గించి యతనిరథంబు సవిశేష
కల్పితంబు సేసి యతండు సెప్పినతెఱంగున సన్నద్ధు లై సముద్ధతిం దేజరిల్లు
టయుఁ దత్సైన్యం బుత్సాహదీప్తం బై కడంగినఁ గరిఘంటారవంబులును రథ
నేమినిస్వనంబులును దురంగకింకిణీక్వణనంబులును సుభటసింహనాదంబులును
నిస్సాణాదితూర్యనినదంబులును బెరసి యంబరంబు పిక్కటిల్లఁ జేసె నివ్విధం
బున యుధిష్ఠిరుం డుద్భటుం డై యురవడించిన. 235

శల్యధర్మనందనులద్వంద్వయుద్ధము.

క. కురువిభుఁడు దనదు[2]మొనలకు, బరవస మొప్పంగ మద్రపతి మును శౌర్యో
ద్ధురుఁ డయి కడఁగ నడరి య,వ్వరూథినిం దాఁకె ధరణి వడవడ వడఁకన్. 237

వ. అట్టియెడ.

క. పులులు దలపడినయుబ్బును, బలుపును దోఁపంగ మద్రపతిధర్మసుతుల్
తలపడి యొండొరువులపై, నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్. 238

వ. వారి నాలోకించి యుభయసైన్యంబులు విజృంభించి సంరంభంబునం గలయఁ
బెరసినఁ గ్రందుకయ్యం బయ్యె నందు. 239

ఉ. నీతనయుండు సింహకమనీయతరం బగుభీమునుల్లస
త్కేతన మర్ధచంద్రశరతీవ్రహతిన్ మణికింకిణీనినా
దాతిశయంబుతోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్
వాతిశరంబునం దునిమె వారివరూథిని యే పడంగఁగన్. 240

చ. అతఁడు ప్రదీప్తకోపముఖుఁ డై పటుశక్తి నురంబు వైచినం
బతి యరదంబుపైఁ బడియెఁ బల్వగుమూర్ఛ మునింగి యప్పు డా
యతథను వెత్తి సూతుతల యక్కురుఘస్మరుఁ డేసె డొల్ల వే
గ తొలఁగ నీడ్చెఁ దేరు దురగంబులు మూఁక గలంగి పాం పఱన్. 241

క. కని యశ్వత్థామయుఁ గృపుఁ,డును గృతవర్ముఁడును నెక్కుడుబరవసమునన్
మనసేనకుఁ దలమిగిలిన, మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మద మెలరారన్. 242

1. గ. విచారించితి. 2. జ. మొనకును బరవస మెసఁగంగ.

క. అమ్ముఖమున సమరము రౌ, ద్రమ్ము పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీ
కమ్ము బహులాస్త్రశస్త్రచ, యమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రము గన్.
వ. పొదివిన నయ్యుధిష్ఠిరుండు. 244
చ. అరదము చిత్రసంచరణ మక్కజ మై విలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దనచేతఁ గూలఁగాఁ
బొరలఁగ మేదినిం దునియఁ బ్రోవులుగా రుధిరంపురొంపి బ్రుం
గ రణవిహారముం జలిపెఁ గౌరవనాథ యనేకభంగులన్. 245
క. నరులు [1]మృదు వితఁ డనంగాఁ, బరఁగుయుధిష్ఠిరుఁడు శత్రుబలముల కతిని
ష్ఠురుఁ [2]డయ్యె నపుడు సుర ల, చ్చెరు వందిరి చూచి ద్రోణుశిక్షఁ బొగడుచున్.
క. మునుము బయ లైన నలిఁ బేర్చినయమ్మను జేంద్రుమీఁద శితవిశిఖము భే
పున నిగిడించుచు శల్యుఁడు, దనరుభుజాబలముతోడఁ దటిమెం బెలుచన్.
క. అవ్వీరునివాలంపఱ, క్రొవ్వు నడఁచి తనదునంపకోల లడరఁగా
నవ్వసుధాధిపుఁ [3]డల్లని, న వ్వోలయఁగ మాఱుకొనె ఘృణారహితుం డై.
వ. ఇవ్విధంబున మార్కొని ధర్మజమద్రపతులు నిజశంఖంబులు పూరించిరి భేరీ
ప్రముఖతూర్యస్వనంబులు నింగి పొంగారఁ జెలంగె నయ్యిరువురు నొండొరువుల
పైఁ జండకాండపరంపరలు పరఁగించి తనువుల నెత్తురు లురలించి పూచినబూరు
వులపోలుపు దాల్చి రట్టియెడఁ గనుంగొనుజనంబులు. 249
చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప దు
స్తరభుజశక్తి ధర్మజుఁడు శల్యునిమాఁ పడఁగించి యివ్వసుం
ధర గొను నొక్కొ నేఁ డితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడు గఁ జేయ నోపు నొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్. 250
వ. అని సందేహడోలాయమానమానసు లై రప్పుడు. 251
తే. మద్రపతి ధర్మజునివిల్లు రౌద్ర మెసఁగఁ
ద్రుంచి నూఱమ్ము లేసి యుద్ధురతఁ బేర్చె
నతఁడు నేఱొక్కధను వెత్తి యతనిధనువుఁ
దునిమి వెస నేసె మున్నూఱుతూపు లధిప. 252

విరథుఁ డయినశల్యుని నశ్వత్థామ తనరథముపై నిడుకొని పోవుట.

ఉ. తోడనె తేరివాహములఁ ద్రుంచి మదంబున సూతుప్రాణముల్
క్రీడయపోలెఁ బుచ్చికొని కేతువుఁ గూల్చిన సేన విచ్చెఁ జే
యాడక యున్నశల్యుని రయంబున నాత్మరథస్థుఁ జేసి పె
న్నీడునఁ బొంద కుండఁ దొలఁగించెను ద్రోణసుతుండు భూవరా. 253
వ. ఇట్లు శల్యుండు సమరవైకల్యంబు నొందుటయు ధర్మనందనుం డార్చి పేర్చి త

1. గ. మృదుఁడితఁ. 2. గ. డనిసురల చ్చెరుపం, దిరిద్రోణునిశిక్ష సన్నుతించుచు నధిపా. 3. క. డజ్ఞనినవ్వో.

ద్బలంబుఁ దఱిమె నంత నమ్మద్రపతి యొండురథంబు గల్పించుకొని కడంగి యా
క్కౌంతేయాగ్రజుపైఁ గంకపత్త్రంబులు నిగిడించుచు నిగిడినం గని యద్దెసఁ జేయఁ
గలసైనికోత్తములు సరభసంబున నయ్యోధవరు నెదుర్కొని రప్పు డతండు సాత్య
కిఁ బదిసాయకంబులను భీమసేననకులసహదేవుల శరత్రయంబులను స్రుక్కించి
యెక్కుడుమదంబునం బొదలినయంగంబులతో నలిరేఁగి మఱియు నప్పుడు పొగ
డం దగి యుండె నాకర్ణింపుము. 254

సీ. కమలాకరములీలఁ గలఁచి యాడెడుగంధ, దంతావళముసముద్దండతయును
దర మిడి మృగసముత్కరము ఘోరంబు గా, వధియించుకంఠీరవంబునేపు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ, గాల్చుదావాగ్నియుగ్రక్రమంబు
ప్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ, యించుఫాలాక్షునిరయ మెత్తెఱయును

ఆ. [1]బోల్పఁ బట్టు లయ్యె భుజగర్వశౌర్యప్ర, తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య, హనన కేళి సలుపునవసరమున. 255

వ. ధర్మనందనుం దల మిగిలినచతురంగంబుల నవ్విధంబున వినిహతంబులు సేసి
యమ్మహీపతిపైఁ గవిసినం గని కవలును శైనేయుండును భీమసేనుండును దోడ
నడువ నతం డమ్మేటిమగని మార్కొని పటుమార్గణంబు లురంబున నించి
నొంచె నప్పుడు కురువిభుండు పనుప మనసైనికులు దలమిగిలి శల్యునికిఁ బ్రాపయి
యప్పవనతనయప్రభృతులతోడఁ బెనంగి రతం డాపాండవాగ్రజుమేనఁ జండ
కాండసప్తకంబు నినిచిన నజ్జననాథుండు నవనిశితనారాచంబు లవ్వీరునంగంబుల
నాటించె నిట్లు దలపడి కోలుపులులపోలికఁ బేరేనుంగులతెఱంగున బలుసింగం
బులచందంబునం బోరి యొండొరుల నొప్పించి రప్పుడు. 256

సీ. శల్యుండు బలునారసము పాండవాగ్రజు, నురమున నాట నత్యుగ్రదీప్త
ఘోరనారాచ మాకుంతీసుతుం డేయ, నతఁడు మూర్ఛిల్లిన నలరె [2]నధిపుఁ
డమ్మద్రపతి తేఱి యలుకఁ గెంపారెడు, కనుఁగవతోఁ జండకాండ మొకట
నయ్యుధిష్ఠిరు నొంప నాతండు పసిఁడిమై, మఱు వాఱుతూపుల నఱికి వైచి

తే. వాలురమ్ములు దొమ్మిది వక్షమున ని
గుడ్ప నయ్యోధవరుఁ డతికూరభల్ల
యుగళఖండితచాపుఁ జేయుడును నొండు
ధనువు గొని యవ్విభుండు దత్తనువు సించె. 257

క. బాసట యై భీముఁడు పై, ల్లేసెను మద్రపతి నాతఁ డిసువురతోడం
జేసెం గయ్యము గృపును, ద్భాసితవిక్రమముతోడు పాటు గలుగఁగన్. 258

వ. అట్టియెడఁ గంకటాంతరంబు ధరియించి కడంగి. 259

ఆ. మద్రవిభుఁడు ధర్మమారుతసుతులమై, మఱువు లుఱక నఱికి మార్గణములు

1. గ. బోల్పఁ బట్టు గాఁగ. 2. చ. నధిప యమ్మద్ర.

దొమ్మిదింట రెంటఁ గ దూఁటులు సేసి దోర్దండములు ప్రదీప్తదర్పుఁ డగుచు.

క. ఆలో ధర్మజుసారథిఁ, గూలఁగఁ గృపుఁ డేయ మద్రకుంజరుఁడు భుజా
లీల మెఱయంగ హయములు, ల్నాలుగు నొక ప్రేల్మిడిని నిలం బడవైచెన్. 261

వ. ఇవ్విధంబున విరథుం డై యమ్మహీకాంతుం డంతర్గతంబున. 262

క. గెలుపును శల్యుని నీ వని, పలికి ముకుందుండు నన్నుఁ బనిచినవాఁ డ
ప్పలుకులకు నసత్యత్వము, గలుగఁగ నేర్చునొకో దైవఘటనబలమునన్. 263

వ. అని శంకించియుఁ గొంకుపోవక యజ్జగన్నాథువచనంబునకు నన్యథాత్వం బేల గలుగు నని యద్దేవునిం దలంచి యామాట యమోఘంబు గావలయు నని ప్రార్థించి వెండియు. 264

చ. స్ఫురితషడర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణుం గుణా
దరసముపాత్తమూర్తిఁ గలితప్రభవస్థితిసంహృతిక్రియా
నిరతి[1]వివర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్దిన
ప్పురుషవరుం జతుర్భుజు విభుత్వమహోన్నతు నాశ్రయించెదన్. 265

తే. భండనము సేయునరునగ్రభాగమునఁ బ్ర, చండశూలోగ్రహస్తుఁ డై శత్రుకోటి
గీటడంచుచు నేఁ జూడఁ గేలి సలుపు, దేవు జయసిద్ధికై సన్నుతింతు భక్తి. 266

వ. అనుచుఁ బురుషోత్తమునిఁ జిత్తమున నిలిపి యున్నతం బైనపూర్వకాయంబుతో మందప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతిదెస నిగిడింప నతఁ డది బెండువడుట గాఁ దలంచి తఱిమి యతిముతి శరంబులు గురియుటయు నప్పుడు. 267

చ. పవనసుతుండు విల్ నతికి బాణయుగంబున మేను నొంచి శా
త్రవులు దలంక నారథికురథ్యములం ధరఁ గూల్చి సూతుకం
ఠవిదళనం బొనర్చి ప్రకటస్ఫురణంబునఁ గంటకంబు భ
ల్లవితతి ఘోరసంహతి నిలం బడ నేసె రయం బెలర్పఁగన్. 268

వ. ఇవ్విధంబున. 269

క. విరథుండు నచాపుఁడు వర్మరహితగాత్రుండు నై నమద్రవిభుఁడు భా
సురఖడ్గచర్మశోభితకరుఁ డై తేరు డిగి కన్నుఁగవఁ గెంపారన్. 270

మ. జముచందంబున నేచి ధర్మసుతుపై సంరంభదుర్దాంతద
ర్పమునన్ వేకవియంగఁ జండబలదుర్వారుండు భీముండు ద్రుం
చె మదం బారఁగ వాలునుం బలకయున్ శీఘ్రత్వసందీప్తుఁ డై
తమది క్కార్పులుఁ దూర్యనాదములు నత్యంతంబు శోభిల్లఁగన్. 271

వ. అమ్మద్రపతి నేర్పుమ జేవయుం గలపరిజనంబులు చేర్పఁ గంకటగదాదండంబులు ధరియించి యుధిష్ఠిరుమీఁద నురవడి నడరె నప్పు డప్పాండవాగ్రజునకు భాసట యై సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయమాద్రేయు లేయు

1. అ. నివర్తితత్రిభువనీ.

దేవుండు గదయును బ్రయోగించిన నయ్యోధవరుండు వాని నన్నింటిని మింట
మెఱుంగు లడరు వెడఁదయమ్ములు పరఁగించి త్రుంచి యార్చినం బేర్చినరోషంబున
నాకృష్ణానుజుండు సారథి మూఁడువాఁడితూపుల నవ్విరోధి రెండుబాణంబుల బె
ట్టేసినఁ గ్రోధదీప్తుం డై ప్రచండకాండంబుల నయ్యేవురను స్రుక్కించిన నీపుత్త్రుం
డతనిచేతఁ బాండుపుత్త్రులు పొలియుదు రని తలంచె నట్లు భాసమానుం డైన
సేనాపతిం గని భీమసేనుండు సహింపక తెంపున బెట్టు గిట్టిన. 202

క. శినిమనుమఁడుఁ గవలును దో,డన యురవడి నడరి పొదువుకొనియు నగ్గలికం
బెనఁగె నతం డానలువుర,కనలుఁ గడంకయును సరకుగాఁ గొన కధిపా. 203

వ. ఇట్లు పెనంగుచుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చినచంద్రసేను
తోడివాని ద్యుమత్సేనుఁ దల ద్రెవ్వ నేసినఁ జక్రరక్షకహీనుం డయ్యును బొలి
వోనికనలున శల్యుండు నటలు వెఱికినం గోపించుసింగంబుచందం బై సమీరణ
సుతాదు లగుజోదుల నలువుర యంగంబులఁ దురంగనికరశరీరసారథినికాయసహి
తంబుగా బహువిధవిశిఖంబులు పరఁగించి నెత్తురులు దొరఁగించినం గని యా
ధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున. 204

క. హరివచనంబు లసత్యతఁ, బొరయఁగ నేర్చునొకో మద్రభూపతిబాహు
స్ఫురణము భీమాదిరథిక,వరు లోర్వనియట్లు గాఁగ బ్రాలెడిఁ దోడ్తోన్. 205

వ. అని తలపోసి తనబలంబునకుఁ జేయి వీచినఁ దోయధివీచివితానవిలాసంబుచందం
బునఁ జతురంగంబులు శల్యుపైఁ గవిసిన నాధైర్యధౌరేయుండు మందరనగంబు
లీలఁ గైకొని వారలం గలంచి పాంచాలపుత్త్రప్రభృతియోధప్రకరంబులను బాండ
వాగ్రజునిం బరమసాంద్రతీవ్రశరాంధకారంబునఁ గప్పి సింహనాదంబు నేసిన. 206

క. దివిజగరుడఖచరాదులు, వివిధవచనరచన లెసఁగ వినుతించిరి శా
త్రవభీకరుఁ డగు నమ్మ,ద్రవిభునిరణవిహరణములు ధరణీనాథా. 207

వ. ఆసమయంబున. 208

తే. గురుసుతుఁడు పెనుఁబ్రాపుగాఁ గనరునిఁ బొదివి, యధిప సంశప్తకులు వివిధాస్త్రతతులఁ
గప్పి రతఁ డందఱను జండకాండవిదళి, తాంగులుగఁ జేసె దోర్లీల నతిశయిల్ల.

చ. తెరలక వారు పైపయి నుదీర్ణసముద్ధతిఁ గ్రమ్మి వాజులన్
బొరిని సిడంబుపైఁ గదియ నాతఁడు నేడ్పడ బాణవర్షముం
గురిసిరి కౌరవేంద్రుమొనలకుం బ్రమదం బగుఘోరభంగి న
ప్పురుషపరాక్రమస్ఫురణ పార్థివసత్తమ కాన మెయ్యెడన్. 210

వ. ఇట్లు సవ్యసాచికిఁ జే యొగ్గ రాకుండ దర్పంబు సూపిన నాభూవరకుమారవర్యుం
డు వీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్రక్షురికాముఖ నారాచప్రముఖవి
శిఖ పరంపరలు పరఁగింప నవి యాసైనికులరథ్యంబులు గూల్చియుఁ గేతనంబులు

ద్రుంచియు బాణంబులు నఱికియు బాణాసనంబులు విఱిచియు సూతుల గీటడం
చియు నరదంబులఁ జెక్కియు మైమఱువులు పొళ్లు సేసియుఁ జామరంబులు దుని
మియు నాతపత్రంబులు రూపుమాపియు నెత్తురు లురలించియుఁ గండలు దొరఁ
గించియు నెమ్ములు వగిలించియుఁ గాళ్లు ద్రుంచియుఁ జేతులు దునిమియు వ్రయ్య
లుగా వక్షంబులు సీఱియు మర్మంబులఁ జొచ్చియు మకుటంబులు డుల్చియుఁ
దలలు రాల్చియుఁ బ్రాణంబులు పీల్చియు రౌద్రం బావహించినలయకాలరుద్రుని
సంక్రీడనంబుచందంబు దోఁచె నప్పుడు రథికవరసహస్రద్వితయంబు దెగటార్చె
నవ్వాఁడిమగండు పేరడవి దహించుదావపావకునిచందంబున వెలింగెఁ దదీయ
తేజోమహిమ సహింపక యుద్ధామగతి నశ్వత్థామ గదిసి యక్కవ్వడిం దొడరి
దురం బొనర్చె నందు. 211

సీ. అతఁడు పండ్రెండువాలమ్ము లాబీభత్సు, మెఁయి గ్రుచ్చి కృష్ణునిమేనియందుఁ
బదివాఁడితూఁపులు పఱపిన మదిలోన, నగ్గించి యవ్వీరుఁ డలఁతినగవు
తోడ రథ్యముల సూతునిఁ గూల్చి యాతని,తనువున నెఱతెగ గొనక నాఱు
మూఁడుమార్గణములుముసలంబు పరిఘంబు, నాతఁడు నిగిడింపనదియునదియు

తే. నన్నరుఁడు దోడుతోడ నైదాఱునిశిత
కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు
సొనిపె నవ్విప్రుమేన మార్కొనియె నపుడు
గడఁగి యప్పార్థు సంశప్తకవ్రజంబు. 212

వ. అట్టియెడ. 213

సురథుఁ డనుపాంచాలకుమారుం డశ్వత్థామచేఁ జచ్చుట.

క. సురథుఁడు గురుసుతుపైఁ దన,యరదము వఱపించి యేయ నప్పాంచాలో
త్తరు నొకనారసమునకును నెర సేసె నతండు గినుకమెసకం బెసఁగన్. 214

వ. ఇత్తెఱంగున. 215

అ. సురథుఁ గూల్చి యతనియరదంబుపైకి ను,ద్ధురత నరిగి గురుసుతుండు చండ
కాండసమితి నిగుడ గాండివిఁ దాఁకి సం,శప్తకులకు సంతసం బొనర్చె. 216

వ. అయ్యవసరంబున. 217

క. కురుపతి ధృష్టద్యుమ్నుని,యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్
శరపంచకమున నొంచెను, బరఁగించెను మఱియు నవతిబాణము లొడలన్. 218

తే. అతఁడు డెబ్బదియమ్ముల నతని నొంప, నన్నరేంద్రుండుఁ జేడ్పడ ననుజసమితి
బలయుతంబుగనడరి యబ్బలియుమీఁదఁ, గురిసి రస్త్రశస్త్రంబులు నరవరేణ్య.

క. ఆపాంచాలోత్తముఁ డు,ద్దీపితకోపుఁ డయి వారిఁ దీవ్రతరశరా
టోపంబునఁ గలఁచె రయం, బేపారఁగ నాత్మసేన కేర్పడ మెఱయన్. 220

చ. కృపకృతవర్మలం గడిమిఁ గిట్టె శిఖండి ప్రభద్రకుల్ మహో
గ్రపువడి దోడ్పడంగ భుజగర్వము సూపిన నాబలాఢ్యులుం
గుపితమనస్కులై బలువుఁగోల్తలఁ బేర్చినలావు చేవక
య్యపువెర వేపు దాల్మి సరి నచ్చెరుపాటున ముంచెఁ జూపఱన్. 221

వ. అప్పుడు శల్యుండు యుధిష్ఠిరభీమసేననకులసహదేవసాత్యకిప్రముఖులపైఁ బటు
బాణంబులు గుప్పించి నొప్పించిన. 222

క. నకులుఁడు రభసంబున సాయకదశక మతనియురంబునందుఁ జొనుప స
భ్రూకుటి యగుచు నయ్యల్లునిఁ, ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా.

క. తక్కటినలువురు వాదివిన, నొక్కొకనిశరీరమున మహోగ్రాస్త్రంబుల్
పెక్కులు వెసఁ బఱపి మదం, బెక్కి నకులుధనువు దునిమె నిషుసహితముగన్.

వ. ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి. 225

మ. నకులుం డొండొకచాప మెత్తి పటుబాణశ్రేణిఁ బర్వింపఁ గీ
చకవిధ్వంసి నిగిడ్చె షష్ఠిశరముల్ శైనేయుఁ డుద్దీప్తసా
యకముల్ దొమ్మిది యేయ ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా
యకుపై నన్నియుఁ బిన్నతమ్ముఁడును దోడై నాట నాటెం గడున్. 226

తే. అతఁడు వెస నవసప్తతిశితశిలీముఖముల సాత్యకి నొంచి మార్గణముతోడ
ధనువు ద్రుంచి రథ్యమ్ములధరణిఁగూల్చి,పదిపదుల్ బలుఁదూపులు పఱపె మేన.

క. ఇవ్విధమున శినివీరుని, క్రొవ్వు చెఱిచి పాండుపుత్రకులబాణంబుల్
నివ్వటిల నీక నలువుర, నవ్వీరుఁడు నొవ్వ నేసె నద్భుతభంగిన్. 228

ఉ. పాండవు లట్లు మద్రపతిబాణములం దెరలంగఁ జూచి తా
నొండొక తేరికిం జని సముద్ధతి సాత్యకి దాఁకె నాతనిం
జండతరప్రచారణవిశారదుఁడై వెస వారు గూడి యు
ద్దండత సూపి రక్కజపుదర్ప మెలర్పఁ బెనంగె నాతఁడున్. 229

ఉ. ఏవురతోడ నట్లొకఁడ యేచి పెనంగుటఁ గౌరవేంద్ర యో
ధావళి చూచి కూడికొని యారథికోత్తముగాథవిక్రమ
శ్రీ విలసిల్ల నంపెనుఁజీఁకటి యాకస మెల్లఁ గప్పఁగాఁ
జేవయు లావుఁ జూపుటయుఁ జేడ్పడి రాప్రతివీరు లందఱున్. 230

వ. సేనయు నొక్కుమ్మడి నద్దిక్కు [1]దఱిమినం గని కృష్ణార్జునులు నిజసైన్యంబు సమ
స్తంబు నేకముఖంబు సేసి మార్కొని రాసమయంబునఁ గిరీటి కృపకృతవర్మ
లను సహదేవుండు సౌబలుని ద్రౌపదేయులు గొందఱురాజులను శిఖండి యశ్వ

1. జ. మొగంబై తఱిమినం.

త్థామను భీమసేనుండు సుయోధనునిఁ దాఁకఁ బాండవాగ్రజుండు దనకు నకు లుండు బాసట గా శల్యు నిలువరించెఁ దక్కనుం గలయోధులుం దక్కటిసైని కులుం దలపడి క్రమంబున, నెల్లబలంబును గలయఁ బెరసె నిట్లు నూల్కొని యంతంతకు రణంబు సమ్మర్దదారుణం బయ్యె న త్తఱి నమ్మద్రపతి రౌద్రంబు రూపు దాల్చిన తెఱంగునం బొంగి పాంచాలయాదవాదిరథికవరులకును బాండు కుమారులకును వారింపఁ గొలఁది గాక రథచిత్రగతులు మెఱయ నెక్కడఁ జూచినం దాన యై నానావిధవిశిఖవితానంబుల నంబరభాగంబు సంపిహితంబు సేసిన మధ్యందినగతం బయ్యును మార్తాండబింబంబు దోఁపకయుండె నట్టియెడ.

సీ. కరులఁ ద్రుంచెడువేళఁ గిరులఁ దున్మాడుసం
 క్రందనుకైవడిఁ గానవచ్చు
నరదముల్ దెరలించునప్పుడు పఱిమొగుల్
 విరియించుబలుగాడ్పువిధము మెఱయు
హయములఁ జెండాడ నరుగుచోట్లను లేళ్ల
 గమిఁ గిట్టుకోల్పులికరణి యొలయు
భటులకు నరుగుచోఁ బస లేనిపెనుఁగాన
 దరికొనుచిచ్చుచందంబు గలుగుఁ
తే. గసి మసంగినయంతకుకరణి యంత్య
కాలరుద్రునిదర్ప మకాండమృత్యు
ముఖమునుగ్రభావము దోఁచు మొనయు వీర
సమితిఁ దెగటార్చునప్పు డాశల్యునందు. 232

వ. ఇట్లు విజృంభించి యత్యద్భుతవిక్రమంబున నుల్లసిల్లునమ్మద్రమహీపతి నుభయ సైన్యంబులజనంబులు ప్రశంసించి రంతకంతకు నగ్గలం బగునగ్గలికఁ జెలంగి యతండు భల్లాదికాండపరంపరలు పటురయంబునఁ బరఁగించుపరమాభీలభంగికి నోహటించి ధర్మజుమోహారంబు దెరలి మరలి పఱవం దొడంగిన నన్నరవరుం డదల్చి కరతలం బెత్తి నిలు నిలు మని నివారింప నిలువ దయ్యె నయ్యుధిష్ఠిరుండు పౌరుషంబు పెంపునఁ దెంపు సేసి మామా యని పేరెలుం గెత్తి యాశల్యునిఁ దాఁకి దర్పంబు సూపినం జూచి మగుడ నిగిడి సేన పోరికిఁ బురికొనియె నప్పుడు పాండవాగ్రజుండు దమ్ములను దొరలను దనపాలికిఁ బిలువం బంచి వారలతో ని ట్లనియె. 233

చ. అమరనదీసుతాదు లగునక్కడివీరుల మీర లందఱుం
గ్రమమునఁ బిల్కుమార్చి భుజగర్వము సూపితి రేను శత్రుసై
న్యమథనకల్యు శల్యుఁ దెగటార్చెద నా కిది కృత్య మీసము
ద్యమ మనివార్య మై నెగడునట్టితెఱంగు వినుండు చెప్పెదన్. 234

నరుఁ డబ్బలంబునకు ని,ష్ఠురగాండీవముక్తశరపటుత్వము సూపెన్. 311

క. నకులసహదేవులును సా,త్యకియును రభసమున వాలుశరమ్ములు నిగుడన్
శకునిపయిఁ గవిసి రతఁడును, బ్రకటస్ఫురణంబునం దిరం బై పోరెన్. 312

చ. సమదగజాధిరూఢుఁ డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో
టములఁ గలంచుచున్ గజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి
త్రము గ వధించుచున్ రథకదంబములన్ సమయించుచున్ మహో
గ్రముగఁ జరించువిస్ఫురణఁ గన్గొని కోపసముద్భటాకృతిన్. 313

ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాల్వుఁ డేనుంగుతోడఁ బీనుం గై పడుట.

వ. ధృష్టద్యుమ్నం డెదుర్కొనిన నతనిఁ ద్రొక్కించువాఁ డై యవ్వీరుండు వారణ
పతిఁ గొల్పిన నతండు. 314

మ. పటునారాచచయంబు కుంభయుగళీభాగంబునన్ బెట్టు నా
టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము సాటోపంబుగాఁ గ్రమ్మఱిం
చుటకున్ సాల్వుని మెచ్చఁ గన్గొనుజనస్తోమంబు కోపోద్గమో
ద్భటవేగంబున వచ్చి పట్టె నది యాపాంచాలు తే రుగ్ర మై. 315

క. ఆతఁడు గద చేతం గొని, భీతి గదురుమనముతోడఁ బృథ్వికి దాఁటన్
సూతాశ్వసమేతంబుగ, నా తే రయ్యేనుఁ గెత్తె నాకసమునకున్. 316

ఆ. ఎత్తి త్రిప్పి యాడి యిలతోడ వ్రేసి పా,దములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర
తతులు నిగుడఁ బవనతనయశిఖండిసా,త్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున.

క. అతఁ డందఱబాణంబులు, వితథంబులు సేసి యస్త్రవిద్యాపారీ
ణత సూపె నవ్విధం బ,ద్భుతము [1]నినిచె గగనచరతతులచిత్తములన్. 318

వ. అప్పుడు. 319

తే. [2]అజ్జ పాటించి మది వెఱయుజ్జగించి, రయము మెఱయ నప్పాంచాలరాజసుతుఁడు
గదిసి మొగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ, గొండ గూలిన ట్లక్కరి గూలె నధిప.

క. ఆలోనన శినివరుఁడు వి,శాలాస్యప్రదరనిహతి సాల్వునిశిర మా
భీలముగఁ ద్రుంప నాతఁడు, గూలిన మనమూఁక విచ్చెఁ గురువంశనిధీ. 321

ఉ. వాలి మెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
న్మీలితవిక్రముం డగుడు మేమెయి నాతనిఁ దాఁకె నస్త్రవి
ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు పోర వారిదో
ర్లీలలు సూచి రోటువడి రెండుబలంబులయోధవీరులున్. 322

వ. ఇట్లు పెనంగుచుండి. 323

క. కృతవర్ము నొంచె నెనిమిది, శితశరముల శినివరుండు శినివరుచాపం
బతఁడు దునిమె బలువిలుగొని; యతనిహయంబులను సూతు నాతఁడు గూల్చెన్.

---

1. గ. బెనిచె. 2. క. గ. లజ్జ... వెఱ బుజ్జగించి.

మ. విరథుం డై యభిరామశూలమున నశ్వీరుండు శైనేయు నై
చె రయుం బార నతండు భల్లమునఁ ద్రుంచెం బెక్కుతుండంబు లై
తొరుఁగం జూచి విషాది యై నిజరథస్థుం జేసి తచ్చాణగో
చరతాదుర్దశ కావృథోద్యముఁ గృపాచార్యుండు తప్పించినన్. 325

క. మనసేన విఱిగె నృప నీ,తనయుం డొక్కరుఁ డుదగ్రతరముగఁ గుంతీ
తనయుల నద్దెసఁ గలయో,ధని కాయముఁ బొదివె బాణధారలఁ బెలుచన్.

మ. పతి యిమ్మై సముదీర్ణవిక్రమకళాపారీణుఁ డై విద్విష
చ్చతురంగంబులయందు నొక్కటియు విస్ఫారోల్లసన్మార్గణా
హతికిం దప్పక యుండునట్లు గ సమగ్రాశ్చర్యసంపాదకో
ద్ధతబాహావిభవంబు సూపె సురబృందస్తోత్రపా[1]త్రోద్ధతిన్. 327

వ. అప్పుడు రెండువీళ్ల నతనిపాటిమేటిమగలు లే రనుబుద్ధి నాకుం బొడమెఁ బదం పడి పాండవులును జేయఁగలవారలును నవ్విధం బొదివిన నతం డందఱ కన్ని రూపు లై ధర్మసుతుని శతశరంబులను భీమసేను డెబ్బదిసాయకంబులను సహదేవుని నైదింటను నకులు నఱువదినాల్గింటను ధృష్టద్యుమ్నుని సప్తమార్గణంబులను ద్రౌపదేయుల నైదైదుతూపులను సాత్యకి మూఁడుకాండంబుల నొప్పించి సహదేవుధనువు దునిమిన నక్కుమారుండు వే ఱొక్కవిలు గొని చలంబున నక్కురువిభుం గదిసినఁ దక్కటిరథికులుం గూడికొని యొక్కొక్కరుండు పెక్కమ్ములు పైఁ గురియఁ గేలిచందంబున వాని నన్నింటి వారించుచుఁ దత్తనువుల శోణితంబు పూరించుచు నాజెట్టిజోదు బెట్టిదుం డై పెనంగ మనయోధులుం బురికొని యద్దొరల మార్కొనిరి మనసైన్యంబు దైన్యంబు విడిచి మరలి వారి బలంబులఁ దలపడియె నట్టియెడ. 328

క. భీముఁడు గురుతనయుఁడు ను,ద్దామభుజావీర్యశౌర్యధైర్యములు జన
స్తోమము లగ్గింపఁగ సం,గ్రామ మొనర్చిరి నితాంతగాఢస్ఫూర్తిన్. 329

చ. పరుషపరాక్రమస్ఫురణఁ బాండవముఖ్యునివాజులం జతు
ష్కరహతిఁ గూల్చె సౌబలుఁడు సత్వరుఁ డై సహదేవుఁ డమ్మహీ
శ్వరుఁ దన తేరిమీఁద నిడి సంగరమధ్యము వాపె నాతఁ డొం
డరదముమీఁదికిం జని రయంబున నయ్యరిఁ దాఁకె నుద్ధతిన్. 330

క. శరములఁ బొదివిన నాతఁడు, దిర మై యేయంగ రణము దివిజగరుడఖే
చరసిద్ధప్రకరాద్భుత,కర ప్రకారమున నొప్పెఁ గౌరవనాథా. 331

సీ. శకునినందనుఁడును నకులుండు నొండొరు,లకుఁ జండబాహుబలంబు సూపి
రతులశౌర్యమున సాత్యకికృతవర్మలు, పోరి విలు ద్రుంచి కౌరవేంద్రుఁ
[2]డేసె ధృష్టద్యుమ్ను నేచి యొండొకవింట, నతని నాతఁడు నొంప నక్కజంపుఁ

1. గ. త్రస్థితిన్. 2. ఆ. డెసఁగ ధృష్టద్యుమ్నుఁ జేసె నొండొక.

గయ్యమయ్యిరువుర కకమ్యొ ద్రౌపదిపుత్త్రు, లేవురు పతిఁ గిట్టి క యింద్రియములు
తే. బాలిశునిఁ జిక్కువఱచినకపగిది దలరఁ, జేయ నతఁడేఁడఁబోవక క సాయకములు
పెక్కురయమున నిగిడించికయక్కుమార, వితతిఁగలపఁ దత్సంగరకమతిశయిల్లె.
వ. మఱియు ననేకు లనేకులం బొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చినయగ్గలిక మొగ్గ రంబులు రెండును గలయఁగఁ బెరసినం బేర్చిన పెందూళి భానుబింబంబుగప్పి యప్పు డు దొరుఁగునరతురంగమాతంగరుధిరధారల నడంగిన నధికం బైన సంగరంబు నకుం గడంగినకౌంతేయులయురవడికి నోహటించి మనమోహరంబుదొరలు మరలిన మరలనీక నీకొడుకు పురికొలుపుకొని తఱిమినం గనలి ధర్మనుతుండు.
తే. మూఁడునారాచములఁ గృపుకవాఁడి చెఱిచి
వాలి కృతవర్మ హయముల్ల క నాలుగింటఁ,
గూల్పఁ దన శేరిపై నిడి క గురుసుతుండు
దొలఁగఁ గొంపోమె నవ్విరకథుని నృపాల. 334
చ. కురుపతి చూచి చిత్తమునఁ క గోపము పెంపెసలార నేడునూ
అరదము లాతనిం బొదువుకనట్లుగఁ బంచిన నొక్కపెట్ట బం
ధురతరవారివాహములు క తోయజబాంధవుఁ గప్పుచాడ్పు దోఁ
ప రయముమైఁ గడంగి యవి క పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్. 335
క. కనుఁగొని శిఖండిముఖయో, ధనికాయం బడరి యారకథప్రకరంబుఁ
సునిశితశరప్రకరములఁ, దునుమాడెఁ రౌద్రరసము క దొలఁకాడంగన్. 336
వ. ఆసమయంబున మనదెస నుల్కాపాతశర్కరావర్షాదు లగునుత్పాతంబుల్లు గలిగె వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీరు కోట్లల నేయుం డేను [1]వెడముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద నంచు సముద్ధతిం గదిసె నప్పుడు మద్రేశబలపురస్సరం బైనయమ్మోహరంబు రభసంబునం దఱిమి పాండవసేనాసంరంభంబున కోర్వక తిరిగిన నాసుబలసూనుండు ప్రబలతురంగ దశసహస్రంబులతో వేగంబు మెఱయ వైరిసేనవెనుకఁ గిట్టి యేను గలుగ మీకు భయం బేల యని యక్కారవసైనికులం బేసుకొని యదల్చి యార్చిన నాకౌంతేయవాహిని కలంగిన ధర్మనందనుండు సహదేవు నాలోకించి. 337

శకునిసహదేవు లాశ్వికసహాయు లై ఘోరంబుగాఁ బోరుట.

ఆ. వేగ తాఁకు మైదుకవేలగుజ్జంబులు, దౌపదీతనూజకతతియు నీవు
శకుని ననుడు నతఁడు కసంరంభజృంభి మై, యట్ల చేయ ఘోర కమమ్యెఁ బోరు.
వ. అట్టియెడ. 339
సీ. లీలఁ గట్టియలొడఁ క గూలంగ వైచియు, డొంకెనపోటులఁ క బొంక మడఁచి
పడఁద్రోచి[2]యును వాలఁకగడికండములుగ వ్రే, సియుఁ గఠారంబులఁ కజీఱి చెఱిచి.

1. గ. జ. బెడముట్టున. 2. అ. జ. వాలునఁ గడికండలుగను వ్రేసియుఁ,

గీటడంగించియుఁ గ గిట్టి యొండొరుఁ బట్టి,కొని మల్లుచందంబు గ ననికిఁ జొచ్చి
నేలకు వంచియుఁ గ గేలిమై [1]గళముపై, నెక్కియుఁ బెక్కండ్రు గరొక్క మొగిన

ఆ. మెక్కుటయు సహించి గయుక్కునఁ బెనఁగియు, నుఱక వివిధగతుల గనుబ్బి చెలఁగి
బొమ్మలాడినట్లు గ [2]పోరి యారావుతు, లధిప నెఱయ మెఱసి గ రందు నిందు. 340

వ. మఱియు ననేకప్రకారంబుల భండనంబు సేసిరి పదంపడి యమ్మాద్రీకుమారుని
వీరోద్రేకంబునకు నోహటించి గాంధారీసోదరుం డాఱువేలతురంగంబులతోడం
దిరిగె నతండును ద్రిసహస్రహయశేషసేనాసమేతుం డై యన్నకడ కరిగె నా
సౌబలుండును జట్టి వచ్చి ధృష్టద్యుమ్నుని మొనపైఁ బడిన నతండు సైన్యసము
ద్దండసంరంభం బెసంగ విక్రమాటోపంబు సూపినయపుడు పంచసహస్రత్రిశత
హయంబులు వడిన రౌద్రంబు రూపు దాల్చిన ట్లాయుధఖండనాస్థిభంజనశబ్ద
శ్రవణంబునను రక్తమాంసమేదోస్థిమస్తిష్కమజ్జాసమ్మేళనదారుణరణతలదర్శ
నంబునను దదీయవిస్రగంధాఘ్రాణంబునను యోధులు వీతచేతస్కు లైరి తెగిన
తల యొకచేతను నెత్తుట జొత్తిల్లినకరవాలం బొకకరంబునను బట్టుకొని యట్ట
లాడినట్లు పెనంగి యాశకుని హతావశిష్టంబు లైనశతాశ్వంబులతోడఁ దొలంగి
యచ్చటిజనంబులతోఁ గురుపతి యెచ్చట నున్నవాఁ డనిన వార లి ట్లనిరి. 341

ఉ. అల్లదె కంటె పూర్ణశశి గయట్లు కడుం జెలు వొందెఁ జూడఁ బే
రెల్లి రథప్రతాన మదె గ యేపున సంగరకేలిఁ జాల శో
భిల్లెడు నయ్యెడ గ రిపువి గభీషణవిక్రమణప్రకారగా
ఢోల్లసనుండు భూపతి మ గహోన్నతి నొప్పెడుఁ బొమ్ము చెచ్చెరన్. 342

వ. అనిన విని తల యెత్తి చూచి తత్ప్రదేశంబున కరిగి యద్ధరణీశుం గని యతని
కి ట్లనియె. 343

క. పొలియించితి నే గుఱ్ఱం,బులఁ దేరుల కుటికి యింక గ భూరిరయమున గ
బొలియింప వలయుఁ బ్రాణం,బులు డాఁచిన వశమె పాండు గపుత్త్రుల గెలువన్.

వ. రథంబులు గజంబులు దెగినం గాని కాలుబలంబుల సమయించుట పని గా దనిన
నమ్మాటకు సైనికులు సంతసం బంది బరవసంబు సేయ నమ్మహీనాయకుండు
సముత్సాహదోహలి యై తఱిమిన మూఁకలు కడంక మెలర్ప దర్పస్ఫురితంబు
లగుచు నురవణించినం గని గాండీవి గోవిందున కి ట్లనియె. 345

క. మొనసి చనుదెంచుదుర్యో,ధనసేనాసముదయంబుఁ గ దఱియ నురవడిం
జననిమ్ము మనరథము నా,సునిశితబాణముల సమయఁ గ జూచెద దీనిన్. 346

దుర్యోధనుహర్షం బుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట.

వ. అనుచు నమ్మొన యాలోకించి నిరూపించి. 347

క. పెనఁకువ మెడత్రెవ్వక పదు, నెనిమిదిదివసములు సిల్లె గ నేఁ బెనఁగంగా

1. క. గ. దళముపై. 2. గ. పొలియు నా రావుతు.

సాయకంబులు సరకుగొనక గదం జిత్రంబుగా జడియుచు వడముడివిక్రమంబునఁ దవులంబడక నిగిడె నశ్వసూతరహితం బగురథంబుపై నున్నయన్నరేంద్రుండు తనదెసకు సింహచంక్రమణత్వసుందరుం డై వచ్చునవ్వీరు నాలోకించి సక్రోధం బై నయవష్టంభంబున నుద్దీపితుం డై. 272

క. ఇతని సమయింప నచ్యుతుఁడు ననుం బనిచె నాకు నొనరించినపా
లితఁ డని తలంచి మొగ ముగ్రత నొందఁగ శక్తిమీఁదఁ గనుదో యొలయన్.

వ. హృషీకేశు నుద్దేశించి. 274

ఉ. నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడుభక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె భక్తజనాభిమతప్రదానవి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నాపయి నిల్పు మిత్తఱిన్. 275

వ. అని హృదయంబునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు. 276

ఉ. అచ్చపుభక్తిక్రిఁ మతిఁ బ్రియంబున నొందినఫాలలోచనుం
డిచ్చినఁ బ్రీతియోగమును నెక్కుడుభక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్ఠ మెయిం బరిశోభితార్చనం
బిచ్చుచుఁ దాను గొల్వ నుతి కెక్కినయమ్మహనీయశక్తికిన్. 277

మ. ప్రణతుం డై రభసోదయాభినవదర్పస్ఫూర్తి శోభిల్లుచు
[1]న్మణిదండద్యుతిమంజరీస్ఫురణము న్సంశోభిఘంటాపటు
క్వణనంబుఁ రిపుసైనికప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ
షణరేఖం [2]బగుదానిఁ బుచ్చికొని చంచన్ముష్టిదృష్ట్యుద్ధతిన్. 278

వ. అభిరామభీమాకారుం డై. 279

తే. నెరయుకినుకఁ బెన్వేఁడ యై నిప్పు లురలు
కన్నుఁగవ శల్యుఁ జూచిన నున్నయునికి
నతఁడు నీఱు గా కుండుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ. 280

వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రయదాహదోహలి యగుశూలాయుధులీల దోఁప దుర్నిరీక్షుం డై. 281

ఉ. ఘోరతరప్రకార మగుకుంచితబాహువిలాస మొప్ప వి
స్తారము వింత యానురము సారతరంబు గఁ జూచి వజ్రధా
రారుచిసన్నిభప్రచురరశ్మిలు పర్వఁగ బిట్టు వైచె న
ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్కృతికల్యు శల్యునిన్. 282

తే. అట్లు పాండుభూపాలకులనగ్రసుతుఁడు, మద్రనాథుని వైచిన రౌద్ర మెసఁగ

1. క. ఫణిరత్నద్యుతిమంజరీస్ఫురణమున్. 2. క. గ. బగుపాణిఁ.

గంకటముదూఱి వక్షంబుఁ గడచి వెన్నువెడలి చనియమ్మహాశక్తి పుడమిఁ జొచ్చె.

-ధర్మరాజు శక్తి ప్రయోగించి శల్యుని జంపుట.-

వ. ఇట్లు శక్తి వెడిదంపుటురవడి నుచ్చి పోయిన. 284

చ. క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్తమంగ మా
ప్లుతము గఁ జేయఁగా నతఁడు బోరగిలం బడి మేరుధరం గర
ద్వితయము సాఁచి ధర్మజుని దిక్కు శిరంబుగ వజ్రదారుణా
హతిఁ బడు భూరిభూధరమహాత్తరశృంగము భంగి భూవరా. 285

ఆ. భూమిమీఁద నిట్లు బోరగిలం బడి, మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
లేమ యురమునందు లీలమై వ్రాలిన, ప్రాణనాథుఁ [1]బోల్పఁ బట్టు గాఁగ. 286

ఆ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి, పొలిచెఁ జూడ మద్రభూవిభుండు
విధియుతంబు గాఁగ వేలిచి విడిచిన, నాఁటి యున్నయగ్ని ననుకరించి. 287

మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ
కిన నాభూపతి చిత్రచాపధరుఁడై కేళీసమప్రక్రియన్
ధనువుం గేతువుఁ ద్రుంచి తోడన సముద్యద్దీప్తభల్లాహతిం
దునిమెం గుండలకాంత మైనశిరముం దుర్దాంతదర్పంబునన్. 288

వ. ఇట్లు శల్యుండు సోదరసహితంబు గాఁ బడినఁ బాండవసైన్యంబు జనంబులు వృత్ర
వధం బొనరించు పాకశాసనుఁ బ్రశంసించు బృందారకులట్ల ధర్మనందను నగ్గించి
రమ్మొగ్గరంబునం దూర్యనినదంబులు సింహనాదంబులుఁ జెలఁగఁ గలంగి కురు
సేన విఱిగి పఱచినం బోసీక పొదువుం డనుచు సాత్యకి వెనుకొనుటయుఁ గనుం
గొని కృతవర్ముండు మార్కొనియె నయ్యాదవసింహులరణంబు దారుణం బయ్యె
నందు. 289

సీ. కృతవర్మ సాత్యకి నతిశితశరదశకమున నొంచి తురంగమముల[2]యుబ్బ
నుడిపి విల్లునుముటయును నొండువింట న,బ్బలియుఁ డాతని మేనఁ బదిమెఱుంగు
టమ్ములు వఱపి రథ్యమ్ముల నరదంబు, సూతుని నఱకినఁ జూచి కృపుఁడు
దన తేరిపైఁ బెట్టుకొని తొలఁగించె న,వ్వీరుపోరికి మాఁక వెఱచి పఱచెఁ

తే. గడఁగి వెనుకొన్న పాండవోత్కరమునొకఁడ, నిలువరించె నుద్దండుఁడై నీతనూజుఁ
డంత వేఱొక్క తేరెక్కి యరుగుదెంచి, తాఁకె హార్దిక్యుఁ డరిసేన తల్లడిల్ల.

వ. ఇట్లెదిర్చినఁ బేర్చినయలుకఁ బాండవాగ్రజుండు కృతవర్మనిఘోటకంబులను గీ
టడంగించినఁ గురునందనుం డాహృదికనందనుని నిజస్యందనంబున నిడుకొని య
వ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ము
లెమ్ములం గీలింప నతండు పదాఱుతూపుల నాభూపాలునిఁ దదీయతురంగంబుల
నేసె నాసమయంబున. 291

1. క. దలఁపఁ. 2. గ. యుబ్బ,డంచి విల్ వెసఁ ద్రుంచుటయు. 3. అ. సముద్ధతి.

తే. భద్రకరి నెక్కి చామరప్రకరవీజ
నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి
యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ
బొలిచె నెంతయు భవదీయపుత్త్రుఁ డధిప. 292

శల్యుచుట్టంబు లొక్కపెట్ట ధర్మరాజుం జుట్టుముట్టుట.

ఉ. అమ్మనుజేంద్రుముందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుచు
ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు ల
గ్రమ్ముగ వీఁకఁ దేరులు పొగడ్తకు నెక్కఁగ దీప్త మైనకో
పమ్మున నేచి పాండవులపై నడరం గని పేరెలుంగునన్. 293

వ. అన్నరనాథుండు. 294

తే. మీర [1]లెవ్వరు వడిఁదలమిగిలిచనఁగ, వలదునామ్రోలబలుపారినిలువుఁడనియె
వారు నిలువక పాండవబలముచేవ, దఱుఁగఁ జొచ్చి యుధిష్ఠిరుఁ దాఁకి రధిప.

వ. ఇట్లు చలంబున నవ్విభుం డలపడి వివిధాస్త్రంబుల నొప్పించినఁ గవ్వడియును వడముడియుఁ గవలును ద్రౌపదికొడుకు లేవురును గోవిందుతమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున నుద్దండచతురంగసమేతు లై యారథికులఁ బొదువుటయును వారు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్మదమకరప్రకరంబులవిధంబున విహరించి రట్లు పాండవసేనాక్షోభసంపాదు లగునాజోదులయాటోపంబు విలోకించి గాంధారపతి గాంధారేయు నాలోకించి. 296

తే. మద్రవిభువారి నమ్మెయిమార్తురాఁగి, కొనఁగమనకును పేక్షింపఁజనునెయనుడు
నతఁడు నామాట విన్నక వారరిగి రేమి, సేయువారము చెప్పు మౌచిత్య మనియె.

వ. అని నన్ను నాపరివారంబును రక్షింపను దగ వెఱంగింపను నర్హుండ వీవ కావె యనుమాట లాడిన నతండు ప్రీతుం డై బలపరిపాలనంబును గర్జంబు సెప్పుటయును దనపనిగా మనంబునం బూని యవి దోఁచునట్టియుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం బాపాదించి. 298

చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమలీల నరాతిసేన సా
చ్చినఁ బతి గావ కున్న నుపజీవులు మెత్తురె యన్నఁ గాతుఁ గా
కని బహుతూర్యనాదములు నార్పులునుం జెలఁగంగఁ ద్రోచి య
జ్జనపతి వీఁకమై నడరె సైన్యయుతంబు గ సత్వరంబుగన్. 299

క. అంత ధనంజయకిమ్మీ, రాంతకముఖయోధవరమహాస్త్రప్రకరం
బంతకుకడ కనిచెఁ బరి, శ్రాంతం బగుమద్రనాథురథికచయంబున్. 300

వ. ఇవ్విధంబున. 301

1. క. లేర్పడ వడిఁ దల- గ. లేర్పడ విడిదల.

మ. అరులం గీటడగించి పాండుసుతసైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం
గురుభూనాయకుసేన నొచ్చి కలయం గూలెన్ ధరన్ గుంపులై
తిరుగం బాఱఁగఁ జొచ్చె విచ్చె మరలన్ దిగ్భ్రాంతి వాటిల్ల స
త్వరతన్ నల్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లగన్. 302

క. మనవారి కపుడు భీష్ముని, చనుటయుఁ గోదండగురునిసమయుటయును గ
ర్ణునిపొలియుటయును గ్రొత్తై, మనమున [1]వెనుఁబాటు గదిరె మనుజాధీశా. 304

వ. అప్పు డద్దిక్కుజనంబులు.

చ. ధరణికి నింక నాయకుఁడు ధర్మతనూజుఁడు నేఁ డవశ్యముం
గురుపతి గూలు నెవ్వగలకుం గుచు రయ్యెడు నాంబికేయుఁ డు
ద్ధురు లగుపాండునందనులదుర్దమభంగి యెఱింగి ధర్మత
త్పరులకు గెల్పు బ్రాఁతె హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్. 305

వ. అని రట్టియెడ నీకొడుకు నిజసారథిం జూచి మనబలం బాహవంబున కోహ
టించి పాఱెడు నిత్తఱి నేను బరవసంబు సేసినఁ గాని నిలువ దవ్విధంబునకు
రథం బనువై యుండఁ జేసి చేరఁ దెమ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు
డిగ్గి రథం బెక్కి యెక్కుడుమగఁటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు
సని యెలుం గెత్తి. 306

ఉ. ఎక్కడఁ [2]బోవ వచ్చు గిరు లేనియుఁ గాననభూము లైనఁ దో
నెక్కియుఁ జొచ్చియుం బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్
ద్రొక్కక తక్క రట్లయిన దుర్గతి వాటిలుఁ బోక నిల్చి పే
రుక్కునఁ బోరినన్ సుగతి [3]యొందెను సంపద యొండెఁ జొప్పడున్. 307

వ. అట్లుం గాక. 308

క. పాండవబల మల్పం బై, యుండం గృష్ణుఁడు ధనంజయుండును డప్పిం
బెండువడఁగఁ గని మనకును, గం డడఁగఁగ నేల గెలుపు గైకొన వచ్చున్.

వ. అని పలికి కరతలం బెత్తి నిలు నిలు మనిన నబ్బలం బతని నగ్గించుచు మరలె
నమ్మేటిమగండు ముంగలి యయి నిలిచి పొంగారం గవియుకౌంతేయసేనా
సముద్రంబునకుఁ జెలియలికట్ట యయ్యె నయ్యవసరంబునందు మునుకొని
వడిం దఱుముపడముడిం బొదివి మనపదాతిప్రకరంబు దర్పంబున నార్పులు
బొబ్బలుం జెలంగ బహువిధశస్త్రాస్త్రంబులు పరఁగించినం బెరిఁగినమదాతిరేకం
బున గదాదండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ
గూల్చు పెనుగాలికై వడి నతం డేకవింశతిసహస్రసంఖ్యసుభటుల నేలపాలు సేసె
నప్పుడు. 310

క. కరిహయరథబృందం బుద్ధురత నడరెఁ బాండునృపసుతులమూఁకలపై

1. క. గ. బెనుఁబాటు. 2. క. వోవ. 3. అ. యొండె జయంబును నొండె.

వనధిం బోలెడుకురుబల, మనఘా కనుఁగొనఁగ గోష్పదాకృతి యయ్యెన్.

ఆ. దైవ మిట్లు గలఁచుటనే వీరి మదిమది, నుండి ఘోర మైనయుద్ధమునకుఁ
దొడఁగ వలయునట్టితలఁడరువు కావించి, కొనిరి చీకురాజుకొడుకు లేచి. 349

చ. అమరనదీసుతుండు వడిసనప్పుడు వీరలబుద్ధి సంధికా
ర్యమునకుఁ జొచ్చు నింక నని యాత్మఁ దలంచితి నమ్మహాత్ముఁడు
న్సముచితవాక్యవృత్తిఁ గురునాయకుఁ దేర్పఁగఁ జూచెఁ జిత్తదో
షమహిమ నద్దురాత్ముఁడు ప్రశాంతత నొందఁడ యెన్నిభంగులన్. 350

క. గంగాతనయుఁడు దెగినను, సంగరమున కుత్సహింపఁ జనునే తమకుఱ్ఱ
వెంగలు లని యప్పుడు దెలి,యంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా. 351

ఉ. దంతియుఁ దాను నాజి భగదత్తుఁడు గూలఁగఁ జూచి సింధుభూ
కాంతునిచావు దెల్లముగఁ గన్గొని యాతనిఁ గావఁ బూని య
ట్లంతలు రాజు లెల్ల సమయం గని ద్రోణునిపాటు గాంచి యా
వంతయు నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ డెంతమూర్ఖుఁడో. 352

క. తనయనుజు లకట దుశ్శా,సనుఁడును లోనైనవారు సమసినచందం
బును బంధుసహితముగఁ గ,ర్ణుని గీటడఁచినవిధంబునుం జూడఁ డొకో. 353

క. అది యెల్ల నేల చెప్పఁగఁ, దుది శల్యునిపాటు గనియుఁ దోఁప దితఁడు బ
ల్లిదుఁ డని ధర్మజుదెసఁ దలఁ, పిది కురుపతి బుద్ధికొలఁది యేటికి వగవన్. 354

క. క్షోణీరాజ్యార్థము దన, ప్రాణము గలుగంగ నీఁడు రారాజు జగ
త్త్రాణపరాయణకరణధు,రీణుం డగుపాండుసుతగరిష్ఠున కెట్లున్. 355

వ. కావునఁ గొఱంతయును దీర్పవలసి యున్న దనిన విష్ణుండు జిష్ణున కిట్లనియె. 356

ఉ. అక్కడ సంధికిం జనినయప్పుడు నవ్విదురుండు కృష్ణ నీ
విక్కడ కేల వచ్చితి వివేకహీనవివేకుఁడు [1]దుర్మదాంధ్యముం
దక్కనె సంగరంబ యుచితం బగుకృత్యము గాక యిమ్మెయి
న్మక్కున నూర్పు గల్గఁ గుజనుండు సుయోధనుఁ డుర్వి యిచ్చునే. 357

వ. అని బోధించె నదియునుం గాక దుర్యోధనుండు జనియించినప్పుడు మును
లిప్పాపాత్ముండు నిఖిలక్షత్త్రియక్షయహేతు వగు నని యాదేశించిరి గాదే
యనిన నర్జునుం డతని కిట్లనియె. 358

తే. అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె, నున్నవారలఁ బొలియించి తన్ను విడిచి
కాని విడువండు ధృతరాష్ట్రసూనుఁ డుర్వి, ధర్మసూనున కిది నిశ్చితంబు గృష్ణ.

క. దుర్బల మగునమ్మోఁకను, దోర్బల మెసఁగంగ నిపుడ త్రుంచెద [2]నాదు
ర్నిర్బంధపరుఁడు దన దగు, దౌర్బల్యము గనుచు మదము దక్కి కనుఁగొనన్.

వ. రయంబున రథంబు గడపు మనుడు నుత్తుంగమాతంగమహీంసుహాశోభితంబును

---

1. అ. దుర్మదాంధతన్. 2. అ. నే నానిర్బంధ.

సాంద్రస్యందనగుల్మగహనంబును బహుళహయకకక్షాకీర్ణంబును సముద్భటసుభట లతాలసితంబును నైనసుయోధనుసేనాకాననంబునందు మాధవమహావాయువు ధనంజయదారుణానలంబు దరికొల్పిన. 361

క. ఆకృష్ణవర్త్మునుజ్జ్వల,భీకరశరజిహ్వ లడరఁ గ బేర్చిన నధిక వ్యాకులత నొందె రోదసి, నాకౌకస్సమితి మెచ్చునసనం బొదలంగన్. 362

వ. ఇట్లు దారుణరణవిహరణంబు సలిపి సవ్యసాచి యాసైన్యంబు నిపతితవిఘటిత భ్రాంతపలాయితంబు సేసినఁ దెరలక నిలిచి కురుపతి కరతలం బెత్తి నిలు నిలు మని మెలుంగుసూపిన నది మగుడఁ బురికొని నిగిడి నేమినినదఘంటాక్వణనకింకిణీ నిక్వాణంబులు సెలంగఁ బాండవబలంబుఁ దాఁకిన ధృష్టద్యుమ్నశిఖండిశతానీకు లయ్యనీకంబు ననేకవిధసాయకనికాయంబులం గప్పి రప్పుడు ధృష్టద్యుమ్నునర దంబుచక్కటికి సంరంభంబున. 363

ఉ. భూపతి మించి ద్రుపదభూపతనూజునురంబు నిర్భరా
టోపత యుల్లసిల్లఁగఁ బఱటుప్రదరంబుల నొంప నాతఁడు
దీపితకోపుఁడై హరులు ద్రెళ్లఁగ సారథి డొల్ల సేయఁగా
నేపఱి తేరు డిగ్గి యతఁ డెక్కె హయోత్తముఁ గారవేశ్వరా. 364

వ. ఎక్కి కొండొక తొలంగి మాతంగఘటలం బురికొల్పిన నవి పురందరనందను నరదంబుఁ బొదివిన నవ్వీరుండు ఘోరనారాచధారల నవ్వారణంబులపైఁ గురి యం గని గదాహస్తుండై యరదంబు డిగ్గి యనిలపుత్త్రుండు గవిసినఁ దుండంబు లవిసియు దంతంబులు దునిసియుఁ గుంభంబులు వగిలియుఁ బ్రక్కలు చదిసియు వెన్నులు విఱిగియు నగ్గజంబు లొఱలుచు నెత్తురులు గ్రక్కుచుఁ దెరలుచు సుడిసడు చుండ వెండియుం బైపై నురవణించుకరులం గనుంగొని ధర్మజనకుల సహదేవులును ధృష్టద్యుమ్నాదియోధులు నద్దిక్కు తఱిమి రట్టియెడ నశ్వత్థామ కృతవర్మకృపాచార్యులు దుర్యోధనుఁ దేరిగములలోనం గానక కలనం బడియెనో యని.యనుమానించుచు నచ్చటిమానవపతులం గురుపతి యెచ్చట నున్నవాఁడని యడిగినఁ గొందఱు శకునిదెసఁ [1]దొలంగె ననఁ దక్కటివా రతని వెదక నేల బ్రదికియుండెనేనియుఁ గనికొందము పాండవులమీఁద నుఱికి [2]పొడుతము గాక యనిన విని యట్ల చేయ నారథిత్రయంబును [3]దదనీకంబును వెడలి సౌబలుఁ డున్నచక్కటికిం జనియె నిట్లు దిక్కు మాలినయ మ్మొనచుట్టును ముట్టి. 365

దుర్విషహప్రభృతికురుకుమారులు భీమునిచేఁ జచ్చుట.

క. పాంచాలకుమారాదు లు,దంచితభుజబలము మెఱయ నమ్ములవెల్లిన్ ముంచిరి నిజకరిహరిరథ,సంచయసంరంభ మెసఁగ జగతీనాథా. 366

1. అ. గలంగె. 2. చ. పోట్లాడుదము. 3. జ. రథానీకంబును.

వ. అప్పు డేను ధృష్టద్యుమ్నునిఁ బారి కొకభంగిఁ దొలంగి తప్పియు నద్దెస నుద్దామగతి చతుశ్శతస్యందనములతోఁ నడరుసాత్యకిచేతఁ బట్టువడితి నట్టియెడ నడముడి కుంజర ప్రకరభంజనవిహరణపారీణతం బేర్చి యార్చినం జూచి నీకొడుకులు దుర్విషహ దుష్ప్రదర్శనప్రముఖులు శితవిశిఖంబులు గురియుచుం గవిసి యబ్బలుమగనిం బొదివిన నతండు రథం బెక్కి యెక్కుడుమదంబున భల్లనారాచాదిబాణంబులఁ బ్రాణంబులు గొనినం గనుంగొని హతశేషం బైనభవదీయబలంబు క్రోధశోకావేశంబున నవ్వీరుఁ జుట్టుముట్టిన నాజెట్టిజోదు పంచశతరథంబులును దంతిశతసప్తకంబును దురంగాష్టశతంబును బదాతిదశసహస్రంబును దనసాయకసముదయంబుల వేగంబున సమయునట్లుగా సంక్రీడనంబు సూపినం దక్కటివారు దేఱిచూడనుం జాలకంతంత నిలువ భవత్కుమారమారణం బప్రతిహతంబై చెల్లుటకు నుల్లంబు వికసిల్ల శిష్టైకసోదరుం డైనసుయోధనునిఁ దెగినవానిఁగాఁ గొని తన్ను నప్పుడు కృతార్థునిఁగాఁ దలంచుచు మల్లచఱచినం గించిదవశిష్టంబైనయాకౌరవసైన్యంబు వెగడందిఱిచ్చవడియె నయ్యవసరంబున గుజ్జుపుఁదండంబులతోఁ సుదర్శనుఁడు దాను నున్నసుయోధను నాలోకించి గోపాలదేవుండు దేవేంద్రపుత్త్రున కి ట్లనియె. 367

సీ. అరు లడంగిరి యుధిష్ఠిరుఁ డాది యగుభవ, ద్భ్రాతలు నీపరిపాలనమున
నుల్లసిల్లిరి సంజయుని బాడుదల వట్టి, కొని వచ్చి సాత్యకి వినుతి కెక్కె
నెలమి ధృష్టద్యుమ్నుఁ డెంతయు నొప్పె ని, ప్పుడ కూడి తఱుముమీఱఁ బ్రోవు గట్టి
నిలిచినహయములం బొలియింపవలయునిం, దున్నాఁడు చూచి తెఱయొద్దు చక్కఁ

తే. గానమర్చుచుఁ జూడ్కులు గలయ దెసలఁ, బొరినిగుడ్చుచు ధృతరాష్ట్రపుత్త్రుఁ డల్ల
వాఁడె తెల్లనిగొడుగుతోఁ వాఁడి దక్కి, నివ్వఱు గప్పిన నొప్పు నిప్పువోలె.

క. ఇతనిని భవదీయోజ్జ్వల, శితనారాచప్రసారశిఖాప్రభీలో
ద్గతి గతజీవితుఁ జేయుము, కృతకృత్యుఁడ వగుదు జగము కీర్తింపంగన్. 369

క. వినుము ధృతరాష్ట్రనందను, లనిలతనయుచేతఁ బొలిసి రండఱు నింకొ
క్కనుజుండు నితండును ని, ల్చినవా రయ్యిరువు రిపుడు చెల్లెద రెట్లున్. 370

వ. అనిన విని సవ్యసాచి సవినయంబుగా నయ్యంబుజాక్షు వీక్షించి. 371

చ. అమరనదీతనూభవుని నస్త్రకళాగురుఁ గర్ణునిన్ మహా
సమరమునం దనేకబలసంఘములన్ బలవన్నృపాలవ
ర్గములను మద్రరాజు దుదిగాఁ దెగటార్చె భవత్ప్రసాదది
వ్యమహిమ యింక నల్పతరసైన్యసమూహము దాని కడ్డమే. 372

వ. ఇన్నూఱురథంబులు నూఱేనుంగులు రెండువేలకాలుమానిసియు సౌబలునితోడి యేనూఱుగుఱ్ఱంబులు నింతియ కాదె యీసేన యిది కృపాశ్వత్థామకృతవర్మలు గలసి నిలుప నిలిచినయది యేను దఱిమి యఱుముట కలిగెనే నింతవట్టును బఱి

మార్చెడ నిమ్మ్రాఁక పడియును బాజీయుం తనచుట్టు బయ లైన సుయోధనుం డె ట్లయ్యెడినో యటుసూడుము మార్కొని యెనేని మదీయమార్గణాగ్నికి నాహుతి సేసి కపటద్యూతంబున నపహృతంబు లైనసకలధనంబులునలుఁగుమొనమరల్చిన వాఁడ నై పాండవాగ్రజునిచింతవంత యంతయుఁ బుచ్చివై చెద నేఁ డెల్లపనులు సక్క నయ్యెడుఁ గరిపురపురంధ్రీజనులు తమపతులఁ బుత్త్రులుం బోలియుట విని పాండవు లుద్దండబాహువీర్యశౌర్యసమగ్రు లని మెచ్చెంగెదరు గాక యనుటయు నన్నరువాటకు మెచ్చుచు నతండు. 373

చ. అరదము కౌరవేంద్రుదెస కై నడపంగఁ గెలంకులం గడం
గిరి నకులానుజన్ముఁడును గీచకవైరియుఁ గౌరవేశ్వరుం
బోరిగొన నుత్సహించి వడి భూవర వారి కెదిర్చె సౌబలుం
డరిబలముం దదీయరథికావలియుఁ గ్ విమతింప నుగ్రుఁ డై. 374

వ. తక్కటివారు ను క్కొక్కి పురికొని రాశకునియు సుశర్ముండును సవ్యసాచిని సుదర్శనుండు సమీరనందనుని నీయగ్రనందనుండు సహదేవునిం దలపడి రట్టియెడ. 375

క. వడముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం
దొడరి భవత్సుతు మార్కొని, నిడుద వెడఁదతూపు లేసి నెఱేఁ దూలించెన్. 376

ఉ. కట్టియ వై చె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రిలేఁ
బట్టి నతండు సోలియును బాహిరపోవక తేఱి యావిభుం
గిట్టి నిశాతబాణచయకీలితదేహునిఁ జేసె రావుతుల్
కట్టుపకాసు లై నరునిఁ గప్పిరి శక్తులఁ దోమరంబులన్. 377

వ. గాంధారదేశీయు లగునాశ్వికు లట్లు పొదివిన నొదవినకినుకఁ గ్రూరభల్లంబుల శిరంబులు ధరం దొరఁగించినఁ ద్రిగర్తస్యందనసందోహం బడరి గోవిందపురందర పుత్త్రులపైఁ బటుప్రదరపరంపరలు పరఁగించి విజృంభించిన నవ్విజయుండు. 378

సీ. సత్యకర్మునితల చారుకుండలపరి,స్ఫురితత్వ మొందుచు ధరణి డొల్ల
నేసి మృగంబుపై కెరఁగుసింగముపోలెఁ, గిట్టి సత్యేషుని గీ టడంచి
బహుదినసంచితప్రకటకోపానల,జ్వాలలు సాకారలీలఁ బర్వ
తెఱఁగున నరుణదృగ్దీప్తిజాలంబు సు,శర్ముపై నిగిడించి సాయకత్ర

తే. యం బొడలనాటుటయుఁ దద్రథంబులొక్క, పెట్టఁగవిసిన నన్నిటిఁ బిలుకుమార్చి
రథ్యములఁ గూల్చి యతనియురంబుఘోర,భల్లమున వ్రచ్చి నిర్గతప్రాణుఁ జేసె.

వ. ఇవ్విధంబునఁ ద్రిగర్తపతిం బ్రేతపతిపాలి కనిచి మనదెసజనంబులు ఖేదంబుం దమవారు మోదంబు నొంద నతనినందనుల నేద్వుర నెనమండ్ర ముప్పదుండ్ర మూఁడుమూఁడుగోలలం దలలు నటికెఁ దత్సైన్యశేషంబు బారిసమరె భీమసేను బారిం బడినసుదర్శనుండు దదీయశరజాలంబుల నదర్శనగతుండై పదంపడితచ్ఛరవి

ఖండితకంఠుం డై నఁ గోపంబు దీపింప వగ మిగుల నక్కుమారుమూఁక యమ్మా
రుతసుతుఁ జుట్టు ముట్టిన నతండు బెట్టిదంబు లగుతూపుల నది రూపడంగున
ట్లేపున విహరింపఁ గనుంగొని సహింపక మహీపతిముందటిబలంబు బరవసంబునం
గవిసిన నక్కౌంతేయుసైన్యంబును సరభసంబున నెదిర్చి పేర్చినసమయంబున
సౌబలుండును సహదేవుం దాఁకినం దత్సుతుం డులూకుండు బాసట యై యడరె
వడముడియుఁ బిన్నతమ్మునికి బాసట యయ్యె నాశకుని మాద్రీతనయునిఁ బ్రదీప్త
భల్లత్రయంబున నొప్పించి పదినారాచంబు లతనిమేన గుప్పించినం గోపించుచు
నయ్యిరువురు సాయకనికాయంబు నిగిడించిన నాగాంధారరాజు మొగ్గరంబునఁ
గత్తళంబులు గరవాలంబులు పల్యాణంబులు మోరలు గంఠంబులు చరణంబులు
గరంబులు శిరంబులు దునియలై తొరిఁగిన ధాత్రి చిత్రాకారం బై యుండె నిట్లు
దనతురగసముదయంబు సమయుటయుఁ జలం బెడపక నీమఱంది యన్నకులా
నుజుం గిట్టె. 380

క. పెనుగడఁత దొడ్డయత్తళ,మున నైచిన నతఁడు మూర్ఛ మునిఁగి రథమునిఁ
దన పడినఁ గని యప్పా,వని పొదివెను గౌరవేంద్ర వాహినిఁ గడఁకన్. 381

వ. పొదివినయవ్వీరునారాచంబుల తాఁకున. 382

క. అది గొంత పుడమిఁ బడ ను,న్నది పాఱినఁ గని యదల్చి యవనీశుఁడు బె
ట్టిదముగ నెలుంగు సూపెను, మద మాఱఁగ నబ్బలంబు మగుడువిధమునన్.

వ. ఇవ్విధంబున దొర [1]యఱిమి తఱిమి యమ్మెనకుత్సాహంబుగాఁ జటులవాహం
బగురథం బెక్కి శకునిఁ గూడుకొని కవిసిన. 384

తే. పాండవులసైన్యమును సముద్దండలీల,మాఱుకొనె నంతలో మూర్ఛ దేఱినకులు
తమ్ముఁ డమ్మామపైఁ బది యమ్ము లొక్క,పెట్ట గ్రుచ్చి యాతనివిలు బెట్టు ద్రుంచె.

ఉలూకుఁడు సహదేవుచేత మృతుం డగుట.

సీ. ఆసౌబలుండు శరాసనాంతరదీప్తుఁ, డగుటయు నకులుఁడు ననిలసుతుఁడుఁ
దాఁకిన వారి నతండు పెక్కమ్ముల, నొప్పింప నతనితనూజుఁ డనిల
సుతసహదేవుల సునిశితశరవర్ష,మునఁ గప్ప నయ్యులూకుని ననేక
సాయకంబుల నొంచి శకునిపై నఱువది,యమ్ములు నాటించి యనుచరులను

తే. బెగడుపఱిచె నాభీముండు బెట్టు లూఁకుఁ
డడరి యన్నకులానుజు నంపవెల్లి
ముంప నతఁ డేచి పటుభల్లమున శిరంబు
ద్రుంచె నన్నలమెడలు సంతోష మొంద. 386

క. తనయుఁడు వడ శకుని కనుం,గొని శోకం బాత్మ నారఁ గూరఁగ నశ్రుల్
కనుఁగొనలయందు నినిచె, న్మనుజేశ్వర విదురుభాషణంబులుఁ దలఁచెన్. 387

1. క. యెయిది మగిడి తఱుము నమ్మెన.

వ. అట్లు దలంచుచు నిట్టూర్పు నిగుడ సహదేవుపై నడరి మూఁడునారాచంబులు నిగిడించిన. 388

చ. అవి వెసఁ ద్రుంచి యాతనిశరాసనముం దునుమాడె నక్కుమా
రవరుఁ డతం డనిందితపరాక్రముఁ డై పటుఖడ్గయష్టిదీ
ప్తవిపులముద్గరంబున విభాసితశ క్తిని వైవఁ దోడుతో
నవియు ననేకబాణములఁ నానృపసూనుఁడు నుగ్గు సేసినన్. 389

క. కనుఁగొని పార్శ్వచరులు వి, చ్చిన శకునియుఁ బాఱె నుల్లసిల్లిరి కుంతీ
తనయులు దదీయసేనా, జను లార్చిరి కురువిభుఁడు విషాదము నొందెన్. 390

వ. ఇట్లు పాఱిన. 391

చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ బర్వఁ బాండవా
వరజుఁడు పోవ నీక పొదువన్ వడిఁ బింగలివారు పోరికిం
బురికొని త్రోచినన్ సుబలపుత్త్రుఁడు దత్తురగవ్రజంబుతో
బరవస మొప్పఁగా నతనిపైఁ గవిసెం గృతనిశ్చయాత్ముఁ డై. 392

వ. కవిసినం గని గుణంబు సారించి శరాసారం బడరించి యాసహదేవుం డిట్లనియె.

చ. తలఁకుట యొప్పునే నృపతిధర్మము నూఁది యెదిర్చి మీమెయిన్
నిలుచుట యొప్పఁగాక మహనీయుల ధర్మతనూభవాదులం
బలికితి వీవు జూదపుకోపంబునఁ దత్ఫల మందె దిప్డు మా
చలము బలంబు నేర్పడియెఁ జచ్చిరి మీయవివేకు లందఱున్. 394

వ. మమ్ము నపహసించినవారిలోఁ గురుకులదాహకుం డొక్కరుండ తక్క నద్దురాత్ముండు సూచుచుండ భవదీయశిరంబుఁ దాలఫలంబు లగుడంబునంబడ నై చుపగిదిఁ బటుభల్లంబున డొల్ల సేసెద మామా పాఱక నిలువుమీ యని యట్లు బహుభంగులం బలికి యతం డేయుసాయకంబులు వారించి దశమార్గణంబులు మేనఁ జొనిపి. 395

క. తురగములు సిడము గొడుగును, శరాసనముఁ దునిమి యార్వసాహసమున ని
ష్ఠురశక్తిఁ బూన్చె నాతని, యురఃస్థలము వైవ శకుని యుర్వీనాథా. 396

మ. సహదేవుం డది శాతభల్లమున నుత్సాహోగ్రుఁ డై త్రుంచి దు
స్సహభల్లద్వితయంబునం గరయుగస్వైరచ్ఛిదాకేలి స
ల్పి హసద్వక్త్రవిలాస మొప్పెసఁగ నాభీలద్యుతిస్ఫారభ
ల్లహతిం గంఠము ద్రుంప మస్తకము డొల్లన్ డొల్లె మేనున్ మహిన్. 397

వ. ఇట్లు కౌరవులదుర్నయంబునకు మూలం బగుశకునిఁ దెగటార్చి పేర్చి యార్చిన యనుజన్ము నాలోకించి ధర్మతనయప్రముఖులు పరమప్రమోదభరితాంతఃకరణు లై నిజశంఖంబులు పూరింప శౌరియుఁ బాంచజన్యరావంబున రోదసి నింప సుయోధనుసేన చెదర బెదరక నిలిచి యాసౌబలుసైన్యంబు సహదేవునిపై ననే

కాస్త్రశస్త్రంబులుగురియుచుం గవిసినం గవ్వడియు వడముడియు నవి యన్నియు
మోఘంబు లగునట్లు చేసి యమ్మూఁక బడలువడ నేసి యుల్లాసభాసితు లైనం గని
జనపతి శోకాక్రాంతమతి యై హతశేషు లైననిజసైనికులం బురికొల్పిన వారలు
రక్షకరహితు లయ్యును దెంపుపెంపున శంకింపక యాసవ్యసాచిం బొదివి తదస్త్ర
శిఖాసందోహంబున మ్రందిపోయి రక్కురురాజు దనచుట్టును బయ లగుటం గల
యం జూచి కట్టెదురం జెలంగునాకౌంతేయులం గనుంగొని తొలంగిపోవం దలంచె
ననుటయు నాంబికేయుండు సంజయుదిక్కు మొగం బై. 398

తే. అట్లు మన సైన్యములు దెగటాఱినపుడు, కుంతికొడుకులలో బలశమెంత గలిగె
నకటనాకొడు కెట్టివాఁ డయ్యెఁ జెపుమ, యనుడు నతఁడిట్టులనియె నమ్మనుజపతికి.

వ. అట్టియెడ రెండువేలు రథంబు లేడునూఱుగజంబు లైదువేలు గుఱ్ఱంబులు పది
వేలుకాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండు సంగరాంగణంబున మెఱసి
యుండె. 400

క. పలపలనిమూఁకలోఁ గాల్, నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుం డై యెక్కడుఁ, దొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా. 401

వ. అని ధృతరాష్ట్రునకు సంజయుండు దుర్యోధనుపలాయనం బెఱింగించె నని చెప్పిన
విని యటమీఁదివృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయును. 402

ఉ. [1]సంగవిదూరితాకలితశాంతరసస్ఫుట[2]రోమహదిద్ధబో
ధాంగసమాశ్రితాపదుదయజ్వలనప్రశమప్రవర్తకా
పాంగమరీచిరూపవితతామృతవీచివిహార వాసవో
[3]త్సంగతలోపలాల్యపద [4]సంస్కృతివారణ దైత్యదారణా. 403

క. ఆశ్చర్యకరణకరుణా, నిశ్చలశుచిహృదయభావనీయవిహరణా
పశ్చిమ[5]నాడీసరణ పు,రశ్చరణధ్యేయ భక్తరమణవిధేయా. 404

మాలిని. ప్రణవమయగరిష్ఠపాయసంవేద్యభూమా
భణనమననదూరస్ఫారవిస్తారసీమా
[6]గుణవిభవనిరాసాకుంఠితోల్లాసధామా
గణనరహితలీలాకల్పనిత్యాభిరామా. 405

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్రకొమ్మనామాత్యపుత్త్రబుధారాధనవిరాజితిక్కన
సోమయాజిప్రణీతం బైన శ్రీమదాంధ్రమహాభారతంబున శల్యపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము. 406



1. గ. సంగవిదూరతా...రసస్ఫుట. 2. క. కోపయిద్ధ- గ. లోమదిద్ధ-బోధాంగ. 3. గ. త్సంగతలోపలాల్య; జ. త్సంగ తలోపవాస్య. 4. క. సంశ్రితతారణ. 5. జ. నాళీసరణ. 6. గ. గుణభవననిరా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## శల్యపర్వము, ద్వితీయాశ్వాసము.



కరణనిపుణపదప
ద్మా కేవలసత్త్వసద్మ మాయావ్యవధూ
త్యేకాయనగమ్యా మధు
రాకృతి[1]సర్వత్వరమ్యా హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నిజపుత్త్రుండు పరాజయంబు నొందుట యాకర్ణించి యాంబికేయుండు. 2

క. మద మడఁగి యొక్కరుండును, గద చేకొని రాజరాజు కాల్నడ నెట వో
మదిఁ దలఁచి తొలఁగెనొకో యా,పద లిట్టివి కలవె మనుజపతులకు నెందున్. 3

వ. అనంతరవర్తనంబు తెఱంగెఱింగింపు మనుటయు నజ్జననాథునకు సంజయుఁ డిట్లనియె. 4

సీ. ఏకాదశాక్షౌహిణీశుఁ డై పెంపునఁ, బొంపిరివోవునప్పుడమిఱేఁడు
వెనుక నొక్కరుఁడును జన లేక యేకాకి, యై పోయె నచటికి ననతిదూర
మై యుత్తరము ముట్టనట్టితూర్పున నొక్క,మడు వున్న దానిలో నడఁగియుండు
వాఁడుగా నట్లు లవ్వలనికిఁ జని చని, విదురునిమాటలు మదిఁ దలంచి

ఆ. యధికమతి నృపాలుననుజుఁడు [2]సెప్పిన, ట్లకట దానిఁ గొనన యనుచు శోక
తప్తచిత్తుఁ డయ్యె దైవ మెవ్వరి నెట్లు, చేయఁ జాల దేమి సెప్పఁ గలము. 5

వ. అట్టియెడ నుడిసి చిక్కినమూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషంబుగా సమయించి కృష్ణసారథికంబును ధవళహయంబును గపికేతనంబును నగునుజ్జ్వల స్యందనంబును నప్పురందరనందనుండు బంధుమిత్త్రాభినందితుండై యొప్పె నప్పుడు పొలికలన నీబలంబు బహులంబును బెనుగాలిం బడిన పేరడవిపగిదిం గానంబడు చుండె నందుఁ గృపాశ్వత్థామకృతవర్మలు ముగ్వురు [1]బ్రతికిపోయి రాసమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుంగొని నగుచు సాత్యకి నుద్దేశించి. 6

1. అ. సర్వత్రరమ్యా. 2. క. సెప్పిన ట్లగుట.

తే. వీని నేటికిఁ బట్టితి వీఁడు బ్రదికి, [1]యిచట వర్తించి మనకు నె గ్గేమి సేయు
నప్రయోజన మిది విడు మనిన నేల, విడుతు నీద్రోహిఁ దల దెగ నడుతు ననుచు.

వ. ఆశైనేయుండు వాలు వెఱికి [2]ప్రేయం జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధి చేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు ముందల విడువు మని యానతిచ్చిన నతండు వినతుం డై యట్ల కాక యని పలికి నన్ను విడిచెఁ గృష్ణద్వైపాయనుండు మదీయాననం బాలోకించి బ్రదికిపోయి తెక్కడ కైనం బొమ్మనుటయు నమ్మునీంద్రు వీడ్కొంటి నంత నతఁ డంతర్ధానంబు సేసె నేను దత్ప్రదేశంబు వాసి నీసుతుండు సనినచక్కటికిఁ గ్రోశమాత్రంబు వోయి ద్వైపాయనం బనం బ్రసిద్ధం బైనయమ్మడువుసమీపంబున. 8

తే. అతనిఁ గాంచితి నతఁ డశ్రు లడర నడలు
చూడ్కి నామోము చక్కఁగాఁ జూడ కోర
వోవఁ జూచుచు దీనతఁ బొంది యునికి
గని మనంబున శోకంబు గదుర నేను. 9

వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి యెట్టకేల కెలుంగు దెచ్చుకొని పారాశర్యప్రసాదంబున బ్రదికినతెఱంగు సెప్పిన నమ్మహీకాంతుండును గొంతప్రొద్దు నిశ్చేష్టితుం డై యుండి పదంపడి నా దెసఁ జూచి మన దెస బ్రదికిన వారు గలరే యనినఁ గృపాచార్యాదిరథికత్రయంబును బేరుకొని వారలు బ్రదికి పోయిరి తక్కొరుండును బ్రదుకుట లే దని యెఱింగించిన నిట్టూర్పు నిగిడించుచు నామూఁపుపైఁ జే యిడి యన్నరనాథుండు నన్ను నీకడ కనుపం దలంచి నాతో ని ట్లనియె. 10

తే. మాఱుమానిసి లేకుండ మడిసి రెల్ల, వారు నీదెసఁ బాండుభూవరతనూజు
లాప్తు లుండాము నున్నవా రాహవమునఁ, బడక తొలఁగితిఁ బోటులఁ బడియు నేను.

వ. అని. 12

క. కౌంతేయులబారిం బడ, నింతియ సిరి చాలు రాజ్య మెల్లను దా రై
పొంత ననుఁ బెట్టుకొని యొక, కొంత యొసఁగి రేని నట్టి కూ డేమిటికిన్. 13

క. అనుజులఁ దనుజుల మత్సరి, జనులను సమయించి వారు సమరోల్లాసం
బున మెఱయఁ జూడ నేర్తు నె, జననాథున కింతవట్టు సంజయ చెపుమా. 14

దుర్యోధనుఁడు ద్వైపాయనం బనుమడుఁగున డాఁగి యుండుట.

క. ఇమ్మడువులోన డాఁగెద, నిమ్ముల నెచ్చటికి నైన నేఁగెదఁ దగువృ
త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి, యెమ్మెయి నేనియును దీర్తు నేఁ బగ యనుమీ.

1. అ. యెచట వర్తించు. 2. అ. తెగ ప్రేయం బూనినఁ గృష్ణ.

వ. అని చెప్పి యమ్మడువు సొచ్చి మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁక
కుండ సంస్తంభనంబు సేసికొని యుండె నంత రథ్యంబులు పరిశ్రాంతి నొంది
తూఁగాడ నస్త్రశస్త్రాదిక్షతంబు లగునవయవంబులతోడ రాజదర్శనవిషణ్ణు
లగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ లచ్చట మెలంగి డబ్బాటుగా నన్నుం గని
సంజయా బ్రదికితే యని పలికి కురుపతి ప్రాణంబులం గలఁడే యని యడిగిన
నజ్జననాథుఁ డొక్కండును బాఱుతెంచి నీరిలో డాఁగియున్న తెఱం గెఱింగించి
యాహ్రదంబు సూపి యే మిరువురము నొండొరులతో నాడినమాటలు దేటపడం
జెప్పిన వార లత్యంతవిషాదంబు నొంది. 16

చ. నరవరుఁ డేము సంగరమునం బడ కున్కి యెఱుంగఁ డక్కటా
బరవస మేది వచ్చెఁ బిదపన్ వినియున్ మముఁ గూర్చికోలు దు
స్తర మనుబుద్ధి నిప్పటికి శత్రులక న్మాఱఁగం దలంచి యీ
వెరవున డాఁగ సర్వపృథివీపతి దుర్దశ నిట్లు పొందునే. 17

వ. అవ్విభుండు పెనుఁబ్రాపై నిలిచిన నేము పగతురతోడం బెనంగం జాలుదు మను
సమయంబున విజయవిజృంభితు లగుపాండవులు సబలంబుగా నచ్చేరువ నడ తెం
చిన నారథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి ననుఁ గృపా
చార్యరథంబుమీఁద నిడికొని మనశిబిరంబున కరిగి రందు. 18

చ. కలగొనఁ బాఱుచున్ సతులు గన్నుల నశ్రుజలంబు లొల్క వీఁ
పులపయి పెన్నెఱుల్ విరియఁ బొడ్మఁగ లాలలు రోదనధ్వనుల్
సెలఁగఁగ మోములుం దలలుఁ జేతులుఁ గెంపుగ మోఁదికొంచు భ
ర్తల సహజన్ములన్ సుతులఁ దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్. 19

వ. హతశేషులైనపతాకాతపత్రచామరభృదాదిజనంబులవలన సకలజనసంక్షయంబు
వినుచు నేలం బడి పొరలుచు లేచు చునికి యత్యంతకరుణం బై యుండె నప్పుడు
మాన్యవనితాజనంబులకావలివారునుం గడంగి వారలం దగినవాహనంబులపై
నిడికొని యిక్కడకు వచ్చిరి తక్కినభీతజనంబులు పలుదెసలం బాఱి రట్టియెడ
నీకొడుకు యుయుత్సుండు శోకసంతప్తచిత్తుం డై. 20

శా. గంగానందనుఁ డాది గాఁగఁ గురుసంఘం బెల్ల సంగ్రామధా
త్రిం గూలెం బతి యొక్కరుండుఁ బటుకౌంతేయప్రతాపంబుపే
ర్మిం గీడ్పాటున కోర్చి పాఱె విధి నామేఁ బ్రాణముల్ నిల్పె నా
కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొంచేఁగు టర్హం బగున్. 21

వ. ఏకాదశాక్షౌహిణీభర్త మన్నించుమానవతులు గాసి యగుదు రే యని మనంబు
నం దలపోసి రథంబు డిగి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు నెఱింగించిన న
ప్పాండవాగ్రజుండు పరమకృపాపరుండు గావునఁ బ్రీతుండై శౌరియాననం బాలో
కించి యది మేల కాదె యని పలికి యతం డనుమతి సేయ నవ్వైశ్యాపుత్త్రుఁ

బరిరంభణంబు సేసి లెస్సతలంపు తలంచి తని సంభావించి వీడుకొలిపిన నతండు
రథారూఢుం డై రథ్యంబులఁ ద్వరితగతి నడపి భూపతిప్రేయసీజనంబుల కధ్యక్షు
లగువృద్ధకంచుకులం గలసి వానును దానును వారల నుచితప్రకారంబులఁ దేర్చి
పురంబు ప్రవేశించునప్పు డెదుర విదురుం గాంచి. 22

చ. అతఁ డడుగంగ శల్యసుబలాత్మజులుం బల మంతయుం రణ
క్షితిఁ బడు టేర్పడం బలికి చెప్పెఁ దురంగము డిగ్గి మేదినీ
పతి యొకరుండుఁ బోయెఁ బాండవముఖ్యుఁడు ప్రీతిఁ బంపఁగా
నతివల నిల్లు సేర్చుటకు నై యిట రాకయు మానవేశ్వరా. 23

వ. అనిన విని యతండు శోకవ్యాకులుం డగుచు నవ్వైశ్యాపుత్త్రుం బొగడి కాలో
చితకృత్యం బాచరించి లెస్స చేసి తని పలికి మఱియు ని ట్లనియె. 24

తే. ఎప్పుడును సంజయుఁడు వచ్చి యెఱుఁగఁ జెప్పఁ
బతికి సమరవిశేషంబు లతఁడు నేఁటి
తెఱఁగు చెప్పెడిఁ గాక యే తెంచి మున్న
మనము వినిపింపఁగాఁ దగ దనఘ దీని. 25

వ. ఒండుముఖంబున నివ్వార్త నగరు సొరకుండునట్లుగా సంవిధానంబు సేయ
వలయు నీవు దుర్యోధనుప్రియాజనంబులను దద్రక్షకులను దోడ్కొని భవదీయ
మందిరంబునకుం జనుము తక్కటివారి నంతంత నడఁకువతో నిలువ నియమింప
వలయు నని పలికి తానును యుయుత్సుండును సావధానప్రయత్నంబున నవ్విధా
నంబు సంఘటించి నీతమ్ముండు పెద్దమొగసాలం జాలుమానిసులం గావలిపెట్టి
యభ్యంతరంబు ప్రవేశించియుండె నక్కడఁ గౌరవసేనాసన్నివేశం బత్యంతవిరళ
జనం బయ్యె మున్ను మాతంగతురంగసుభటబృంహితహేషితభాషణంబుల
వలన శబ్దాంతరంబు గర్ణగోచరంబు గానియట్టియాశిబిరంబు నిశ్శబ్దం బయి
యుండె నని విని యాంబికేయుం డి ట్లనియె. 26

క. సూతసుత యిట్లు పగతుర, చేత మనబలంబు రాజసింహులు బంధు
వ్రాతమ్మును సమసినఁ దుది, నే తెఱఁగున నడచితిరి నరేంద్రుఁడు మీరున్. 27

వ. అనుటయు నమ్మహీకాంతునకు సంజయుం డి ట్లనియె నంత నయ్యెడకుఁ గౌంతే
యులు సైన్యంబును దారును సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగు
దెంచు కలకలంబు వీతెంచిన. 28

క. కృతవర్మయుఁ గృపుఁడును గురు,సుతుఁడును గనుఁగొనుచు నొండుచోటికిఁ జని ర
ట్లతిరభసంబునఁ గుంతీ,సుతు లచటికి వచ్చి నీమసుతుఁ బలుగడలన్. 29

వ. అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చనిరి చనునప్పు డజాతశ
త్రుండు నీపుత్త్రునగరిలోనిజనంబులఁ గృపతోడం గనుంగొని వెఱవకుండుం డని

పలికి చనిమె నట్లు వారు నిజశిబిరంబునకుం జనుటయు మనయోధవరులు నేను మునంబున నడలు గదుర సమ్మడువుకడకుం బోయితిమి కృపాదు లగుమువ్వురు దమరాక యెఱింగించి యుమ్మనుజపతి కిట్లనిరి. 30

కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట.

క. లెమ్ము కురునాథ కడఁగుము, ప్రమ్ముం గొని పాండుపుత్త్రమథనమునకు సై
న్యమ్మదియును నీచేతఁ గృ, శ మ్మయ్యెడుఁ జుమ్ము వలదు శంకింపంగన్. 31

వ. అట్లు కాక గెలిచి భూమి యేలుట యొండెఁ జచ్చి నాకలోకసుఖం బనుభ వించుట యొండెం గాని నీయట్టివాని కిట్టితెఱంగు కర్తవ్యంబు గా దని పలికిన విని యవ్విభుండు వారల కిట్లనియె. 32

చ. తనువు ఘనాస్త్రశస్త్రములఁ దాఁకున నొప్పిని డప్పి పుట్టె నా
మనము వశంబు గా కెడలె మాటలచందము సూడ మీరు డ
స్సినయటు లున్నవార లనుజీవులు లేరు తొలంగి నేఁటిమా
త్ర నిలువుఁ డెల్లి పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్. 33

వ. అనవుడు నగ్గురునందనుండు. 34

ఉ. ఏ లనుమాన మేను సమయించెద వైరము నేఁటితోడఁ బాం
చాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ
పాలక పుచ్చఁ గత్తళము పాటిగఁ బట్టుము నాదుమాట. లి
య్యాలితనంబు వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్. 35

వ. అనియె నప్పు డనిలసుతుని వేఁటకాఱులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతు లై జలపానార్థం బమ్మడువునకు వచ్చి రంతకమున్న ధర్మనందనుం డొక్కబోయం బోడఁగని దుర్యోధనుండు దొలఁగెం జెట్టుచేమల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ వలయు ననిన వాఁడును వృకోదరునిమృగయులలోనివాఁ డగుటఁ దమవారికి నెదురు వోయి యమ్మాట తెఱం గెఱిఁగించుటం జేసి యప్పని మనంబులం దున్నట్టియాబోయ లట్లు కెలన నేమఱి సల్లాపంబులు సేయు చున్న యన్నరనాథునియారథికవరులవచనంబులు విని పూర్వాభ్యాసంబువలన న య్యుక్తిప్రత్యుక్తులపరిపాటి చేటపడిన నన్నీటిలో నీకొడుకు డాఁగి యుంట నిశ్చ యించి తమలో మెల్లన యిట్లనిరి. 36

క. ఈరథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం
గౌరవపతి డాఁగినగతి, బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. 37

తే. అతఁడు పసదన మొసఁగు మారుతతనయుని
మున్న గని మెచ్చు వడయుద మన్నరేంద్రు
నతఁడ కాన్పించు మనల రయమునఁ బోవ
వలయు మాంసభారంబులు వలదు లెండు. 38

వ. అని మోపులు డిగవిడిచి వెసం బాఱి రయ్యవసరంబునఁ బాండునందనులు నీ
నందను వెదక ననేకచారులం బొలికలనికెలంకులకుం బుచ్చి యాతండు తమ
కగపడమికిఁ జింతాక్రాంతు లై యుండ నాబోయలు భీమునిపణిహారులఁ ద్రోచి
కొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాంచి యమ్మడువున
నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. 39

క. తమవిన్నమాట లన్నియుఁ, గ్రమమునఁ జెప్పిన నతండు గడుఁబ్రియమున న
ర్థము లొసఁగె వారికి ననేకములు వహింపంగఁ గొలఁది గా కుండంగన్. 40

వ. ఒసంగి యాలుబ్ధకుల నగ్రజుఁ గానిపించి దేవా దుర్యోధనుండు ద్వైపాయన
హ్రదంబున నొక్కఁడు ద్రవిద్యం జేసి జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లు
గాఁ జేసికొని డాఁగియున్నవాఁడు వీ రెఱింగి వచ్చి రని యతనికి విన్నవించి
యాసుయోధనగురునందనాదులసల్లాపంబు లెఱిఁగించిన నతండు పరమహర్షం
బున నాబోయలకు బహువిధంబు లగుపసదనంబు లిచ్చి తక్కినతమ్ములకును
గృష్ణునకుఁ జెప్పికొని వారును సకలబంధుమిత్రపరిజనంబులును దోడన చనుదేర
నుద్దామగమనంబున. 41

తే. తురగఖురపుటరథనేమికరిపదాతి, ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ
పణవనిస్సాణకాహళరణన మెల్ల, దెసలఁ బరఁగంగ వచ్చె నద్దెసకు నధిప. 42

వ. అట్లు ధర్మనందనుం డేతెంచుకలకలం బాలకించి యంతకమున్న రణోత్సా
హంబున కై రాజు నిర్బంధించు చున్నయగ్గురుపుత్త్రకృపకృతవర్మ లతనితో ని
ట్లనిరి. 43

మ. ధరణీనాయక పాండుపుత్త్రులు సముద్దామోద్ధతిన్ వీరె వ
చ్చిరి వీరిన్ వడిఁ గిట్టి తాఁకుద మొ నీచిత్తంబు పోరాటకుం
జొర దే నిప్పటికిం దొలంగి చని యెచ్చో నైన నే ముండి చె
చ్చెర రూపించినవేళఁ జెప్పి నెడకుం జేరంగ నేతెంతుమా. 44

ఆ. అనుడు నానృపాలుఁ డయ్యోధవరులతో, నిప్పు డనికి నుత్సహింప కెచటి
కేనిఁ దొలఁగిపోయి యిచటికి మగుడంగ, రండు పగలు సనిన రాత్రి యగుడు.

వ. వారు వారణపురంబున కనివారణఁ బోయెదరు వోదురు గాక యిచ్చేరువఁ బోయి
రేనియు నిమ్మడువున నాయునికి యెఱుంగ లే రట్లు గాక యెఱింగి రేనియు నన్నుఁ
జేర రాదు మదీయవిద్యావిశేషసంస్తంభితాంభోదుర్గంబున నిర్భయుండ నై యుం
డెదఁ బొం డనినం బొగులుమనంబులతోడ నారథికజనంబులు వోవం బతి జలం
బులు శిలాసదృశంబులు గాఁ బరిస్తంభించె నేనును బాండుసూనులచావు లెల్ల
కడల నెలంగుటం జేసి రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గా దనియు నతని
తోయస్తంభనవైదగ్ధ్యం బెఱుంగుట నొలసినయాఱటను ముందటియట్ల వారల
తోడం జని చని చిత్తంబు గలంగినం జనం జాలక యరదంబు డిగ్గి యచ్చట.

నొక్కెడ నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడువునకుఁ నొక్క పటుపుగలపాదపయోజమిం దూఱి పొంచియుండితి వారలు దూరంబు గని యొక్క విపులవటంబుపొంత విశ్రాంతి నొంది నీనంగనువలనికిం జనినహృదయంబులతోఁ దదీయకార్యచింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధసంభాషణంబులు సేయుచుండి రక్కడ. 46

క. కలకల నవ్వుచుఁ బెలుచం, బలుకుచుఁ దమకెలఁకులందుఁ బాంచాలకుమారులు సనుదేరఁగఁ బాండుసు,తులు వచ్చిరి సంతసంబుతో మడువునకున్. 47

వ. ఇట్లు వచ్చి ధర్మతనయుండు [1]భవత్తనయమాయాస్తంభితం బైనయాజలాశయంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన యిట్లనియె.

క. చొర రాదు మనుజులకు నె,వ్వరికిని నిజ్జలము కౌరవక్షితిపతి నిర్భరమాయాసంరక్షా,[2]భరితం బై కాన వీతభయుఁ డాతండున్. 49

→ ధర్మరాజు మడుఁగున డాఁగియున్నదుర్యోధనుని దూఱనాడుట. ←

క. అని వెండియు నాపతి గురు,జననాథుగుఱించి పలుకు శక్రుఁడు దోడై చనుదెంచెనేనిఁ బో వ,చ్చునె నాచేఁ దప్పి యిందుఁ జొచ్చినఁ దనకున్. 50

వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున నిట్లనియె. 51

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయపుభంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడుపరాక్రమలీలలు గొల్చు నెట్లు దై
తేయులు దొల్లి మాయల నరాతిప్రబలాత్మకు లైనఁ దద్వధో
పాయములర్థి జయింపరె నృపాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 52

వ. హిరణ్యకశిపువృత్రవధప్రకారంబులు వినవె రావణుండు హోమాదిమాయాక్రియావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపంబడె నరకాసురు నేను బరిమార్చిన తెఱం గెఱుంగవే వీఁ డగపడునట్టివిధంబు సూచికొమ్మనిన విని యప్పాండవాగ్రజుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యిట్లనియె. 53

చ. ఇటు తగునే సుయోధన మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట విన జూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు ద్రుం
గుటయును జూచి తేమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పునే. 54

ఉ. శూరుఁడ వండ్రు నిన్ మడువుఁ జొచ్చుట శౌర్యముచొప్పె మాన మే
యూరికిఁ బోయె నాజి నృపు లోడుదురే నృపుఁ డన్నమాత్రమే
కౌరవవంశజాతుఁడవు గష్టపుఁజిచ్చుట దెచ్చుకొంటి నీ
పేరును బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే. 55

1. అ. భవత్తనయమాయాస్తంభి. 2. క. పరిణత మై -గ. పరీత మై-అ. భరితాత్ముఁడు. 3. అ. జావును.

తే. క్షత్త్రధర్మంబు విడిచినఁ ✽ గలదె యిహముఁ
బరముఁ బేరోలగంబునఁ ✽ బలుకుపలుకు
లెల్ల మఱచితె విను మవి ✽ పొల్లు లైనఁ
గష్టపాటు గాకుసు తేల ✽ గావ వచ్చు. 56

చ. కొడుకులుఁ దమ్ములుం గలన ✽ ఘోరపుఁజావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదుబుద్ధి యొడ ✽ లోముట కైనను రాజరాజ యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి ✽ మానము ప్రాణముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా వినవొకో ✽ కడునీచతఁ బొంది తక్కటా. 57

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగి యుండె నటె రాజరాజిస్సిరో చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యముం విడిచి దోర్గర్వంబు వెం డమ్యెనే
శుంభత్స్నానము దూలెఁ గా కని జనస్తోమంబు నిందింపదే. 58

తే. కర్ణశకునిదుశ్శాసనుల్ ✽ ఘనులు గాఁగఁ, దలఁచి వారలఁ గొని మమ్ము ✽ గెలుచువాఁడ
వై మనంబున శంకింప ✽ కట్లు కీడు, చేసి తాపూఁపు దప్పిన ✽ గాసి వైతి. 59

వ. నీకొలంది గంటి మగపడితి వింక నెందుఁ బోవచ్చు నని మఱియు నట్లనియె. 60

మ. భయముం బాయఁగఁ ద్రోచి వీరగుణముం ✽ బాటించి సంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషముమైఁ ✽ జూ పొండె గెల్పొండెఁ గా
క యధీరత్వము నాకు [1]నీడె యని వీరకం బెర్చి వే తాఁకు మెం
తయుఁ బెరమ్యేడు రమ్ము లె మ్మొదిఁగిరక ✽ దైన్యమ్ము వచ్చుం జుమీ. 61

చ. అని మము నోర్చినం బృథివి ✽ యంతయు నేలఁగ వచ్చు లేక చ
చ్చిన సురసద్మసౌఖ్యములు ✽ చేకుఱు రెండుదెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగ నగుఁ ✽ బాటును బ్రాణముచేటుఁ దెచ్చుకోల్
వినుము మము నీ వెదుర్పఁ దగు ✽ వేయువిధంబులఁ జాటి చెప్పెదన్. 62

వ. తెంపు చేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించినపరమధర్మంబు పురుషుండ
వై తేని దీని ననుష్ఠింపు మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుం డిట్లనియె.

దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట.

సీ. నరుఁడు ప్రాణభయంబుఁ ✽ బొరయుట యరుదయ్య
వినుము తెల్లంబుగా ✽ మనుజనాథ
రథవాహసారథి ✽ రహితుండ నగుటను
బాణాదిహేతిసంపదలు లేమిఁ
బరివారశూన్యత ✽ వాటిల్లుటను బంధు

---

1. క. నింద- గ. కీడి.

మిత్రసహాయు[1]లు । మిడి యడంగఁ
జచ్చుటఁ బోటుల । నొచ్చి మేనును డప్పి
గూరి చిత్తంబును । బోరి కెలయ

తే. కునికిఁ జేసియుఁ దొలఁగితి । నొదిఁగి సేద, దేర్చుకొని రణమునకు ను।దీర్ణవృత్తి
వచ్చువాఁడను నీవు మీ।వారు విశ్ర,మింపుఁ డంతకు మఱి రండు । సొంపు నూప. 65

వ. అని పలికినఁ బాండవాగ్రజుండు.

క. ఇందాఁక విశ్రమించితి, విందు నినుం దడవి కంటి । మిప్పు డిచట నీ
కుం దేఱె డప్పి కురుపతి,నందన ర।మ్మింక రణము।నకు నాయిత మై. 66

వ. అనుటయు. 67

తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు । నెల్లభోగ,ములును గోరుదు రక్కుమా।రులును నాదు
తమ్ములును లేరు తురగర।థద్విపప్ర,హీన యయ్యె నీక్షోణియు । నేల పెనఁగ. 68

చ. ద్రుపదతనూజులన్ గెలిచి । దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపజితదర్పహీను లగు।నట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటి నేనియు [2]వృ।థారభసం బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్ము లేమిని గు।రుండు మృతుం డగుటన్ ధరాధిపా. 69

క. తనవారుఁ దానుఁ గూడఁగ, నమభవసుఖ మందఁ డేని । నది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు, ననుజన్ములు బ్రదికి రేలు । మఖిలధరిత్రిన్. 70

క. ఏ నింక సమర మొల్లమ,హీనాయక నీక యుర్వి । నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరి,ధానుఁడ నై తప మొనర్చె।దను మునులకడన్. 71

ఆ. ఓడి వచ్చినాఁడ । నుద్ధతి నా కేల, యుదుకు మాని నీవ । యుర్వి యేలు
గుఱ్ఱములును నేను।గులు లేనిబయలు నీ,తలనె కట్టికొనుము । ధర్మతనయ. 72

చ. అన విని యన్నరేశ్వరుఁడు । హాసముతో నతనిన్ గుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృ।దాప్తసహాయులు సన్నఁ గాదె శ
ల్యునిఁ గొని మమ్ము గెల్చి సక।లోర్వియు నేలుట కుత్సహించి తీ
పనవుట లేల మాను మిది । పాటిగఁ బట్టుము లెమ్ము పోరికిన్. 73

సీ. నీయీగి నేను భూ।నాయకుఁ డగు టొల్ల, రాజకోటికిఁ బ్రతి।గ్రహము సనునె
నిను ననిం డెగటార్చి । నేలఁ బాలించెద, నను నోర్చి తేనిఁ బెం।పున సుఖింపు
మేమిటివాఁడ వై । యిచ్చితి పుడమి నీ, కనియెదుమాట యి।ట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీ।నేర్చినఁ గురుకులం,బునకు ని ట్లాఱడిఁ । బొంద నేల

తే. శాంతి నొందుటకై ధర్మ।[3]సంవిభాగ,కరణ మొనరింప వచ్చిన।కమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక । వాఁడి సూది, మోపినంతైన నుర్వి యీ।నోప నంటి. 74

క. ఏమివిధంబునఁ బోరలియు, భూమి కురునృపాల నీకుఁ । బుచ్చుకొనఁగ రా

---

1. గ. లు ఘడిమిడంగి. అ. లమ్మియి నడంగి. 2. అ. వృథారభసంబున మబ్బు లేదు. 3. అ. సంవిధాన.

కీమెయి దైన్యపడితి నా, కేమార్గము వట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా. 75

క. అరులకు సిరి యిచ్చెద నను, వెరవిఁడియుం గలఁడె దీని విడువుము నాకుఱ్
ధర యిచ్చి తేనియును నినుఁ, బొరిగొన కే విడువ నఱిమి పోరుట యొప్పున్.

క. నాచే నీప్రాణంబులు, నీచే నాజీవితంబు నిజ మున్నవి యి
న్నిచత యవకార్యము రాజోచితకర్మకృతనిశ్చయుఁడ వగుము నృపా. 77

వ. అని వెండియు నిట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం
ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్నికపటోపాయంబులు సేసినను నీచేతఁ
జెడక యునికి యెఱుంగవే యింక నట్ల యిమ్మాయలం బ్రయోజనంబు లేదు.

క. లేలెమ్ము బిరుదవై ర, మ్మాలమునకు నీవు నెఱుఁగు దవ్విధము కదుఱ్
[1]మే లొండు తెరువు లే దిం, కేల యొదిఁగి కష్టపడ నరేశ్వర చెపుమా. 79

వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ జెఱవారు నట్ల పలికి
రనిన విని ధృతరాష్ట్రుండు. 80

తే. అట్లు జంకింపఁబడి మఱి యేమిసేసె, నాతనూజుండు [2]మున్ను నెన్నఁడును జంకఁ
బడినవాఁడుగాఁడక్కట పుడమినాల్గు, చెఱఁగులును వెఱఁ దనపంపు సేయ బ్రదికె.

క. పరిజనహీనత దీనతఁ, బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యముల నమ్మెయిఁ, బరితాపము సేయ నేమిభంగి నిలిచెనో. 82

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుండును దమ్ములుఁ
గొడుకులును ద్రుపదపుత్త్రులును బొదువుకొని పలుకుపలుకులకుఁ జిత్తం బుత్తల
పడ నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి మురం బొనర్చువాఁడై యప్పాండ
వాగ్రజున కిట్లనియె. 83

సీ. మీ రేవురును బరివారబాంధవమిత్త్ర, సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిస్యందనతురగసమేతుల, రే నొకరుండ విహీనసహచ
రత్వంబు విగతాయుధత్వంబు వాహ[3]న, హీనత నొందితి నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు నది గాక పోటుల, డస్సితిఁ గడు మీకు డప్పి లేదు

తే. వరుసఁ దగ నొక్కఁడొక్కఁడ వచ్చిపోరుఁ, డిపుడ వెఱలిమిమ్మందఱ నెల్ల చెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ జుట్టుముట్టి, పలువు[4]రొక్కనితోఁ బోరఁ బాడియగునె. 85

వ. అట్లు మీరు సాలరేని.

ఉ. తమ్ముల నిన్నుఁ గేశవుని తమ్ముని ద్రౌపదియన్నదమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొకండన యే నిటె వచ్చి బాహుద
ర్పమ్ముల నిర్లవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మ తే
జమ్మున రూపుమాపు క్రియ సజ్జత నిల్వుము సుస్థిరుండ నై. 86

తే. వినుము నీకుఁ గృష్ణునకును వెఱచి కాదు, ముంద రే నట్టులాడుట యెందుఁ జెల్లు

1. గ. మే లాదవు తెరువు. 2. క. ముంద రెన్నఁడును. 3. క. నాభావంబు నొం. 4. క. రొకనితోఁ బెనఁగంగఁ బాడి.

సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల, వారలకుఁ దెల్పుటకుఁగాని వసుమతీశ.

వ. నేఁడు మిమ్మందఱ సమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయద్రథశకుని
శల్యాదు లగుబంధుమిత్రసహాయులఋణంబు దీర్చెద నని పలికినం బాండవా
గ్రజుం డిట్లనియె. 88

చ. సమరముపాడి నీ వెఱిఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడును బూని మహాద్భుతబాహుసంపదర్
పము వడిఁ దాఁకెదం బిలుకుమార్చెద నంట యుదాత్తమైనధై
ర్యమహిమ గాదె యిట్లనినయంతన యే నటు లేల చేసెదన్. 89

చ. వలసినయస్త్రశస్త్రములు వాహనముం గొను మొక్కరుండ నిర్
గలన జయించువాఁ డతనిగర్వము నీ వడఁగించితేని నీ
యిల సకలంబు గైకొని వహింపుము రాజ్యవిభూతి వాఁడు నిర్
దలపడి పోరుఁ జుట్టలును దక్కటివారలు నిల్చి చూడఁగన్. 90

వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కిట్లనియె. 91

చ. అరదము లెక్కి ఘోరవివిధాస్త్రచయంబుల మున్ను పోరమే
నరవర క్రొత్తచందమురణంబు కరంబు ప్రియంబు సేయు ని
ష్ఠురగదలం బదాతు లయి శూరతయున్ మహనీయధీరతా
స్ఫురణమునుం బొగడ్త వడఁ బోరుట మే లని నిశ్చయించితిన్. 92

తే. వింతకూరలు గుడుపున వేడ్కసేయు
భంగి సంగ్రామమున నాత్మభంగు లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున గద ధరించి
నిను సహోదరులను యోధులను జయింతు. 93

చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదుప్రాణము లకుంఠితబాహువిలాసభాసి నై
యనవుడుఁ బుట్టలోపలిమహాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁ
జె నధిప యవ్విభుండు దనచిత్తము నప్పలుకుల్ గలంచినన్. 94

దుర్యోధనుఁడు గదామండితుం డై హ్రదంబు వెడలి వచ్చుట.

వ. ఇట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలుశూకలా
శ్వంబుచందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు సంక్షోభింప నపహసిత
శిలాసారోదారంబును కనకపట్టికామండితంబును నైనగదాదండంబు విపులాంస
పీఠంబున నమర్చుకొని వెడలె నట్లు సంరంభవిజృంభితుం డై. 95

తే. గదయుఁ దానును రుచిరశృంగమునఁ బొల్చు
పర్వతము శ్రేణి సేయునీపట్టిఁ జూచి
కాలదండంబు చేకొని లీలఁ బొల్చు
జమునిఁ గా మదిఁ దలఁచిరి జనము లెల్ల. 96

వ. అతనిఁ గనుంగొని పాంచాలురును బాండవులును. 97

తే. చిఱుతనగవుతో నొండొరులచేతు లప్ప
ళించి నిర్భరసంతోషలీల నొప్పి
రమ్మహీనాథుఁ డయ్యుపహాస మెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడమఁ గెంపు. 98

వ. కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల నెల్ల నాలోకించి. 99

క. ఈగెలి వేలార్చెద బా,హాగర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ
భాగమునఁ గూల్చి నెఱపెద, నాఁగదబలు [1]పెట్టు లైన నగుఁ డండాఁకన్. 100

తే. అనుచుఁ బోటులఁ దొసఁగురక్తాంబుధార
లంగ మెల్లను గప్పిన నప్పు డొప్పెఁ
గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ
బొలుచుకులపర్వతంబుచాడ్పున నతండు. 101

వ. అట్లు ఘోరాకారుం డై నిలిచి నీకొడుకు పాండురాజుకొడుకులు బంధుమిత్రపరివారసమేతంబుగా నడరి యొక్కపెట్ట తన్నుం బొదువుదు రని శంకించి పాండవాగ్రజు దెసఁ గనుంగొని. 102

ఉ. రం డిట యొక్కఁ డొక్కఁడ దురం బొనరింపఁగ మీరు పల్వు రొ
క్కండను నేను హేతిహతకాయత డస్సినవాఁడ నన్న నా
తం డభిమన్యు బాలుని నధర్మతఁ బౌధు లనేకయోధు లొ
క్కం డన కెట్లు చంపి రటు గాఁ గొను మిబ్బవరంబు నావుడున్. 103

వ. నిరుత్తరుం డై యున్నభవత్తనయున కాధర్మతనయుం డిట్లనియె. 104

క. ఏ నట్లు సూపి చెప్పితిఁ, గాని యది రణంబుపాడి గామి యెఱుఁగుదుర్మ
రా నీను నీదుపయి మ, త్సైనికులను వెఱవ కాయితము గమ్ము నృపా. 105

క. తల చక్క ముడిచికొని ద్రిం, డలవడ బంధించి పోరి కమరి నిలువు నీ
వలచినయట్టివ యిచ్చెద, నలఘుశిరస్త్రాణకంకటాదులు నెమ్మిన్. 106

వ. మఱియు నొక్క తెఱంగు నీమనంబున మెచ్చును నచ్చెరువును నెలకొనం బలికెద నాకర్ణింపుము. 107

తే. ఏఱికొనుమీవు నొకని మాఱ యేవురందు, వాఁడు నీతోడఁ దగఁ బోరు వాఁడువానిఁ
జంపి మహి యేలువాని చేఁ జచ్చి త్రిదివ, సౌఖ్యమొందుము చేసితి సమయ మేను.

వ. అని పలికి యుజ్జ్వలవివిధవర్మంబు లాతనిముందటం బెట్టించి. 109

క. విను జీవముతో నిన్నుం, జననిచ్చుట యొండు దక్క సమరంబునఁ గో
రినయది నీకొసఁగెద నిం,తన చెడియెనె యకట యన్నదమ్ములకూర్ముల్. 110

---

1. గ. పెట్టు లౌనొ- అ. పట్టు లైన.

వ. అనిన విని నీతనయుం డట్లు కాక నీవు నా కలిగెదవే యని కనకచిత్రితంబు లగు శిరస్త్రాణకంకటంబులు గైకొని ధరియించి కాంచనాచలంబు ననుకరించుచు గద చేత నమర్చి పాండవాగ్రజుం గనుంగొని. 111

సీ. కవలలో నొకఁ డొండె కిరీటి యొండె వృకోదరుఁ డొండె నీవొండెఁ జేత
గద గొని యెక్కటికయ్యంబునకుఁ బూని, యేర్పడ నిలిచిన నీక్షణంబ
సమయంగఁ జూచెదఁ గ్రమమున మీరెల్ల, నొకఁడొక్కఁ డేతేరఁ బ్రకటబాహు
దర్పంబు వొంగ డొండ ధరఁ గూల వ్రేయుచు, వచ్చెద మఱియు నీవారిలోన

తే. నలిగి యెవ్వఁడు దాఁకిన నట్లు నాదు
గదకు నెర సేసి పేర్చెదఁ గడు గదార
ణంబు నాతోడఁ జేయ మన్మథహరుండుఁ
గడఁగ లేఁడు మీ కెందుఁ బోఁ గలదు నేఁడు. 112

వ. ఇవ్విధంబున దుర్యోధనుం డుద్ధతుం డై మఱియుం బెద్దయెలుంగునఁ బలుకుచుండ నతండు విన కుండఁ బద్మనాభుండు పాండవాగ్రజున కిట్లనియె. 113

చ. ఇతఁడు గదారణంబునకు నీకొలఁదిగ నినుఁ బిల్చినగ మరు
త్పతిసుతుఁ గోరినం జిఱుతతమ్ములలో నొకని వరించినగ
మతి సెడి రొక్కొ వీర లనుమాటకుఁ బాత్రము గాదె సాహసం
బుతఱిమె మేదినీశ యిది బుద్ధి దొఱంగి తనుగ్రహంబునన్. 114

చ. ఒకరునిఁ జంపి తేని సకలోర్వియుఁ గైకొను మంట నీవు మున్
శకునికి మాయజూదమున సంపద లెల్లఁ ద్రయోదశాబ్దభో
గ్యకృతి నమర్చి యొడ్డినటు లైనది పందెపుఁగయ్య మయ్యె శ
త్రుకులము నెల్ల దుఃఖపడి త్రుంచుట దాఁ దుదిఁ బండె మాడనే. 115

చ. నరవర యెక్కటెక్కటి పెనంగఁగ భీముని నైనఁ బన్నఁ గా
దరయఁగ భీముకంటె గదయందలికౌశల మెక్కు డీమహీ
శ్వరునకు భీము మేన బలసంపద మిక్కిలి దానఁ బోవునే
వెరవునఁ గోలుపోదె భుజవీర్యము పోరుల నెందుఁ జూడమే. 116

వ. అనిన విని మహాబలనందనుండు వసుదేవనందనున కిట్లనియె. 117

—శ్రీకృష్ణుఁడు భీము నగ్గించి దుర్యోధనులోడిగదాయుద్ధమునకుఁ బనుచుట.—

మ. గద నాచేతికి వచ్చినప్పుడు మహోగ్రక్రీడమై లోకము
ల్పదునాల్గున్ సమయింతుఁ బో మ్మనుసముల్లాసంబు నన్నొందు దు
ర్మదసంరంభ[1]వికత్థమం డయినకౌరవ్యాధముం డేల్లు నా
కెదు రై ప్రాణముతోడఁ బోవు నృపు నిల్లే లొత్తె దీమాత్రకున్. 118

తే. వాని[2]గదభారమునకు నోర్వకయు నాదు,పటుగదాదండ ముద్దండబాహుదర్ప

---

1. క. వికత్థనుండు- గ. వితర్కనుండు. 2. గ. భారమనుమాటవలదు నాదు-అ. గదభారమునకోర్చిపూని.

లీల విలసిల్ల వేఁ్రియుదు నేలఁ గూల, సంతసముతోడ మెచ్చు పుట్టింతు నీకు. 119

వ. అనుటయు నచ్యుతుండు ప్రియం బెసంగ నాకిమ్మీరమర్దను మొగంబునఁ జూడ్కి నిలిపి. 120

మ. బకవిధ్వంసన మాచరించితి హిడింబప్రాణముల్ గొంటి కీ
చకనిర్మూలనకేలి సల్పితి జరాసంధాంగకస్వైరభం
జకలీలన్ విలసిల్లి తీవవి మనుష్యస్ఫూర్తిమాత్రంబులే
యొకమర్త్యుం డెదు రెట్టు నీకు మదిలో నూహింప కిట్లాడితిన్. 121

క. కాళింగాదిక్షోణీపాలుర నున్మదమహాద్విపప్రకరములన్
నేల నిడి కాలఁ జమరితి, వాలినకురునృపకుమారవర్గంబులతోన్. 122

వ. అని పలికి కురుపతిదెసఁ గటాక్షవీక్షణంబు నిగుడ నెడియు. 123

తే. వాలి దుశ్శాసనునిఱొమ్ము వ్రయ్యఁ జీరి, నీవు నెత్తురు ద్రావంగ నిన్ను నతఁడు
సూచుచుండియు వెఱసొచ్చి స్రుక్కెఁ గాక, కవియఁజాలెనె నీపయిఁ బవనతనయ.

చ. అగపడి కచ్చువెట్టి యితఁ డాడినమాటల కిప్డు బల్లిదుం
డుగఁ గొని యేను బల్వురుఁ గదుర్వడి నీతనిఁ జంపకుండ నే
మిగ సమయంబు సేసి తిది మేలొకొ యంటి నృపాలుతోడ నీ
మగఁటిమిచందముల్ దలఁచి మారుతనందన యాఱడిల్లితిన్. 125

చ. తులువతనంబునన్ సభకు ద్రోవది ముందల వట్టి యీడ్చి య
ట్లలఁపఁగఁ జూచి నీవు దగ నాడినరెండుదెఱంగులందుఁ బెం
పొలయఁగ దుస్ససేనుపని యొక్కటి దీర్చితి తీర్పు మింక బా
హులకసి వోవ వీనిపనియుం ద్వరితక్రమవిక్రమంబునన్. 126

తే. పరజయము నొంది కట్టుము పట్టమిలల, ధరణిరాజ్యంబునకు ధర్మతనయుఁ బ్రీతి
బంధులకు నెల్లఁ గన్నులపండు వగుచు, నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు.

వ. అని మఱియును. 128

చ. బరవస మొప్ప నీవు గదపండువు సేయఁ దలంచి తాఁకినం
గురుపతి నిర్జితుం డగుటకుం బవనాత్మజ యేను బూఁట పో
టరితన మెల్లఁ జూపుము కడంగుము నీ వని యేలిమాటమై
నరవర ధర్మసూనుఁడు విజయం బొసఁగెన్ మఱందికిన్. 129

వ. ఇవ్విధంబున వృకోదరునకు జయప్రదంబు లగుమాట లాడి దుర్యోధనుండు దండి
మగండు శ్రమంబునుం జాలఁ గలండు నీవతిప్రయత్నంబునఁ బెనంగవలయుఁజుమ్మీ
యని పలికె నప్పుడు సాత్యకి యాసమీరనందను నగ్గించెఁ బాంచాలురుఁ దక్కనుం
గలుగుధరణీశులు నబ్బలుమగనిఁ బ్రశంసించి రతం డగ్రజునాననం బాలోకించి.

చ. వినుము నరేంద్ర యేను బలవిక్రమముల్ వొగడొంద నిక్కల
ఘ్నునిపయి నామనంబునతికోపము పార్థుఁడు ఖాండవంబునం

దనలము పర్వఁ జేసినటు లగ్గలికర్ణ నిగిడించెదర్గ గదం
గొనియెదఁ బ్రాణముల్ మహి యశఃకుంతితశాస్త్రిగ నేలు మంతయున్. 131

ఆ. మహితకీర్తి పుష్పమాలికఁ బూన్చెద, నిన్నుఁ జీకురాకు నేఁడు వనరుఁ
గాక శకునిబుద్ధికతమునఁ దమ కింత, పుట్టె నని తనూజపాలియు బెట్టేఁగి. 132

వ. అని పలికి సన్నాహంబు శోభిల్లు చుండ గదాదండంబుఁ గేల నమర్చి వృత్రున కభిముఖుం డగువాసవుండునుంబోలె దుర్యోధనుదిక్కు మొగం బై నిర్వ్యాళ హం బైనశుండాలంబుచందంబున నున్నయన్నరపతిఁ గనుంగొని తమయన్న యుఁ దమ్ములు నెమ్మనంబుల సంతసిల్లఁ దాను సమరోల్లాసభాసితుం డగుచు నతని కి ట్లనియె. 133

ఉ. ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక లక్కయింటఁ జి
చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ [1]దూలఁ బుచ్చి తా
చుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడఁగ ద్రౌపది భంగపెట్టితి
ట్టటన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము చేరి తగ్గ మై. 134

సీ. గాంగేయకుంభజకర్ణశల్యాదులు, నీకుఁ గాఁ బెనఁగి యనేకబంధు
మిత్రులు మడిసిరి ధాత్రీపతులఁ దోడు, తెచ్చితి పలువురఁ జచ్చి రంత
వట్టువారును దోడఁబుట్టువు లెల్లను, గూలి రంతటికిని మూల మైన
శకుని గీటడఁగె నింకకొకరుఁడ వీ వున్న, వాఁడవు విను నిన్ను నేఁడు నాదు

తే. గదకు నెర సేసి లోకంబుకల్మషంబు, లేను బాపెద నీరజ్జు లేల నాకుఁ
జక్కనై రమ్ము మద్భుజాస్తంభశుంభ, దుగ్రకేళికిఁ బాత్ర మై యోట దక్క.

చ. అనుడు నెదిర్చి నీతనయుఁ డాతని కి ట్లను నేల రిత్తగ
ర్జనములు గాన వే పటుభుజాకలితోగ్రగదాసముద్భటుఁ
నను నిటు రమ్ము నూపుము రణంబున నీదుబలంబుఁ జేవయుఁ
మన మిటు చేరి నిల్చి వెడమాటల యాడుచు నున్కి యొప్పునే. 136

క. వినుము గదారణమున నను, జెనయఁగ వాసవున కైనఁ జెల్లదు [2]నీ వీ
యనిఁ బాడి దప్ప కుండఁగఁ, బెనఁగుము ప్రాణంబుతోడఁ బ్రదిలెదు భీమా. 137

వ. అనిన విని పాంచాలురుం దక్షిణజనపాలురుం బ్రశంసించి మత్తమాతంగంబుఁ డలశబ్దంబుల నుబ్బం జేయునోజ రారాజుఁ బ్రహర్షంబు నొందించిరి గజబృంహి తంబులు హయహేషితంబులును జెలంగె నాయుధంబు లెక్కుడుమెఱుంగులఁ బొలిచెఁ దదనంతరంబ యెల్లవారును నెడగలుగఁ గూర్చుండిరమ్మహావీరులుదలపడు వా రై వీరోద్రేకంబునం జేసి యతిలోకం బగునవష్టంభంబున విజృంభించి యొం డొరుల నవలోకించి రట్టియెడ. 138

1. అ. గోలుపుచ్చి. 2. క. నీవే యని పాడి;-గ. నీవే యొన పాడి.

భీమదుర్యోధనులగదాయుద్ధము చూడ బలరాముఁడు వచ్చుట.

సీ. యదుకులదీపకుం డగురాముఁ డవ్వార్త, యంతక మును విని ♦ యక్కుమారు
లాత్మశిష్యులు గాన ♦ యాహవ మీక్షింపఁ, దీవ్రయానమున నేతెంచి దృష్టి
గోచరుం డగుటయుఁ ♦ గురునాథ తగ నెల్ల, వారు నెదుర్కొని ♦ గారవమునఁ
బ్రణమిల్లిన నతండు ♦ ప్రత్యభివందన, మాచరింపంగ ధర్మాత్మజుండు
తే. సమ్మదంబునఁ బరిరంభణమ్ము సేసె, నరుఁడుఁ గవలును ద్రౌపదీనందనులును
వందనం బొనరించిరి ♦ వారి నాతఁ, డర్హభంగి భాషణముల ♦ నాదరించె. 139

క. హరియును సాత్యకియు వినయ, భరితాంతఃకరణు లగుచుఁ ♦ బ్రణతు లయిన న
య్యిరువురను గ్రుచ్చి బెరయం, భరిరంభణ మాచరించెఁ ♦ బరమప్రీతిన్. 140

వ. ఇత్తెఱంగున నెల్లవారలు నాబలదేవునిఁ గాంచి కుశలసంప్రశ్నంబు సేసి రయ్యా
దవపుంగవుండు సదుత్తరం బిచ్చి యేను బోయి పెక్కుదినంబు లయ్యె నని యుగ్గ
డించి మిమ్ము నిందఱను జూచుటకును నాశిష్యులగదాయుద్ధం బనుసంధించుటకును
వచ్చితి ననియె నమ్మరుత్సుతుండును భవత్సుతుండును గదలు చేతులన యుండ
నతనిఁ జేరి భక్తిం బ్రణామంబు లాచరించిన నతం డాదరించె నంతఁ గాంతేయా
గ్రజుండు రౌహిణేయుతో నన్నదమ్ములయిరువుర మెక్కటిపోరు చూడు మని పలికి
వా రట్లు ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధులైన తెఱం గెఱింగించిన నతండు లెస్స
కాక యని యనుమతి సేసెనని సంజయుండు ధృతరాష్ట్రునకు రామునాగమనంబు
సెప్పె ననిన విని తదీయప్రవర్తనశ్రవణకుతూహలాయత్తచిత్తుం డైన జనమేజ
యుండు వైశంపాయనున కి ట్లనియె. 141

తే. ఉభయవాహినిసంగరోద్యోగసమయ
మున హలాయుధుఁ డేతెంచి ♦ మురహరుండు
పాండురాజసూనులయెడఁ ♦ బక్షపాతి
యని విరాటాదిబంధులు ♦ వినఁగఁ బలికి. 142

క. హరి మెఱుఁగనిచక్కటియును, బురుషార్థము నా కెఱుంగఁ బోలునె యీని
ష్ఠురత వినఁ జూడఁ జాలక, సరస్వతీతీర్థమునకుఁ ♦ జనియెదుబుద్ధిన్. 143

వ. మీ కెఱింగించి పో వచ్చితిఁ బోయి వచ్చెద నని వాసుదేవధర్మజు లొడఁబడి
యనుపఁ జనియె నని వింటి బలదేవుండు తీర్థయాత్ర నిర్వర్తించిన తెఱంగును భీమ
సుయోధనులగదాయుద్ధంబు చెల్లినభంగియు నతని కాలోన నచటి కేఁగుదేర
సమకూఱినవిధంబును వివరించి చెప్పు మనిన జనమేజయునకు వైశంపాయనుం డి
ట్లనియె. 144

సీ. వినుము నరేంద్ర యక్కవిధమునఁ జని యమ్మ, హాత్ముండు గోసువర్ణాదు లైన
దానార్హబహుపదార్థంబులు దనయగ్ని, హోత్రంబు దెచ్చుట ♦ [illegible]

బుచ్చె ననేకవిప్రుల నాప్తసచివుల, వలయురథద్విపాశ్వములగముల
రావించెఁ దండులప్రముఖభోజనసాధ, నములు సంపన్నహృద్యములు గాఁగఁ

ఆ. దేరఁ బనిచె నిట్లు తీర్థయాత్రాసంవి, ధాన మాచరించి మానసీయ
మగుసరస్వతీమహాంభోధిసంగమ, స్థానమునకుఁ జనియె సవినయముగ. 145

వ. అది ప్రభాసం బనుపేరం బరఁగున [1]ట్లందులకుఁ జని తీర్థసేవనం బనుష్ఠించి యంత
నుండియుఁ బథిశ్రాంతిప్రయాణంబుల సరస్వతిచేరువ నడచి తదీయసకలతీర్థంబు
లాడుచు నన్నపానంబుల నాసనశయనయానంబులను ధేనుకనకరత్నాంబరాభర
ణాదిద్రవ్యంబులను విప్రుల నతిప్రీతులఁ జేయుచు బాలవృద్ధవనితావికలాంగదుర్బల
ప్రాయులఁ బరిశ్రాంతు లైనయెడలం [2]గడిమికొని యథేష్టప్రకారంబుల శరీరస్థితి
నడపింపఁదగువారి నియోగించి మఱియు ననేకధర్మంబు లాచరించుచుఁ గురుక్షే
త్రంబునకు వచ్చె ననుటయు జనమేజయుం డాతీర్థవిశేషంబులు వివరించి చెప్పు
మనుడు వైశంపాయనుం డిట్లనియె. 146

క. మును చనియెఁ బ్రభాసమునకు, నని చెప్పితి నతని నది మహోత్తరతీర్థ
మ్ము నరేంద్ర యందుఁ జంద్రుఁడు, [3]దనయక్ష్మం దీర్చుకొని గతవ్యథుఁ డయ్యెన్.

## ప్రభాసతీర్థప్రభావవర్ణనము.

వ. అత్తెఱం గెఱింగించెద దక్షకన్యకల నశ్విన్యాదు లగుసప్తవింశతిసంఖ్యలఁ జంద్రుం
డు వివాహం బయ్యె నందు రోహిణి రూపాతిశయవతి యగుటంజేసి తదాసక్తుం
డైనఁ దక్కటివారు వగ నొంది తండ్రికడకుం జని చంద్రునియన్యాయం బెఱిం
గించిన నాప్రజాపతి చంద్రునితో నుగ్గడించి యిది చాల నధర్మం బింక నిట్లు
సేసితేని శపింతుఁ జుమ్మీ సముఁడ వై వర్తింపు మనుటయు నమ్మాట దెస ననా
దరంబు సేసి యతఁడు వెండియుఁ దొంటియట్ల వర్తించిన నెఱింగి యమ్మహా
త్ముండు గోపించి యక్షుఁడవు గాను మని శాపం బిచ్చిన నయ్యోషధినాథుండు
నానాఁటికిఁ గృశుం డయ్యె నట్లా తెవులుచేత నతండు పోఁడిమి మాలిన నోష
ధులు పస చెడియె దానఁ బ్రజలు డయ్యం జొచ్చి రది చంద్రకార్శ్యహేతుకం
బగుట యనుసంధించి. 148

క. దేవత లమృతాంశునితో, నీ వేటికిఁ గృశుఁడ వైతి నిక్కము చెపుమా
నావుడుఁ దన తెఱఁ గేర్పడఁ, గా వారికి నతఁడు సెప్పెఁ గౌరవముఖ్యా. 149

క. విని వార లతనిఁ దోడ్కొని, చని ప్రార్థించుటయుఁ దగఁ బ్రసన్నుం డై యి
ట్లను దక్షుఁ డఖిలభార్యా, జనులయెడన్ నడవవలయు శశి సమవృత్తిన్. 150

వ. అట్లు నడచుచు సరస్వతీజలనిధిసంగమకలితం బైనతీర్థంబుజలంబుల నిమగ్నుం డై
వృద్ధిఁ బొందు వఱసన పది**యే**నుపది**యే**నుదినంబులు సంక్షయంబును బ్రవర్ధనంబు
నొందం గలవాఁ డని చెప్పి వెండియు. 151

---

1. క. ట్లందు సని. 2. అ. దఱిమికొని. 3. క. గ. దనుక్షయము.

క. అమవస సమవస నాతీ, ర్థమునఁ గృతస్నానుఁ డై సుధాకరుఁడు ప్రవృ
ద్ధిమహితతనుఁ డగు నని యతఁ, డమరుల వీడ్కొల్పి యామ్యదిగాంకునితోడన్.

వ. వనితలకు విప్రులకు నవమానంబు సేయకుమీ యని పలికి వీడ్కొలిపె నట్లు
శాపమోక్షంబు గని చంద్రుం డాతీర్థంబునకుఁ జని తదీయజలస్నానంబున నాప్యా
యితశరీరుం డై లోకప్రభాసుం డయ్యె నది కారణంబుగా నాతీర్థంబు ప్రభాసం
బను పేరం బ్రసిద్ధి నొందె నం దుండి యారోహిణీనందనుం డరిగి చమసోద్భేద
నం బనుతీర్థంబున నొకరాత్రి వసియించి యుదపానంబునకుం బోయె దానివిశేషం
బాకర్ణింపుము. 153

క. త్రితుఁ డనఁగా ద్వితుఁ డన నే, కతుఁ డనఁగఁ దపస్విసుతులు గల రావిప్ర
త్రితయము భూపాలురకును, గ్రతుదీక్ష లొనర్చి ధేనుగణముం బడసెన్. 154

వ. ఇట్లు వడసి యొక్కట నేతెంచు నెడ నయ్యేకతద్వితులు నిజభ్రాత యగుత్రితుని
వంచించి తా రాగోవులఁ దోలంగ నడిచి కొనిపోవువారుగాఁ బాపబుద్ధి కుత్స
హించి రాసమయంబునఁ దెరువున నొక్కవృకం బున్నఁ దద్భయంబునం దొలం
గం బోయి ప్రమాదంబునఁ ద్రితుండు నూతం బడిన నయ్యిరువురు నతని నుపే
క్షించి ధేనువులం గొనిపోయి రమ్మునికుమారుండు నిర్జలం బైనయయ్యుదపానం
బున నుండి సోమపానంబు సేసినంగాని యీదురితంబు వాయ దని తలంచి యజ్ఞ
సాధనంబునకుఁ బ్రతినిధులు సంకల్పరూపంబున సంపాదించికొని క్రతు వొనరించిన
దేవతలు సన్నిధి సేసి హవిర్భాగంబులు గైకొనిరి సరస్వతీజలంబు తత్కూపం
బున నుద్గతం బై యాసవనపతి నుద్ధరించె నయ్యమరులు వరం బడుగు మనిన
నమ్మహాద్విజుండు. 155

తే. వినుఁ డుపస్పర్శ మిందుఁ జేసినయతండు
వడయువాఁడు మహితసోమపానఫలము
వరము నా కిది యనుటయు వార లట్టు
లవుట సంప్రీతిమై [1]నిచ్చి దివికిఁ జనిరి. 156

వ. అట్టియయ్యుదపానంబును సేవించి వినశనంబునకుఁ జనియెఁ ద త్తీర్థంబు హీన
జాతులకుఁ బొడసూపక నశించుఁ గావున వినశనం బనం బరఁగె మఱియు భూమి
కంబునకుఁ బోయె నది యప్సరోగీతనృత్యవిహారభూమి యగుట భూమికం బనఁ
బ్రసిద్ధం బయ్యెఁ బదంపడి గంధర్వతీర్థంబునకు నేఁగె నది విశ్వావసుప్రభృతిగం
ధర్వతపస్సిద్ధిస్థానం బం దుండి గర్గస్రోతంబునకుఁ జనియె నందు గర్గుండు సన్ముని
సేవితుం డై చిరకాలంబు వసించె నచ్చోటు గదలి యాబలభద్రుండు. 157

ఆ. వినుము శంఖతీర్థమునకు నైసర్గిక, మునకు నాగధన్వమునకు వరుసఁ
జనియె నాగధన్వ మనునది వాసుకి, స్థాన మచటఁ గొల్తు సకలసురులు. 158

1. గ. జెప్పి.

వ. నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించి రం దుండి యానీలాంబరుండు నైమి
శంబున కరిగె నయ్యెడం దొల్లి [1]సరస్వతి యనునేఱు దూరంబై యుండ నైమిశా
రణ్యవాసు లగుమునులు గ్రతువు సేయం దొడంగిన నాసరస్వతి వారల సంభా
వించుటకు మలంగి పాఱినకతంబునం దటసమీపం బయ్యె నవ్విశేషంబు విని
విస్మితుం డగుచు నాహలాయుధుం డాతీర్థంబుఁ గొనియాడి సప్తసారస్వతంబున
కుం బోయె నచ్చట మంకణుం డనుమహాముని వసించుఁ దొల్లి నలినభవుసత్రం
బున నైమిశారణ్యమునులయాగంబున గయునిక్రతువున నుద్దాలకునధ్వరంబున
వసిష్ఠునసప్తతంతువున గురునిసవనంబున వెండియు నొకమఱి యాపరమేష్ఠియజ్ఞం
బున హిమవత్పుష్కరాదు లైనతత్తత్పుణ్యదేశంబులకు సుప్రభయుఁ గనకాక్షియు
విశాలయు [2]సురతన్వయు నోఘమాలయు సువేణియు విమలోదకయు నను నామం
బుల నారీవేషయుక్తయై సరస్వతి చని యజమానసకలదేవమునిసంభావన
వడసె నట్టిసప్తాకారంబుల నాసంయమియాశ్రమంబునఁ బ్రవర్తించుట నది సప్త
సారస్వతం బనం బరఁగె నమ్మంకణునిచరితంబులు మఱియునుం గల వాశ్చర్య
కరంబులు వినుము. 159

మంకణమహామునిమాహాత్మ్యాభివర్ణనము.

సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండి యాచేరువ నొర్రు తడుపు
గట్టక నీళ్లాడఁగాఁ జూడఁ దనదుశుక్లము నిర్గమించిన ఘటసురక్షి
తము సేయ సప్తభేదము లొంది యది సత్పురుషు లైరి వారు మరుద్గణంబు
నకు సంజననకారణం బైరి విను మొక్కనాఁ డత్తపస్వి వ్రేల్నాటి దర్భ
ఆ. గంటఁ గూరయసురగాఱిన నర్తించె నతఁడు తపముసిద్ధి కాత్మఁ బొంగి
జగము లెల్ల దానసంక్షోభ మొందె నిర్జరులు భీతిఁ జనిరి శంభుఁ గాన. 160
వ. కని యంతయు నెఱింగించిన నద్దేవోత్తముం డాభూదేవోత్తముపాలి కరిగి యిది
యెంతటివిశేషంబు దపంబు లిట్టివే నర్తించుట మాను మని పలికి తనయంగు
టంబు వ్రేలం గీఱిన నందు భస్మంబు గాఱిన నాసంయమి సిగ్గుపడి దండప్రణా
మంబు సేసి. 161
ఆ. దైవ మెల్లఁ దలఁప నీవ సమస్తజగంబులకును నేడుగడయు నీవ
కర్మఫలదుఁడవును గర్మప్రదుండవు, నీవ కరుణ నన్నుఁ గావు మభవ. 162
వ. అని వెండియు ననేకప్రకారంబులం బ్రశంసించినం బ్రసన్నుం డై పశుపతి యత
నికిఁ దపఃప్రభావం బక్షీణంబు గా వరం బిచ్చి చనియె నమ్మహాముని నృత్యంబు
మానిన జగంబులసంక్షోభంబు శాంతం బయ్యె నట్టియమ్మహాత్మునినివాసం బైన
సప్తసారస్వతంబుననుండి యాసీరి యౌశనసంబునకుం బోయె వినుము తొల్లి రఘు
రామునిచేతఁ జచ్చినమహోదరుం డనునసురతలపునుక యొక్కతపస్వికాలఁ

1. క. గ. చ. యయ్యేటికి దూరం బై యుండునైమి. 2. గ. జ. సుతనువును.

దగిలి పుచ్చ రా కున్న నతండు వేదనం బొందు చుండం గని యార్యులు సర
స్వతి నౌశనం బనుతీర్థంబు శుక్రుండు దపంబు సేసినచో టందుఁ బొమ్ము నీదురి
తంబు వాయు ననిన మహోదరనామధేయుం డగునాసంయమి యచ్చటికిం జనినఁ
గపాలంబు ముక్తం బయ్యె దానంజేసి యది కపాలమోచనం బనం బరఁగు
నచ్చోటు వదలి పృథూదకంబునకుం జనియెఁ దదీయవిశేషంబు వినుము గాధి
యనుమహారాజుకొడుకు విశ్వామిత్రుం డనునతండు. 163

ఆ. తండ్రియట్ల సకలధాత్రీశుఁ డై యుండి, దనుజమథనమునకు దండు వెడలి
యరుగునెడ వసిష్ఠునాశ్రమంబునపొంత, విడియఁ బరిజనములు వినయ మెడలి.

వ. అందు దుర్నయంబు లాచరించిన నమ్ముని కోపించి నిజహోమధేనువు నాలోకించి
నీబలంబు పనుపు మనిన నది దనమాహాత్మ్యంబున నచట నావహిల్లినఘోరా
కారు లగువీరులఁ బనుప వార లారాజువరూథిని మడియించిన శేషించినజనం
బులు పలుగడలం బాఱి రట్లు దురవస్థం బొందునాసేనం జూచి యగ్గాధినందనుం
డెల్లశక్తులకంటెఁ దపశ్శక్తి యెక్కు డగుట యెఱింగి యాపృథూదకంబునఁ
దపంబు సేయుచుండ దానికి దేవపతి విఘ్నంబు సేయ మఱియు నియమనిష్ఠుం డై
బ్రహ్మచేత బ్రాహ్మణ్యంబును బడసె నత్తీర్థంబుననుండి బలభద్రుండు బకాశ్రమం
బున కరిగె నయ్యెడ బకుం డనుమునీంద్రుండు తొల్లి. 165

క. ధృతరాష్ట్రుం డనుధరణీపతి దన్ను నధఃకరించి పలికినఁ గోపా
న్వితుఁ డై హోమ మొనర్చెను, ఘృతనరమాంసముల నతనికిం గీడొదవన్.

ఆ. నఱుకఁబడినయడవి తెఱఁగున నతనిరా, ష్ట్రంబు సకలజంతుసముదయములు
నులియ విన్ననయ్యె నులికి యాభూపతి, యత్తపస్విపాలి కరుగుదెంచి. 167

వ. దండప్రణామం బాచరించి పెక్కుభంగులఁ దేలించి మున్ను ధేనునిమిత్తం బగు
దుర్భాషణంబుల నింత పుట్టుటం జేసి యాసంయమికి ననేకధేనువుల నొసంగి
దురితోపశాంతి యొనర్చె నట్టిబకాశ్రమంబుననుండి రేవతీరమణుండు యయా
తంబునకుం బోయె 'నందు యయాతియజ్ఞంబున భోజనసమయంబున ఘృతదుగ్ధా
దులయందు విప్రుం డెయ్యది గోరిన నది' యెల్ల సరస్వతి సంపూర్ణమనోరథంబు
గా నొసంగుచు వచ్చె నయ్యెడ గదలి వసిష్ఠావగాహంబునకు వచ్చెఁ దత్ప్రదే
శంబు దొల్లి విశ్వామిత్రునాశ్రమం బతండు వసిష్ఠునెడఁ దపోవిషయమత్సరం
బునఁ గుపితుం డై. 168

సీ. అతని వధించుటకై సరస్వతి మదిఁ, దలఁచిన నానది తత్క్షణంబ
సౌమ్యవేషంబునఁ జనుదెంచి నిభృత యై, పని యేమి యనిన నమ్ముని వసిష్ఠుఁ
గొనిరమ్ము నాకడ కని పంచెఁ బంచిన, వార లిద్దఱతపోనైభవంబు
నకు భయ మందుచు నరనాథ యరిగి వ,సిష్ఠున కప్పని సెప్పెఁ దెలియ

తే. నాతఁ డవ్వాహినికి నిట్టు లనియె నన్ను, నీవు గొనిపోక తక్కినఁ నీకు శాప

మిచ్చు నగ్గాధిసుతుఁడు దక్కదిచ్ఛ సలుపు, మించు కేనియుఁ గొంకక మెప్పు డైన.

వ. అని యనుజ్ఞ యిచ్చిన సరస్వతి యత్తపస్వి తనచేరువ నొకప్పుడు జపయుక్తుం డై యుండం గూలాపహరణంబు సేసి వఱుత నమ్మహాత్ముం గొనిపోయిన నతం డాంగిరసమంత్రంబుల నత్తరంగిణిం బ్రణుతించె నదియు సంప్రీత యగుచు నమ్ముని విశ్వామిత్రునకు సన్నిహితుం జేసిన నతని నగ్గాధిసూనుండు వధియింప సాధనం బన్వేషించు నాలోన వంచించి యాప్రవాహం బవ్వసిష్ఠుఁ దొలంగించినఁ గోపించి విశ్వామిత్రుండు శోణితవాహిని వగు మని శపించిన నొక్కసంవత్సరం బత్తటిని దైత్యసేవిత యై యుండె నత్తీర్థంబునకుఁ గొందఱు మును లేతెంచి యాదురవస్థ యాలోకించి 170

తే. అమ్మహానది నడిగి వారు రత్తెఱంగు, దెలిసి నిజయత్నబలమునఁ దీర్పఁ దీఱె నట్టిదురవస్థ వారలు నాత్మఁ బ్రీతి, యూనఁ జలిపిరి పావనస్నానవిధులు. 171

వ. అప్పుడు గొందఱు బ్రహ్మరాక్షసు లమ్మునులకుఁ బ్రణమిల్లి తమచేసినవిప్రద్వేష గురుజనావమానదుష్టాన్నభక్షణంబు లగుపాతకంబులు వేఱు వేఱ యుపన్యసించి గనే మియ్యెడ వసియించి యున్నవారము మాకు నిష్కృతి యనుగ్రహింప వలయు ననుటయు వారలాపనికి సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది యరుణానది వలన నట్టితెఱం గగు నెఱుంగుం గావున నిగూఢంబుగా నరుణం దనలోనికిఁ దెచ్చి దీన మజ్జనంబు సేయుఁ డని యనుమతి సేసిన. 172

ఆ. అజ్జలమునఁ గ్రుంకి యాబ్రహ్మరాక్షసుల్, తనువు లచట విడిచి ధర్మపరుల గతికిఁ బోయి రట్టు లతిగూఢ మై యున్న, యరుణ తెఱఁ గెఱింగి యమరపతియు.

వ. తాను సఖ్యంబు సేసి నమ్మించి నముచిఁ జంపినపాపంబు తదీయస్నానంబునం బాపికొనియె నట్టిపుణ్యస్థానంబుననుండి యత్తాలధ్వజుండు సోమతీర్థంబునకుం జనియె నది సోముండు రాజసూయంబు చేసినచో టయ్యెడ ననిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధిపత్యంబునకు నభిషేకంబు సేసి రతండు తారకాదు లైన యసురులం దెగటార్చె నతనిజననాదివృత్తాంతంబు కౌరవవంశజాతుండ వగునీకు వినఁ దగుఁ జెప్పెద నాకర్ణింపుము. 174

## కుమారస్వామిప్రభావాభివర్ణనము.

ఆ. హరుఁడు దనదువీర్య మగ్నియం దిడిన న,హింపఁజాల కజున కెఱుఁగఁ జెప్పి యతఁడు వనుప దాని నగ్ని గంగాగర్భ,భూతముగ నొనర్చె భూపవర్య.

వ. తేజోమయం బైనయాగర్భంబు గంగ హిమవన్నగంబుమీఁద సముత్సృష్టంబు సేసినఁ గనకమయం బైనశరస్తంబంబున నగ్నిసన్నిభుం డగుకుమారుం డై యొప్పె నయ్యెడ మెలంగుకృత్తిక లక్కుమారుం గని పుత్త్రార్థిను లై యం దఱు నొక్కపెట్ట వీఁడు మాకొడు కని పలుకుచుఁ గరతలంబుల నెత్త నప్పు డయ్యార్వురచన్నులుం జేపిన నద్దారకుండు చంద్రనిభంబు లైనయాననంబు

లాఱు దాల్చి సప్తమాతృస్తన్యపానం బాచరించిన విస్మయప్రమోదభరిత లై
వార లాశిశువు నెప్పటియెడన యునిచి రట్లయ్యగ్నిభవుండు గాంగేయుండును
శరజన్ముండును గార్తికేయుండును నయ్యె నయ్యెడకు బృహస్పతి యేతెంచి జాత
కర్మాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి పోయెఁ దత్ప్రదేశంబు దనమహానుభావం
బున జాతరూపమయం బై యుండు. 176

క. విను మఱికుమారుఁ డుత్తమ, మనఁ దగియె నుతపము దనవిహారముగా వ
ర్ధన మొందె ధాత్రి ధాత్రిగ, ధనురాగమమును శ్రుతులును దనుఁ గొలువంగన్.

వ. ఒక్కనాఁ డక్కుమారుం జూచువేడుక శివుండు శైలకన్యకయుం దానుఁ బ్రకృష్టబల
పరాక్రమంబులు నానాప్రకారవదనశరీరంబులు గలుగు ప్రమథగణంబు గొలువ
నయ్యెడకుఁ జనుదెంచె నప్పుడు బ్రహ్మవిష్ణులును నింద్రాదిదిక్పాలురును రుద్రా
దిత్యమరుద్వసుప్రభృతిసకలసురులును గరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధర
యక్షాదిదివ్యులును మునులును మఱియుఁ బితృదేవతలును ననుచరసమేతు లై
యేతెంచిరి మూర్తిమంతంబు లై యోషధిసరిత్సముద్రపర్వతంబులు నరుదెంచె
నిట్లు నిజదర్శనకౌతుకంబున వచ్చినయమ్మహాసమూహంబున కభిముఖుండై యోగ
బలాన్వితుం డగునబ్బాలుండు రా నన్నీలగ్రీవుండు నిరీక్షించి యంతర్గతంబున.

తే. ఉమయు నగ్నియు గంగయు నుండ నన్ను, గారవంబున నధికునిఁగాఁ దలంచి
చక్క నాపాలి కేతెంచు నొక్కొ వీఁడు, సంభృతస్నేహభక్తివిస్రంభుఁ డగుచు.

క. అనుచుండఁగ నమ్మువ్వురు, తనతనచిత్తమున నట్ల తలఁపఁగ నది మె
ల్లను దివ్యబోధమునఁ గని,కొని యబ్బాలుండు యోగకుశలత వెలయన్. 180

వ. మూర్తిచతుష్టయంబు దాల్చి యన్నలువురయొద్దకు నేకకాలంబునం జనినం గని
యెల్లవారు నద్భుతమగ్నమానసు లై రక్కుమారుండు పదంపడి యొక్కరుం
డై పొలిచి నిలిచె నప్పుడు. 181

చ. హరుఁడును గంగయుఁ శిఖియు నంబికయుం బ్రణిపాతపూర్వని
ర్భరవినయంబుతోడఁ దగఁ బద్మజుఁ జేరి మహాత్మ యిక్కుమా
రురుచిరమూర్తికిన్ గుణగురుత్వవిభూతికి నీడు గాఁగ ని
మ్మరసి యుదాత్త మైనపద మన్న నతండు ప్రియం బెలర్పఁగన్. 182

వ. దేవహితపరుం డగుటంజేసి చిత్తంబునఁ దలపోసి వీఁడు దేవసేనకుం బతి
యగుం గాక యని నిశ్చయించి వారల వీక్షించి యవ్విధ మెల్లవారును వినం
దెలియఁబలికి శక్రవరుణాదు లగుమేటివేల్పుల నబ్బాలునకుం జూపి వీరు నీకు
రక్షణీయు లని యప్పగించె నయ్యమరవరు లక్కుమారు నభిషేకంబు సేయుద
మని వారిజాసనుం బురస్కరించుకొని యెల్లవారును దోడన యరుగుదేర సర
స్వతీసమీపంబునకుం జని సకలరత్నమయం బైనదివ్యపీఠంబు హిమవంతుండు
వెట్టనం దాభూతపతిపుత్త్రు నునిచి బృహస్పతి హోమకార్యంబు నిర్వర్తింప నీశాన

విష్ణువిధికౌశికులు లోనుగా నమరముఖ్యు లభిషేకద్రవ్యంబులు సారస్వతజల పూర్ణమణికనకకలశంబులు ధరియించి గంధర్వాప్సరోగణంబులు సంగీతమం గళం బాచరింప మహామునిప్రకరపుణ్యాహఘోషంబులు సెలంగ నుమా శ్రీ సరస్వతీశచీప్రముఖ లైనపుణ్యాంగనలు దీవనలతో సేస లొలుక నభిషేకించి సమ్మోదంబున సేనాధిపత్యంబునకుం బట్టంబుగట్టిరి తొల్లి తత్పవిత్రదేశంబున దేవ తలు జలాధిపత్యంబునకు వరుణు నభిషిక్తుం జేసి రవ్వరుణాభిషేకంబుకంటెఁ గుమారాభిషేకం బొప్పె నప్పావకసంభవునకుఁ గొమరుమనకమలభవశార్ఙ్గిశత

మఖప్రముఖు లగుసకలప్రభువులు దమతమయనుచరులయందు రూపగుణబల పరాక్రమాధికు లైనవారి నేటి భీమఘంటాకర్ణసంక్రమదండధరసహితు లగు ననేకవీరుల నొసంగి వారల బెరసి వర్తించుటకుఁ దగినసేనాంగసముదయంబు నమ్మహితాత్మునకు మూలబలంబుగా నొనర్చి రబ్బలంబులఁ జిత్రాభరణవర్మా యుధధరులును వివిధప్రకారాకారులు నగుగజకర్ణనికుంభకుముదాదు లైనసైని కులు మెఱసి యుల్లసిల్లి రమ్మాతృకలతో శత్రుభయంకరంబు లగుచు మాతృకా గణంబులు ప్రభాసినీవిశాలాక్షీపాలితాపురస్సరంబు లై పొలిచె నట్టియెడ. 183

సీ. శంకరుఁ డుదితభాస్కరనిభధ్వజమును, వాసవుఁ డసురవిధ్వంసకరణ
పరిణతశక్తియు హరి బలవర్ధని, యగువనమాలయు నగజ యెపుడు
మాయనివెలిపట్టుబోయిని గంగ యు,జ్జ్వలసుధామయకమండలువు గురుఁడు
దీప్తదండము వైనతేయుండు మహితమ,యూరంబు వరుణుం డుదారరూప
తే. మైనతామ్రచూడంబును నర్థవిభుఁడు, దర్పితచ్ఛాగమును శతదళభవుండు
లసితకృష్ణాజినంబును నసమసమర,జయము నొసఁగిరి ప్రీతి నాషణ్ముఖునకు.

వ. ఇట్లు సిద్ధస్వరూపదీపితుం డైనయతని నాపావక చూచుచు శంకరుండు వీని కీవిభ వంబునకు ననాయాసంబున నమరవిరోధినాశంబు గావించుటకు వలయు నని తలంచి భూతమయం బగుమహాసైన్యంబు సమర్పించె నప్పు డింద్రాదిబృందార కులు నిజబలసందోహంబులతో నాబర్హివాహను బరివేష్టించిరి శంఖభేరీపణవ గోముఖప్రముఖతూర్యంబులు దిక్కులు పిక్కటిల్లఁ జెలంగె నట్లు మహతి యగు దేవసేనకుఁ బతి యై యమ్మహాసేనుండు సురముఖ్యులఁ జూచి మీ కెవ్వారి నేనియుం జంపను జెఱుపను వలసియున్నది యట్టిబల్లిదంపుఁబగఱం బరిమార్చెద నని వరం బిచ్చిన వారలు బహులప్రమోదంబు నొందిరి సేన యార్చినఁ ద్రిలో కంబులు నాదమయంబు లయ్యె నవ్విధంబున విశాఖుని నుత్తమపదస్థునిఁ గావించి విరించివైకుంఠశ్రీకంఠులు నిజేచ్ఛఁ జనిరి పదంపడి యగ్గుహుండు దేవతలు తారకాసురునివలన నలంగి యునికి యెఱింగి. 185

క. బలయుతముగ నడచిన నబ్బలియుండు ననేకదైత్యబలములతో న
గ్గలిక నెదురు నడచెను దద్బలయుగమున కక్కజంపుఁబోరు భండన మయ్యెన్. 186

కుమారస్వామి తారకాసురుం జంపి దేవతలకు ముదంబు సేయుట.

వ. అట్టియెడ. 187

క. తనదొరలుఁ దాను దారక, దనుజేంద్రుఁడు గార్తికేయుఁ గదాఁకిన నమృతా
శనగణసన్మదసంపా, దనుఁ డగుచును శక్తి యతఁడు ధరియించె నృపా. 188

వ. అమ్మహనీయసాధనంబున ననేకకోటిశక్తు లుద్భవించి నానాదానవప్రకరంబుల
బడలువడం జేసి యుల్కాసహస్రంబుల పిడుగులతండంబుల ప్రోఁతచందంబున
విరావం బావహిల్ల నది ప్రయోగించి యమ్మహాత్ముండు మహిషత్రిపాదభృతో
దరు లనుదనుజసేనాపతులం బొలియింప నిలింపసైన్యంబులు సంరంభంబున
దైత్యబలంబులం దెగటార్చె నక్కుమారుండు ప్రయోగింప నాశక్తి పగతురం
బిలుకుమార్చి క్రమ్మఱం గరతలంబునకు వచ్చుచుండె నత్తారకుం డట్లు దమవారు
సమసిన సక్రోధుం డై యగ్గుహునిఁ గిట్టి ఱెట్టిదం బగునతనిశక్త్యస్త్రంబులతాఁ
కునం బడియె నిట్లు జయంబు సేకొని యక్కార్తికేయుండు వెలింగె విబుధులు
ప్రమోదంబు నొందిరి పదంపడి. 189

క. బలికొడుకు బాణుఁ డనియెడు, బలవదసురవల్లభుండు బాధించు నమ
ర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయ, బలిష్ఠుఁ డయి జగము లెల్లఁ భయముం బొందన్.

వ. దాని విని యమ్మహాసేనుండు. 191

మ. కడిమిం బోయి మహోగ్రశక్తినిహతిం గ్రౌంచంబు భేదించి యె
క్కుడు గర్వంబున వచ్చి మార్కొనినరక్షోనాథుఁ దత్సైన్యముం
గడువేగంబున రూపుమాపి మునిసంఘంబుల్ ప్రశంసింపఁ బె
ల్లడరెన్ నిర్జరదుందుభిధ్వనులు పుష్పాసార మొప్పారఁగన్. 192

వ. త్రిభువనానందకరుం డై విజయవిభవాతిశయంబున నొప్పె నిట్లఖిలలోకసంభావ
నీయం బగుషణ్ముఖచరితంబు లాకర్ణించి కృతార్థుండ నైతి. కౌరవాన్వయపావన
యాబలదేవువృత్తాంతంబు కొంత విను మతం డత్తీర్థంబునఁ బ్రతిష్ఠితుం డైన
కుమారునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యందలిపెద్దలు కుమారాభిషే
కంబు సెప్పఁ జెవులపండువు సేసి. 193

ఆ. అగ్నితీర్థమునకు నరిగె నయ్యెడఁ దొల్లి, యగ్ని డాఁగియున్న నమరు లచటి
కేఁగుదెంచి కాంచి రిద్ధశమీగర్భ, లీనుఁ డైనయతని మానవేంద్ర. 194

వ. భృగుశాపంబునం బ్రాపించుసర్వభక్షకత్వంబునకుఁ జాలక దొలంగినయగ్నిదేవు
నట్లు గని బ్రహ్మాదిదేవత [1](లమ్మునివచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షకుండ
వయ్యు మాలో నగ్రపూజ్యుండ వని యొడంబఱిచి) నిజస్థానంబులకుం జనునప్పు
డత్తీర్థంబు పరమపావనం బని తజ్జలంబులఁ గృతస్నాను లైరి యందుండి యాసీరి

(1) ఇది కొన్నిటఁ గానిపింపదు.

కౌబేరతీర్థంబునకుం జనియె నది కుబేరుండు దపంబు సేసి ధనాధిపత్యంబు మొద
లైనవరంబులు వడసినచోటయ్యెడ గదలి యతండు. 195

—ప్రభావతి యనుమునికన్యకమహిమాభివర్ణనము.—

సీ. బదరిపాచననామపరమతీర్థమునకుఁ, జనియె భరద్వాజతనయ తొల్లి
యచటఁ బ్రభావతి యనునది యింద్రుండు, పతి గాఁగఁ గోరి తపంబు సేయ
నతఁడు వసిష్ఠునాకృతి దాల్చి వచ్చిన, నయ్యింతి యర్ఘ్యపాద్యాదు లిచ్చి
భక్తితోఁ జేరి మఱి త్పాణి శక్రున కిచ్చు, దాన నప్పూనిక మానఁ గాని

తే. వలయుపనిఁ బంపుఁ డన్న నవ్వాలయ నమ్మ
హాత్మ్యుఁ డది యట్ల యగుఁ గాని యతివ వీనిఁ
బక్వములు సేయు మని కొన్నిబదరిఫలము
లానితంబినిచే నిచ్చి యవుల నుండ. 196

వ. అదియును గృతస్నానయుఁ గలితధౌతపరిధానయు నై ప్రొయి నగ్ని రాజఁబెట్టి యాఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండ నవి పాకంబునకు రాకయుండ వెండియుఁ దనసవరించినకాష్ఠంబులు గ్రమంబున నిడి యనలంబు ప్రబలంబు సేయఁ గాష్ఠంబులు సమసెఁ గాని యారేఁగుఁబం డ్లురియ వయ్యెఁ గాష్ఠంబులు గలయెడకుం బోయి తెచ్చునంత కగ్ని యాఱెనేని దుష్పాకం బగు నని యామగువ తనకా లింధనంబుగా నిడి పాకంబు సేయఁ గనుంగొని పాకశాసనుం డచ్చెరువొంది ప్రత్యక్షుంబై శుభాంగి నీదునిష్ఠాతిశయంబునకు మెచ్చితి భవదభిమతం బిచ్చితి నీతనువు విడిచి త్రిదివమ్మునకు రమ్ము సర్వపాపహరంబు బై యీ తీర్థంబు లోకత్రయప్రఖ్యాతం బయ్యెడు మనియె నమ్మహాభాగయు నాసుమనోవిభునకు మనోరమ యై వెలసె నట్టిబదరిపాచనంబుననుండి. 197

ఆ. ఇంద్రతీర్థమునకు నేఁగె నాబలభద్రుఁ, డచట నూఱుక్రతువు లాచరించి
యనిమిషేశ్వరుండు గనియె శతక్రతుఁ, డనుప్రసిద్ధితోడ నతులపదము. 198

వ. అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం బోయెఁ బలుమాఱు రాజుల నెల్లను బొరిగొని పరశురాముం డత్తృప్తుం డై ప్రాయశ్చిత్తంబు గా నయ్యెడఁ గశ్యపునుపదర్శనంబున రాజసూయంబులు నశ్వమేధంబులువాజిపేయంబులు ననేకంబు లొనర్చి యమ్మునీంద్రునకు దక్షిణసమస్తక్షోణియు నొసంగె నందుండి యయ్యేకకుండలుండు యామునంబునకుం జనియె నది వరుణుండు రాజసూయంబులు సేసినప ట్టయ్యధ్వరంబునవసానంబున దేవాసురులకు సకలభూతసంక్షయకరం బగుచున్నసంగరంబు ప్రవర్తించె. 199

ఆ. అచటు గదలి యాతఁ డాదిత్యతీర్థసం, సేవనమున కరిగె ధీవిశాల
యందుఁ గ్రతు వొనర్చి యాదిత్యుఁ డుజ్జ్వల, జ్యోతిషాధిపత్యశోభి యయ్యె. 200

వ. ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును జైమినియు మఱియును దేవలజై
గీషవ్యాదు లగునైష్ఠికు లనేకు లయ్యెడ నద్భుతయోగసిద్ధిం బొందిరి. 201

తే. అచటనుండి సారస్వత మనువసిష్ఠ,తీర్థమున కేఁగె నాబలదేవుఁ డధిప
యందుఁ దొల్లి నిష్ఠాతిశయంబుమై దధీచి యనుముని నియమంబులాచరించె.

వ. ఆనియమాచరణంబునకు నింద్రుండు శంకించి తద్విఘ్నకరణంబునకు నలంబుస
యనునప్సరోవనితం బుత్తెంచినఁ దదీయదర్శనంబున నమ్మునివీర్యంబు స్ఖలించిన
దాని సరస్వతి గర్భంబుగా ధరియించి పుత్త్రుం గాంచి తపస్విజనగోష్ఠి నున్న
యత్తపోధనుకడకుఁ దెచ్చి వీఁడు నీకొడుకు భవత్తేజంబు వృథ వోనీక యేను
వహించి కాంచితి వీనిం గైకొను మనిన నతండు వాని నెత్తికొని యాలింగనం
బును మూర్ధఘ్రాణంబును జేసి యాసరిద్వర నాలోకించి నీవు బ్రహ్మసరస్సున జని
యించితి పుణ్యనదులయందు మేటి వని సంస్తుతించి నీజలంబులం దర్పణంబు సేసిన
విశ్వేదేవతలుఁ బితరులు గంధర్వులుఁ దృప్తు లాదు రని యనుగ్రహించి యక్కు
మారుండు నీపేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పండ్రెండేం డ్లనావృష్టి
యైన నయ్యాపదఁ బొంద కుండఁ బెక్కండ్రు మునుల రక్షించి వేదాధ్యయనం
బులు సేయించు నని చెప్పి యొప్పగించిన సరస్వతి ప్రీత యై తనయుం గొని
చనియె నాకాలంబున, 203

క. అమరులకు నసురులకుఁ గలహము గలిగిన బలవిరోధియాయుధనికురుం
బము సవరించుమహోద్యోగమునఁ బ్రవర్తించె వీరకౌతుక మలరన్. 204

వ. అట్లుద్యోగించి. 205

చ. జగముల నెందునుం బడయఁ జాల కతండు దధీచియస్థులం
దగియెడునాయుధంబు లగుఁ దత్పరతం జని వేఁడ నాతఁ డి
చ్చు గురుతరాత్మయోజ్జ్వలయశోనిరతుం డని పంపఁగా నిలిం
పగణము వోయి వేఁడిన నృపాలక యిచ్చె నతండు ప్రీతితోన్. 206

వ. ఇచ్చి యతం డవ్యయలోకంబున కరిగె నమరవరుండును దదస్థుల వజ్రాయుధంబు
నొనర్చి పేర్చె నంత నాసారస్వతుండు ద్వాదశవార్షికం బగుననావృష్టిదురితం
బునఁ దన్నుం జేరి పిన్న యనక విద్యావిశేషకలితం బైన గౌరవంబున శిష్యత్వంబు
భజియించినయఱువది వేవురుమునుల సరస్వతీప్రభావజనితం బగునన్నంబున రక్షిం
చుచు వేదంబుఁ జదివించె నాసారస్వతతీర్థంబుననుండి యాసంకర్షణుండు వృద్ధ
కన్యాశ్రమంబునకుం బోయె నయ్యెడ గర్గవంశవర్యుం డగుకుణి యనుతపోధనుండు.

తే. పరమతపమున నొకకన్యఁ బడసి పెంచి, దివమునకు నేఁగె నదితపస్స్థిరతఁ బూని
పతి వరింపంగ నొల్లక బ్రహ్మచర్య,మున వెలింగి యయ్యాశ్రమమున వసించె.

వ. పదంపడి యత్యంతవృద్ధ యై పరలోకగమనంబు గోరె నప్పుడు యదృచ్ఛాసన్ని
హితుం డైననారదుం డక్కన్యక కిట్లనియె. 209

తే. నచటిబయ లెల్లఁ దాన యై యక్కజంపుఁ
జంచమును ఘోర మైననిస్స్వనముఁ జండ
గతియు భూతవితానభీకరముగా ను
లూక మొక్కటి వచ్చె భూలోకనాథ. 16

అశ్వత్థామ యాలూకంబు కాకంబులఁ జంపుట నాలోకించుట.

వ. వచ్చి యవ్విటపివిటపంబు నూఁది యక్కాకంబుల నాలోకించి యంగంబుల యుద్భటత్వం బుడిపికొని గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని నాక్రమించి. 17

ఉ. కొన్నిటికంఠముల్ నులుపుఁ గొన్నిటికాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటిపక్షముల్ నఱకుఁ గొన్నిటిపొట్టలు వ్రచ్చు లీలమైఁ
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్లు ల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగన్ వధియించె భూవరా. 18

వ. ఇవ్విధంబున నిద్రావివశంబు లైనయవ్వాయసంబుల వివిధంబు లగువధంబుల గీటడఁగించి యాకౌశికంబు శత్రువులం బొదివి సమయించిన మేటిమగనిమాడ్కి మోదంబు నొందినం గని యగ్గురునందనుం డాచందం బొనర్చుటకు డెందంబున నుత్సాహంబు వొడమి పొంగి తనలోన. 19

తే. ఇవ్విహంగమ ముపదేశ మిచ్చె నాకు, నిద్రవోవంగ శత్రుల నిగ్రహింతు
నింత లెస్సగు నే ముందరేమి తెఱఁగు, గాననై తిని నాపూను కార్యమునకు. 20

వ. అని వెండియు. 21

ఉ. పాండునరేంద్రనందనుల బాంధవపుత్త్రయుతంబు గాఁగ ను
ద్దండత నే వధింతు నని దర్ప మెలర్పఁగఁ గౌరవాధినా
థుండు వినంగఁ బల్కితిని దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్
గండున బెట్టు పైఁ బడుట కార్యము గాదు దలంచి చూడఁగన్. 22

క. అరవాయి గొనక బెట్టుగఁ, బరిగొని యక్కడిఁదిమగలపై నడరుట యు
ద్ధురగతి నగ్నిజ్వాలో,త్కరముపయిన్ మిడుత యుఱుకుకరణియ కాదే. 23

వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక మఱి చేసిన రారాజు నిర్గతప్రాణుం డైన నాకెలసం బెవ్వరి కెక్కెడుఁ జక్కటితోడిబవరంబున నబ్బలుమగల గెలువరా దని యిట్లురియాడునాచిత్తంబు చింతాపరంపర వాయ నీపక్షివిచేష్టితంబు లోచనగోచరం బయ్యెఁ బగతురఁ దెగటార్చునెడ నన్యాయం బనక యుపాయం బెయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్రసిద్ధంబ కాదే యె ట్లనిన. 24

తే. ఎత్తినప్పుడు విడియుచో నిఱకటంపుఁ. దెరువునందు నడపు సెడి తిరుగఁబడిన
యట్టియెడ నిద్రవోయెడు నవసరమున, శాత్రవుల బెట్టు పైఁబడి చంపవలయు.

వ. అనునీతివాక్యంబులు వింధు నంగీకృతక్షత్త్రధర్ముం డగువానికి నిట్టివి కర్తవ్యంబు
లట్లుఁ గాక పాండవేయులు పితామహగురులైనభీష్మద్రోణులఁ దెగటార్చునెడం
జక్కటి గలతెఱంగున సంగరంబు చేసిరె యంగరాజును రారాజును బరిమార్చిన
భంగులఁ దలంపంగూడునె కావునఁ గల్మషోపాయు లగుకౌంతేయుల నిద్రాసమ
యంబున (గొబ్బున) నిగ్రహించుట నీతియ కాని నింద్యంబు గా దని నిశ్చయించె
నట్లు క్రూరవ్యవసాయుం డగునగ్గురుసుతుండు దనమామను గృతవర్మను మేలు
కొల్పి యిట్టిసమయంబున నిద్రించితి మని లజ్జించుచున్నయారథికవరులతో ని
ట్లనియె. 26

సీ. మొగదప్పితిమి రణంబున మనమకట ము,వ్వురము రారాజు నొక్కరునిఁ బొందు
తనయులు దమవారుఁ దారును బెక్కండ్రు, గూడి చుట్టును ముట్టి గుల్లపఱచి
యేకాదశాక్షౌహిణీశ్వరుఁ డట్లొంటి, మెయిఁ జిక్కి పోరుచుండియును బాడి
దప్పఁ డివ్విభుని నధర్మవిక్రమమునఁ, బాపాత్మకుం డగుబకవిరోధి

ఆ. కూల్చె నంతఁ బోక కురుదేశరాజ్యాభి,షిక్తమైనయతనిశిరము దన్నెఁ
బరిభవంబు నొంచెఁ బ్రాణాంతకరవేద,నాతిశయముకంటె నన్నరేంద్ర. 27

క. లావును వెరవును గలుగుమ,హావీరు లనేకు లట్టు లన్నిదినము లా
భూవిభునకై పెనఁగి జయ, మీ నలఁతులు గాక పోయిరే మన వచ్చున్. 28

ఆ. ఎవ్వ రెంతఁ జేసి రేనియు విధి యొండు, దలఁప నాఫలంబు దలఁగ కేల
యుండు నిట్లు గాఁగ నున్నది గా కేమి, యెసక మెసఁగుకౌరవేంద్రమన్నువు. 29

వ. అని పలుమాట లాడి మీమది కలంగకున్న దేని నీమహావ్యసనంబునకుఁ గర్త
వ్యం బెద్ది చెప్పవలయు ననినఁ గృపాచార్యుండు ధనురాచార్యనందను మొగంబు
గనుంగొని నీవు చెప్పఁ దలఁచినయంతవట్టునుం జెప్పి కార్యం బడిగితేని నాకుఁ
దోఁచినదానిం జెప్పెద విను మని యి ట్లనియె. 30

కృపాచార్యుఁ డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱింగించుట.

సీ. ప్రారంభముల కెల్లఁ బౌరుషమ్మును దైవ,మును సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటిచేతఁ గానేర దనఘ త,త్ఫలసిద్ధి యెట్లన్నఁ దలఁచు వాన
కారుపొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చుఁ, గావింప నేర్చునే యేవిధమున
వల నేర్పడఁగ దున్నఁ బొలములోనైన వ,ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె

ఆ. కాఁపు లావు వెరవు గల్గి కర్షణము సే,యంగ వృష్టి దగినయట్లు గలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై,వంబుతోడుపాటు వలయు నెందు. 31

వ. అదియునుం గాక. 32

క. తగుపని కుద్యోగించుచుఁ, దగ వెఱిఁగెడుహితుల కనుమతంబుగఁ జేయన్
జగతీసురవరకార్యము, లగు వారికిఁ గలుగు విధిసహాయత్వంబున్. 33

క. ధర్మము దప్పక నయగతిఁ, గర్మాచరణంబు నడపఁగాఁ [1]ఫలసిద్ధిన్
నిర్మలయశ మగుఁ దప్పినఁ, బేర్మి సెడదె నింద రా నభేద్యోత్సాహా. 34

ఉ. నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు భాజను
ల్వేతురు చేటు సేఁతలు ఫలింపక తక్కిన మున్న వచ్చు న
త్యాతురతాస్పదంబు లగు నాపద లిద్ధవివేకవైభవా. 35

ఉ. క్రోధము లోభముం భయముఁ గూరినచిత్తముతోడ దుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు సజ్జను లాఁగఁగఁ జేయుకార్యముల్
బాధలఁ బెట్టుచున్నె సిరి పాయఁగఁ జేయక యున్నె వానిఁ దీ
వ్రాధినితాంతదుఃఖహృదయత్వము దేరక యున్నె వానికిన్. 36

చ. వినుము కురుక్షితీశుఁడు వివేకవిదూరుఁడు క్రోధలోభముల్
మనమునఁ బేర్చినం దురభిమానమునం హితు లెంత చెప్పిన
న్వినక బహుప్రకారముల నిందకు నోర్చి పరాభవించె స
జ్జను లగుపాండుపుత్త్రుల నసత్పథవృత్తికిఁ జేటు దప్పునే. 37

వ. అని పలికి యతండు మీమది గలఁగక యున్న దేనిఁ గర్తవ్యంబుఁ జెప్పవలయు నని యడిగినమాట లుగ్గడించి. 38

క. జగ మెఱుఁగఁగ దుశ్శీలుం, డగుభూనాథుండు వోయినట్టులె పోఁగాఁ
దెగడుం జేటుఁ గలిగి వగ, మిగులను మది గలఁగ దే యమిత్రధ్వంసీ. 39

వ. అది యట్లుండె మన కిప్పు డిది కర్తవ్యం బని నిశ్చయింప మన మేమి నేర్తుము తగవు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 40

క. మన మందఱమును ధృతరాష్ట్రునికడకుం బోయి కార్యసూత్ర మతనిచే
వినవలయు నాతఁ డెయ్యది, గని పలికిన నదియ మనకుఁ గర్తవ్య మగున్. 41

వ. అమ్మహీకాంతుండు. 42

క. తానును గాంధారియు నె,ద్దానిం గార్యంబు గాఁగఁ దలఁచి పనిచినం
దానికిఁ గా దన వలవదు, పూని యనుష్ఠింత మదియ పొగ డొందించున్. 43

వ. వారలకడ విదురుండు నుండు నమ్మువ్వురు విచారించి చెప్పినకార్యంబునకు నింద గలుగ దట్లుం గాక యెట్లు పొగలినను దైవోపహతంబు లగుకార్యంబులు సిద్ధిఁ బొందునె యడిచిపడ వలవదు విచారించికొండ మనవుడు శోకదందహ్యమాన మానసుం డగుచు నగ్గురుపుత్త్రుండు కృతవర్మను నతని నాలోకించి. 44

### అశ్వత్థామ కృపాచార్యకృతవర్మలతోఁ దనపూన్కి స్థిరీకరించుట.

సీ. వెర విట్టిదెఱఁ గిది వెంగలితన మని, యెల్లనాఁడును దన మెఱిఁగినట్టి

1. అ. ఫలసిద్ధుల్.

తెఱఁగున నిజకార్య[1]దృష్టియ కయికొను, నొరులనేర్పులు పట్టనొల్లఁ డాత్మ
బుద్ధియ మేలని పొగడు నన్యులచిత్తవృత్తుల నిందించు వివిధగతులఁ
జెందెడు నాత్మీయచేతఃప్రవర్తన, మఱయఁడు దాన బాల్యమునఁ దలఁచు
ఆ. తలఁపు గీడు చేసి మెలప్రాయమున నొండు, తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి
ముదిమి వచ్చినతఱి నదియును విడిచి యన్యంబులైన నేర్పు లాచరించు. 45
క. ఆపదఁ బడి యొక్కఁడు సద్వ్యాపారము గాఁగఁ జూచి [2]దాని నడపు శ్రీ
ప్రాప్తించిన నరుఁ డొండొక, చూపున వర్తించు నది విశుద్ధపదముగన్. 46
క. తగు నని మరణాదులకై, తెగువదెసఁ మానవుండు దృఢనిశ్చయతం
దగిలినయది పరమహితం, బుగ వదలక నడుపు ఘనన్యబుద్ధులు గొనమిన్. 47
వ. మీ రెఱుంగనియది లేదు నాకుం దోఁచినకర్జంబు మన కందఱకును శోకనాశం
బగునట్టిది దాని వినుండు చెప్పెదఁ బ్రజాపతి ప్రజల సృజించి విప్రునకు దమం
బును క్షత్త్రియునకుం దేజంబును వైశ్యునకు దక్షత్వంబును శూద్రునకుఁ ద్రివర్ణా
నుకూలతయు వలయుగుణంబులుగా విధించెం గావున శాంతుండు గానివిప్రుండును
దేజస్వి గానిరాజును దక్షుండు గానివైశ్యుండును ద్రివర్ణానుకూలుండు గాని
శూద్రుండును నిందం బడుదు రది యట్లుండె నేనును విప్రకులంబునందు జన
పూజితం బైనవంశంబునందు జనియించి భాగ్యహీనతవలన రాజోచితధర్మం బను
ష్ఠించితి నదుమ నానిష్ఠ వదలి విప్రధర్మంబు ఘహనీయం బైన నది యాచరించు
వాఁడ నగుట నామదికిం జూడ మేలై యుండ దదియుం గాక. 48
తే. మేటివిల్లును దివ్యాస్త్రకోటియును ధరించి మెఱయంగ నాజి వధించెఁ దండ్రి
నొకఁడు వాఁడును రూపుతో నుండునట్టె, యెట్లు తలయెత్తి మెలఁగుదు నేను జెపుఁడ.
క. వాఁడు మొదలు గాఁ బగతుర, వాఁడి గలుగుతూపుగములవలను మెఱసి యే
నేఁడు వధింతును నెవ్వఁగ, వేఁడిమిఁ బడఁ జాల కొక్కవెరవు దలఁచితిన్. 50
క. లే దింకం బగ యని ధను, రాదులదెస వాహనములయందును సంత్య
క్తాదరులై పగతురు నేఁ, డాద మఱచి నిద్రవోదు రది తఱి పొడువన్. 51
ఆ. ఓడి పోయి డప్పి నూని గట్టును జెట్టుఁ, జేరి యొదిఁగి యున్నవారిఁ గాఁగఁ
మనలఁ దలఁతు రరులు మనముల నావంత, శంక లేదు సంతసంబు ఘనము. 52
చ. మదమునఁ దేలి యేమఱినమార్తుర దాడిగఁ బోయి బెట్టు ము
ట్టెద శరజాలసత్వరపటిష్ఠతఁ బల్వురఁ ద్రుంతుఁ గొందఱం
జదుపుదు నుల్లసత్పరిఘసంహననంబునఁ గొన్నికంఠముల్
చిదుముదు నేల రక్తపరిషిక్తము గాఁ గరవాలలీలలన్. 53
తే. గెలుపునూఱట నగ్గల మొదవునిద్రఁ
బీనుఁగులుఁబోలె నున్నయాబిరుదుమగలఁ

1. క. దృష్టిఁ గనుంగొను. 2. గ. దాన నపుడు.

జంపి పీనుంగుఁబెంట గావింపవలయు
శిబిర మెల్లను భూతముల్ సెలఁగుచుండ. 54

వ. అని వెండియు. 55

క. కరిహయనరశవముల భ,గ్నరథంబుల నెరసి ద్రుపదనందనగాత్రో
త్కరము పడి యుండఁ జూడక, పరిభవతాపోపశాంతి పడయఁగ నగునే. 56

శా. ధృష్టద్యుమ్నుని ముట్టి పట్టుదు మదోద్రేకం బడంగింతు న
త్కృష్టాస్త్రంబులఁ జంప కల్క పశుభంగిం జంపినం గాని పో
దిష్టావాప్తి యనంగ నా కిదియె భూయిష్ఠంబు గౌంతేయులన్
గష్టస్వైరవిధాభియోగమృతులం గావింతు నుగ్రాకృతిన్. 57

క. అలిగినపినాకిచందం, బలవడ శిబిరంబుఁ జొచ్చి యందఱఁ బగఱం
బొలియింతును శుద్ధుఁడఁ గా, వలదే జనకునకు నాదువల నేర్పడఁగన్. 58

క. పాండవులం బాంచాలురఁ, జండభుజావిభవ మెసఁగ సమయించి కృతా
ర్థుండ నయి పెంపుఁ దేజము, గందును దక్కొండు లేదు కార్యము దలఁపన్. 59

వ. అనవుడుఁ గృపాచార్యుం డి ట్లనియె. 60

సీ. పఱచినవారికిఁ బగ మాఱు పలుపంగ, నుత్సహించుట కడునొప్పు గాదె
దైవయోగంబునఁ దగినయుద్యోగంబు, నీమానసంబున నెలవుకొనియె
మాకు నీవునిక్క సమ్మత మేము దీనికి, నీతోడివారము నీవు డస్సి
యున్నవాఁడవు నిద్రయును లేక యున్న[1]సీ, వెడగరపడియె దీయడవిలోన

ఆ. నెమ్మి డప్పిదేఱ నిద్రించి వేగినఁ, దెలివితోడ నత్యుదీర్ణవృత్తిఁ
గడఁగి యేము దోడ నడతేర నడరిన, నరిగణంబు గెలుతు వశ్రమమున.61

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ పైఁ బోవ ను
ద్ధురలీలం గృతవర్మయుం గృపుఁడు నుద్యోగస్ఫురన్మూర్తు లై
వెరవుం జేవయుఁ జూపి తో నడప దోర్వీర్యోద్ధతిన్ మార్కొన
న్నరయోధావళి గాదు దేవతతికి న్రా దెమ్మెయిం జూడఁగన్. 62

వ. అని మఱియును. 63

చ. విను కృతవర్మ దివ్యశరవేది బలాఢ్యుఁడు శౌర్యశాలి యే
నును సమరోద్యమంబునకు నూల్కొనఁ జాలుట నీ వెఱుంగు ది
ట్లను గనుతింప రాదు గురునట్టిఁడ యీతఁ డనంగ వచ్చు ని
న్ననఘచరిత్ర యిట్టిరథికావలి వైరుల నెట్లుఁ జేయదే. 64

వ. కావునఁ గోదండంబు నెక్కుడించి కంకటం బూడ్చి నిద్రింపు మేము నిద్రాగమ
నంబున జడులమై యున్నవారము ప్రభాతం-బగుటయు నెల్లవారలకు నుల్లంబు

1. అ. వి, వేగిరపడియెద వేల యింత.

తెలివొందు నప్పుడు గడంగి యోధులం బొదివి పేరువాఁడి పొలియింతము మనము
పాంచాలసహితంబుగాఁ బాండవులం దెగటార్చుటయుండె వారిచేతం దెగుటయుం
డె నయ్యెడుం గాక రిత్త మరలుదుమే యనిన మామకు నశ్వత్థామ యిట్లనియె.

తే. [1]అలుక యెత్తినవానికి ♦ నర్థచింత, కునకు నాతురునకుఁ గామ♦గోచరాత్ము
నికిని వచ్చునే విను నిద్ర ♦ నీవు నెఱుఁగు, దెఱిఁగియుండి యిట్లేటికి ♦ నేఁప నన్ను.

క. ఎన్నఁబడి జను లెఱింగిన, యిన్నాలుగుతెఱఁగులందు ♦ నెయ్యది యైనన్
గన్నుమొగుడ నీదటె నా, కిన్నియుఁ గలుగంగ నిద్ర ♦ యేటికి వచ్చున్. 67

చ. గురుదెసవంత నాతురతఁ ♦ గూరెద వైరిఁ దలంచి కోపసం
భరితుఁడ నయ్యెదన్ సమర♦భంగినిరూపణచింత నొందెదం
గురుపతికిం బ్రియం బెసఁగఁ ♦ గోరుట నుత్తలపాటు సెందెదం
బురుషవరేణ్య యే నిదుర ♦ వోవఁగ నెమ్మెయి నేర్తుఁ జెప్పుమా. 68

శా. సారాచారనిరూఢుఁ డైనధనురా♦చార్యున్ వధింపంగఁ గ
న్నారం జూచితి వీవుఁ దత్పరిభవం♦ బట్లుండె భగ్నోరుఁ డై
రారా జెంతయు దీనవృత్తిఁ జెవులా♦కరం బల్కఁగా విన్నయే
నీరే యూరక నిద్రవోదునటె యి♦ట్లే లంటి వీరోత్తమా. 69

ఆ. మనము వినఁగ రాజు♦పనవినభంగి కే, క్రూరచిత్తుఁ డైనఁ ♦ గుంద కున్నె
కరుణ లేక యున్న♦పురుషున కేనిఁ గ, న్నీరు దొరఁగకుండు♦నే మహాత్మ. 70

చ. అతఁడు మదీయసఖ్యపరుఁ ♦ డక్కట యేఁ గనుగంద కుండ నా
క్షితిపతి యిమ్మెయిం బరుల♦చేతఁ బరాభవ మొందె దానిఁ జూ
చితి మును లోకు లవ్విభుని♦చేటును బాండుతనూజకోటియు
న్నతియును జెప్ప వింటి నది♦ నామది సూఁడెడు నిద్ర వచ్చునే. 71

వ. అదియును గాక. 72

మ. కవ్వడియున్ ముకుందుఁడును ♦ గావలిగా భయ మేది యున్నవీ
డెవ్వరి కైన ముట్టుకొని ♦ యేపునఁ బేర్చి జయింప వచ్చునే
యెవ్విధి నైననుం బగఱ♦యే పడగించుట పౌరుషంబ యే
నొవ్వక గెల్తు రాత్రి మెయి ♦ నూల్కొని తాఁకితి నేని మాతులా. 73

ఆ. ఇట్లు నిశ్చయించి ♦ యెసకంపుఁగడఁకతో, నున్నవాఁడ నిట్టి♦నన్ను మాన్ప
రామి యెఱుఁగ కంటి ♦ రారాజుమన్నన, వమ్ము చేసి మరల♦వచ్చు నెట్లు. 74

క. సమయింతుఁ బొదివి సౌప్తిక, సమయంబున నెల్లభంగిఁ ♦ జతురంగసమే
తము గాఁగఁ బాండునృపసుత, సముదయమును ద్రుపదభూప♦సంతానంబున్. 75

వ. సమయించి మఱి విశ్రమించియు నిద్రించియు సుఖించెద నీవు నిద్ర పేరు సెప్పి

---

1. అ. "అలుక వొడమువాని ♦ కర్థచింతునకును, నాతురునకు మన్మ♦థార్తునకును, నిద్ర వచ్చు నెట్లు ♦ నీవును దీనిని, నెఱిఁగియుండి యేటి ♦ కేఁప నన్ను.

యుద్యోగంబు మాన్పి మఱల్పఁ జూచెద విధి తగ వగునే యనిన గురునందనునకు
గౌతముం డి ట్లనియె. 76

కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంపఁ దగ దని యశ్వత్థామకు హితవు చెప్పుట.

చ. అలుక మనంబునం గదిరి | నాతఁడు దాను నెఱుంగఁ డొడ్లచేఁ
దెలియఁడు కార్యతంత్రములు | ధీమహితుం డగువాని కైననుం
జెలులును జుట్టలుం దగిలి | చెప్పఁగఁ జొప్పడుఁ గాక తక్కని
ర్మల మగునీతితంత్రము ది | రం బయి చిత్తమునందు నిల్చునే. 77

క. మతి నెప్పుడుఁ దా ధర్మస్థితి నూహించుచును హితులు | సెప్పెడివెర వు
ద్ధతి దక్క యాచరించుచు, జితేంద్రియత గలిగి నడవఁ | జెందు శుభంబుల్. 78

తే. దుష్పథంబులఁ జొరనీక | తొలఁగఁ దివుతు
రాప్తజనములు దగ వశ్య | లయినవార
లందుఁ బుణ్యంబు దొలఁగని | యతఁడు దొలఁగుఁ
దొలఁగ నేరఁడు భాగ్యంబు | దొలఁగువాఁడు. 79

క. మతిమంతు లైనవారికి, హితు లగు వెరవు గలవార | లెఱిఁగింతురు దు
స్థితి గాకుండఁగఁ గార్యము, గతి యొత్తియుఁ దప్ప లిడియుఁ | గడవఁ బలికియున్.

క. నాపలుకు వట్టి యాగ్రహదీపితుఁ డగు టుడిగి మదికిఁ | దిన్నఁదనము నీ
వాపాదింపుము చలమును, గోపముఁ గ్రౌర్యంబు విడువు | గుణరత్ననిధీ. 81

వ. అ ట్లైనం బశ్చాత్తాపంబునం బడవు నిద్రించినవానిని నాయుధంబులు విడిచినవా
నిని వాహనవైకల్యంబు నొందినవానిని శరణుసొచ్చినవానిని దల వీడినవానిని వధి
యించుట ధర్మంబు గా దీసమయంబున సమస్తసైన్యంబును బాండవపాంచాలురు
నిద్రవోవుదురు నిదుర సావునట్టిద కాదె పీనుంగులుం బోలెఁ బడి యున్నవారిం బొ
డిచి పాపంబుగట్టుకొని నరకంబునఁబడుట మేలె మహాస్త్రవిదు లగు రథికముఖ్యుల
యందు మేటి యనం బరఁగి యింతకు ము న్నేమిటం గల్మషంబు లేనినీయట్టివాని
కిట్టిదుష్కర్మంబు గర్తవ్యంబగునే యిది మడుఁగుఁజీరయందుమసి దాఁకినట్లయ్యెడు
సూర్యసంకాశుండ వగునీవు సూర్యోదయసమయంబునఁ బ్రకాశప్రకారం బైన
పరాక్రమంబున కుపక్రమింపు మనవుడు నశ్వత్థామ కృపాచార్యున కి ట్లనియె. 82

సీ. నీచెప్పినది యెల్ల | నిజము శాసింపంగఁ, దగువాఁడ వై హితం | బగు తెఱంగు
నా కెఱింగించితి | నీ కేను జెప్పెద, నేర్పడ వినుమయ్య | యెల్లనృపులు
గనుఁగొనుచుండ మ | జ్జనకుని సన్న్యస్తశస్త్రుని నట్లు పాం | చాలరాజ
సుతుఁడు ధృష్టద్యుమ్నుఁ | డతిపాతకం బని, కొంకక తల పట్టు | కొని వధించె

ఆ. భీష్ము నాశిఖండి | పేరఁ గృత్రిమసమరమున నర్జునుండు | సమయఁ జూచె
నరద ముర్విఁ గ్రుంగి | యనువు దప్పిన డిగ్గి, యెత్తుచుండఁ గర్ణు | నేసె నరుఁడు.

ఆ. చేయి నరుఁడు దునుమఁ | బ్రాయోపవేశప్రవృత్తిమైఁ బ్రశాంత | చిత్తుఁ డైన

పుణ్యపురుషు నట్టి భూరిశ్రవుఁ గృష్ణు, ననుజుఁ డట్లు సంపె నాగ్రహమున. 84

చ. పలువురు గూడి కౌరవనృపాలకు నొక్కరుఁ జుట్టుముట్టి వి
చ్చలవిడిఁ బాపకర్మ మనుశంక యొకించుక యేని లేక యా
కులు గద నుగ్గు సేయఁగ మరుత్సుతునిం బురికొల్పి రిన్నిభం
గుల మును వారె కాదె చెడ గ్రొచ్చిరి సంగరధర్మసేతువున్. 85

వ. వారి నెట్లు నిందింపవు మమ్ము నెట్లు వారించెద వాలింపుము. 86

ఆ. తొడలు విఱిగి నేలఁ బడియుండి ననుఁ గని, మానవేంద్రుఁ డట్లు దీనవృత్తి
నాడెఁ గొన్నిమాట లవి యంతరంగంబు, నందుఁ జిక్కి కినుక యలఁత సేసె. 87

వ. వాని వెలార్పవలయు మజ్జనకహననసంతుష్టుం డగుధృష్టద్యుమ్నుండు లోనైన యప్పాపాత్ములఁ బాపంబు తెఱువున రూపుమాపెద దీనం జేసి కీటజన్మంబు పాటిల్లినను మేలు కాని యీకడంక మాననేర నన్ను వారింప నెవ్వరివశంబు గునని దిగ్గన లేచి యగ్గురుతనయుండు రథం బెక్కినం గనుంగొని యగ్గౌతముండును గృతవర్ముండును. 88

ఆ. ఏకనిశ్చయమున నిట యేఁగుదెంచితి, మనఘ నీవు నేము నధిపునికి
నిట్టిమమ్ము వేఱుపెట్టి యెక్కటికార్య, మాచరించువాఁడ వగుట దగునె. 89

చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మహితాత్ముల కేనవశ్యముం
జని ద్రుపదాత్మజుం బొదివి చంపెద దుర్గతిఁ బోవుచావుగా
ఘనభుజశక్తి శౌర్యము నకంపితధైర్యమునుం వెలుంగ మీ
రును దెలివొంది కూడికొన రూఢికి నెక్కెద మెల్లభంగులన్. 90

ఆ. ఒండుతలఁపు లుడిగి రం డని పోవ నా, రథికవరులు గడఁగి రథము లెక్కి
తొనసి చనిరి వారు మువ్వురు నగ్నిత్ర, యంబుఁ బోలి యొప్పి యప్పు డధిప.

వ. అట్లు చని నిద్రావివశం బైనపాండవశిబిరంబు డగ్గఱి రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 92

ఆ. రాజుఁ గూల్చి జయముఁ దేజంబుఁ బొందిన, యత్యుదగ్రవిభవు లైనయరుల
శిబిర మాక్రమింపఁ జిత్తంబులం దుఁ దెం, పొదవి మువ్వు రట్లు గదియు టరిది.

వ. వారు చేసినవిధంబు వివరింపు మనిన నాసూతసుతుండు విచిత్రవీర్యనందనున కిట్లనియె నట్లు శిబిరద్వారప్రదేశంబునకు నడచి సహాయులం గడచి యశ్వత్థామ యుద్దామరభసంబునం జన నుత్సహించె నట్టియెడ. 94

### అశ్వత్థామకు శివుఁడు భూతాకృతి యై తోఁచుట.

సీ. స్ఫురితశోణిత మగుశార్దూలచర్మంబు, పరిధానకరణి విభాసితముగ
నురగాత్మకము లైన యుపవీతములు హార, ములు నంగదంబులుఁ బోలుపుమిగుల
వివృతవిశాలాస్యవివరంబు నిశితదం, ష్ట్రానికరంబు ఘోరంబు గాఁగ
భాసురకాంతివికాసంబు లగులోచ, నంబులు బహుసహస్రంబు లొప్ప

తే. నుగ్రమును సుందరంబును నుజ్జ్వలంబు, నై మహాకార మద్భుత మావహింప
భూత మొక్కటి భీషణస్ఫురణ మెసక, మెసఁగ నగ్గురుపుత్త్రుకట్టెదుర నిలిచె.

క. విను మాభూతం బిట్టిది, యని కలరూ పేర్పరింప నమరులకు వశం
బె నరేంద్ర తదాకృతి గనుఁ, గొనినఁ భేదిల్లవలయుఁ గొండకు నైనన్. 96

వ. ఇట్లతనియగ్రభాగంబున నావిర్భూతం బైనయమ్మహాభూతంబు నాస్యకుహరం
బున నాసికావివరంబులఁ జెవులఁ గన్నుల నన్నింట మంటలు వెడలి మింట
నడరఁ దదీయతనుతేజోమరీచిసంఘంబుల శంఖచక్రగదాహస్తు లై హృషీకేశు
లనేకులు వెడలి రి ట్లఖిలభూతభయంకరం బగునమ్మహాభూతంబు నాలోకించి
యవ్వీరవరుండు. 97

చ. హృదయమునం గలంక యొకయించుక యేనియు లేక వీరసం
పద యలరంగ భల్లముఖబాణతతుల్ నిగిడింపఁ బెద్దగా
వదనము విచ్చి భూత మనివార్యవిధంబునఁ ద్రావె బాడబం
బుదధిజలంబు ద్రాగెడుమహోగ్రసముద్ధతి వాని నన్నిటిన్. 98

చ. అతులశరంబు లట్లు వృథ యైనఁ గనుంగొని ద్రౌణి రశ్మిమం
డితమహనీయశక్తి నిగిడించిన భూతముఁ దాఁకి యంత్యకా
లతిమిరవైరిమండలవిలగ్నమహోల్క యుఁబోలెఁ బిన్నపి
న్నతునియ లై యడంగె నరనాథ యతండు విషాద మందఁగన్. 99

చ. అలఘుతరాత్మసారుఁ డగునగ్గురుపుత్త్రుఁడు ఘోరఖడ్గమున్
బిలగతసర్పముం దిగుచుభీషణరేఖ నటించుభంగి న
గ్గలపురయంబునం బెఱికి గాఢవిముక్తము గాఁగ వైచినం
బాలు పఱి పోయె దూదిక్రియ భూతశరీరసమాగమంబునన్. 100

తే. సరభసంబుగఁ దోమరసమితిఁ జక్ర,వితతిఁ బరఁగించి పేర్చె నవ్వీరవర్యుఁ
డదియు నదియును దోడ్తోడ నల్ల నగుచు, మ్రింగె నమ్మహాభూతంబు మేదినీశ.

క. అలిగి యతండు నితాంతో,జ్జ్వలగద వైచుటయు నదియు సత్వరలీలన్
జలచర మామిషముం గొను, పొలుపు నెఱయ మెఱయ మ్రింగె భూతం బధిపా.

ఆ. ఇవ్విధమున సకలహేతులు వమ్మయి, పోవ నతివిషణ్ణబుద్ధి యగుచు
నట్టు నిట్టుఁ జూచు నతనికి బహుజనా,ర్దనులు దోఁచి రంబరమున నెల్ల. 103

ఉ. భీకరవిష్ణురూపములు పెక్కిటు లొక్కటఁ దోఁపఁ దీవ్రతా
పాకులమానసుం డగుచు నగ్గురుసూనుఁడు దుర్మదంబునం
జేకొన నైతి నట్లు కృపుచెప్పినసత్యహితోపదేశముల్
నా కిది పెద్దయే యని మనంబున ని ట్లని పల్కె వెండియున్. 104

ఆ. మహితశాస్త్రకలితమార్గంబు విడిచి ని,జేచ్ఛఁ బగఱ గెలువ నెవ్వఁ డరుగు
వాని నయ్యధర్మవర్తనక్రౌర్యము, మెవ్విధమునఁ జెఱుచు నింత నిజము. 105

సీ. గోవు బ్రాహ్మణు బాలకుని వృద్ధు నంధుని, సఖుఁ దోడఁబుట్టువుఁ జడుఁ బ్రమత్తు
మత్తుని గురుని నున్మత్తుని సుప్తుని, [1]నంగన భీతుని నస్త్రశస్త్ర
నిహతి నొప్పించుట విహితంబు గా దని, యార్యులు సెప్పుదు రట్టిధర్మ
మార్గంబు దొలఁగి దుష్కర్మతంత్రంబుమైఁ బగ, యడఁగింపఁ గడఁగిన నసురవృత్తిఁ

ఆ. జేట కాక కార్యసిద్ధి గానేర్చునే, పెద్ద మెత్తికొనిన భీతి మగుడఁ
బడుట గష్టసరణి బలిమి దయ్యముతోడఁ, జెల్ల దింక నేమి సేయువాఁడ. 106

ఉ. అక్రమవృత్తి గీడుతెరు వై ఫలియింపదె ద్రోణసూతి దు
ర్విక్రమనిందకర్హుఁడె సవిస్మయ మైనమనంబు భూతవృ
త్తిక్రమవేది గాదు గణుతింపఁగ నేమియొ యిమ్మహాద్భుత
ప్రక్రియ కాదికారణము పాపనిరూఢుఁడు నీతిఁ గాంచునే. 107

వ. అని పెక్కుభంగుల వగచి పల్లటిల్లినచిత్తంబుఁ బట్టుకొల్పి యిట్లని నిశ్చయించె.

శా. భావం బేకముఖంబుఁ జేసికొని యాపద్ధ్వాంతభానున్ మహా
దేవుం బర్వతకన్యకాప్రియు దయార్ద్రీభూతచేతస్కు లో
కావిర్భావవివర్ధనాలయకృతివ్యాపారపారంగతున్
దేవేంద్రప్రముఖామరార్చితుని భక్తిప్రౌఢతం గొల్చెదన్. 109

ఆ. అఖిలదేవతామయాత్ముఁ డద్దేవుఁ డ, ట్లగుట నిఖిలదైవికాపదుదయ
నిరసనం బొనర్చునియతి నప్పరమేశుఁ, గొలిచి యిపుడ కీడు దొలఁగఁద్రోతు.

వ. అని యిట్లు నిశ్చయించి నియతుం డై రథంబు డిగ్గి ధరణీతలంబునం గూర్చుండి
భావంబున భూతనాథు నెలకొలిపి యక్కుంభసంభవుండు. 111

### ఆశ్వత్థామ శివున కాత్మోపహారం బొసంగ నిశ్చయించుట.

సీ. స్థాణు నుగ్రుని శివు శర్వు నీశానుని, భద్రప్రదుని శంభు రుద్రు గిరిశు
నవ్యయు శ్రీకంఠు హరుఁ బరమేశ్వరుఁ, బురహరు నజుని శంకరుఁ ద్రినేత్రు
బహురూపు విశ్వరూపత్వసంవ్యాప్తుని, నంబికాహృదయేశు నమరవంద్యు
గణనాథు విభు శూలఖట్వాంగధరు జటా, మండలాలంకృతమౌళి నభవు

ఆ. నాశ్రయించి యతని కాత్మోపహార మ,ర్పించువాఁడఁ గాక పెక్కుతలఁపు
లేల నాకు నమ్మహేశ్వరేశ్వరుఁ డెట్టి,గతి యొనర్చె నది సుఖంబ కాదె. 112

వ. అని తలంచి భూతకృత్యం బైనపరాక్రమప్రతిబంధరూపం బుగ్గడించి. 113

క. ఏ నీయాపదఁ గడచిన, నానాభూతోపహారసవ్యార్చన నీ
శానునిఁ బ్రీతుం జేసెదఁ, బూని ప్రమథగణము నన్నుఁ బొగడునటులుగన్. 114

చ. అని హృదయంబునం బలుకు నమ్మహనీయచరిత్రుముందటం
గనకపువేది దోఁచె సధికద్యుతిజాలము లుల్లసిల్ల నం

1. గ. నంగనాభీరుని.

దనలము విస్ఫురత్పటుశిఖావలి నొప్పి వెలింగె దానికి
న్మనము దలిర్ప నిశ్చయముగ నం దెలివొందె నతండు నెంతయున్. 115

వ. అప్పుడు ప్రదీప్తవదనులుం బ్రజ్వలితనేత్రులు నేకపాదులుం గరితురంగసింహసూక
రాననసమాననముఖులును దీవ్రదంష్ట్రాకరాళాస్యులును మఱియు ననేకప్రకారంబు
లగువక్త్రంబులం బొలుచువారును వక్రాంగులు దీర్ఘదేహులు హ్రస్వశరీరులు
నతిస్థూలకాయులుం గృశమూర్తులుం బింగళగాత్రులు నీలతనులు మఱి నానా
వర్ణంబులు గలుగువారును బంచశిఖులును జటాధారులును గపాలధరులును
మఱియు బహుభంగికంబు లైనమౌళితలంబులం బొలుపొందువారును లోనుగా
వివిధవిశేషవికృతస్వరూపులగు ననంఖ్యాతప్రమథులు చిత్రాంబరమాల్యాంగరాగం
బులు రత్నకనకమయభుజగాస్థిమాలాభూషణంబులును ధనుస్తూణకృపాణముసల
ముద్గరపరశుభిండివాలశూలప్రభృతిస్ఫారప్రహరణంబులు మెఱయ మృదంగపణవ
డమరుఘంటాగోముఖాదితూర్యంబులు మొరయ విస్ఫురద్ధ్వజపతాకాకుంచికలు
శోభిల్లఁ బాడుచు నాడుచు నార్చుచు బొబ్బలిడుచు నవుడు గఱచుచుఁ దుళ్లుచు
గురువులువాఱుచుఁ గరటిబృంహితంబులుఁ గంఠీరవగర్జితంబులు శంఖరవంబులు
భేరీధ్వనులుం బోనిమెలుంగులు సెలంగ బెట్టిదంబు లగుపలుదెఱంగులపలుకు
లెసంగ బ్రహ్మద్వేషు లగువారిమాంసరుధిరంబులఁ బూర్ణంబు లగుకపాలంబులు
గరతలంబులం గొని యాభీలంబు లగుభక్షణపానంబు లాచరించుచు సోమపాన
శమదమతపోబ్రహ్మచర్యప్రముఖంబు లగుతమవిశిష్టకర్మంబులకు భవుండు విస్మ
యంబు నొందుంగాని యష్టగుణం బగునైశ్వర్యంబు నొందియుఁ దారు విస్మితులు
గానియట్టిమహానుభావుల ద్దేవునకు గౌరికిగజముఖషణ్ముఖులకంటె నర్మిలికింబట్టగు
భవ్యులు దివ్యజనస్తవ్యు లయ్యుగ్రగురుతమాభవు తెం పెఱుంగుటకు సాత్త్వికవ్యా
పారఘోరత్వంబుఁ గనుంగొని వినోదించుటకు నచ్చి యతనిచిత్తంబునకు బెదరు
పుట్టించువారై భీషణాకారంబుల నుల్లసిల్లిన నాధైర్యధుర్యుండు. 116

మ. [2]వెఱ పావంతయు లేక వారిఁ గలయం గ వీక్షించి నెమ్మోమునం
జిఱునవ్వుం మదిఁ దెంపుసొంపు వెలయం గ జెల్వంబు రెట్టింప నం
దఱుఁ గీర్తింప రథంబుమీఁదిఘనకోదండంబు చే నందిచి
చ్చుఱుకం జేరె నుదాత్తభంగి మహనీయోత్సాహసందీప్తుఁ డై. 117

ఆ. ఇవ్విధమునఁ జేరి కయ్యవ్వేదిలోపల, భాసమానుఁ డై నకపావకునకు
దేహ మొక్కయాహుతిగఁ జేయుటకుఁ దగు,నంత లేకయునికి నతఁడు సూచి.

క. తనయరదముమీఁదం గల, ధనుర్వితానము లసత్పరిదరజాలములం
గొనివచ్చి వేదియం దిం,ధనములుగాఁ బేర్చి తెంపు దలకొనుమదితోన్. 119

వ. పేర్చి యప్పరమేశ్వరు నుద్దేశించి. 120

1. గ. బంచశిరస్కులును. 2. క. వెఱపా వెంతయు.

క. తెఱఁ గెట్టిదియో నామది, నెఱుఁగ మదాత్మోపహారక మిచ్చెద నీకుం
గఱకంఠ వరము నాకుఁ బ్రగఱఁ బరిమార్పంగ శక్తిఁ గలుగుటయ చుమీ. 121

వ. అని ప్రార్థించి. 122

క. ఆంగిరసకులజనిత మీ, యంగము శిఖియందు దీని నాహుతిగాఁ జే
యం గంటి భవద్భక్తిసు, సంగతమతితోఁ గృతార్థుఁ జమ్మఁడ నైతిన్. 123

క. అని పలుకుచుఁ బరమేశ్వరు, మనమున నిడి యూర్ధ్వబాహుమహితాకారుం
డును ఘనసమాధియగుచుఁ, విను ముఱికెను గురుసుతుండు వేదికపైకిన్. 124

ఆ. ఉఱికి మంటలోన నుల్లంబు తెలి వొక, యింత యేనిఁ గుంద కిద్ధమూర్తిఁ
దేజరిల్ల నున్న ధీరవర్యునకుఁ బ్రత్యక్ష మయ్యె శివుఁడు దయ దలిర్ప. 125

అశ్వత్థామకు శివుఁడు ప్రత్యక్షం బై ఖడ్గం బొసంగుట.

వ. ఇ ట్లిమర నిల్చినభక్తవత్సలుం డగుభవానీవిభుండు దరహసితముఖుం డగుచు
దివ్యావలోకనామృతంబు వెల్లిగొల్పిన నవ్వేదియందుఁ గమలాకరంబులో నున్న
చందంబునఁ బ్రమోదంబు నొంది యున్నయస్నరోత్తమునకు నారాయణప్రియుం
డి ట్లనియె. 126

క. ఇమ్మెయి నీ దగుసత్కర్మము విశేషమునఁ జేసి మానస మత్యం
తమ్ము ప్రియ మందె నీకు వర మ్మొసఁగఁగ వచ్చితిఁ ధరాసురవర్యా. 127

వ. అనవుడు. 128

తే. తనువు పులకలపోవు గా మనము గాఢ
సంభృతానందముగ శరాచార్యసుతుఁడు
వితతసంభ్రమముఁ జై వేది నెడలి సాఁగి
మ్రొక్కి లేచి ఫాలంబున మొగిచెఁ గేలు. 129

వ. అప్పుడు. 130

చ. అతని మొగంబుమీఁద నొలయఁ మధురం బగుచూడ్కి పార్వతీ
పతి మృదురీతి నిట్టు లను భవ్యము లైనతపంబు సత్యము
స్మృతియును శౌచముం గలిగి నిశ్చలభక్తి యొనర్చుఁ గృష్ణుఁ డ
ప్రతిమసపర్య నాకు ననుకరక్తుఁడ నేనును నమ్మురారికిన్. 131

క. అతనికి సన్మానము సే, యుతలంపున భూతరూపయుక్తుఁడ నై వ
చ్చితి నినుఁ బాంచాలురపై. నతిస్ఫురణఁ బోన నీక యడ్డం బై తిన్. 132

తే. తెల్లముగ నీదు చిత్తంబుఁ దెలియఁ గెలుంగ, వలసి నే నిట్ల నేకసూకయులు పొనర్చి
యస్త్రశస్త్రనిరాసంబు నాచరించి, కేలి సలిపితి వేయును నేల చెపుమ. 133

వ. కృష్ణసన్మానంబును గృతంబయ్యెఁ బాంచాలురకుఁ గాలంబు డగ్గఱియె నేఁడు దెగు
దురు నీవు నాయనుగ్రహంబు వడసి తని యొక్క మహనీయఖడ్గం బబ్బప్రుని చేతి

కిచ్చుచు నతం డెఱుంగ కుండఁ దేజోరూపంబున నతనితనువున నావేశించె నిట్లు రుద్రుం డొలసినయగ్గురునందనుం డమందహర్షమయమూర్తి యై యతులప్రభ నొప్పె మున్ను భూతంబుచేత నపహృతంబు లైనయస్త్రశస్త్రంబులును బిడప వేదియం దిడినయాయుధంబులునమ్మహావీరుని తేరిపైఁ బూర్వప్రకారంబున నుండె నప్పుడు ప్రమథగణంబు లదృష్టాకారంబు లై యమ్మహాత్మునిఁ బరమాత్ముఁ గొలుచుచందంబున బలసి రా రథారూఢుం డై పాండవశిబిరంబునకు నాతండు నడవఁ దోడన కృపకృతవర్ములు నడచి రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

చ. అతఁ డటు లేపునం జనఁగ నాకృపుఁడుం గృతవర్మయుం గా మహో
న్నతవరలాభగర్వితమనస్కుఁడు ద్రోణసుతుండు వోవఁగా
నితనిక్రియం గా బలోద్ధతిసహిష్ణుత గల్గునె యొడ్ల కంచు సం
భృతభయచిత్తవృత్తు లయి పెంపఱఁ బోరు గదా పిఱిందికిన్. 135

వ. మఱియును. 136

మ. పటువేగంబున ముట్టి ద్రోణసుతుఁ డప్పాంచాలలోకంబుఁ ద
త్కటిభూపాలుర ద్రౌపదీతనయవర్గంబుం భుజాఖేలనో
ద్భటఖడ్గోల్లసనంబుపాల్పఱిచి తద్ధాత్రీతలం బెల్ల నె
త్తుట జొత్తిల్లఁగఁ జేసె నే రిపుచమూదుర్వారఘోరాకృతిన్. 137

క. పాండవశిబిరముఁ జొచ్చి య,ఖండితపౌరుషము వెలయఁగా గలశజపు
త్త్రుం డది యంతయు మత్పు,త్త్రుం డరిగెడు తెరువునం దగరుగఁ జేసెఁ గదే. 138

వ. సమరప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱిఁగింపు మనుటయు నతం డిట్లనియె.

తే. ఇవ్విధంబున గురుసుతుఁడు దేపుమిగిలి, చనఁగఁ గృపుఁడును గృతవర్మయునుదలిర్చి
కడఁక నతనితో నడచిరి గాని వారి,వలన నించుకయును నరవాయి లేదు. 140

వ. ఇట్లు తనకెలంకుల నడచునవ్వీరుల నాలోకించి యాచార్యసుతుండు సంతోషించి.

ఉ. మీరును దెంపు సొం పెసఁగ మిక్కిలి బీరము లావు చూపఁగాఁ
గోరి కడంగి పైఁ బడుటకుం దగి [1]యుండదు వీడు మీబలో
దారతప్రాపునం జని యుదగ్రభుజావిభవంబు పెంపు సొం
పారఁగ నవ్విరోధినిచయంబు సమస్తము నేన త్రుంచెదన్. 142

వ. అని యిట్లు వారి నగ్గించి వాకిట నిలిపి మహాసియు బాణబాణాసనంబులు వహించి సుప్రసుప్తసకలజనం బైనయాశిబిరంబుఁ జొచ్చి తాను మున్న గతాగతజనంబుల వలనఁ బ్రసంగాధీనతం జేసియవ్విడిదల తెఱంగును నిట్టిట్టివి వారిసన్నివేశంబు లిచ్చటిచ్చట నని సాభిజ్ఞానంబుగా విని యుసికికతంబున నరసికొని పోవ నేర్చి తొలుత ధృష్టద్యుమ్నుసదనంబునకు నరిగి బాణబాణాసనసహితం బై యున్నరథంబు డిగి రుద్రు నుద్దేశించి మానసంబున. 143

1. క. యుండుఁడు మీఱి.

క. పూనితి నిష్ఠ మెయిఁ నిను, నానాభూతోపహారనవ్యార్చన నీ
కే నొనరించెద నది యీ, శానా కైకొనుము సుప్రసన్నుఁడ వగుమీ. 144

వ. అనుచు నరిగి. 145

తే. అచటిజనములుపగలింటియాహవమున, శ్రమముఁ బొందియు నిశ్శేషశత్రునాశ
నమున నూఱటఁ జేసియు నమితనిద్ర, నొందియత్యంతవివశులై యుండనతఁడు.

వ. మందగతిం బ్రవేశించి. 147

చ. తెరయును మేలుకట్లుఁ దగుదీవియలుం జెలు వొంద మేటిచ
ప్పరమునఁ జాలహృద్య మగుపాన్పున నూఱడి నిద్ర వోవున
గ్గురవధకారిఁ గాంచి కడుఁ గ్రోధము మోదము సందడింప సు
స్థిరతఁ బదప్రహారమునఁ [1]దెల్పెఁ దృణీకరణాభిరాముఁ డై. 148

వ. తెలిపినఁ గను విచ్చి తన్నుం జూచి యెఱింగియుఁ గలంగక రణదుర్మదుం డైన
యాద్రుపదనందనుఁడు దిగ్గన లేచినం దనచేతివిల్లు విడిచి యతనితలఁ బట్టుకొని
పెడమఱలఁ దిగిచి యబ్బలియుండు. 149

ఉ. నేలపయిం బడం దిగిచి నిష్ఠురభంగి నురఃస్థలంబు మోఁ
కాల నొగిల్చి యేపున మొగం బతిదారుణముష్టి నొంచె ని
ద్రాలసవృత్తి నంగములయందు బలంబును బుద్ధి నేర్పునుం
జాలనియవ్విరోధి వివశత్వముఁ బొందఁగఁ జేసె వ్రేల్మిడిన్. 150

వ. ఇవ్విధంబున నతనిచేత ధృష్టద్యుమ్నుండు. 151

చ. వివశత భీతిఁ బొంది కడువిహ్వలుఁ డై తనుఁ జూడ ద్రోణసం
భవుఁడు వెసన్ శరాసనము వాపి గుణంబు తదీయకంఠముం
దవులఁగఁ జేర్చి వాగురవిధం బొడఁగూర్చి మనంబు విక్రమో
త్సవమున నుబ్బఁగాఁ బశువుం జంపెడుచాడ్పునఁ జంపు వేడుకన్. 152

వ. ఉరంబును మెడయు నిరుగాలం ద్రొక్కినఁ ద్రొచియు దైన్యంబు దోఁప గోళ్ల
గీఱియు నిస్తరింప లేక యెలుంగు వెడల కున్న నెట్టకేలకు మాట వెడవెడ
యెఱుంగ వచ్చు తెఱంగునఁ బాంచాలవరుం డమ్మహీసురవరున కిట్లనియె. 153

క. గురుపుత్త్ర శస్త్రనిహతిం, బొరిపుచ్చుము తడయ నేల పుణ్యగతికిఁ జె
చ్చెరఁ బోవునట్లు సేయుట, పరికింపఁగ మేల కాదె పగతుర కైనన్. 154

వ. అనిన విని యశ్వత్థామ యతనిమొగంబు చూచి. 155

క. వినుము గురుద్రోహికిఁ గ, ల్గునె యుత్తమగతి నితాంతకుత్సితభంగిం
దునిమితివి నీవు గురు నే, నును దుర్విధమునన యిదె నినుం దెగఁజూతున్. 156

ఆ. అనుచుఁ బెలుచ నొంప నచ్చటిజనములు
గలఁగి యపుడు మేలుకాంచి చూచి

---

1. గ. దెల్పెను ద్రౌణి రణాభిరాముఁ డై.

భయము దోఁపఁ గడిఁది బలుగాముగాఁ దమ
యుల్లములఁ దలంచి యొదిఁగి యుండ. 157

—అశ్వత్థామ నిద్రాపరవశుం డగుధృష్టద్యుమ్నుం జంపుట.—

ఉ. కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చుసింహముం
బోలుచుఁ జేర్చి యాద్రుపదభూపసుతున్ సమయించె వేదనన్
సోలఁగ రోఁజఁగాఁ బలుమఱుం బొరలంబడి లాల గ్రక్క న
వ్వాలుమగండు వాక్పరిభవంబుఁ దలంచుచుఁ గ్రౌర్యధుర్యుఁ డై. 158

క. ధృష్టద్యుమ్నుని నిట్లతి, కష్టవిధిప్రాప్తమరణుఁ గావించి మహా
వష్టంభోజ్జ్వలుఁడును సం,హృష్టాత్ముఁడు నగుచు వింట నిడియె గుణంబున్. 159

వ. ఇట్లు సజ్యం బయినచాపంబు ముష్టి నమర్చి యాచార్యనందనుండు. 160

ఆ. చప్పరంబు వెడలి చనుదెంచి [1]యల్లని, నగవు నెఱయ సూతు మొగమునందు
జూడ్కి వొలయ రత్నసుందరం బగునిజ, స్యందనంబుపైకిఁ జనియె నధిప. 161

మ. అరదం బిమ్మెయి నెక్కి యుబ్బి శిబిరం బాప్రొద్ద నిశ్శేషతం
బొరయం జేయుకుతూహలంబు మది నుప్పొంగన్ లసన్నేమిని
ష్ఠురనాదంబు ప్రమోదముం బెనుప రక్షోభూతచిత్తంబులం
బరవీరావలియిండ్లకందువ లెడం బాటించుచుం బోయినన్. 162

తే. పీనుఁ గై యున్నపాంచాలసూనుఁ జూచి, రక్షకులును దదీయపురంధ్రులును స
మగ్రశోకాంధకారనిమగ్నచిత్త, వృత్తు లై యేడ్చి రెలుఁగులు విన్ను ముట్ట. 163

క. ఆకలకలమున మేల్కని, యాకెలఁకులయిండ్లరాజు లది యే మనుచున్
వే కదియం గని యాజను, లాకులరవ మెసఁగ నిట్టు లనిరి నరేంద్రా. 164

క. రక్కసుఁడో మానిసియో, నిక్క మెఱుంగము వధించె నృపసూనుని వీఁ
డొక్కరుఁ డుదగ్రుఁ డై రథ, మెక్కి యరిగెడున్ దురాత్ము నెయిదుఁడు కడఁకన్.

వ. అనిన విని యన్నరపతులు తల లెత్తిచూచి పోనీక పొదువుం డనుచు సపరివారం
బుగా నడరి యశ్వత్థామం బొదివిన నుద్దామప్రకారంబునం దిరిగి మూఁపులు
పెరుఁగ గొనయంబు సారించి. 166

మ. ఖరనారాచపరంపరావిహరణక్రౌర్యంబునన్ శాతని
ష్ఠురభల్లప్రవిసారదారుణతరక్షోణీశులం దద్బలో
త్కరముం గేలియపోలె గీటడఁచె ద్రోణిగర్వం బఖర్వంబుగా
పెరవుం జేవయు భూతముల్ వొగడ నవ్వీరుండు ధీరోద్ధతిన్. 167

వ. తదనంతరంబ యుత్తమౌజునిలోఁగిలి చొచ్చి కృపాణపాణి యై యరదంబు డిగ్గి
యరకొని యతనియభ్యంతరమందిరంబుఁ [2]బ్రవేశించి. 168

సీ. అలికిడి మేల్కనునతని ధృష్టద్యుమ్నుఁ, బట్టినక్రియఁ దల పట్టి యీడ్చి

---

1. యొజ్జనినగవు. 2. గ. జొచ్చి.

యాతనిఁ జంపినన్ యట్టులు పశుమరణాతికౌతుకమునన్ నవనిఁ బెట్టి
చంపు నచ్చెరువన్ బప్పరంబున శయనించుయుధామన్యున్ దెఱఁగి కదఁగి
చనుదెంచి రాక్షసుఁడని తలంచియుఁ గొంకు, వెట్టక పెనుగడన్ బెట్టు వ్రేయ
ఆ. వ్రేటు వడి చలింపన్ గాటోపదీపితుఁ, డగుచు గురుతనూజుఁడ దక్కుమారు
నగ్రజన్ముఁ బోలెన్ నుగ్రత వధియించెఁ, గాని ఖడ్గలీలన్ గలుగ దయ్యె. 169
వ. ఇట్లు ద్రుపదపుత్త్రుల నొక్కుమ్మడి నిరువుర గీటడంచి యబ్బలుమగండు. 170
శా. కాలాకారతఁ బేర్చి దోర్లసితఖడ్గస్ఫారసాంద్రప్రభా
జాలం బొప్పఁగ నిండ్లు సొచ్చి లఘుసంచారంబు శోభిల్లఁ బాం
చాలవ్రాతముఁ గ్రీడమైఁ దునిమె రక్షశ్శ్రేణి మాంసంబుఁ గీ
లాలంబుం గబళించి త్రావి మదలీలాలోలతం గ్రాలఁగన్. 171
వ. అట్టియెడ. 172
శా. నిద్రాసక్తునిఁ గొంత మేల్కనినవానిన్ సుప్రబుద్ధాత్ముఁడై
యుద్రేకంబును శౌర్యసారమును బాహూల్లాసముం జూపఁ జం
చద్రేఖం దిరమైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాఁకి యు
న్నిద్రస్వైరసముద్ధతిన్ మెఱయువానిం దున్మె నేకాకృతిన్. 173
వ. మఱియు నతండు. 174

## అశ్వత్థామ కరితురంగంబులపై కుఱికి నఱకుట.

స్రగ్ధర. తుండంబుల్ నుగ్గునుగ్గై తొరఁగఁగఁ జులుకన్ ద్రుంచుఁ గుంభస్థలంబు
ల్ఖండించున్ మౌక్తికంబుల్ గల్లలుఁగఁ జెదరన్ గాయముల్ వ్రేవుఁ బ్రోవుల్
చండంబుల్ సాంద్రరక్తస్రవమున బెరయన్ జాల్వడన్ వ్రేయు నిమ్మో
త్కుండాలశ్రేణి మాయించుచు వెలిఁగి హయస్తోమశాలాగతుం డై. 175
ఉ. కొన్నిటిపాదముల్ నఱకుఁ గొన్నిటిమోరలు చెక్కు లీలమైఁ
గొన్నిటికంఠముల్ దునుముఁ గొన్నిటివీఁపులు వ్రచ్చు నుబ్బునం
గొన్నిటిసర్వగాత్త్రములు గ్రూరవిచేష్టితవిభ్రమంబు దోఁ
పన్నుఱుమాడుఁ బ్రౌఢబలభాసితభూరిభుజావిహారుఁ డై. 176
వ. ఇబ్భంగిఁ బీనుంగుపెంట లైనపాంచాలురవిడిదల వెడలి విజయోద్దాముం డగు
నశ్వత్థామ చల్లడముకట్టి మొదలయినపరికరంబులు పాటించియున్నగనపలోఁగిళ్ల
కుం జని తొలుత ద్వారలందునుముచుఁ బరిజనమాతంగతురంగమండలంబుల ముట్టి
విదళనవినోదంబులు సలుపుచు నొక్కొక్కయెడ మార్తురు మేల్కని పన్ని మా
ర్కొనిన మారి మసంగినట్లు మృత్యుదేవత గెరలినచాడ్పున జముండు నలిరేఁగిన
కరణిఁ గనుపుగొట్టి కాలుకాలం బెనంగినపీనుంగులను గనకరత్నవలయంబులఁ జెలు
వందుచేతులను దునిసిపడినకరికరంబులతో సరసమాడుచెలువు సంజలనంబు నొందు
చరణంబులను నావులించుతలలను వేదండదంతఖండంబులను హాటకనుబుపాళ

బులను రథావయవశకలంబులను మదువులు గట్టు నెత్తురులను గుప్పలు గొనుకండ
లను బెనంగొను ప్రేవులను బెనుతిట్ట లగు నెమ్ములను మూర్తిమంతంబు లయినట్టి
యద్భుతంబునకు భయానకంబునకు బీభత్సంబునకు నన్నెల నెల వగునట్లుగాఁ
జేయుచుఁ జెలంగి చెలంగి మలంగి మలంగి తనకరవాలలీలలు భూతబేతాళంబులకుఁ
బ్రీతిఁ బెనుపఁ జతురంగంబులం బాఱినను బీఱువోయినను దెరలినను గలంగినను
దొలంగినను దఱిమినను నఱిమినను గిట్టినను ముట్టినను దాను వానిం బొదివి పొలి
యించుచు బలువిడియునుబ్బును వెరవును బరుసఁదనంబు నొక్కచందంబునఁ జెల్ల
నం దొక్కటినైనను దక్కనీక యంతకంతకు నెక్కు డగుకోపంబున నాటోపంబు
దీపింపవాదరఁ జిక్కిన యెముకతునుకలు గోఱదాడలకై వడిగలిగి రుధిరాను లేపనం
బున నాభీలం బగు నసిపట్టిక ఘోరాకార మైన రాక్షసి పగతుర గీటడంగించుటకుఁ
దనకుం దోడు వచ్చిన తెఱంగున మెఱయఁ జేదిసైన్యసన్నివేశంబు లోనుగాఁ గల
పలుచోట్లఁ గమలాకరంబు సొచ్చిన ఘనలులాయంబు రేఖయుఁ గేలివనంబుఁ దఱిసిన
మత్తశుండాలంబు పోల్కియును గాంతారంబు దరికొను దావపావకు విధంబును దోఁప
విహరించుచు వలయుతఱి రథం బెక్కుచుఁ బాదచారి యై విక్రమించుచు వెరవు
దొరకొనినయప్పుడు డిగ్గుచు నగ్గలికమై బెరయఁ బెనంగి పగతుర రక్తంబున సిక్తం
బైనశరీరంబు దారుణప్రకారంబున నుల్లసిల్లఁ దన్ను సకలజనులు దానవుం
డని తలంపఁ బెంపారు భీషణోద్ధతిఁ బ్రవర్తిల్లుపరాక్రమక్రీడ నతిశయిల్లి రాజ
మందిరంబు సార నప్పళించుచుఁ దద్ద్వారంబున కభిముఖుం డై యరిగె నట్టియెడ.

సీ. కలయఁగ వీడు మేల్కని యమ్మహావీరుఁ, డొక్కెడ మెలఁగుటయును నతండు
దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తద్బంధుసంతతి గీటడఁచి యోధదంతితురగ
చయముల నెల్లను సమయంగఁ జూచుచు, రాకయుఁ గర్ణపరంపరావ
గతమున సన్నాహగాఢ మై యెక్కడెక్కడ యని కడఁగి శిఖండి ద్రౌప

తే. దేయులును దానుఁ బన్ని యుద్వృత్తశౌర్య
[1]మానతుంగప్రభద్రకమాత్స్యతతులుఁ
దోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణతనయు
ముట్టి శస్త్రాస్త్రచయముల ముంచుటయును. 178

వ. వారల నేర్పడ నాలోకించి. 179

ఉ. అగ్గురునందనుండు హరిణావలిఁ గాంచి కుభృత్తటంబు వే
డిగ్గుమృగేంద్రు చాడ్పునఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా
డిగ్గి రథంబు చోద్యపువడిం గలయన్ బెరసెం గరంబులం
దగ్గల మైన ఖేటకము నద్భుతఖడ్గముఁ దేజరిల్లఁగన్. 180

---

1. అ. భంగి ద్రుపదప్రభద్రకబలవితతులు. 2. క. గవిసెం గినుకం.

మహాస్రగ్ధర. చతురంగచ్ఛేదకేళీసరభసకలనాశ్చర్యధౌరేయనానా
గతులం దన్నల్లవారుం గడిఁదియసుర నాఁగా నతిక్రూరచేష్టో
ద్ధతి యొప్పం జొచ్చి సైన్యాస్త్రముల నతనియస్త్రంబులం ద్రుంచి వీఁకం
బ్రతివింధ్యుం గిట్టి రెం డై పడఁగఁ దునిమెఁ దద్భాసమానాంగయష్టిన్. 181

వ. ఇవ్విధంబున ధర్మతనయనందనుని నడుము వెగ నడిచి యార్చి పేర్చిన. 182

మహాస్రగ్ధర. అతిశోకక్రోధవేగవ్యథితహృదయుఁ డై యశ్వసాదిత్వవీరో
ద్ధతిఁ [1]ప్రౌఢస్ఫూర్తి సెల్వొందఁగ సబళముఁ దద్గాత్రముం జొన్పఁ బూఁచె
న్నురితసోముం డల్లఁ బట్టి న్గురుసుతుఁ డదియుర్ [2]స్రుక్క చెన్నార నల్క
న్ధృతఖడ్గుం డైనఁ జేయు న్శిరముఁ దురగము న్వ్రీలిమ్మిడిం ద్రుంచివైచెన్.

వ. ఇవ్విధంబునఁ జిత్రవధంబునకు గోచకుం డైనకీచకాంతకతనయుం గనుంగొని.

మహాస్రగ్ధర. నినుఁ గూడన్ వీఁడె వచ్చెన్ నృపుఁ డనుచు శతానీకుఁ డాభీలచక్రం
బున నశ్వత్థామవక్షంబునను రుధిరముం బొంగఁగాఁ జేయ నప్పా
టున నీడంబోక బల్వేటున నిలఁబడ నాటోపముం జూపి యంతం
దనివో కాదుర్జయుం డాతనిశిరమును దద్గాత్రముం బాపె లీలన్. 185

వ. అట్లు నకులసూనుండు సమసిన. 186

మహాస్రగ్ధర. శ్రుతసేనుం డప్డు కోపస్ఫురదరుణమరీచుల్ దలిర్పంగఁ జక్షు
ర్ద్వితయం[3]బుం గెంపునం బొందినచెలువము సందీప్తఘోరంబుగా బె
ట్టతనిం జంచద్గదన్ వ్రేయఁగ నుఱుక తద్ధాస్యచ్ఛిదాస్ఫారకేళీ
చతురుం డై యక్కుమారున్ జముకడ కనిచెం జండదోర్దర్ప మొప్పన్.

వ. ఇత్తెఱంగున వికృతాననుం డై పడి మృతుం డైనసహదేవసుతుం జూచి రోషం
బునం బేర్చి. 188

మహాస్రగ్ధర. వితతజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్య మేపార బాణ
ప్రతతిం దన్నింప వీఁకం బలక జడియుచున్ బల్విడిం బేర్చి చంచ
ద్గతిఁ గ్రీడం దంతిహేలాదళనరతమృగేంద్ర[4]స్ఫురన్మూర్తి దోఃపట
శ్రుతకీర్తిం గిట్టి కంఠత్రుటనవిలసనారూఢి నవ్విప్రుఁ డొప్పెన్. 189

వ. ఇట్లు ద్రౌపదీతనయపంచకంబు పంచత్వంబు నొందినఁ గ్రోధాతిరేకంబునఁ బ్రభ
ద్రకులును శాంతనవాంతకుండును ధృష్టద్యుమ్నాంతకుఁ జుట్టిముట్టి. 190

చ. శరములఁ దోమరంబులను జక్రములన్ వెసఁ గప్పి బెట్టు ము
ద్గరకరవాలకుంతముఖదారుణహేతుల నొంప నాతఁ డు
ద్ధురగతులం బ్రభద్రకులఁ ద్రుంచుచుఁ గేళి యొనర్పఁగా శిఖం
డిరుచిరమార్గణంబు భ్రుకుటిస్థలి నొంచె సముద్భటోన్నతిన్. 191

---

1. గ. మూర్తిస్ఫూర్తి. 2. గ. నుగ్గుగాఁ జేసి. 3. క. గ. ఛ. బుగ్రంబునం బొంది. 4. క. క్రమ ఫూర్తి దోఃపట

## అశ్వత్థామ శిఖండిం బొదివి చంపుట.

క. గురుసుతుఁడు క్రోధమయ మగు, బరవసమున నప్పు డాద్రుపదనందను మే
నిరువదియ గాఁగ నేసెను, [1]శిరము నుదగ్రతఁ గృపాణశిఖ మెఱయఁగన్.

వ. ఇవ్విధంబున దొరలు దెగినను బాంచాలప్రభద్రకమత్స్యసైన్యశేషంబులు వాఁక పెనంగిన నతండు మాతంగవితానవిదళనం బప్పుడు సలిపినకంఠీరవంబు తనమీఁద హరిణకులంబు గవిసిన నెట్టి దగు నట్టివాఁ డగుచుఁ బేర్చి యార్చి నత్తెఱంగుతు ములంబునఁ బొడగానమిఁ బాండునందనులు కృష్ణసాత్యకులును నాశిబిరమున లేకయునికి యెఱింగె నప్పుడు గనుంగొనుజనంబులకు నితం డశ్వత్థామ యనుబుద్ధి వొడమె నది యె ట్లనినఁ గురుపాండవులు భండనంబుఁ జేయం దొడంగినయది మొదలుగా రాత్రు లచ్చటిజనులు నీలతనువును రక్తాస్యనయనయు రక్తాంబర ధరయు రక్తమాల్యానులేపనయు నగులేమ యొక్కతి తమవీటివారు నిద్రవోవు చుండఁ దలలు వీడ ముసులు వికృతంబు లై ప్రేలం బాశంబులఁ గరితురగసహితం బుగా బంధించి ఘోరసంరంభంబునం దెచ్చి తెచ్చి యశ్వత్థామయుగ్రభాగం బునం బెట్ట నుగ్రభావంబున నతండు మునుముచు నార్చు చునికిఁ గలలు గాంతు ర ట్లగుటం జేసి నిద్రాసక్తులం జంపుటయు నవ్విధంబునార్పును నేర్పడ ననుసం ధించి యక్కలలఫలంబు గా కేమి యని తలంచి చొచ్చి పోటునకు నయ్యారాత్రి రాత్రిమై వచ్చుట నిశ్చయించి యశ్వత్థామఁగా నెఱింగి రవ్వీరుండు మెఱుంగు మెఱచినట్లు వివిధగతులఁ జరించినం జెండాడినం జూచియు నీడంబోక రణక్రీడ సల్పిన నబ్బలుమగండు సముద్దండబాహుదండవిలాసుం డై. 193

మహాస్రగ్ధర. తలలన్ హస్తములం బాదములఁ దనువులం దత్ప్రదేశంబుఁ గప్పం
దొలఁగించున్ వానిఁ గ్రొన్నెత్తురు వఱపి సాయకస్తోమదంతిప్రతానం
బుల మేదోమాంసఖండంబుల దనుజమహాభోజనం బావహించు
[2]స్మలఁగం బాఱుం జెలంగు న్నలి నెసఁగు జయోన్మత్తుఁ డై మానవేంద్రా.

తే. అట్లు విహరించి హతశేషు లైనజనులు
పాఱఁ గనుఁగొని రథ మెక్కి పటురయమున
వారి వెనుకొని మెఱుఁగువాలారుతూపు
గములు పరఁగించి యందఱ సమయఁ జూచి. 195

క. [3]ఆకలన నట్లు సేసి మహాకులజనతతులు గాఁగ నన్యస్థలులన్
భీకరరథగతుల నుదగ్రాకృతి నై మెఱసి యమ్ము లడరింపఁగన్. 196

వ. ఇట్లెసఁగుబహుళకోలాహలంబున హయంబులు నిభంబులుఁ గట్లు ద్రెంచుకొని కలయం బాఱెఁ బాఱుటయు గోడిగలకై దంతపాతకలహంబులం గెరలుగుండ్ల క్రందునను నొండొంటిమదగంధంబులు సహింపక మార్కొని పోరాడు

1. గ. శిరంబు మున్నుగ. 2. గ. స్లలిఁ బాడున్ లీల నవ్వు న్నలి. 3. గ. ఆకలన నుట్లు.

సామజంబులసమ్మర్దంబునను గాళ్లు దునిసియుఁ జేతులు నలిసియు నురంబు లవిసి
యు వెన్నులు విఱిగియుఁ బ్రక్కలు నొగిలియుఁ దలలు వగిలియుఁ జాఁపకట్టు
వడి చదిసియుఁ గ్రంతల నిఱుకటంపుఁజోట్ల మానవకోట్లు పీనుంగుతిట్ట లగు
చుండఁ బలకయు వాలునుం గొని యవ్వాలుమగండు వేడుకం దేరు డిగ్గి యగ్గ
జంబులను ఘోటకంబులను బొదివి పాటవాటోపం బొప్ప విపాటనవినోదంబు
సలిపె నప్పుడు గొందఱు నెఱయ మేల్కనని భ్రమను భయంబునను బాదంబులు
గుదివడఁ బాఱలేక నెల వెడలినమెలుంగుల నస్తవ్యస్తపుమాట లాడఁ గొంద
ఱు జనకసహోదరాదు లగుబంధువులఁ బేరువేరం బిలుచుచుం దిరిగి కనుదిరిగి
తమవారు గానివారలచెట్టలు వట్టుకొని చనఁ గొందఱు కైదువులు గొని కదిసి
నిదురకన్నులం బొదువుచెలులను జుట్టంబులను బగఱ యని సమయింపఁ గొంద
ఱెదురుగాఁ జనుదెంచినవా రిది యేమి యని యడుగ నశ్వత్థామ సొచ్చి పొడు
చుచున్నవాఁ డనిన వాసుదేవార్జునులు శిబిరంబున లేమి నప్పాపాత్మున కిట్లు
సేయ వచ్చెం గాక వా రున్నఁ దన్నుఁ గాసి సేయరే యని పలుకఁ గొందఱు
బీభత్సుం డిట్టిపరాక్రమంబు సేసినం జూచి మనంబున రోయ కుండునే యతం
డెన్నఁడేనియు వాహనవికలుఁ డైనవానిని జేత నాయుధంబులు లేనివానిని దల
వీడినవానిని వెఱచినవానిని వెఱఁగుపడినవానిని నిద్రించువానిని నొంచునే
యని యర్జును నగ్గింప నయ్యెందఱ నగ్గురునందనుండు గురుతరం బయినకురు
రాజుపరిభవంబు లప్పటప్పటికిఁ దలంపఁ బెంపారుదారుణక్రూరత్వంబునఁ గోలు
మసంగి యించుకయరవాయి గొనక చెండియుం ద్రుంచియుం జించియుఁ దుంగ
మదుఁగుఁ జొచ్చినమాతంగంబుపగిది బడలువడం జేసె నాసమయంబున. 197

సీ. ఆయోధవరుబారి కగ్గంబు గాక ద, వ్వుల భీతిఁ దలలచీరలును వీడఁ
బాదంబు లట దొట్రువడఁ బాఱి కొందఱు, మానవాధీశులు సైనికులును
విడిదలవాకిట వెడలుచోఁ గృపకృత, వర్మలఁ గని వఱువట్లు వట్టు
పెదవులు దడుపుచు సదయతఁ గావరే, యనుచు మ్రొక్కఁగ నమ్మహాత్ము లపుడు
తే. రాక్షసావేశసంభృతక్రౌర్యు లగుట, నధిప యాత్మీయమానుషహాని దలఁప
లేక వారలఁ బొదివి యనేకభల్ల, దారితులఁ జేసి రందఱఁ దరతరంబ.

క. ధరణి నెఱి దప్ప నొఱగిన, కరిహయనరచయము లొఱలఁగాఁ గరుణము భూ
వర యొలసె శిబిరమునఁ దన, కరయఁగఁ జేరుగడ లేమి నది వృథయయ్యెన్.
200

వ. అట్టియెడ.

మహాస్రగ్ధర. దనుజవ్రాతంబు కాంతాతతియును బ్రజలుం దాఁచు నానావిధోగ్ర
ధ్వను లాకాశావకీర్ణత్వమహిమఁ జౌరయం దంష్ట్రిలత్యంతఘోర
త్వనిరూఢిం బొంద నార్చుం దఱచుగ నగు నుత్తారసల్లాపముల్ సే
యు నలిం గ్రందారఁ బైపై నురవడిఁ గవియుం హుంకృతాభీలభంగిన.

వ. ఇవ్విధంబున వివిధవికారాననంబులు బహుభంగికకరపాదంబులు గలుగునపరి
మితక్రవ్యాదులు గవిసి మేదోమాంసమస్తిష్కమజ్జంబు లానుచుం జవి యైన
వానిఁ బుత్త్రమిత్త్రకళత్త్రాదుల కొసంగుచు నన్యోన్యకోటి బెరసినయెడఁ ద్రోఁద్రోపు
లాడి యవియుఁ గైకొనుచుం గీలాలాలపానంబున మత్తిల్లి నృత్యంబులు సేయుచు
మఱియు ననేకప్రకారంబుల విహారంబు సలుపుచు నుల్లసిల్లిరి పదంపడి
యఱపీనుఁగు లొఱలుటయును దానవగణంబుకలకలంబును డిందువడియె నప్పుడు
జగంబులు గొని కాలినకాలాగ్నియుంబోలెఁ బాండవశిబిరంబు నిరవశేషంబుగా
సమయించి శమియించి చాపాచార్యనందనుండు మేనెత్తుట జొత్తిల్లి మోహాం
ధ్యంబుతోఁ గలసి యునికిం జేసి సాంద్రతరరక్తసిక్తంబు లైనబాహుఖడ్గంబు
లేకద్రవ్యంబుచందంబు నొంద మరలి తాను బ్రవేశించుతఱి నెట్లుండె నట్ల నిశ్శ
బ్దం బైనయవ్విడిదల వెడలుచుండఁ దెలతెల వేగె నిట్లు ప్రతిన నెఱపి కృపకృత
వర్మలపాలికిం జనుదెంచి వారలతో ని ట్లనియె. 202

అశ్వత్థామ పాండవశిబిరంబు వెడలి కృపకృతవర్మలఁ గూడికొనుట.

సీ. సకలపాంచాలురు సమసిరి పాంచాలి,కొడుకు లందఱు జముకడకుఁ జనిరి
చేదిమాత్స్యప్రభద్రాదిబలంబులు, నిరవశేషంబుగా నేలఁ గలిసె
మాటలు పెక్కేల మానిసి గుఱ్ఱ మే,నుం గనుపేరెల్లఁ ద్రుంగెఁ బాండు
భూవరనందను లేవురుఁ గృష్ణుఁడు, సాత్యకియును [1]నెందుఁ జనిరొ కాని
తే. తండ్రియును నేలినాతఁడు దైన్యపడిన, దాని కరులపై వచ్చి యీశానువరము
గాంచి మీరలు పెనుఁబ్రాపుగాఁగ వీడు,దఱియుటకు నెంతదగునంత పఱుపఁగంటి.
వ. అని చెప్పిన వినుచు మున్ను రాక్షసావేశంబునం జేసి నీచపరాక్రమంబు లాచ
రించి తదనంతరంబ తెలిసి యారథికవరులు నగం బొగులుచున్నవారు గావున
నగ్గురునందను నగ్గింపం దలంపక యూరకుండి తమమనోవికృతి యతం డెఱుం
గక మున్న తలలు వంచుకొని తగుతెఱంగున నొగడిన నతండు. 204
తే. పాండుతనయులు నాచేతఁ బట్టువడుట, తెగుటగలిగిన ననుఁ గొంత పొగడఁదగును
జలముమై రిత్తవాండ్రను జంపు టరయ, మీరు గొనియాడునంతటి పౌరుషంబె.
వ. అనిన విని వారలు ధృష్టద్యుమ్నప్రముఖపాంచాలురను బ్రతివింధ్యాదిద్రౌపదే
యులను బేరుకొని వారివారిబలంబులను మాత్స్యసీకప్రభృతిసైన్యంబులను
నొక్కరూపేనియుఁ దిక్కకుండ నొక్కరుండవ రెండుజాములలో నేలం గలిపితి
కరం బచ్చెరువు గాదె యని యతనిం గౌఁగిలించుకొని రనుటయు సంజయునకు
ధృతరాష్ట్రుం డి ట్లనియె. 206
క. కురుపతికి జయము గోరెడు, గురుపుత్త్రుఁడు మున్న యేలొకో యిటు తఱికిం
జొరక యెడమడిసినను మఱి, వెరపుం జేనయును జూప వేదుకనడియెన్.

1. క. నెందు సనిరొ. 2. గ. జొరయక మడిసినచో మఱి.

వ. అనిన యమ్మహీపతి కతం డి ట్లనియె. 208

ఉ. పాండునృపాలనందనుల బాహుబలంబున గోడి యాతఁ డు
ద్దండతఁ గుంది యుండి వసుధావరునూరులు నుగ్గు సేసి భీ
ముండు దదుత్తమాంగము సముద్ధతిఁ దన్నిన దాన శోకముం
జండతరప్రకోపము నసహ్యపువేదన సేయ నత్తఱిన్. 209

ఆ. గురునిచావు తెఱఁగు క్రొత్తయై మనమున, నావహిల్లుటయు మహాగ్రహమున
బాస యిచ్చి రాజుపనుపును బడసి యు,దగ్రవృత్తి నరిగి యట్లు సేసె. 210

ఉ. తా వెసఁ బోవునప్డు బలదర్పసమగ్రులు పాండుపుత్త్రుల
చ్చో వసియింపకున్కిఁ దన[1]చూచినకార్య మతం డొనర్చె దే
వావలి కైన నత్తెఱఁగునాక్రమలీలలు సెల్ల నేర్చునే
భూవర వార లున్న విధిపోకలఁ బోవుట గాక యంతయున్. 211

వ. అని చెప్పి విను మట్లు కృపకృతవర్మలచేత సంభావితుం డై కుంభసంభవసంభ
వుండు వారలతో మన మిఁక మనుజపతికడకుఁ దడయక పోవలయుఁ బుణ్యంబున
మనము వోవునంతకుం బ్రాణంబులు గలిగి యుండెనేని నిత్తెఱం గెఱింగింత మను
టయు వార లట్ల కాక యని యచ్చోటు గదలి యమ్మువ్వురును భూవల్లభసల్లాప
కుతూహలంబున రయంబునం జనుదెంచి. 212

అశ్వత్థామాదిరథికత్రయంబు దుర్యోధనుఁ గనుంగొనుట.

తే. రక్తసంసిక్తమైనధరాతలమున, నార్తిఁ బొరలుచు నూర్పు లందంద సంద
డింప జీవంబు వెడలనుంకింపఁ జేష్ట, లొయ్యనొయ్యన యుడుఁగంగ నున్నయధిపు.

మహాస్రగ్ధర. కని శోకం బాత్మలం దగ్గలముగ రథముల్ గ్రక్కునన్ డిగ్గి భూమిన్
ధనువుల్ వో వైచి బాష్పోద్గమము వొదువ వక్త్రంబులన్ విప్రలాపం
బును దైన్యం బావహిల్లం బొరలుచుఁ బొరి నాభూవిభున్ శాంతదృష్టిం
గనుఁగొంచుం జేరి కేలం గముపయి నిడుచుం గౌఁగిటం జేర్చికొంచున్. 214

చ. పురపురఁ బొక్కి యానృపతిపుంగవుచుట్టును నుండి యక్కటా
ధరణి సమస్తమున్ భవదుదారమహాజ్ఞకు లోను సేసి యి
ప్పురుసున నీవు దీనతకు భాజన మైతి విధాత కెందు దు
ష్కర మగుకార్యముం గలదె కౌరవనాయక మమ్మెఱుంగుదే. 215

క. అన నప్పలుకులు వెడవెడ, విని భూవిభుఁ డల్లఁ గన్ను విచ్చిన వదనం
బునఁ జూడ్కి నిలిపి కలశజ,తనయుం డి ట్లనియె గద్గదగళుం డగుచున్. 216

చ. అమితబలంబు దర్పమును నద్భుత[2]ధీరతయున్ గదాపరి
శ్రమముఁ బొగడ్త కెక్కనినుఁ జక్క నెదుర్చుట గాక పోర రం
ధ్రము గని యొక్కఁ డుద్ధతి గదం బెగటార్చుట గల్గెనట్టె యిం

1. చ. తూరత నాతఁ డొనర్చెఁ గాక దే. 2. క. విక్రమమున్.

క మగల కెట్టివారలకుఁ గల్గ దపాయము దైవ మల్గినన్. 217

చ. దురమునఁ బెంపుఁ జేవయును దుర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచకవిశిష్టతలంబునఁ బోరి సద్గతిన్
బొరసెదు నీకు నై వగపు పుట్టదు బంధులు రాజు దేవులుం
దిరియుదు రింక వారి దగుదీనత కోర్వక యుమ్మలించెదన్. 218

ఉ. సీరి యనారతంబుఁ దనశిష్యులలోపల నెల్ల నిన్ను దు
ర్వారపరాక్రమాఢ్యుఁ డని వర్ణన సేయుట గేలి చేసి యా
మారుతికిన్ జయం బొసఁగె మాలవిధాత్రుఁడు వానిగెల్పుకో
లేరికి సమ్మతం బగునె యిట్టిది దీనను బెంపు గల్గునే. 219

చ. కురువర నీమగంటిమియుఁ గొ త్తలయున్ బలముం జలంబు దు
స్తరగతిఁ బేర్చి భీమునకుఁ జావక పోవఁగ రానియట్టి దై
నరు బెదరించి కేశవుమనంబు గలంచి యధర్మవృత్తికిం
జొరుఁ డని పంచె దీని దివిజుల్ గని రిం కిట వేయు నేటికిన్. 220

ఉ. ధర్మము మాని యూరులు గదం బొడి సేసినయంతఁ బోక దు
ష్కర్ముఁడు వాయుజుం డెడమకాల శిరం బటు దన్నెఁ జూచి యా
ధర్మసుతుండు శాస్తిఁ దగ దానికిఁ జేయఁడ యాతఁ [1]డెప్డు నర
తర్మదదుష్టుఁ డీగెలుపు దైన్యము సేయదె కీర్తి మాయదే. 221

క. కౌరవనాయక నీదుగ,దారణగౌరవము సకలధరణీజనచే
తోరంజన మై నిర్మల,సారయశోధనము నీకు సంపాదించెన్. 222

వ. అని పలికి తనమానుషంబు తెఱం గూహించి. 223

చ. కుడువఁగఁ గట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్ట జన్నము
ల్నడుప ననేకధర్మవిధులం బొగ డొందఁగఁ జాలునట్టియె
క్కుడుసిరి యిచ్చి పేర్మి నొకకొండగ మన్చిననీవు సావఁగా
నొడ లిటు లోమితిం గురుకులోత్తమ యే నొకసేవకుండనే. 224

వ. అని తన్నుఁ దాన నిందించుకొనుచు మఱియు. 225

ఉ. న్యాయము దప్పకుండఁగ రణం బొనరించి దివంబు గైకొనం
బోమెద వందు రాఁ దగినపుణ్యము సేయుట లేదు గాని మా
చేయు మనంబునుం దనియఁ జెండఁగఁబడ్డవిరోధివర్గమున్
నీయెడ కిం పొనర్పఁగ గణింపఁగ భాగ్యము గల్గె భూవరా. 226

ఆ. పుణ్యలోకమునకుఁ బోయినయప్పుడు, ద్రోణుఁ గాంచి నీకు ద్రోహి యైన
జనవినింద్యచరితుఁ జంపె ధృష్టద్యుమ్ను, ననఘునీతనూజుఁ డనుము తొలుత.

వ. అని నామాఱుగా నమస్కరించి కౌఁగిలించికొనుము మఱియు వలయుసల్లాపం

---

1. గ. డెప్పడున్ ధర్మతురుష్కుఁ డీగెలుపు.

బులు సేయుము బాహ్లికసోమదత్తభూరిశ్రవస్సైంధవప్రముఖభవదీయబాంధవ
జనంబులతో నాచేసినకుశలప్రశ్నంబుగా సంభాషింపు మది యట్లుండె రేయింటి
తెఱం గెఱింగించెద. 228

సీ. అమృతంబు నింపు కర్ణములకు నొసఁగెడు, మాట లాకర్ణింపు మనుజనాథ
శాత్రవశిబిరంబు సౌప్తికవేళఁ బ్రవేశించి నీచుఁ గిల్బిషమయాత్ముఁ
దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచితిఁ బశుమరణంబుగాఁ దదనంతరంబ కవిసి
వానిబంధుల నెల్ల వరుస గీటడఁగించి, ద్రౌపదీసుతుల నందఱను బొదివి
తే. మిడుకమిడుకంగఁ జంపియప్పుడమి యెల్లఁ, దునియ పెంటగఁగరివాజిమనుజతతుల
నెల్ల నఱికితిఁ బాండవు లేవురును ముఱారియును సాత్యకియును నా బారిఁ బడరు.

వ. అని చెప్పి. 230

ఉ. ఏ మటు వోక శౌరి మది నేర్పడ మఱు గని డాఁగురించెనో
యేమిటి కింపుఁ బోయిరో నరేంద్ర యెఱుంగను ధర్మదూష్యసం
గ్రామవిధంబులం జయముఁ గల్గియు వారికి దక్క దయ్యె వా
రే మయి రేమి మా కెలస మెక్కె నెఱుంగుము మమ్ము మువ్వురన్. 231

వ. అని కలిసికొని పలికి కృపకృతవర్మలవలనుం జూపి. 232

క. వీరి పెనుఁ బ్రాపు వడసిన, గౌరవకులనాథ యేన కాదరయంగాఁ
జీరికిఁ బోవనివారును, వైరుల సమయంగఁ జేయ వలఁతుల కారే. 233

వ. అనిన నమ్మాటలు మనఃప్రియంబులై నాలుకకు లావిచ్చిన నాభూవరుం డమ్మహీ
సురవరున కిట్లనియె. 234

క. నీవును నీయోధవరులు, నావైరులఁ బఱిచినంత యాచార్యుండున్
దేవవ్రతుండుఁ బఱిచిరె, భావింపఁగ దుష్కరంపుఁబని యిది యనఘా. 235

ఆ. కర్ణు మనము పెద్దగాఁ గొనియాడుదు, మతనికంటె శల్యుఁ డధికుఁ డందు
ఱతఁడు నతఁడు నిట్టియాక్రమంబున నాకుఁ, బ్రియము సేయఁజాలి రే మహాత్మ

వ. అని యమ్మువ్వుర మొగంబులు గలయంగనుంగొని మీరు కృతకృత్యులరు సుఖుల
రై యుండుఁడు పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుఁగాక వగలు మాని పొం
డని పల్కి ప్రాణంబులు విడిచిన వారలవ్వసుమతీపతిఁ గౌఁగిలించుకొని వలగొని
వచ్చి మరలి చూచుచు నరదంబు లెక్కి యరిగి రంత నుదయగిరిశిఖరంబు
నకు ఖరకరుండు వచ్చె నేను నిత్తెఱంగు నీ కెఱింగింప వచ్చితి నాహవప్రకారం
బంతయు నీకు వినిపించుటకు నాఁడు మునీశ్వరుండు నన్నుఁ బనిచి యొసంగిన
దివ్యదర్శనత్వంబు నీకొడుకుతోడిద యయ్యె నని యిట్లు సంజయుండు ధృతరా
ష్ట్రునకు నశ్వత్థామాదిరథికత్రయవ్యాపారకథనపూర్వకంబుగా దుర్యోధను
లోకాంతరగమనంబు సెప్పె ననిన విని యటమీఁదఁ బాండునందను లెవ్వి
ధంబునం బ్రవర్తించి రని యడుగుటయు. 237

మహాస్రగ్ధర. పరమజ్ఞేయస్వభావా ! భవభయహరణప్రౌఢనామానుభావా
కరఖేలచ్చక్రశూలా ! కలుషహృదయసాంగత్యవైముఖ్యశీలా
కరుణాయత్తాంతరంగా ! కమలభవమనఃకంజసంవాసభృంగా
దురితధ్వాంతప్రదీపాతులనిరసనసంస్తుత్యనిర్వ్యాసనూపా. 238

క. పరిణామగమ్య నిగమా, [1]పరనిష్ఠాసంపదచలభావనరమ్యా
నిరుపమసౌందర్య తప,శ్చరణనిరతహృదయకమలసముదితసూర్యా. 239

మాలిని. [2]చరణయుగళకాంతిస్ఫారలీలానిరూఢా
దరసుఖమయయుక్తా ! ధర్మశీలానురక్తా
సురసముదయరక్షా ! సువ్రతాసంగహేలా
కరమహిమకటాక్షా ! గాఢసర్వానుపేక్షా. 240

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున సౌప్తికపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 241



1. క. పరినిష్ఠా... భావన; చ. పరిపాకసుసంపదలసభావన.

2. గ. స్మరణశమితపాపా ! స్ఫారలీలానురూపా
పరసుఖమయభక్తా ! భక్తిశీలానురక్తా
సురసముదయరక్షా ! సుప్రసాదానుశిక్షా
సరసశుభకటాక్షా ! చారునిర్వాణదక్షా.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## సౌప్తికపర్వము, ద్వితీయాశ్వాసము.



శాశ్వతతత్త్వకరణక
లాశాలిదయాదినిర్మలజ్ఞానమయా
నాశోత్పత్తిరహిత [1]శు
ద్ధాశయసంభజనమహిత హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు సూర్యోదయం బైనయా సమయంబున సమీరనందనాదిసోదరులును శౌరిసాత్యకులుం బరివేష్టింప నున్న ధర్మతనయుపాలికిఁ బఱతెంచి ధృష్టద్యుమ్నునిసారథి సాష్టాంగదండప్రణామంబు సేసి కరకమలంబులు మొగిడ్చి. 2

సీ. నరవర మనవీడు నడిరేయి కృతవర్మ, యును గృపాచార్యుండుఁ దనకుఁ దోడు
గా వచ్చి జనులు నిద్రావివశాత్ములై, యుండ నశ్వత్థామ యొకఁడు సొచ్చి
తొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తత్సోదర,తనయాదిపాంచాలతతుల మట్టి
యన్యాయవిధిని నిరోధ్యం బైనవిక్రమ,లీలాతిశయమున నేలఁ గలపి
ఆ. చేదిబలము నెల్లఁ జెండి మాత్స్యప్రభ,ద్రకులు మేలుకాంచి ద్రౌపదేయు
లను శిఖండిఁ గూర్చికొని తన్నుఁ దాఁకిన, బెట్టు చంపె నంతవట్టువారి. 3

వ. మఱియును. 4

స్రగ్ధర. పీ డెల్లం దల్లడిల్లన్ వివిధగతులమై విక్రమోల్లాస మొందం
గ్రీడాకల్పంబుగా నాకృతిఁ గని ప్రజ శంకించి దైత్యుం డనం జెం
డాడెన్ శీర్షవ్రజంబుల్ హరులగముల వేఁటాడె సేనుంగులం దా
న్నాడెం గాఢేయ హేలాభ్యసనలసితబాహాహార్గళాభీషణుం డై. 5

తే. అడవి దరమిడి నఱుకంగ నందుఁ గలవి
హంగమంబులు గలగొన నఱచు తెఱఁగు

1. క. శుద్ధాశనసంభూతమహిత.

ద్రోఁచె నాతఁడు యోధులఁ దునుమఁ గలఁగి
యన్యజనము లాక్రందించు నప్పు డధిప. 6

క. అఱచినఁ బఱచిన వ్రేళులు, గఱచిన నతఁ డించుకయును గరుణింపక యుం
దఱ నఱుము సేసె గుంపుల, కుఱికి యుఱికి ఖడ్గదారుణోల్లసనములన్. 7

వ. ఆసమయంబున. 8

మహాస్రగ్ధర. కృపుఁడుం హార్దిక్యుఁడు వాకిట నిలిచి భయాక్షిప్తయోధవ్రజంబుల్
నృపులుం వే నిర్గమింప న్వివిధశరముల న్మేదినిం గూల్చుచుం ఘో
రపుసంరంభంబు దుర్వారముగఁ గెరలి రౌద్రంబు రూపంబు దాల్పం
గుపితక్రవ్యాదులో నాఁ గుచరితనిరతిం గ్రూరతాధుర్యులై నన్. 9

వ. తత్ప్రదేశంబు నవ్వీటిలోనుంబోలెఁ బీనుంగుపెంట యయ్యె నట్లు శిబిరంబునం
గలకరితురగనరనికరంబులు నిశ్శేషత్వంబు నొందె నాయుశ్శేషంబు కతంబునం గృత
వర్మ చేతం బట్టువడి యతండు మందల విడువ నిట వచ్చితి నని చెప్పినం బాండ
వాగ్రజుండు. 10

తే. శోకవేగసంతప్తుఁడై సొలసి వ్రాల, సంభ్రమమ్మునఁ బట్టిరి సాత్యకియును
గవలు భీమసేనుండును గరతలముల, నుమ్మలికము నెమ్మనములఁ గ్రమ్ము దేర. 11

వ. కొండొకసేపునకు మూర్ఛ దేఱి యన్నరపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె. 12

ధర్మరాజు తనపుత్త్రు లశ్వత్థామచేఁ జచ్చుట విని పలవించుట.

సీ. ఎట్టివారల కైన నెఱుఁగంగ నగు నె కా, ర్యంబుల గతు లుపాయంబు బలుపు
వెలయంగ నట్లు శత్రుల బంధుమిత్త్రపు, త్త్రామాత్యయుతముగ నాహవమున
సందఱ నేఁ దెగటార్చినవాఁడ నై, విజయంబు సేకొని విభవ మెసఁగ
నిట యేఁగుదెంచితి నట బంధుమిత్త్రపు, త్త్రామాత్యయుతముగ నస్మదీయ
తే. బలము నెల్లను ముట్టి శత్రులు నితాంత, ఘోరముగఁ దెగటార్చిరి కుత్సితంపు
విధము వాటిల్లె నస్థిరవిజయమునఁ బ, రాజయమ యాడు నింక ధరాజనంబు. 13

స్రగ్ధర. బాణజ్వాలానితాంతప్రసరణముల శుంభద్విపత్సాంద్రసైన్య
శ్రేణీకాంతారముల్ చూర్ణితమును గఁ బటుక్రీడమైఁ దేజరిల్లెం
ద్రోణాచార్యాగ్ని వేఁడిం దొడరక మెఱసెం దోర్విలాసంబు వైరుల్
ప్రాణంబుల్ [1]నాఁచికోల్ దప్పదు తుది విధి యబ్బాలురం ద్రెళ్లవైచెన్. 41

మహాస్రగ్ధర. శరదంష్ట్రాభీషణం బై చటులరిపుమృగస్వైరవిధ్వంసలీలా
స్ఫురణం శోభిల్లు రాధాసుతుఁ డను పులి విస్ఫూర్జితంబుం సహింపం
వెరవుం దర్పంబుఁ గల్గెం వికలరిపులచే వీటిఁబోయెం గుమారో
త్కర మింకే మందు నాపత్పరికలన ప్రమాదంబునం గాక యున్నే. 15

స్రగ్ధర. శాతాస్త్రస్ఫారవీచీసముదయరభసాశ్చర్యసంపాదిహేలా

1. క. దోఁచికోల్; గ. దాఁచికోల్.

స్ఫీతం బై క్రమ్ముదేరన్ బెదరక కలఁచెన్ భీష్మవారాశిఁ దుశ్చా
రాతివ్యాపారదుర్వారరతఁ దెగిమెఁ గుమారవ్రజం బక్కటా ని
ద్రాతంద్రావ్యాప్తి నక్రూరరతఁ బొలసి భుజాప్రౌఢి వమ్మయ్యెఁ జుమ్మీ. 16

ఆ. అధికబలము గెల్చి యవనీపతులు గొంద, అతివిహీనరిపులయాక్రమమున
మడిసి రకట జలధి వెడలి సన్నపుఁగ్రయ్య, మునిఁగి రూపడంగు జనులనూడ్కి.

చ. జనకుఁడు లేమికిం గడువిషాదము నొందెడికృష్ణ యిమ్మెయిం
దనయులు భ్రాతలుం దెగుటయు దా విని మూర్ఛ మునుంగు నెమ్మనం
బును నవశంపుమేను నయి భూస్థలిఁ ద్రెళ్లకయున్నె తేజనే
నిని బటుశోకవేగమున నిర్భరవేదనఁ జెంద కుండునే. 18

క. మున్నిట్టి తెఱఁగుశోకం, బెన్నఁడు దా ననుభవించి యెఱుఁగ దకట నేఁ
డన్నెలఁత యలఁతపెల్లున, నెన్నియవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో. 19

వ. అని వగలం బొగిలి పాంచాలి రావింపం దలంచి తనపనుపున నవ్వేలంది ద్రుపద
విరాటులు చచ్చినమఱునాఁడు తదీయపత్నులకు శోకాపనోదంబు సేయుటకై సుభ
ద్రయు నుత్తరయును దో నరుగ విడిదలనుండి విరాటుపురంబున కరిగి ద్రుపదుం
డును గొడుకులు నవ్వీటికి వచ్చునాఁడు దోడన వచ్చి కోడండ్రును దానును నంద
యున్నయాద్రుపదుపత్నిం గాంచి పడంపడి సుభద్ర యర్జుననుమతి వడసి
ద్వారవతికిం బోవ నమ్మత్స్యపురంబున నునికిం జేసి యన్నరనాథుండు నకులుం గ
నుంగొని యతిత్వరితగమనంబునకుం దగురథంబునం జటులంబులైనరథ్యంబులం
బూన్చికొని యుపప్లావ్యంబునకుం జని ద్రుపదనందనను దక్కనుమనవెసం గలుగు
నంగనలను ద్రుపదమత్స్యపతిపక్షంబుభామలను దోడ్కొని యవ్విడిదలకుం జను
దెమ్మని చెప్పి యేము నయ్యెడకుం జనుదెంచెద మనుటయు నతండు తదుక్తప్ర
కారంబునం జనియె నజ్జనవల్లభుండు తక్కటితెమ్ములును దామోదరసాత్యకులును
నడలుచుఁ దన్నుం బొదివికొని చనఁ గౌరవశిబిరంబునం గలజనంబులు గొల్చి
పోవ నేడ్చుచు నిజశిబిరంబునకుం బోయి తత్ప్రదేశంబున. 20

మహాస్రగ్ధర. స్ఫురదశ్వత్థామచంచద్భుజాసదసివిస్ఫూర్జితక్రూరగధారా
పరికృత్తావ్యక్తగాత్రప్రకరుల సఖులన్ బంధులం బుత్త్రులం దాఁ
గరుణం బుష్పాంగనార్తిం గనుఁగొని వికలాంగత్వముం బొందె మూర్ఛా
పరతంత్రుం డై ధరిత్రిం బడినఁ బడిరి తద్భ్రాతలుం గేశవుండుం. 21

వ. ఇట్లు పడి సాత్యకిప్రయత్నంబున నందఱుం దెలిసిరి ధర్మనందనుండు వెడవెడ
దెలిసియు మగుడ నిగుడునడలున మనంబు మునుంగ వెగ డొంది నందనులతను
వులమీఁద నదనంబు బాష్పాంబుధారాక్రాంతంబుగాఁ బ్రకటాక్రందనంబు సేయు
చుఁ బలవించుచుండె గృష్ణార్జునులు సముచితభాషణంబుల బోధించిరి తక్కటి
వారును దగుమాటల నుపచరించిరి కొండొకసేపునకు నవ్విభుండు మోదనంబుదక్కి.

పుత్త్రశోకార్తుఁడగునప్పాండురాజపుత్త్రుండు పుత్త్రశోకార్తిం బొగులువిచిత్రవీర్య
పుత్త్రుకడకుం జని తత్పార్శ్వవర్తులచేత నావేదితుం డగుచు నాభూవల్లభుపాదం
బులకుం బ్రణతుం డగుటయు. 124

శుద్ధవిరాటివృత్తము. ఉల్లం బప్రియ మొందఁ గ్రొత్త సం
ధిల్లన్ నెవ్వగ దీనవక్త్రుఁడై
యొల్లంబోవుచు నున్నె నవ్విభుం
డల్లం గౌఁగిట నానృపాలకున్. 125

వ. ఇవ్విధంబున నాలింగనంబుసేసి సాంత్వవచనంబుల నుపచరించె దదనంతరంబ
భీమార్జుననకులసహదేవులు సేరిన నతనియొద్దివారు వారిం బేరువేర నెఱిం
గించిన. 126

తే. భీముఁ డనుమాట విని యతిభీమ మైన
యలుక యనువహ్ని యవ్వీరుఁ డనువనంబు
దరికొనంగ నుంకింప నధర్మవిధికి
నాయితం బగునయ్యాంబికేయుఁ జూచి. 127

క. మన సెఱిఁగి హృషీకేశుఁడు, దనమనమున నిద్దురాత్ముతలఁ పొప్ప దిసీ
యనుచుం బవసజు నద్దెసఁ, జన కుండఁగఁ బట్టి భీతసంభ్రమలీలన్. 128

వ. ధృతరాష్ట్రుిం డిట్టివాఁడు గాఁగలవాఁ డని తొల్లి యెఱింగి త్రికాలవేది యైన
కృష్ణుం డయోమయంబుగా భీమప్రతిరూపంబు సేయించి సంగ్రహించి నిగూఢ
ప్రకారంబునం దత్ప్రదేశంబునకుఁ దెప్పించినవాఁడు గావున గ్రక్కున నయ్యె
నుపరూపజ్జగతీశ్వరుం జేర నిలిపె నిలిపిన నది భీమసేనుఁడ కాఁ దలంచి. 129

క. కోపం బుత్కటమై యాప్రరూపము నిరుగేలఁ బట్టి [1]రూఢత ఘోరా
టోపం బెసక మెసఁగ నా,భూపతి వెసఁ గౌఁగిలించి పొలుపఱ విఱిచెన్.

లయవిభాతి. పెరుఁగఁగ నిజాంగములు సరభసపరిస్ఫురణ
మరుదుగ జనావలులు నిరుపమవిధం బ
న్నరపతిబలం బనఁగఁ గరయుగముతో లవియ
నురము సదియం బెలుచఁ దొరఁగఁగఁ బొరిన్ నె
త్తురులు ముఖరంధ్రములఁ బరవశత మానసము
పొరయుటకుఁ జొచ్చియును సరి గొనఁగఁ గంటిన్
వరసుతున కిప్పు డనుపరమపదవిన్ మగుడఁ
గురునృపతి యాప్రతిమఁ బొరి నిటులు పుచ్చెన్. 131

వ. ఇత్తెఱంగున దశసహస్రసామజసమానబలుం డగునయ్యంధనృపతి గంధవహ
నందనప్రతిరూపంబు భగ్నంబు సేసి పెంపున నెడఁద నిర్భరహర్షంబు నొందియు

1. ప్రూఢత.

మెఱమెచ్చునకై భీమునిం బేర్కొని హాహాకారంబు లెసంగ రోదనంబు సేసిన
జిఱునవ్వునం దనవదనకమలం బొప్పం గమలనాభుం డతని కిట్లనియె. 132

తే. అడల నేటికి నీచేతఁ గబడఁడు భీముఁ, డిపుడు భంజింపఁబడినది గ యినుపరూపు
వినుము నీకోప మెఱిఁగియ గ వెనుక కతని, దిగిచి యేను నీముందట గ దీని నిడితి.

క. బలమున నీతో [1]దారయఁగ, నిల నెవ్వఁడు గలఁడు నీమగహితభుజశాఖల్
తలఁపఁగఁ బ్రళయాంతకుడం, ష్ట్రిలు వీనిం దగిలి వశమె గ చాకుండంగన్. 134

135

వ. కావున.

ఉపేంద్రవజ్రావృత్తము. మరుత్తనూజుం బొరిగమాల్పఁ జూచుం
బరిస్ఫురత్కోపనిగబద్ధుఁ డై యి
గ్ధరావిభుం డం చిది గ తల్గనే సం
స్మరించి [2]యిూరోపు నగమర్చికొంటిన్. 136

తే. తనయశోకాతురుండనై గ ధర్మమెడలి, యనిలసుతుఁ దెగటార్చెద గ ననితలంచి
తట్టిపని నీదుచే నేల గ యగు విధాత్ర, లీలఁ బరికింప నేరక గ బేల వైతి. 137

138

వ. అదియునుం గాక.

క. విను మొకని నేల భవదను, జునిపుత్త్రుల నెల్లఁ జంపఁ గ జొప్పడినను నీ
తనయులు మగుడఁగ వత్తురె, యనయము పాపంబు సేసి గ తాఁబడిఁ బోవన్. 139

స్రగ్విణీవృత్తము. ఏము నీపుత్త్రుచే గ నెన్నియేఁ భంగులన్
వేమఱుం బాటు నీగవెంట భావించుచున్
సామసంపాదినై గ సైఁపు మాతప్పులన్
భీమహత్త్వంబు సంగధిల్లు నీకిమ్మెయిన్. 140

వ. అని చెప్పె నప్పుడు ధృతరాష్ట్రపరిచారకు లతనియవయవంబులరుధిరంబు ప్రక్షా
ళనంబున నపనయింపం దలంచి జలంబులు దెచ్చి యెఱింగించిన నజ్జనపతి యప్పని
యాచరించె నప్పుండరీకాక్షుండు వెండియు నవ్విభున కిట్లనియె. 141

సీ. జగతీశ వేదముల్ గ సదివితి శాస్త్రముల్, వింటి వర్తిల్లితి గ వృద్ధగోష్ఠి
నఖలపురాణపర్యాలోచనము సేసి, తెల్లధర్మంబులు గ నెఱుఁగు దిట్లు
నీతప్పు దలఁపక గ నెవ్వగఁ బొందెదు, కన లెడ వేను శంతనుసుతుండు
గురుఁడునువిదురుండుఁ గ గూర్కొని కూర్కొని, చెవులఁ బోయ మె సవిశేషకార్య

తే. వచనములు సంజయుఁడు పెక్కు గ వరుస లుభయ
బలువిధంబులు దెలియఁగఁ గ బలుకఁ డెట్ల
నీకు నాబుద్ధు లన్నియు గ నెమ్మనమునఁ
జేర్పఁ బోలవ యింకేమి గ సేయ వచ్చు. 142

క. భీమార్జునులరణసము, దామత్వం బెఱిఁగి యెఱిఁగి గ తగునే తొడరం

1. దొరయఁగ. 2. యిూరూపు.

గా మనుజుల కవ్వీరుల, నే మనఁ గల దింక నేల౯ యాచందంబుల్. 143

క. తన మేలుఁ గీడుఁ దా మదిఁ, గనుచు హితులు సెప్పుబుద్ధి౯ గైకొని శుభముం
గొనకొని నడపుపతికి వచ్చునె పశ్చాత్తాప మెట్టి౯చోట నరేంద్రా. 144

ప్రణవవృత్తము. నీయుల్లం బొక౯నియతిం గార్యం
బాయత్తంబుగ౯ ననుసంధింపం
జేయం జాలవు౯ చెడు తెర్వుం బోఁ
బాయం ద్రోవవు౯ బలిమిం బుత్త్రున్. 145

తే. ద్యూతమున [1]గెల్వు నెపమున౯ నుఱికి పుణ్య
కాంతఁ దల వట్టికొని సభా౯భ్యంతరమున
కీడ్చి వలువ లొలుచుటయు౯ నెఱిఁగి సుతులఁ
జంపె నని భీముఁ జంపఁ ద౯లంప నగునె. 146

వ. నీయవినీతియుం గొడుకులదుశ్చరిత్రంబునుం దలంచి శోకరోషంబులు విడిచి
శాంతుండ వై యుండు మనిన నుపేంద్రునకు నన్నరేంద్రుం డి ట్లనియె. 147

జలధరవృత్తము. నీపలు కెల్ల నిక్కమ య౯నింద్యగుణా
యీపురుషార్థహాని సుతు౯ లీల్గుటకుం
దాపముఁ బొంది తాల్మి దిగఁ౯ద్రావి మహా
కోపుఁడ నైనఁ [1]బాటిలెఁ ద౯గుం గినియన్. 148

క. తెలిసితి నీమాటలఁ బుత్త్రులదెస నెవ్వగల నెల్లఁ౯ దొఱఁగి యనుజపు
త్త్రుల నాకుఁ బ్రియ మొనర్పం, గలవారుగ నడచువాఁడ౯ గంసారాతీ. 149

వ. అనుటయు నమ్మహాత్ముండు భీమార్జుననకులసహదేవులం గానిపించినఁ గ్రమం
బున నమ్మానవపతి వారలం గౌఁగిలించుకొని దీవించె నప్పు డాశ్రితవత్సలుం
డగుశ్రీవత్సలాంఛనుండు యుయుత్సునకుఁ దదీయసందర్శనంబు సముచితప్ర
కారంబున నడపె నట్లు గాంచినవణిక్కన్యాజాతు నెడఁ బొడమినవాత్సల్యం
బున వైచిత్రవీర్యుం డతనిఁ దిగిచికొని యక్కునం జేర్చికొనియెఁ దదనం
తరంబ యద్ధరణీవిభుండు ధర్మపుత్త్రప్రభృతు లగునయ్యేవుర నుద్దేశించి మీరు
గాంధారిం గనుం డని పంచిన నప్పాండవేయులు పద్మనాభపురస్సరంబు
గాఁ జని వినయంబున వినతు లైన నద్దేవి దీవింప నొల్లక యుల్లంబు నిజత
నూజులమరణంబునకుం దాపంబు నొంద శాపం బిచ్చునది యై యజాతశత్త్రు
నుద్దేశించిన నత్తెఱఁగు సకలప్రాణిచిత్తవృత్తంబులు దనదివ్యబోధంబునం దేట
పడం గనియెడువాఁడును మనోజవుండును సర్వలోకసంపూజ్యుండును నగుసత్య
వతీసూనుం డెఱింగి తత్క్షణంబ సన్నిహితుం డయ్యె నఖిలజనంబు లభివందనంబు
సేయం గైకొనుచు నక్కోడలిం జేరి యోహో శపింపకు శమింపు మని

1. గెల్పు నేపున.

పలికి మఱియు నిట్లనియె. 150

ధర్మజు శపింపఁ బూనినగాంధారిని వ్యాసుఁ డూఱార్చుట.

సీ. పాండవేయాగ్రజుపైఁ నల్క మానుము, రాజసం బేల యీ | రాజు ధర్మ
పరుడు నీ వించుక | పాటించి వినవమ్మ, చెప్పెదఁ గౌరవ | శ్రేష్ఠుఁ డనికిఁ
జనుచుండి తల్లి దీ | వన యిమ్ము జయముగా, నా కని పలికిన | నాకుమారు
తోడ నీపేర్మి కి | నీడుగాఁ గొడుక య[1]క్కడ నుండు ధర్మ మ | క్కడకు జయము
ఆ. సేరు ననవె భూరి | ఘోరయుద్ధంబున, గెలుపు గొనిరి గాన | తలఁప ధర్మ
పరుల కాఁగవలయుఁ | బాండుతనూజు లన్యాయ లేనిబుద్ధిఁ | జూడు మెట్లు.

మేదినీవృత్తము. వినుమిటు లేటికిం జనని | వృత్త మూఁది యల్గక
జనము నుతించు నీదుగురు | సారధీరబుద్ధిక
నిను నతిశాంతచిత్తయని | నిక్క మేనుఁ గందుక
మనమున నిట్టినీ కగునె | మత్సరంబు వత్సా. 152

వ. ధర్మంబు పరిగ్రహించి నీకొడుకు లగుపాండవులదెస రోషంబు నిగ్రహింపు మనిన గంధవతీనందనునకు గాంధారరాజనందన యిట్లనియె. 153

సీ. ఏ నసూయాగ్రస్తఁ | గాను వీరలఁ జెడఁ, దలఁతునె యెట్టు లు | మ్మలికఁ జేసి
కలఁగితిఁ గాక యి | క్కౌంతేయవర్గంబు, గొంతి కె ట్లట్ల నా | కును భరింప
వలదె దుర్యోధను | తులువతనంబున, శకునియుఁ గర్ణదు | శ్శాసనులును
దుష్టాత్ము లగుటను | ద్రుంగెఁ గౌరవకుల, మడరి పాండవులు గ | య్యంబు పాడిఁ
తే. జంపి రందఱ నదిమది | నొంపఁజాల, దచ్యుతుఁడు సూడఁ గురుపతి | ననిలసుతుఁడు
దగునె గదపోర నాభికి | దిగువ నొంచి, చంప నత్తెఱఁ గుల్లంబు | నొంపకున్నె.
క. విడుతురె శూరులు రణమునఁ, బడునట్టియవస్థ తమకుఁ | బాటిల్లిననుం
బుడమి సమస్తజనంబులు, నడపెడు తెఱఁ గలుక తప్పు | నకు రాకున్నే. 155

వ. అనిన భీముండు భీతికంపితుండగుచు గాంధారికి వినతుండై వినయంబున నిట్లనియె.

భీముఁడు గాంధారికిఁ గోపోపశమంబుగా నుత్తరం బిచ్చుట.

సీ. తలపోసి చూడంగ | ధర్మమయ్యె నధర్మ, మయ్యె నేఁ బ్రాణభ | యంబుకతన
నట్లు సేసితిఁ గృప | యార సైరింపుము, నీదుపుత్త్రుఁడు లావు | నేర్పుఁ గలఁడు
గావున [2]నమ్మెయిఁ | గాని యోర్వంగ రా, దది యట్టు లుండె ధ | ర్మాత్మజునకుఁ
బాడితో వచ్చెనే | పరిభవం బతనిచే, ద్రౌపది యేకవ | స్త్రయు రజస్వ
ఆ. లయునుగాదె యపుడు | దయమాలి కొలువున, కీడ్చి తేరఁ బంచి | యేమి యనియె
నతఁడు వినవె యూరు | లప్పుణ్యకాంతకుఁ, జూపు టెఱుఁగవే వి | శుద్ధచరిత.

వ. తత్కాలోద్దీపితం బైనకోపంబున నెసంగుమనస్సంతాపంబు దాల్మి దహించినఁ దదూరుభంగంబు గదాదండంబునం జేయం గలవాఁడ నని యప్పేరో

---

1. నెక్కడఁ గలుగును ధర్మ మక్కడకు. 2. నమ్మేన.

లగంబునఁ బ్రతిన వట్టితి నుత్తమక్షత్త్రధర్మజ్ఞులు ప్రతిజ్ఞాహాని నిందింతురు గాన పూనిక నెఱపితి విను మాసభలో నప్పుడ తొడలు పొడిసేసి యతనిం దెగఁ జూడఁ దగియుండ నజాతశత్త్రునాజ్ఞ మిగుల రామింజేసి యమ్మహాత్ముచేసిన సమయంబు దప్పింపక యవ్విధంబున విపినంబున కరిగి యనేకదుఃఖంబులం బడి మగిడి వచ్చి యజ్జనపతి సంధి గోరి శౌరిం గౌరవసభకుం బుత్తెంచుటకుం దగుమాట లాడునవసరంబున నేనును. 158

తే. అన్నదమ్ముల మై యుండి । యకట మనల
నోరులు దల లెత్తి చూడ నొం । ఙారులతోడఁ
బెనఁగ నేటికి [1]నీ సేల । పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట । పోల దొక్కొ. 159

వ. అని నీకొడుకునకుం జెప్పి పుత్తెంచితి దానను శాంతిం బొందక యద్దురాచారుండు చలంబున వైరంబుఁ బెనిచె నట్లగుట నవశ్యంబును ధర్మరాజునకు రాజ్యంబు సేకొనుటయు నాకుఁ బ్రతిజ్ఞ దీర్చుటయుం గర్తవ్యంబు లయ్యెం గావున నేమిభంగినైనం బగ దీర్పవలసె నీవును సువిచార వింతయు విచారింపు మనవుడుఁ నద్దేవి యతని కిట్లనియె. 160

క. ఆచావు సావఁ దగు నన్నీచునకుఁ వానివలన । నిక్కం బరయన్
నీచెప్పినయన్నియుఁ గల, వాచెద్దియుఁ దగవ నీకు । నది యట్లుండెన్. 161

తే. వైరి ననిఁ జంపుదురు గాక । వ్రచ్చి నెత్తు
రెత్తికొని క్రోలుక్రూరాత్ము । లెచట నైన
నెన్నఁ డేనియుఁ గలిగిరే । యీవు దక్క
నది వృకోదర వృకవిధ । మసురభంగి. 162

వ. అనవుడు ననిలపుత్త్రుండు సుబలరాజపుత్త్రి కిట్లనియె. 163

జలధరవృత్తము. ఆసభలోని కట్లు ద్రుప । దాత్మజఁ దా
[2]గాసిగ నీడ్చి వ ల్వొలువఁ । గాఁ గినుకం
జేసినబాసకై పెదవిఁ । జేర్చితి దు
శ్శాసనుశోణితం బిది ని । జం బరయన్. 164

వ. అదియునుం గాక విను మతని నేఁ బొదివినప్పుడు. 165

క్రౌంచపదవృ. కౌరవసేనావీరులు లావుం । గడిమియుఁ జలమును । గడఁకయు మెలర్పన్
దీగతిసొంపుం గ్రూరతపెంపుం । దెగువయు నెఱపఁగఁ । దెరలక వీఁకన్
బోరనఁ ద్రోవంగా రసభం బే । ఫును గలితనమును । బొలుపు వహింపన్
వారు భయంబుం గూరుటకుం గా । వలసెను రుధిరము । వదనము సేర్పన్. 166

వ. ఆరెండుపనులకై యట్లు దా్రివుట గా నటించితిం గాని. 167

---

1. నీ నేలఁ బెద్ద. 2. దొండు. 3. (బైసిగ యీడ్చి వల్వ లొలుచ్వం.

తే. అన్యజనములశోణిత మైనఁ ద్రావు, టధికపాతక మని విందు ననుజరక్త
మాన నే నంత వెట్టినే యంతపాప,కర్ముఁడనె తల్లి యంతనిష్కరుణమతినె. 169

వ. అనుటయు.

తే. అంధులకు నూఁతకోలగానకట యొకని, నైన నిలుపక నూర్వురనదయవృత్తి
మ్రింగి తం దెవ్వఁడేనియు మీకు నెగ్గు, లాచరింపనివాఁడు లేఁడయ్యె నయ్య.

క. ఒక్కరుని నీవు సంపక, తక్కిన నంతటనె ప్రతిన దప్పానె విభవం
బెక్కఁగ మీయన్న నతం, డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా. 171

వ. అని పలికి ధర్మనందనుదెస మనసు నిగుడం బుత్రపౌత్రవధసంపీడితస్వాంత యగునగ్గాంధారి క్రోధపరుషాక్షరంబుల నమ్మహారాజెచట నున్నవాఁ డనిన నాభూపతి భయకంపితగాత్రుం డగుచుం జేతులు మొగిచి సవినయంబుగా మెత్తనిమాటల నిదెవచ్చితి దేవీ యేను బాండవాగ్రజుండ ననుచుం జేరం బోయి.

క. నీపుత్త్రులఁ జంపించిన,పాపాత్మునిఁ గ్రూరచిత్తుఁ బరివాదార్హున్
శాపంబునఁ బొలియింపుము, భూపాలకవల్లభాభిపూజితచరణా. 173

క. ధరణిం గలరాజులకుం, బరివారమ్మునకుఁ జావు పాటిల్లుటకై
పరుషత గైకొన్నయుధి,ష్ఠిరు దారుణదండకలితుఁ జేయం దగదే. 174

మత్తకోకిల. జీవ మేటికి రాజ్య మేటికిఁ [1]జెల్లుఁ జుట్టుల బిడ్డలం
జావఁ జూచినయట్టిద్రోహికి సర్వభోగము లేటికిన్
నావుడున్ మఱుమాట లాడఁగ నాలు కాడక యుండి య
ద్దేవి యూర్పు నిగిడ్చె నుష్ణము దీర్ఘముం బరుషంబుగన్. 175

వ. ఇట్లు ధృతరాష్ట్రమహిషి యతనియుచితవచనంబులు విని యూరక యుండె నతం డంజలిపుటంబు ఫాలంబున మోపి యానతుం డయ్యెఁ బట్టావృతనయన యగు నప్పతివ్రతదృష్టి పట్టంబునంచుసందునం జని యజ్జనపతిపదనఖంబులం జెందిన నవి గందినం జూచి సవ్యసాచి జనార్దను వెనుకకుం జనియె సమీరసుతుండును మాద్రీసుతులుం దిరుగుడువడి రప్పుడు గాంధారరాజనందన క్రోధంబు దక్కి ధర్మపుత్త్రాదులదెస మాతృభావం బలవడ సాంత్వనస్వరంబునం గుంతీసందర్శనంబు సేయరన్నా యని పలికిన నప్పురుషసత్తములు చిత్తంబులకలంక డిందువడ నందఱు నొక్కటఁ గుంతి యున్నదెసకుఁ జన నక్కుంతిభోజనందన వారిం గలయం గనుంగొని. 176

పాండవులు కుంతీదేవికడకు గాంధారిపంపునం బోవుట.

అంబురుహవృత్తము. పెద్దయుఁగాలము వారలఁజూడఁగఁ బ్రేముడించుచు దుర్భరా
పద్దశ [2]నొందుట సమ్మహితాత్ములపట్టు లందఱుఁ ద్రుంగుటం
దద్దయు శోకమునం బొరి నశ్రులధార లొల్క వగర్పుతో

1. జెలులఁ. 2. నుండుట.

నద్దురవస్థ తెఱంగు గనుంగొని యంతకంటెను నార్తులై. 177

వ. చరణంబులు దొట్రిల్లం జని తచ్చరణంబులమీఁద వ్రాలి. 178

తే. ఏడ్వ నందఱపైఁ జేతులిడుచుఁ బిలుచు, నేడ్చి యద్దేవి వారల నెత్తి వేఱు
వేఱ మేనులు నివురుచు వివిధదారు,ణాస్త్రశస్త్రవ్రణప్రచయములు గాంచి.

క. అచ్చోటు లంటి చూచుచు, వెచ్చనియూర్పులు నిగుడ్చు వేఁగుచుఁ బొగులుం
గ్రుచ్చి కవుంగిటఁ జేర్చును, వచ్చితిరే నృపకుమారవరులార యనున్. 180

సీ. ఆసమయంబున నప్పాండుభూపాల,పత్నికి శోకాగ్ని ప్రజ్వరిల్లఁ
దత్సమీపమునకు ద్రౌపది విన్నని,మోముపైఁ గన్నీరు ముసుఁగు వడఁగఁ
బదముల నట దొట్రుపాటు వాటిల్లంగ, దైన్య మాకారంబు దాల్చినట్టి
తెఱఁగునఁ జనుదెంచి దేవి సౌభద్రాదు,లైనసీమనుమ లెం దరిగి రెంత

తే. యేనిఁ గాలంబు నినుఁ జూడ రిప్ప డిచటి, కేల రారంచు నడుగుల మ్రోల నేల
వ్రాలె వికలాంగియై తెంచిపైవ నెండ, దాఁకి [1]వందినతీఁగచందంబు దోఁప.

వ. ఇట్లు మేదినిం బడి రోదనంబు సేయునయ్యుగ్మలిమీఁద నొఱగి తానునుం బెద్ద
యెలుంగున నేడ్చి గుచ్చి యెత్తి యక్కునం జేర్చి యూరార్చి యత్తన్వియుం
దనయులుం దోడన చనుదేరఁ గుంతి గాంధారికడకుం జనియె నప్పుడు ద్రౌపది
యాధృతరాష్ట్రపత్నిపాదంబులకు మ్రొక్కి యడలున వెక్కుచున్న నద్దేవి య
మ్ముద్దియ నుద్దేశించి. 182

మత్తకోకిల. పుత్రి యిట్లగునమ్మ శోకముఁ బొంది కుందుచు నున్న నీ
గాత్ర మొండొకకీడు పాటిలి కందుఁ బాండుతనూభవుల్
పుత్రవర్గము చన్నచో నెద భూరితాపముఁ బొందుదుం
బాత్రహీనతఁ బడ్డగొంతికిఁ బాయ నేర్చునె నెవ్వగల్. 183

క. నిను నేని ట్టూరార్చెద, నను నీవూరార్ప వలదె నానీతెఱఁగుల్
విను మొక్కరూప మన కే, మనఁగలదు విధాత క్రూరుఁడై పలుపంగన్.

ప్రహరణకలితవృత్తము. ఇది యిటు లగు టక్లెఁగి పలికె నా
విదురుఁడు సభఁ గొవిదులు వొగడఁగా
నది వినియును నే నడఁపన దురితం
బొదవెఁ [2]గలఁక సే టొలయ కుడుగునే. 185

వ. ఇట్లనియెదం గాక నాచేతఁ బోవునే యెవ్వరు నేమి సేయుదురు కాలవశంబున
నవశ్యభావి యైనది యమ్మెు నుపశమింపు మని పలికె నని యిట్లు పాండవులు
ధృతరాష్ట్రుని గాంధారిని ననునయించిన తెఱం గెఱింగించిన నాథుంగి నుపశమిత
క్రోధ యైనగాంధారరాజనందన పదంపడి యెవ్విధంబున వర్తించె ధర్మతనయు

1. వ్రందిన. 2. నకట గలఁగ.

నసంలరవ_ర్తసం బెప్పాటఁ జెల్లె నని యడుగుటయును. 186

శిఖరిణీవృత్తము. తపస్స్వాధ్యాయాదిక్షపితమలచిత్తప్రకలితా
విపజ్జాలజ్వాలావిరమణసుధావృష్టిలలితా
జపాపుష్పశ్రీరచ్ఛవికిరణసంసద్ధుర్జనరా
సపర్యానిర్వాహ[1]ప్రచురకలనస్థైర్యమధురా. 187

క. సాత్యవతేయాదిమహా, మత్యవగమ్యప్రకారమధురవిలాసా
సత్యత్వానంతత్వని, రత్యయశుభసారమయసమగ్రవికాసా. 188

మాలిని. సదసదనభిషిక్తా సంభృతానందభక్తా
విదళితదురితాలీ విశ్వనిర్వాహశాలీ
మదనదసురభేదీ మానసానుప్రమోదీ
వదనజనితవిప్రా వైభవానందదీప్రా. 189

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబున స్త్రీపర్వంబునందుఁ బ్రథ
మాశ్వాసము. 190



1. స్తవనకలన.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## స్త్రీపర్వము, ద్వితీయాశ్వాసము.

---



మత్కీర్తిమదత్యభి
రామాకృతిసద్గుణాభిరతిమత్పుణ్యా
గ్రామాకృతి[1]మత్సంప
త్త్యామోదితభక్తలోక హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు పాంచాలి నూఱడం
బలికినయనంతరంబ పతివ్రతాశిరోమణియు మహాభాగయు సత్యవచనయు
నగునయ్యాంబికేయుభార్యకుం బారాశర్యమునీంద్రవరప్రదానంబునం బ్రాప్తం
బై తాత్కాలికం బయినదివ్యదృష్టివిభవంబున నిజవ్రతహాని లేని తెఱంగున
సంగరతలం బఖిలంబును నధికవిస్తారదూరప్రాప్తం బయ్యె నాలోకనగోచరం
బగుటయు. 2

మణిగణనికరము. గొడుగులపఱియలు గుఱుకులు గొనుటల్
పిడములతునియలు పెదరి యునికిఁ బెం
డడిగలుఁ బడగలు దఱచు మురియలై
పుడమిఁ గలయుటకుఁ బొగులు లోలయ మదిన్. 3

క. నుఱు మైనకాల్బలంబులు, నఱవఱ లయి యున్నయట్టియరదంబులుఁ బెం
డఱ చగుసూతాంగకములు, నొఱిగినరథ్యములగములు నుల్ల మలంపన్. 4

లయగ్రాహి. రాహుత్తులతుండములు మావఁతులనుగ్గుఁ దుర
గావలిశవంబులు గజావయవరాశీ
భావభయదస్థలులుఁ బ్రేవులును గండలును
బ్రోవు లయి పెన్మెదడుపై విరిసి రక్త
స్రావమునఁ బెల్లయినతేవమునఁ జూడఁ గడు
నేవ మగుపట్ల మృతభావగతు లయ్యెన్

---

1. నుత్సవవర్త్యామోదిత.

జీవములఁ బాయఁ రాఁగా ♦ నా వికచవక్త్రముల
తోఁ వఱలు రాజులు మనోవికృతి సేయన్. 5

లయగ్రాహి. హారరుచులుగా హృదయహారితరమూర్తు లగు
వారు హరినీలమణిభారవిలసత్కే-
యూరబహులాంశుచయచారుతర రేఖు లగు
వారు నవవజ్రరుచిరోరుఘృణిమత్కో-
టీరరమణీయు లగువారు గరుడాశ్మమయ
భూరికటకద్యుతివిహారపరిశోభా
స్ఫారు లగువారలును ♦ బోరఁ బడి నెత్తురులఁ
గూరుటఁ గరం బెడఁద ♦ కారటము సేయన్. 6

లయగ్రాహి. అమ్ములును విండ్లుఁ బరిఘమ్ములును దోమరచ
యమ్ములును గుంతనికరమ్ములుఁ గనత్ఖ
డ్గమ్ములు నహీనముసలమ్ములును జక్రనివ
హమ్ములును లోనగునసమ్మితమహోగ్రా
స్త్రమ్ములును గండలును ♦ నెమ్ములుఁ గపాలములు
సమ్మిళితరూపకలమ్ము లయి సంగ్రా
మ మ్మతులదారుణవిరోధ మ్మగుటఁ దెల్పు టధి
క మ్మగుకలంక హృదయమ్మున కొనర్పన్. 7

లయగ్రాహి. కుత్తుకలబంటి యగు నెత్తురులు దోయిళుల
నెత్తి చవి గ్రోలుచును ♦ జిత్తములు దృప్తిన్
జొత్తిలి నితాంతమదమత్తములుగాఁ జటుల
నృత్తములు సేయుచుఁ జలత్తనువికారో
ద్వృత్తపటుహాసముల ♦ రిత్త లగుదుర్వచన
వృత్తులను నొండొరుల ♦ నెత్తికొని మాంసం
బ త్తి తినుటన్ వికటవృత్తు లగురాక్షసుల
మొత్తము పరిక్షుభితచిత్తత యొనర్పన్. 8

సీ. ప్రేవులు గండలు ♦ పెటికి [1]పేటాడి యం,గదఁ గొని మెదళ్లు లొగల్చికొనుచు
రాగిలి రక్తంబు ♦ ద్రావుచు లోచన,గుళికల నాలిచి ప్రింగుచును నిండె
కాయలాడట మెయిఁ ♦ గబళించుచును గ్రొవ్వు,దెమలిచినమలుచు నెముకయూ
చవి గొని యానుచు జావక యున్నహ,ఫులు సచ్చుటకుఁగాఁ గఁ ♦ బెలుచఁ దన్ని

తే. కొనిన వెలిఁ బాయఁ బాఱుచుఁ ♦ జెనకి తొడరి
కాటు లాడుచు నున్నసృగాలములును

1. ~ట్లాడి.

గాకములు రాపులుఁగులును గ్రద్దలును వృ
కంబులును మానసము వికలంబు సేయ. 9

వ. అగ్గాంధారరాజనందన కలను గలయం గనుంగొనియెఁ దదవసరంబున సాత్యవతేయుండు కౌంతేయుల రావించి బంధుశవంబులకుఁ [1]గాలోచితాచారసహితంబుగా నగ్నిసంస్కారంబు సేయుం డని పనిచి యంతర్ధానంబు సేసె వారు ధృతరాష్ట్రుం బొదివికొని వాసుదేవపురస్సరు లయి యప్పనికిం జనుచుఁ గౌరవకాంతలఁ దత్ప్రదేశంబునకు నడపించిన నప్పడఁతులు పతులును సుతులును సోదరులును పౌత్త్రులును మిత్త్రులును గుణపంబు లై పడియున్నఁ జూచి చెయ్వేది మేదిని నొఱగువారును వావిడిచి యఱచువారును బురపురం బొక్కువారును బడి పొరలుచుఁ బొగులువారును వేనలులు వీడి వెన్నుల విరియం దిరుగువారును బలవించువారును బేర్కొని యగ్గించువారును మ్రాన్పడువారును మోములుం దలలును మోఁదుకొనువారును నై రప్పు డాదుర్యోధనజనని జనార్దనుం బేర్కొని చేరం బిలిచి పరమశోకార్త యగుచు నతని కిట్లనియె. 10

గాంధారి పొలికలను చూచి కృష్ణునితోఁ జెప్పి దుఃఖించుట.

సీ. చూడుము ధృతరాష్ట్రకోడండ్రఁ గన్నార, వీరె కన్నీరు పైఁ వెల్లిగొనఁగ
దీనతఁ బొందెడునాననంబుల విప్ర,లాపంబు లైనసల్లాపములను
నడలు చొండొరులకు నన్నలఁ దమ్ముల, రూపించి వేర్వేఱ చూపుటయును
బోరి మొగంబులుసూచి పురపురఁ బొక్కుచుఁ, దల లల్లఁదూలంగ నిలుచుటలును
తే. గలిగి [2]యలిగెడువారికన్నులకుఁ బండు, వగుచునున్నారు కాకులు నగలతనువు
లెక్కియున్నను చేష్టలు దక్కి కొంద, ఱడువఁ జేయాడకున్నవా రంబుజాక్ష.

మానిని. కూలియుఁ గాంతి యెఱుగుర్వఁగఁ దేజము గుందక వహ్నులు సస్ఫారశిఖా
జాల మడంగియుఁ జాయ వెలింగెడుచందము నొందిరి శల్యుఁడుఁ బాం
చాలుఁడుఁ గర్ణుఁడుఁ జాపగురుండును శాంతనవుండు నిజంబున కీ
బాలుఁడు వీరప్రభం గడచెం గుణభద్రునిఁ గంటె సుభద్రసుతున్. 12

ఆ. ప్రభువు లంతనంత రాజిల్ల నెడనెడ వీరయోధతతులు వెలుఁగుచుండ
గ్రహచయమునఁ దారకప్రకరంబునఁ, బొలుచుగగనతలముఁ బోలెఁ గలను.

సీ. అర్జునభీష్మ చాపాచార్యభీమక, ర్ణాదులమహితదివ్యాస్త్రవితతు
లాడిన నొండొకకీడు రా నేరమి, వీతవికార మై వీరయోధ
చారుశరీరసంచయ ముండఁగా దీనిఁ, గంకశివాగృధ్రకాకకులము
లాదిగాఁ గలుగుక్రవ్యాదముల్ పీఁకుచుఁ, గాడుట నెంగిలి యయ్యె నకట
తే. హంసతూలికాతల్పములందుఁ బొందు
భోగిజనములమృదుగాత్రములు ముకుంద

1. గాలోచితోపచారంబుగా. 2. యల్లెడ.

కంటెఁ బరుసనిధరణిభాగమునఁ గూలి
యున్నయవి సూచువారలయుల్ల ముడుక. 14

క. చెవిని సొగయించువీణా,రవమును గానంబు వేణురావము నిత్యో
త్సవముగ విను రాజులకడ, శివారుతము చెలఁగు చునికి చిత్త మలంచెన్. 15

తే. సారచందనహృద్యకస్తూరికాది, [1]లేపనాలిప్తి నుండెడుభూపవర్యు
లకట శోణితపంకదిగ్ధాంగు లగుటఁ, గనుట కోర్వరాదయ్యెడుఁ గమలనాభ.

క. వనితలు మేలపుమెయి మెలు,పునఁ దిగిచిన నొప్పుహారములు మొదలగు ప్ర
న్ననితొడవులు గ్రద్దలు దివి,య నరేంద్రులు గొంద ఱునికి యచ్యుత కంటే.

క. ప్రాణంబులు విడిచియును గృ,పాణాదులు విడువ కున్నభటు లారయ స
ప్రాణులపోలెం బ్రథన,క్షోణికిఁ దొడ వగుచు నున్కి చూడుము కృష్ణా. 18

క. సూరెలను వందిజను,లిం, పారఁగ నుతియింప నొప్పునట్టిమహీశుల్
నారీజనములు సుట్టుం, జేరి పనవుచుండ నునికి సేసె నలంతన్. 19

తే. కూరుమొన పెట్టినట్టులు గొంద ఱుజ్జ్వ
లాయుధములు గంకటములు నమర నున్నఁ
జూచి చావనివా రని చూడు చేర
నరుగ కున్నవి కంకగృధ్రాదు లనికి. 20

వ. ఇది యంతయు నీచేఁ, సాధితం బైన కార్యం బని పలికి వెండియు. 21

సీ. అట్టలకడ నుత్తమాంగముల్ గానక, యలమట నలుగడ లరయువారుఁ
దలలు చేతులఁ గొని తనువు లత్తలమునఁ,దఱచు పీనుఁగులలోఁ దడవువారు
శిరములు మేనులఁ జేర్చి భావించి ని,జాస్యముల్ ప్రేసికొం చఱచువారు
తునియలు పెక్కైనఁ బనివడి గూర్చి రూ,పులుగనుంగొని మూర్ఛమునుఁగువారు

తే. నైనకౌరవపాంచాలమానినీజ,నముల నచ్యుత చూడుము నాథజనక
పుత్రసోదరశవములపొంత కేఁగి, పెక్కుదురవస్థ లొందెద రక్కటకట. 22

తే. అవయవములు రూపఱఁగఁ గ్రవ్యాదభక్షి
తంబు లై యున్కిఁ గొన్నిశవంబు లుపిద
లెంత సూచియు నవి గొంద తెలియఁగఁజాల
రయ్యెదరు సూడు తమబంధు లగుటఁ గృష్ణ. 23

క. ఇట్టివి యెల్లను గనుఁగొను, కట్టెఁడితన మొందునట్లుగా నేమొకొ త్రో
ల్పుట్టువునం జేసితి నీ,చుట్టల నిటు సూడకుండఁ జొప్పడ దయ్యెన్. 24

క. అని పలుకునపుడు దుర్యో,ధనునికళేబరము దృగ్గతం బగుటయు న
వ్వనిత యిలఁ ద్రెళ్లె నటికిన,యనఁటిక్రియఁ మూర్ఛఁ జిత్త మవశం బైనన్.

గాంధారి దుర్యోధనుని కళేబరంబు చూచి పలవించుట.

వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొకసేపునకుం దెలిసి గాంధారి పరిచారక లూఁదికొని పోవ నప్పుత్త్రశవంబుకడకుఁ బోయి. 26

తరల. విపులవక్షముమీఁద నశ్రులు వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతికుంజర కౌరవేశ్వర నేల నిమ్మెయి నీయుదా
త్తపురశరీరముఁ బొందఁ బాడియె తల్లి వచ్చిన భక్తితో
నుపచరింపక లాతివై యిటు లూరకుండుట యుక్తమే. 27

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించుచు హాహాకారంబు లెసంగ రోదనంబు చేసి యాసుబలనందన తనసమీపంబునకుఁ జనుదెంచి యున్నయుపేంద్రున కి ట్లనియె. 28

మంగళమహాశ్రీవృత్తము.
ఈతఁడు రణంబునకు నెత్తి చనుచుండియును నెంతయును భక్తిఁ గని నాకుం
బ్రీతి యెసఁగం బలికి పేర్మి మొలయం బొగడి పెద్దయు వినీతినిరతుం డై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన విశిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల ననూన మగు నిద్ధజయ మాతలకు నెట్లయిన సిద్ధ మగు నంటిన్. 29

వ. ఇట్లన నేల యంటేని. 30

మానినీవృత్తము. జూదమునప్పుడు సర్వజనంబులు చూచి భయంపడి యిప్పని యి
మ్మేదిని సేనలకుం గురుకోటికి మృత్యువు గాని నిజం బలఁతిం
బో దని యాడరె యిమ్మెయి నా దగుబుద్ధికిఁ దోఁచినసత్యము దా
మోదర పాటిలదే కొడు కంచుఁ బ్రియోక్తులు వల్కినఁ బెంపు సెడున్. 31

వ. వినుము దీవనకుం జొరక మధ్యస్థపుమాట లాడుటయ కాదు మఱి నే నప్పు డతనితోడ. 32

తే. ఆహవంబునయందు నీవు వోహటించి, పోవ నడి వచ్చునడికంబెఁ జావు మేలు
శస్త్రజీవితఁ బరలోకసౌఖ్య మనుభ,వింపు మమరత్వసంపద వెలయు మంటి.

క. అని చెప్పి యుంటి నాచె,ప్పినయట్టులు సేసి యితఁడు పేరును బెంపుం
గని యుండఁగ నిట్లడలున, మునుఁగు టరయఁ గడుపుశోకమున పెంపునుమీ.

ఆ. అరివిమర్ది యితనికై నగ పేటికిఁ, బుణ్యలోకమునకుఁ బోయె ననుచు
నుండ నోపెనేని నుల్లంబు ధృతరాష్ట్రు, దిక్కులేమిఁ దలఁచి పొక్కకున్నె. 35

వ. అని వెండియు. 36

సరసిజవృ. శ్రీరమ్యత్వం బారఁగఁ బెం పూర్జితముగ మణివిరచితమకుటములుం
దాలుం జూడన్ సారవిభూతిన్ ధరణిపు లనిమిషధవనిభు లగుచున్
భూరిప్రీతిన్ సూరెలఁ గొల్వన్ భువనవినుతమగు పొలుపు నెలయము
న్నీరా జుండన్ దారుణదైవం బిటు వఱచునె తుది నిశనిఁ గటకటా. 37

తే. కనకబహురత్నమయపీఠకమున మృగాక్షు, లాలనట్టంబు లిడఁ జెలుకనమరునట్టి
కౌరవేంద్రుండు పెనునేలఁ గంకపక్ష, పవనహతుఁ డయ్యెఁ జూచితె పద్మనాభ.

క. ఈరాజు భీమసేనును, దారోగ్రపరాక్రమమున ధరణి నొఱగి దు
ర్వారగమదవారణము కం, ఠీరవమువిహారమునఁ బడినగతిఁ బొలిచెన్. 39

క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం, బదివేలవిధములఁ జెప్పఁ బాటింపఁడు దు
ర్మదమునఁ దగిమెదుబుద్ధులు,విధి మూఁడినమర్త్యుఁ డేల వినునుచితోక్తుల్.

క. పదునొకఁడక్షౌహిణులే, [1]పాదవఁగ నలిఁ గొలువ నొప్పునుర్వీశ్వరుఁడే
తుది నిష్పరివారుం డై, గదఁ జేకొని యొంటి పోరి కలనం బడియెన్. 41

తే. ధరణిగజఘోటకములొప్పుధార్తరాష్ట్రు, లెల్లఁబొలుపారఁగాఁగంటినిప్పుడవి వి
నాశమొందినఁ బాడతి నలిననాభ, యది పరాధీనముగఁ జూచునట్టి దయ్యె.

వ. అని దుర్యోధనవల్లభ[2] నిరీక్షించి మాధవు నుద్దేశించి యి ట్లనియె. 43

ఆ. కొడుకుచావుకంటెఁ గోడలియడలునఁ, బెరిఁగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గల మెరియంగఁ,దొడఁగె దీనికేది తుది యుపేంద్ర. 44

సీ. చూడు మిమ్ముద్దియసుతుఁ జూచి వదన మ,ల్లార్చుచుఁ బ్రాణేశునాననంబు
పైఁ జూడ్కి యదరించి పాణితలంబున, నందంద నెమ్మొగ మడిచికొనుచు
మరలఁ బుత్త్రునిదెస కరిగినమనసు పే, రడలున మునుఁగంగ నతనిచెన్ను
మోమునఁ దనమోము మోపిమూర్ఛిల్లుచుఁ, దెలిసి వల్లభునురఃస్థలము గ్రుమ్మ

తే. నుదుకుఁగన్నీరఁ దడియంగ నొఱగుచును వి
చేష్ట యై యూరకుండుచుఁ జెలులతోడఁ
దిరిగి పొగులంగ వేసలి విరియ మేన
నవులఁ దిరుగుచు నున్నది యక్కటకట. 45

వ. అని వెండియు. 46

సీ. ఈసుమధ్యమ యిమ్మహీశ్వరుబాహుత,లంబున లలితోపలాలనంబు
నొంది రాగిల్లెడునుల్లంబుతో నుండు, నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ
వచ్చుఁ గనుంగొనవశము గా దిది యిట్టి,కొడుకును మనుమండుఁబుడమినిట్లు
పడియుండఁ జూచెడుపాపజాతికి నిప్పు, డవియక నిగ్గడి మైనయినుప

తే. గుండియకుఁ జేటుపాటింకఁ బుండరీక,నయన యెన్నఁడు లేమి నిర్ణయముగాదె
యింతకోర్చెడునట్టివా రెన్నఁడేని, నుర్వి నెందేనిఁగలుగుదురొక్కొ యొరులు.

క. జననియు భార్యయు నేమై,న నేమి వేదములు బొంకునకుఁ జొరమి నిజం
బని పుణ్యలోక మగు నని, తనకార్యము సూచె నిట్లు తగునె యితనికిన్. 48

వ. అని యనేకభంగుల విలాపంబు సేసి తక్కటితనయులదెస నాలోకించి విష్ణు
దేవునితో ని ట్లనియె. 49

1. పాదవఁ బొదువ నొప్పనట్టియుర్వీ. 2 యగుభానుమతి.

భాస్కరవిలసితవృ. కౌరవనృపతితనూజశతంబుం ♦ గంటె పవనసుతుపటుభుజలీలా
ఘోరతఁ దడఁబడ మేదినిమీఁదం ♦ గూలె వికటముఖకర[1]చరణత్వం
బేరి కయినఁ గనుఁగొన్న విషాదం ♦ బెంతయు మది నొలయఁగఁ బ్రియకాంతల్
చేరి విలపనము దద్దయు నార్తిం ♦ జేయఁగ సునికి వనట [2]శౌరిఁ బెట్టెన్. 49

తే. చందనార్ద్రకుట్టిమములఁ ♦ జరణతలము, [3]లొందుటకు నేవగించునయ్యువిదలిపుడు
నెత్తురుల తేవ మెక్కిన ♦ నేలఁ బొరలు, చున్నవా రేమి సెప్పుదు ♦ నుడుకు పేర్మి.

. బాలలుఁ దరుణులుఁ బ్రౌఢలుఁ, దూలెడువికలాంగకముల ♦ తో డెందముల్
వాలినవిరహానలముల, పాలై వందు రెద రొక్క ♦ భంగిన యకటా. 51

క. బలదర్పధైర్యశౌర్యో, జ్జ్వలు లగుధృతరాష్ట్రసుతుల ♦ సతులకు నిట్లా
కులతమయి వనట పెల్లునఁ, దలరవలసె దిక్కుమాలి ♦ దైవము చెఱుదిన్. 52

క. నిజభూషణాతపత్ర, ధ్వజకంకటఖండవేష్టి ♦ తము లైనకురు
వ్రజగాత్రశకలములు వా, రిజనాభ కనుంగొనంగ ♦ రెట్టించె నగల్. 53

క. జననియుఁ దండ్రియుఁ [4]దొలుబా, మునఁ జేసినపాపకర్మ ♦ మునఁ గాక సుయో
ధనుఁడు మొదలయిననూర్వుర, ననఘుఁడు ధర్మజుఁడు నామ ♦ మడఁపఁగఁ దగునే.

గాంధారి దుశ్శాసనునికళేబరంబు చూచి విలపించుట.

సీ. అచ్యుత వీఁడె మ ♦ హాభీలభుజుఁ డగు, భీముగదాహతి ♦ భూమిఁ గూలి
యాతనిచేత సర్వాంగంబులుం దును, గలుగుక్రొన్నెత్తురు ♦ కాంతిఁ ద్రావఁ
బడి మఱి తెగటారి ♦ పడియున్నవాఁడు దు, శ్శాసనుఁ డీతండు ♦ సభకు ద్రుపద
పుత్త్రి నీడిచి తెచ్చి ♦ పొలువతనమ్మునఁ, బతులసన్నిధిఁ గురు ♦ క్షితివిభునకుఁ

తే. గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగఁ దూల, పుచ్చెఁ బెక్కువిధంబుల ♦ నొచ్చి యామృ
గాక్షి యప్పుడు మారుతి ♦ యంతరంగ, మేర్పఁ దలఁపించుదానన ♦ యింత పుట్టె.

క. ఆసభ నమ్మెయి నీదు, శ్శాసనుఁ డప్పాండుపుత్త్ర ♦ సతిఁ గ్రూరాత్ముం
డై [5]సంక లేక పెద్దయుఁ, గాసిం బెట్టంగ నెఱిఁగి ♦ కలఁగినమదిలోన్. 56

వ. ఏను దుర్యోధనునితో నిట్లంటి. 57

తరువోజ. [5]హరిచేత రక్షిత ♦ మైనపాంచాలి, కగునయ్య యిమ్మెయి ♦ నత్యంతనీచ
పరిభవదుఃఖంబు ♦ పాల్ సేత మీఁదు, పరికింప కున్నఁ గీ ♦ డ్పాటిల్ల కున్నె
యరికంజకుంజరుఁ ♦ డగుభీముఁ బల్కు, లనుబరిగోలల ♦ నలఁచుట మేలె
వెరవిడి నేవేగ ♦ విడువుము గార, వింపు మీవంశప ♦ విత్ర నోపుత్త్ర. 58

క. క్రూరాత్ముఁడు నీచుఁడు గాం, ధారివిభునిఁ దొఱఁగు పాండు ♦ తనయులఁ బుణ్యా
ప్రారంభులఁ గూడి మనుము, కౌరవకులమెల్ల బ్రదుకఁ ♦ గాఁ బొగడొందన్. 59

క. అని యెన్నిభంగులను జెప్పినఁ దా నప్పలుకు లెల్లఁ ♦ బెడచెవులం బె

---

1. చరణం బై, యేరికయిన. 2. యిగిరించెన్. 3. నొవుటకు. 4. బ్రిగాలును, మును సేసిన. 5. సంకటపడఁ బెద్ద, 6. అరయక సభలోన నత్తోయజాక్షి ♦ నమ్మెయి దయ మాలి ♦ యత్యంత.

—38

పై నుదగ్రుఁడు దగుకార్యము, గనునె వశం బగునె దైవగతిఁ దప్పింపన్. 60

స్టై నుదగ్రుఁడు దగుకార్యము, గనునె వశం బగునె దైవగతిఁ దప్పింపన్.

తే. నాఁటిమాట లుల్లంబున నాఁటియుండ, నొవ్వుతోఁ దఱి వేచి నేఁ డిద్విధమునఁ
బఱిచెభీముండు నొప్పింపఁబడినత్రాఁచు, పామువగ నాటి తెగటార్చు భంగిఁ గృష్ణ.

క. తగుఁ బగ దీర్చుట యిమ్మెయిఁ, దగ వగునే నెత్తు రెత్తి త్రావుట భీముం
డు గడుఁ ఘోరము సేసెను, మగలకతితుఁ డుగ్రవృత్తమా పోగ డొసఁగున్.

తరల. కరములుం జరణంబులుం [1]విరిగ గల్గి సాఁగి వికీర్ణమై
యురము నిర్భరవైకృతంబుగ నుర్విఁ ద్రెళ్లి సుతుండు గే
సరినఖంబుల వ్రవ్వఁబడ్డగజంబుచాడ్పున నుండఁగాఁ
గరుణ మాత్మకు నింత మిక్కిలి గాక యున్నె జనార్దనా. 63

సీ. వీఁడె వికర్ణుండు వాఁడిమెఱుంగు మేఘంబులగములమధ్యంబునందుఁ
దేజరిల్లెడుమాడ్కి రాజిల్లుచున్నవాఁ, డతిసాంద్రహస్తికాయములలోన
గార్ముకజ్యాకిణకఠినమై యున్నయి, బ్బాలునిముంజేయి బాలగృధ్ర
మోపదు కబళించి యును జంచుపుటమునఁ, జీరంగఁ జూచితే శౌరి యితని

తే. రమణి పోరిఁ బోరిఁ గన్నీరు గ్రమ్మఁ జుట్టు, మెలఁగి కాకుల గ్రద్దలఁ దోలఁగనడుచు
చున్నయది [2]పాసి యవి వోవకున్న నిట్లు, సూతు రే తల్లు లెందును సుతుల నకట.

క. మారుతనందనునుగ్రపు, నారాచము లొడల నాటినం జచ్చియు న
వ్వీరకుమారుం డుజ్జ్వల, చారుత్వముఁ బాయ కున్నచందముఁ గంటే. 6૬

క. అనిమొన నెవ్వరికిని మాఁ, ర్కొన రానిఘనుండు దుర్ముఖుఁడు భీమునిచే
వినిపాతితుఁడై భూరజ, మున బ్రుంగుడువడ్డవాఁడు మురహర కంటే. 66

తే. నక్కతోఁ దెలువీనియూనన నముసగము, దిన్నయవియట్టులయ్యును నున్నయొప్పు
దొరసి సప్తమినాఁటిచందురునిఁ [3]బోలెఁ, జూడు భావించి దీపితశూరవంశ.67

మత్తకోకిల. శూరసేనుఁడు భీమసేననిషూదితుం డయి చుట్టు నం
భోరుహానన లార్తిమూర్తతఁ బొందిన ట్లతిరూక్షహా
హారవంబులతోడఁ గ్రుమ్మర నల్లవాఁడె వికారితా
కారుఁడై పడియున్నవాఁడు వృకంబుఁ బక్షులుఁ జించినన్. 68

సీ. అంగంబు కోమల మంతరంగంబు చా, తుర్యనిరూఢంబు శౌర్యఘనుఁడు
వీఁడె గోవింద వివింశతి యీతండు, సొబగుండు మెలఁతలు సుట్టు నెపుడు
నప్సరోగణ మమరాధిపుఁ గొలిచెడు, ఛాడ్పునఁ బాయక సమ్మదంబు
చిగురొత్త నుండుదు రగరుకస్తూరికా, చందనాద్యనులేపశాలి యిపుడు

తే. గ్రద్దలును గాకులును జుట్టుఁ గదిసియుండఁ, దఱచు నెత్తుటఁ దోఁగినతనువుఁ దాను
నున్నవాఁ[illegible] గానాకర్ణనోత్సుకుండు, నక్కలఱచెడుచేరువ నక్కటకట. 69

[illegible]. కనకపుం[illegible]గాత్రుఁ డైన

---

1. బరి. 2. గాని [illegible]వి వాయ [illegible] కన్న యిట్లు. 3. [illegible]లి, [illegible]డు.

దుష్ప్రిహుఁడు చచ్చి యుండియుఁ దోయజాక్ష
వికచనవకర్ణికారసంవేష్టనంబు
గలుగుశైలంబు తెఱఁగునఁ బొలిచెఁ జూడు. 70

గాంధారి యభిమన్యుకళేబరంబు గనుంగొని ప్రలాపించుట.

వ. అని మఱియు నిట్లనియె. 71

లయవిభాతి. అరయ నిది పెద్ద యని పరులమొనఁ జిత్తమున
వరకు గొన కుగ్ర మగుబరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురువరుఁడు దలరం గవిసి
కరితతులుఁ దేరులనికరములుఁ దురంగో
త్కరములును గాల్బలము [1]నెరవులునుఁ గీటడఁగ
శరగురుఁడుఁ గర్ణుఁడును గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం [2]బరవఁ బరఁగి దివిజుల్ వొగడ
ధరఁ బడి ముకుంద మనరతనయుఁ డొప్పెన్. 72

ఆ. పాఁడి మాలి తన్నుఁ బలువురు పొదివినఁ, బోరి తద్దఁ డప్పిఁ గూరి నిదుర
పోయెనొకొ సుభద్రపుత్త్రుండు మృతుఁడైనఁ, జెలువ మింత యేల కలుగ నేర్చు.

సీ. ఉత్తర యిక్కుమారోత్తమునురమున, వ్రాలి మోమునఁ దనవదనకమల
మందంద సేర్చుచున్నది మున్ను గన్నంత, మెలఁగంగ నేరక చెలులమాటు
గొనుసిగ్గుపెంపున వనట నిట్లయ్యె ని,ప్పుడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియునిఁ
గనుఁగొని బిగియారఁ గౌఁగిలించుచు శిర, మూరుతలంబున నునిచి సాణి

తే. పల్లవంబున నాననమల్లనల్లఁ, దొడయుచును నిన్నుఁ జూచుచుఁ దోడుతోడఁ
బొడము[3]పెల్లునఁ గన్నీరు దుడిచికొనుచు, నలఁత పెనువెల్లిఁ దేలెడు నంబుజాక్ష.

వ. వింటె యవ్వనితవిలాపంబు. 75

భద్రచారిత్ర సుభద్రను నిర్జర, ప్రతిమాను లగుపాండురాజసుతులఁ
బాసి యెం దరిగితి పార్థునిపట్టి న, చ్యుతునియల్లుని సమరోర్విఁ జెనసి
పరిమార్పఁ జాలి రెవ్వరు పెక్కుభంగుల, మాటలాడఁగ మఱుమాట లేల
యాడవె నాతోడ నస్త్రగురుండుఁ ద, త్తనయుండు గృపుఁడు రాధాసుతుండుఁ

తే. బాడిమానుసులంద్రు నిన్నాబలు నొకనిఁ, బొదివి రిస్సిరొ పెక్కండ్రు ప్రోడ లిదియు
మగఁటిమి యెక్కించు పనికిట్లు దెగినయప్పు, డుల్లములు వారలకు నెట్టు లుండెనొక్కొ.

క. పాండవులును బాంచాలురు, దండిమగలు వారు సూడఁ దలఁకక నిన్నుర్
భండనమునఁ బడ వైవఁగ, గండు గలుగు టద్భుతంబు గాదె తలంపన్. 77

క. తన లేనిచోటఁ బలువురు, నినుఁ జుట్టును ముట్టి యొక్కనిం జేరి వధిం
చినవంచనకు ధనంజయు, మన మెమ్మెయి నురియునొక్కొ మన్మథమూర్తీ.

1. నెరవులను. 2. బలుపఁ. 3. పెల్లుకన్నీరు 4. జాల రెవ్వరుఁ బెక్కు. 5. నెరియుఁ; మురియు.

తరల. అరుల నెల్లను గెల్చి మేదిని యంతయుం గొని తేజముల్
సిరియుఁ బెంపును గీర్తియుల్ విలసిల్లఁగా మనుచుండియుం
బురుషసింహులు పాండుభూవరపుత్త్రు లక్కట మోదముం
బొరయ నేర్తురె నిన్నుఁ గోల్పడి పోయి పుష్కరలోచనా. 79

క. నీమూర్తియందుఁ బ్రాణము, లేమిఁ దెలిసి యుండఁ జంచలింపక జీవం
బేమికతంబునఁ గలిగియొ, నామేను దొఱంగిపోదు నాథ యెఱుంగన్. 80

సీ. దేవలోకంబున నీ విప్పు డెవ్వతెఁ, దీపారఁ బలుకులఁ దేర్చి కురులు
పుదుకుచుఁ దగ నన్నుఁ బోలె లోలాత్మఁగాఁ, జేయుచున్నాఁడవు చెలువు నేర్పు
మెఱయంగ నచ్చర తెఱవలమనములు, గలఁచియాడుదు గాక యలఁతిఁబోదె
యంగనాగోష్ఠి నున్నపుడు నానడవడి, బుద్ధిఁ దలంతె ని న్బొందఁ గాంచి

ఆ. యాఱునెలలు వోమె యంతియ యింతియ, కాని లేదె తొంటిమేనఁ జేసి
నట్టిమేలు మోహనాకార యభిమన్యు, వీర నిర్వికార వినుతసార. 81

వ. అను చున్నది యిట్లు పలవింప విరాటనందనం దదీయజననీప్రముఖబాంధవస్త్రీ
జనంబు లచ్చటు వాయం దిగిచి పొగులుచుం గొనిపోయిరి వారలం గనుం
గొనుము. 82

కవిరాజవిరాజితము. గురునిశరంబులు దాఁకిన మేదినిఁ గూలి విరాటుఁడు పేరిన నె
త్తురుల మునింగిన మేనును దానును ధూళి సమీరుఁడు మోముపయిం
బొరిఁబొరిఁ జల్లఁగ నున్కి గనుంగొని పొడ్మఁగ నశ్రులు హా యనుచుం
బురపురఁ బొక్కెద రెమ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్. 83

క. అకటకట యుత్తరుఁడు గొం,డుక కాంభోజుండునుం గదల్ బాలుఁడు వా
లికకై దువు లాడిన నేల కొఱగి యొప్పి రభిమన్యులక్ష్మణులక్రియన్. 84

సీ. పాండుపుత్త్రులభుజాబలమున కులుకక, యెవ్వీరుప్రాపున నెదురు నడచె
దుర్యోధనుఁడు గొంతితొలుచూలి కెవ్వఁడు, హృదయశల్యంబయి యనిదుర సెఱుచు
నట్టికర్ణుండు మదాంధసింధురము బ,లోద్ధతద్విరదమహోగ్రవిక్ర
మమున గీటడఁగినమాడ్కి నర్జునుబలు, గడిమిచేఁ దెగటార్పఁబడియె వీని

ఆ. బాహువిలసనమునఁ బడినమహాయోధ,వరు లనేకు లితఁ డవార్యరోష
దూషితుండు పరుషభాషణశీలుండు, ధైర్యధనుఁడు దానశౌర్యశాలి. 85

వ. విను మవ్వీరోత్తముండు. 86

క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం
బుఱని తెగువ ముందటఁ బె,న్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. 87

తే. ఇతనిచుట్టును గలకల మెసఁగ రోద,నంబు సేయుపత్నీనివహంబులోనఁ
గంటె వృషసేనుతల్లి యగ్గలపుటడలు, మూర్తి యైన తెఱంగున నార్తిఁ దూలె

వ. ఈరమణీరత్నంబు ధరణీతలంబునం బొరలుచు. 89

తే. పరశురామునిశాపంబు బాణశక్తి, గ్రాఁప బ్రాహ్మణశాపంబు రథము సిక్కు
వఱుప గాండీవధరుచేతి మెఱుఁగుటమ్ము, మన్నిగొనియెనె యీకర్ణు మగలరాజ.

వ. అని మఱియుం బలుదెఱంగులం బలవించి యుత్థిత యై యాలోకించి. 91

తే. కాకులును గ్రద్దలును దిన్నఁ గడును ద్రెస్సి
యపరపక్షచతుర్దశి యమృతకరుని
కరణి నొప్పెడుకర్ణుమొగంబుమీఁద
వనిత యందంద మోపెడుఁ దనమొగంబు. 92

ఉత్సాహవృత్తము. వాఁడిమగఁడు నిద్ర పోవు వాలుమృగముఁబోలె నై
వీఁడె బాహ్లికుండు వృష్ణివీర చూడు చచ్చియుం
బోఁడి దొఱఁగకున్నయట్టి పొల్పువర్ణ వెలింగె వె
న్నీఁడితండు బలము లెన్ని యేనిఁ జెల్లు ద్రోచినన్. 93

తే. మేనఁ బ్రాణము వాసిన మీఁద మొగము
మెఱసి యుండునె యెందు ని త్తెఱఁగుకాంతి
తోడఁ బున్నమనాఁటిచం దురునిచంద
మమరెఁ జూడు మిక్కుఱువృద్ధు నాననంబు. 94

గాంధారి సైంధవునికళేబరము చూచి వాపోవుట.

సీ. పల్కుతప్పమి నెఱపంగఁ దలంచి యుత్సాహంబు వాటించి సవ్యసాచి
దుర్యోధనుండును దొరలు ననేకసైన్యంబులు నంతంత నడ్డపడఁగఁ
దెరలిచి వడి మెడ ద్రెవ్వ నేసినఁ బడి, యున్నాఁడు సైంధవుఁ డుఱక ద్రుపద
తనయఁగాననమునఁ గొనిచన్న నాఁడ తాఁ, దెగినాఁడుగాఁ డెకొంక తేయు లపుడు.

తే. దయ దలిర్పంగ దుస్సలఁ దలఁచి యలుక, గ్రాచి మందల విడిచిరి గాక దైవ
కృతము దప్పింప రాకున్కి కతన నిపుడు, వారు విడిచి రిమ్మద్దియ వలనికరుణ.

తే. హృదయమున వగ లేనియ ట్టట్టు నట్టుఁ, దిరుగుచున్నది దుస్సల వరునిశిరముఁ
గాన కీకూఁతు నిమ్మెయిఁ గనుటకంటెఁ, దలఁప నెక్కుడుదుఃఖంబు గలదె కృష్ణ.

వ. నాఁటిరాత్రి యరులు చేసికొనినప్రతిజ్ఞ వేగులవారిచేత దుస్సల విని సైంధవునికి
బుద్ధి చెప్పినతెఱంగు లవి వినుము. 97

సీ. విజయుప్రతిజ్ఞకుఁ ద్రిజగంబులోపల, నడ్డంబు లేదు సుమ్మధిపుఁ డంటిఁ
గురురాజుసైన్యంబు బిరుదునమ్మకుమంటి, గురుఁడుపార్థునకుమాఱ్కొనఁడయంటి
నరు డాయ నొకనికైనను బుద్ధిగొన దంటి, సమరంబు నీకు నసాధ్య మంటి
ధర్మపుత్త్రుఁడు నిన్ను దయఁగాచుఁ బొమ్మంటి, నామాటవినఁగదె నాథ యంటి

ఆ. రాజతిలక రాజరాజకంఠీరవ, రాజరత్న దినసరాజతేజ
రాజరాజ యనుచు రాజన్య సైంధవ, రాజుఁ బనవుచుండె నాజిలోన. 98

తే. తోడఁబుట్టువు విధన యై తొలఁగి యునికి

కోర్చి చలమునఁ బతిఁ దెగటార్చి సంత
సించితిరె తండ్రులార మీ రంచుఁ బొందు
పుత్త్రకుల దూఱుచున్నది పొలఁతి వింటె. 99

ఉత్సాహవృత్తము. తనయుఁ గాచువనిఁ బూని ధర్మపుత్త్రవాయువం
దనులుఁ గవలుఁ జేయఁ గలుగు చండిమగలు సేనలం
గాసి వడిం గడంగ సరకుఁ గొనక నిల్చి యొక్కఁడుం
బెనఁగి యాఁగె సైంధవుండు బిరుదుదక్షుఁడుం గదే. 100

తే. తప్పు సైంధవుపైఁ బెట్టఁ దగునొ తగదొ
పార్థుప్రతినకు నొక్కండ పాత్ర మయ్యెఁ
దాన యందఱ నాఁగుట తప్పు గాదె
యదియ సౌభద్రుమృతిహేతు వగుట లేదె. 101

తే. బోరగిలఁ బడ్డవాఁడు గపోల మొకటి
పుడమి మోచినయది మోము పొలుపు సెడదు
వీఁడె చూచితె శల్యుండు వెడలి యున్న
జిహ్వ దినియెడు వాయసశ్రేణి కృష్ణ. 102

క. ఇట్టవునె మాద్రితోడఁ, బుట్టె ననక యితనిధర్మపుత్త్రునకుఁ గడుం
బెట్టిదుఁడై చంపవలసెఁ, జుట్టుపుఁదన మేల రాజసుతులకుఁ గలుగున్. 103

క. సెల్లుఁడు యమతనయునితో, నెల్లగుణంబులను జాల నెనయుదు నని తా
నుల్లమున నిశ్చయించుం, జెల్లం బో పోరఁ బగఱచే నిట్లయ్యెన్. 104

వ. అమ్మహీవిభుండు. 105

భుజంగప్రయాతము. కురుక్షోణినాథుండు గోరంగ మైత్రిన్
ధురం దాల్చి తా నేర్పుతో సారథిత్వం
బరిశ్రేణిసంత్రాసి యై పూని కర్ణుం
బరిక్షోభితుం జేసె భాషాస్త్రపంక్తిన్. 106

ఆ. అధికపంకపతిత మై యున్నయాఁబోతుఁ, బొదివి యున్నమొదవుకదుపువోలె
నున్నవారు సూడు ముదితలు దైన్య మా,స్యముల నెలవుకొనఁగ శల్యు బలసి.

మత్తకోకిల. చూచితే భగదత్తు నీతఁడు శూరతామహిమన్ నరున్
వీచిసన్నిభబాణపంక్తుల [1]వెట్టిఁ జేసె మహేంద్రుతో
నేచి పోరుబలుండువోలె సహింప కీతని నిట్లు గాఁ
జూచి తాతనిమీఁది నెయ్యము[2]సొంపునన్ మురమర్దనా. 108

క. పులుఁగులును మెకంబులునుం, దొలిచి తినిన నెలవు దప్పి తొలఁగియుఁ గంటే
తల నున్నకనకదామము, పొలుపు దెగంబాయ దీన్నృపుం గమలాక్షా. 109

1. వేఁడిఁ జేసి. 2. (జెలువు నెలవు దొంకియుఁ.

~ గాంధారి శరతల్పగతుం డగుభీష్ము నుద్దేశించి శోకించుట. ~

సీ. బలశౌర్యములఁ దన | పాటిగా నెందును, మానవు నొరుఁ జూప | లేనియట్టి
శంతనుపుత్త్రుఁడే | శత్రులబాహుద,ర్పంబున రణభూమిఁ | బడియెఁ దన్ను
వాలాయమును గెల్వ | వచ్చునే చంపికొం, డని పాండుసుతులపై | నగ్గలంపుఁ
గరుణ మర్మము సెప్పఁ | గాక యెమ్మెయి నైన, నతినిష్ఠ యెప్పుడు | నతనియందుఁ
ఆ. గలదు గాదె తండ్రి | కార్యంబునకుఁ గాఁగ, రాజ్య ముడిగి పూనె | బ్రహ్మచర్య
మితనిఁ జెప్పి చెప్ప | నితరుండు పౌరుష,కలితసంభవుండు | గలఁడె కృష్ణ, 110
క. కురువంశ మెడల వచ్చినఁ, బరమోపాయమున మగుడఁ | బడసెన్ మడిసెం
గురునికరముతోడన యి,ప్పురుషుఁడు పురుషార్థసార | భూషణుఁడు గదే. 111
క. దేవుఁడు గాకితఁడు నరుఁడు, నా వచ్చునె నిష్ఠ పెంపు | నం బ్రాణంబుల్
తా వలసినపుడ విడువం, గా వేడుక నునిచినాఁడు | గాదె తనువునన్. 112
ఆ. తీవ్రబాణజాల | దీప్తులు పరఁగించి, పాండుతనయసైన్య | బహుళతమము
లీలఁ బదిదినములు | నోలి వినోదించి, యకట భీష్మభానుఁ | డస్తమించె. 113
క. శరవణమునందుఁ బొలుపుం, బొరసినగాంగేయుతోడఁ | బోల్పఁగ నను వై
శరతల్పంబునఁ దేజో,భరితుఁడు గాంగేయుఁ డొప్పెఁ | బంకజనాభా. 114
తే. అర్జునుఁడు వెట్టె నీతని | కంపపాన్పు, నకుఁ దగంగ నిశాతబా | ణముల మూఁట
నలవరించినతలగడ | యస్త్రజనిత,వారిఁ దృప్తునిఁ జేసె న | వ్వీరవరుఁడు. 115
క. వీరశయనమున గంగకు,మారుఁడు కల్పక్షయమున | మార్తాండుఁడు సం
చార మెడలి ధరఁ బడియె,ప్పారెడుచందమున వెలిఁగె | నంబురుహాక్షా. 116
క. దేవవ్రతుండు గీర్వా,ణావాసంబునకుఁ జనిన | యట కుశునికరం
బేవాని నడిగి తెలియు న్కో, విశ్రుతధర్మసంప్ర | యోగవిధంబుల్. 117
సీ. పగవారి మొన లను | పల్లెరులం గాల్చి, మడిసెఁ గుంభజుఁ డని | యెడుదవాగ్ని
యెన్నియస్త్రము లింద్రుఁ | డెఱుఁగు నన్నింటను, బరిణతుం డీతండు | భార్గవునకు
నెట్లట్లు సువిధేయ | మిమ్మహాత్మునకు ధ,నుర్వేద మితనికి | సర్వవేద
ములుఁ బరిచితము లి | య్యలఘుతేజునిశిష్యుఁ, గాదె పార్థుఁడు గార్ము | కమున మేటి
ఆ. యయ్యెఁ దక్కుకౌర | వాన్వయజాతులు, సాత్యకియును నివ్వి | శాలబుద్ధి
నాశ్రయించుటను మ | హాస్త్రవిత్తము లైరి, యోధు లింతవార | లుర్విఁ గలరె.
క. వివిధమహాస్త్రంబులు గా,లవశతఁ జెడఁ గాక శౌర్య | లంపటు నియ్యో
ధవరునిఁ బగవారికిఁ జే,ర నశం బగు నెట్లు సంగ | రంబునఁ గృష్ణా. 119
తే. గురుని మున్నిడుకొని కాదె | కురుకుమారు, లనికిఁ బిలిచిరి ధర్మపు | త్త్రాదులయిన
వాలుమగల నట్లంతటి | వాఁడుఁ బగఱు, నఱికిపైచినఁ బడియున్న | తెఱఁగు కంటె.
తోటకము. సతతంబును శిష్యులు | సద్వినయా

1. బల్కానముఁ గాల్చి.

న్వితు లై ప్రణమిల్లెదు । వీరిపద
ద్వితయంబు గనుం జెడఁ । దిన్నవి సూ
చితె నక్కలు దైనము । చెద్దియఁ గటా. 121

ఆ. ద్రుపదతనయుఁ డట్టె । ద్రోణునితలఁ గోయు,వాఁడు విధికి నెట్టె । వారి నెట్టి
తెఱఁగు సేయ రాదు । దీనికి నే మను,వార మిది యసంభ । వంబు గాదె. 122

సీ. కృపునితోఁబుట్టువు । కృపి తనభర్త ద్రోణాచార్యుపాల దై । న్యంబు విపుల
వేణియు మొగమున । వెంట మునుంగు వ,డంగ రాల్పడిన యె । లుంగుతోడఁ
బలవించి పలవించి । బహుశిష్యు లయ్యతి,రథవర్యునస్త్రశ । స్త్రములు రథము
ననయనంబులును జి । తాకలనంబు సే,యుచుఁ సామగానసం । యుక్తవదను

ఆ. లగుట నూచి సామ । మతికరుణంబుగాఁ, దాను బాడఁ జొచ్చె । మానితాగ్ని
సాద శమర్చి యవ్వి । శుద్ధాత్ము నొండొక,యగ్నివోలెఁ బెట్టి । రందుఁ గృష్ణ.

క. కృపి మున్నుగ శిష్యులు సొద, యపసవ్యముగాఁగ దిరిగి । యరిగిరి శోకా
ర్తపుటాడళులతో గంగకు, నపగతశరవిద్య యయ్యె । నవని కటకటా. 124

ఆ. సోమదత్తసుతునిఁ । జూడుము సాత్యకి, దూష్యభంగి శిరముఁ । దునుమనొఱగి
యున్నవాఁడు గ్రద్ధ । లొలిచి తినంగ నీ,సుకృతపరుని నిట్లు । సూడవలసె. 125

వ. సోమదత్తుండు పుత్త్రశోకాయత్తచిత్తుం డై యుండి తన్ను సాత్యకి గవిసినప్పుడు తనకొడుకునెడ నతండు సేసినయధర్మం బుగ్గడించి గర్హించినవిధంబు మృతుం డైనను మొగంబునం దోఁచుచున్నది భూరిశ్రవుతల్లి యది యతనిని వల్లభునిఁ బొరింబొరిం గనుంగొనుచు గద్గదకంఠంబుతో నాసోమదత్తు నుద్దేశించి. 126

సీ. ఓరాజ కల్పకు । యోపమానం బగు,కౌరవజాతిసం । తతియము చూడ
కున్నాఁడ నధికదా । నోజ్జ్వలు బహుమహా,ధ్వరకర్త భూరిశ్ర । వసుఁడు నీదు
గారాబుపట్టి సం । క్రందననందను, దుర్విక్రమంబునఁ । దునుముఁబడిన
బాహువు సాత్యకి । పాపకర్మంబున, సంఛిన్న మైనమ । స్తకము నై మ

ఆ. హీతలమునఁ బడియె । నిప్పుణ్యసంతతి,దిక్కు సూడ వేల । యొక్కమాటు
కొడుకుచుట్టు నేడ్చు । కోడండ్రయలమట, యరయ నిట్లు దగునె । యధిప నీకు.

క. వీ రేవు రొంటిచీరలుఁ, దారును విరిదలలతోడఁ । దద్దయు నడలుం
గూరి పలవించెదరు నిను, సారసికలభీతిరుతుల । చందము దోఁపన్. 128

ఆ. ఆలమునకు వెడలు । నప్పు డిచ్చితి నీదు,పసిఁడిగొడుగు సుతుఁడు । లసితవిభవుఁ
డగుట కది నికృత్త । మై పడి యున్నది, యక్కుమారురథము । నందుఁ జూడు.

క. అని పనవుచున్నయది య,వ్వనితను గోడండ్రఁ జూడ । వశమే ఘనుఁ డ
ర్జునుఁ డిట్టినీచకర్మం,బున కిట్టులు సొచ్చెనో కు । పురుషుఁడపోలెన్ 130

కవిరాజవిరాజితము. విను మది సాత్యకి చచ్చుట కోర్వక । వీరవరుండగు పార్థుఁడు సే

1. యుతవివల భలం.

సినతఁగ వైనను నయ్యె నతం డటుౝ జేనఋక్తిఁ మునిమైనమహా
త్మునిఁ గని యుబ్బుచు సాత్యకి యే మనిౝ ద్రుంచె శిరంబు కడంగి జగం
బున నొరు లింత నికృష్టపుఁగర్మముౝపొంతను బోదురె చక్రధరా. 131

క. ఇక్కురునరునాంధ్రురలో, నొక్కత యతిరమ్యమూర్తిౝ యుత్సంగమునం
దక్కర మిడికొని పనవెదు, నెక్కుడువగ నూని యదె మౝహీంధర కంటే. 132

సీ. మెలుపారఁగాఁ బట్టిౝ మొలనూలిమణులు గ,దల్చుచుఁ దిగుచుచుఁౝదగులొనర్పుఁ
జనుఁగవమీఁది కౝల్లన వచ్చి లలితవి,మర్దనంబున లజ్జౝ మరలఁ ద్రోచు
నాభి యూరులు జఘౝనము మెత్తమెత్తన, యొత్తి ముదంబునౝ నుల్ల [1]మూన్చు
ననయంబుఁ దిన్ననిౝయనువున గనయంబు, ప్రిదులంగ మెలఁగిచొౝక్కొదవఁ జేయు

ఆ. నిక్కరంబు నెయ్యౝ మెక్కింప నేరంగఁ, దగిలి [2]సంతతంబుఁౝ దలఁచునట్టి
భంగి మెఱయఁ గీడుౝవఋపంగఁ గొనియాడ, వలఁతి నీఋ సేయౝవలసె దీని. 133

ఆ. ఒరునితోడఁ బోరౝ హరి సూడ సిగ్గఱి, గ్సేసె విజయుఁ డతనిౝయేటు సభల
నమ్ముకుంగుఁ [3]డెట్టుౝ లగ్గించు నట్టివి, వ్వచ్చుఁ డేమిభంగిౝ మెచ్చుఁ దన్ను. 134

వ. అని యిట్లు విలాపంబు చేసి యూర కున్న దిన్నాతిం దక్కటిమెలనాఁగ లేలిన
దానిఁబోలెఁ బొదివికొని యున్నవా రాలోకింపుము. 135

గాంధారి శకునికళేబరంబు గాంచి యతనిచేఁత లుగ్గడించి శోకించుట.

సీ. మేనల్లుఁ డగునకుౝలానుజునేటులఁ, బడియుండి శకునులౝపాలు వడ్డ
శకునిఁ జూచితె మురౝసంహర యితఁడు మా, యాజాలములకు నాఁౝడోజ సకల
మాయలు నీచేతౝ మడిసె దుర్ద్యూతంబు, నొనరించి రాజ్యంబుౝ గొనియె ధర్మ
తనయునిచే నిష్ఠౝ దన చెద్దియు ఫలియించె, నని యనుజూదంబుౝనందుఁ బ్రాణ

ఆ. మోటుపడియె నెత్తౝమాటకు నీతండు, గఱచు బెల్లఁ గురునిౝకాయనాశ
మునకు నయ్యె నీన్నృౝపుఁడ కాఁడె పాండునం, దనులతోడి వైరౝమునకుఁ గర్త.

క. హిత మొనరించెద నంచుఁ, ధృతరాష్ట్రతనూభవునకుఁౝ దెక్కలికాఁ డై
మృతి యొనరించెం దానును, మృతుఁ డయ్యెను భ్రాతృపుత్త్రౝమిత్త్రయుతముగన్.

మత్తకోకిల. వార లస్త్రహతాంగు లై యనౝవద్యలోకము గాంచి రీ
వైరకర్తయు నట్లు గాంచెనుౝ వారి నల్పవిచారు లం
బోరి కెత్తెడునట్లుగాఁ దగఁౝ బొంది వెఱ్ఱులఁ జేసె నీ
క్రూరుఁ డందును నన్నదమ్ములౝకుౝ విరోధము సేయఁడే. 138

క. రుచిరాంగదు నస్త్రనిచయ, నిచితాంగకునిం గళింగౝనృపుఁ గంటె సమి
ద్విచరణవిహరణమున నిలఁ, డచలితధృతి యగుట యెఱుఁగౝనయ్యెడుఁ గృష్ణా

ఆ. ఇతనిచుట్టు నున్నౝమెలనాఁగ లడలునఁ, గూరి వందియును ముౝకుంద యొప్ప

---

1. గ. మాన్చు. 2. జ. సంతసంబు. 3. గ. డట్టు లగ్గించునట్టె విభ్వ.

వాయ కున్నవారు గ బలితంపువడఁ బఞ్జ, పుష్పదామకములఁ బోలుపు చో౯ప. 140
ఉత్సాహవృత్తము. మానినీజనంబు సేరి మగధనాథుఁ డగుజయ
త్సేనుచుట్టు నేడ్వ నధికదీననాదములకు నా
మానసంబు సాంద్రకరుణమయతఁ బొందె మోహనం
బైనయట్టిమేడ్పు లెందు నంబుజాక్ష వింటె మే. 141
సీ. కోసలనాథుండు భాసురమూర్తి బృహద్బలుచుట్టుఁ బ్రియాంగనాజ
నంబులు సేరి కంపంబుతోడఁ జెమర్చు, కరముల నభిమన్యుకరవిముక్త
శరములఁ బెఱుకుచుఁ బోరి మూర్ఛఁ బొరయుచు, నప్పటికప్పటికతనిముఖముఁ
దేఱి చూచుచు విధిఁ దిట్టుచు శోకాగ్ని, నుల్లంబు లెరియంగ నున్నవారు
ఆ. తునిమి వైవ నెండఁ దనికినఁ బెద్దయు, వంది చూడ్కి దిగువ వలను కలిమి
దొఱఁగ కున్నయట్టితోయజంబులచంద, మయ్యెఁ జూడ వీరియాననములు.
వ. ద్రోణబాణపరిపీడితప్రాణు లై పడియున్నవారు ధృష్టద్యుమ్ననందనులు. 143
మత్తకోకిల. అంగదంబులుఁ గంకణంబులు హారవల్లులు నాదిగా
నంగకంబులభూషణంబులు హారికాంతి వెలుంగఁగా
సంగరాంగణభూమికిం దమచారుభావ మలంక్రియా
సంగతిం గలిగింప నొప్పిరి శౌరి చూచితె వీరలన్. 144
నర్కుటము. త్వరితరథాశ్వమారుతగతస్ఫురితాకృతి యై
శరబహుళార్చిరుద్గమవిశాలతఁ బొల్చుధను
ర్గురుఁ డనుచిచ్చుపై శలభకోటిగతిం బడి మ్రం
దిరి గనుఁగొంటె పేర్వుర నుదీర్ణులఁ గేకయులన్. 145
క. పంచాననంబుచేతం, బంచత్వముఁ బొంది యున్నబంధురకరిఁ బో
లించుటకుం దగి యొప్పెం, బాంచాలుఁడు ద్రోణుకడిమిఁ బడి కంసారీ. 146
క. ద్రుపదనృపాలునిధవళా, తపత్ర మస్త్రంబు లెచోటుఁ దాఁకక జిగి యా
రి పొలిచె శారదచంద్రుం, డుపమాపాత్రంబు గాఁగ నుర్వి యనుదివిన్. 147
తే. వల్లభులును గోడండ్రు నీవసుమతీశ్వ, రునకు నగ్నిసంస్కారంబు నొనరఁ జేసి
యుమ్మలికమునఁ దద్దయు వెమ్మునంత, రంగములతోడ నరిగిరి గంగదెసకు. 148
క. ద్రోణుఁడు దలరం దలపడి, బాణకళావేది చేదిపతి యుజ్జ్వలత
ద్బాణహతిఁ గూలి సమర, క్షోణిపరిష్కార మగుచు శోభిల్లెఁ గడున్. 149
తే. తలయుఁ గాళులుఁ దమయూరుతలములందుఁ
బెట్టికొని వీనిభార్యలు బెట్టిదంపు
టడలుతాఁకునఁ [1]గడు బెగ డారఁ గూరు
నుల్లములతోడఁ బలవించు చున్నవారు. 150

1. గ. బలు వెగ డార; చ. గడు వగ నార.

క. మానవనాథు లనేకులు, వీనిభుజావిక్రమంబు౯ వేఁడిఁ బడిరి నీ
మేనమఱఁది శిశుపాలుని, సూనుం డీధృష్టకేతుఁ ౯ జూచితె కృష్ణా. 151

ఉత్సాహావృత్తము. అతనినందనుఁడు సుకేతుఁ ౯ డల్లవాఁడె ద్రోణపా
లితుఁడు వీనిఁ జూడఁగా మఱేదిఁ సుయోధనుండుఁ ద
త్సుతుఁడుఁ దోఁచుచున్నవారు ౯ శోకవహ్నితాప మూ
ర్ఛితము గాఁగ బంధుజనుల౯చిత్త మెంత గుందునో. 152

తే. అల్లవారె యవంతీశు ౯ లధికబాహు, బలులు విందానువిందులు ౯ బహుళభూష
ణోజ్జ్వలులు పడియున్నవా౯రుగ్రవాయు, పతితకుసుమితనవసాల౯భంగిఁ దోఁప. 153

వ. అని చూపి యిట్లనియె. 154

సీ. శాంతనవుండు నా౯చార్యుండుఁ గర్ణుండు, భూరిశ్రవుఁడు గురు౯పుత్త్రకుండుఁ
గృపుఁడు సైంధవుఁడును ౯ గృతవర్మయును గురు, రాజు [1]నవమానుష౯రథికవరులుఁ
గలయంగ నెన్నెదు౯కొలఁదులవారె వా, రలిగినఁ జెఱుదు ర౯య్యమరు లైన
నట్టివీరులబారి ౯ కగపడి యుండియు, నేమియుఁ గారైతి ౯ రీవుఁ బాండు

తే. తనయు లందఱు నీకూర్మి౯తమ్ముఁడును మ
హాద్భుత మ్మిది దలఁప భీ౯ష్మాదు లైన
వారి నఱె పోర నిర్జింప ౯ వచ్చు నెట్టి
పనియు భరమె దైవమునకుఁ ౯ బద్మనాభ. 155

వ. దైవంబు దుర్యోధనాదు లగునూర్వురకు నొక్కటెత్తున నిట్లగునే యని వెండియు.

తరువోజ. కురురాజు మొద లైన౯కొడుకుల నెల్లఁ, గోల్పోవు టిప్పుడు౯గోవింద కలిగె
నరిగితి సంధి సే౯యఁగ రాక యున్న, నట యప్డు నీచెప్పు౯ కైనది కాదె
పరమహితంబుగఁ ౯ బలికిరి గంగ, పట్టియు విదురుండు ౯ పాటించి పెక్కు
వెరవుల నొత్తిన ౯ విన నైతి వావి, వేకులచూపేల ౯ వృథ వోవ నేర్చు. 157

వ. అని పలికి పశ్చాత్తాపదుఃఖంబు పెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయి యైన పుత్త్రశోకం బడరి యలఁతి గానియలఁతఁ బెట్ట నూరకుండి యక్కౌరవరాజపత్ని పద్మనాభుదెసఁ గనుంగొని కోపోద్దీపిత యై. 158

సీ. ధృతరాష్ట్రపాండుభూ౯పతులకుమారులు, తమలోన నీసున ౯ సమరమునకుఁ
దొడఁగిన నీవడ్డ౯పడ వైతి తగు చాలు, మానుసుల్ గలిగియు ౯ మాననీయ
వాక్యుండ వయ్యును ౯ శక్యసమస్తకా, ర్యుం డనఁ బేర్కని౯యును నుపేక్ష
చేసితి కురురాజుఁ ౯ జెఱుపన తిరిగితి, నిఖిలరాజులఁ దద౯నీకములను

ఆ. నాశ మడఁచి తెల్ల౯భూములుఁ బాడయ్యె, నంతవట్టు ఫలము ౯ ననుభవింపు
మే పడంగ నిన్ను ౯ శాపానలజ్వాల, దగ్ధమూర్తిఁ జేయు౯దాన వినుము. 159

1. గ. ను మాళవ.

## గాంధారి శ్రీకృష్ణునకు శాపం బిచ్చుట.

సీ. పూని పాతివ్రత్య। పుణ్యఫలంబున, సంపాదితం బైన। సార[1]తపము
బలిమి సాధనముగాఁ। బలికెద నుత్తమ, జ్ఞాతులఁ దమలోన। సంగరమునఁ
బొలియఁ జేసితి గాన। పొలియుదు రన్యోన్య, ఘాతకు లై భవ। ద్జ్ఞాతిజనులు
నీవును దప్పక। నేఁ డాదిగా ముప్ప, దాఱగు నేఁ డైన। యద్దినమున

తే. నరయ దిక్కెవ్వరును లేని। యగ్గలంపుఁ, గుత్సితంపుఁదెఱంగునఁ। గూలువాఁడ
విట్లు మీవధూజనములు। నేడ్చువారు, పతుల సుతులను బంధులఁ। బనవి పనవి.

క. అన్ని ఘోరంబుగఁ బలికిన, విని విపులమనస్కుఁ డైన। విష్ణుఁడు చిఱున
వ్వున నానన మొప్పఁగ న,వ్వనితకు ని ట్లనియె గౌర।వస్తుత్యముగన్. 161

తే. మున్న కాదె యాదవులకు। మునివరేణ్య, కలితదారుణశాపంబు। గలదు నీకు
నేల చర్వితచర్వణ। మిట్లు సేయ, దీన నీ వేమి త్రవ్వితి। దానిఁ జెపుమ. 162

క. యదువంశజాతులకుఁ ద,ప్పదు నాశము వారి సురలుఁ। బరిమార్పఁగ లే
రది కారణంబు గాఁగఁ దె,గుదు రొండొరుచేత రణము। ఘోరత్వమునన్. 163

తే. అనినపలుకులు విని పాండు। తనయు లెదలు, వెఱపు పెంపునఁ గంపింప। విహ్వలించి
యాత్మజీవితములదెస। నాస లపుడు, వదల విడిచిరి కౌరవ। వంశవర్య. 164

వ. ఇట్లు పలికినయచ్యుతుం డద్దేవి నుద్దేశించి లేవమ్మా మృతు లైనసకలబంధుమిత్త్రులకు నగ్నికార్యంబులు సేయింప వలయు నని వెండియు. 165

సీ. వినుము గాంధారి నీ। తనయుండు చేయు దు,ర్నయము లెఱుంగవే। నాకు నీకు
శాంతనవునకు నా। చార్యునకును బాహ్లి,కునకుఁ దండ్రికి మాన్పఁ। గొలఁది గాని
[2]దుర్మానమున నిట్లు। దొడరె యి ట్లయ్యె మీ, యపరాధమున వచ్చి। నట్టికీడు
నకు నింత నొవ్వంగ। ననుఁ బల్కఁదగునె యు,మ్మలికంబు ధృతిఁ బట్టి। మాన్పుమింకఁ

తే. జేటునకుఁ జావునకు వగఁ। జెందుజనుల
కినుమడింపదె మానస। మున నలంత
రాచకూఁతుండ్రు సుతుల సం। గ్రామనిరత
హృదయు లగువారిఁ గాంచఁ గో। రుదురు కాదె. 166

వ. అని చెవి సూఁడినట్లు పలికిన విని నిరుత్తర యై గాంధారి యూరకుండె నట్టియెడ ధృతరాష్ట్రుండు ధర్మనందనుతో నీవు పను మొనలం గలజనులకొలంది యెఱుంగుదు చచ్చినవారిలెక్క దలం తేని నా కెఱింగింపు మని పల్కిన విను మెఱుక పడ్డవా రుత్తమజనంబులు డెబ్బదియాఱుకోట్లు నిఱువది వేలును ముక్కడిమూఁక యిరువదినాలుగు వేలు మున్నూటయిరువండ్రుఁ దెగి రని చెప్పిన నమ్మనుజపతి వీరిందఱు నేగతికిఁ బోదు రనుటయు. 167

తే. ఎవ్వ రాత్మదేహములు స। మిద్ధ మైన

1. క. ఫలము. 2. క. దుర్మానియట్టులు. 8. గ. ముప్పరంబులు.

యస్త్రవహ్ని వేలిచిరి వా ర్రమరలోక
మునకుఁ జని నిర్జరాంగనా ర్జనవిలసితుఁ
డై నయమరేంద్రునకుఁ బూజ్యు ర్లగుదు రధిప. 163

క. తఱచుగ శస్త్రాస్త్రంబులు, నెఱఁకులు దూఱినఁ జలించి ర్నిజధైర్యంబుల్
మఱచి తెరలి చచ్చిరి కొంఁదఱు గుహ్యకగతికిఁ బోవఁ ర్దగుదురు వారల్. 169

క. సమరమున నెత్తెఱంగున, సమసిననుం గీడు తెరువు ర్చన రుత్తమలో
కమునక పోదురు జనములు, ప్రముదితు లై యంద్రు బుధులు ర్పౌరవముఖ్యా.

క. అనిన విని నాథవంతులు, ననాథులును నైనవీరి ర్కందఱకుఁ గృపా
ధనలోల చేయఁగా వచ్చున కాదే యగ్నికార్య ర్శోభనముఁ దగన్. 171

వ. అని పలుకుటయు ధర్మనందనుం డిట్లను నీయఖిలజనంబులు నాహితాగ్నుల
యట్ల యట్లుం గాక వీర లిందఱ కుదకదహనక్రియాకరణయోగ్యులును లేరు
మన మేది కొలఁదిగా నిప్పని సేయుద మని పలికి తా రజ్ఞాతవాసంబు నిర్వహించి
సముచితప్రకారంబున విరాటాదులచేతం బరిజ్ఞాతు లైనసమయంబున సంగతుం
డై యది మొదలుగాఁ జెల్లెడు శాంతికపౌష్టికాది శ్రౌతస్మార్తక్రియాకలాపంబులు నడు
పుచుం దమయొద్ద నున్నధౌమ్యు నాలోకించి విదురుని సంజయుని యుయుత్సునిఁ
గనుంగొని మీరు భరతకులులకుం దక్కననాథవంతు లైనవారలకు విధ్యుక్తం
బుగా నగ్నిసంస్కారంబు సేయుం డని పనిచి యత్తెఱంగునకుం దోడుపడుట కై
సూతజనంబులను దత్కాలసమాగతు లైన కరిపురజనంబులోనం దగువారి నిరూ
పించి మున్న తెప్పించినచందనాగురుఖండక్షౌమవసనకస్తూరికాకుంకుమఘృతతైల
ప్రభృతు లగువలయువస్తువు లాధౌమ్యముఖ్యుల కొప్పించిన వా రయ్యవసరం
బునం గూడికొనినబహుబ్రాహ్మణసంఘంబులతోఁ జని దుర్యోధనదుశ్శాసనకర్ణశ
ల్యాదులకు నభిమన్యుఘటోత్కచవిరాటధృష్టకేతుప్రముఖులకును దక్కను బే
రెఱుకపడునానాదేశాధీశులకుం బ్రచురకాష్ఠసంచయంబులను భగ్నరథావయవ
ధ్వజధనుశ్శరకుంతాదులను పొదలు పేర్పించి పితృమేధక్రియ లనువు నడపి చిచ్చునం
జొనిపి యనాథవంతు లైనభూకాంతుల ననేకసహస్రసంఖ్యలం బ్రోవులుగాఁ
బెట్టించి సమగ్రదారుసముదయంబు లమర్చి యగ్ని యిచ్చి రప్పుడు ఋగ్యజుఃపఠన
రవంబులును సామగాననాదంబులును రమణీరోదనధ్వనులును రోదసీకుహరంబు
నిండె ధూమంబున దిక్కులు పిక్కటిల్లెఁ జేతనభూతంబుల కెల్ల విపులవిషాదం
బావహిల్లె నివ్విధంబునం దగవు నడపించి. 172

కుంతి ధర్మజునకుఁ గర్ణుండు దనకొడుకగుట దెలుపుట.

భూవర కురువంశ ర్పుంగవుం డగుధర్మతనయుండు ధృతరాష్ట్రు ర్వినయ మొప్ప
ము న్నిడుకొని యాఁడు ర్మొత్తంబుఁ దోడ్కొని, బంధుజనంబులు ర్బలసి రాఁగ
నరిగి గంగాస్నాన ర్మాచరించి తిలోదకప్రదానము సర్వ ర్కౌరవులకు

నయ్యాంబికేయుఁడు నక్కురుభార్యలు, ననుజులుఁ దానును నధికనిష్ఠఁ

ఆ. జేసి రతనికడకు నాసమయంబున, నడలు నెమ్మనమున నడరి క్రమ్మ
కన్నునీరు మొగముగప్పంగఁ జని కుంతి, మెల్లవారు వినఁగ నిట్టు లనియె. 173

తరల. వినుము కౌరవకోటికిం దనవిల్లు పెట్టనికోటగా
నని యొనర్చి భవద్బలంబుల నన్నిటిన్ మిము నేవురం
దనిపి యంబరచారు లెల్లను దన్ను మెచ్చి నుతింపఁ బా
ర్థునిమహాస్త్రము బల్విడిం దల ద్రుంపఁ గూలినకర్ణునిన్. 174

క. జను లెల్లను రాధేయుం, డనుటను మీరలును వాని నట్టుల కా నె
మ్మనమునఁ దలంతు రటు గా, దనఘ మదీయాత్మజన్ముఁ డాతం డరయన్. 175

ఆ. మీకు నగ్రజుండు నాకు భాస్కరుదయ, లలితకవచకుండలములతోడఁ
బుట్టినాఁడు గానఁ బోయంగవలయుఁ ది,లోదకంబు లమ్మహాత్మునకు. 176

వ. అని తదీయజన్మప్రకారంబును దివాకరుప్రసాదభావంబును జెప్పుటయు దుస్స
హంబు లగునమ్మాటలు చెవులు సూఁడిన ట్లయినఁ బాండవులు పరమదుఃఖా
వేశంబు నొంది రందు భీమాదులు నివ్వెఱ పడియుండ ధర్మనందనుండు దల్ల
డిల్లుచుం దల్లితో ని ట్లనియె. 177

సీ. అనిలజార్జునుల మార్కొన నేర్చె నెవ్వని,యుత్సాహ మూఁది సుయోధనుండు
నై దేహపాండ్రాదివసుధేశు లెవ్వని,కడిమిసొంపున నరిగాఁపు లైరి
మనసైన్యకోటి యెవ్వనిబాహువీర్యసం,పద కోడి యంతంత నోడుఁగుచుండు
నద్భుతం బొసరించె నమరుల కెవ్వని,యసమానవివిధదివ్యాస్త్రమహిమ

తే. మమ్ము నందఱ నెవ్వనిమహితశక్తి, యెక్కుడై సంగరంబునఁ జిక్కుపఱిచె
నట్టికర్ణునిఁ గొంగున నగ్ని డాఁచి,నట్టు లెమ్మెయి డాఁచి తో యమ్మ చెపుమ.

క. అర్జునుఁ డొక్కరుఁడు దక్క ను,పార్జితశౌర్యమున నమ్మహాబాహునివి
స్ఫూర్జితరథమున కెదు రై, గర్జిల్లఁగ రథికుఁ డెండుఁ గలుగునె జననీ. 17[illegible]

తే. కర్ణుఁ దొలుచూలుగా నేల కంటి తల్లి, నీదుమంత్రంబు పరమవిషాద కారి
యయ్యె మా కెల్ల నట్టిమహాబలైకగణ్యు బ్రుంగుడుపఱచుట కారణముగ

తరువోజ. భానుపుత్త్రునిచావు బంధుల నెల్లఁ, బరమసంతాపంబుపాల్పడఁ జే
మానితబలుఁ డభిమన్యుండు పోర, మడిసినప్పుడు నిట్టిమఱుకువ నాత్మ
నూనదు ద్రౌపదేయులనాశమునకు, నుడుక దివ్విధమున నుల్లంబు ద్రుపద
సూనులు ధృతరాష్ట్రసుతులును దుఱింగు,చొప్పున కిమ్మెయిఁ జోర దడల్చా

ఆ. అతఁడు మాకు నన్న యని మున్న యెఱుఁగంగఁ
గన్నఁ గురుకులంబు గలఁగఁబడక
మనుదు మట్టు లైన మనుజలోకమునకుఁ

గలుగ దడలు మాకుఁ గలుగ దడలు. 182

వ. అని విలాపంబు సేసి విషాదశిథిలవర్ణంబులతో గోత్రనామంబు లుగ్గడించుచు సమ్మార్తాండనందనునకుం దిలోదకప్రదానంబు సేసెఁ దదనంతరంబ భీమార్జుననకుల సహదేవులుం జేసి రట్లు గర్ణుండు పాండవాగ్రజుండగుట యెఱింగి కురువధూజనంబు లార్తనాదంబు లెసంగ నాక్రందించిరి ధృతరాష్ట్రుండును గాంధారీకుంతీపూర్వకంబుగా నతనికి నుదకకర్మం బాచరించె నయ్యజాతశత్రుం డా దినేశపుత్త్రునివలని సౌభ్రాత్రంబువలనఁ బరిచారికాసమేతంబుగాఁ దద్భార్యల రావించి గారవించి యతనికై యనేకవిధపుణ్యకర్మంబులు భూరిదక్షిణంబులుగా ననుష్ఠించి కృతకృత్యతానందంబు నొంది సకలబంధుసహితంబుగా గంగాసముత్తరణం బాచరించె నని యిట్లఖిలజనాభినందితుం డగుధర్మనందనుండు గర్ణుం దమయన్నయని యెఱింగిన తెఱంగు వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన నజ్జనపతి కురువంశ్యుం డగునయ్యుధిష్ఠిరువర్తనం బటమీఁద నెట్లు సెల్లె నని యడుగుటయు. 183

మందాక్రాంతము. వీణానాదప్రతిమనిగమారావనిర్భవత్సారపుణ్య
శ్రేణీసంపాదిత[1]విమలతాస్థేమనిర్లేపచిత్త
త్రాణక్రీడాకలనసతతోత్సాహవద్దివ్యభావా
ప్రాణాపానాహరణనిపుణప్రాపణీయానుభావా. 184

క. త్వాంతాహంతానిరసన, శాంతాంతఃకరణయోగిజనవిజ్ఞేయా
చింతాసాగరమగ్న, భ్రాంతజనాధ్యేయ పరమభక్తివిధేయా. 185

మాలిని. భరితనియమచేతఃపద్మవిజ్ఞానకేలీ
పరిమళపరిపాకప్రౌఢసంపర్కశాలీ
పరిణతికృత[2]దూష్యద్భంగిభూతాళిహేలా
కరుణభృతిజగ[3]త్సంస్కర్తృదానందశీలా. 186

గద్య. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధా
రాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహా
భారతంబున స్త్రీపర్వంబునందు సర్వంబును
సమాప్తము.

---

1. క. సువిమలాశేషనిర్లేపచిత్తా. 2. గ దృప్యద్భంగి. 3. గ. త్సాంద్రకాంతతానంద.

